ములు. వ్యాసలేఖకులు పండితులు, కళాకోవిదులు, శాస్త్రోపాధ్యాయులు, లోకవ్యవహారానుభవజ్ఞులు, దేశాభిమానులు, సేవాపరాయణులు. సంచికయందు దే బది వ్యాసములు ప్రచురితములు. వ్యాసములందు సగము ఆంధ్రోద్యమ సమస్యకు సంబంధము కలిగియున్నవి. ఆంధ్రవిశ్వవిద్యాలయము, దేశభాషావశ్యకత, ఆంధ్రవ్యక్తి, ఆంధ్రోద్యమము ఆంధ్రుల విద్యావ్యాపకము, ఉచితప్రాథమికవిద్య, ఆంధ్రదేశార్థికస్థితి, ఆంధ్రుల సేవ, స్వపరిపాలనము, నాట్యరంగములు, చిత్రలేఖనము, వ్యవసాయాభివృద్ధి, వ్యాయామక్రీడలు మొదలగు వ్యాసము లందు ముఖ్యములు. సాంఘికపరివర్తనము, పాశ్చాత్యసంఘవిప్లవము, సామాన్యభాష, విషయ లోలత, రూపకల్పన, దేవాలయములు, బలి, భగవద్గీతలు మొదలగు వ్యాసములును గలవు. సంకల్పసిద్ధిని, స్త్రీస్వతంత్రజీవనావశ్యకతను, విద్యామూల్యతను గుఱించి నారీమణులు వ్రాసిన వ్యాసములు గలవు. గతసంవత్సరమునందును వర్తమానసంవత్సరమునందును ఐరోపా మహాసంగ్రామవిషయములు ప్రజల హృదయముల నాకర్షించుట సహజము. మహాసంగ్రామానలమును రగిల్చిన జర్మను చక్రవర్తి సంక్షేపచరిత్రము వ్రాయఁబడినది. బ్రిటీషుసామ్రాజ్యచరిత్రము, తురుష్కసామ్రాజ్యచరిత్రము, జపానుదేశచరిత్రము గలవు.

ఉత్సాహసమన్వితులైన యాంధ్రులకు కావ్యనిర్మాణ కౌశలము నైసర్గికము. ఆంధ్రభాషయును మృదువై మధురమై ఆంధ్రుల భావవ్యక్తికి తగియున్నది. సంచికయందు హిందూవిశ్వవిద్యాలయము, ధూర్జటి, తిక్కన, అప్పరాయస్మృతి, అబలావిలాపము, పీఠికాపురాధీశుఁడు, సంగీతము, పాణిగృహీత, సుతస్మృతి, తృప్తి, జాతీయావబోధము మొదలగు మనోహరంబులును, రసభావభరితంబులును నైన పద్యంబులు గలవు.

చిత్రపటములు, దేశపటములు

జాతీయ జీవిత విజృంభణమునకు కళలు కావ్యములు సంపదలు సోపానములు. గానకళాప్రదర్శన ంధ్రభాషా మాధుర్యము జగద్విఖ్యాతము. కాని, గానకళ ఆంధ్రవ్యక్తిని ప్రకటించుటకు తగిన రీతిని వృద్ధిపొందుట లేదు. చిత్రకళ యాంధ్రలోకమున దైన్యస్థితియందున్నది. ఆ దైన్యమును తొలఁగించి దేశము నభ్యున్నతస్థితికి తెచ్చుట యవసరము. ప్రాచీన నవీనభావములను తెలుపుటకై కొన్ని చిత్రపటములిందు ముద్రింపఁబడినవి. పత్రలేఖనము, సుఖసంసారము, దైవారాధనము, శకుంతల దుష్యంత సభాప్రవేశము, వసంతప్రబోధము, అరుణోదయము, సీతారాములు, సీతా రామ లక్ష్మణులు, అనసూయా కృత సత్కారము, వనసుందరి, అక్బరు సంస్థాన నవరత్నములు, శివాజీ సైన్యములు మొదలగు పటములు పూర్వలిఖిత చిత్రపటములనుండి తిరిగి ముద్రింపఁబడినవి.

గత సంవత్సరము హైందవ జాతీయజీవనమునందు మహాసంగ్రామమువలన నూతనయుగ మేర్పడినది. కావున, హైందవ జాతీయాభ్యుదయమునకై తమ జీవితములనుసమర్పించిన దేశీయ మహాసభాధ్యక్షుల చిత్రపటములు ముద్రింపఁబడినవి. సుప్రసిద్ధులైన అక్కన్న మాదన్న మంత్రిపుంగవుల పటములు గలవు. ఆంధ్రదేశము నలంకరించు ప్రతిష్ఠాపనలను తెలిపెడి పటములు కొన్ని చేర్పఁబడినవి. మఱియు, యూరపు రాణుల పటములు, యోధుల పటములు, రణరంగముల పటములు, యుద్ధసామగ్రుల పటములు మొదలగు వివిధములైన పటములు ముద్రితములు. అన్ని పటములు చేరి రమారమి 300 పటములు గలవు. ఈ సంచికయందు రంగుల దేశపటము లిరువది గలవు. ఆ పటము లన్నియు నాంధ్రమునందు ముద్రింపఁబడినవి. లోకస్థితిని తెలిసికొనుటకు భూగోళశాస్త్రజ్ఞాన మవసరము గాన, ఈ దేశపటములు జ్ఞానాభివృద్ధికి సహకారులు కాఁగలవు.

ముఖపటము

శ్లో. ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం.

శ్రీ సీతారాములు పురాణదంపతులు, లోకకల్యాణకరులు, దివ్యమంగళస్వరూపులు, అవతారమూర్తులు, ఆరాధనయోగ్యులు. సీత మహాసాధ్వి, మహా

లక్ష్మి. శ్రీరాముఁడు మహా పురుషుఁడు, ధీరోత్తముఁడు, ధర్మప్రవర్తకుఁడు, నిగ్రహానుగ్రహసమర్థుఁడు, దుష్టసంహారకుఁడు, శిష్టసంరక్షకుఁడు. ఆపదలను గడవంబెట్టి శుభంబుల నొడగూర్చెడి శ్రీ సీతారాముల మూర్తులు ముఖపఠమునందు ముద్రితములు.

సీతారాముల పూతచరిత్రము ధర్మారాధనమునకు పరమప్రమాణము. ధర్మజ్ఞాన మతిదుర్లభము. ధర్మారాధనము దురారాధ్యము. ధర్మ మతిసూక్ష్మము, విశాలము. మానవవికాసమునకు ధర్మము సాధనము; ధర్మము ప్రాణము. ధర్మప్రవృత్తి విశ్వవ్యాప్తము. మనుజునకు వ్యక్తిధర్మము కుటుంబధర్మము కులధర్మము జాతిధర్మము బ్రహ్మధర్మము ధర్మవిశేషములు. వ్యక్తిధర్మము కుటుంబధర్మమునందును కుటుంబధర్మము కులధర్మమునందును కులధర్మము జాతిధర్మమందును జాతిధర్మము బ్రహ్మపదమునందును సంప్రతిపాదితములై మహావ్యక్తుల జీవితంబులందు సందర్శనీయంబులు. మహావ్యక్తుల జీవితంబులందు "తత్త్వమసి" మహావాక్యార్థ మనుభవజ్ఞాతము. ధర్మజ్ఞతకు మహాయజ్ఞము సాధనము. మహాయజ్ఞము త్యాగసంభవము. పరిత్యాగశీలురకు లోకమునం దసాధ్యసిద్ధి లేదు. శ్రీ రామచంద్రుని పవిత్ర చరిత్రమునందు త్యాగశీల ఫలము దివ్యముగ ప్రతిబింబితము.

శ్రీరాముని దివ్యచరిత్రమునందు సర్వావస్థలయందును త్యాగము పరిస్ఫుటము: బాల్యదశయందు విశ్వామిత్రుని జన్నమును గాపాడుటకై స్వసుఖమును పరిత్యజించెను. యౌవనదశయందు తండ్రి ధర్మమును గాపాడుటకై రాజ్యమును పరిత్యజించి వనవాసమున కేఁగెను. రఘుకులధర్మసంరక్షణార్థమై క్షత్రియుల ధర్మమును నిర్వహించెను. ఆర్యజాతీయధర్మసంరక్షణార్థమై రావణాదిరాక్షససంహారమున కుపక్రమించెను. మహానుభావులకు సదృశమైన పుత్రధర్మమును సతీధర్మమును మిత్రధర్మమును భ్రాతృధర్మమును స్వామిధర్మమును రాజధర్మమును మానవధర్మమును ఉత్కృష్టరీతిని నిర్వహించి బ్రహ్మపదము నధిష్ఠించెను. సేవాపరాయణులై కులధర్మమును జాతిధర్మమును గుణధర్మమును ఉద్ధరించుటకై ప్రయత్నించెడి స్త్రీపురుషులకు సీతారాముల దివ్యరూపసందర్శనము ధర్మద్యోతకము కాఁగలదు. కష్టపరంపరలకు పాలయ్యును దర॥వతమును పరిపాలించిన రామచంద్రుని పావనచరిత్రము సంస్మరణీయము. జాతీయ జీవనమునందు ధర్మప్రాబల్యము నుపపాదించుటకై మంగళకర్తలైన శ్రీ సీతారాముల చిత్రపటము ముఖపటముగ ముద్రింపఁబడినది.

పట్టాభిషేకమహోత్సవ మాఁగుటవలన వ్యాకులచిత్తయైన సీతను రాముఁ డోదార్చుచున్న భావము చిత్రపటమునందు చిత్రితము.

రంగుల ముఖపటమును దేశపటములును ఆంధ్రపత్రికా ముద్రాలయమునందు ముద్రితములు.

## వందనములు

సంవత్సరాది సంచికకు భావోద్దీపితంబులును హృదయాహ్లాదకరంబులును జ్ఞానప్రదంబులును అగు వ్యాసములను వ్రాసి సంచికను సంవత్సరాదికి ముద్రించునట్లు సాహాయ్యము చేసిన దేశబాంధవుల కనేకవందనంబులు. ప్రచురణమునకై చిత్రపటములను పంపిన మహాజనులకును, చందాదారులకును, పోషకులకును ఇతరవిధముల సాయముచేసిన మహాశయులకును వందనంబులు. వ్యవధి లేకయు ఇతరకారణములవలనను, కార్యాలయమునకు చేరిన వ్యాసములందును ఛాయాపటములందును కొన్ని ముద్రితములు కానందులకు, వానిని పంపినవారు మన్నించుటకు ప్రార్థితులు.

## ఉపసంహారము

కాగితముల కఱ వేర్పడినను గత సంవత్సరముకంటె నీ యేఁడు వ్యాసములు చిత్రపటములు హెచ్చుగ ముద్రింపఁబడినవి. ఆంధ్రపత్రికయొక్క చందాదారులకు నిరుటివలె నొక రూప్యమునకే సంచిక నిచ్చుటకేర్పాటు చేయఁబడినది.

ఆంధ్ర మహాజనులు సంచికను ప్రచురించుటయందుఁ గల సాధకబాధకములను గమనించి యీ సదుద్యమమునకు చేయూఁత నొసంగి పత్రికాభ్యుదయమునకు తోడ్పడఁ బ్రార్థితులు.

నల సంవత్సరము సంగ్రామ సంక్షోభావృతంబైనను బ్రహ్మవర్షము. నలసంవత్సరమునందు సర్వేశ్వరుఁడు రౌద్రావతారము నుపసంహరించి సౌమ్యస్వభావము పూని లోకమునకు శాంతిని సుఖమును, భరతవర్షమునకు జాతీయ ప్రాబల్యమును, ఆంధ్ర ప్రపంచమునకు కామ్యార్థసిద్ధిని అనుగ్రహించుఁగాత!

# గత సంవత్సర వృత్తాంతము

లోకచరిత్రమునందు గత సంవత్సర వృత్తము భయంకరము. ఆనంద సంవత్సరమునం దారంభమైన మహాసంగ్రామము రాక్షస సంవత్సరమున ప్రబలినది. సర్వియాయం దుదయించిన సంగ్రామ దావానలము మూఁడు ఖండములకు వ్యాపించినది. యూరపు ఆసియా ఆఫ్రికా ఖండములు భీకర సంగ్రామరంగము లైనవి. లోకమునందలి సకలరాజ్యముల కర్మాగారములును ప్రత్యక్షముగనో పరోక్షముగనో మారణసాధననిర్మాణములకై వినియోగపడుచున్నవి. మూఁడు కోట్ల మనుజు లొండొరుల వినాశమునకై ప్రయత్నించుచున్నారు. ప్రత్యహమును 20 కోట్ల రూప్యములు యుద్ధసన్నాహములకై వినియోగింపఁబడుచున్నవి. ఒక కోటి ప్రజలు యుద్ధమువలన నష్టమై యుందురు. సంగ్రామ మనర్థ పరంపరలకు మూలము. ప్రజాక్షయము, ద్రవ్య నాశనము, వ్యాపార నష్టము, మహాసంక్షోభము, క్రోధజ్వర పీడనము మహా సంగ్రామ ఫలములు.

## సంగ్రామతత్త్వము

ప్రపంచరంగము విచిత్రము, సమ్మోహజనకము, నిరంతర పరివర్తనాధీనము. ప్రకృతిమండల మనుక్షణము మాఱుచుండును. ఉత్తేజనావనమనములు పరివర్తనమునకు కీలకములు. లోక ముత్తేజితమై వికాసమును పొందుచున్నయెడ లోక మవనమితమై ప్రక్షిప్తమగుచున్నది. ఉత్తేజనావనమనములు పరమాణువునకును మహత్తునకును సహజ ధర్మములు. గ్రామములకు దేశములకు రాజ్యములకు మహాఖండములకు గోళములకు బ్రహ్మాండములకు ఉత్తేజనావనమనములు సహజసంభవములు. వ్యక్తులందును జాతులందును ఉత్తేజన మవనమనమును అవనమన ముత్తేజ[illegible]ను అనుగమించుచుండును. సామ్రాజ్యములకును జాతులకును ఉచ్చనీచదశ లుత్తేజనాప్రకర్షణమువలనను ఉత్తేజనాభావమువలనను సంభవములు. ఉత్తేజనము లేనపుడు అవనమనము గోచరము. చిచ్ఛక్తిని ప్రదర్శించుట కుత్తేజనము సాధనము. ఉత్తేజనమువలన చిచ్ఛక్తి క్రియారూపమును ధరించుచున్నది. పాశ్చాత్యరాజ్యములలో గతించిన మూఁడు శతాబ్దములందును మహత్తరమైన యుత్సాహము విజృంభించినది. ఉత్సాహము ప్రజలను కార్యపరతంత్రులను చేసినది. కార్యపరతంత్రత్వము కర్మోపజీవులకు కర్షకులకు వర్తకులకు రాజులకు గురువులకు సమానధర్మ మైనది. కర్మపరతంత్రులైన పాశ్చాత్యులు సకల భౌతిక వ్యవస్థలయందును విశేషాభివృద్ధిని గడించిరి. పాశ్చాత్యుల పరిశ్రమలు విపరీతముగ నభివృద్ధి చెందినవి. వాణిజ్యము విరివిగ వ్యాపించినది. మతము విజృంభించినది. రాజ్యములు లోకవ్యాప్తము లైనవి. లోకమునందే మూల చూచినను పాశ్చాత్య నిర్మిత వస్తువులు, పాశ్చాత్య ధూమనౌకలు, పాశ్చాత్య ధూమశకటములు, క్రైస్తవ మతవ్యాపకులు, పాశ్చాత్యపరిపాలనములు ప్రత్యక్షములు. దిగంతవ్యాప్తంబైన కర్మపరత్వమువలన పాశ్చాత్య రాజ్యములందు సంపదలు మితిమీఱి పెరిఁగినవి. భోగాభిలాష హెచ్చినది. సుఖారాధనము పరిపాటియైనది. తృష్ణాసముద్భూతమైన కర్మపరత్వ మనర్థ పరంపరలకు హేతుభూతమై మహాసంగ్రామరూపమున పరిణమించినది. పాశ్చాత్యుల తృష్ణకు జర్మనుల కార్యపరత్వము పరమప్రమాణము. జర్మనుల ధనాకర్షణాభిలాష వ్యాపారాభిలాష రాజ్యాభిలాష వర్తమాన మహాసంగ్రామమునకు మూలకారణములు. జర్మనులయందు మూర్తీభవించిన మహత్తరంబైన యుత్తేజనమునకు ప్రతిక్రియగ అవనమన మవసరమైనది. లోకకంటకమైన యుత్తేజనము నుపసంహరించుటకు భగవ

న్నిర్ణీతమైన మహాసంగ్రామము నిమిత్తమాత్రము. పాశ్చాత్య సాహచర్యసంసర్గములవలన ప్రాచ్య దేశములందును మహత్తరమైన యుత్తేజనము గలిగినది.

మానవ వికాసమునకు కర్మపరత్వము సాధనము. కర్మలు ప్రకృతి పురుష సమాశ్రయ సంజాతములు. కర్మరహితులకు దేహయాత్రయును దుర్లభము. భగవద్గీతయందు కర్మలు యజ్ఞార్థము లని శ్రీకృష్ణుఁ డుపదేశించెను.

శ్లో. నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపిచ తే నప్రసిద్ధ్యేద కర్మణః
యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర.

తృష్ణాసంగసహిత మైన కర్మనిష్ఠ బంధకము, పాపప్రదము. తృష్ణాసంగరహిత మైన కర్మనిష్ఠ మోక్షసాధనము, పుణ్యప్రదము. వర్తమాన మహాసంగ్రామమునందు బ్రిటీషు సామ్రాజ్యము స్వల్పరాజ్య సంరక్షణము స్వసంరక్షణము మున్నగు ధర్మస్వత్వముల సంరక్షణమునకై చేరినది. జర్మను సామ్రాజ్యము తృష్ణా సంపూరణమునకై చేరినది. ఆంగ్లేయు లవలంబించినది విశుద్ధ మైన కర్మయోగము. జర్మను లవలంబించిన దపరిశుద్ధ మైన కామయోగము. ప్రాచీ ప్రతీచీ సంసర్గమువలన ప్రాచ్యులం దుత్తేజన మేర్పడి దారుణం బైన తృష్ణ పుట్టినది. తృష్ణాసముద్భూత మైన కర్మపారతంత్ర్యమును కర్మయోగ మని భ్రమపడుట కవకాశము లేర్పడుచున్నవి. వర్తమాన మహాసంగ్రామము వలన ప్రాచ్యులందు చిరకాలస్థాపిత మైన యవనమన దశకు భంగము కలిగినది. కార్యనిర్వాహణాసక్తి ప్రబలినది. ప్రాచ్యులయం దుదయించిన కర్మపరత్వమువలన వారికిని లోకమునకును కలుగనున్న మేలుకీడులు కాల గర్భమునందు ప్రక్షిప్తములు. జీవవికాసమునకును లోక కల్యాణమునకును మూలము, ధర్మసంస్థాపనానుకూల మైన కర్మయోగము గాని, కర్మపారతంత్ర్యము గాదు. కర్మపరతంత్రు లస్వతంత్రులు, తృష్ణాపాశబద్ధులు, సంగగ్రస్తులు. కర్మయోగులు స్వతంత్రులు, తృష్ణావిరహితులు, సంగవర్జితులు. లోకపరిణామప్రాపికె భగవత్ప్రసాదితము లైన హిందూ బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ మతములు ప్రాచ్యదేశసంజాతములు. కర్మపరత్వము మతధర్మబద్ధమై ప్రాచ్యదేశములందు కర్మయోగాయత్తమై జీవవికాసమునకును లోకకల్యాణమునకును అనుసంధాన మగుటకు వర్తమాన మహాసంగ్రామము నిమిత్తమాత్రముగ నుండుట భగవన్నిర్ణయము కావచ్చును.

## భరతఖండము

భరతఖండ మొక విశాలమైన మహాఖండము. దేశవైశాల్యము 18,02,657 చదరపు మైళ్లు. జనసంఖ్య 31,51,56,396. అందు స్వదేశసంస్థానముల విస్తీర్ణము 70,98,583 మైళ్లు; జనసంఖ్య 7,08,88,854. హిందూదేశమునందు అమెరికా సంయుక్తరాష్ట్రములందలి జనసంఖ్యకు మూఁడు రెట్లు జనులును, రుష్యా గాక శేషించిన యూరపు ఖండమునందుఁ గల జనసంఖ్యను మించిన జనులును గలరు. దేశమందు 2,150 పట్టణములు 7,20,342 గ్రామములు 6,37,!0,179 గృహములు గలవు. ప్రజలలో 21,70,00,000 మందికి వ్యవసాయము, 35,300,000 మందికి పరిశ్రమలు జీవనాధారములు. మనుజున కొకనికి సామాన్యాదాయము సంవత్సరమునకు ముప్పది రూప్యములు. హిందూదేశమునందు 14 రాష్ట్రములు 630 స్వదేశ సంస్థానములు గలవు. స్వదేశ సంస్థానములందు నిజాము రాజ్యము ప్రముఖము. నిజాము రాజ్యపు విస్తీర్ణము 82,698 చదరపు మైళ్లు; జనసంఖ్య 13,374,676; ఆదాయము 521 లక్షల రూప్యములు. నిజాము రాష్ట్రమునందు 52,00,000 ఆంధ్రులు గలరు.

మహాసంగ్రామభారమును బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగ మైన హిందూదేశము నైతము వహించుచున్నది. సంగ్రామానర్థము హిందూదేశమునకును వ్యాపించినది. వివిధములైన సంగ్రామరంగములందు మూఁడులక్షలకు పైఁబడిన హిందూదేశసైనికులు యుద్ధము చేయుచున్నారు. ఉత్సాహసాహససంపన్నులు సైనికవృత్తియందు చేరుచున్నారు. రణరం

క్షతగాత్రులు స్వదేశము చేరుచున్నారు. వ్యాపార వాణిజ్యములు కొంత తగ్గినను ఎప్పటివలె సాగుచున్నవి. యుద్ధమువలన దేశాదాయము తగ్గినది. వ్యయము హెచ్చినది. వ్యయ మధిక మగుటవలన క్రొత్త పన్నులు వేయఁబడినవి. రణరంగము ఆసియా ఖండమునకు వ్యాపించుటవలన యుద్ధము హిందూదేశమునకు సమీపస్థ మైనది. శిక్షితులైన బ్రిటీషు సైనికులు ఫ్రాన్సు రంగమునకు లభించుటవలన హైందవసైనికు లితరరంగములకు మార్పఁబడిరి. హైందవసైనికు లిపుడు మెసపొటేమియా సూయెజు ఆఫ్రికా రంగములందు బ్రిటీషు సామ్రాజ్య సంరక్షణార్థమై శౌర్యప్రతాపములతో యుద్ధము చేయుచున్నారు. హైందవసైనికులు దండనాయకుల పొగడ్తలకు పాత్రులైరి. హైందవప్రజ లవ్యాజమైన స్వామిభక్తిని ప్రకటించిరి. సంస్థానాధీశులు సామ్రాజ్యరక్షకసైనికులను రణరంగమునకు పంపిరి. సంస్థానాధీశులు ప్రజలు ఉపచారనిధులకై రెండుకోట్లరూప్యముల చందాల నొసంగిరి. సమరోత్సాహము హిందూదేశమునకును వ్యాపించినది. రణోత్సాహసమన్వితులైన భారతీయులు సైన్యములందు చేరి బ్రిటీషు సామ్రాజ్య సంరక్షణమునకై మేనుల నర్పించుచున్నారు. వ్యాధిగ్రస్తులకును క్షతగాత్రులకును సెయింటు జాన్ ఏంబ్యులెన్సు సంఘమువా రుపచారములను చేయుచున్నారు. మూఁడు వైద్యనౌకలు సైనికుల యుపచారార్థమై పని చేయుచున్నవి. హైందవుల రాజభక్తియందును బ్రిటీషు సామ్రాజ్య సంరక్షణాసక్తియందును సైనికుల రణోత్సాహమునందును బ్రిటీషు ద్వీపవాసులకు విశ్వాసము గలిగినది. ఆ విశ్వాసమునకు ప్రతిఫలముగ యుద్ధానంతరము హిందూదేశ రాజ్యాంగములు స్వరాజ్యస్థాపనానుకూలముగ సంస్కరింపఁబడు ననెడి యాశ హైందవప్రజల హృదయంబులం దుదయించినది ఫలము ముందు తెలియఁగలదు.

హిందూదేశపరిపాలనము

భాగ్యవశమున గతసంవత్సరమునందు ప్రజాసేవానిరతుఁడైన హార్డింజి ప్రభువు రాజప్రతినిధిగ నుండెను. ఆ మహనీయుఁడు యథాశక్తిని హైందవ జనాభిప్రాయము ననుసరించి పరిపాలించుటకు ప్రయత్నించెను. గతవత్సరమునం దామోదితము లైన శాసనములలో దేశసంరక్షకశాసనము, అస్సాము పనివాండ్ర శాసనము, కాశీవిశ్వవిద్యాలయ శాసనము ముఖ్యములు. దేశసంరక్షకశాసనము కఠిన మైనను, సంగ్రామస్థితివలన నవసర మైనది. అస్సాము పనివాండ్ర శాసనమునందు పనివాండ్రను చేర్చుటలో కట్టుదిట్టము లేర్పఱుపఁబడినను పనివాండ్ర కష్టములు గట్టెక్కిన వనుటకు వీలు లేదు. పనివాండ్రను చేరఁదీసెడివారి మాయోపాయములును యజమానుల ధనలోభభావమును పనివాండ్ర యోగక్షేమములకు ప్రతిబంధకములు. తక్కిన పనివాండ్రకువలె తేయాకు తోఁటల పనివాండ్రకును సకలవిధము లైన ప్రతిబంధకములను తొలఁగించుట యుచితము. కాశీవిశ్వవిద్యాలయ నిర్మాణమువలన భరతఖండమునందు విద్యాశిక్షణమున నూతనయుగ మేర్పడఁగలదు. భరతఖండమునందలి విద్యాపద్ధతుల నిర్ణేతలు పాశ్చాత్యభావబద్ధులు; అధికారాభిమానులు. కాశీ విశ్వవిద్యాలయమునందు హిందూవిజ్ఞానవ్యాపనమునకును ప్రజాప్రతినిధుల యధికారమునకును అవకాశములు గలవు. కాశీవిశ్వవిద్యాలయము భారతజాతీయబలమునకును విజ్ఞానవ్యాపనమునకును తోడ్పడు నని హిందువులు విశ్వసించుచున్నారు.

సామ్రాజ్యశాసనసభయం దుపపాదితములై యంగీకృతములైన తీర్మానములలో ప్రధానములు:

హిందూదేశమునందు పరిశ్రమాభ్యుదయమునకై పాలకు లుచితరీతిని ద్రవ్యసాహాయ్యము చేయవలయు నని రాజా కుశాలు సింగుగా రుపపాదించిరి. సవరణలతో నీ తీర్మానమును పాలకు లంగీకరించిరి. యుద్ధానంతరము కూడనున్న బ్రిటీషు సామ్రాజ్యసభయందు హైందవప్రతినిధులు నియమింపఁబడవలయు నని షాఫిగా రుపపాదించిన తీర్మాన మంగీకృత మైనది. నియుక్తులు గావలసిన ప్రతినిధులు అధికారప్రతినిధులో అనధికారప్రతినిధులో యూరపియనులో హైందవులో

RAMA CONSOLING LAKSHMANA



రాముడు లక్ష్మణుని నోదార్చుట

SITA AND RAMA: THEIR INNOCENT PLEASURES IN EXILE



సీతా రాముల వనవాస సల్లాపములు

(కాంగ్రెసు అధ్యక్షులు)

Mr. DADABHAI NAOROJI
Congress President, Calcutta, 1886, Lahore, 1893, and Calcutta, 1906
with Mrs. Besant of the Home Rule League.



Mr. SURENDRA NATH BANNERJI
Congress President, Poona 1895, and Ahamadabad, 1902



సురేంద్రనాథ బెనర్జిగారు
పూనహ, 1895, అహమదాబాదు, 1902

Sir C. SANKARAN NAIR
Congress President, Amraoti, 1897



సర్. శంకరన్ నాయర్ గారు
అమరావతి, 1897

C

Mr. A. M. BOSE.
Congress President, Madras, 1898



ఏ. ఎమ్. బోసుగారు
మద్రాసు, 1898

Mr. RAHIMTULA MAHOMED SAYANI
Congress President, Calcutta, 1896



రహిమతుల్లా మహమ్మదు సయానిగారు
కలకత్తా, 1896

Mr. P. ANANDA CHARLU
Congress President, Nagpur, 1891



పి. ఆనందాచార్యులుగారు
నాగపూరు, 1891

Mr. LAL MOHAN GHOSE.
Congress President, Madras, 1903



లాల్ మోహాన ఘోసుగారు
మద్రాసు, 1903

Mr. R. C. DUTT.
Congress President, Lucknow, 1899



రమేశచంద్ర దత్తుగారు
లక్నో, 1899

Mr. ALFRED WEBB.
Congress President, Madras, 1894



ఆల్ఫ్రెడు వెబుగారు
మద్రాసు, 1894

ముందు నిర్ణయింపఁబడవలసి యున్నది. వలస రాజ్యము లందు బంధనవ్రాత పద్ధతి నాఁపవలయు నని మదన మోహన మాలవ్య గారు తెచ్చిన తీర్మానమును పాలకు లంగీకరించిరి. గాంధిగారి సాత్త్వికనిరోధమునకు మూలకారణ మైన బంధనవ్రాతపద్ధతిని నిర్మూలము చేయుట కంగీకరించినందులకు హార్డింజి ప్రభువు హైందవుల కృతజ్ఞతకు పాత్రుఁడు. బంధనవ్రాతపద్ధతులందలి దుస్సహదౌర్జన్యమును లోకమునకు వెల్లడిచేసిన గాంధి గారును ఆండ్రూసు గారును సంస్తవనీయులు.

### దేశాదాయము

"ఆయము నెఱిఁగి వ్యయము చేయవలయు" నను నియమము గృహకృత్యములకువలె రాజకార్యముల కును చెల్లుచున్నది. రాజ్యపాలనమున కమితమైన ద్రవ్య మవసరము. యుద్ధమువలన రాబడి తగ్గినది; వ్యయము హెచ్చినది. గత సంవత్సరమునందు రూ. 126 కోట్లు వ్యయమగు ననియు రూ. 120 కోట్లు ఆదాయము వచ్చు ననియు మదింపు వేయఁబడినది. కాని, ఆదాయము రూ. 123,75,90,000 లు, వ్యయము రూ. 127,89, 60,000 లు నికరము తేలినది. గతసంవత్సరము రమారమి 4 కోట్ల రూప్యముల లోటు తేలినది. యుద్ధము త్వరలో ముగిసెడి సూచనలు గానరావు. రాఁగల సంవత్సరమునందు ఆదాయము రూ. 123,75,00,000 లనియు వ్యయము రూ. 128,25,00,000 లనియు మదింపు వేయఁబడినది. లోటు రూ. 4,50,00,000 లు. ఈ లోటును సవరణ చేయుటకై క్రొత్త పన్నులు వేయఁబడినవి. క్రొత్త పన్నులను వేయుటవలన రాఁగల సంవత్సరమునందు ఆదాయము 129 కోట్లకు పెరుగు ననియును వ్యయము 128 కోట్లకు మించ దనియును కోటి రూప్యములు నిలువయుండు ననియును అంచన వేయఁబడినది. నిర్ణయించిన ద్రవ్యోపపత్తికై (1) దిగుమతి వస్తువులమీఁది సుంకము 5 నుండి 7½ కు హెచ్చింపఁబడినది; అందువలన మూఁడు కోట్ల రూప్యము లధికముగ లభించును. (2) ఆదాయపు పన్ను హెచ్చింపఁబడినది; తన్మూలమున కోటి రూప్యము లధికముగ లభించును (3) ఉప్పు పన్ను, మద్యముల సుంకము, పొగాకు పన్ను హెచ్చింపఁబడినవి. (4) ఎగుమతి చేయఁబడెడి తేయాకు, జనపనారల మీఁద పన్ను వేయఁబడినది. ఈ మార్గావలంబనమువలన రూ. 5,40,00,000 ల ఆదాయము హెచ్చు నని మదింపు వేయఁబడినది. ఈ పద్ధతులు సామాన్యముగ నంగీకృతము లైనవి. కాని, దిగుమతులలో ముఖ్యమైన బట్టలమీఁది సుంకమును, లాంకాషైరు శ్రీమంతులకు వెఱచి, హెచ్చింపకుండుట శోచనీయ మైనను, రాజప్రతినిధి నిర్దేశించినట్లు యుద్ధానంతర మీ విషయమునందు మార్పులు గలుగు నని నమ్మఁబడుచున్నది.

### విద్యావ్యాపనము

హార్డింజి పరిపాలనా కాలమునందు విద్యావ్యాపనమునకై తగిన ప్రయత్నములు చేయఁబడుచున్నవి. బ్రిటీషు హిందూదేశమునందు 1913-14-వ సంవత్సరమున 138 కళాశాలలు, 1,349 ఉన్నతపాఠశాలలు, 1,16,650 ప్రథమపాఠశాలలు గలవు. ఆ విద్యాలయములందు 38,836 రు శాస్త్రవిద్యను, 4,66,386 రు ఉన్నతవిద్యను, 46,09,405 రు ఆరంభవిద్యను అభ్యసించుచున్నారు. విద్య నభ్యసింపఁదగిన వయసు గల వారిలో నూటికి 29 రు వంతున విద్య నభ్యసించుచున్నారు. స్త్రీలకై కళాశాలలు 11, ఉన్నతపాఠశాలలు 157, ప్రథమపాఠశాలలు 14,722 కలవు. ఆ విద్యాలయములయందు 353 రు శాస్త్రవిద్యను, 21,085 రు ఉన్నతవిద్యను, 9,09,266 రు ఆరంభవిద్యను అభ్యసించుచున్నారు. విద్య నభ్యసింపఁదగిన ప్రాయము గల బాలికలలో నూటికి 5 రు వంతున విద్య నభ్యసించుచున్నారు. మొత్తముమీఁద 75,18,147 రు స్త్రీ పురుషులు విద్య నభ్యసించుచున్నారు. విద్యాభ్యాసమునకై వ్యయమైన ద్రవ్యవివరణము:

| | | | |
|---|---|---|---|
| రాష్ట్రాదాయము | ... | రూ. | 3,64,54,000 |
| స్థానికాదాయము | ... | ,, | 1,47,91,000 |
| మ్యూనిసిపలు ద్రవ్యము | ... | ,, | 37,66,000 |
| విద్యార్థుల జీతములు | .... | ,, | 2,66,64,000 |
| ఇతర విధముల | ... | ,, | 1,85,49,000 |
| | మొత్తము | ,, | 10,02,24,000 |

లోఁగడ సంవత్సరముకంటె గతసంవత్సరము విద్యార్థుల సంఖ్య 37,00,000 హెచ్చినది. విద్యావ్యాపనకై కోటి రూప్యము లధికముగ వ్యయమైనవి. అభివృద్ధి శ్లాఘ్యమైనను, 25½ కోట్ల ప్రజలలో 75 లక్షలు మాత్రమే విద్య నభ్యసించుటయు 127 కోట్ల ఆదాయమునుండి 5 కోట్ల రూప్యములు

విద్యకై వ్యయము చేయుటయు సంతృప్తికరము గాదు.

వ్యాపారము

మహాసంగ్రామము వ్యాపారవ్యాపనమునకు భంగము కలిగించినది. 1914-15-వ సంవత్సరమునందు 354 కోట్ల రూప్యముల వ్యాపారము జరగినది. ఖోగడ సంవత్సరము 491 కోట్ల రూప్యముల వ్యాపారము జరగినది. యుద్ధము 137 కోట్ల రూప్యముల వ్యాపారమును తగ్గించినది. వ్యాపారమునందు ఎగుమతుల మొత్తము 187 కోట్ల రూప్యములు; దిగుమతుల మొత్తము 167 కోట్ల రూప్యములు. దిగుమతి యైన ద్రవ్యము 14,85,00,000 రూప్యములు; ఎగుమతి యైన ద్రవ్యము 3,30,00,000 రూప్యములు. ద్రవ్యమునందు 15 కోట్ల రూప్యముల మొత్తము తగ్గినది. నాలుగు మాసములలో దిగుమతులందు బట్టలు 15 కోట్లు, లోహములు 10 కోట్లు, ఇతరపదార్థములు 20 కోట్లు తగ్గినవి. ఎగుమతులందు దూది జనపనార ధాన్యములు నూనెగింజలు పప్పులు బియ్యము తగ్గుటవలన, నాలుగు మాసములలో ఎగుమతి మొత్తము 70 కోట్లు తగ్గినది. హిందూదేశమున ప్రతిమనుజునకు రూ. 11¾, రుష్యాయందు రూ. 17, బ్రిటీషు ద్వీపములందు రూ. 376, ఫ్రాన్సునందు రూ. 167, ఇటలీయందు రూ. 87, అమెరికాయందు రూ. 131, జపానునందు రూ. 36, చీనాయందు రూ. 4¾ వంతున 1914-వ సం. వ్యాపారము జరగినది. నాగరకతయును విశాలప్రదేశమును జనబాహుళ్యమును సస్యసమృద్ధియుఁ గల దేశములలో హిందూదేశమును చీనాదేశమును వ్యాపారమునందు వెనుకఁబడియున్నవి.

పరిశ్రమలు

పరిశ్రమలు హిందూదేశమున హీనదశయందున్న వను విషయము సర్వజనాంగీకృతము. పరిశ్రమల నభివృద్ధి చేయవలయు నను సంకల్పము ప్రజలకును పాలకులకును గలదు. పరిశ్రమనిర్మాణమున కవసరమైన బొగ్గు ఇనుము సహజపదార్థములు ప్రజావర్గము దేశమునందు విరివిగఁ గలవు. పరిశ్రమల కవసరమైన శాస్త్రజ్ఞానము కార్యపరత్వము కార్యనిర్వహణసామర్థ్యము సంవర్ధనీయములు. పరిశ్రమాభివృద్ధివలన దేశమునకు పాశ్చాత్యదేశములందుఁ గలిగిన మేలుకీడులు సహజము. వర్తమానకాలమునందు వాంఛితాభివృద్ధియే నాగరకతకు లక్షణ మను భావము వ్యాపించినది. సూదులు బట్టలు యంత్రములు బిస్కోతులు చుట్టలు బ్రాంది డబ్బీపాలు మందులు మున్నగు సమస్తవస్తువులు పాశ్చాత్యదేశములనుండి రావలసియున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రములందువలె భరతఖండమునందును వ్యవసాయపరిశ్రమలు సమానముగ నభివృద్ధి పొందినపుడు, సంపద అభివృద్ధి చెంది ప్రజలు సుఖములను పడయఁగలరు. బ్రిటీషు పరిపాలకులు హిందూదేశమునందు స్థాపనయోగ్యములైన పరిశ్రమలను నిర్ణయించుటకై పంచాయతీసభను నియమించుట శుభసూచకము. సభకు సర్ థామసు హాలెండు అధ్యక్షుఁడు. సర్ ముకర్జి సర్ దోరాబ్జీ తాతా సర్ కరీంభాయి మున్నగు హైందవసభ్యులును విచారణకర్తలుగ నియమితులు. సభావిమర్శనలు పాశ్చాత్య కోటీశ్వరుల లాభమునకుఁ గాక హైందవప్రజోపయోగమునకై చేయఁబడు నని నమ్మవలయును.

పరిశ్రమలందు దూది యంత్రాలయములు నార యంత్రాలయములు లోహయంత్రాలయములు చర్మయంత్రాలయములు ఖనిజపరిశ్రమలు ఆహారపరిశ్రమలు ముఖ్యములు. దేశమునందు 7,113 కర్మాగారములు గలవు. అందు 21 లక్షల పనివాండ్రు పాటుపడుచున్నారు. కర్మాగారములలో విశేషభాగమునకు యూరపియను శ్రీమంతులు స్వాములు. పాశ్చాత్యవస్తువులపై నాధారపడియున్న హిందూదేశమునకు వర్తమానమహాసంగ్రామమువలన పరిశ్రమలు లేని లోపము బాగుగ తెలిసినది. యుద్ధమువలన హిందూదేశమునందు నూతనముగ పరిశ్రమలను స్థాపించుట కవకాశము కలుగలేదు.

హార్డింజి ప్రభువు

ఉదారహృదయుఁడైన హార్డింజిప్రభువు 1910-వ సం. నవంబరు నెల 23-వ తేదీని పరిపాలనాధికారము వహించెను. ఈ ప్రభువర్యుని పరిపాలనకాలము హిందూదేశ చరిత్రమునందు ప్రసిద్ధి పడయఁగలదు. శ్రీ పంచమ జార్జి సార్వభౌముఁడు డిల్లీనగరమునందు రాజ్యాభిషిక్తుం డయ్యెను. డిల్లీనగరము రాజధానిగ చేయఁబడెను. నూతనడిల్లీనగరము నిర్మిత మగుచున్నది. వంగరాష్ట్రవిభజనము రద్దుచేయఁబడినది. బీహారు రాష్ట్రము నిర్మింపఁబడినది. మధ్యరాష్ట్రములందు బీహారు

నందు కాశీయందు విశ్వవిద్యాలయములు స్థాపింపఁబడినవి. పౌరసేవోద్యోగవిధానములను, సైన్యవ్యయమును, హిందూదేశ మంత్రిసభకును హిందూదేశమునకును గల ఆర్థికవ్యవస్థలను, విమర్శించుటకు పంచాయతీ సభలు నిర్మితములై విచారణ చేయఁబడినది. దక్షిణాఫ్రికాలోని హైందవప్రజల కష్టములను బాపుటకు సదుపాయములు చేయఁబడినవి. బంధనప్రాతపద్ధతి నాఁపుట ధర్మ మని యంగీకరింపఁబడినది. బ్రిటీషు సామ్రాజ్యసభయందు హిందూదేశప్రాతినిధ్య మవశ్యమని యంగీకరింపఁబడినది. ఐరోపా మహాసంగ్రామము వలన పాలకులకు పాలితులకు పరస్పరవిశ్వాసగౌరవములు దృఢతరము లైనవి. గతించిన అయిదున్నఱ సంవత్సరములందును హార్డింజి ప్రభువు ప్రజలకును ప్రజానాయకులకును సంస్థానాధీశులకును చూపిన సాదరగౌరవభావములు విజ్ఞాతములు. మార్చి 24-వ తేదిని గూడిన సామ్రాజ్యశాసనసభయందు సభ్యుల సంస్తవములు రాజప్రతినిధి సంభాషణము మననార్హములు. హార్డింజి ప్రభువర్యుఁడు విషమావస్థలయందు సైతము చూపిన సానుభూతి సాంత్వనము సమానము సత్పరిపాలనమునకు సాధనములై ప్రజల హృదయంబుల నాకర్షించినవి. హార్డింజ ప్రభువర్యుఁడు దర్బారు సమయమున ప్రకటించిన మహాసందేశమునందు రాష్ట్రీయ స్వపరిపాలనమునకును స్వరాజ్యస్థాపనకును మూలాంకురములు గలవు. శ్రీ హార్డింజి ప్రభుని వాక్యానుసరణిని బ్రిటీషు పరిపాలకులు స్వరాజ్యసంస్థాపనకు సోపానంబులను నిర్మించి సత్కీర్తి గడించెదరు గాత! దుర్భరమైన పుత్రకళత్రవియోగదుఃఖమును సహించుచు స్వకీయ శక్తిసామర్థ్యములను హైందవప్రజాహితమునకై వినియోగించి పాటుపడిన శ్రీ హార్డింజిప్రభువునకు భగవంతుఁ డాయురారోగ్యైశ్వర్యంబులను ప్రసాదించుఁగాత! నలసంవత్సర చైత్ర శుద్ధమునందు శ్రీ షెల్మ్సుఫర్డ్ప్రభువు గవర్నరు జనరలు పదవి నధిష్ఠింపఁగలఁడు. ఆ ప్రభువర్యుని కాలమునందు యుద్ధము పరిసమాప్తి నొంది హైందవాకాంక్షితములు ఫలవంతములై స్వరాజ్యసంస్థాపనాంకురములు ప్రవర్ధమాన మగుటకు దైవము ప్రసాదించుఁగాత!

### జాతీయోద్యమములు

హైందవజాతీయజీవనమునందు మార్గశీర్ష మాసము పవిత్రము, హృదయాహ్లాదకరము. మాతృపూజాపరాయణు లైన దేశభక్తులు మాతృరూప సందర్శనార్థమై ప్రతియేఁటను జాతీయసభాయాత్రను చేయుట యాచార మైనది. జాతీయమహాసభాసమావేశములు జాతీయభావమును కేంద్రీకృతము చేయుటకు సాధనము లైనవి. నానా ప్రదేశాగతు లైన దేశబాంధవులను మహాసభామంటపమునందు వీక్షించుచు గంభీర భావములను వినునపుడు శ్రోతల హృదయక్షేత్రంబులం దవితర్కితముగ దేశారాధనభావము లంకురించుట సహజము. జాతీయసభాయాత్ర, దేశబాంధవుల సందర్శనము, దేశాభిమానమంత్రజపము, జాతీయ ప్రబోధమునకు తోడ్పడుచున్నవి.

ముప్పదియవ జాతీయమహాసభ డిసెంబరు మాసాంతమునందు సుందరం బైన బొంబయి నగరంబునఁ గూడినది. సభకు నానాప్రదేశములనుండియు 1,800 ల ప్రతినిధులు 10,000 ల ప్రేక్షకులు వచ్చియుండిరి. శ్రీయుత గాంధిగారి ప్రసంగమును శ్రీమతి అనిబిసెంటమ్మ సరోజినీదేవి గార్ల ఉద్ధృత ప్రసంగములును సభ్యుల నుత్సాహపరవశులను జేసినవి. సభాధ్యక్షులు సుప్రసిద్ధు లైన సత్యేంద్రప్రసన్నసింహా గారు. ఆహ్వానసంఘాధ్యక్షుఁడు స్వాతంత్ర్యప్రియుఁడైన దిన్షా ఎడుల్జీ వాఛా గారు. ఉభయుల యుపన్యాసములును హైందవజాతీయమహాసభావాదములను బలపఱచుచు, స్వరాజ్యాదర్శమును ధ్రువపఱచినవి. సర్ సత్యేంద్రప్రసన్నసింహా మితవాది. వారి ప్రసంగమును తదనుకూలముగ నున్నది. సింహా గారు ఆయుధశాసనమును తీవ్రముగ ఖండించిరి. స్వరాజ్య సంస్థాపనము దూరస్థమైనను భావనిర్ణయ మవసర మని ప్రతిపాదించిరి. వారి దీర్ఘప్రసంగములోని యీ క్రింది వాక్యములు వారి భావమును తెలుపఁగలవు:

"స్వపరిపాలనాదర్శము హృదయాకర్షకమై చిత్తరంజకమై తనరారునది యైననే తప్ప ప్రభుత్వమువా రెత్తరువు పాలించినంతనే దేశీయమహాసభ యామోదించిన కతమున నూతన వికాసము నంది మేల్కొనుచుండు హైందవ భూమి హృదయవేదనము నపనయింపఁజాలదని నిజ మరయు నిష్పాక్షిక నిర్ణాయకులకు అర్థము కాక యుండఁజాలదు. హైందవభూమి కోరుకొను స్వపరిపాలన యొక్క స్వరూపము అమెరికా అధ్యక్షుఁడు లింకను నిర్వచించిన "ప్రజలకొఱకు ప్రజలమీఁద ప్రజలచేత నెఱపఁబడు అధికారము"నకంటె భిన్నము కాదు. బ్రిటీషు ప్రభుత్వము సుపరిపాలనయే యగును. కాని, ఒక ముఖ్యమంత్రి చెప్పినయట్లు "సుపరిపాలన స్వ

మునకు ప్రత్యామ్నాయము కాఁజాలదు." ఇటీవల నొక సుప్రసిద్ధాంగ్ల పత్రికయం దొక రిట్లు వ్రాసిరి: "వైకుంఠమునుండి దేవదూత దిగివచ్చి పరిపాలించున ట్లేర్పడినను ఏ కారణము ఎట్లు పరిస్థితులను మార్చినను ఆంగ్లేఁడు తనకుఁ గల ఆ పవిత్రపు హక్కును తనను బంధించు న్యాయశాస్త్రములను తానే నిర్మించుకొను స్వాతంత్ర్యమును వదలుకొనఁజాలఁడు. ఆ స్వాతంత్ర్యమునే వదలుకొనియె నేని అతఁ డాంగ్లేఁడు కాఁడు. ఆంగ్లభూమిలోని క్షేత్రముల నే వృక్షరాశిని వికాసమున కన్నెత్తి చూడ సాహసింపఁడు. న్యాయశాస్త్రములు తమంతట నెప్పుడును మహామూల్యత కలవి గావు. సుస్వభావులగు నిరంకుశులెందఱో రాజ్య మేలినారు. యుగయుగములను అట్టి ధర్మకర్తలెందఱో వదలినారు. తమకు లోఁబడిన ప్రజలను తనివిపఱచి కొన్ని సందర్భములలో వారి యైశ్వర్యమును పెంచి పరిపాలించినారు. కాని, వారి ఏలుబడియందు పారతంత్ర్యమున నిబిడీకృతమై యుండు నైతిక మానసిక శక్తులు విజృంభింపలేదు పారతంత్ర్యముచే కలుగు గుణసంప్రవాహము గాని వైజ్ఞానికవిస్తరము గాని వర్ధిల్లలేదు. అరిస్టాటలు తలపెట్టిన యే ధర్మశాసనములోను లేని శుభసూచన ఆత్మానుభవ ఆత్మోద్ధరణ స్వయంసాహాయ్యముల నాలింగనమున మానవకోటికి కలుగుచున్నది. దీనిని బట్టి చూడ స్వపరిపాలనాధర్మము వట్టి సంవేదనాయత్తము గా దనియు చారిత్రకాధారము పూర్ణముగా కల దనియు స్పష్ట మగుచున్నది. బ్రిటీషు పరిపాలన ఈ భూమిలో ప్రారంభ మయిననాటినుండియు నాంగ్లేయులు తలపెట్టుకొనిన యాదర్శము నిదియే. రాజనీతిజ్ఞులు పరంపరగా అనుగుణపద్ధతుల నిర్వచించినారు. సార్వభౌమపరంపర పూజ్యరీతిని ఆ యాదర్శమును స్థిరపఱచినది. ఆంగ్లరాజ్యపరంపర దానిని శాసనబద్ధ మొనర్చినది."

మితవాద పురస్కృతము లైన సింహా గారి భావములు పాలకవర్గామోదమును పడసి, యుద్ధానంతరము రాజ్యాంగములు సుధారితము లైన, దేశక్షేమమునందు పాలకపాలితులకుఁ గల పాశబంధము బలపడఁగలదు. సింహా గారు నిరూపించినట్లు స్వరాజ్య సంస్థాపనను గోరుటకుఁ గల కారణము హైందవుల యర్హత సహజస్వత్వము గాని సంగ్రామసమయంబున హైందవులు చూపిన ప్రభుభక్తికి ప్రతిఫలము గాదు.

### సంఘసంస్కరణసభ

రాజకీయ సభా సమావేశ సమయమునందు సంఘసంస్కరణసభయును గూడుట యాచార మైనది. రాజ్యాంగసంస్కరణమువలె సంఘసంస్కరణమును ముఖ్యావసర మని యిపుడు సర్వజనాభిప్రాయము స్థిరపడినది. సంస్కరణమునకు బహురూపములు. సకల సంస్కరణముల ఫలము మానవసంఘ వికాసము. వికాసమునకు జ్ఞానము సాధనము. జ్ఞానసంపాదనమునకు విద్య మూలము. జనసమూహమునందు విద్య వ్యాపించి జ్ఞానోదయ మైనపుడు సంస్కరణము సహజముగ జరగుచున్నది. సంస్కర్తలు విద్యను వ్యాపింపఁజేయుటకై పాటుపడిన, వారి యుద్దేశములు శీఘ్రముగ సఫలము లగుటకు అవకాశము కలుగును. సంస్కరణములందు విశేషభాగము స్త్రీలకు సంబంధించినవి. స్త్రీలకు సంబంధించిన సంస్కరణములును ఇతర సంస్కరణములును స్త్రీల సాహాయ్యమున సులభసాధ్యములు. ఈ రహస్యమును ఇరువది తొమ్మిదవ సంఘసంస్కరణసభ కధ్యక్షుఁడైన కర్వే పండితుఁడు బాగుగ గ్రహించెను. కర్వే పండితుని జీవితము స్త్రీల విద్యావ్యాపనకై వినియోగపడుచున్నది. విద్యావ్యాపనయందుఁ గల సాధకబాధకములను బాగుగ నెఱిఁగిన కర్వేగారు జనసామాన్యమునందు విద్యావ్యాపనకు దేశభాషల వలె నాంగ్లభాష సాధనము గా దని తమ ప్రారంభోపన్యాసమునందు సహేతుకముగ ప్రతిపాదించిరి. స్త్రీవిద్యావ్యాపనకై దేశభాషలందు ప్రత్యేకవిశ్వవిద్యాలయస్థాపన మవసర మని సంబోధించిరి. ఆంధ్రదేశాభ్యుదయమును గోరెడి యాంధ్రులు కర్వే పండితుని యుపన్యాసమును చదివి యర్థమును మననము చేయవలసి యుందురు. కర్వేపండితుని యుపన్యాసమునందలి ఈ క్రింది వాక్యములు వారి భావమును తెలుపుచున్నవి:

"విద్యావ్యాపనమునందు రెండు ధర్మములను పాటింపవలయును. దేశభాషలలోనే చదువు చెప్పుట సహజము. ఇందువలన చదువుకొనువారికి విషయము బాగుగా బోధపడును. గృహకృత్యమునందు స్త్రీల ధర్మము వేఱు; పురుషుల ధర్మము వేఱు. విద్యావ్యాపనము విషయమై పై యంశము లవసర మని విద్యాధికు లొప్పికొనియున్నారు. బాలురకు దేశభాషలో బోధించు స్థితి వచ్చునప్పుడు, స్త్రీల విద్యావిధానములో నా మార్పెప్పుడు జరగు నని మనము శను పెట్టుకొని యుండ నక్కఱలేదు. మన మెంత త్వరగా నీ విధానము నవలంబించిన మన జాతి కంత మేలగు. డబ్బును శరీరదార్ఢ్యమును తెలివి తేటలును నున్నచో, స్త్రీలును పెద్దపెద్ద పరీక్షలకు చదివి పురుషులతోఁబాటు విశ్వవిద్యాలయములవారిచే బహూకృతులుగ బడయవచ్చును. అట్టివారు స్త్రీలోకమునకే గాక ప్రస్తుతపు స్థితిగతులలో సంఘమున కంతకును అలంకారప్రాయులుగ నుందురు. సంఘమున స్త్రీలకును పురుషులకును బాధ్యత సమానము. ఇద్దఱును వృద్ధిపొందినఁ గాని, సంఘము వృద్ధిపొంద నేరదు వీరు చేయవలసిన పనులు మాత్రము వేఱు. వారివారి ధర్మనిర్వహణమునకు తగిన విద్య నిచ్చుట యవసరము అందుచేత స్త్రీలకును పురుషులకును ఒకేమోస్తరు విద్య పనికిరాదు. వారివారి ధర్మముల ననుసరించి స్త్రీలకును పురుషులకును విద్య నేర్పవలెను.

కనుక ఇద్దఱికిని ఒక విద్యావిధానము పనికిరాదు. వేఱువేఱుగ నుండవలయును. బాలికాబాలుర విద్యావిధానములు రెండును, ఏకవృక్షశాఖలవలె వర్ధిల్లును. ఏకజీవసారమును గ్రోలుచు ప్రత్యేకసంపదలను తమతమ శక్త్యనుసారముగఁ బడయవలయును. వీనిలో నొకదానికొకటి సంబంధము లేనియెడల వీరిలో నెవరి విద్యయు పూర్తిగా దని చెప్పవచ్చును.

"ఈ విధానము ననుసరించి స్త్రీలకు కళాశాలలను పెట్టి దేశభాషలో విద్యాభ్యాసము చేసినయెడల, మెట్రిక్యులేషను మున్నగు తరగతులలో చదువుచున్నవారు సయితము మా నూతనవిద్యాలయములలో చేరఁగలరు. వారి విద్యాభ్యాసము ముగిసిన తరువాత, విశ్వవిద్యాలయమువారికివలెనే, వారిని పరీక్షలు జరపి వారివారి యోగ్యతలను నిర్ణయింపవలెను. ఇప్పటి విద్యవలన ప్రయోజన మున్న దని కాదు, విశ్వవిద్యాలయమువారి పట్టముల కాసించి స్త్రీలు చదువుకొనుచున్నారు. వారికి కావలసిన విద్యను నేర్పి పట్టములను కూడ ఇచ్చినయెడల, వారు కోరున దేముండును?"

సంఘసంస్కరణసభ ఆహ్వానసంఘాధ్యక్షులు సుప్రసిద్ధులైన సర్ గణేశనారాయణచంద్రావార్కరుగారు. సభాధ్యక్షుఁడు కర్వేపండితుఁడు. సభామంటపము విద్యావతులైన నాగరీమణులచే నలంకృతము. విద్యావతీ పరిశోభితంబైన సంఘసంస్కరణ సభను సందర్శించినపుడు గలిగిన ఆనందము ఉత్సాహము వర్ణనాతీతము. గుణవతులైన హిందూసుందరులు విద్యావతులైనపుడు హైందవజాతికి దుస్సాధ్యమైన సంస్కరణము గానఁబడదు. శ్రీమతి సరోజినీదేవి కృష్ణాబాయి కాశీబాయి మొదలగు నారీమణుల ప్రసంగములను వినినపు డపారమైన యానందము కలిగినది. స్త్రీవిద్యాభివృద్ధికై దేశభాషలందు కర్వేపండితుఁడు స్థాపింపనున్న విశ్వవిద్యాలయ మచిరకాలమున జన్మించి భగవదనుగ్రహమువలన భారతజాతీయౌన్నత్య పోషణమునకు సాధనము కాఁగల దని నమ్ముటకు శుభసూచనలు గలవు.

### మహమ్మదీయమహాసభ

హిందూదేశవాసులైన హిందువులు మహమ్మదీయులు ఏకోదరులు, భరతమాతకు ప్రియసంతానము. హైందవజాతీయ ప్రాబల్యమున కుభయమతస్థుల బలమును శరణ్యము. ఉభయమతస్థుల సంయోగము బలమునకును వియోగము దౌర్బల్యమునకును కారణము. ఉభయమతస్థుల కలహములు పాలకుల యౌదాసీన్యభావమును బలపఱచుచున్నవి. జాతీయమహాసభ స్థాపితమై ముప్పదేండ్లు గతించినను మహమ్మదీయసంఘము తటస్థభావము వహించియున్నది. దేశభక్తుఁడు గోపాలకృష్ణగోఖలే హిందూమహమ్మదీయసంయోగమును సాధించుటకై చేసిన ప్రయత్నములు సుప్రసిద్ధములు. మోర్లి-మింటో సంస్కరణములు వ్యాప్తములైన తరువాత మహమ్మదీయులు సంస్కరణాందోళనలాభములను గ్రహించి మహమ్మదీయమహాసభను స్థాపించిరి. హిందూమహమ్మదీయసంయోగమును సమకూర్చుటకై ఉభయమతస్థుల నాయకులును శ్రద్ధాళులై పాటుపడ సమకట్టిరి. గతసంవత్సరము బొంబయియందుఁ గూడిన మహమ్మదీయమహాసభ ఆ ప్రయత్నముల ఫలమని నమ్మఁదగును. హైందవజాతీయసభ కూడిన కాలమునందే బొంబయినగరమునందు మహమ్మదీయమహాసభ సమావేశమగుటవలన నుభయమతస్థులందును ప్రవర్ధమానంబైన సంయోగభావము మాతృదేశారాధనభావము వ్యక్తమైనవి. మహమ్మదీయసోదరులు స్వరాజ్యసంస్థాపనమున కుభయజాతుల సంయోగము సాహచర్యము సాధన మని గ్రహించిరి. బొంబయియందుఁ గూడిన మహమ్మదీయమహాసభకధ్యక్షుఁడు బీహారునందు న్యాయవాదిగ నున్న మజ్రుల్ హక్ మహాశయుఁడు. సభాధ్యక్షుని ప్రారంభోపన్యాసము గంభీరము, ఉత్సాహభరితము, స్వాతంత్ర్యశోభితము, ప్రజారంజకము, మననయోగ్యము. ఈ క్రింది వాక్యములు సభాధ్యక్షుని భావమును తెలుపఁగలవు:

"మనకు సజీవి యగు జాతి కొసంగఁబడవలసిన అధికారమును దర్జాయును ఒసంగఁబడవలయును. ఏయే పనులు ముందుగా చేయఁబడవలయునో నన్ను సూచింపు మందురేని చెప్పెదను వినుఁడు:

(1) స్వపరిపాలనమును పొందుటకు ప్రథమ సోపానము సామ్రాజ్య సభలో కట్టకట్టుకొనియున్న అధికారాధికారుల సంఖ్య పోవలయును. (2 ప్రజలచే నెన్నుకొనఁబడిన అనధికారసభ్యు లాసభలో సంఖ్యాధికులుగా నుండవలయును. వారు హిందూదేశ వ్యవహారములను హైందవుల దృష్టిపథమునకు తగినట్లుగా చర్చించి వ్యవహరింపవలసియున్నారు (3) తరువాత రాజప్రతినిధిగారి కార్యనిర్వాహక సభ్యులు అధికారులు (ఐ. సి. ఎస్. దొరలు) గా నుండకుండునట్లు ఆ ప్రతిబంధకమును తొలఁగింపవలయును. (4) పదంపడి హిందూదేశ పరిపాలనమును ప్రజలకు తెలియకుండ నడపు అన్ని చీఁకటి చోటులలోనికి ప్రజాప్రతినిధుల వెలుతురు ప్రవేశించునట్లు చేయవలయును. (5) గవర్నరుల కార్యనిర్వాహక సభలలో భారతీయులను ఎక్కువమందిని ప్రవేశపెట్టవలయును. అనఁగా ఎ-- టెచ్చుట రాజ్యపాలనా సూత్రములు గలవో వానినివలె

వలయును. (6) రాష్ట్రములకు వారి స్వపరిపాలనమునందు ప్రత్యేక స్వాతంత్ర్యము లుండవలయును. (7) స్థానికపరిపాలనము రిప్పన్ ప్రభువు కోరినట్లుగ నడపింపవలయును. (8) ఆయుధశాసనము అంతర్ధానము కావలయును.(9) భారతీయులు గవర్నమెంటుద్యోగములలో ఎంత గొప్ప వయినను ప్రవేశించుట కెట్టి అభ్యంతరమును ఉండఁగూడదు. (10) ప్రతిజాతినుండియు వాలంటియరులు పటాలములలో చేర్చుకొనఁబడవలయును (11) వ్యవసాయము వృద్ధినొందవలయును. పరిశ్రమలు పెంపొందింపఁబడవలయును. (12) విద్య నిర్బంధముగాను ఉచితముగాను నుండవలయును."

రెండవ దినమునందు దురంతకుల ప్రేరణవలన సభ విచ్ఛిన్నమగుట సంతాపకరమైనను, సభాసమావేశమువలన మహమ్మదీయనాయకుల మనోరథ మీడేరినది.

## పారిశ్రామికసభ

వర్తమానకాలమునందే రాజ్యమును చూచినను పరిశ్రమల ప్రాబల్యము ప్రత్యక్షము. సకలరాజ్యములందును పెద్ద కర్మాగారములు వెలసినవి. పెద్ద కర్మాగారములందు వస్తువులను చవుకగ చేయుట సాధ్యము. హిందూదేశమునుండి యేఁటేఁటను కోట్లకొలఁది రూప్యముల విలువగల సహజపదార్థములు ఎగుమతి చేయఁబడి, ఆ మొత్తమునకు మించిన నిర్మాణపదార్థములు దిగుమతి చేయఁబడుచున్నవి. ఇతర దేశములందు నిర్మితపదార్థముల కగు వ్యయము మన దేశమునందు నిర్మితపదార్థ నిర్మాణమునకై వినియోగపడిన, సంపదలు హెచ్చి దారిద్ర్యము తగ్గి ప్రజలు సుఖపడఁగలరు. వర్తమానకాలమున లోకమునందలి సకలరాజ్యములును వ్యాపారపాశబద్ధములు. ఒక దేశమునం దధికముగ వస్తువులను నిర్మించి పరదేశముల కంపుటయే వ్యాపారసరణి. పాశ్చాత్యదేశముల నిర్మాణవస్తువులకు హిందూదేశము పణ్యస్థానము. బ్రిటీషు పరిపాలకు లవలంబించిన యనిర్బంధ వ్యాపారము పరిశ్రమాభ్యుదయమునకు ప్రతిబంధకమని పరిశ్రమతంత్రజ్ఞుల మతము. సంగ్రామారంభమునుండియు బ్రిటీషు పరిపాలకులును అనిర్బంధ వ్యాపారమునందలి యనర్థములను గ్రహించిరి. శత్రువ్యాపారమునకు నిర్బంధమును కల్పించుట ధర్మమని యంగీకృతమైనది. సంగ్రామానంతరము బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములను మిత్రమండలి రాజ్యములను వ్యాపారపాశ ముగ చేయవలయునను దృఢసంకల్ప మేర్పడి తదనుకూలమైన ప్రయత్నములు జరగుచున్నవి. దేశబలమునకు రాజ్యాంగస్వాతంత్ర్యమువలె నార్థికస్వాతంత్ర్యమును ముఖ్యము. హిందూదేశమునందు ప్రజలు రెండు వంతులు వ్యవసాయమువలన జీవించుచున్నారు. వ్యవసాయ పద్ధతులు సుధారితములై పరిశ్రమ లభివృద్ధిని చెందినపుడు భరతఖండము శ్రీమంతం బగును; క్షామపీడ తొలఁగును; ప్రజలు సుఖములను పడయఁగలరు.

పరిశ్రామికమహాసభకు సన్మానసంఘాధ్యక్షుఁడు సర్ దిన్షా పెటిటు, అధ్యక్షుఁడు నసుర్వాంజీ తాతా పుత్రుఁడు సర్ దోరాబ్జీ తాతా. తాతావంశజులు కోట్ల రూప్యముల విలువగల దూది యంత్రాలయములను లోహయంత్రాలయమును జలవిద్యుద్యంత్రాలయమును నిర్మించి ప్రసిద్ధి పడసిన కోటీశ్వరులు, పరిశ్రమ నిర్మాతలు. సర్ దోరాబ్జీ తాతా ప్రారంభోపన్యాసము అనుభవజ్ఞానసముపాశ్రితమై విమర్శనోపేతమై ఆర్థికసిద్ధాంతప్రమాణశోభితమై యొప్పుచున్నది. ఈ క్రింది వాక్యము లా భావమునకు నిదర్శనములు:

"జాతీయత మూలాధారముగ నుండని ఏర్పాటు ఏదియును యుద్ధానంతరము చేయఁబడినచో నది స్థిరముగ నుండదు. జాతీయతకు ధనసంపదయే మూలాధారము గాని తక్కిన వేమియును కాఁజాలవు. దేశాభివృద్ధి భావమే లేకుండినచో సర్వజనాకర్షకాదర్శక మింకొకటి యుండఁజాలదు. వివిధ సంఘముల ఆర్థికాభివృద్ధికిని అభ్యంతరము లేర్పడినపుడు భాషాసామాన్యము గాని వంశసామాన్యము గాని ఐకమత్యమును కలిగింపఁజాలవు రాజకీయ స్వాతంత్ర్యములకంటెను గూడ భారతీయ జాతీయతనే ఎల్లవారును ముఖ్యముగ కోరుచున్నారు. మాతృదేశమునం దనురాగమును మాతృదేశగౌరవమును ఎల్లవారును ముఖ్యముగ కోరుచున్నారు."

సర్ దోరాబ్జీ తాతా సకలపరిస్థితులందును విజయమునకు స్వయంసాహాయ్యము విజ్ఞానము కృషిపరాయణత్వము సాధనములు గాని, ప్రతిబంధకములు సాధనములు గావని విశ్వసించెడి ప్రాజ్ఞుఁడైనను, నిర్బంధ వ్యాపారసిద్ధాంతమునకు పరాఙ్ముఖుఁడు గాఁడు

## ఇతరసభలు

బొంబయినగరమునందు దేశాభ్యుదయమునకవసరమైన యితరవిషయములను విమర్శించుటకు మహాసభలు గూడినవి. వ్యాపారమహాసభ కధ్యక్షుఁడు సర్ ఫజుల్‌భాయి కరీమ్‌భాయి గారు. హిందూ మహాసభ కధ్యక్షుఁడు మదన మోహన మాలవ్య గారు. ఆర్య

సమాజమహాసభ కధ్యక్షుఁడు స్వామి వివేకానందుల వారు. బ్రహ్మసమాజమహాసభ కధ్యక్షుఁడు డాక్టరు నీలరత్నసర్కారు గారు. బ్రహ్మజ్ఞానసమాజసభ కధ్యక్షురాలు ఆనిబిసెంటు గారు. సకలసభాసమావేశముల ఫలము దేశాభ్యుదయము. జాతీయబలమునకు పరిశుద్ధమైన మతము సంఘము శ్రీకరంబైన పరిశ్రమలు వ్యాపారము గౌరవభాజనంబైన స్వపరిపాలనము సాధనములు. జాతీయజీవన విజృంభణమునకు వివిధ భావవ్యాపనమును సాధన మని గ్రహించి పాటుపడుట శ్రేయఃప్రాప్తికి సాధనము.

### చెన్నరాష్ట్రము

చెన్నరాష్ట్ర విస్తీర్ణము 1,41,075 చదరపు మైళ్లు, జనసంఖ్య 4,14,02,000. ప్రజలు ద్రావిడ జాతీయులు. ముఖ్యభాషలు అఱవము, ఆంధ్రము, మలయాళము, కన్నడము. ప్రతి 1000 మంది జనులందును 407 మంది యఱవమును, 377 మంది యాంధ్రమును, 74 మంది మలయాళమును, 37 మంది కన్నడమును, 23 మంది హిందుస్థానిని వాడుదురు. వృత్తులలో ముఖ్యమైనది వ్యవసాయము, 100 కి 68 మందికి వ్యవసాయము జీవనాధారము. పంటలలో వరిపంట ముఖ్యము. నేత పరిశ్రమ పరిశ్రమలలో ముఖ్యము.

### వ్యాపారము - వ్యవసాయము

సంగ్రామ వ్యాపనమువలన 1914-15 సం. చెన్నరాష్ట్రమునందు 24 కోట్ల రూప్యముల వ్యాపారము తగ్గినది. గతసంవత్సరమునందు దిగుమతుల మొత్తము రూ. 12,52,00,000 లు, ఎగుమతుల మొత్తము రూ. 21,61,00,000 లు. నూనెపదార్థముల యెగుమతి తగ్గుటవలన చెన్నరాష్ట్రమునందు నష్టము సంభవించినది. తోళ్ల యెగుమతికి యుద్ధారంభమునందు భంగము కలిగినను ప్రస్తుతము భంగము లేదు. నీలిమందు వ్యాపారమువలన చెన్నరాష్ట్రవాసులకు కొంత లాభము కలిగినది.

చెన్నరాష్ట్రమునందు 100 లో 68 మందికి వ్యవసాయము జీవనాధారము. వ్యవసాయదారులలో 100 కి 49 మంది భూస్వాములు. సాగు చేయఁబడుచున్న భూమి విస్తీర్ణములో కోటి యెకరములు వరి సాగునకై వినియోగపడుచున్నవి. జొన్నలు సజ్జలు రాగులు ప్రత్తి నూనెగింజలు తక్కిన పంటలలో ముఖ్యములు. చెన్నరాష్ట్రమునందు 1,231 యంత్రాలయములు గలవు. యంత్రాలయములందు వడ్లమఱలు దూదిమఱలు ప్రముఖములు.

### విద్యావ్యాపనము

చెన్నరాష్ట్రమునందుఁ గల 414 లక్షల ప్రజలలోను 31,30,000 మంది మాత్రమే వ్రాయను చదువను నేర్చినవారు. 1000 కి 138 మంది పురుషులును 13 రు స్త్రీలును మాత్రమే యక్షరజ్ఞులు. 1000 కి 6 రు వంతున పురుషులును 4000 కి 1 రు వంతున స్త్రీలును ఆంగ్లభాషాభిజ్ఞులు. 1913-14-వ సం. నందు పురుషులకు 29 శాస్త్రకళాశాలలు, 5 ప్రాచ్యకళాశాలలు, 3 వృత్తికళాశాలలు, 364 మధ్యమపాఠశాలలు, 26,018 ప్రథమపాఠశాలలును, స్త్రీలకు 2 శాస్త్రకళాశాలలు, 69 మధ్యమపాఠశాలలు, 1,443 ప్రథమపాఠశాలలును గలవు. పాలకపోషితవిద్యాలయములు గాక 720 ప్రజాపోషితవిద్యాలయములు గలవు. అందు ప్రథమపాఠశాలలలో 12,00,249 మందియు, మధ్యమ పాఠశాలలలో 1,28,157 మందియు, వృత్తికళాశాలలందు 986 మందియు, ప్రాచ్యకళాశాలలలో 7,094 మందియు, శాస్త్రకళాశాలలలో 7,094 మందియు, మొత్తము 14,69,945 మంది విద్యార్థులు గలరు. ప్రతియేఁటను చెన్నపురి విశ్వవిద్యాలయమునుండి 600 మంది యుపపదాధియుక్తులు వెలువడుచున్నారు.

విద్యాభివృద్ధికై చెన్నరాష్ట్రమునందు 1913-14 సంవత్సరమున ఈ క్రింది మొత్తము వ్యయము చేయఁబడినది.

| | | | |
|---|---|---|---|
| రాష్ట్రాదాయము | .. | రూ. | 65,69,000 |
| స్థానికాదాయము | ... | ,, | 23,94,000 |
| మ్యునిసిపాలిటీలు | .. | ,, | 5,63,000 |
| జీతములు | ... | ,, | 46,06,000 |
| ఇతరాదాయములు | ... | ,, | 38,67,000 |
| మొత్తము | | ,, | 179,39,000 |

రాష్ట్రాదాయమునుండి విద్యాభివృద్ధికై 1915-16 సంవత్సరమునందు రూ. 77,69,000 లు వ్యయము చేయఁబడినవి.

### విద్యావ్యాపనా వ్యయవివరణము

| | | | |
|---|---|---|---|
| సామ్రాజ్యాదాయము | ... | రూ | 21,42,000 |
| రాష్ట్రాదాయము | ... | ,, | 64,29,000 |
| స్థానికాదాయము | ... | ,, | 13,81,000 |
| మ్యునిసిపల్ ఆదాయము | ... | ,, | 5,66,0[illegible] |
| మొత్తము | | ,, | [illegible] |

### కోశవ్యవస్థలు

కోశాధ్యక్షుఁడు సర్ హార్కోర్టు స్టువర్టుగారు కోశవ్యవస్థలం దవసరమైన కొలఁది సవరణలను చేసిరి. స్థానిక పరిపాలనముల కొసంగఁబడిన మొత్తములు పనులు ముగియక పూర్వ మొసంగుటకు నిర్ణయింపఁబడినది. విద్యాశాఖావ్యయమునకు ప్రత్యేకశీర్షిక యేర్పఱుపఁబడినది. బోరింగు పంపింగు శాఖ వ్యవసాయశాఖయందు చేర్పఁబడినది. విద్యావ్యాపనకై అధికవ్యయ మేర్పాటు చేయఁబడినది. గత సంవత్సరమునందు చెన్నపురి రాష్ట్రాదాయమునుండియు సామ్రాజ్యాదాయమునుండియు విద్యాశిక్షణమునకై రూ. 1,05,18,000 లు వ్యయము చేయఁబడినవి. గతసంవత్సరమునందు స్థానికప్రభుత్వము ప్రాథమికవిద్యావ్యాపనకై రూ. 38,72,000 లు వ్యయము చేసెను.

### గతసంవత్సరాయవ్యయములు

రాబడి—భూమిసిస్తు రూ. 350,41,000; స్టాంపులు 75,50,000; మద్యశుల్కము 175,50,000; ఆదాయపు పన్ను 19,85,000; అడవి 40,00,000; రిజిస్ట్రేషను 23,00,000; శాస్త్రశోధనాదులు 10,00,000; ఇతరములు 46,50,000; సామ్రాజ్యపాలక దత్తము 23,20,000. మొత్తము రూ. 7,63,96,000.

వ్యయము—భూమిసిస్తు రూ. 123,86,000; అడవి 29,48,000; పాలనము 15,86,000; కోర్టులు 84,54,000, చెఱసాలలు 15,10,000; పోలీసు 1,11,68,000; విద్య 76,86,000; వైద్యము 50,79,000; పింఛనులు వగైరా 38,10,000; నీటిపాఱుదల 11,37,000; పబ్లికు వర్క్సు 39,90,000; సివిలు వర్క్సు 84,61,000; ఇతరములు 94,77,000. మొత్తము రూ. 771,92,000.

### రాష్ట్రీయశాసననిర్మాణసభ

హిందూదేశమునందు స్వపరిపాలనమును స్థాపించుటకు రాష్ట్రీయ స్వాతంత్ర పరిపాలనమును కేంద్రీకృత సామ్రాజ్యాధికారమును సాధనములని రాజ్యాంగవేత్తల మతము. రాజ్యాంగ సంస్కరణమునందు మోర్లీప్రభు వీ భావము నవలంబించెను. హార్డింజిప్రభువు తన సుప్రసిద్ధసందేశమునం దీ భావమును ధ్రువపఱచెను. రాష్ట్రీయసభలందు పేరున కనధికారసభ్యు లధిక సంఖ్యాకులు. కాని, పాలకనియమితు లనధికారులయ్యును పాలకమతావలంబనులు. సిద్ధాంతమునం దనధికార సభ్యుల సంఖ్య హెచ్చుగ నున్నను, వాడుకయం దధికారుల సంఖ్య హెచ్చుగ నున్నది. శాసన[సభయం]దు 48 మంది సభ్యులు గలరు: 21 మంది ప్రజానియుక్తులు, 21 మంది పాలకనియమితులు, 6 మంది అధికారులు. యూరపియనులు ప్రజాప్రతినిధు లయ్యును, పాలకవర్గపు మతముతో నేకీభవించుట సహజము. ప్రజాభిమానభరితులైన పాశ్చాత్యులకు హిందూదేశమునందు కాలు మోపినంతనే అధికారాభిమాన మావహించుచున్నది. ఇది ప్రకృతివైచిత్ర్యము. ఈ విచిత్రభావము హిందూ దేశమునందలి శాసనసభాచరిత్రముల నవలోకించిన వారలకు సువిదితము. గతసంవత్సరపు శాసనసభ వృత్తాంత మీ యుదంతమునకు నిదర్శనము.

నవంబరు మాసమునఁ గూడిన శాసనసభయందు గ్రామపంచాయతీ శాసనమును గుఱించి తీవ్రమైన చర్చలు జరగినవి. పంచాయతులను స్థాపించుటకును సభాధికారమును నిర్ణయించుటకును ప్రత్యేకశాసనమును నిర్మించుట యుచిత మని ప్రజాప్రతినిధులు తెలిపిన యభిప్రాయములను పాలకులు నిరాకరించిరి. గ్రామపంచాయతులకు సభాధిపతి నెన్నుకొనెడి స్వత్వమును సభ్యుల కొసంగుటకు పాలకు లంగీకరించిరి. నిర్బంధకప్రారంభవిద్యను గుఱించియును బాలికా విద్యావిషయమును గుఱించియును సభ్యు లుపపాదించిన తీర్మానములను పాలకులు నిరాకరించిరి. సింహళమునకు పోవు ప్రయాణికులకును కూలీలకును గల నిర్బంధములను తొలఁగించుటకై రామచంద్రరావు పంతులు గారిచే నుపపాదితమైన తీర్మానమును సవరణలతో పాలకు లంగీకరించిరి. జిల్లా బోర్డుల కనధికార సభాధిపతులను నియమించు విషయమై రామచంద్రరావు గా రుపపాదించిన తీర్మానమును పాలకులు నిరాకరించిరి. మార్చి మాసమునఁ గూడిన సభయం దాయవ్యవస్థలు చర్చింపఁబడినవి. గా. నరసింహేశ్వరశర్మ గారు ఔషధాలయములకై 20 వేల రూప్యము లధికముగ వ్యయము చేయవలయు నని యుపపాదించిన తీర్మానమును పాలకు లంగీకరించిరి. ఆ సమావేశమునందు 1916-17 సం. నకు రాష్ట్రాదాయము రు. 770 లక్ష లనియు వ్యయము రు. 773,14,000 లనియు మదింపు వేయఁబడినది. ఆదాయవ్యయపట్టికను సంస్కరించుటకై ప్రజాప్రతినిధులు చేసిన ప్రయత్నము లామోదితములు కాలేదు. ఏప్రిలు సమావేశముతో ప్రస్తుతము దేశహితార్థమై పాటుపడుచున్న ప్రజాప్రతినిధుల గడువు ముగియఁ

SIR DORABJEE TATA
President, Eleventh Industrial Conference



సర్ దొరాబ్జి తాతాగారు
బొంబయి పదునొకండవ పరిశ్రామిక మహాసభాధ్యక్షుండు

THE HON. SIR FAZULBHOY CURRIMBHOY
President, First Commercial Conference, Bombay, 1915



ఆనరబిల్ సర్ ఫజుల్‌భాయి కరీంభాయిగారు
బొంబయి ప్రథమ వర్తక మహాసభాధ్యక్షుండు

THE PRESIDENT AND MEMBERS OF THE ALL-INDIA CONGRESS COMMITTEE



జాతీయమహాసభాధ్యక్షుండు, స్థిరసంఘసభ్యులు

గలదు. క్రొత్త యెన్నికలం దెవరికి శాసనసభయందు ప్రవేశము గలుగునో ప్రస్తుతము దురూహ్యము. నియమితకాలమునందు దేశహితార్థమై పాటుపడిన గౌ. బి. నరసింహేశ్వరశర్మ గారు, భూ. నరసింహరాజు గారు, మో. రామచంద్రరావు గారు, కొ. వేం. కృష్ణారావు గారు, ఆ. కృష్ణారావు గారు, గు. కేశవపిళ్లె గారు, ఇతరనియుక్తులు, నియమితులు నంశ్యులు. గతకాలమునందు దేశసేవ చేసిన దేశబాంధవులను తిరిగి యెన్నుకొని కృతజ్ఞతను చూపుట వివేకము, ధర్మము.

ఆంధ్రలోకము

శిశిరవసంతముల సంధిసమయ మతిబంధురము, గంభీరము, భావగర్భితము, వికారము. పండుటాకుల పసిడిరంగొక యందము. చిగురుటాకుల కెంజాయ యొక సొంపు. చిగురులు పుట్టి పెరిగి పండుట, పండిన యాకులు రాలి తిరిగి చిగుర్చుట ప్రకృతిధర్మము పండుటాకులు పసచెడినపుడు రాలుచున్నవి. చిగురుటాకులు పస గలిగి పెరిగి నయనానందకరమైన నూతనవికాసమును ప్రసరించుచున్నవి. ఆకులు ప్రసూనములకు, ప్రసూనములు కాయలకు, కాయలు పండ్లకు, పండ్లు విత్తనములకు సాధనంబులు. ప్రకృతియం దనవరతము ప్రవృత్తి ప్రసిద్ధము. ప్రకృతిమండలమునందు వ్యక్తమైన నూతనవికాసము, నూతనచైతన్యము, నూతనవిలాసము, వసంతకాలమునకు నిదర్శనములు. వసంత ప్రబోధవిరహితమైన ప్రకృతి మృతప్రాయము, కాంతివిరహితము, శోభాశూన్యము, నిర్జీవము. మృతప్రాయమైన ప్రకృతి వ్యవస్థలు నిర్వీర్యములు, నిరుపయోగములు. ప్రకృతి చైతన్యము వసంత ప్రబోధమునందు సందర్శనీయము. ప్రకృతియందువలె ప్రకృత్యధిష్ఠాతలైన పురుషులందును వసంతప్రబోధము సందర్శనీయము. అనుపయోగపదార్థములు లయము నొందుట ఉపయోగ పదార్థములు వికసించుట సృష్టిపరిణామ ఫలము. ప్రకృతియందువలె వ్యక్తులందును జాతులందును ప్రబోధము గలుగుట వికాసమునకు చైతన్యమునకు నిదర్శనము.

ఇరువదవ శతాబ్ద మారంభమున సకలదేశములలోను వివిధజాతులందును ప్రబోధ ముదయించినది. భావములు విశాలము లగుచున్నవి ఆదర్శములు మారుచున్నవి. ఆశ అధిక మగుచున్నది. సంకల్పములు సుస్థిరము లగుచున్నవి. ఉత్సాహము హెచ్చుచున్నది. కార్యపరత్వము ప్రబలుచున్నది. ప్రవర్ధమానములైన భావములు సంకల్పములు ఉత్సాహము కార్యపరత్వము జాతీయావబోధమునకు నిదర్శనములు. సంవత్సరాదిని ప్రకృతివికాసమునకై వసంతోదయమువలె జీవవికాసమునకై యుగాదిని ప్రబోధోదయము గలుగుట సృష్టిక్రమము. వర్తమాన మహాసంగ్రామము యుగసంధియం దేర్పడిన వికృతి. సురుచిరపల్లవంబుల సంభవంబునకు జీర్ణపర్ణంబుల నిర్గమనం బవసరం బగు విధంబున నూతన వికాససంస్థాపనకు జీర్ణసంస్థాపనల వినాశం బవసరంబు. వర్తమానకాలమున లోకమునందలి సకల వ్యవస్థలయందును ఈ సమస్య ప్రత్యక్షము యూరపు రాజ్యముల విప్లవమునకి సమస్యయె మూలము. రాజ్యలాభమునకు సాధనము ధర్మమా బలమా యను సమస్య వర్తమాన మహాసంగ్రామమువలన విడవలయును. జర్మనులు బలమును నమ్మిరి. ఆంగ్లేయులు ధర్మమును నమ్మిరి. విజయమునకు ధర్మము సాధన మని యార్యుల మతము. హిందూదేశ రాజ్యాంగసంస్కరణమునకును ఆంధ్రోద్యమ తత్త్వమునకును ఈ సమస్యయే బీజము. భారతీయాభ్యుదయమునకును ఆంధ్రాభ్యుదయమునకును జీర్ణంబులైన ప్రాచీనవ్యవస్థలు సాధనంబులా, ప్రబోధసంజాతంబులైన నూతనసంకల్పంబులు సాధనంబులా యను సమస్య యేర్పడినది. విద్యాశిక్షణపద్ధతులందును ఈ సమస్యయే తారసిలుచున్నది. విద్యాశిక్షణము విజ్ఞానలాభమునకా, భాషాపాండిత్యమునకా యను సమస్య కలుగుచున్నది. ఇప్పగిదిని సకలవ్యవస్థలందును ప్రబోధదశయందు వికార ముదయించి వికాస మేర్పడుచున్నది.

ఆంధ్రోద్యమము

ఆంధ్రోద్యమసమస్య సకలలోకావృతంబైన ప్రబోధమున సంజాతము. లోకావృతంబైన ప్రబోధావస్థయం దాంధ్రులును క్రమవికాసము పొందఁ గోరుట సహజము, ధర్మము. క్రమవికాసము గోరని జాతులు నిరర్థకములై క్షీణించుట సామాన్యము. ఆంధ్రోద్యమమునకు పవిత్రమైన దేశాభిమానము గాఢమైన భాషాభిమానము విశుద్ధమైన సేవాభిలాష మూలములు గాని, స్వార్థారాధనము ఉద్యోగలాభము, ధనలోభము కారణములు గావు.

వేళ, దేశమునకును ప్రజలకును పరిసరములకును తగిన రీతిని భౌతికలాభములను పొందఁగోరుటయు దోషభూయిష్ఠము గాదు. ఆత్మసంరక్షణము ధర్మములలో నుత్తమ ధర్మము. ధర్మసాధనమునకు శరీరసంరక్షణము మూలము. తాను తరించినఁ గాని యితరులను తరింపఁజేయఁజాలఁడు. ఆంధ్రులు బాగుపడిన భారతజాతీయతకు బలము కలుగును. ఆంధ్రులు దుర్బలులైన భారతజాతీయతకు దుర్బలత్వము కలుగును. సకలాంగసౌష్ఠవము లేని భారతజాతి నిరుపయోగము, అప్రశస్తము, అసంభవము. భరతవర్షమునం దనేకజాతులు గలవు, అనేకభాషలు గలవు, అనేకభాగములు గలవు. స్వతంత్రవ్యక్తి గల యిరువది భాషలు గలవు; పదునాలుగు రాష్ట్రములు, 600 సంస్థానములు గలవు. ఏ రెండు భాగములకును ప్రజాసంఖ్యయందును విస్తీర్ణమునందును రాబడియందును సాంప్రదాయాచారములయందును సామ్యము లేదు. సమానభాషయు సాంప్రదాయాచారములును గలిగి ఏకదేశవాసు లైన ప్రజను ఏకభావబద్ధులను చేయుట సులభము. సంకీర్ణసముదాయము నేక మని భావించుట- బుద్ధిమాంద్యమో దురభిమానమో స్వార్థపరత్వమో దేవున కెఱుక. సామాన్యభాష సామాన్యజాతి సామాన్య సాంప్రదాయాచారములు సామాన్యపరిస్థితులు కలిగి యుండని చెన్నరాష్ట్రము ప్రజాయోగక్షేమముల నే రీతిని తోడ్పడఁజాలనిదియు విచారశీలురకు విదితము.

ఆంధ్రోద్యమమునకు ధర్మపదము ఆంధ్రవ్యక్తి వికాసము, తన్మూలమున భారతవ్యక్తి వికాసము, తన్మూలమున మానవజాతి వికాసము. ఆంధ్రవ్యక్తి వికాసమున కాంధ్రవ్యక్తి సంరక్షణము, పోషణము, పాలనము సాధనములు. ఆంధ్రవ్యక్తి సంరక్షణమునకు, పోషణమునకు, పాలనమునకు, ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము ఆంధ్రభాషాభివృద్ధి ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆంధ్రసాంప్రదాయచార సంరక్షణము సోపానంబులు. ఆంధ్రవ్యక్తిత్వము 2500 సంవత్సరములుగ భరతఖండమునందు సంరక్షితము. ఉద్యానవనంబునం దొక చెట్టున కనువగు దోహదము వేఱొక చెట్టున కనుపయోగము. కొన్ని చెట్లకు ఎండ యనుకూలము. కొన్ని చెట్లకు నీడ యనుకూలము. వృక్షము నెఱుఁగుట ఉద్యానవనపాలనమునకు సాధనము. సుసంవర్ధితంబు లైన నానావిధ పుష్పఫలవృక్షములు వనలక్ష్మి కలంకారములు. వల దనినను కల దనినను భరతఖండమునం దనేకజాతులు భాషలు గలవు. సృష్టివికాసమునకు వ్యక్తివికాసము మూలము. లోకమంతయు నేక మగుట లయమునందు సాధ్యము కాని, స్థితియందు సాధ్యము గాదు. ప్రవృత్తిమార్గము స్థితిసంభవము గాని లయసంభవము గాదు. ఆంధ్రులకును ఇతర భారతీయులకును వ్యక్తిత్వమునందు భేదము గలదు. గుణములందును శీలములందును సంకల్పములందును ఆంధ్రవ్యక్తి భిన్నము. వ్యక్తుల వికాసంబును, వికాసవంతం బైన వ్యక్తుల సమ్మేళనంబును, భారతజాతీయతత్త్వార్థముగ గ్రహింపఁగల ధీమంతులు ఆంధ్రవ్యక్తి సంస్థాపనము ధర్మపద మనియు భరతవర్షాభ్యుదయ సాధన మనియు గ్రహింపవలసి యుందురు. ఆంధ్రోద్యమ ప్రాప్తికి ఆంధ్రరాష్ట్రము, ఆంధ్రవిశ్వవిద్యాలయము, ఆంధ్రభాష, ఆంధ్రసాంప్రదాయాచారములు సాధనము లగు విధ, మీ సంచికయందు ప్రచురించిన వ్యాసములను, ఆంధ్రమహాసభ కార్యదర్శి ప్రచురించిన పుస్తకమును చదివిన తెలియఁగలదు.

### ఆంధ్రదేశ సంస్థాపనలు

ఆంధ్రదేశమునం దనంతముఖముల ప్రకాశించుచున్న ప్రబోధకాంతు లజ్ఞానతిమిరంబును పారఁద్రోలుచు నూతనోత్సాహమును నూతనసంకల్పములను నూతనప్రయత్నములను వికసింపఁజేయుచున్నవి. వివిధ ప్రదేశములందును వివిధజాతులందును ప్రబోధ ముదయించినది. మచిలీపట్టణమునందు స్థాపిత మైన యాంధ్రజాతీయకళాశాల ఆంధ్రవ్యక్తిప్రబోధమునకు నిదర్శనము.

ఆంధ్రదేశమునం దన్ని మండలంబులలోను రాజకీయసభలు సాంఘికసభలు మతసభలు మహిళాసభలు భాండాగారసభలు శాఖాసభలు పరపతిసంఘములు స్థాపితములై దేశాభ్యుదయమునకై పాటుపడుచున్నవి. ఆంధ్రదేశప్రబోధప్రదము లైన సకలప్రయత్నములును ఆంధ్రోద్యమగర్భస్థము లై యాంధ్రమహాసభయందు కేంద్రీకృతములు.

### మూఁడవ యాంధ్రమహాసభ

గతసంవత్సరము అధికవైశాఖ బహుళ చతుర్దశీ బుధవాసరంబునందు మూఁడవ యాంధ్రమహాసభ

విశాఖపట్టణంబునందుఁ గూడినది. సభకు నానాప్రదేశములనుండియు 550 మంది ప్రతినిధులు 1000 మంది ప్రేక్షకులు ప్రముఖులు వచ్చియుండిరి. సన్మానసంఘాధ్యక్షులు భూపతిరాజు వేంకటపతిరాజు గారు. సభాధ్యక్షులు పానుగంటి రామారాయనిం గారు. సభామంటపమునం దాంధ్రదేశము నావరించిన పరమోత్సాహము వ్యక్తీకృతము. సభ్యుల కలకలధ్వనులు ఉల్లాససల్లాపములు పరమోత్సాహభరితములు. సన్మానసంఘాధ్యక్షుని యుపన్యాసమునందలి ఈ క్రింది వాక్యము లాంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతను స్థిరపఱచుచున్నవి:

“మన దేశమునకు మున్ముందు రావలసిన స్వపరిపాలనము కానడా దేశమువలె ఒక్క తరగతి ప్రజలు నివసించు స్వతంత్ర రాష్ట్రములను గలిగియుండి, అన్ని రాష్ట్రములను ఒక్క ముఖ్య ప్రభుత్వముక్రింద నుంచున ట్లొనరింపఁజేయునది. భావికాంధ్రరాష్ట్రము 1,72,45,178 మంది ప్రజలను, 83,436 చదరపు మయిళ్లను గలిగియుండును. కాన, ఒక్క పెద్ద రాష్ట్రమువలెనే యుండును. ఆంధ్రరాష్ట్రపు తీర్మానము దేశారిష్టదాయక మనియు, స్వలాభోపేత మనియు, కొందఱు వాకొనుచున్నారు. మా ఆంధ్రదేశాభివృద్ధికై రాష్ట్ర మవసర మయినప్పుడు స్వలాభమునకయి పాటుపడుటలో తప్పు లేదనియు, ఒకరి హైన్యస్థితి యింకొకరికి లాభకరముగా నుండవలయు ననుట యన్యాయ మనియు, దేశమున కంగము లగు అన్ని రాష్ట్రములును బలవంతములయి పుష్టిని గలిగియుండుట దేశారిష్టము కాదనియు చెప్పుచున్నాను. ఆంధ్రరాష్ట్ర మొసంగఁబడెనేని దేశీయతృష్ణ యెప్పటివలెనే యుండును. బేహారును బెంగాలునుండి విడఁదీయుటవలన నేమి విపత్తులు సంభవించెనో ప్రతిపక్షులు చెప్పెదరుగాక! బేహారీలు ఆనందమగ్నులయి యున్నారు. బెంగాలీలు దుఃఖపడుట కేమి కారణములును లేవు. ఇప్పుడు దేశమం దున్న పండ్రెండు రాష్ట్రములు మన యేకజాతీయతకు భంగకరముగా నుండనిచో ఇఁక రెండు మూఁడు క్రొత్త రాష్ట్రములను నిర్మించినయెడల ఏమి భంగము కలుగునో నాకు తోఁచకున్నది. రాజకీయ సభావేదికలనుండి “ఏకజాతీయత” యని ఘోషించువారు ఆ జాతీయతను బలపఱచు బాసుగారి బిల్లును, శాస్త్రిగారి రజస్వలా వివాహ శాసనమును నెట్లెదిరించిరో తోఁచకున్నది. ప్రతి రాష్ట్ర వ్యక్తియు తన యభివృద్ధికయి గట్టి యత్నములు చేయనిది వర్ధిల్ల నేరదు. పరిత్యాగము విసర్జనము అను పదములు రాజకీయ చర్చల కన్వయించునవి గావు. మన పొరుగు వాని కపకారము చేయరాదు గాని, మన యభివృద్ధి కనుకూల మేదో చూచుకొనవలయును. కాఁబట్టి ఆంధ్రరాష్ట్రమునకై సాహసముతో మనము సక్రమాందోళనమును చేయక తప్పదు. హార్డింజి ప్రభువు ప్రత్యేక బేహారురాష్ట్రమును నిర్మించుటకయి ఈ క్రింది కారణములను జూపిరి: ‘బేహారు ప్రజలు సమానము గాని బెంగాలీలతో జతపఱుపఁబడిరి. అందుచే వారి యభివృద్ధి కింతవఱకును దగిన యవకాశములు కలిగియుండ లేదు. బేహారులో చాల భాగ ముద్యోగములు బెంగాలీల వశమయి యుండుటచేత మా దేశములో మా యుద్యోగములు మాకు కావలయు నని బేహారీలు గోలపెట్ట మొదలిడిరి. బేహారులో నిటీవల గొప్ప ప్రబోధము కలిగినది. బెంగాలీలనుండి తాము తప్పించుకొననిది తాము బాగుపడ మని బేహారీలు చెప్ప మొదలిడిరి. వారి యీ కష్టము నిప్పుడు తొలఁగింపమేని, మున్ముందు గొప్ప యాందోళనము పుట్టి తీరును. అందుచే ప్రస్తుత కాలమే ఈ యవసరమయిన మార్పునకు తగిన తరుణము.’ ఆంధ్రుల కోరికలును సాఫల్యము నొందుటకయి యీ మాట లెంతయు తోడ్పడును.”

సభాధ్యక్షులు రామారాయనింగారు ప్రారంభోపన్యాసమునందు ప్రవేశపరీక్షవఱకును దేశభాషలలో విద్యాశిక్షణమును చేయుట విజ్ఞానవ్యాపనమునకు సాధన మనియు విద్యోపార్జనమునకు విపులముగ శీలసంరక్షణమును కార్యానుష్ఠానము నుండవలయుననియు ప్రబోధించిరి. ఆంధ్రోద్యమ తత్త్వమునకు బీజమైన రాష్ట్రసమస్యను గుఱించిన సభాధ్యక్షుని యభిప్రాయ మీ క్రింది వాక్యములవలన విదితము కాఁగలదు:

“ఈ వాద ప్రతివాదములను పర్యాలోచించి చూచిన హైందవ దేశము రాష్ట్రవిభాగము లేక రాజ్యము చేయ నసాధ్య మనియు, రాష్ట్రస్వాతంత్ర్యమును గోరు నీ కాలమున రాష్ట్రవిభాగము కూడ నంతవఱకు భాషల ననుసరించి మార్చుట యుక్త మనియు ననుటకు సందేహము లేదు. ఆంధ్రరాష్ట్రమును సంపాదించుటకు ఆంధ్రమండలములలోని యవశ్యతరము లగు విశాఖపట్టణపు రేవు, గంజాము విశాఖపట్టణములలో ఇనుపదారి, దత్తమండలములు మొదలగు వానిలో శాస్త్రపాఠశాలలు, ఆంధ్రమండలములలో వృత్తి కళాశాలలు, ఆంధ్ర విశ్వవిద్యాలయము లోనగువానికై సంతతము ప్రయత్నింపవలసియుందుము. వీనికిఁగాను చేయవలసిన పరిశ్రమయే మాత్రమును ఆఁగఁగూడదు. రాష్ట్రోత్సాహ మాత్రమున నిలువక వెంటనే పని పూనవలసి యున్నాము.”

ఆంధ్రరాష్ట్ర నిర్మాణావశ్యకత యంగీకృతమై సభ్యులచే నీ క్రింది తీర్మాన మామోదితమైనది:

“పరిపాలనా సౌకర్యములకును, ప్రజల పురోవృద్ధికిని, హిందూదేశమును భాషాప్రయుక్తరాష్ట్రభాగములుగ విభజించుట యవసరము; (2) దేశీయ మహాసభవారు వ్యక్తీకరించిన స్వపరిపాలనాధర్మమును, ఇండియా దొరతనమువారు తమ లేఖలో సూచించిన స్థానికస్వపరిపాలనమును సాధ్యమగుట కట్టి భాషాప్రయుక్త రాష్ట్రములే యనుకూలములు; (3) చెన్నరాజధానిలో తెలుఁగు మండలములను ప్రత్యేకరాష్ట్రముగ నిర్మించుట యుక్తము, అవసరము.”

ఆంధ్రమహాసభచే నంగీకృతమైన తీర్మానము నందు మూఁడు విషయములు గలవు. భగ

నందు స్వపరిపాలనాస్థాపన మవసర మనునది మొదటి విషయము. స్వపరిపాలనమును స్థాపించుట యవసర మని భారతీయు లందఱు నేకగ్రీవముగ వాదించుచున్నారు. ప్రస్తుత మీ విషయసంబంధమైన యాందోళనము సకలరాష్ట్రములందును జరగుచున్నది. మండలసభలు కాంగ్రెసు కమిటీలు స్వపరిపాలనసమస్యను విప్పుటకై ప్రయత్నములను చేయుచున్నవి. ఈ విషయమై భేదాభిప్రాయములు లేవు. రాష్ట్రీయస్వపరిపాలనమును స్థాపించుటకు సాధనము లెవ్వి యనునది రెండవ విషయము. ప్రస్తుత మున్న రాష్ట్రములందు స్వపరిపాలనము స్థాపితమైనను, పరిస్థితు లననుకూలముగా నయోగ్యమైనచో ప్రయోజనము గలుగదు. విజ్ఞానవ్యాపనకును దేశాభ్యుదయమునకును భాషాప్రయుక్తరాష్ట్రము లుపయుక్తములు గాన, స్వపరిపాలన స్థాపనమునకు భాషాప్రయుక్త రాష్ట్రము లవసరము. ఆంధ్రమండలములను ప్రత్యేక రాష్ట్రముగ నిర్మించుట మూఁడవ విషయము. విశాల ప్రదేశమును సామాన్యభాషను జనబాహుళ్యమును గల యాంధ్రమండలములను ప్రత్యేకరాష్ట్రముగ నిర్మించుటవలన భాషాప్రయుక్తరాష్ట్రము నిర్మితమై స్వపరిపాలనము దేశాభ్యుదయమునకు తగిన రీతి నేర్పడును గాన, ఆంధ్రరాష్ట్రనిర్మాణము యుక్తము, అవశ్యము. ఆంధ్రోద్యమసమస్యకు ఆంధ్రరాష్ట్రనిర్మాణము ప్రాణము. రాష్ట్రము సాధ్యమైన, ఇతరవాంఛితములు సులభసాధ్యములు. ఇతర వాంఛితములు సాధ్యములైనను రాష్ట్రరూపమైన ప్రత్యేకవ్యక్తిత్వము లేనపుడు వాంఛిత లాభము ప్రయోజనకరము గాదు. బీహారురాష్ట్ర చరిత్ర మీ సిద్ధాంతమునకు నిదర్శనము. ఆంధ్రోద్యమమున కాంధ్రదేశవ్యాప్తంబులైన సకల సంస్థలు జీవప్రనాళులు. జీవప్రనాళుల రసపోషణ మభివృద్ధికి పరమసాధనము. ఆ సాధనములను సంరక్షించి ఆంధ్రోద్యమమును పోషించుట ఆంధ్రప్రపంచమునకు నియత ధర్మము. ఆంధ్రోద్యమమున కనుబంధములైన సంస్థలచరిత్రల నవ్యవధివలన ప్రచురింప జాలనందులకు దేశబాంధవులు మన్నించుటకు ప్రార్థితులు.

# భారతీయసందేశము

గాదె శ్రీ జగన్నాథస్వామి గారు

శ్రీ విక్టోరియ చక్రవర్తిని ప్రజాక్షేమాభిలాషాత్మయై
యే వాగ్దానము లిచ్చెనో తొలుత నేయే సౌఖ్యముల్ గూర్చెనో
మీవా రయ్యవి పాటిసేయరు గదా! మీరైన మా కాప్తులై
తీవిం దీర్పుఁడు దాన మీ యశము దండిన్నిండు బ్రహ్మాండముల్.

ఉ. గోవులవంటి హైందవులకుం దగ గొల్లలవంటి హూణులన్
దైవము గూర్చిపెట్టిన కతంబున, మీ రిఁక మా సుఖంబుకై
యేవగ నైనఁ జూడవలె; నెందుల కన్నను మేఁత పుష్టిగా
గోవుల కున్నఁ గాదె యిల గొల్లల భాగ్యము వృద్ధి చెందుటల్?

ఉ. ఇప్పటి కెంత లేదనిన నెన్నఁగ నొక్క శతాబ్ద మయ్యె మీ
రొప్పుగ హిందుసీమఁ బద మూనిన; దప్పటినుండి రూఢిగా
నెప్పటికంటె దేశమున నెంతయు శాంతి ఘటిల్లెఁ గాని హా!
దెప్పరమైన లేమి యొకతెన్నున వచ్చిదె దాఁపరించెడిన్.

చ. ప్రజఁ బ్రజవోలెఁ జూచుకొని పాలన చేయుట ధర్మ మంచు మీ
స్వజనము పార్లమెంటుసభవారికి నచ్చఁగఁ జెప్పి భారత
ప్రజ కతిబాధకం బయిన పన్నులఁ జట్టములన్ దొలంచి శి
ష్టజనులు మెచ్చు పాలనము సల్పఁగఁ డంగుఁడు జార్జిభూపతీ!

శా. స్వారాజ్యంబును ధిక్కరించెడి మహాశాంతుల్ స్వరూపజ్ఞులన్
ధీరుల్ చూడఁగ నగ్రజాతులు, స్వబుద్ధిన్ నేఁడ కాదన్నఁడేన్,
గోరంజూచిరె యస్థిరార్థములు? సంకోచింప మీ కేటికి? క
వ్వారైనన్ దగు రీతిఁ బాలన మొనర్పంజాలు మా వారికిన్.

ఉ. మున్నొకసారి మా విషయమున్ దిలకించి స్వసీమ కేఁగి యా
పన్నుల భారతప్రజల పాలనకున్ దగు కీలు ప్రేమ యం
చెన్నఁగ గిల్డుహాలుసభ నేర్పడఁ జెప్పితి, రిప్డు నాఁటి మా
టన్నడపంగ వీ లిదె తటస్థపడెన్ జుఁడి మీకు దేవరా!

ఉ. భాషలఁ బట్టి దేశము విభాగము చేయుట, కాలనీల వి
ద్వేష మడంగఁజేయుటయు, స్వేచ్ఛనొసంగుచు భారతీయులన్
బోషణ చేయు టెట్లు? సమబుద్ధిఁ జరించెదరేని మీర, లే
ఘోషయుఁ బుట్టఁబోదు; సమకూడు సుఖస్థితి యెల్లవారికిన్.

ఉ. కోరిన కోర్కె లెల్ల సమకూర్చిన మీ చిరకీర్తి విగ్రహా
కారము దాల్చి శాశ్వతముగా భరతోర్విని నిల్చు; ధర్మవి
స్తారులు రామకృష్ణనృపచంద్రము లెప్పటివారు? నేఁటికిన్
వారల పావనాఖ్య శ్రుతిపర్వముగా వినవచ్చు నిచ్చలున్.

ఉ. రాజట దోషవర్తి, దినరాజట యుగ్రకరుండు, దేవతా
రాజట భ్రాతృహంత, నగరాజట గుప్తసువర్ణుఁ, డంబికా
రాజట భిక్షుకుండు, ఫణిరాజట చూడ ననేకజిహ్వుఁ; డా
రాజుల బాడఁ బోక ప్రజ రంజిలఁ బాలన చేయుఁడీ నృపా!

తే. అడుగవలసిన మర్యాద నడిగితి, మిఁక
పైని మీ చిత్తము మఱి మా భాగ్య, మిందు
తప్పు లున్నను మన్నించు టొప్పు మీకు
సాధుపదవర్తి! శ్రీ జార్జి చక్రవర్తి!

# ఆంధ్రసర్వకళాశాల

కట్టమంచి రామలింగారెడ్డి గారు

సంక్షేపవాదము *

ఇప్పుడు ప్రభుత్వమువారియొక్కయు, నాంధ్రప్రజలయొక్కయు హృదయదృష్టికిని, మనోదృష్టికిని గుఱియై, వారి నిరాలస్యమగు సంకల్పము నిరీక్షించి వేచియుండు ప్రారంభములలో ప్రాథమికము ప్రత్యేకాంధ్రసర్వకళాశాలా నిర్మాణోద్యమము. ఈ ప్రయత్నమునకుఁ దగిన వాక్సామగ్రి యిదివఱలోనే సేకరింపఁబడియున్నది గాని. యింకను దీర్ఘవిచారణ కవకాశము లేకపోలేదు.

అవశ్యకత

జాత్యాదిభావములంబట్టి కొందఱీకార్య మావశ్యక మందురు. మఱికొందఱు విద్యాపద్ధతి సంస్కారణార్థంబు మను. ఈ రెండవ తెగవారి సంఖ్య యధికంబు కాదుగాఁబోలు.

జాత్యాది కారణములు

జనసామాన్యమునకుఁ బ్రబలకారణముగఁ దోఁచునది జాత్యాదులచే నుద్భూతమైన ప్రత్యేకభావము. మనము ఆంధ్రులము. 'తెనుఁగువారి'మన్న నార్యసంతతికిఁ దప్పినవార మగుదుమను భయవిభ్రాంతులచే నేమో "ఆంధ్రులము, ఆంధ్రులము" అను నోరునిండు పదము వాడుకకు వచ్చినది. ద్రావిడుల చరిత్రము, దేశము, భాష, మొదలగునవి వేఱు. వారికిని మనకును విజ్ఞానచంద్రికామండలివారి శాస్త్రజ్ఞులోకిరు వెల్లడిపఱచిన రసాయనసమ్మేళనము గాని, యింకేవిధమైన సమ్మేళనము గాని లేదు. మద్రాసు కళాశాలలోఁ బ్రతిబింబితములగు దేశభాషలు ఐదు; అఱవము, తెలుఁగు, మళయాళము, కన్నడము, ఓఢ్రము. ఇట్టి సంకరజాతికళాశాల యేప్రాశస్త్యమునైన గడింపఁజాలునా ? విద్యావిషయమున నెల్లరును సంయుక్తులు సమానులునై యున్నారను మిషఁబెట్టి, యుద్యోగవిషయమునను అందఱను సరిసమానముగఁ బోటీచేయునట్లు నియోగింతురు. దీనిచేఁ గాదె తెనుఁగుదేశములోని యుద్యోగము లనేకములు ద్రావిడులాక్రమించుకొని మనల స్థానభ్రష్టులఁ జేసియుండుట! నా జన్మపట్టణమగు చిత్తూరునకుఁ బట్టియుండు గతిని గమనింపుఁడు; పదునైదేండ్లక్రింద నచ్చట నఱవవా రరుదు; నేఁడు వీథిలోఁ బోవుచు, చక్కని వస్త్రముల ధరించి తాంబూలము నెమరుచు నొయ్యారముగ వచ్చు నెవనినైన 'ఫలానివారి యింటికి త్రోవ యేది?' యని తెనుఁగున నడిగితిమేని, యతఁడు నిరుత్తరుఁడగుటయే కాదు, 'ఈమృగ మేయడవినుండి దారిఁదప్పి వచ్చె' నని విస్మితుఁడై యెగాదిగఁ జూచును. స్వదేశమే విదేశమయ్యెనేని, దానికన్న చెడిన యధోగతి యెక్కడిది? ఆంధ్రసర్వకళాశాల ప్రభవించెనేని దానం జదివి కడతేఱిన బి. ఏ., ఎం. ఏ. లకుఁ గాని యితరులకు నిక్కడి పదవులు దొరకఁజాలవు. భాషయందైన సామ్యము లేనివారు రాజోద్యోగముల నధిష్ఠించిరేని, జనుల సుఖదుఃఖములను, మర్మములను అరయక గ్రుడ్డి యధికారము చెలాయింతురు. భాషలో కలయిక యున్నయెడలఁ గొంతకుఁ గొంత మనసులు గలియకపోవు; ప్రీతి పుట్టకపోదు; అట్టిచో తలమీఁది యుద్యోగుల ప్రీత్యర్థమే కాక, పాదసంగతులైన ప్రజల క్షేమార్థమును పాలనము నడచును.

సత్యమైన కారణము

ఈ హేతువులు కొన్ని సమంజసములు; కొన్ని కావు. "గవర్నమెంటు నియోగముల నిర్వైరముగ నోటవేసికొనఁదలఁచిన కించిద్విద్యాయుతుల కైతవము ఈ వాదములకు మూలమును ఫలమును" అని కొందఱు వాపోయెదరు.

* ఈ విషయముంగూర్చి యింకను దెలియఁ గోరువారు, ఈ గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడిన "Speecheson Univer Reform" అను పుస్తకముఁ జదువవలయును. వెల 8 అణాలు.

మనలో నల్పులు లేకపోలేదు. ఎవ్వరిలో లేరు? అయినను మొత్తముమీఁద తెనుఁగువారియంత యుదారచిత్తులు దక్షిణాపథమునఁ గానవచ్చుట యరుదు. ఇది స్వాభావికలక్షణ మని విఱ్ఱవీఁగుట తప్పు; మఱి చరిత్రాంశసంజనితము. మిక్కుటముగ యుద్ధములు చేసి, విజాతీయులతోఁ బోరాడి, గొప్ప రాజ్యములను స్థాపించి, శౌర్యము ధైర్యమును బ్రకటించిన యోజనులలోఁ గాని, నక్కజిత్తులు తక్కువ యోజనలు తఱచు ప్రబలవు; ధారాళమగు బుద్ధి వ్యాపించును. తెనుఁగువారి పూర్వచరిత్ర మట్టిది. ప్రకృతగుణములు నట్టివే. నేఁటికిని గవర్నమెంటుద్యోగములే ప్రాణమానాధారము లని మనవారు నమ్మినట్లు కానము. ఇఁక ముందు నమ్ముదు రనుటయు విశ్వసనీయముగాదు. మాతృభాషారక్తి, దేశభక్తి, సంఘసంస్కారము, వాణిజ్యము మొదలగు స్వతంత్రప్రచారములే మనకుఁ బ్రాణములు కాని, కలెక్టరు కచ్చేరీ గుమాస్తాపనులు కావు. సేవావృత్తియందు మన కభిరుచి తక్కువ. అది మన రక్తములోఁ బదిలముగ నింకను బట్టువడలేదు. ఎన్నఁడును బడకుండుఁ గాక! ఒక్క బంగాళాదేశము విడిచి చూచినయెడల ఆంధ్రమండలమునఁబలె జాతిభావ మింకెందును ఇంత దట్టముగ నింకి యూఱియుండలేదు. అట్టి మనము ద్రావిడులయెడ వైరము అసూయ పూని, పగ సాధింప నీసర్వకళాశాలాయుక్తి పన్నినార మనుట శుష్కహృదయుల నైచ్యమును వెల్లడించు నింద. ఆంధ్రులఁగూర్చిన యీ శ్లాఘనవాక్యములు, మధ్యస్థులగు పాశ్చాత్త్యులచే పదేపదే యుపన్యసింపఁబడినవియే కాని, నా కల్పనలు గావు. ఆంధ్రోద్యమ మంతయు నుద్యోగనిమిత్తమైన కడుపాత్రముచేఁ గల్పింపఁబడిన మంత్ర మని గాలిదాఁటుననైన సంశయించునేని దేశభక్తుఁ డెవ్వఁడును దీనికి సమ్మతింపఁడు.

"తెనుఁగు లెస్స"

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యనుట యభిమానముతోఁ జేరిన స్తోత్రము గాని సత్యముచే నాదేశింపఁబడిన దనుట సాహసపు మాట. లెస్సయైన నేమి? కాకున్న నేమి? మనకు మన భాషయందు వాత్సల్య మెక్కువ; ఇదిసహజము, అనింద్యము. ఆభాషకు ప్రకృతము విద్యాదాయకపద్ధతులలో ప్రవేశము తక్కువ. ఈ విషయమైన సంస్కారమునకై మన మెంత ప్రయత్నించినను, ఇప్పటి స్థితిగతులఁబట్టి చూడఁగా, నుదాసీనులై యుండు నితరదేశభాషలవారును మనతో నేకీభవించినఁ గాని కొనసాఁగదు. ఒక్క భాషామాతకుఁ బుట్టిన సంతానమునే యైకమత్యము గలదిగాఁ జేయుట దుర్ఘటమన్నచో, నిఁక బహుభాషాసంతానముల నొక్కమందలోనికిఁ దెచ్చుట లేశకార్యమా? సర్వభాషలను సమముగఁ జూచు సమవర్తి మన యూనివర్సిటి. మనలో నైకమత్యము చాల దను సాకుఁబెట్టుకొని, యిప్పటి దుస్స్థితిని శాశ్వతముగాఁ జేయకమానదు. ఎట్లును, ప్రత్యేకింపఁబడినఁ గాని, యాంధ్రమునకు ప్రత్యేకసత్కారము గలుగదు; కలిగింపఁగాదు.

హిందూదేశము దేశము గాదు; మహాఖండము. బంగాళా, బొంబాయి, ద్రావిడము, పంజాబు మొదలగు మండలములవారు మొత్తముమీఁద నభిన్ను లయ్యును, కొన్నివిధముల భిన్నప్రకృతి గలవారు.

దీనిచే నైకమత్యము చెడునా?

అట్లగుటఁ దమతమ స్వభావముకొలఁది తమ గుణగణమ్ముల వికసింపఁజేసి రేని తమకే కాదు, దేశమునకును మేలు; కీర్తి. ఈ మాత్రమున కనుగుణమగు స్వాతంత్ర్యము యుక్తము. ఇట్లు పరిమితప్రత్యేకత్వముఁ గాంచినందుననే పరస్పరవైరమెత్తి దేశముయొక్క యైక్యప్రభావమును చించి చెండాడుదు రని భయముగొనుట భ్రాంతిమదలంకారమో లేక వికారమో! బంగాళా మద్రాసు రాజధానులు వేఱుగా నున్నవిగదా? మనకును వారికిని ఎన్ని యుద్ధములు నడచినవి? నడువనున్నవి? అంగములు వేఱయ్యును దేహపోషణమున సంయుక్తతం దాల్చినట్లు, మండలములు వేఱయ్యును దేశసముద్ధరణమున సంయుక్తతం దాల్చిన రాష్ట్రములు లేవా? అపురూపములా? అమెరికామహాదేశము సంయుక్తరాజ్యతంత్రంబు గలిగి వర్ధిల్లుచుండుటఁ జూడమా? కావున మండలములు

వేఱుపడినను, మనసులు వేఱువడ వని నా నమ్మిక. యూనివర్సిటీలు వేఱువడిన దాని విచ్ఛిన్నతా ప్రభావ మింకను దక్కువగ నుండు ననుట కేమి శంక!

శాస్త్రము యొక్క ముఖ్యోద్దేశము ప్రకృతిని మనుష్యునకు వశగతముం జేయుట; శిక్షయొక్క ముఖ్యోద్దేశము మనుజుని సంఘమునకు వశగతుం జేయుట. సంఘాభివృద్ధికి ననుకూలింపని విద్య లెంత మనఃపీడకము లయినప్పటికిని విద్యలు కానేరవు. దేశశ్రేయమునకుం గావలసినవిద్య లెవ్వి? అయ్యవి యిప్పు డిట నుండు విద్యాలయములచే నుద్ధరింపఁబడుచున్నవా? కావేని యేకారణములఁబట్టి? దేశభాషలను ముఖ్యభాషలుగా నవలంబించిన సర్వకళాశాలలను, ఒక్కొక్కభాష కొక్కొక్కటిగా స్థాపించితిమేని, ఈ లోపములు నివారితములౌనా? శిక్షాసంస్కారపరమైన దృష్టితోఁ జూచువారికి ప్రధానములుగాఁ దోఁచు నాలోచన లివియే.

విద్యాబోధవిధాన సంస్కారములు

గౌరవార్హులగు శ్రీ మదనమోహన మాళవీయ పండితులు మన కళాశాల లన్నియుఁ బురాతనము లనియు, నీ కాలమునకుఁ బనికిరా వనియు పచ్చిగఁ బల్కియున్నారు. ఆధునికకళాశాలల పనిపాటుల గమనింపనిది, మన కళాశాలల కాలాతీతత్వము గోచరింపదు. అట్లగుట నవ్యకళాశాలల శిక్షావిషయిక నిర్మాణము నాలోచింతము.

ఆధునికకళాశాలలవ్యాపారములు బాహ్యములు, ఆభ్యంతరములు నని రెండు దెఱఁగులు. తమ ప్రాకారములోఁ బ్రవేశించి,క్రమముఁ దప్పక నడుచుచుండు విద్యార్థులకొఱకునై చేయఁబడు కృత్యములు ఆభ్యంతరములు. ఇప్పుడు మన యూనివర్సిటీలు, హైస్కూల్లు, యావత్తుశాలలు నడుపు పనులు ఇట్టివ.

అభ్యంతరశిక్ష

ప్రకృతి యనఁగా భాగము. అభ్యంతరప్రకృతులు ద్వివిధములు: బి.ఏ., ఎం. ఏ. యను బిరుదులకుఁ దగిన విద్యలఁ జెప్పు ప్రకృతి యొకటి; అంత గొప్పవిద్యాగాంభీర్యము నాశింపక తక్కువ బిరుదముల మాత్రము కోరి యభ్యసించువారికి, వారికిఁ దగిన జ్ఞానదానము నొసంగునది రెండవది. ఈ రెండవ ప్రకృతి యీ దేశములో మృగ్యము. కాలధనవ్యయముల కోర్వఁజాలనివారును, ఒకటిరెండేండ్లైన యూనివర్సిటీలోఁ జేరి, నియమితవిద్యాచక్రమున నొకటిరెండు భాగముల మాత్రము స్పృశించి, కొంతకుఁ గొంత మేలు వడయుదురు. దీనిచే విద్యాపరిశ్రమల సంఖ్య యెక్కువ యగును. బాలురకు విద్యను బోధించు పద్ధతుల నేర్పెడు శిక్షాశాస్త్రము, మనయందు బి.ఏ. లో కడతేఱినవెనుక లభింపవలసిన భాగ్యము. ఇతర దేశములందు పట్టపరీక్షకుం బఠనీయములైన భాగములలో నదియు నొకటి. అట్లగుట శిక్షావిధానమున. సమర్థులైన యుపాధ్యాయుల సంఖ్య, యిచ్చటఁబోలె నచ్చట క్షామబాధఁ దాల్చినది గాదు. క్రొత్తక్రొత్త పాఠశాలల నేఁటేఁట వేలకొలఁదిగ స్థాపించి విద్యను ప్రసరింపఁజేయు రాజ్యములలో నెల్ల నీపద్ధతి యనివార్య మనియు శ్రేయస్కర మనియు భావింపఁబడుచున్నది. విద్యలు ద్వివిధములు: శాస్త్రములు, కళలు అని. శాస్త్ర మనఁగా విజ్ఞాన మిచ్చునది. కళ యనఁగా నేర్చిన విద్యను మనుష్యప్రయోజనార్థముపయోగించు నేర్పు. తత్త్వము, చరిత్రము, అర్థశాస్త్రము, తర్కము, ఇత్యాదులు శాస్త్రములు; శిల్పము, చిత్రరచన, వైద్యము, వాస్తువు, రంగులు వేయుట, సబ్బు మొదలగు సామగ్రులఁ జేయుట, వాణిజ్యము, వ్యవసాయము, గనులఁ ద్రవ్వుట, లోహపుఁబనులు,ఇత్యాదులు కళలు. వట్టి విద్యలచేఁ బొట్ట నిండదు; రాజ్యము బలవంతము గాదు; పరివర్తనకళలు నాగరకతకుఁ బ్రాణములు; పురోవృద్ధికి మూలములు. శాస్త్రజ్ఞుఁడు వెలివఱిచిన వస్తుగుణమ్ములను, తత్త్వములను, మానవకోటియొక్క క్షేమార్థమై క్రియలలో నిగుడఁ జేయుట కళ యనఁబడును. కన్నులు మూసికొని చదివినను శాస్త్రజ్ఞాన మలవడును; ఒడలు వంచి, ప్రతిదినముఁ జేసిచేసి యభ్యసింపనిది కళ పట్టువడదు. శాస్త్రము కళకు వేరువంటిది; కళ శాస్త్రమునకు పండువంటి

అభ్యంతర ప్రకృతులు

వీని సంయోగము పురోవృద్ధి, వియోగము క్షయము; అట్లగుట నాధునికసర్వకళాశాలలయం దెల్ల నీ రెండు విద్యలును సమన్వితములు చేయఁబడియున్నవి. "లీడ్స్" అను నింగ్లాండులోని యూనివర్సిటీలో నభ్యసింపఁ గూడిన కళలు: యంత్రములు; బాటలు వంతెనలు వేయుట మొదలగు క్రియల నేర్పు వాస్తువు; విద్యుచ్ఛక్తి; గనులు; లోహములు; ఇంధనములు; వ్యవసాయము; రసాయన శాస్త్రప్రయోగము (రంగులు, రంగులు పట్టించుట ఇత్యాదులు); చర్మములఁ దయారుచేయుటకై వలయు రసాయన శాస్త్ర ప్రయోగములు; దూది ఉన్ని మొదలగు పోగులుగా రాఁజాలిన సరకులతోఁ జేయఁబడు నేఁతపని; ఇత్యాదులు. వాణిజ్యకళ ప్రకృతులలో నొకటి. మనలో పౌరాణికసర్వకళాశాలలకును, ఆధునికసర్వకళాశాలలకును గల తారతమ్యము విప్పి చెప్పనేల? వేనిచే ప్రజల కెక్కువ యుపకారము గలుగుచున్నదో యదియు సర్వవిదితము. వైదికపద్ధతికిని బ్రిటిష్ ఇండియా పద్ధతికిని గల భేదమే మనఁగా, తాటాకులకు బదులు కాకితములు ప్రచారమునకు వచ్చినవి; ఇంకేమియు లేదు.

*విద్యావ్యాపనము*

కళాశాలయందు క్రమవిద్యార్థులుగఁ బ్రవేశింపఁ జాలని వారికిని విద్యాదాన మొసంగుటకు బాహ్యక్రియ యనియు, విద్యావ్యాపన కార్య మనియుఁ బేళ్ళు. వృత్తుల నధిగతులైన కాఁపులు కమ్మరులు మొదలగు కష్టజీవులకును మనోవికాసముఁ గల్పింపఁజూచుట ప్రత్యాధునిక విద్యాశాలయుఁ జేయు ముఖ్యకార్యములలో నొకటి. మన దేశమున నీ ప్రారంభ మెక్కడను అంకురింపలేదు. శక్తి లేమినో, రక్తి లేమినో, బుద్ధి లేమినో ఊహ్యము. మన విద్యాధికులకును విద్యావ్యాపనముఁగూర్చి యట్టె తెలియదు. కావున నొకింత దీర్ఘముగఁ జర్చించుట యావశ్యకము.

విద్యార్థు లిచ్చు వేతనములతో మాత్రము ఏ యూనివర్సిటీయు నిజజీవనము శాశ్వతముగ నిల్పుకొఁ జాలదు. దాని పోషణకై జనసామాన్య మిచ్చెడు పన్నులలోఁ గొంత భాగము నైవేద్య మియ్యవలయును. ప్రాణదాతలైన ప్రజలకును అది ప్రత్యక్షసేవ చేయుట ధర్మమే కదా! ధర్మమే కాదు; నీతియును. ఎట్లన, ప్రజానీకము అర్థవంతము గుణవంతము నై యుండదేని తుదకు తనకే ముప్పు. పాశ్చాత్త్యులలో సర్వప్రజాసమ్మతిమీఁదఁగాని, రాజ్యపరిపాలనము కొనసాఁగదు. ప్రజలలో విద్యాబుద్ధులు సంరక్షితములు గాక వినాశితము లైనచో, మూఢరాజ్యము సిద్ధించి రాజ్యమే చెడును. కావున, నే గవర్నమెంటువారును ప్రజల నశ్రద్ధతోఁ జూడఁగాదు. ప్రభువే ప్రజ; ప్రజయే ప్రభువు. ఇఁక ప్రజార్థము కాని ప్రభుత్వ మను శోభ యెట్లు? సర్వ కళాశాలలు, హైస్కూలులు, ప్రతియంతస్తు విద్యాశాలలును, శక్తి కొలఁది విద్యాప్రకటన మొనర్చెడిని.

*విద్యాశాలలు: ప్రజలు*

*విద్యావ్యాపన పద్ధతులు*

అమెరికాఖండములోని యగ్రగణ్యములం దొక్కటి యని పేరువడసి, యనేకసర్వకళాశాలలకు మాతృకయు మార్గదర్శకము నై విరాజిల్లు "విస్కాన్సిన్" అను మహా యూనివర్సిటీ యందుఁబలె నీలోకమున నెక్కడను జ్ఞానప్రకటనపద్ధతులు, అంత మంచిస్థితికిఁ దేఁబడియుండ లేదు. ఈ పరిపూర్ణతను వర్ణించితిమేని ఈ విషయము సుబోధ మగును.

*విస్కాన్సిన్ యూనివర్సిటీ విద్యావ్యాపన పద్ధతులు*

విద్యావ్యాపనకర్మాంగములు నాలుగు: (౧) గ్రంథప్రకటనము; (౨) ప్రసంగము; (3) ఉత్తరప్రత్యుత్తరముల మూలమునఁ జేయఁబడు బోధ; (౪) చర్చలు నడుపుట. విద్యావ్యాపనము యొక్క ముఖ్యార్థము లియ్యవి:—(౧) కళాకౌశలము; (౨) వ్యవసాయాభివృద్ధి; (3) సంఘీభావాభివృద్ధి; (౪) ఉపస్వతంత్రపరిపాలనాస్థానము లగు మునిసిపాలిటీలు మొదలగు వానిని సాహాయ్యముఁ జేసి మంచి స్థితికిఁ దెచ్చుట; ఇత్యాదులు.

*వ్యవసాయాభివృద్ధిపద్ధతులు*

ఒక్క వ్యవసాయమును మాత్ర ముద్ధరించుటకై యనుగ్రహింపఁబడిన శిక్షావిధానము లెన్నియో గమనింపుఁడు:—

కాఁపువారికి నుపయోగపడు గ్రంథములఁ బ్రకటింతురు. గ్రంథము లనఁగా కామాయణమునవలె మనుష్యుని మోఁత గలయవి కావు; పగ లంతయుఁ బొలములఁ గష్టించి వచ్చెడు కృషీవలులు విరామార్థమును ప్రయోజనార్థమును శ్రమలేక చదువఁదగినచిన్న పుస్తకములు. వీనిలో నిష్ప్రయోజన పరమగాఢశాస్త్రఘోష తక్కువ; వృత్త్యనుష్ఠానములకుఁ బనికివచ్చు తంత్రములు మెండు. పాశ్చాత్యులీ కార్యవిషయమునవంధ్యవిద్య నుపాసింపరు. ప్రాణములకొఱకుఁ బుస్తకములు; పుస్తములకొఱకా ప్రాణములు?

౧. గ్రంథ ప్రకటనము

పనిపాటలు లేక విరామముగా నుండు శీతఋతువులలో సమీపస్థులను యూనివర్సిటీలోనికే పిలుచుకొనివచ్చి, 'స్వల్పకాల విద్యార్థు' లని పరిగణించి, రెండు మూఁడు మాసములు వ్యవసాయకళకుం జేరిన క్రియల బోధింతురు. ఈ తరగతులయందును సద్యోభ్యాసమునకు వీలైన క్రియలంగూర్చిన చర్చ లెక్కువ. బాహ్యావిద్యావ్యాపనమున ముఖ్యముగ నాదరింపఁబడునవి ఇట్టి క్రియాశాస్త్రములే కాని నట్టి తత్త్వములు గావని యెఱుఁగునది.

౨. స్వల్పకాలపువిద్య

'విస్కాన్సిన్' అమెరికా సంయుక్తరాష్ట్రములలో నొకటి. ఆ రాష్ట్రమునకుఁ జేరిన పల్లియలలో మూఁడు నాలుగు వారములు నడుపఁబడు వ్యవసాయకళాబోధకశాలల నేర్పఱచి చుట్టుప్రక్కల వారికి క్రొత్త తెఱఁగులఁ గృషి చేయుట నేర్పుదురు. వీనికి "స్వల్పకాలపాఠశాల" లని పేరు.

3. స్వల్పకాల పాఠశాలలు

కృషి, వాణిజ్యము, కళ, అను నీ మూఁడు తెఱఁగుల వృత్తులందును నూతన పరిశోధనలు పాశ్చాత్యులలో ప్రతిదినము వెలువడుచున్నవి; సంస్కారములు కనుఁగొనఁ బడుచున్నవి. వీని నెల్ల ప్రజాబాహుళ్యమునకుఁ గాలయాపనము లేనియట్లు వివరింపక, పండితమండలుల హృదయాంతరాళమందే మూఁటగట్టి భద్రముగ పాతిపెట్టినయెడల, రాజ్యమున విద్య హెచ్చినను వృద్ధి నొచ్చదు. మనము వెనుకఁబడుదుము; పురాణపురుషుల మౌదుము. ఈ యుపాధి దప్పించుటకు, ఈనాళ్ళలో సంధ్యకన్న నెక్కువ క్రమముగ నుపాసింపఁబడు వార్తాపత్రికల ద్వారా, నూతనసంగతులఁ బ్రచురించుటకై సమర్థులగు విద్యాధికుల నియమించియున్నారు.

౪. పత్రికా ప్రచారము

అచ్చటచ్చట ప్రసంగములు చేయుటకై దేశాటనముఁ జేయు నుపాధ్యాయు లున్నారు.

౫. ప్రసంగము

వృత్తుల నెల్ల నగ్రగణ్యము కృషి. కృషియే కళలకు నాలవాలము. కావున ప్రతిదేశమునందును కృషిని ముఖ్యముగ నుద్ధరింపఁజూతురు. అయిన నొక యిక్కట్టు: కాఁపులు మందబుద్ధులు; నడవడి యంతకన్న మందము; నూతన మన్న భయము; ప్రాఁత యన్న భక్తి; మౌఢ్యము మూర్ఖ్యముఁ గలిసినవారు; "గుండ్రాతికి కాళ్ళు వచ్చి గునగున" నడువఁజాలినను, వారు అలఁతులఁ గదలరు; చెప్పిన వినరు; అయిన నొక్కటి; చేసి చూపితిమేని యనుసరింతురు; ఒక్కపర్యాయము పట్టుపట్టిరేని కొంచెమున విడువరు. ఆధునికశాస్త్రములును కళలు నాదేశించు పద్ధతుల నవలంబించునట్లు వీరిని ప్రోత్సాహపఱచుటకునై ప్రభుత్వమువారును, సర్వకళాశాలలవారును, గ్రామసమీపములఁ బొలములఁ గొని, తమ కింకరులచే మేలిమి విధమ్ముల సాగుబడి చేయించి, ఫలము చూపి, ప్రాచీనాచారపరాయణుల శంకయు జంకును బాపి, సంస్కారపరాయణులఁ జేతురు. పంటల యాధిక్యమును జూపి నిరూపించుట తప్ప జయప్రదమైన తార్కాణ యింకేదియు లేదు. లాభమో నష్టమో యను సంశయమునకు నెడ ముండుపట్ల, ఎందఱు శాస్త్రజ్ఞులు చెప్పినను, బీదలైన కాఁపులు తమ సర్వస్వముఁ బరీక్షార్థమై యేదేశమందున్ను కాలమందును ధారవోయరు. ప్రత్యక్షప్రమాణముచే గాఁపులకు కృషికౌశలమును నేర్పుటకై యూనివర్సిటీలు మొదలగు ప్రకృతులచే నిర్వహింపఁబడు క్షేత్రములకు "నిదర్శన క్షేత్రము" లని పేరు. ఇట్టివి అమెరి-

౬. నిదర్శన క్షేత్రములు

ఖండములో జిల్లాకు నైదాఱు చొప్పున స్థాపింపఁబడి యున్నవి. కృష్యాదులకుం జేరిన సంస్కరణముల శోధించువారును సృజించువారును దామే యగుటచే, అట్టి క్రియ లెవ్వరి యనుష్ఠానము లేనిది నిరర్థకము లగునో, యట్టి కాఁపులకు నిస్సందేహముగ నిరూపించి చూపుట, యూనివర్సిటీవారు న్యాయముగఁ బూనవలసిన భారమే కదా !

తామే సొంతముగ సాగుబడి చేయించుట లేశ కార్యము గాదు. చేయఁజాలినను ఎన్ని పొలముల నుద్ధరింపఁగల్గుదురు? కొన్నింటి మాత్రము. ఇఁక

౨ ఉపదేశము, విచారణ

నీ పొలముల దర్శించి పరీక్షించి కృతార్థులగుటకై వ్యావసాయికు లెల్లరును దండోపతండములుగ క్షేత్రయాత్ర రాఁగలుగుదురా? ఈ లోపపూర్తికై గ్రామములకుఁ బోయి, యందలి సాహసాధికులతో ప్రస్తావించి, నమ్మకముఁ బుట్టించి, నూతనవిధముల వ్యవసాయము సాఁగించునట్లు ప్రేరించుటకై కళాభిజ్ఞులు నియమింపఁబడియున్నారు. ఉపదేశము చేయుట వీరి మొదటి పని; అనుష్ఠానములు నిర్విఘ్నములుగ జరుగుచున్నవా లేవా యని యెడతెగక విచారించుట రెండవది. వీ రప్పుడప్పుడు పోయి చూచి, పంటల నారసి గురుధర్మము చెల్లించుచుండవలయును.

ప్రత్యక్ష గురు శిష్య సంవాదములు సదా జరుపుట యసాధ్యము. ఇంతకన్న లఘుతరము పోస్టుద్వారా చర్చించుట. ఉత్తరప్రత్యుత్తరమూలమున

౩ ఉత్తర ప్రత్యుత్తరములు

కళాదక్షతను బెనుచు నంగ మొకటి నియమింపఁబడియున్నది.

ఒక్క కృషివిషయమై చేయఁబడు దోహదము లిన్ని! ప్రజాసేవనమే కదా ప్రభుత్వముయొక్క ముఖ్య కర్మము; ధర్మము !

కృషికై యెన్నివిధముల సాయ మొనర్తురో, యన్ని విధములఁ బరివర్తనకళలకును సాహాయ్య మొనర్తురు. జిల్లాలు, తాలూకాలు, మునిసిపాలి

ఇతర కళలు

టీలు, యూనియనులు, మొదలగు పరిమిత స్వాతంత్ర్యముగల రాజ్యభాగములు ధనాఢ్యములు కావు గాన, వానిచేఁ జేయఁబడు పరిపాలనకార్యమున విశేష ప్రావీణ్యముం దాల్చినవారికిఁ దగు సంబళముల నిచ్చి యుద్యోగముల నిలుపుకొననేరవు. వీని సాహాయ్యార్థమై యూనివర్సిటీలు, ఆకార్యమున నిపుణులైన వారిని దమ యొద్ద నుంచుకొని వానికి నెరవలి యిచ్చును! మునిసిపాలిటీ సహాయకాంగ మొఁకడు "విస్కాన్సిన్" సర్వకళాశాలయందుఁ గలదు. ప్రతి మనుజుని వేర్వేఱుగఁ బిలిచి బోధించి చక్కఁబెట్టుటకు బ్రహ్మకైన నలవికాదు. మనుష్యులను సంఘములుగాఁ బ్రోగుచేసినచో కాలధనవ్యయము, శ్రమాధిక్యమును తగ్గించుకొనియు, ఒకనికి మేలు చేయునంతలో అంతమేలు నూర్గురికిఁ బట్టింపఁగల్గుదుము. జనులై కలయిక లేకయుండు గ్రామ్యులలో సంఘీభావము, సంఘముల నుప్పతిల్లఁ జేయుటకునై, సంఘీకరణాంగమొండు ఈ యూనివర్సిటీవారు పోషించెదరు. కూలినాలి చేసి బ్రతుకు కర్మణ్యులకునై, రాత్రిపూటల $7\frac{1}{2}$ గంటలనుండి 10 గంటలవఱకు, యూనివర్సిటీలు హైస్కూళ్ళు, ఇంకను దక్కువ పాఠశాలలును, క్లాసులు నడుపుటకు చేయు నేర్పాటులు సర్వవ్యాప్తములు; అనఁగా ఇండియాలో మాత్రము తప్ప. బుద్ధిమాంద్యము, వృద్ధిమాంద్యము లేని దేశములలో విద్యాశాలయన్న తనకడప దాఁటివచ్చు విద్యార్థులను మాత్రమ విచారించుకొను శాల గాదు; కడపబయటివారిని గూడ కడు నపేక్షతో నరసి కడుపారఁ బెట్టెడు కన్నతల్లి!

కావ్యములు, నాటకములు, చరిత్రము, తత్త్వశాస్త్రము, ప్రాచీనభాషలు, మొదలగు జీవనాధారములతో ప్రత్యక్షసంబంధము లేని విద్యలే

ఆధునిక శిక్షా కర్తవ్యము

గౌరవార్హము లనియు, ప్రపంచ వాసన లేనివగుట మనుష్యసేవ్యము లనియుఁ, బౌరాణికకళాశాలలు వానినే యుపాసించినవి. నిష్ప్రయోజనతంబట్టి ప్రముఖత నిర్ణయించినవి కాఁబోలు! ఆధునికముల దృష్టియుఁ బథమును వేఱు. పరస్పరవైరము, ఆర్థికస్పర్ధ, జాతివైషమ్యము, పరాక్రమబుద్ధియుఁ బ్రబలిన కాలములలో ఆధ్యాత్మికముల ధ్యానించుచుండిన

ప్రాణములు దక్కవు; ప్రాణములు పోయిన పిమ్మట ఆ ఆధ్యాత్మికములకును నిలువఁజోటుండదు. శాస్త్రవిద్యలు అందఱకు సాధ్యములు గావు; మఱి విశేషప్రజ్ఞావంతులకు మాత్రమే. కాయకష్టముచే నెఱవేఱఁగల కర్మలు సర్వజనసాధ్యములు; అనఁగా అంగవైకల్యము లేని యెడల యూనివర్సిటీ పఠనీయములలో కళలకును స్థానముండవలయు. ప్రధానములు చేయఁబడినను దోషము లేదు. ఎట్లును, శాస్త్రములు, కళలు, కృషి, యి వన్నియు మిశ్రములుగా లేని ప్రాఁత తరహా కళాశాలలు కాలవిరుద్ధములు; విపరీతములు. మిశ్రవిద్యాశాలలే గరిష్ఠములనియు కర్తవ్యము లనియు నిప్పటి విద్యాదాయకమార్గనిర్మాణకర్మఠుల దృఢాభిప్రాయము.

విద్యావ్యాపన కార్యమునకు మాతృభాషా ప్రయోగము ప్రధానము. అభ్యంతరవిద్యలందు కళలకు

మాతృభాష

ముఖ్యస్థాన ముండవలె నంటిమేని, కళలు వ్యవహారములకుం జేరిన వగుట, నవియు వ్యావహారికభాష యగు మాతృభాష మూలమ్మున నేర్పఁబడినఁ గాని యుపయోగకరములు కానేరవు. ప్రకృతము మన విద్య లన్నియు గొడ్డుపోయియుండుటకుఁ గారణ మే మనఁగా, కాలేజీలోని భాష భావములకును, ఇంటిలోని భాష భావములకును క్షాత్రేత్తునకుఁ బలె సంధి లేమి. పరదేశ భాష వ్యావహారిక మేనాఁటికైన నౌ ననుట పిచ్చితలంపు; తలవంపునకుఁ గారకము.

ఇట్లనుటచే నింగ్లీషును దేశమునుండి వెడలఁ గొట్టవలయు ననుట నా యాశయము గాదు. ఇంగ్లీషు

ఇంగ్లీషు

లేకున్న దేశమే యుండదు! వివిధభాష లుండు భరతఖండములో ఐకమత్యార్థమై సామాన్యభాష యుండితీరవలయును. పాశ్చాత్యభాష యగు నింగ్లీషు ఇందునకు నెత్తిన భాష. మఱియు నాగరకాగ్రేసరదేశములలో జరుగు వర్తమానముల నరయుటకు ననుకూలించిన సాధనము. ఇంగ్లీషు పోయినఁ గన్నులు పోయినవార మగుదుము; మాతృభాష పోయిన చేతులు లేనివార మగుదుము. రెండు నుండవలయు. ఇంగ్లీషు ముఖ్యోపభాషగా నుండిన మేలు.

సర్వకళాశాలలఁ గూర్చిన విమర్శనలఁ దెలిసిన వార మౌట, నిఁక నాంధ్రులకు ప్రత్యేకకళాశాల

యావశ్యకమా యను ప్రశ్నను గైకొందము.

ఆంధ్రసర్వ కళాశాల

యూనివర్సిటీ లేల? ఉద్యోగస్థులను దయారు చేయుటకా? ప్రజలను ముందునకుఁ దెచ్చుటకా? దీని కేమి యుత్తరమో దాని ననుసరించి తక్కిన యుత్తరము లేర్పడును. ప్రజాప్రయోజనార్థ మన్నయెడల నాధునికరీతి గల యూనివర్సిటీ కావలయును. ఇది యాంధ్రనాయకులకు సమ్మతమా? "ప్రాచీనవిధము గల యూనివర్సిటీ సాధ్యము, తదితర మసాధ్య" మని యందురేని, ఆ 'సాధ్యము' అభిలషింపఁదగినది కాదు; వరముగ నిచ్చినను వల దని నా యభిప్రాయము. ఆధునిక విద్యావిధాన పరిశీలజ్ఞులయు నభిప్రాయ మిట్టిది. ప్రత్యేకప్రాచీనాచారసర్వకళాశాలాస్థాపనచే, ఇప్పటి స్థితిలో నుండు లోపములు నివారింపఁబడవు. క్రొత్త నష్టములు వచ్చును. రాజధానిలోని విద్యార్థులు మద్రాసులో గుమిగూడుటచే దేశీయైక్యము వర్ధమాన మయ్యెడిని. చూపు విస్తార మగుడు బుద్ధియు హృదయమును విస్తరించును. ప్రాఁత తరహా చిన్న యూనివర్సిటీ యొండు మన మెడకు వ్రేలవేసి రేని, యూరోపియ నుపాధ్యాయుల సంఖ్య హెచ్చును; ఇఁకముందు మాతృభాషా విషయికదోహదములకుఁ బ్రయత్నించితిమేని, వారి సంఖ్య యనుల్లంఘ్యమైన విఘ్నకారక మగుట తప్పదు. నవీనరీతి సర్వకళాశాల లభ్య మయ్యెనేని దానికన్న మించిన భాగ్యము లేదు. ఇట్టిదానికి సరాసరికి సెలవును తక్కువ. ఔను గాని, సర్వకళాశాలల ననుసరించి యుపవిద్యాశాల లుండవలయును గదా! ఆమూలాగ్రముగ విద్యాశాలల నవరించుట సాధ్య మగునా? అగును. ఇట్లైన మనకు ప్రత్యేక విద్యాధికారిని విద్యాదాయక ప్రకృతిని నిర్మింపవలయును గదా! అవును. విద్యావిషయమున నాంధ్రమండలము ప్రత్యేకింపఁబడవలయు నన్న, ఆంధ్రమండలము రాజధానులలో రాజధానిగఁ బరిణమించినఁ గాని యగునా? సర్వకళాశాలోద్యమమును, ఆంధ్రమండలో

ద్యమమును, ఒండొంటితోఁ బెనగొనియున్న వనితోఁచెడిని; పరస్పరావలంబనము గలయవి. మద్రాసుతోఁ గలసియున్నంతకాలము విద్యాసంస్కారము అఘటమాన మని నా నమ్మిక. దేశశ్రేయస్కర మగు శిష్టసంస్కరణమునకు ప్రత్యేకాంధ్రమండలనిర్మాణము అనివార్యకారణము గాకున్నను పరమసాహాయ్యకారి.

ఐరోపీయనుల యభిమతము

ఇప్పు డుండు కళాశాలలే చాలు ననియు, నింక నెక్కువ యాసించుట తగ దనియుఁ గొందఱు ఐరోపీయనులాక్షేపించెదరు. వీరి శత్రుత్వము తెలిసియే యున్నది; దానిని గూర్చిన చింత యేల ? సహజ నిరోధకములలో నొకటి యని, తప్పించుకొనియో తొలఁగఁద్రోసియో, మన దారిన మనము పోవుచుండవలయు. ఈ యైరోపీయనులు, ఇప్పుడు మనకు దక్కియుండు 'పాత్రికాపరక' విద్యాభోజనమే యెక్కువనియు, చెడ్డ యజీర్ణకారి యనియు, దీనిని గూడ నియ్యకుండిన నెంతో మే లనియు లోలోన కఠిన మోహనలఁ జేయుదురేమో! "గవర్నరు జనరలు మొదలగు పరమోన్నతపదవుల నుండువారు ఉదారచిత్తతమై యూనివర్సిటీ విద్య ప్రసరింపఁజేయఁ బ్రయత్నించినను, వా రాదేశించు నీతుల నెవరు కొనసాగింపవలయునో యా యుద్యోగుల యౌదాసీన్యము కతన, ఆ గొప్ప వారి కోరికలు సఫలములు గాకున్నవి" అని, మద్రాసు హైకోర్టు న్యాయాధిపతిమండలికి భూషణప్రాయులైన 'అబ్దుల్ రహీము' గారు తెగఁగోసిన ట్లిటీవలఁ బలికియున్నారు. 'ఎక్కువ యూనివర్సిటీల స్థాపించుట ముఖ్యకర్తవ్య' మని హార్డింజి ప్రభువుగారు మొగమోడక చెప్పి ఇండియా జనులకు హృదయామోద మొనర్చిరి. వారి పలుకు పండగుఁగాక ! ఒకవేళ నెక్కువ యూనివర్సిటీలను విధిలేక స్థాపింపవలసినవా రయ్యు, ప్రతియొక్కటిని "ఆక్సుఫర్డు" "కేంబ్రిడ్జి" లోనివానివలె ధనాధికులకు మాత్రము ప్రవేశింప సాధ్యములైనవానిఁ గా నొనర్చి, శాలల సంఖ్య హెచ్చినను బాలుర సంఖ్య హెచ్చకుండునట్లు, ఈ చిల్లరదేవతలు, "విద్యను సామాన్యము చేయఁగూడదు; అసమానగాంభీర్యముగా నొనర్పవలయును" ఇత్యాది నెపముల నేర్పుతోఁ బన్ని, కుయుక్తిఁ జేసి, హార్డింజిగారి మాట నిల్పినను, అభిమతార్థమును వ్యర్థముఁ జేతురేమో, జాగ్రత్త! వలలోఁ బడఁబోయెదరు సుఁడీ !!

జన సంఖ్య; సర్వకళాశాలలసంఖ్య

ఆంధ్రజనబాహుళ్యముం బట్టి చూచినచో, ఆధునికరాజ్యసంప్రదాయముల ప్రకారము, తెనుఁగు దేశమున నొక్కటే కాదు, పది కళాశాలలున్నను అతిశయదోషంబు ప్రాపింపదు. 'కనడా' యను బ్రిటిష్ మహారాజ్యచక్రమునకుం జేరిన దేశము మొన్నఁ బుట్టినది; వైశాల్యమున భరతఖండమునకన్న నెక్కువ; జనసంఖ్య యత్యల్పము; రమారమి ముక్కాలుకోటియె; ఆ వైశాల్యములో వీరు దూరదూరమున మిక్కిలి పలుచగ వెదఁజల్లఁబడినట్లున్నారు; జనబహుళపట్టణములు గొన్ని యున్నవి; కాని జనబహుళజనపదములు (జల్లాలు, తాలూకాలు) మందునకైన లేవు; పట్టణముల వదలి పది మైళ్ళు పోయినను జాలును, మన పురాణముల ప్రకారము కలికాలములో సత్యసంధు లెంత యరుదో, మనుష్యులే యచ్చట నంత యరుదు! అట్టి వివిక్తరాష్ట్రంబున నుండు సర్వకళాశాల లెన్ని యనుకొంటిరి ! సుమారు ఇరువది! ముక్కాలుకోటి జనమునకు ఇరువది కళాశాలలు! ముప్పదిమూఁడు కోట్ల భారతీయుల విద్యాతమోనివారణార్థమై జ్ఞానపుష్పవర్ష ముగురియించు నిక్కడి సర్వకళాశాలల సంఖ్య ఐదు! వారికి నౌషధప్రాయమైన సర్వకళాశాలాగుణసంఖ్యాభివృద్ధి మన కేల విషప్రాయ మగునో? ఈ విచిత్రరహస్యమును మనల నాక్షేపించు నైరోపీయనులు గురూపదేశముఁ జేసి వెల్లడిపఱుతురా? ఈ క్రింది పటమున పరిమితధనోపేతము లగు కనడా, ఆస్ట్రేలియా లను క్రొత్త బ్రిటీషు రాజ్యములను గూర్చిన యంకె లున్నవి. యథాక్రమముగాఁ జూచిన మన కెన్ని యూనివర్సిటీ లుండవలయునో వీనిచే విశద మగును:—

కనడా

| | మండలములు | జనసంఖ్య | సర్వకళాశాలా సంఖ్య | విద్యార్థి సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య |
|---|---|---|---|---|---|
| 1 | న్యూబ్రన్స్విక్కు | 351,889 | 2 | | |
| 2 | నోవస్కోషియా | 492,338 | 4 | | |
| 3 | క్విబెక్కు | 2,003,232 | 4 | | |
| 4 | ఆంటేరియో | 2,523,274 | 4 | | |
| 5 | మానిటోబా | 455,614 | 1 | 850 | 16 |
| 6 | సేస్కట్చివాను | 492,432 | 1 | 500 | 18 |
| 7 | ఆల్బెర్టా | 374,863 | రాజ్యస్థాపితము 1, ప్రజా ,, 1 | 488 | 11 |
| 8 | బ్రిటిష్కొలంబియా | 398,480 | 1 (ఇంకను ప్రారంభద స్థాపితముగాలేదు) | | |

ఆస్ట్రేలియా

| | మండలములు | జనసంఖ్య | సర్వకళాశాలా సంఖ్య | విద్యార్థిసంఖ్య | ఉపాధ్యాయుల సంఖ్య |
|---|---|---|---|---|---|
| 1 | న్యూసౌతువేల్సు | 1,646,734 | 1 | 1,407 | 114 |
| 2 | విక్టోరియా | 1,315,551 | 1 | 1,129 | 79 |
| 3 | క్వీన్స్లాండ్ | 605,813 | 1 | 83 | 10 |
| 4 | సౌతుఆస్ట్రేలియా | 408,558 | 1 | 730 | 38 |
| 5 | వెస్టరణ్ఆస్ట్రేలియా | 282,114 | 1 | 200 | 12 |
| 6 | టాస్మానియా | 191,291 | 1 | 147 | 8 |

'కాల్గెరీ' యను కనడాయందలి చిన్న పట్టణము, ఒక్కయూనివర్సిటీ చాల దని యింకొకదానిని స్థాపింప మొదలిడినది. "అయ్యో! ముక్కాలు కోటి మంది యుండు దేశములో నిన్ని మహాశాల లున్నవే! ఇంకెట్లబ్బా! ప్రళయము తేవా మావా?" యని గుండెలు చీల్చుకొను మహాత్ములు పశ్చిమదిక్కున దొరకరు. "నూతనసర్వకళాశాలలను నిలిపితిమేని, తగినంత గొప్ప సంఖ్య విద్యార్థులు వత్తురా?" యని కొందఱాక్షేపింతురు. దీనికి సమాధాన మేమి? "మీరిచ్చు విద్యలను బట్టియు, బోధకపద్ధతులను బట్టియు నుండు" ననుట. సార్థకవిద్యలను సులభగ్రాహ్యము లగు విధమ్మున నేర్పుమరయేని, బాలికలు, బాలకులును తండోపతండములుగ వచ్చి ముట్టడింతురు. ఇప్పటి రీతిని, హృదయశూన్యుల, మనశ్శూన్యుల, కార్యశూన్యుల నొనరించు పద్ధతుల సింహాసనస్థములఁ జేసితి రేని ఎక్కువమంది రారు; వచ్చినను బనికిరారు. "టొరాంటో" యను కనడాలోని యొక్క యూనివర్సిటీకి మాత్రము చేరిన విద్యార్థుల సంఖ్య నాలుగువేలు! మనలో నిప్పటికే యధికసంఖ్యలు మద్రాసును ముట్టడించుచున్నా రని యెంచువారికి వేఱు ఖండన మేల? ముక్కాలుకోటి జన ముండు కనడాయందు సర్వ కళాశాలలకుం జేరినవారి మొత్తము సుమారు పదునొకండువేలు!

ఈ విషయ విచారణము సుగమము గావలయు నన్ని విద్యలలోని జాతులఁగూర్చి యించుక చర్చించుట యావశ్యకము. ప్రథమభేదము శాస్త్రము లని, కళ లని. శాస్త్రములు ద్వివిధములు: మానుషములు, ప్రాకృతములు. మానుషములు: తర్కము, తత్త్వము, చరిత్రము, భాష, సంఘశాస్త్రము, మనుష్యశాస్త్రము, నీతి (రాజ్యపరిపాలనము, రాజ్యనిర్మాణము), అర్థశాస్త్రము మొదలగునవి. ప్రాకృతములు: ప్రకృతి, రసాయన, జీవ, వృక్ష, భూగర్భ, భూగోళ, ఖగోళ శాస్త్రాదులు — ప్రకృతిని పరిశోధించి తద్వ్యాప్తిన్యాయముల నెఱుఁగఁజూచునవి. మొదటియవి కళలయందు నుపయోగింపఁబడఁజాలవు గావున 'అప్రయోజ్యములు' అని పేరు దాల్చినవి. ఈ రెండు తరగతులును శాస్త్రములు. వీని యుద్దేశము జ్ఞానవైశద్య వికాసములే తప్ప, వ్యాపారపారీణత, కళానైపుణి మొదలగు కార్యసంబంధశూరత్వము గాదు. ఐనను ప్రకృతి శాస్త్రములు కార్యప్రయోజ్యములు. మానుషములకు అలంకార విద్య లనియు, నాణెపు విద్య లనియు పాశ్చాత్యులలో చాలకాలమునుండి వచ్చిన పేర్లు; నాగరకరీతిని పెంచునవి గాన. కళాప్రయోగసంబంధము గలవిగా చర్చింపఁబడని ప్రకృతి శాస్త్రములకు శుద్ధ శాస్త్రము లని పాశ్చాత్త్యనామకరణము. శుద్ధము లనఁగా వట్టి వని యర్థము; కళలయందు ప్రయుక్తములు కాని భంగి;

అప్రయుక్తములై యున్నట్లు; అనుట. నిర్మలము, పుణ్యము, శుభ్రము మొదలగు నర్థములిటఁ బనికిరావు. ఈ అప్రయుక్తప్రకృతిశాస్త్రముల సైతము నాణ్యపు విద్యలలో గ్రహించుటయుఁ గలదు. ఏలన, కళాప్రయుక్తములు గావేని యవియు జీవయాత్రకుఁ బనికిరావు; అనఁగా గుమాస్తా పని మొదలగు గవర్నమెంటు వారియొక్కయు ప్రాఁతబల్లయొక్కయు సేవనము దప్ప స్వతంత్రమార్గముల ననుట. మానుషములు శుద్ధముగ నప్రయోజ్యములు; అనఁగా కలెక్టరు కచ్చేరీలమీఁదఁ దప్ప వేఱెద్దానియందును బ్రయోగింపఁగానివి. ప్రకృతిశాస్త్రములు, కళాప్రయుక్తములుగ నైనను తత్సంబంధము లేని విధమున నైనను పఠింపఁబడవచ్చును.

కళలు

ప్రకృతి శాస్త్ర శోధనముచేఁ గనుఁగొనఁబడిన న్యాయములను ప్రకృతిమీఁదనే ప్రయోగించి మనుష్యులకు నెక్కువ ప్రయోజనకారిగా చేయునది కళ. ప్రకృతిశక్తులను యంత్రాదుల ద్వారా బంధింపవలయును. కళలలో రెండు విషయము లున్నవి. (౧) ప్రకృతిశక్తులయు న్యాయములయు జ్ఞానము (౨) వీనిం బ్రయోగించుటకై చేయవలసిన నిర్మాణము, పరిశ్రమము. ఈ ప్రయోగముల వివరించు శాస్త్రములకు 'ప్రయుక్తశాస్త్రము' లని పేరు. అనఁగా కళాప్రయుక్త ప్రకృతిశాస్త్రము లని నిర్వచనము. ఇటను న్యాయవిచారణపై దృష్టి పోవును గాని, యంతకన్న నెక్కువగ దాని నేరీతిని ప్రయోజనార్థము ప్రయోగింపవలయు ననుటపైఁ బోవును; అనఁగా శాస్త్రములు కళాసంబంధములుగా చర్చింపఁబడును. ప్రయుక్తశాస్త్రములకుఁ జేరునవి— జీవయాత్రకుఁ గావలసిన సమస్తకార్యములును సిద్ధులును! (౧) ఇంజనీరింగు. (ఇది సాధారణముగ చతుర్విధంబు: రోడ్లు మొదలగునవి, యంత్రములు, విద్యుచ్ఛక్తి, గనులు, వీనికిం జేరిన నిర్మాణములు. ఈ నాల్గింటిని చతుర్విధ వాస్తువు లని మొత్తముగ సూచింపనగు.) (౨) రసాయనశాస్త్రప్రయోగములు : రంగులు, చర్మములఁ దయారుచేయుట, సబ్బులు, ఇత్యాదులు లెక్కలేనివి. (3) వ్యవసాయము. (౪) వైద్యము. (౫) గృహాసంబంధికళలు : వండుట, భోజ్యవస్తుగుణములు, ఆరోగ్యము మొదలగునవి. కాలవైరుధ్యముఁ జెందని యూనివర్సిటీలలో ప్రయుక్త శాస్త్రములు పట్టాభిషిక్తములై యున్నవి. కాలవిపరీతములలో మానుషములు దట్టములు. ఇంతకన్న విపులముగ నీ విషయములఁ జర్చింపఁగాదు. వేయి సిద్ధాంతము లైనను ఒక్క వృత్తాంతముతో సరిపోలవు. కాన నివిగో! వృత్తాంతములు.

ఆధునిక సర్వకళాశాలా ప్రకృత్యంగ వృత్తాంతములు

పాశ్చాత్త్య సర్వకళాశాలలలో తత్తద్వ్యాపారములు గజిబిజి లేక నడచుటకై, ప్రత్యేకాంగముల నేర్పఱిచి, వానియందలి యుపాధ్యాయమండలికి నధ్యక్షులను వేర్వేఱ నియమించియున్నారు. ఈ యంగములఁ బట్టి చూచిననే సర్వకళాశాలల యపార వ్యాపారముల వృత్తము స్ఫురించును. *

బర్మింగ్‌హాము:— (అ) డిగ్రీ లిచ్చు ప్రకృతులు (1 నాణ్యపు శాస్త్రములు (భాషాదులు) (2) ప్రకృతిశాస్త్రములు (3 వైద్యము (4) వాణిజ్యము, శిక్ష (విద్యాబోధకకళ), వ్యవసాయము ఇత్యాదికళలును, వ్యాపనవ్యాపారమును అనుగ్రహింపఁబడియున్నవి. ప్రయుక్తశాస్త్రమునకుఁ జేరిన కళలు— గనులు, లోహములు ఇంజనీరింగు (విద్యుదాదులు). సంఘసంస్కారము నొక విద్య!

(ఆ) విద్యావ్యాపనవిషయములు:—ప్రకృతిశాస్త్రము, రసాయనశాస్త్రము, జంతు, వృక్ష శాస్త్రములు, గనులు, లోహములు మొదలైన కళలు, సంగీతము, గృహనిర్మాణము, ఇత్యాదులు.

కేంబ్రిడ్జి:—(అ) డిగ్రీపాఠములు:—మనుష్యశాస్త్రము, భాషలు, అర్థశాస్త్రము, చరిత్రము, గణితము, తత్త్వము, ప్రకృతిశాస్త్రములు, యంత్రశాస్త్రములు, న్యాయము, ప్రాచ్యభాషలు.

(ఆ)డిప్లోమా ఇత్యాది డిగ్రీలకన్న తక్కువ బిరుదముల పాఠములు:—పైఁజెప్పినవియు, వ్యవసాయము, ఆరోగ్యము, శిక్ష, మొదలగునవి. డిగ్రీలలోఁబలె అంతయెక్కువ పరిశ్రమ మిందనావశ్యకము.

(ఇ) విద్యావ్యాపనము:— ఉపాధ్యాయుల సంఖ్య 25; స్కూళ్లను స్థాపించిన స్థలముల సంఖ్య 60; ప్రసంగముల వినుటకు వచ్చినవారి సంఖ్య 9,630; ప్రసంగానంతరము ఒకగంట నడపఁబడు క్లాసులలో క్రమముగఁ జేరినవారి సంఖ్య 3,402.

---

* ఇందలి విషయములు, అంకెలు మొదలగునవి తెలుచుగ 1912-13-వ సంవత్సరపు వృత్తాంతము లాధారములుగఁ గలయవి.

లీడ్సు:—(అ)డిగ్రీప్రకృతులు:—(1) 'మానవ' శాస్త్రములు (అర్థశాస్త్రము, వాణిజ్యము, న్యాయము, శిక్షయుఁ గలసి); (2) వైద్యము; (3) ప్రకృతిశాస్త్రములు; (4) ప్రయుక్తశాస్త్రములు (కళలు)—ఇందుఁ జేరినవి వ్యవసాయము, లోహములు, నలుదెఱంగుల ఇంజనీరింగు మొదలగునవి; పూర్వనివేదితములు.

(ఆ) డిప్లోమాప్రకృతులు:— (1) ఆరోగ్యశాస్త్రము. (2) పండ్ల (నోటిలోనివి) శాస్త్రము.

(ఇ) విద్యావ్యాపనము:—పైనివి. ఒక్క వ్యవసాయమునకు మాత్రము:— బోధకుల సంఖ్య: 9; స్కూళ్ళు: 10; వ్యవసాయ ప్రసంగములు: 370; అవి యీయఁబడిన స్థలములు: 70.

మెక్‌గిల్, కనడా:—(అ)డిగ్రీప్రకృతులు:—(1)నాణ్యపుశాస్త్రములు. (2) న్యాయము. (3) వైద్యము. (4) ప్రయుక్తశాస్త్రములు. శుద్ధప్రకృతిశాస్త్రములు మొదటిదానియం దిమిడియున్నవి. (5) వ్యవసాయము.

(ఆ) డిప్లోమాప్రకృతులు: (1) వాణిజ్యము. (2) గార్హికకళలు. (3) శిక్ష. (4) సంగీతము. (5) రణవిద్య.

(ఇ) ప్రయుక్తశాస్త్రాంగములు:—గృహనిర్మాణము, రసాయనశాస్త్రప్రయోగములు, లోహములు, రైల్వేయానములు, ఆరు విధముల ఇంజనీరింగు (రసాయనము, లోహములు గలిపి), ఆరోగ్యము, దంతచికిత్స, వ్యవసాయగార్హికకళల స్వల్పకాలపాఠములు, మొదలగునవి.

(ఈ) విద్యావ్యాపనము:—అమెరికాఖండములో నీపని ప్రాణసమానముగ నెన్నఁబడుచున్నది. విశేషించి చెప్పనేల ?

మాంచెస్టరు:—(అ) డిగ్రీప్రకృతి: (1) అప్రయోజ్య విద్యలు. (2) ప్రకృతిశాస్త్రములు. (3) మతము. (4) న్యాయము. (5) వైద్యము. (6) సంగీతము. (7) ప్రయుక్తశాస్త్రములు. (8) వాణిజ్యము.

(ఆ) డిప్లోమాప్రకృతి: (1) దంతచికిత్స. (2) శిక్ష. (3) ఆరోగ్యము. (4) శ్రీమఘులు సందులు తయారుచేయుట. (5) ప్రయుక్తశాస్త్రములకుఁ జేరిన యేడు కళలు. (6) సంఘసంస్కారవిద్య.

(ఇ) ప్రయుక్తశాస్త్రములు:—ఇంజనీరింగు (అన్ని వర్గములు), రసాయనశాస్త్రప్రయోగములు (రంగులు పట్టించుట మొదలగునవి), ఆవేశన (ఫ్యాక్టొరీల) పద్ధతులు, ఆరోగ్యము, రైల్వే యేర్పాటులు.

(ఈ) విద్యావ్యాపనప్రకృతి.

మానిటోబా (బాలశాల) కనడా:— (అ) డిగ్రీప్రకృతి:—(1) అలంకారవిద్యలు. (2) ప్రకృతిశాస్త్రములు. (3) న్యాయము. (4) వైద్యము. (5) ఇంజనీరింగు. (6) వ్యవసాయము (ప్రారంభ దశలో నున్నది).

(ఆ) డిప్లోమాప్రకృతి:—వాణిజ్యము.

(ఇ) వ్యాపనప్రకృతి.

ఆక్సుఫర్డు:—(అ)డిగ్రీప్రకృతి:—(1)నాణ్యపువిద్యలు. (2) ప్రకృతిశాస్త్రములు. (3) మతము. (4) న్యాయము. (5) వైద్యము. (సంగీతము, శిక్ష, మొదటిదానియందును, ఆరణ్యకము ప్రకృతిశాస్త్రమునందును జేర్పఁబడియున్నవి.)

(ఆ) డిప్లోమాప్రకృతి:—పైఁజెప్పినవానిలోని భాగములు. (మనుష్యశాస్త్రము, అర్థశాస్త్రము, ఆరోగ్యము, నేత్రవైద్యము, శిక్ష, ఆరణ్యకము, ఇంజనీరింగు.)

ప్రయుక్తశాస్త్రములు ఇక్కడఁ గాని కేంబ్రిడ్జియందుఁ గాని ప్రముఖములు గావు. ఈ విషయమున నీ యూనివర్సిటీలు కాలానుసారములు గావు, వెనుకఁబడినవి. అయినను మనయంత దూరమునఁ గాదు.

(ఇ) వ్యాపనము:— ప్రారంభింపఁబడిన సంవత్సరము 1878 (కేంబ్రిడ్జికన్న నొకయేఁడు వెనుక). 33 ఏండ్లలో (1911 వఱకు) హాజరు విద్యార్థుల సంఖ్య: 510,000. ఇందు పరీక్షించి యోగ్యతాపత్రముల నిచ్చుటయుఁ గలదు. 1912-వ సంవత్సరపు లెక్క:— స్థలములు: 125; ప్రసంగములు: 1,345; హాజరైన విద్యార్థుల సంఖ్య: 14,130; ఉపాధ్యాయులు: 40.

టొరాంటో, కనడా (ప్రౌఢశాల):—(అ)డిగ్రీప్రకృతి:— (1) నాణెపువిద్యలు (ప్రకృతిశాస్త్రములు గలసి) (2) వైద్యము (3) ప్రయుక్తశాస్త్రములు (ఇంజనీరింగు కలసి) (4) శిక్ష (5) ఆరణ్యకము (6) గార్హికము (7) వ్యవసాయము, పశుచికిత్స. (శాఖాశాలయొం డున్నది. అందు)

(ఆ) ప్రయుక్తశాస్త్రాంగములు ఏడు:— గృహనిర్మాణము; రసాయనశాస్త్రకళలు; ఐదు విధముల ఇంజనీరింగు (రసాయనవాస్తువులతో). ఇతరపాఠములు:—దంతచికిత్స; సంగీతము; ఔషధములఁ దయారుచేయుట.

(ఇ) విద్యావ్యాపనము:— అమెరికా మామూలు మేరకు.

విస్కాన్‌సిన్, అమెరికా:—(అ) డిగ్రీప్రకృతి:— (1) అలంకారవిద్యలు (శుద్ధప్రకృతిశాస్త్రములతోడ). (2) ఇంజనీరింగు. (3) న్యాయము. (4) వ్యవసాయము. (5) వైద్యము. (6) పట్టపరీక్షానంతరవిద్యాకృషి.

(ఆ) విద్యావ్యాపనము.

(ఇ) వేసవికాలపు సెలవులలో నడపఁబడు విద్యాబోధనము. (క్రమవిద్యార్థులకుఁ గాదు; గ్రామపాఠశాలోపాధ్యాయులు మొదలగువారికి నై.)

చికాగో, అమెరికా (అతిప్రౌఢము), అంగములు:— (1) తత్త్వము (మనశ్శాస్త్రము, శిక్ష కలిసి) (2) అర్థశాస్త్రము (3) రాజనీతి (4) చరిత్రము (5) అలంకారకళలు (చిత్తరువులు మొదలైనవి) (6) సంఘశాస్త్రము, మనుష్యశాస్త్రము (7) గార్హికకళలు (8) వివిధమతములఁ బోల్చి పరిశీలించుట (9) సంస్కృతము

హిందూదర్శనములు (10) వివిధభాషలు (11) గణితము (12) ఖగోళశాస్త్రము (13) ప్రకృతి (14) రసాయన (15) భూప్రకృతి (16) భూగోళ (17) జంతు (18) శరీరనిర్మాణ (19) శారీరక (20) వృక్ష (21) వ్యాధికారణ సూక్ష్మజీవ ప్రభృతి శాస్త్రములు (22) దేహకృషి (కుస్తీ, ఈత, మొదలగునవి).

వసిడా, జపాను:—(అ) డిగ్రీప్రకృతి: (1) జపానీయ వాఙ్మయము (2) చతుర్విధమగు ఇంజనీరింగు (3) వాణిజ్యము (హాజరువారి సంఖ్య సుమారు 1000!) (4) శిక్ష (5) ప్రయుక్తశాస్త్రములు, కళలు (6) ప్రకృతిశాస్త్రములు. (ఆధునిక విషయములంగూర్చి జపానుభాషలో వ్రాయించి ఈ యూనివర్సిటీ ప్రచురించిన గొప్ప గ్రంథముల సంఖ్య దాదాపు 200!)

(ఆ) విద్యావ్యాపనము.

టోకియో, జపాను:—(అ) డిగ్రీప్రకృతి (1) న్యాయము (2) వైద్యము (3) ఇంజనీరింగు (4) జపానీయవాఙ్మయము.

పిలిపీన్ దీవులు:—అంగములు: (1) శుద్ధవిద్యలు (ప్రకృతిశాస్త్రములతో) (2) వైద్యము (3) వ్యవసాయము (4) పశుచికిత్స (5) ఇంజనీరింగు (6) న్యాయము (7) ఆరణ్యకము (8) చిత్రకళలు.

ఇట్లు వివిధశాలల వ్యాపారములను అంగములను పరిశీలించుటచే దెలిన విషయము లివ్వి:—

(1) అలంకారవిద్యలకన్న కళాప్రయుక్తశాస్త్రములకు ప్రవేశ మెక్కువ.

(2) శుద్ధ శాస్త్రములును కళలును ఏకశాలయందే నేర్పఁబడును.

(3) శిక్ష (బోధకకళ) పట్టపరీక్షకుం జేరిన పాఠములలో నొకటి.

(4) తమతమ దేశముల స్థితిగతుల గమనించి, వానికిం దగినట్లు కళాశాలావ్యాపారములు నిర్ణయింపఁబడియున్నవి.

(5) వ్యవసాయము అన్నిటను ప్రత్యక్షము.

(6) గార్హికకళలు తఱుచుగఁ జేర్పఁబడియున్నవి. పురుషులకు మాత్రము విద్య నేర్పినయెడల సంఘము, ఒంటికంటితోఁ జూచునదియు, నొంటిచేతఁ జేయునదియు, నొంటికాల నడుచునదియు నై, అంగవైకల్యమును చిత్తశుష్కత్వమును బ్రాపించిన దగును. స్త్రీవిద్యావిషయమైన హిందూదేశక్షోభకు మద్రాసు యూనివర్సిటీ కాదు హేతువు. మఱి యే యూనివర్సిటీయుఁ గాదు. మన దురాచారములే. ఈ లోపమునకు చికిత్సఁ జేయ నన్యుల కసాధ్యము. అట్లనుటచే మనకు సాధ్య మని యనుమానించుటయు నిరాధారము! నా యర్థ మే మనఁగా, అయిన మనవల్లఁ గావలయును, లేనియెడల నేజాడను గాఁజాలదు.

(7) యూనివర్సిటీ విద్యచే స్వతంత్రవ్యాపారశక్తి హెచ్చును. గవర్నమెంటే గతి, దిక్కు, మోక్షము, తల్లి, తండ్రి, గురువు, దైవము నని నమ్మి ప్రభుత్వభాగవతులమై యుండనక్కఱలేదు.

(8) డిగ్రీకే కాక దానికన్నఁ దక్కువ బిరుదములకు నేర్పాటు లున్నవి.

(9) పగలు వృత్తులలోఁ జేరి పరిశ్రమించువారికై సాయాహ్నముల పాఠములు నడపఁబడును.

(10) విద్యావ్యాపనము అన్నిటఁ బ్రసిద్ధము. ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి యను పురాణశాలలును ఈ కార్యము ననుగ్రహించియున్నవి. ఇఁక సనాతనధర్మ మనుట కేమి సందేహము?

ఇంకను అనేకవిషయములఁ జదువరు లెఱుంగకపోరు. ఇఁక నన్యోన్యవిద్యల నభ్యసించు విద్యార్థుల సంఖ్యలఁ బరికింతము:—

పిలిపీన్ దీవులు:—

| | |
|---|---|
| (1) అలంకారవిద్యలు (ప్రకృతిశాస్త్రములతో) | 200 |
| (2) వైద్యము | 73 |
| (3) వ్యవసాయము | 253 |
| (4) పశుచికిత్స | 27 |
| (5) ఇంజనీరింగు (ప్రారంభదశ) | 5 |
| (6) న్యాయవాదిత్వము | 146 |
| మొత్తము | 704 |

నూటికి నేఁబదిమంది కళాప్రయుక్తశాస్త్రపాఠకులు. ప్రకృతిశాస్త్రములఁ జదువువారిని ప్రయోజకులలోఁ జేర్చినచో నలంకారవిద్యావాచకుల సంఖ్య నూటికి ముప్పదికన్న మీఱదు

విస్కాన్‌సిన్:—

| | |
|---|---|
| (1) అలంకారవిద్యలు (శుద్ధప్రకృతి శాస్త్రములతో) | 471 |
| (2) కళాశాస్త్రములు | 678 |

| | |
|---|---|
| (3) వ్యవసాయము | 1,289 |
| (4) వైద్యము | 108 |
| (5) తదితరములు (గార్హికాదులు) | 243 |
| మొత్తము | 2,889 |

శుద్ధప్రకృతి శాస్త్రములను ఆలంకారిక విద్యలను జదువువారు 100-కి 16 గురు మాత్రమే. ప్రకృతి శాస్త్రాధ్యాయులం దీసివేసిన 'మానుష' శాస్త్రపాఠకులు నూటికి నారుగురైన నుండరు.

బర్మింగ్‌హామ:—

| | |
|---|---|
| (1) ఆలంకారికవిద్యలు | 251 |
| (2) ప్రకృతిశాస్త్రములు | 117 |
| (3) ప్రయుక్తశాస్త్రములు | 176 |
| (4) వైద్యము | 92 |
| (5) తదితరకళలు | 177 |
| (6) కొంతకాలము మాత్రము వచ్చువారు | 150 |
| మొత్తము | 949 |

అనగా నూటికి ముప్పది తొమ్మండ్రుగురు మాత్రము పరమపరిశుద్ధజ్ఞానము వడసినవా రనుట.

బ్రిస్టల్, ఇంగ్లాండు (ప్రారంభదశ):—

| | |
|---|---|
| (1) ఆలంకారికవిద్యలు | 40 |
| (2) ప్రకృతిశాస్త్రములు | 76 |
| (3) ప్రయుక్తశాస్త్రములు | 64 |
| (4) వైద్యము | 36 |
| (5) తదితరములు | 44 |
| (7) సాయాహ్నకాలవిద్యార్థులు | 552 |
| మొత్తము | 812 |

నూటికి పదునాల్గురు మాత్రము శుద్ధవిద్యవారు! తక్కినవారు ప్రయోజకవిద్యలవారు.

లీడ్సు:—

| | |
|---|---|
| (1) వైద్యము | 147 |
| (2) ఆలంకారము (ప్రకృతిశాస్త్రములతో) | 893 |
| (3) సాయాహ్నకాల విద్యార్థులు | 208 |
| (4) కొంతకాలము మాత్రము వచ్చువారు | 84 |
| మొత్తము | 1,334 |

ఇందు శుద్ధవిద్యలవారు సుమారు 150 మంది మాత్రము. అనగా నూటికి పదునొకండు మంది.

లివర్పూల్:—

| | |
|---|---|
| (1) డిగ్రీడిప్లోమాలవారు | 849 |
| (2) పట్టపరీక్షానంతరవిద్యార్థులు | 107 |
| (3) కొంతకాలము (డిప్లోమా) వారు | 116 |
| (4) సాయాహ్నకాల విద్యార్థులు | 316 |
| (5) తదితరవిద్యార్థులు | 151 |
| మొత్తము | 1,539 |

శుద్ధవిద్యలవారు సుమారు 200 మంది—అనగా 100-కి, 13 గురు.

మాంచెస్టరు:—

| | |
|---|---|
| (1) డిగ్రీడిప్లోమాలవారు | 1,117 |
| (2) కొంతకాలము వచ్చువారు | 237 |
| (3) సాయాహ్నమువారు | 201 |
| మొత్తము | 1,615 |

ఇందును అలంకార విద్యావినోదుల సంఖ్య మిక్కిలియు నల్పము.

మెక్‌గిల్, కనడా (ప్రౌఢశాల):—

| | |
|---|---|
| (1) అలంకారవిద్యలు(ప్రకృతిశాస్త్రములు కలిసి) | 390 |
| (2) ప్రయుక్తశాస్త్రములు, కళలు | 500 |
| (3) వైద్యము | 300 |
| (4) న్యాయవాదిత్వము | 60 |
| (5) గార్హికము | 67 |
| (6) వ్యవసాయము | 98 |
| (7) శిక్ష (విద్యాబోధనము) | 180 |
| (8) ఖండకాలికులు | 170 |
| మొత్తము | 1,765 |

అలంకార న్యాయవాదిత్వ వర్గములు కలిసి "అప్రయోజకుల" సంఖ్య 100 కి 26

టొరాంటో, కనడా (ప్రౌఢశాల):—

| | |
|---|---|
| (1) అప్రయోజ్యాప్రయుక్తములు | 1,629 |
| (2) ఖండకాలికులు | 284 |
| (3) దంతచికిత్స | 60 |
| (4) పశుచికిత్స | 186 |
| (5) వైద్యము | 593 |
| (6) ప్రయుక్తశాస్త్రములు | 680 |
| (7) శిక్ష | 350 |
| (8) గార్హికము | 104 |
| (9) ఆరణ్యకము | 44 |
| మొత్తము | 3,885 |

అలంకారవిద్యలవారి సంఖ్య నూటికి నలువది రెండు; ప్రకృతిశాస్త్రజ్ఞులం దీసివేసినచో నప్రయో

జ్యములవారి సంఖ్య నూటికి నిరువది యుండిన హెచ్చు.

మద్రాసు యూనివర్సిటీ

ఇకఁ మన మద్రాసు యూనివర్సిటీలోని యుదంతంబులఁ జింతింతము.

(అ) డిగ్రీప్రకృతులు:—(1) అలంకారవిద్యలు (ప్రకృతిశాస్త్రములతోఁ గూడి) (2) న్యాయవాదిత్వము (వ్యాధిత్వము!) (3) వైద్యము (4) ఇంజనీరింగు (రెండు విధములు మాత్రమే).

డిప్లోమా, విద్యావ్యాపనము మొదలగు నూతన ప్రచారము లీ పవిత్రసరస్వతికి సరిపడవు. శిక్ష యున్నది గాని యది పట్టపరీక్షానంతర సేవ్యము. ప్రయుక్తశాస్త్రములు, కళలు, శుష్కజీవితములై యున్నవి.

1914-వ సం. పట్టపరీక్షాపాఠకుల సంఖ్య ప్రకారము.

బి. ఏ. క్రొత్త యేర్పాటు:—

| | | |
|---|---|---|
| (1) ప్రకృతిశాస్త్రములు | | 196 |
| (2) భాష, చరిత్రము, తత్త్వము | | 404 |
| (నిష్కళంకవిద్యలు!) | మొత్తము | 600 |

ఇందులో చారిత్రకుల సంఖ్య మాత్రము 326! ఈశ్వరా!! భాషాద్యప్రయోజ్య విద్యలవారి సంఖ్య: నూటికి 66!! పై 600 గురును కళాసంగము లేని కలెక్టరుకచ్చేరి కాఁపుదలవారనుట మాత్రము మఱవకుఁడు!

బి. ఏ. ప్రాఁతయేర్పాటు:—

| | |
|---|---|
| (1) తత్త్వము, చరిత్రము | 428 |
| (2) ప్రకృతిశాస్త్రములు | 249 |

తాత్త్విక చారిత్రకుల సంఖ్య నూటికి 61; ఇరు విద్యలును అప్రయుక్తములు!

| | |
|---|---|
| (3) న్యాయశాస్త్రము (దేవుఁడే గతి!) | 1,187 |
| (4) శిక్ష (ప్రాఁత, క్రొత్త) | 151 |
| (5) వైద్యము | 269 |
| (6) ఇంజనీరింగు | 57 |

1914-వ సంవత్సరము పట్టపరీక్షకు విజయం చేసిన వారిలో:

అప్రయుక్తవిద్యలు:—

| | | |
|---|---|---|
| (1) భాష, తత్త్వము, చరిత్రము నవలంబించినవారి సంఖ్య | | 832 |
| (2) ప్రకృతిశాస్త్రములు | | 653 |
| 3) న్యాయవాదిత్వము | | 1,187 |
| | మొత్తము | 2,622 |

కళాప్రయుక్త విద్యలు:—

| | | |
|---|---|---|
| (1) శిక్ష | | 151 |
| (2) వైద్యము | | 269 |
| (3) ఇంజనీరింగు | | 57 |
| | మొత్తము | 477 |

1914-వ సంవత్సరము పట్టపరీక్షకు విజయం చేసినవారిలో:— ప్రయుక్తాప్రయుక్త విద్యాపాఠకుల సాదృశ్యము 18 కి, 100 కి నుండునంత! శిక్షను అప్రయుక్తములలోఁ గలిపినచో ప్రయుక్తపాఠకులు 100 కి, 10½ మాత్రమే! శుద్ధముగ ననాదరణీయవిద్యలపాలైన యీయూనివర్సిటీవంటి మఱియొక యనర్థకయూనివర్సిటీని పూతగోదావరీతీరమున స్థాపింపఁజేసి, గవర్నమెంటు సేవను, తన్మూలముగఁ బ్రజలమీఁద నధికారమును జేయ నెంచినవారెంత కృతార్థులైనను, ప్రజల కేమి మేలు? పశ్చిమరాజ్యములు దినదిన ప్రవర్ధమానములుగ నుండుటకును మన రాజ్యము మన రాజ్యమువలెనే అనన్యాయాలంకారమును విధిలేక ధరించి యుండుటకును గల హేతువులలో మన నిష్ప్రయోజక విద్యాదాయిప్రకృతి యొకటి. దేశమునకు మేలుగోరువారు ఈ పౌరాణికి సర్వకళాశాలా ప్రతిబింబముల నాశింపరు. ఆశించిరేని, వారు ప్రజాక్షేమము నరయుచున్నారా, కచ్చేరీల నరయుచున్నారా, యను సందేహము దేశభక్తులకుఁ దట్టకమానదు.

ప్రకృత మిట్టి కళాశాల మన కనావశ్యకము

ఆధునిక విద్యావ్యాపారములు మాతృభాషా మూలమునఁ దప్ప నన్యథా ఘటింపనేరవు. ఆఫీసులు మన నోటఁ బడినచో, దేశము స్వాతంత్ర్యమును మహాభ్యుదయమును వహించు ననువారు లేకపోలేదు; వారి యూహ మంచిది కాదనుటకై సుప్రసిద్ధులగు కొందఱ యభిప్రాయము నివేదించెదను.

మాతృభాష

కవిశేఖరుండును విద్యాబోధన శాస్త్రపారీణుండును అగు సర్ రవీంద్రనాథ ఠాకూరు గారు పలికిన ప్రకారము:

రవీంద్రనాథ ఠాకూరుగారు

"దేశోద్ధరణార్థము విద్య నెల్లెడ వ్యాపింపఁజేయవలయును. సర్వజనులకును విద్య సాధ్యము గావలయు నన్న మాతృభాష

మూలముగ సద్దాని బోధింపవలయును. బుద్ధితక్కువచేతనో డబ్బు తక్కువచేతనో ఇంగ్లీషునందు విశేషపాండిత్యము సంపాదింపఁ జాలనివారి కేల యుత్కృష్టతరవిద్య లగు బి. ఏ., ఎం. ఏ. పఠనీయము లందరానివిగ నుండవలయునో తెలియకున్నాఁడను. మాతృభాషలఁ దగిన పుస్తకములు లే వని కొందఱి వాదము; ఈ కఱవునకు కారణము యూనివర్సిటీలు దేశభాషలకుఁ జేసిన యపకృతి గాని వేఱొండు గాదు. వానికిని ప్రధానస్థానము నిచ్చితేని గ్రంథప్రకటనము తనంతట నుద్ధుర మగును."

అబ్దుర్ రహీము గారు

మద్రాసు హైకోర్టు జడ్జి యగు అబ్దుర్ రహీము గారు సెలవిచ్చిన విధము:

"శ్రీ రవీంద్రనాథ ఠాకూరు గారు మాతృభాషామూలక విద్యాభ్యాసము మంచి దనియు, మహనీయము లగు ప్రకృతి ప్రయుక్తాదిశాస్త్రములు తద్ద్వారా వెల్లడింపఁబడవలయు ననియు నిటీవల వక్కాణించిరి. అటువంటి మహాపురుషుని మాట ననాదరణతోఁ జూడరాదు. ప్రకృతము దేశభాషలను చిల్లర విద్యలకు మాత్రము వాడెదరు. గొప్ప గొప్ప విద్యల నయిత మారీతినే ప్రాముఖ్యమునకుఁ దేనియెడల, ప్రజాబాహుళ్యమున ఉత్కృష్టవిజ్ఞానము వృద్ధిఁజెందదు."

సర్ హెరోల్డు స్టూవర్టుగారు

సర్ హెరోల్డు స్టూవర్టు గారు ఈ విషయ మింకను చక్కఁగా ప్రబోధించి రని నా యభిప్రాయము. మద్రాసు యూనివర్సిటీ బిరుదప్రదానోత్సవ కాలమ్మున, నట మూఁగిన విద్యార్థికలోకమ్మును వీక్షించి యుపన్యసించుచు, మాతృభాషామూలమ్మున విద్యాబోధన లేనిది ఆధునిక శాస్త్రవిజ్ఞానము జనసామాన్యమునకు నలవడఁజాల దనియు, ఆక్సుఫర్డు కేంబ్రిడ్జిలంబలె అప్రయోజ్యములు, అప్రయుక్తములు నైన యలంకార శాస్త్రములు మాత్ర ముపాసించుచుండుట కర్తవ్యము గా దనియు, లీడ్సు మాంచెస్టరు మొదలగు నూతనరీతి యూనివర్సిటీలు చూపిన దారిని మనముఁ బోవుట మంచి దనియు, ప్రయుక్తశాస్త్రాభ్యాసంబునఁ గాని దేశమం దభివృద్ధి యడరనేర దనియు వచించిరి. మాతృభాష యొకటి యున్న మాత్రమునఁజాలదు; ఏభాష యెంత మాత్ర మున్నను జాలదు! ప్రకృతిశాస్త్రముల నీనాఁటికి నానాఁటికిఁ దేలు జ్ఞానమును విస్తరింపఁజేయుటకును, జనులలో వ్యాపింపఁజేయుటకును, ప్రయుక్త శాస్త్రములను కళలను బోధించుటకును, ప్రచారమునకుఁ దెచ్చుటకును, నను గ్రహింపఁబడిననే కాని, తదేకధ్యానమునకై తేఁబడి ప్రతిష్ఠింపఁబడినయెడల, మాతృభాష శత్రు వగును. భాష యని కాదు మాతృభాషను గోరుట; ప్రకృతిప్రయుక్తశాస్త్రముల సర్వవ్యాప్తములుగాఁ జేయుటకు విధిలేని సాధన మని.

ఈ ప్రశంస యీవఱలోనే యధిక మయ్యోనేమో! ఏ నిందకైన నోర్చి సర్వకళాశాలలంగూర్చిన యీ కాలపుఁ దత్త్వములను ప్రకటించుట ముఖ్యకర్తవ్యము. "సర్వకళాశాలలు కావలెను, కావలెను" అని యాత్రముతోఁ నాఁకలి కోర్వని విధంబున నఱచు మన నాయకులలో నెందఱకు దాని నిజమైన రూపంబు తెలియును? తుదకు నాసనమైన సోఁకియున్నది? మన దేశమున మనస్సునకు విశ్రాంతి యున్నను నాలుక కున్నట్లు గానము. ఏమియుఁ దెలియనివా రయ్యును "సర్వకళాశాలాస్థాపనమునకై కమిటీ నొం డేర్పఱుపఁబోయెదము. మిమ్ము నొకసభ్యునిఁగా గ్రహించెదము. వచ్చెదరా?" యని గవర్నమెంటువా రడిగిరేని, శంక జంకు దాల్చునంతటి వినయశాలులు మన నాయకులలో నెందఱున్నారు? పిలువకమున్నే ససంభ్రమముగఁ బరువిడి పలువుర నాశ్రయించి పదవి నందుకొంద మనువారి సంఖ్య యెంత? యోజింపుఁడు. అట్లగుట నాబాలగోపాల మెల్లరకును గొంతకుఁ గొంత యైనఁ దెలిసిన, నిఁకముందు ప్రమాదము సంభవింప దను విశ్వాసముమై నీ వ్యాసము వ్రాసినాఁడను. "పండ్లు కావలయునా?"యని యొకఁ డడిగెనేని "మామిడిపండ్లా? బెత్తపు పండ్లా?"యని గుఱుతింపకమున్నే "ఇండు, తీసికొండు"నని ముందున కేగువారు మూఢులా, ప్రౌఢులా? ఎటువంటి యూనివర్సిటీ లభ్యమో యది తెలియకమున్నే యెట్లు వరింపఁగలము? ప్రాఁత పెద్దమ్మ యైనయెడల వలదు. సకలప్రజాభిరామనవ్యకళాశోభిత యైనయెడల సర్వమంగళ సన్నాహములతోఁ దెచ్చి దేశలక్ష్మిగ భావించి గౌరవించెదము.

# జాతీయావబోధము

బాలకవి చామర్తి రాజశేఖరరావు గారు

ఉ. తెలతెలవాఱుచుండె, నరుదెంచెడి మెల్లని పిల్ల వాయువుల్,
కలకలమంచుఁ గూసె విహంగంబులు, కొక్కొరొకో యటంచు మే
ల్కొలుపఁ దలంచి కోళ్లు గుమి కూయిడఁ జొచ్చె నుషస్సు మీఱెఁ దె
మ్మలమటఁ జెందఁబోకు సమయం బిది భారతపుత్రరత్నమా!

ఉ. కాల మతిక్రమించెడిని, గాఢతమోవిసరం బదృశ్యమై
తూలె, సమస్తకార్యములు దూలుసుమీ నిదురించుచున్నఁ, బ్రా
ల్మాలకుమయ్య, యన్యులు విలంబన కోర్వఁగలేక యీ యుషః
కాలమునందె లేచి నిజకార్యపరాయణులైరి చూడవే!

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాతిశయుండవు గాన నీవు, నీ
వుం దగునట్లు దీవనలు గోరు వరంబు లొసంగి పంపఁ జె
ల్వొందెడు వేగుఁజుక్క నిలుచున్నది; రా వని నిశ్చయించి వి
స్పందనము వహించి గగనంబున మెల్లఁగ నిష్క్రమించెడున్.

తే. గగన మను పళ్లెరములోన నిగడియున్న
తారకానీక మను దివ్యపారిజాత
కుసుమజాలంబు సొగసు నిగ్గులు రహింప
నమృతకరుఁ డను దీపంపుటారతిఁ గొని
వృద్ధికాముఁడ వంచు నిర్హేతుకంపుఁ
గరుణ వహియించి, సకలమంగళము లీయఁ
దలఁచియున్నది ప్రకృతికాంతాలలామ;
సమయ మాసన్నమయ్యె, నుషస్సు మీఱె;
క్షణము సహియించి, మరియొక క్షణము వేచి
విసివి వేసారిపోయె. నా కుసుమములును
వాసనలు లేక మెల్లఁగా వాడఁజొచ్చె,
వెలుఁగు హారతి దీపంబు వెలుఁగు మాసె;
మేలుకోవయ్య నిద్దుర చాలునయ్య!
కాలపురుషుని సమ్మోహకౌశలంబు
పెరలఁబీడియు నిన్నింక విడువలేదె!
కాలయాపనమయ్యె, వేగంబు రమ్ము
రా వదేమయ్య నీవు భారతకుమార!

ఉ. ఎన్నఁడు లేచునో తనయుఁ డెన్నఁడు తల్పముఁ బాయునో, సుతుం
డెన్నఁడు కార్యభారము వహించి మహోద్యమ మాచరించి య
త్యున్నతిఁ గాంచునో, యనుచు నొక్కతెఱంగు విషణ్ణచిత్తయై
యున్నది దేశమాత, హృదయోపశమం బొనరింప వేటికిన్?

చ. 'జయ జననీ' యటంచుఁ దొలిజామున మేల్కొని, దివ్యపుష్పసం
చయములు గూర్చి, మాతృపదసన్నిధి నుంచి, యమోఘదీవనల్
గయికొని సర్వకార్యసఫలత్వనితాంతనియుక్తచిత్తులై
జయజయనిస్వనంబులు విజాతు లొనర్చిరి లేచి చూడవే!

తే. ప్రకృతిశోభకు నతులజీవంబు నోసి
జీవరాసుల మేల్కొల్పి సృష్టిలోన
నూతనంబైన యందంబు నూలుకొల్పి
సారతరమైన బంగారు నీరువలనఁ
బైరుపచ్చలఁ దళతళప్రభలు నింపి
కుసుమజాలంబునకుఁ గ్రొత్త మిసిమి యొసఁగి
హృదయమున మాటిమాటికి నుదయమైన
వాంఛలకు నుద్యమోత్సాహబలముఁ బెంచి.
లోకబాంధవుఁ డైన ప్రభాకరుండు
సూర్యభగవానుఁ డట్టి తేజోమయుండు
నిన్నుఁ దిలకించి గాటంపునిదురఁ జూచి
జాలి వహియించి నీమీఁద, సదయుఁ డగుచు
బాలకిరణంబులను మేనిపైనఁ బఱపి
లేపుమన్నాఁడు నీ వింక లేచి రమ్ము.

చ. పసులును నిద్ర లేచినవి పచ్చిక భూముల సంచరించుచున్
మెసవెఁ, బిపీలికాదులును మేల్కొనె, గూండ్లు డాసి యిప్పు డా
కసమునఁ బాఱె నెల్ల విహంగంబులు, కాల మతిక్రమించినన్
మసలెద వేమి తల్పమున మాటికి మాటికి? లేవ నొల్లవే?

చ. వినఁబడవో విహంగముల విశ్రుతనాదము, లాలకింపవో
జనుల సమాకులధ్వనులు, శయ్యపయిన్ బలుమాఱ్లిటుల్ క్షణ
క్షణముఁ బరుండి లేచుటకుఁ గారణ మేమి? స్వకార్యచింత నీ
మనసున లేదొ? భారతకుమార! వెసం దిగి రమ్ము తల్పమున్.

తే. మాతృపూజాసమారంభసహితవేళ
మించె నని యెంచు మదిలోఁ దలంపఁబోకు
మిగులఁ బ్రొద్దయ్యె నని లోన దిగులువడకు
వగవ నేటికిఁ గడచినవాని కిపుడు?
వలదువల దింకఁ గన్నీరు విడువఁబోకు
ఫలము లేదయ్య, ధైర్యంబు వదలకయ్య
జరుపవలసిన కార్య మేమఱకు మయ్య.

మ. లలితామోదలతాంతజాలములు వాడంబోవె? దైన్యోగ్యముల్
కలకాలంబుఁ దిరంబు లౌనె యణుమాత్రంబైన? వృద్ధిక్షయం
బులు కాలానుగుణంబుగాఁ గలుగవే? మోదంబుఁ బోనాడి కే
వలబాష్పాకులలోచనద్వయుఁడవై వాపోవ నీ కేటికిన్?

శా. లేరే వీరులు పూర్వకాలమున? లేరే దైన్యభావంబులన్
బాఱందోలి ప్రపూజ్యమాతృహితసేవాతత్పరత్వంబుతోఁ
బేరుం గాంచినవారు? తచ్చరితముల్ విన్నంత వాటిల్లుఁ గా
ర్యారంభోచితశౌర్యవిక్రమమహోల్లాసైకసంరంభముల్.

PRESIDENT OF THE MOSLEM LEAGUE AND MEMBERS OF THE RECEPTION COMMITTEE



మాస్లింలీగు అధ్యక్షుడును ముఖ్యసభ్యులును.



THE BOMBAY SEVA SADAN VOLUNTEERS COLLECTING SUBSCRIPTIONS

బొంబయి సేవాసంఘమువారి ధనము కూర్చిన స్త్రీలు

BOMBAY HINDU CONFERENCE 1915.



బొంబయి హిందు మహాసభ



HON. MR. ABDUL HUSSAIN ADAMJI PEERBHOY
Chairman of the Reception Committee, Bombay Moslem League 1915

గౌ. అబ్దుల్ హుసేన్ ఆడమ్జీ పీర్‌భాయి
అఖిల భారత మహమ్మదీయ మహాసభాహ్వాన సభాధ్యక్షులు



DR. NILA RATNA SIRCAR, President Theistic Conference 1915

డాక్టరు నీలరత్న సర్కారుగారు. బొంబయి ఆస్తికసభాధ్యక్షుండు

# భాషేతరవిషయబోధ — దేశభాషావశ్యకత

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు, బి. ఏ., బి. ఎల్., ఎల్. టీ.

1. రాజ్యపరిపాలనలో జోక్యము కలుగఁజేసికొనఁ దలఁచువారు, ఆంగ్లేయభాష నేర్చుకొనక తప్పదు.

2. విద్యావిధానములో ఈ భాష నిర్బంధపఠనముగ నిదివఱకే యేర్పాటు చేయఁబడియున్నది.

3. మన దేశములో వివిధరాష్ట్రములయం దుండు విద్యార్థికు లొకచోట సమావేశమై, దేశాభివృద్ధికి కావలసిన విషయములను చర్చింపవలెనన్న, ఈ భాష తప్ప వేఱుగ నొక సామాన్యభాష లేదు.

4. మన రాజ్యాంగతంత్రము మున్ముందు సంయుక్తరాష్ట్రరాజ్యతంత్రముగ మాఱినపుడు, సామ్రాజ్య సంయుక్తశాసన నిర్మాణసభలలో ఆంగ్లేయభాష నుపయోగింపకతప్పదు.

5. మనకు పూర్ణస్వాతంత్ర్యము కలిగినపుడు, మనము విదేశములకు రాయబారులను పంపుచో, ఈ యాంగ్లేయ భాషయే కాక, నాగరికరాజ్యములవారి భాష లన్నియు మనవారు కూడ నేర్చుకొనవలసియుండును.

6. విదేశీయులతో మనము వర్తకవ్యాపారము సదా చేయుచుందుము. ఇనుపదారులు, తంతి, తపాలా, పొగయోడలు, విమానములు, జలాంతర్గాములు మున్నగు సాధనములవలన ప్రపంచములో నుండు దేశములు మునుపటికంటె మిక్కిలి సమీపమునకు వచ్చినట్లు కనఁబడుచున్నవి. మన దేశము పూర్వమువలె ఒంటరిగ నుండక, వాణిజ్య పరిశ్రామిక రాజకీయ సాంఘిక విషయములలో విదేశములతో ప్రతిదినము సంబంధము కలిగించుకొనవలసియుండును గనుక, అనేక క్లిష్టసమస్యలను సాధించుచుండవలసి యుండును. పరదేశీయులతో అన్యోన్యసంఘట్టనము వృద్ధియగుచున్నది కాఁబట్టి యిన్గ్లీషు మొదలగు విదేశభాషలను మనము నేర్చుకొనుచుండవలయును.

7. మన దేశభాషలలో కంటె, పాశ్చాత్యదేశభాషలలో విజ్ఞానము మెండుగా నున్నది; ఆధునికశాస్త్రములు కళలు దినదినప్రవర్ధమానములై తనరారుచున్నవి. అనేకమహాకవులు గ్రంథకర్తలు పాశ్చాత్యదేశములలో బయలుదేఱినారు, బయలుదేఱుచున్నారు, బయలుదేఱఁగలరు. ప్రపంచములో నిత్యము క్రొత్తక్రొత్త విధముగ నుద్భవించుచున్న సాంఘికసమస్యలను గుఱించి అనేక గ్రంథరాజములు వెలువడుచున్నవి. వీని నన్నిటిని మనము తెలిసికొనవలెనన్న, ఆయా భాషలను నేర్చుకొని వీలైనంతవఱకు దేశభాషలలోనికి ఆయా గ్రంథములను తర్జుమా చేయవలెను. పాశ్చాత్యదేశములలో ఒకభాషలో నొక యుద్గ్రంథము వెలువడినయెడల, తక్కినవానిలోనికి భాషాంతరీకరణము చేయుచుందురు గనుక, మన యిన్గ్లీషుభాషలో సామాన్యముగ ప్రపంచములో బయలుదేఱు అన్ని గొప్ప గ్రంథములు నుండు ననియే మనము నమ్మవచ్చును. కాఁబట్టి యిన్గ్లీషు భాష మాత్రము నేర్చుకొన్నను, ఆయాగ్రంథములలో నుండు సంగతులను మనము తెలిసికొనఁగలము. కాని, ఆయా భాషలలో నుండు మాధుర్యము మాత్రము, వానిలో పాండిత్యమును సంపాదించుకొన్నఁ గాని, మనకు బోధపడ నేరదు.

పైన వ్రాసిన విషయములలో ఇంగ్లీషు భాషాభ్యసనము ముఖ్యమనియే నా యభిప్రాయము. కాని దీని నందఱు అభ్యసింపఁజాలరు. జనసామాన్యమునకు వాడుక భాషలోనే సమస్తవిజ్ఞానమును నేర్పవలెను. రాష్ట్రపరిపాలన సాధ్యమైనంతవఱకు దేశభాషలలోనే జరగవలెనన్న, దేశభాషలను బట్టియే రాష్ట్రవిభజనము కావలెను.

ప్రారంభ మధ్యమ పాఠశాలలలోనే గాక, ఉత్తమ పాఠశాలలలో కూడ, దేశభాషలలోనే సమస్తవిద్యలను

కఱుపవలెను. అప్పుడే, అవి మనకు జీర్ణమై ప్రతివిషయములో నూతనకల్పనలకు మనవారిని పురికొల్పును. జర్మని జపాను మొదలగు దేశములలోవలెనే ఒకగంట కాలము మధ్యమ పాఠశాలలలో ఇంగ్లీషుభాష నేర్పినఁ జాలును. ఆ భాషలో ప్రతివాఁడును పండితుఁడు కావలెననియు, మంచి వక్త కావలెననియు ప్రయత్నించుట అనవసరము. కలెక్టరు కచ్చేరీలలోను కోర్టులలోను తక్కిన గవర్నమెంటు డిపార్టుమెంటులలోను మాన్లతు భాష బహుశీఘ్రముగ నేర్చుకొనవచ్చును.

ఇప్పుడు, మన కళాశాలలలో మన దేశభాషలను నిర్బంధపఠనీయభాషలుగా నుంచక, ఇంటర్మీడియేటు పరీక్షలో శైలియందు మాత్రము పరీక్షించుటకు ఏర్పాటు చేయఁబడినది. కాని, విద్యార్థులకు మంచి శైలి యెట్లబ్బును? నీరసములైన ఆధునికగద్యకావ్యములను చదివిన నేమి లాభము? మన బాలురు, సరిగా తమ దేశభాష నభ్యసించి, ఆంధ్రవాఙ్మయమును సంపాదించిననే గాని యింగ్లీషులో నుండు విజ్ఞానమును మనోరంజకముగ తమ దేశీయుల కెట్లు తెలుపఁగలరు? భాగవత భారత రామాయణాది పురాణములును, మనుచరిత్ర వసుచరిత్ర ఆముక్తమాల్యద మొదలగు ప్రబంధములును గట్టిగ పాఠశాలలలో చదివింపని యెడల మనవాండ్రకు ఆయా విషయముల కుచితమైన శైలి యలవడనేరదు. సంస్కృతము కూడ బాగుగ నేర్చినఁ గాని, ఆంధ్రములో గొప్ప గ్రంథకర్తలు కవులు కానేరరని నా యభిప్రాయము. మన పురాణములలోను ప్రబంధములలోను వర్ణనలు ఇప్పటి నవనాగరకులకు తలనొప్పి కలిగింపవచ్చును. ఆధునికాభిప్రాయములు ఊహలు వానిలో నుండకపోవచ్చును. మన దేశభాషలలో షేక్స్పియరు ఇబ్సను మొలీరు షిల్లరు మొదలగు నాటకకర్తలును, స్కాటు డికెన్సు థాకరే హ్యూగో డ్యూమాసు మొదలగు నవలాకర్తలును, టెన్నిసన్ న్యూమన్ రస్కిన్ కార్లైలు గెట్టె మొదలగు గ్రంథకర్తలును లేకపోవచ్చును కాని, యీ మహాగ్రంథకర్తల ననుసరించి మనము గ్రంథములను వ్రాయవలెనన్న, సంస్కృతాంధ్రకావ్యములు బాగుగ చదివినఁ గాని, మంచి శైలి కుదురదు. సామాన్యపు వాడుక భాష చాలదు. ఇప్పటి పేలవమైన వచనకావ్యములు పనికిరావు. విదేశీయగ్రంథములలో నుండు భావములను మన దేశభాషలలోనికి దింపునపుడు, ఆ భావములకు తగిన శైలి వాఙ్మయజ్ఞానము లేనిది అవి యెట్లు రాఁగలవు? విషయములను బట్టి శైలియు మాఱుచుండవలయును. కాఁబట్టి మన భాషాభివృద్ధికి, ఇంగ్లీషు చదువుకొన్న ప్రతి విద్యార్థిచేతను సంస్కృతమును గాని దేశభాషను గాని నిర్బంధముగ చదివింపవలెను. మన విశ్వవిద్యాలయములలో, పట్టపరీక్షవఱకుఁ గూడ సమస్తశాస్త్రములను దేశభాషలలో నేర్పవలెను.

జనసామాన్యములో ఆంగ్లేయభాష యెన్ని వందల సంవత్సరములకైనను వాడుక భాష కానేరదు గనుకను, మన పూర్వచరిత్రలు మన భావములు సాంప్రదాయములు మన విజ్ఞానము — ఇది యది యన నేల — మన జాతీయజీవిత మంతయు మన దేశభాషలలోనే యిమిడియుండుటవల్లను, ప్రతి దేశాభిమానియు తన దేశభాషను త్యజింపక సాధ్యమైనంతవఱకు లోకములో నుండు విజ్ఞానసర్వస్వము నంతటిని వానిలోనికి చేర్చుట ధర్మమని గ్రహింపవలెను. తన భాషను మఱచిన యెడలఁ దన పూర్వులనే గాక తన్ను తానే మఱచి విదేశీయులతో కలసిపోవును. భాషాభిమానమునకును దేశాభిమానమునకును అన్యోన్యసంబంధము మిక్కిలి కలదు. దేశాభిమానమును పోఁగొట్టవలెనని, విదేశప్రభువులు, తాము జయించిన దేశములలో, రాజ్యపరిపాలనలోనే గాక పాఠశాలలలో సహితము, తమ భాషనే నిర్బంధముగ చదివించుచు, స్వదేశభాషల కెంతమాత్రము ప్రోత్సాహము నొసంగరు. ఇది విదేశప్రభువుల రాజనీతి. హంగరీ దేశమును జయించిన మెజియార్లు తమ మెజియారు భాషను తప్ప, మరియొక దేశభాషను పాఠశాలలలో నేర్పినయెడల, ఉపాధ్యాయులను శిక్షించెదరు. ఈ విధముగనే పోలెండు అయిర్లండు వెల్సు మొదలగు దేశములలో క్రమక్రమముగ స్వదేశభాష

త్యజింపఁబడుచుండెను. ఇప్పుడిప్పుడు, ఆ దేశములలో ప్రజలు మేల్కాంచి జాతీయవిద్యను దేశభాషలలో కఱపునట్లొనర్చుకొనుచున్నారు. మన దేశభాషలు అడుగంటకున్నను విద్యాధారములుగా లేవు. వానిని బోధన కుపయోగించి వానికి తగిన స్థానము నిచ్చుట యుచితము. రాష్ట్రపరిపాలన మంతయు దేశభాషలలోనే జరగునట్లు ప్రయత్నింపవలెను.

### II పలివేటి శాయప్పశాస్త్రి గారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

ప్రస్తుతి మాంధ్రప్రపంచమందు గాఢమగు దేశభిమాన భాషాభిమానము లుదయించినవి. వీనివలన, దేశభాషలలో విద్య గఱపవలె ననెడు అభిప్రాయము జనియించినది. ఆంధ్రసమావేశములలోను శాసనసభలలోను ఈ విషయము చర్చింపఁబడుచున్నది. దేశభాషాభిమానులును పోషకులును యుక్తియుక్తముగ వ్యాసములను వ్రాయుచు, ఉపన్యాసముల నిచ్చుచు, ఇందలి తత్త్వార్థమును ప్రజాబాహుళ్యమునకు నివేదించుచున్నారు. అయినను, ఇంకను ఈ విషయము అనేకులచే వివాదాంశముగానే పరిగణింపఁబడుచున్నది. ప్రజానాయకులుగూడ భిన్నాభిప్రాయులై యున్నారు. దేశభక్తులలో అగ్రగణ్యుఁడును, ప్రజ్ఞానసంపన్నుఁడును, స్వార్థత్యాగియు అగు సురేంద్రనాథబెనర్జీ గారు గూడ ఈ విషయమందలి తత్త్వార్థమును గ్రహింపఁజాలక గా. రామరాయణింగా రుపపాదించిన తీర్మానమును నిరాకరించుట మిగుల శోచనీయము. ఈ సందర్భమున ఈ విషయచర్చ ఇక్కాలమున కొప్పియుండు నని తలఁచి ఈ వ్యాసమును వ్రాయఁబూనితిని.

2. హిందూదేశములో మూఁడు విధముల పాఠశాలలు గలవు. ప్రథమ మధ్యమ పాఠశాలలు, కళాశాలలు. ప్రథమపాఠశాలలలో దేశభాషకే ప్రముఖత నిచ్చుచున్నారు. ఇతరభాషల మూలమున ఈ తరగతి పాఠశాలలలో విద్య నేర్పుట మిగుల కష్టము. మొత్తము పైని మధ్యమపాఠశాలలలోను కళాశాలలలోను దేశభాష కగ్రస్థాన మిచ్చుట లేదు. విద్యార్థులకుఁ గూడ ఈ కారణమువలన ఆ భాషయం దనాదరణము కలుగుచున్నది. పట్టపరీక్షలలో కృతార్థులైనవారు కూడ నిర్భయముగ రెండు వాక్యములను వ్యాకరణయుక్తముగ వ్రాయఁజాలకున్నారు. హూణభాషలో తప్పులతో వ్రాసినందులకు చిన్నపుచ్చుకొనువారు, స్వభాషలో నుపన్యసింపఁజాల మనియు, వ్రాయఁజాల మనియు, లజ్జ లేక చెప్ప సాహసించుచున్నారు.

ఒక బి. ఏ. తరగతి విద్యార్థి "Conceive" అను పదమును సరిగా వ్రాయకుండుటను, ఆదేతరగతిలో చదువుచున్న మఱియొక విద్యార్థి చూచి నవ్వి, హేళన చేయుచు "నీ తలకాయలాగే రాసినావులే" అని నిందించెను. "రాసినావు అనెడు నీవు కూడ నన్ను దెప్పవలెనా? స్వభాష నుపయోగింపఁజాలని నీబోటివారిని జూడ మిగుల వ్యసన మగుచున్న"దని మొదటి విద్యార్థి ప్రత్యుత్తరమిచ్చెను. ఇందుపై చిన్నపుచ్చుకొనక "తెలుఁగుభాష యెవరికి కావలెను? ఈ భాష నేర్చుకొనుటవలన తహసీల్‌దారీ పని గాని కలెక్టర్ పని గాని వచ్చునా? ఆంగ్లేయోపాధ్యాయుల మెప్పు పొందుట కీ జ్ఞాన మనుకూలపడునా?" అని అతఁడు తిరిగి వాదించెను. ఇప్పటికిని ఇదే యభిప్రాయమును విద్యార్థులు గలిగియున్నారు.

ఎంతవఱకు తెలుఁగు పండితులకు గౌరవము చూపరో, అధిక వేతనముల నియ్యరో, పైతరగతులలో వేయుటకు తెలుఁగులో వచ్చిన గుణములను గణింపరో, పాఠశాలల పుస్తకభాండాగారములలో తెలుఁగు పుస్తకము లుండవో, అంతవఱకు ఈ దురభిప్రాయము లంతరింపవు.

3. ఉన్నతపరీక్షలం దుత్తీర్ణులైనవారు సయిత మాంగ్లేయభాషలో పరిపూర్ణపాండిత్యమును సంపాదింపలేరు గనుకను, తెలుఁగుభాషలో అట్టి కృషి చేసినయెడల ఉత్తమగ్రంథములను వ్రాయు సామర్థ్యము జనించును గనుకను, జ్ఞానవ్యాపకమునకు దేశభాషలో రచింపఁబడిన పుస్తకములే ఆధారములుగా నుండును గనుకను, దేశభాషను ప్రథమభాషగ నేర్పవలసియున్నది. ఇంగ్లాండు జపాను మొదలగు దేశములలో మఱియొక విధముగా బోధన చేయుటయే లేదు.

4. హిందూదేశ మాంగ్లేయులచే పరిపాలింపఁబడుటచేతను, అనేకభాషల నుపయోగించెడు వివిధజాతులవా రిందు నివసించుటచేతను, కొన్ని జాతులలో విద్యావంతుల సంఖ్య స్వల్పముగా నుండుటచేతను, ఆంగ్లేయభాషాభ్యసనము సహిత మావశ్యకమై యున్నది.

5. హిందూదేశప్రజల ప్రస్తుతనాగరకమునకును, సంఘభావమునకును, స్వాతంత్ర్యాభిమానమునకును, బుద్ధి వికాసమునకును, ఆంగ్లేయభాషాగ్రంథావలోకనమే మూలకారణం బనునది నిర్వివాదాంశము. నిరంతరము పరిశ్రమ చేసి పాశ్చాత్యులు గనుపెట్టిన నూతనాంశములను తెలిసికొని, దేశభాషలో శాస్త్రసంబంధమయిన పుస్తకములను రచించుటకును, ఆంగ్లేయ భాషాపరిచయ మావశ్యకమనునదియు నిర్వివాదాంశమే.

మధ్యమపాఠశాలలలో ఆంగ్లేయభాష నేర్పఁగూడ దని మా వాదము కాదు. దేశభాషను మొదటి భాషగా నేర్పి, ఆంగ్లేయ భాషను రెండవ భాషగా నేర్పవలెననియే నా యభిప్రాయము.

హిందూదేశములో వివిధజాతులవారు నివసించుటచే అన్యోన్యాభిప్రాయనివేదనమునకును, సంఘీభావోదయమునకును, హిందూ మహాజనసభ మొదలగు సభలను జరపుటకును, వర్తకవ్యాపారములను నెఱవేర్చుటకును, ఆంగ్లేయ భాషాజ్ఞాన మవసరమే కాని, ఇప్పుడు వినియోగించుచున్నంత కాలము వినియోగింప నవసరము లే దనియు, ఇంత ప్రముఖత అనవసర మనియు స్ఫురించుచున్నది.

6. దేశభాషలో వ్రాయఁబడిన గ్రంథముల మూలమున ఆ దేశప్రజల యమూల్యములైన యభిప్రాయములును ఆదర్శములును

వ్యక్తపడును. ప్రతిదేశ మేదో యొక విషయమం దితరదేశములను మించియుండి నాగరకతకు హేతు వగు సంస్కారమునకు మార్గదర్శిగా నుండును. ద్రవ్యసంపాదనాసామర్థ్యమును కర్మయోగపరాయణత్వమును హిందువులు నేర్చుకొనవలసిన యెడల, ఆంగ్లేయులు గూడ హిందువుల పారమార్థిక జ్ఞానమును జ్ఞానయోగమును నేర్చుకొనవలసియున్నది ప్రపంచమందలి నాగరకత హెచ్చగుటకు ప్రతిభాషలోను పుస్తకములు రచింపఁబడవలెను. స్వదేశవాఙ్మయ వృద్ధికి స్వభాషాపరిశ్రమ మావశ్యకము.

"ప్రతిమనుష్యుఁడు స్వభాషాసాహాయ్యముచేతనే గ్రహించును, యోచించును; నూతనవిషయములను భావించును, కల్పించును. అన్యభాషయం దట్లు చేయఁజాలఁడు. స్వభాషయందు విద్యాపరిశ్రమము కలుగనిచో మనుష్యులకు సాధారణముగ ప్రతిభ యుదయింపదు."

స్వభాష మూలముగ జ్ఞానసంపాదన చేయుట సులభము. ఇతరభాషల మూలముగా జ్ఞానసంపాదన చేయుట కష్టము శ్రమ అధికము. నిరర్థకముగ కాలహరణ మగును. ప్రజాబాహుళ్యమునకీ జ్ఞానము వ్యాపింపదు. దేశాభ్యుదయమునకును దేశభాషాభ్యుదయమునకును పరస్పరసంబంధము గలదు. దేశభాషల నాశనము ప్రజల నాశన మని చరిత్ర లుద్ఘోషించుచున్నవి.

7. ఇంతవఱకు దేశభాషా పరిశ్రమముయొక్క ఆవశ్యకత దెలిపితిని. ఇఁక దేశభాషలలో విద్య గఱపుట అసాధ్య మని వాదించువారి వాదములను దిగువ నుదాహరించి "అవి యుక్తియుక్తముగ నున్నవా?" అనెడి యంశమును విచారించెదను.

8. కొందఱు ఆంగ్లేయభాషలోని శాస్త్రీయపదములకు సరియైన పర్యాయపదములు దేశభాషలలో లేవనియు, ఆహేతువుచే ప్రకృతిశాస్త్రములు నేర్పుట అసాధ్య మనియు వాదించుచున్నారు.

"ఈ యభిప్రాయము తప్పు" అని స్వానుభవమును బట్టి నొక్కి వ్రాయఁగలను బోధనాభ్యసనపాఠశాలలలో వృక్షశాస్త్రము, జంతు శాస్త్రము, శారీరశాస్త్రము, రసాయన శాస్త్రము, ప్రకృతిశాస్త్రము, వ్యవసాయశాస్త్రము నేర్పుచున్నారము. బాలురు సులభముగ వీనిని గ్రహించుచున్నారు. దేశభాష మూలముగ నేర్పుచుండుటచే పూర్వము యఫ్. ఏ. తరగతి విద్యార్థులు నేర్చుకొనుచుండిన సంగతులను అనాయాసముగ నేర్చుకొనుచున్నారు.

9. దేశభాషలలో తగిన పుస్తకములు లేవనియు అట్టి పుస్తకములను వ్రాయుట కష్ట మనియు కొందఱు తలంచుచున్నారు

జపాను దేశస్థులకు పాశ్చాత్యుల సంపర్కము లేనప్పుడు, వారి దేశభాషలో వ్రాయఁబడిన పుస్తకముల సంఖ్య మన పుస్తకముల సంఖ్యకంటె మించియుండలేదు. ఆంగ్లేయశాస్త్రీయపదములకు బదులుగా చీనాదేశపు భాషలోని పదముల నుపయోగించిరి. ఆ భాష మన భాషలకంటె ఎక్కువ శబ్దజాలము కలిగినది కాదు.

ప్రభుత్వమువారు భాషాంతరీకరణమును జేయుట కొక సంఘమును స్థాపించి పుస్తకములను ప్రచురించినయెడల, ఉత్తమగ్రంథములు వెలువడుటయే గాక, ఇందు మూలమున ధనార్జన గూడ కలుగు నని ఇతరదేశగ్రంథరచనచరిత్రలవలన వ్యక్తపడుచున్నది.

జపానుదేశములో మధ్యమపాఠశాలలలోనే గాక కళాశాలలలోఁ గూడ దేశభాష మూలముగ విద్య గఱపఁబడుచున్నది వెసడా విశ్వవిద్యాలయ మిటువంటిదే. దీనిలో 7,000 మంది విద్యార్థులు విద్యాభ్యాసము చేయుచున్నారు కాలాంతరమున హిందూదేశములోఁ గూడ, దేశభాషలందు విశ్వవిద్యాలయములు స్థాపితములుగాక తీరదు. దేశభాషాభ్యుదయము లేనిదే దేశాభ్యుదయము కలలోనివార్తగాన, స్వదేశవాఙ్మయాభివృద్ధి కెల్లరును యత్నింపవలసియున్నది.

10. కొందఱు రెండవ భాషగా ఇంగ్లీషు నేర్పినయెడల, ఇంగ్లీషు భాషాజ్ఞానము తక్కువగా నుండు ననియు, ఉపాధ్యాయు లింగ్లీషులో నిచ్చిన యుపన్యాసములను బాలురు గ్రహింపఁజాలరనియు, ఇప్పటివలె రాజకీయ వ్యవహారములను వర్తకవ్యాపారములను నెఱవేర్చుకొనెడు సామర్థ్యమును గలిగియుండ రనియు తలంచుచున్నారు.

బాలుర యాంగ్లేయ భాషా జ్ఞానము ఉపాధ్యాయుల తెలివితేటలను బోధనాపద్ధతులను పరీక్షానిబంధనలను అనుసరించి భేదించుచుండును. తెలివైన యుపాధ్యాయుఁడు, సరియైన బోధనాపద్ధతుల నవలంబించి, నిజమైన భాషాజ్ఞానమును గలుగఁజేయ యత్నించినయెడల, వారమునకు 4 గంటలు మాత్రమే బోధించినను మధ్యమపాఠశాలలలోని బాలురకు ఇంగ్లీషు భాషలో ఇయ్యఁబడిన యుపన్యాసములను గ్రహించు సామర్థ్యము కలుగును. జర్మను పాఠశాలలలో వారమునకు 4 లేక 5 గంటల చొప్పున 3 సంవత్సరములు మాత్రమే ఆంగ్లేయభాషను నేర్పుచున్నను, అట్టి విద్యార్థులు మన దేశమునకు వచ్చి మృదుమధురశైలి నుపయోగించి యుపన్యాసముల నిచ్చుచున్నారు, వ్యాసములను వ్రాయుచున్నారు. ఇటులే జపానుదేశములోఁ గూడ బాలురు వారమునకు కొన్ని గంటలే నేర్చుకొనుచున్నను, కళాశాలలో ఇంగ్లీషునం దియ్యఁబడెడి యుపన్యాసములను గ్రహించుచున్నారు ఇంతకును ఆంగ్లేయభాషను తప్పులు లేక వ్రాయుటకంటె, నిశ్చలమైన జ్ఞానసంపాదనయు ఆలోచనావివేచనాశక్తుల యభివృద్ధియు ఉన్నతాదర్శములను గలిగియుండుటయు ముఖ్యము.

జపాను దేశస్థులకు మన దేశస్థుల కున్నంత ఆంగ్లేయభాషా పరిచయము లేకున్నను, నూతనముగా అనేకసంగతులను గనిపెట్టియున్నారు. రాజకీయవ్యవహారములను మనకంటె నేర్పుతో నెఱవేర్చుచున్నారు.

సాధారణవ్యవహారములను నెఱవేర్చుటకు మిక్కుటమైన భాషాజ్ఞాన మనవసరము "What make my make" (వాట్ మేక్ మై మేక్) అని గవర్నరుగారియొగుట ఇంగ్లీషుభాషలో చెప్పిన మహాపురుషుఁడు, ఒక స్వదేశసంస్థానముయొక్క మంత్రిగా నుండి, ఆదాయమును వృద్ధిచేసి, ప్రజల సౌఖ్యమును హెచ్చుచేసి, రాజుయొక్కయు ప్రభుత్వముయొక్కయు మన్ననకు పాత్రుఁడాయెను.

II. కొందఱు దేశభాషలలో విద్య నేర్పవలసినదే కాని, హిందూదేశములో మున్నూటముప్పది భాష లుండుటచేత, అట్లు చేయుట కష్ట మని తలంచుచున్నారు

వీనిలో అనేకభాషలకు లిపి గాని పుస్తకములు గాని లేవు. అట్టి భాషల మూలముగ విద్య నేర్ప నవసరము లేదు. కొన్ని భాషలు స్వల్పసంఖ్యాకులచేతనే వాడఁబడుచున్నవి మఱికొన్ని నామమాత్రముననే భేదించియున్నవి. నిజముగ అవి వేఱు భాషలు గావు. మఱికొన్ని సహజముగ నాశన మొందుచున్నవి. స్వల్పకాలములో అంతరింపఁగలవు.

పై హేతువుల ననుసరించి మున్నూట ముప్పది భాషలలోను విద్య నేర్ప నవసరము లేదు. 16 లేక 20 భాషలలో మన హిందూదేశములో విద్య నేర్పినఁ జాలును

కాలక్రమమున ఈ 16 భాషలకును వసడా విశ్వవిద్యాలయము మాదిరి విద్యాలయములు స్థాపింపఁబడవలసియున్నది. వీనిలో ఇంగ్లీషు నేర్పవలెను గాని రెండవ భాషగా నేర్పవలెను.

ప్రారంభమున దేశభాషలలో ఉత్తమగ్రంథములు లభింపక పోవచ్చును వ్రాయఁబడిన గ్రంథములు ఆంగ్లేయభాషాగ్రంథములకన్నఁ దక్కువ విలువైనవిగా నుండవచ్చును కాలక్రమమున ఈ లోపములు నివారణ కాఁగలవు

దేశాభ్యుదయమునకు దేశభాషాభ్యుదయము కారణ మగుటచేతను, దేశభాషాభ్యుదయమునకు పాఠశాలలలో దేశభాష కిచ్చిన ప్రాముఖ్యము కారణం బగుటచేతను, దేశభక్తు లెల్లరు ఈ విషయమును గుఱించి అధికశ్రద్ధ వహించి, ఈ సంస్కారమును ప్రభుత్వమువా రంగీకరించునట్లు చేయవలెను.

## III మంత్రిప్రెగడ సాంబశివరావు గారు, బి.ఏ., ఎల్.టీ.

హిందూదేశమునం దిప్పుడు ప్రబలియున్న విద్యాసమస్యలలో నింతకంటె నెక్కుడు ప్రముఖ మైనది లేదని చెప్పుట యెంతమాత్రమును సాహసము గాదు దేశభక్తిని పురిగొల్పి దేశోద్ధారకవిషయములయందు మనస్సును వికసింపఁజేయుటకు దేశభాషల యభివృద్ధియే యుత్కృష్టసాధన మని అందఱును ఒప్పుకొనిన విషయమే. పరదేశభాషల మూలమున నభివృద్ధి చెందిన దెక్కడను లేదని చరిత్రమునందుఁ గన్పట్టుట లేదు. ఇతర భాషలనుండి గ్రహించిన విషయములను మాతృభాషలో నిమిడ్చి మన మనోంతరాళములలోనికి త్రిప్పి స్వగతములు చేసికొనఁగలిగినప్పుడే, యవి మన సొత్తగును గాని లేనియెడల నవి అప్పు దీసిన సొమ్ములవలెనే మనకు అవసర మగునపు డుపకరింపవు. అట్టి విద్య బూడిదెలో పోసిన పన్నీ రగును గాని మఱివేఱు గాదు

ఇట్టి ముఖ్యవిషయమును గూర్చి భిన్నాభిప్రాయము లుండుట అసహజము గాదు. స్వదేశీయులే కొందఱు వ్యతిరేకాభిప్రాయమును బూనుటయు కొంత సహజమే! ఏ కార్యమునకుఁ గాని ఆటంకములు గడచి జయము కలిగినప్పుడే, దాని జయము ద్విగుణ మగును. అంతరాయములు లేక కార్యఫలితము సిద్ధించినను, సిద్ధింపనప్పటి యట్లేయుండును.

ప్రకృతవిషయమును గూర్చి బెజవాడ ఆంధ్రమహాసభయందు చర్చ జరగినప్పుడు, మన ప్రముఖులలోఁ గొందఱు తమ వ్యతిరేకాభిప్రాయమును చూపిరి. అయినను వారే మఱి సంవత్సరము జరగిన విశాఖపట్టణ తృతీయాంధ్ర మహాసభలో ఆ తీర్మానమునే బలపఱచుచు ప్రసంగములు జరపిరి. ఒక్క సంవత్సరకాలములో దీని కిట్టి బలము కలుగుట జయసూచక మనుటకు సందేహము లేదు.

ఈ విషయమై కొన్ని యభిప్రాయములను ముందుగాఁ దెల్పి సాధకబాధకముల నాలోచించి ప్రముఖు లిచ్చిన యభిప్రాయముల వ్రాసి కార్యసాధన సౌకర్యము లగు మార్గములఁ జూపుట ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

మన రాజధానిలో ఎలిమెంటరీ పాఠశాలలలో నెందఱు విద్యార్థులు గలరు? వారిలో నెందఱు సెకండరీ పాఠశాలలకుఁ జదువవత్తురు? అట్లు వచ్చినవారిలో మూడవ ఫారములోపుననే చదువు మానివేయువా రెందఱు? అది దాఁటి పైతరగతులలోనికి వచ్చినవారిలో స్కూలు ఫైనలు దాఁటువా రెందఱు? వారిలో కాలేజీ విద్య నభ్యసించువా రెంతమంది యుందురు? ఈ ప్రశ్నలకు త్తరము కొంతవఱకు క్రింది సంఖ్యలవలన తెలియును. 41,418,930 మంది ప్రజలలో స్కూళ్లయందు విద్య నభ్యసించు వారు 1,862,182 రు, అనఁగా నలువదిమంది కొకఁడు. వీరిలో

| విద్యావస్థ | పురుషులు | స్త్రీలు |
| --- | --- | --- |
| కళాశాలలు | 5,491 | 56 |
| సెకండరీ పాఠశాలలు | 77,581 | [illegible],689 |
| ప్రైమరీ పాఠశాలలు | 899,393 | 234,885 |
| చదువుకొను ఈడు గల వారిలో నూటికి | 33.1 | 7 4 |

వీనిని పరీక్షించి చూడఁగా పైకి పోయిన కొలఁది విద్య దిగనాసిల్లుచున్నట్టును, జనసంఖ్యలో మిక్కిలి యల్పసంఖ్యాకులే విద్యావంతు లగుచున్నట్టును, స్త్రీలలో విద్య నేర్చువారు అంతకంటెను సూక్ష్మసంఖ్యాకు లైనట్టును తేటపడుచున్నది. దీనికి కారణము కొంతవఱకు ప్రస్తుతపు విద్యాపద్ధతు లనియే యెంచవచ్చును.

ప్రైమరీ తరగతి.—బాలబాలికలలో ననేకులు ఈ తరగతి దాఁటి పైకి పోలేకయున్నారు. అట్టివారికి శాస్త్రజ్ఞానము నియ్యవలె ననిన మాతృభాష దప్ప వేఱు సాధన మేమి గలదు? శాస్త్రజ్ఞాన మనునది మనుష్యజాతి కంతకును కావలసినదే గాని, కొందఱికి మాత్రమే యవసరమై ఇతరులు పొందఁగూడనిది కాదు. ప్రజలలో నిట్టి జ్ఞానము ప్రబలియుండకపోవుటచేత గవర్నమెంటువారు ఆరోగ్యవిషయమైన పనులను తలపెట్టునపుడు, మూఢవిశ్వా

సము గల్గి శాస్త్రజ్ఞానశూన్యులైన సామాన్యప్రజలవల్ల ప్రతిబంధకములు కల్గుచున్నవని పెక్కుమంది యుద్యోగీయులు చెప్పుచుండ విని, వారి విద్యాపద్ధతులవలననే యిట్టి స్థితి ప్రబలి, వారు చేసిన పనుల ఫలితమునే యనుభవించుచున్నారని మనలో కొందఱు క్షమలో తాము నవ్వుకొని యూరకుండవలసివచ్చినది. మూఢవిశ్వాసమును పారఁద్రోలుటకు విద్యావ్యాప్తియే ముఖ్య సోపానము: మాతృభాషలో తప్ప వేఱు విధమున బాహుళ్యముగా విద్యను జ్ఞానచంద్రికలను వెదఁజల్లుటకు వీలులేదు. చాలమంది జనులు మూఢత్వములోఁ బడి యీఁదులాడుచుండ కలరా మహామారి మొదలైన యంటురోగములు ప్రబలినప్పుడు జాతులే నాశనమగుట నిశ్చయము. కాఁబట్టి గవర్నమెంటువారు తాము పూనిన ఆరోగ్యకార్యములకు ప్రజలు తోడ్పకపోవుటచే, ధనవ్యయ మగుటయే గాని కార్యసాఫల్య మగుట లేదని వినిపించెడి మొఱ అడవిలోని మొఱ. ఎక్కువ ధనము వెచ్చించి విద్య వ్యాపింపఁ జేసినఁ గాని ఆ మొఱ నాలకించువా రుండరు.

సెకండరీ తరగతి.——ఈ తరగతియందు అనఁగా ఆరవ ఫారముకఱకును 10 మొదలు 16 సం. ల వయస్సు బాలు రుందురు. సరియైన శిక్షకు పునాది పడుటకు తగిన వయస్సిదియే. నాలవ ఫారము మొదలు ఆరవ ఫారమువఱకును నిర్బంధముగా నన్ని విషయములును ఇంగ్లీషులోనే బోధింపఁబడుచున్నవి. ఇంగ్లీషు భాషా వైపరీత్యములను రహస్యములను గ్రహించి, ఉపాధ్యాయుఁడు చెప్పిన పాఠమును సుగమము చేసికొనుటకు బాలునియొక్క కాలమును శక్తియు అంతరించుచున్నవి అట్లు కష్టపడుటలో విషయవిజ్ఞానము తగ్గిపోయి భాషావిషయికమైన యాటంకములు పెక్కు లగుచున్నవి. చరిత్ర గఱపు ఉపాధ్యాయుఁడు, చరిత్రజ్ఞానము నభివృద్ధి చేయుటయే వాని పాఠములయొక్క ముఖ్యోద్దేశముగాఁ జేయవలెను. ఇప్పటి స్థితిలో అట్లు చేయుటకు వీలు కలుగుట లేదు. కాఁబట్టి ఏ పాఠము చెప్పునపుడు ఆ పాఠముయొక్క విషయమే ప్రముఖత వహింపనియెడల ఆ పాఠము నిష్ప్రయోజనము. దాని కొఱకు వెచ్చించిన కాలమును శక్తియు వ్యర్థములు. ఆ పాఠములనే మాతృభాషలో చెప్పినయెడల బాలురు సులభముగా గ్రహించుటయే గాక, కాలమును శక్తియు కూడివచ్చుటయు, అందువలన వారికి సంతోషము కలుగుటయు తటస్థించును. అట్లు చేసినయెడల, హెచ్చు జ్ఞానమును గూడ కొలఁది కాలములో వారికి కలిగింపవచ్చును. దానివలన శాస్త్రజ్ఞానము త్వరగా నభివృద్ధిచెంది నూతనాంశములయందు మనస్సును ప్రవేశపెట్టుటకు తగు నవకాశములు దొరకవచ్చును.

మాతృభాషలలో విద్య గఱపినయెడల, బాలుర హూణభాషాప్రావీణ్యము తగ్గిపోవునని కొందఱి వాదము. అయితే, నా యభిప్రాయ మది కాదు. అట్టి వాదము దేశాభివృద్ధికరమును గాదు. అయిన నట్లగునని మన మొప్పుకొనినను నష్టమేమి! సెకండరీ విద్యయొక్క ముఖ్యోద్దేశము జ్ఞానము నార్జించుటయా, లేక హూణభాషను నేర్చుటయా? ఈ ప్రశ్నకు తగిన సమాధానము నిచ్చినయెడల, మన వాదముయొక్క ప్రాబల్యము నొప్పుకొనుటయే. ఏ మూఢుఁడును హూణవిద్య నభ్యసించుటయే సెకండరీ విద్యయొక్క యుద్దేశమని నుడువఁడు. ఈ విద్య నభ్యసించువారిలో నూటికి 90 మంది ఏ ప్లీడరు గుమాస్తాలుగానో, తాలూకా గుమాస్తాలుగానో, ఏ వర్తకసంఘములోనో, మఱియెచ్చటనో ఉద్యోగము సంపాదించుకొని పొట్ట పోసికొనువారే. వీరికి హెచ్చు హూణభాషాజ్ఞానముయొక్క యవసరమేమి? వ్యావహారికజ్ఞాన ముండిన చాలును. కాని వారికి మానవశరీరధర్మములు, ఆరోగ్యవిషయములు, గృహనిర్వాహకము, అంటువ్యాధులు ప్రబలిన పడవలసిన జాగ్రత్తలు, చేయి తెగిన చేయవలసిన పని మొదలయిన అనేక జీవితవిషయములు తెలియకపోయిన, వారి జీవితమే వారికి దుర్భర మగును. ఇఁక సంసారము నీఁదుట యెట్లు? సముద్రము నీఁదుటకంటెను కష్టతరము. అందువలన జీవితసౌఖ్యమే యంతరించును.

ఒక చిన్న యుదాహరణము: ఐదారుగురు గల చిన్న కుటుంబములో 10-12 సం. ల బాలుఁడు ఇంగ్లీషు బడిలో చదువుచుండుట ఈ రోజులలో అరుదు గాదు. వాఁడు ఇంటిలో పాఠము చదువునప్పుడు చిన్న చెల్లెలు వచ్చి 'ఏమి టన్నయ్యా చదువుచున్నావు?' అని గాని, నాయనమ్మ వచ్చి 'నీవు చదివే దేమిటిరా?' అని గాని ప్రశ్నించినప్పుడు వాఁడు "నీ కేమి తెలుసును, పో" -అని తప్ప, ఇతరసమాధాన మేమైన నియ్యఁగలఁడా? వీఁడు ముం దెప్పుడో తహశ్శీలుదారు పనో డిప్యూటీ కలెక్టరు పనో చేయు నను సంతోషము తప్ప, దినదినమును వాఁడు మనఃప్రపంచమునందు తనవారలకు దూరుఁ డగుచున్నాఁ డను సంగతి మఱచుచున్నాము. మన విద్యార్థులలో నెందఱు నిజమైన సంసార సౌఖ్యము ననుభవించుచున్నారో చెప్పుటకు వీలు లేదు. లెక్కలను సంపాదించిన చాల నుపయోగముగా నుండును. ఏదో సభకు వెళ్లి రాత్రి ఆలస్యముగా నింటికి వచ్చినప్పుడు 'ఏమి, ఇంత ఆలస్యమైన?' దని ఇంటివా రడిగిన, "ఏదో మీటింగు. అందుచేత ఆలస్యమైన" దని సమాధానము చెప్పుట తప్ప, మఱియేవిధముగా వారి నూరడించి వారికి జవాబు చెప్పఁగలుగుచున్నామో మనకే తెలియును. ఎప్పుడైన సాయంత్రము నెండలకడ ఇంటికి వచ్చినవెంటనే షికారు బయలుదేఱుదుము. భోజనానంతరము నిద్ర. ఈవిధముగా ఇంటిలో చాల తక్కువ కాలమే గడపి రోజులు వెళ్లఁబుచ్చుటకే ప్రయత్నించుచున్నాము. కాని, మనకుఁ గల జ్ఞానము కొంతైనను ఇంటిలో వారికి కలిగించుటకు మనము ప్రయత్నించుట లేదు. దాని కంతకును కారణము మనఃప్రపంచములకుఁ గల తారతమ్యమే. ఇట్టి స్థితికి కారణము మనము మాటలాడు భాషలో మన యభిప్రాయము లిమిడియుండక పోవుట తప్ప వేఱు గాదు. మాతృభాషలో విద్య నేర్పినయెడల ఈ దురవస్థ తప్పు ననుటకు సందేహము లేదు. భాష యెట్లు పరదేశీయమో జ్ఞానము గూడ నట్లే పరదేశీయముగా నుండి అంతర్గత మగుట లేదు. ఇట్టి "అజీర్ణజ్ఞానము" వలన మన బాలురు బాధ

పడుచున్నారు.

ఇంగ్లీషులో బాలురను పండితులను చేయవలె ననిన అన్ని పాఠములును ఆ భాషలో చెప్పుటవలన నది యలవడదు. మంచి మంచి క్రొత్త పద్ధతుల సాహాయ్యమువలన దానిని బోధింపవలెను. దానికి వినియోగించు కాలము వృద్ధిచేయవలెను. మాతృభాషలో తక్కిన విషయములను బోధించినయెడల, ఇంగ్లీషునకు చాల కాలము వినియోగించుటకు వీలగును. అట్టి మార్పువలన ఇంగ్లీషు భాషాజ్ఞానము గూడ హెచ్చుగుటకు కారణము గలదు.

సర్వకళాశాలలలో విద్య నభ్యసించుటకు ఇంగ్లీషు కావలెను గదా? మొదటినుండియు దాని నేల చెప్పఁగూడ దను వాదమునకు కొందఱు లోనగుచున్నారు. ఇది అన్నప్రాశనలోనే కారపుగుండ నేల తినిపింపఁగూడ దను వాదముతో తుల్యముగా నుండును. 12, 16 సం॥ల ప్రాయములో మనస్సు మిక్కిలి కోమలమై వికసించుటకు తగు స్థితిలో నున్నప్పుడు దానిని అనవసర కష్టముల పాలు చేయుట, పూవును త్రుంచుటకు ప్రయత్నించుటయే. కళాశాలలఁ జేరినవారికి మనస్సు వికసించి కష్టవిషయములను గూడ గ్రహించు శక్తి యుండవచ్చును గాని, బాలురకు కూడ నట్టి విద్యయే యుండవలె ననుట మనోంగముయొక్క తత్త్వము నెఱుఁగక మాటలాడుట గాని వేఱు గాదు. ఇది గాక, సర్వకళాశాలలో చదువువారు నూటికి కందరు గలరు? అట్టి స్వల్ప సంఖ్యాకులకొఱకై తక్కినవా రందఱును జ్ఞానశూన్యులు కావలె ననుట సమంజసము గాదు. బిడ్డల బాగు గోరు తల్లిదండ్రులు ఈ విషయమును చక్కఁగ గమనింతురు గాక!

స్త్రీవిద్య.——మన దేశపు ప్రస్తుతస్థితియందు బాలుర విద్యకంటె బాలికల విద్యయే ఎక్కువ అవసరమని చెప్పవలసియున్నది. మన దేశములో స్త్రీ ఇంటికి యజమానిని గాని పురుషుఁడు గాఁడు. గృహసంస్కరణము జరగవలె ననిన స్త్రీలు పూనిన కార్యము సఫలీకృతమగును గాని, పురుషుఁడు పూనిన చేయును గృహకార్యమునకు స్త్రీలే నిర్వాహకలు. పురుషులు ఆమోదించి సంతోషించువారు. అట్టి గృహములను నిర్మింపవలె ననిన, ముందుగా తగిన స్త్రీజనము అవసరము. మన దేశములో ప్రతి స్త్రీయును యుక్తకాలమునందు కడివెడు పిల్లల తల్లియై గృహసౌఖ్యమునకు ఆటపట్టయి అందఱి నానందాబ్ధి నోలలాడించు తరణియై జీవయాత్ర గడపుటయే జన్మసాఫల్యము చేసికొనుట యని గుర్తెఱుంగవలెను. గృహిణియే, ఆఁకలివైచిన అన్నము పెట్టి, రోగము వచ్చిన మందు నిచ్చి, విచారమువచ్చిన సంతోషము కలిగించి గృహయాజమాన్యము వహింపవలసియున్నది. అట్టి స్త్రీమతల్లులను విద్యాశూన్యలుగా నుంచిన ఎన్ని కష్టముల పాలు గావలసివచ్చును? ఆమె విద్యావతియైన ఆమె యభిప్రాయములను ఉగ్గుపాలతోనే పిల్లలకుఁ గలిగించుటకు వీలగును గదా! చిన్న వయస్సులో తల్లికంటె నెక్కువ యుపాధ్యాయు లరు? ఆమె శుద్ధముగా నుండిన పిల్లలు గూడ శుద్ధముగా నుందురు. ఆమె మూఢురాలైన పిల్లలు మౌఢ్యమున మునిఁగి పోవుదురు. అట్టి స్త్రీజనమును తయారు చేయవలె ననిన, మాతృభాషలో విద్య నేర్పుట తప్ప వేఱు మార్గమున కార్యసాధనమగునా? మరి రాజధానిలో ఏగురు స్త్రీలు మాత్రమే కాలేజీ పట్టపరీక్షలలో తేలినట్లు ఒక సంవత్సరపు లెక్క తెలుపుచున్నది. వీరు మాత్రమే విద్య నేర్వవలసినవారును తక్కినవారు నేర్వఁగూడనివారునా? కాఁబట్టి జ్ఞానము వెదఁజల్లుటకు మాతృభాషకంటె వేఱు మార్గము లేదు.

పత్రికాప్రకటనము.——దేశమును విద్యావంతము చేయు సాధనములలో పత్రికాప్రకటనము ఉత్తమము. మన మెన్ని పాఠశాలలు పెట్టినను కొద్దిమందికే విద్య గఱపఁగలుగుదుము గాని, పత్రికలన్నో సంఘములను జాతులను జ్ఞానపథమునకు త్రిప్పు సాధనవిశేషము లని చెప్పవచ్చును. పత్రికాపఠనమువలననే కొందఱు మహాజ్ఞానవంతులయి రనుటకు నిదర్శనములు గలవు. అయిన, శాస్త్రవిషయికజ్ఞానము పత్రికాముఖమున వ్యాపింపవలె ననిన, నట్టి పుస్తకములు ముందుగా నుండవలెను. శాస్త్రసారస్వతము వెలసినమీఁద, జ్ఞానకళికలు పత్రికాముఖమున వ్యాప్తమై జనుల హృదయాంగముల నాటుకొని సంఘములోనికి తిరిగి వ్యాపించి, సంఘాభివృద్ధికిని దేశాభివృద్ధికిని కారణము లగును.

పఠనగ్రంథములు.——మన వాదమును పూర్తిగా సంగీకరించుటకు కొందఱొక యభ్యంతరము చెప్పుచున్నారు. "పఠనగ్రంథములు లేవు గదా, పాఠములు చెప్పుట ఎట్లు సాధ్యమగును? అందుచేత గ్రంథములు పుట్టువఱకును మాతృభాషలో విద్య నేర్పుటకు వీలు లేదు." అయితే, పఠనగ్రంథములు లేకపోవుటకుఁ గల కారణమును వా రూహించియుండలేదు. పాఠకులు లేకపోవుట తప్ప వేఱేమి కారణ ముండును! పాఠకు లున్న, పాఠ్యపుస్తకములు లేకయుండునా? జపాను దేశములో వారి భాషయందు అన్ని పుస్తకములును వెలయుటకు కారణమేమి? జపానువారు దేశభాషలోనే ఉన్నతవిద్యను గఱపుట గాదా? జపానుభాషకంటె ఎన్ని మడుంగులో మిన్నయైన మనభాష ఇట్టి యవస్థయం దుండుటకుఁ గల కారణమేమి? ప్రోత్సాహము లేకపోవుటయే గదా? మన దేశములో సివిలు కోర్టులు పెట్టినప్పుడు న్యాయవాదు లుండిరా? న్యాయవాదులు లే రని కోర్టులు పెట్టుట మానిరా? ఇప్పుడో న్యాయవాదులు కొల్లలుగా నున్నా రని చింతిల్లుచున్నాము గాని, తక్కువగా నున్నా రని చెప్పుచున్నామా? అట్లే పఠనగ్రంథములు లే వని వగచుట కారణమరయక దూఱుట గాని వేఱు గాదు. పాఠములు ప్రారంభించిన పుస్తకములు వెంటనే వెలయును. పాఠములు ఇంగ్లీషులో చెప్పుచు దేశభాషలలో పుస్తకములు లే వనుట యన్యాయము.

జిల్లా వ్యవహారము లన్నియు జిల్లా భాషలోనే జరపఁబడవలె నని గవర్నమెంటువారు సిద్ధాంతపఱచిన, చాల మంచిది. అట్టి ఆజ్ఞలు ఉన్నను కొన్ని అమలులో లేవు. జిల్లా కోర్టు వ్యవహారములు జిల్లా భాషలో జరిగిన ప్రజల కెంత సౌకర్యము? అనవసరపు వ్యయ

మెంత తగ్గును? ఈ విషయమై ఒక జిల్లాజడ్జిగారు ప్రజల భాష లోనే తమ కోర్టు వ్యవహారములు జరగవలసిన దని శాసించుట మిగుల సంతోషకరము. రివిన్యూ వ్యవహారములు విద్యాశాఖవారి వ్యవహారములు కూడ ఇట్లు జరగిన నెంత లాభకరము! హైకోర్టుకును గవర్నమెంటునకును వెళ్లు కాగితములు తప్ప, తక్కిన వన్నియు దేశభాషలలో నుండిన ఎంత మంచిది! అట్టి దినములు మనకు త్వరలో ప్రాప్తించుం గాత!

పారిభాషికపదములు.—పుస్తకములు వ్రాయుటకు సరియైన పర్యాయపదములు మన భాషలో లేవని కొందఱి కొక పెద్ద యడ్డంకి కన్పట్టుచున్నది. ఈ విషయమై చాలవఱకు కొఱంత ఇదివఱకే తీరిన దని చెప్పవచ్చును. చాలవఱకు శాస్త్రగ్రంథములు తెనుఁగు భాషలోను మఱికొన్ని ద్రవిడభాషలలోను కూడ ప్రచురింపఁబడినవి. వీరేశలింగము పంతులు గారు మొట్టమొదట చూపించిన త్రోవను అనేకులు పండితులు గ్రంథకర్తలు నవలంబించి పర్యాయపదములను కల్పించి వీలు లేని చోట హూణపదములను తగురీతి మార్చి గ్రంథరచన చేసియున్నారు. ఇంకను వ్రాయవలసిన గ్రంథములలో ఇంగ్లీషు పదములఁ దీసికొనినను, అభ్యంతర ముండదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు కొన్ని పదములను ప్రకటించి యున్నారు. నాగర ప్రచారిణీ సభవారి పారిభాషికపద గ్రంథము నిఘంటువుగా నుపయోగ మగుచున్నది. మాటలను గ్రహించుట సులభమో, మాటలకొఱకై భాష నంతను చదువవలె ననుట సుకరమో బుద్ధిమంతులు గ్రహింతురు గాత! ఇంకను గణితశాస్త్రగ్రంథములు దేశభాషలలో వెలయవలసియున్నది. సంస్కృతములో లీలావతి భాస్కరాచార్య ఇత్యాది గ్రంథములు లోకప్రసిద్ధము లిదివఱకే యుండుటచేత ఆ శాస్త్రగ్రంథములు గూడ వ్రాయుట కష్టము గాదు. బంగాళి భాషలో క్షేత్ర బీజ కోణ గణితము లిదివఱకే ప్రచురింపఁబడినవి. ఏ విధముగా నాలోచించి చూచినను ప్రతికక్షుల వాదమునకు నిలువ నీడ గాన్పించుట లేదు.

సింహావలోకనము.—కాఁబట్టి పైని చెప్పిన విషయములనుబట్టి దేశాభివృద్ధిమూలకము లగు దేశభాషలు మొదట వృద్ధి చెందవలె ననియు, భాషలు వృద్ధిచెందుటకు వానికి పాఠశాలలయందు ప్రాముఖ్యము గల్గి బోధనక్రమ మాభాషలలో జరగవలె ననియు, అట్లు జరగకపోవుటవలన బాలురు నేర్చినవిద్య జీర్ణము గాక ఇతరుల కుపయోగింపకుండుటయే గాక వారికి కూడ నుపకరింపకపోవు ననియు, విద్యార్థులు దేహారోగ్యము దృఢత్వము తగ్గి దుర్బలులై పోవుట మొదలగు సర్వానర్థములకును ప్రకృతిపద్ధతి లోనగుచున్న దనియు తేటతెల్ల మగుచున్నది.

## అనుబంధము

దేశభాషల ప్రాబల్యము హెచ్చించి, దేశభాషామూలమున శాస్త్రపాఠముల స్కూలు ఫైనలు క్లాసువఱకును గఱపుటయే మిక్కిలి సమంజస మను సిద్ధాంతమును చేసికొని, దానికై పాటుపడుటకుఁగాను "దేశవిద్యాసంఘము (Council of Education) ఒకటి చెన్నపురిలో సర్ డాక్టరు సుబ్రహ్మణ్యయ్యరు గారి యాధిపత్యముక్రిందను అనేకు లగు మహనీయుల సభ్యతక్రిందను స్థాపింపఁబడినది. ఈ సభ్యులలో మహమ్మదీయులు కూడఁ గలరు. రాజధానిలోని ఉపాధ్యాయసంఘములు తదితరసంఘములు దీనిలో సభ్యత కర్హములు.

వీరు 1915-వ సం మేనెల 24-వ తేదిని చెన్నపురి గవర్నమెంటువారి కొక నివేదనమును బంపిరి. దానియొక్క సారాంశ మేమనిన: స్కూలు ఫైనలు క్లాసులో 'C' గ్రూపులోనికి త్రోయఁబడిన దేశభాషలను సంస్కృతము ఇత్యాదిభాషలను 'B' గ్రూపులోనికి మార్చి, ఏ జిల్లావా రా జిల్లాలోనే అన్ని పాఠశాలలును నేర్పింపవలెననియు, ఆ గ్రూపువిషయములందు పరీక్షలను దేశభాషలలో చేసికొనుటకు నుత్తరువు దయచేయింపవలె నని. ఇది ప్రజల యనుమతి కిదివఱకే పాత్ర మైనది గనుక, గవర్నమెంటువారికి యభ్యంతరము నుండఁగూడ దని వారి యాశయము.

## విదేశీయుల యభిప్రాయములు

సర్ థియడోర్ మోరిసన్ గారు.—"పాశ్చాత్య విద్యావ్యాపన మత్యంత మవసర మని నేను నమ్మెదను, అట్టి వ్యాపనము దేశభాషల మూలకమున జరుగవలె నని యభిప్రాయపడుచున్నాను."

సర్ జార్జి బర్డ్‌వుడ్డు గారు.—"ఏ వైపు చూచినను దేశభాషలు తమ ప్రథమౌన్నత్యస్థితికి వచ్చుటకు తగు విశ్వప్రయత్నములే మనల నెదుర్కొనుచున్నవి."

కార్మయికేలు ప్రభువు గారు.—"అప్పటి విద్యాపద్ధతులయందలి లోపములు చాలవఱకు, మన కిప్పుడు గల యనుభవజ్ఞానములలో కొంతయైనను పూర్వపు టుద్యోగియుల కుండినయెడల, కన్పట్టకపోయియుండును." అని మెకాలే గారి సిద్ధాంతమును గూర్చి నుడివిరి.

కర్జను ప్రభువు గారు, 1903.—"అనేకమైన సారస్వతవైచిత్ర్యములును శిల్పకళానైపుణ్యగోప్యములును దేశభాషలయం దిమిడియుండుటయే గాక, నూతనజ్ఞానరహస్యము లన్నియు నా భాషలలో పొందుపఱచి కోట్లకొలఁది ప్రజల మనస్సులకు తట్టులాగునఁ జేయుటకు ఆ భాషలు తగియున్నవి. ఇంగ్లీషు భాష అల్పసంఖ్యాకులకు మాత్రమే తెలియును."

గా. మన్రో గారు, 1893.—"చిన్న వయస్కులగు బాలురకు కష్టమగు శాస్త్రవిషయములను వారికి తెలియని భాషలో బోధించుటకంటె నెక్కుడు శోచనీయ మగునది నాకుఁ గన్పడదు. మన యింగ్లీషు బాలురను ఫ్రెంచిలో విద్య నేర్వవలసిన దని చెప్పిన నెట్లుండునో యాలోచింపుఁడు."

ఇఁక ననేకులు దేశీయులును విదేశీయులును గూడ దీని యావశ్యకతను గూర్చి యభిప్రాయముల నిచ్చియున్నారు. వ్యాసవిస్తరభీతిచే నింతటితో విరమింపవలసివచ్చినందులకు చదువరులు మన్నింతు రని వేడుచున్నాను.

# ఆంధ్రవ్యక్తి

వికొండల సాంబశివరావు గారు

వ్యక్తి యనఁగా నేమి? ఏది వ్యక్తమైనదో యది వ్యక్తి. వ్యక్త మనఁగా ప్రకాశమానము. అవ్యక్త మనఁగా నప్రకాశమానము. ఏది గూఢమో, నిహితమో, దాఁగియున్నదో, కాలచక్రమునం దెక్కడనో పడియున్నదో, అది యవ్యక్తము. ఏది కాలచక్రమున కధీనమైనదో, తనయం దిమిడియుండు శక్తులను పెంపొందింపఁజేసికొనుచున్నదో, నానాఁడు విశ్వములో నుండు సకలజవము నాధారముగఁ జేసికొని వికాసము నందుచున్నదో, అది వ్యక్తమైనది. కావున దాఁగియుండునది యవ్యక్తము; ప్రకాశించునది వ్యక్తము. బీజమం దనేకశక్తిపుంజములు ఇమిడియున్నవి; కాననది యవ్యక్తము. ఎప్పు డా బీజము భూమిపైఁ బడి పృథివ్యప్తేజోవాయురాకాశాదులను వ్యవహారమునకుఁ దెచ్చుకొని, బద్ధమై, మొల కెత్తి, విజృంభించుట కారంభించునో, అప్పు డది వ్యక్తము. అది యాకులు వేసి, చిగుర్చుచు, క్రొత్తక్రొత్త కొమ్మలు ధరించిన కొలఁది, దానియం దుండు నవ్యక్తగుణములు వ్యక్తమగును, ప్రకాశించును. అప్పుడే దాని వ్యక్తిత్వము ప్రకాశించుచున్న దందురు, దాని వ్యక్తి నేటపడుచున్న దందురు. దానిని వ్యక్తి యందురు.

కాని, యీ వ్యక్తిభావము నింకను పరీక్షించి చూతము. బీజము బీజాకారమున నున్నపు డది చిన్నది. అది మొలకెత్తి విజృంభించినపుడు దాని యావరణము సాకారము పెద్దవి. బీజమునుండియే వృక్ష మైనను, వృక్షము విస్తీర్ణము; బీజము క్షుద్రము. బరువునందు చూడఁబోయినను బీజవృక్షములకు హస్తిమశకతారతమ్యము. ఈ తారతమ్యము వృక్షవిజృంభణమువలన కలిగినది గదా! బీజము విశ్వశక్తుల నధిష్ఠించి, తత్తచ్ఛక్తుల నంతఃకరణమునందు ధ్యానించి, వానిని వ్యవహారమునకు తెచ్చుకొనుటవలన నీ విజృంభణము గలిగినదని మన మిదివఱకు చూచియుంటిమి. కాని, యిక్కడ నొక జిజ్ఞాస రావచ్చును. బీజశక్తి విశ్వశక్తుల నంతఃకరణమున ధ్యానించి వానిని వశీకరణమునకు తెచ్చుకొనినపు డాయా శక్తిపుంజములు పూర్వమువలె తాము భిన్నభిన్నవ్యక్తులుగ నున్నవా, లేక సకల వ్యక్తులును సమంజసమై, సమ్మిళితమై వృక్ష మను వ్యక్తియందు సమానాధారమును పొంది యేకాత్మతను సాధించినవా? ఒక వృక్షజీవమం దుండు శక్తులు తమలోఁ దాము పోరాటము సల్పుచు, నొకదాని నొకటి మీఱిపోవలయు నని యత్నించుచు, వృక్షవ్యాపకత్వమునకు సంఘాతమును గలిగించుచున్నవా? లేక యన్నియును పరస్పరము సహాయ మొనర్చుకొనుచు వృక్షవ్యక్తిత్వమున కాధారములై, యేకాధారమును పొందియున్నవా? దీనికి జవాబు చెప్పకయే యందఱు గ్రహింపఁగలరు. ఇక్కడ మఱియొక సంగతి నాలోచింపవచ్చును. వృక్షాదులవలె చేతనములు గాక సంపూర్ణముగ జడములగు పదార్థములకు వ్యక్తిత్వ మున్నదా? వృక్షాదులం దేవిధమున సకలశక్తులును తమతమ భిన్నత్వమును రక్షించుకొనుచు వృక్షవ్యక్తికి సాయపడుటకై తమ సర్వస్వమును సమర్పించుకొనుచు, వృక్షాధారమును పొంది కృతార్థత నందుచున్నవో, కేవలము జడములగు మృణ్మయాదులందుఁ గూడ నిట్టి చిద్విలాసమును చూడనగునా? లేక మృణ్మయాదులం దాంతరిక సంపర్కము, సంయోగము, ఏకాత్మత, ఏకాధారత, గానుపింపక కేవలము బాహ్యయోగమే యున్నదా? అనఁగా రాయి రప్ప యిత్యాదులం దాంతరిక స్నేహ ప్రేమ సమ్మేళన భావ మున్నదా? లేక వాని యందుఁ గల భిన్నావయవములు కేవల మొండొంటి బాహ్యమందే యుండి, యేదోయొక బాహ్యాసన్నివేశము చేత బానిసలవలె కట్టఁబడియున్నవా? అనఁగా, నొక

రాష్ట్రముక్కయం దుండు భిన్నాంగములు, ఒక వృక్షము
యొక్క యంగములవలె పరస్పర సుఖదుఃఖములందు
పాలుగొనుచు, నొకదానిబాధను మరియొకటి కూడ
ననుభవించుచు, నొక యంగము వికలమైనపుడు దక్కిన
యంగములు దానిలోటును పూరింప సర్వవిధముల
యత్నించుచు, నొకయంగము వికసించినపుడు తక్కిన
యంగములు గూడ నుత్సాహముతో ప్రేమపూర్ణ
హృదయముతో పూర్ణత్వము పొందుచున్నవా? లేక
యీ యంగముల సంపర్కము కేవలబాహిరమై స్వేచ్ఛ
చేఁ గట్టఁబడినవై, యొండొంటి సుఖదుఃఖములలో
జోక్యము లేక మూఢత్వము నాశించినవా? దీనికి జవా
బును గూడ చెప్పకయే గ్రహింపనగు.

మన మిప్పుడు వితర్కించిన విషయమునందు
మనకు తేలిన మీమాంసను మనసునం దుంచుకొని
మనము ప్రకృతాంశములోనికి దిగుదము. ప్రకృత మిప్పు
డాంధ్రదేశ మెట్టి స్థితిలో నున్నది? ఆంధ్రమాత యేపరి
ణామమును పొందియున్నది? పరతంత్రమునకు లొంగక
యాత్మతంత్రమున కధీనమైన జీవవ్యక్తిస్థితిలో నున్నదా,
లేక యాత్మతంత్రము స్వతంత్రత మన నేమియో యెఱుఁ
గక పరతంత్రమున కధీనమైన జడవ్యక్తివలె నున్నదా?
ఆంధ్రదేశమందు సర్వకళలును గలసి యేకకళ యైనవా?
లేక కళ లన్నియు నొకదాని పోరు ఒక దానికిఁ గిట్టక
యాత్మనాశనమును సల్పుకొనుచున్నవా? ఆంధ్రదేశ
మందుండు శక్తు లన్నియు సమంజసమై, యథాస్థాన
ముల నాక్రమించి, యథాశక్తిగ నాంధ్రమాతృవ్యక్తీ
కరణమునకు తోడ్పడుచున్నవా? లేక పరస్థానముల
నతిక్రమింప యత్నించి, యనధికారచర్చలలోఁ బడి
యాత్మవిస్ఫుటనమునకు భంగము గలిగించుకొనుచున్న
వా? ఆంధ్రదేశవాసు లాత్మసంయమము చేసి యాంధ్ర
మాతృవ్యక్తీకరణమే ప్రధానముగఁ జేసికొని, తమ
సర్వశక్తుల నందుకై వినియోగించుచున్నారా? లేక
యీ మాట మఱచిపోయి, వితండవాదములకు లోనై,
యింద్రియాధీను లగుచున్నారా? ఆంధ్రదేశీయులు స్వా
ర్థము నశింపఁజేసికొని, యాంధ్రమాతృవ్యక్తీకరణము
నందే తమ స్వవికాసము గలదు గాని, దానిని విడిచి
లేదని గ్రహించి మాతృదేవీపరిచర్యలోనే మగ్నులై
యున్నారా? లేక మాతృసేవను మఱచి యహంకార
వశులై, నిజవ్యక్తిత్వము రక్షించుకొనఁబోయి దానిని
నష్టపఱచుకొనుచున్నారా? ఆంధ్రదేశములో నిప్పుడు
పనిచేయుచుండు నుద్యమము లన్యోన్యస్నేహభావ
ముచే బద్ధమై యున్నవా? లేక పైమెఱుంగులై నామ
ధారిణులై, యన్యోన్యసంబంధము లేనివై, పైపై నగురు
మిణుంగురుఁబురుగులై యున్నవా? వే యేల? ఆంధ్ర
దేశమునం దిప్పు డాత్మసంయమయజ్ఞము జరగుచు
న్నదా? లేక ఆత్మనాశకసాధన మగుచున్నదా?

ఆంధ్రప్రవరులారా! రాగమును చెందకుఁడు.
అవికలచిత్తముతో కడవఱకు చదువుఁడు. దేశమందుండు
సకలోద్యమములను మననించి చూడుఁడు! ఆంధ్రదేశ
మందు జరగుచుండు రాజకీయసభ లేమి యాందోళనము
లేమి, సాంఘికసభ లేమి యాందోళనము లేమి, విద్యా
విషయికమైన గందరగోళము లేమి, మతవిషయికసభ
లేమి యాందోళనము లేమి, అంతఃకరణపారిశుద్ధ్య మను
యజ్ఞసాధనమువలన జన్మించినవి కావు; మన నాగర
కము చాలవఱకు పాశ్చాత్యనాగరకముతో డీకొనుట
వలన నశాంతిని పొంది తల్లడిల్లినది; రెండు కెరటములు
భయంకరనాదముతో నెదుర్కొనినపుడు పైపై నురు
గును నీటిబుగ్గలును బైలుదేఱిన ట్లా తల్లడపాటునుండి
పైనఁ జెప్పిన నీటిబుగ్గలవంటి యాందోళనములు బైలు
దేఱినవి. మన తెలుఁగు దేశమందు ప్రకృత మున్న
మండల రాజకీయ సభలు సంఘములు, తాలూకా
సభలు సంఘములు, గ్రంథభాండాగారముల కగు యత్న
ములు, ఇంకను పలువిధములగు నడావిడులు నిందులో
చేరినవే. ఒకవ్యక్తి రెండువిధములుగ కర్మప్రపంచమున
దిగవచ్చును. దేశమున ననేకారిష్టములు గలుగుచున్న
పుడు దేశమునకై జాలిచెంది తాత్కాలికదయార్ద్రభావ
ముచే తాడితుఁడై, దరిగానక కర్మలో మునుఁగవచ్చును.
ఇట్లు చేసినపు డితని చిత్తమును భావమును జ్ఞానమును
సమంజసమై, సమాధియోగమం దేకాత్మప్రతిపత్తిని

పొందకుండమిచే, కొంత కర్మ చేసినపిమ్మట, ఆత్మ వికల
త్వమును పొంది, ఇతఁ డాత్మహారి యగును; ఇతనికి స్వ
ప్రతిష్ఠ పోవును, ఆత్మకేంద్రము హరించును; చివరకు
బుద్ధిహారియై యింద్రియాధీనుఁడై జడుఁడగు నశించును.
కర్మము ననుష్ఠించు విధ మింకొకటి యున్నది. అదియే
ఋజుమార్గము. నూతనభావము లుద్దేశములు జన్మించి
నపుడు వాని కధీనము గాక వానిచే పీడితుఁడు గాక,
వాని నన్నిటిని వశముచేసికొని, వాని నాత్మకేంద్ర
స్థానమునకు పట్టుకొనిపోయి, యక్కడ వానిని గూర్చి
మననము చేసి వానిని జ్ఞానాగ్నిలో దగ్ధముచేసి యేకా
త్మప్రత్యయసారములో జ్ఞానమునకును భావమునకును
గల సమన్వయమును గ్రహించి పరమాత్మప్రేరేపణ
మును పొంది కర్మలోనికి దిగవలయును. ఇట్లు చేసిన
వాఁడే యోగస్థుఁడు, వీఁడు కర్మప్రపంచములోనికి దిగి
నప్పు డాత్మహారి గాక యాత్మప్రతిష్ఠుఁ డగును; కర్మ
చేసినకొలది నాత్మ వికలత్వమును పొందక పరిపూర్ణత
నందుచుండును. మహత్కర్మచక్రములో గిరగిరఁ దిరు
గుచున్నను ఇతఁ డాత్మరాజ్యమున స్వారాజ్యములో
నధివసించును. ఒక రాష్ట్రమునందలి యవస్థయు నిదియే.
స్వదేశము విదేశముతో డీకొనినందుచే నూతనభావము
లుద్దేశములు జనించుట స్వాభావికమే కాని, ఆ రాష్ట్రపు
దేశపుశక్తియంతటితోనే తృప్తిపొంది, పైపైనురుగులతో
నే ఖేలించినయెడల, ఏ క్షీణవాయుసంఘర్షణముచేతనో
యారిపోవునట్టి బుద్బుదమువలెనే, అదియు క్షణికోత్సా
హము పోయినంతనే, యథాస్థానమును చెంది తటస్థమై
మునుపటికంటె నెక్కుడుగ జడత్వమును పొందును.
అట్లు గాక, డీకొనిన శక్తులు రెండును గభీరస్థానమునకు
వొచ్చి, యక్కడ పరమాత్మతో తమ యేకత్వమును
దర్శించి, సమంజసమై, యొండొంటితోఁ గలసి మెలసి
యున్నయెడల నందుండి యొక మహాశక్తి సంభూత
మగును. ఆ శక్తి మునుపటి రెండు శక్తులనుండి యుద్భ
విల్లినదే గాని, వాని చిచ్ఛక్తిసమ్మేళనమునుండి పుట్టు
టచే నూతనమైనది. ఇదివఱ కున్నట్టి రెండు శక్తులు నం
దున్నవి. కాని వీనినుండి పుట్టినది నూతన మగుటచే
దీని శక్తియు నూతనతరము, తీక్ష్ణతమము, అపరిమి
తము, అవర్ణనీయము, మహావిఘ్నభేదకము. దీనిముం
దేదియు నాఁగదు. రసాయనశాస్త్రములో మనము
విన్నట్లు రెండు భిన్నద్రావకములు గలసినపు డందుండి
మహాశక్తి యుద్భవించినట్లే, ఇదియు శక్తిసమ్మేళనము.
మృణ్మయపదార్థ సమ్మేళనమువంటిది గాక చిన్మయ
సమ్మేళన మగుటచే, అది పరిమితము గాక యపరి
మితము. రెండు శక్తులు డీకొనినపుడు పైపైన పుట్టు
నురుగులు మృణ్మయపదార్థసంభూతములవంటివి. అట్లు
గాక యంతరాళమున సమంజసమైనపు డందుండి వచ్చు
ప్రకాశములు, లీలలు, రూపములు చిన్మయసంభూ
తములు.

ప్రకృతము తెలుఁగుదేశమం దింకను నియాంత
రికసమ్మేళనము గావలయును. ఇప్పుడు పాశ్చాత్యనాగర
కత పైపైన నటించిన ట్లున్నది. అది లోనికి పోయి,
మన నాగరకముతో నేకాత్మతను పొందవలయును.
అప్పు డందుండి పుట్టు శక్తులు ఉద్యమములు ఉత్సాహ
ములు ఆందోళనములు ఇప్పు డున్నవానివలె నుండవు.
అవి యెట్లుండఁగలవో మనము చెప్పలేము. చిచ్ఛక్తి
సంభూతము లగునట్టివాని నెన్నడు ననుమానించి నిర్ధా
రణచేయ వీలులేదు. అవి చిన్మయునికే తెలియును.
కాని యవి సర్వాంగసంపూర్ణముగ నుండు నని మాత్ర
ము మనము చెప్పఁగలము. అందు ముందన్నియు నంత
రమునకుఁ బోయి బైటికి వచ్చును; మునుఁకలు వేసి తరు
వాత తేలును. ఆంధ్రదేశమం దేకవ్యక్తి రావలె నన్న-
ముం దాత్మయజ్ఞము గావలెను. ఆ యజ్ఞమునందు
పరిశుద్ధమగు నంతఃకరణమే గుండము. చిచ్ఛక్తియే
యగ్ని. సకలభావములు, తెలుఁగుదేశమం దుండు సకల
వ్యక్తులు—హిందువులు మహమ్మదీయులు క్రైస్తవులు—
తెల్లవారు, నల్లవారు, సకలశాస్త్రములు—వేదములు
బైబిలులు కొరానులు పురాణములు—సకలోత్సాహ
ములు— రాజకీయసంబంధికములు సాంఘికములు మత
సంబంధికములు—ఇత్యాదు లన్నియు నాహుతులు. పర
మాత్మయే యజమానుఁడు. బ్రహ్మయే పురోహితుఁడు,

ఆ యజ్ఞమునుండి సంభూత మగునదే యాంధ్రవ్యక్తి. ఆ యజ్ఞమునం దింకను "స్వాహా" యనుచు ననేకాహుతులు వచ్చిపడును — త్రికాలము లాంధ్రదేశమునకు భాగ్యదేవత లగు రారాజులు, మహాకవులు, మహాభాగవతులు, యోగులు, జ్ఞానులు, సాధుపుంగవులు, పోతనాదులు, తిక్కనాదులు, మన దేశమందు పుట్టిన పరదేశసాధువులు, వారి సాధనసంపత్తి సమునదయమును, మరియు గణనాతీతములగు ననేకద్రవ్యములు నందు పడును. ఇట్టి మహాయజ్ఞసంభూత మైనదే యాంధ్రవ్యక్తి యగును. దానికే సహజవ్యక్తిత్వము, ఏకత్వము నుండును. దానిలోనే భిన్నత్వమందు సమన్వయము గానంగును. ఇది లేకయే యిట్టి యజ్ఞసంభూతము కాని దానినే వ్యక్తి యనుటకు వీలు లేదు. అం దేకత్వముండదు. అం దేకాత్మీయత సంభవింపదు. ప్రేమ యుండదు. కల్లోల మెక్కువ. భేదభావ మెక్కువ. విరోధము మెండు.

ఏ యాంధ్రవ్యక్తి యిట్టి మహాయజ్ఞసంభూతమో యాది సర్వగ్రాసి. అది భారతవర్షమం దుండు సకలనాగరకములను మ్రింగివేయును; పృథివిని తన యుదరమం దుంచుకొనును. దాని భక్తిప్రవాహములో నందఱు కొట్టుకొనిపోవుదురు; దాని కర్మకు మితి యుండదు; దాని జ్ఞానమున కేదియు నాగదు; అది సమస్తప్రపంచముతో యోగమును చెందియుండును; ఏకాత్మతను సాధించును; అది సంపూర్ణముగ స్వాధీన మైనది. దాని వచనములను సమస్తపృథివియు వినును. ఆ వ్యక్తియందు బమ్మెర పోతన నూతనభాగవతమును వ్రాయును; నూతనభక్తిప్రవాహము పారునట్లు చేయును. తిక్కన ఘంటము నూతనభారతమును సృష్టించును; దాని శైలి పూర్వపుదానిని సహస్రవిధముల మించును; దాని భావము ఘనిష్ఠతరమగును. విద్యారణ్యుఁడు ఋగ్వేదమునకు పూర్వముకంటె గభీరతరార్థమును జెప్పఁగలఁడు; నూతనసాయణాచార్యభాష్యమును వ్రాయఁ గలఁడు. ధర్మము స్థాయితర మగును. వైష్ణవము శైవమును కౌఁగిలించుకొనును; వైదికము నియోగము నాలింగనము చేసికొనును; శూద్రులు బ్రాహ్మణు లగుదురు; భూదేవతులు స్వర్గదేవత లగుదురు. వాణిజ్యము వ్యాపారము హెచ్చును; రాఁబడి యెక్కువగును. ఆంధ్రులు భుజబలమున నందఱిని మీఱిపోదురు; ఆకారమందు మోహనాకారు లగుదురు. ఎక్కడ చూచినను సంపూర్ణతయే గానిపించును; సర్వాంగసంపూర్ణతవైపునకే దృష్టి యొగ్గును; ధర్మము నీతియుఁ గలసియుండును; యోగము భక్తియు బెండ్లియాడును; కర్మము జ్ఞానము నైక్యము నందును; ఆ యాంధ్రవ్యక్తియే వ్యక్తి; ఆ యాంధ్రరాష్ట్రమే రాష్ట్రము; తక్కన రాష్ట్రము రాష్ట్రముగాదు.

ఆంధ్రులారా! మదీయసోదరులారా! రండు. ఇట్టి మహాయజ్ఞమును వేల్చెదము రండు! దానికి తగిన యాయోజనము చేసికొనెదము రండు!! సిద్ధ మయ్యెదము; ఆత్మయందు పారిశుద్ధ్యమును నెలకొల్పెదము; అపుడు పరమాత్మ మనలోని కవతరించి మనలఁ దరింపజేయును. ఓహో! అల్పముతో తృప్తి యేల! పూరింటియందు సంభ్రమ మేల! అంతఃకరణశుచిత్వ మను నగ్నిని రగులఁజేసి యా పూరింటిని తగులఁబెట్టుఁడు. తగులబెట్టి యాశ్మశానముపై నూతనగృహనిర్మాణము చేయుఁడు!! తథాస్తు !!!

# ఆంధ్రుల దేశసేవ

చల్లా శేషగిరిరావు గారు, బి. ఏ.

ఆంధ్రోద్యమమునకు రూప మొసఁగినది ఆంధ్రమహాజనసభయే. ఆంధ్రమాతృసందర్శనమునకై వివిధభాగములనుండియు ఆంధ్రు లందఱు నొక్కచోటఁ గూడుచున్నారు. ఆంధ్రు లందఱు తా మొక్క సంఘమునకుఁ జెందినవార మనియు, ఆంధ్రభాషయే మాతృభాషగాఁ గలవార మనియు, సామాన్యసంప్రదాయములు గలవార మనియు, హైందవజాతియందు బలమగు నొక యంగముగ నేర్పడనున్నార మనియు తెలిసికొనఁ గలుగుచున్నారు. తమ నిజస్వరూపమును దర్శింపఁ గలుగుటయే ఆంధ్రమహాజనసభయొక్క ముఖ్యోద్దేశము. ఆంధ్రులే గాక ఆంధ్రేతరులు గూడ, ఆంధ్రభాష మాటలాడు నొక సంఘమువారు గల రనియు, వారు రెండుకోట్లమంది గల రనియు, వారు ప్రాచీననాగరకమం దే దేశమువారికిఁ గాని యే సంఘమువారికిఁ గాని తీసిపోరనియు, ఆంధ్రులు గూడ తగిన యభివృద్ధి నొందినఁ గాని హైందవజాతి బలపడనేర దనియు, ఆంధ్రోద్యమము ద్వేషజనితము గాని సదుద్యమ మనియు, ఆంధ్రులలో నూతనవికాసము గలుగుట హైందవు లందఱకు క్షేమకర మనియు, ఆంధ్రరాష్ట్రము ఆంధ్రవిశ్వవిద్యాలయము జాతీయతకు భంగకరములు గాక పోషకము లనియు మెల్లమెల్లగా తెలిసికొనఁగలుగుచున్నారు. నెల్లూరిలో జరగిన రాజధానీసభయం దీ విషయమై చర్చ రాఁగా, విషయనిర్ణాయకసభలో ఆంధ్రరాష్ట్రమును గూర్చి తీవ్రమైన వాదప్రతివాదములు జరగెను. ఆ చర్చయందు ద్రావిడులు గూడ ఆంధ్రరాష్ట్రమును గూర్చి తమ కుండిన యపోహములు భ్రమప్రమాదజనితము లని యొప్పుకొనవలసివచ్చెను. గతదేశీయమహాజనసభయొక్క ఆహ్వానసంఘకార్యదర్శులను, భాష నాధారపఱచుకొని హిందూదేశమును విభజించుట యుక్త మను తీరుమానమును కాంగ్రెసులో ప్రవేశపెట్టుటకు, ఆంధ్రమహాజనసభయొక్క స్థాపితోపసంఘపు కార్యదర్శి గారు కోరియుండుట యెల్లరకు తెలిసినవిషయమే. అందుపైని కొంత కలవరము దేశమునందు కలిగినది; వివిధరాష్ట్రములలోని పత్రిక లీ విషయమును గూర్చి చర్చించినవి. మొత్తముమీఁద ఆంధ్రోద్యమమును గూర్చి యామోదమునే తెలిపినవి. జాతీయవాదుల యభిప్రాయములను వ్యక్తీకరించు "మరాటా" పత్రిక రాష్ట్రవాదమునెడల సంపూర్ణామోదమును తెలిపినది. మదరాసులో ఆంగ్లేయులచే నడపఁబడు "మదరాసు టైమ్సు" పత్రికగూడ అంగీకారమును స్పష్టపఱచినది. దేశీయమహాజనసభలో విషయనిర్ణాయకసభయందు కొందఱాంధ్రప్రముఖు లీ తీరుమానమును ప్రవేశపెట్టుటకు యత్నించిరి కాని, దేశీయమహాజనసభను నడపుచున్న ప్రాఁతనాయకులు నూతనపక్ష మనిన బెదురుదురు. తమ ప్రాచీనపద్ధతులనుండి యొక యడుగయినను అవతలఁ బెట్టుటకు వెఱతురు. సంఘసంస్కరణ మనిన పూర్వాచార పరాయణుల కెట్టి భీతియో, ప్రజాభిప్రాయమునకనుగుణ్యముగా చట్టములను మార్చుకొనుటకు స్థానికాధికారుల కెట్టి కష్టమో, కాంగ్రెసు పద్ధతులలోఁ గాని తీరుమానములలోఁ గాని నూతనమార్గముల ననుసరించుటకు బాధ్యత గల నాయకుల కంత కష్టముగ నుండును. నూతనాదర్శములు కలిగి, నూతన వాంఛలు దినదినప్రవర్ధమాన మగుచున్న యిక్కాలములో, ఇరువది సంవత్సరముల క్రింద కాంగ్రెసుయొక్క ప్రారంభదినములలో విద్యార్థులకుఁ గల యభిప్రాయములనే యీ దినమువఱకుఁ గూడ నవీనవిద్యార్థుల మీఁద బలవంతముగ ప్రయోగించుట, బైబిలులోఁ జెప్పినట్లు క్రొత్త మద్యమును ప్రాఁత బుడ్లలోఁ బోయుట వంటిదే! యువకుల యాదర్శములను గూర్చి యాలోచించుటకైనను వీరికి సహనము లేదు. ఇట్టి యసహనమే సూరతులో జరగిన దేశీయమహాజనసభయొక్క భంగపాటునకు కారణము. కాల మెల్లపుడును మార్పు చెందుచున్నది. సృష్టిలో నీ సత్యము మన కెపుడును పొడగట్టుచునే యున్నది. స్థిరత్వము జడత్వమునకు కారణమగును గాని, యభివృద్ధికి కారణము గానేరదు. ప్రపంచములో నిక్కాలమునఁ గలుగుచున్న పరిణామమును గమనించి, హిందూదేశమునందు వివిధ సంఘములలో మొలకలెత్తుచున్న నూతన సంచలన

ములను గణనచేసి, బహువిధము లగు నుద్యమముల నిమిత్తము, యభివృద్ధి కాటంకము గాని పథములను గూర్చి ప్రతివత్సరమును దేశీయమహాజనసభలో ప్రముఖు లందఱు చేరి యాలోచించుట యత్యుత్కృష్ట ధర్మము. స్వపరిపాలనయు రాష్ట్రస్వాతంత్ర్యమును మన నాయకులు గోరుచున్నారు. రాష్ట్రస్వాతంత్ర్యము నాధారము చేసికొని స్వపరిపాలన గోరుటకు ముందు కొంచె మాలోచన చేసినయెడల, మున్ముందు భాషల నాధారము చేసికొని దేశము నంతను రాష్ట్రములుగ నేర్పఱచిననే కాని, రాష్ట్రస్వాతంత్ర్యము సుస్థిరముగ నుండఁజాల దని శోచకమానదు. కాని యీ వత్సరమే కాంగ్రెసులో రాష్ట్రపు తీరుమానమును గూర్చి యాలోచింపలే దని మనము విచారింపవలసిన యవసరము లేదు. కాలము పరిపక్వము కావలెను. దేశములో నీ నూతనసందేశ మింకను బాగుగ ప్రబలవలెను. అపుడు గాని మన నాయకులు త్వరపడరు.

ఆంధ్రోద్యమ మింతవఱకును ఆంధ్రదేశములో జనింపఁజేసినది యుత్సాహము మాత్రమే. ఇంకను ఈ యుత్సాహము ప్రతి పల్లెలోను పట్టణమునందును వ్యాపింపవలెను. మొత్తముమీఁద ఆంధ్రు లెల్లరును ఆంధ్రరాష్ట్రము నామోదించినవారే. నెల్లూరివారును దత్తమండలములవారును గూడ, రాష్ట్రాదర్శ మనిన ఉత్సాహభరితులై యున్నారు. కాని, యుత్సాహ మున్నంత మాత్రముననే, ఏ యుద్యమమును ఫలవంతము కానేరదు. కార్యరూపమున పరిణమింపని యుత్సాహము త్వరలో నస్తమించును. ఇంతవఱకును ఈ నూతనోద్యమము కార్యరూపమును ధరించుటకు తగిన యత్నములు జరగలే దనుట సువ్యక్తము. సంచారకార్యదర్శు లిద్దఱిని నియమించుటతో మాత్రము తృప్తి కలిగెను. ఇట్టి స్థితికి రెండు కారణములు గానుపించుచున్నవి. ప్రస్తుతము ప్రపంచము నుఱ్ఱూఁత లూఁగించి ప్రళయ కాలమును స్మరింపఁజేయుచున్న మహాసంగ్రామము ప్రథమకారణమై యుండనోపు. అన్ని జాతులవారివలెనే ఆంధ్రులును ఆంగ్లేయప్రభువు లీ దారుణసంగ్రామమునందు జయమొంది జర్మన్యుల బారినుండి ప్రపంచమును రక్షించెదరుగాక యని తదేకనిష్ఠతో భగవంతుని ధ్యానించుచున్నారు. వారి మానసము లన్నియు ఈ సంగ్రామము మీఁదనే కేంద్రీకరింపఁబడియున్నవి. వారును తక్కిన హైందవులతోఁబాటు సాయము చేయుచున్నారు. సంగ్రామానంతరమునఱకుఁ గూడ సాయము చేయుటకుద్యుక్తులై యున్నారు. అందువలన ఆంధ్రోద్యమము వారికి ప్రియమైనను, ప్రియతరమైన ఆంగ్లేయ విజయప్రాప్తి వారి మనోవీథియందు ప్రధానస్థాన మాక్రమించి యున్నది. రెండవ కారణము ఆంధ్రమహాజనసభ యొక్క స్థాపితోపసంఘసభ్యుల యుదాసీనతయై యుండవచ్చును. సభ్యు లందఱును కలసి యైకమత్యముతో పని చేయుటకన్న నొకరిమీఁద నొకరు అన్యాపదేశముగ నిందలు మోపుటతో కాలము గడపుచుండుట శోచనీయము. కార్యదర్శిమీఁదనే యీ యశ్రద్ధాకారణమును మోపుట సరి కాదు. ప్రతి సభ్యుఁడును కార్యభారము తనదియే యని గుర్తెఱిఁగి కార్యమునకుఁ గడంగుట ధీరలక్షణము. సభ్యులే గాక ప్రతి యాంధ్రుఁడును, సభ్యుఁడైనను గాకపోయినను, ఆంధ్రోద్యమవ్యాప్తికి తగు సాయము చేయుట తన విధి యని గమనింపవలెను. అపుడు గాని యాంధ్రోద్యమము మూలమూలలకుఁ బ్రాఁకి ఆంధ్రులలో సంపూర్ణవికాసమును కలిగింపఁజాలదు. అపుడే ఆంధ్రు లున్నతస్థాన మాక్రమించి హిందూదేశమునకు మార్గదర్శులు కాఁగలుగుదురు. అట్టి తరుణమునందే ఆంధ్రులు స్వపరిపాలనాస్వాతంత్ర్యము ననుభవించి సుఖింపఁగలుగుదురు.

రాఁబోవు ఆంధ్రమహాజనసభ కాకినాడపట్టణములో జరగనున్నది. ఆ సభలో ఆంధ్రోద్యమము కార్యరూపమును దాల్చుట కెట్టి మార్గము లవసరమో, ఆంధ్రప్రముఖులు బాగుగ నాలోచించి వానిని గూర్చి తీరుమానింపవలసియుందురు. మాటలకన్న కార్యమే యీ తరుణమున నెక్కువ యవశ్యము. ఆంధ్రరాష్ట్రము ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆంధ్రులకు లభించుటకై దృఢమగు ప్రయత్నములను చేయవలెను. గమ్యస్థానమునకు చేరుట సులభము కాదు. సంవత్సర మంతయు పని జరగవలెను. ప్రయత్నములు విఫలము కావచ్చును; నిరుత్సాహపడ నవసరము లేదు. సత్యము మన పక్షమం దున్న దని నిశ్చయించినపుడు ఎన్ని కష్టములు సంప్రాప్తించినను, ఎడతెగక పని చేసినయెడల, విజయము ధ్రువముగ కలుగును. కార్యసాఫల్యమునకై ఏయే మార్గము లవలంబించుట యుక్త

మో నాయకులును అనుభవశాలులును ఇప్పటినుండియు ఆలోచన చేసి సభాకాలమందు చర్చించి ఐకమత్యముతో పనిచేయుట దేశాభివృద్ధికి సాధనము. ప్రతి జిల్లాలోను ఆంధ్రసంఘము లుండవలెను ప్రతిసంఘమునకు కార్యదర్శి యొక రుండవలెను. కార్యదర్శు లందఱు మహాసభయొక్క యుపసంఘములో సభ్యులుగ నుండవలెను. ప్రతి జిల్లాలో ఆంధ్రోద్యమమును వ్యాపింపఁ జేయుటకు ఈ కార్యదర్శులు జవాబుదారీ వహింపవలెను. ఆంధ్రసంఘము ప్రత్యేకముగ స్థాపించుటకు వీలులేని చోటులందు జిల్లాసంఘమే యీ పనిని నిర్వహింపవచ్చును. కార్యదర్శి యావత్కాలము దేశసేవకు వినియోగించుట కుద్యుక్తుఁడై యుండవలెను. దేశాభిమానము గల యువకులును విద్యార్థికులును ఆంధ్రదేశములో అనేకు లున్నను, ధనలోపమువలన వారిట్టి కార్యములను పూనుకొనుటకు శక్తి కలిగియుండరు. అట్టివారికి ఆంధ్రనిధినుండి యుపకారవేతన మిచ్చి వారిని ప్రోత్సాహము చేయుట ఉపసంఘమువారికి కర్తవ్యము. ఇట్లు సంవత్సరాదినుండియు సంవత్సరాంతమువఱకు ఆంధ్రోద్యమవ్యాప్తికై పనిచేసిన యెడల మన యాదర్శము త్వరలో ఫలోన్ముఖ మగును. ఉపసంఘ కార్యదర్శి యీ జిల్లాసంఘకార్యదర్శులు తిన్నగ పనిచేయుచుండునట్లు తనిఖీ చేయుచుండవలెను. తగిన యాలోచనలు చేసి ఆంధ్రమహాజనసభలో కార్యసాఫల్యమునకై చర్చ జరగించుటకు ఆంధ్రనాయకులు ప్రార్థితులు. ద్వేషభావము తొలఁగఁదీసి యొకరి నొకరు గేలిసేసి యవమానపఱచుటకు యత్నింపక ఆంధ్రు లందఱును గమ్యస్థానమును జేరుటకు కృషి చేసెదరుగాక !

## II చట్టి నరసింహారావు గారు

ఆర్యావర్తమం దుద్భవించిన నూతన జాతీయ జీవన వాతావరణ తీవ్ర విజృంభణముచే నలు దిశల పంపఁబడిన మత సాంఘిక రాజకీ యాందోళనా నీలమేఘములు, ఆంధ్రదేశాకాశమంతయు నావరించి చీఁకటులఁ జిమ్ముచున్నవి. ఆంధ్రులు దరి ద్రోవ కానకున్నారు. అట్టితఱి నవీనాంధ్రోద్యమ శీలలవాయు సంచలనంబుచే మేఘమండలి యొకింత కదలఁబాఱి వర్షించినఁ గాని, ఆకసము నిర్మలమై యుండదు, ఆంధ్రదేశము సస్యపరివృతంబై, పుష్పఫలపూరితంబై, నేత్రోత్సవంబై యుండనేరదు. కావున, భగవదాజ్ఞచే నాంధ్రోద్యమము పునర్జీవితమై వృద్ధి నొందుచున్నది. ఈ యుద్యమము ప్రత్యణువునందును వ్యాపించియున్నది. ఈ వ్యాప్తికి పరిమితి లేదు. మానవకోటిని చలింపఁజేయుచున్నది. ఒకప్పుడు వ్యతిరేకాభిప్రాయము లొసంగువారు, మఱొకప్పుడు ఈ యుద్యమము సర్వమానవసమ్మత మని యంగీకరించుచున్నారు. సామాన్యోద్యమ మైనయెడల, మొగ్గయందే పురుగు ముట్టియుండెడిది. సర్వవ్యాపకం బగు నీ యాంధ్రోద్యమము, తనకెన్ని యిక్కట్టులోనఁగూడినను, ప్రత్యణువునందును వ్యాపించి, తొలుదొల్త కొందఱు వ్యతిరేకాభిప్రాయులుగ నుండినను, వారిని తుద కొడఁబడునట్లు చేయుచున్నది అందును నీ యుద్యమము ఆధ్యాత్మికచలనముగాని కేవలము మానవనిర్మితము కాదు మానవుఁడు దైవసందేశమును దెచ్చుటకు నిమిత్తమాత్రుఁడు. ఎప్పుడైనను ధర్మము మానవముఖంబునుండి వెలువడును. ఇది దైవనిర్మితము! స్వభావము! అట్లు వెలువడు వచనంబులే పరమవాక్యములు! వేదాదివచనంబులును నట్టే! తొలుదొల్త ఇట్టి యుద్యమములు పరిహాసమునకు పాల్పడును.

కారణము అనుభవసిద్ధంబు. ఒకనికి రుచించినది మఱొకనికి చేఁదగును ఒకనికి చేఁదగునది వేఱొకనికి మధురముగ నుండును. ఒకని నేత్రంబులకు శృంగారముగ నున్నది యింకొక్కనికి దుఃఖభాజనముగఁ గనఁబట్టును. ఒకని కర్ణపుటములకు శ్రావ్యముగ నున్నది మఱొక్కనికి చెలనొప్పిగ నుండును. ఒకరి భావము మఱొకరికిఁ గిట్టదు. ఒకని సలహా వేఱొకనికి గొంతుకోఁతవలె నుండును. ఇట్లు భేదభావములతోను భిన్నభిన్నతత్త్వములతోను ప్రపంచకము చిత్రవిచిత్రపరిణామములకు లోనైయున్నది. నిమిషనిమిషమునకు నద్భుతమైన మార్పులీ సృష్టియందుఁ గన్పించుచున్నవి. నిన్న ఉన్నది నేఁడు లేదు. నేఁ డున్నది రేపు ఉండదు. రే పున్నది మాపు లేదు. జలభాగము భూభాగముగను భూభాగము జలమయముగను మాఱుచున్నవి. ఈ రీతినే వివిధములైన మార్పులను మన మనుభవించుచుఁ జూచుచున్నాము. కాలపరిణామము లెట్లున్నను, ఫలకారి అయినను గాకున్నను, మానవుఁడు ప్రయత్నములు చేసితీరవలయును.

హిందూదేశమున నూతనజాతీయజీవ ముద్భవించినది మొదలు, వివిధజాతులవారును మేల్కాంచఁజొచ్చిరి. వారివారి సంఘమందుఁ గాని మతమందుఁ గాని రాజకీయవిషయములందుఁ గాని గల్గు లోపములను సవరించుకొనుటకై పాటుపడుచుండిరి. చిరకాలమునుండి నీచదశలో నున్న మాల మాదిగ యెఱుకల యేనాది యాడిగ కమ్మ రెడ్డి మున్నగు శూద్రజాతులవారు, నేఁడు నూతన జాతీయ తత్త్వగీతము చెవి నాట మొదలిడఁగనే, పవిత్రజీవితదశ ననుభవింపవలెనని యెంచి తమ పురోవృద్ధికి తగు మార్గముల నాలోచించుటకు తగు సభలు జరపుచు కృషిచేయుచున్నారు. మనచే నిర్దయగ విడువఁబడి యుపేక్షింపఁబడిన మాలమాదిగలు, మానవజాతియందు పుట్టి మనము చేయవలసిన పవిత్రములగు కార్యములు పెక్కులు గల వని యెంచి, హిందూమతము తమ్మెంత పైకి రానియ్యకుండినను, క్రైస్తవమతావలంబకులై తమ పురోవృద్ధికి పాటుపడుచు సభలు చేయు

చున్నారు. దీనివలన హిందూజాతికి మిక్కిలి నష్టమును, ఒకవిధమున లాభమును కలదు. పంజాబీలు, బెంగాలీలు, మహారాష్ట్రులు, బీహారీలు తమతమ రాష్ట్రాభివృద్ధికి పాటుపడు మార్గములఁ జూచి, ఆంధ్రులు తమ దీర్ఘనిద్రనుండి మేల్కాంచి "ఆంధ్రమహాసభ" నొకదానిని స్థాపించిరి. వీరి పరమావధి ప్రత్యేకాంధ్రరాష్ట్రము, ఆంధ్రవిశ్వవిద్యాలయము.

"నా విష్ణుః పృథ్వీపతిః" అనెడి తత్త్వము ఆంధ్రజాతియందు అంతర్వాహినియై, సదా ప్రవహించుచుండును. ఆంధ్రచక్రవర్తియగు కృష్ణదేవరాయలకు జయాంకమును సముపార్జించినవారు ఆంధ్రులే! మన ప్రభువులకును రాజ్యస్థాపనమునందు ఆంధ్రులు తోడ్పడిరి. అట్టివారు నేడు వెనుకఁబడియుండిరన, మన ప్రభువులకు మాత్రము లోటు గాదా?

ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకముగా నేల కావలెనో, యిటీవల హిందూదేశపత్రికలలో చర్చ పూర్ణముగా జరిగినది. మరల నిచ్చట నా చర్చను జేయుట చర్వితచర్వణము. ఆంధ్రులు నేఁ డాక్రమించిన స్థలము 11 జిల్లాలు. వీరి సంఖ్య 2 కోట్లకు మించియున్నది. ఎల్లరు వాడెడు భాష ఆంధ్రభాష. వీరికిని తక్కిన సంఘములవారికిని ఆచారములు వేఱు, సంఘవ్యవస్థలు వేఱు. వీరు నూతన జాతీయ జ్ఞానతేజము గాంచి, తమ లోపముల రూపుమాపఁగడంగిరి. వేషభాషలు, ఆచారవ్యవహారములు, మత సంఘ వ్యవస్థలు, ప్రవర్తనములు, జీవనోపాయములు వేఱువేఱుగాను భేదముగాను నుండిన జాతులను కలపి పరిపాలించుట, పాలితులకును పాలకులకును మిగుల కష్టము. ఒకరును వృద్ధి పొందలేరు. వేర్వేఱుగా సర్వవిధముల వృద్ధి పొందిన వెనుక, ఏకజాతీయతకు కలసి పాటుపడుట తేలికగా నుండును. అందుకే భాషాప్రయుక్త రాష్ట్రవిభజనము హిందూదేశమున అవసర మని ఈ యాంధ్రోద్యమతత్త్వము చాటుచున్నది! ఆ హిమవత్పర్వత రాజశిఖరమునుండి పినాకపాణియొక్క ఓంకారనినదమా అన్నట్లు మన రాజప్రతినిధి గారు హిందూదేశమున భాషలను బట్టి రాష్ట్రవిభజనము చేయు టావశ్యక మను సందేశమును స్పష్టముగ వెల్లడించిరి. మరియును ఆంగ్లరాజ్యనీతిజ్ఞులు కర్జను, హార్డింజు సెన్సు, స్ట్రాకీ, కాటను, బ్రైటు మున్నగు రాజకార్యధురంధరులు, ఆయాభాగములలో మాటలాడు భాషలను బట్టి రాష్ట్రముల నేర్పఱిచిన, పాలనాసౌకర్యము గలిగియుండు ననియు, ఇంకను పైఁగా సంపూర్ణాంతఃపరిపాలనాధికారము నాయా భాగముల ప్రజల కొసంగవలె ననియు, దృఢముగా చెప్పియున్న సంగతి పత్రికాపాఠకులకు విదితమే! ఇంతకన్న రాజ్యాంగతంత్రజ్ఞులు వే ఱెవరు కలరు! భాషాప్రయుక్తరాష్ట్రవిభజనము శీఘ్రకాలములోనే జరగఁగల దని చెప్పుట కిది చాలదా?

ఆంధ్రజాతీయజీవితము నిన్న మొన్నటివఱకు గ్రీష్మఋతువుయొక్క తీవ్రమైన గాడ్పులచే పండఁబాఱి ఆకులు వడలి రాలిన మోడువలెఁ గాన్పించె. ఆంధ్రరాష్ట్ర వసంతాగమ సందర్శనమహోత్సాహంబున, లోనఁ దాఁగి ముడుచుకొనియున్న చిగుళ్లగు తీవ్రశక్తులు బయల్పడి లోకమున కెంతో యుపకారము చేయ నుద్యమించియున్నా మని తమ రక్తవర్ణ నేత్రంబుల కాంతులు ప్రసరింపఁజేసె. చూపఱ నేత్రంబులకు ముదంబు గలిగె. చిత్రకారుని హృదయము నాకర్షించునట్టి సొగసుల పుట్ట యయి చిగురొత్తి, పుష్పించి, ఫలముల నియ్యనున్న క్రొమ్మావిగున్న యగు నవీనాంధ్రోద్యమమును జూచి యే మానవుని యుల్లము పల్లవింపకుండును? ఆంధ్రరాష్ట్ర వసంతాగమ సందర్శనంబున కోనయూపిరితో నున్న శుకపికశారికావళుల కలకలనినాదములు వాద్యములయి, మోడులవలె నున్న ఆంధ్రులను 'నిద్రనుండి లెండు లెం' డని వీనుల విందు గొలుపుచు మేల్కొలుపులు పాడుచుండ, ఏ మానవుండు కలవరములోఁ గూడిన నిద్ర ననుభవించును? ఆంధ్రరాష్ట్రవసంతాగమసందర్శనమున, ఆంధ్రజనమానససరోవరంబులు, పుష్పలతాపరివేష్టితంబులై వికసితపద్మపరిమళమయంబులై ఆనందమును తాము పొందుచు, "మావలె బాగుపడుఁ" డని చూచువారలకు నీతిని ఆశను గలుగఁజేయుచున్నవి!

ఆంధ్రరాష్ట్ర వసంతాగమసందర్శనమహోత్సవంబున ఆంధ్రయువజనపిక సంతానంబులు కడుపార మేఁత దొరకు నని నిండాశతో నుండి రుతములు సల్పుచున్నవి. వాని గీతము లాలకింపఁబడుచున్నవి. వసంతుఁడు సంతసించి సత్వరంబుగ ఫలముల నియ్యఁగలఁ డని యాశ జనించునట్లు పువ్వులు రాలి కాయలు కాచుచున్నవి. ఋతువు లొకే తీరుగ నుండవు కదా! కాలచక్రము తిరిగిన కొలఁది ఋతుధర్మములు మాఱుచుండును, మార్పులు గలుగుచుండును. ఈ స్వాభావికతత్త్వరహస్యమును గ్రహించినవారు ఆంధ్రరాష్ట్రోద్యమమున కడ్డము రారు! ఆంధ్రోద్యమము నూతన వికాసములతోను మార్పులతోను చిత్రవిచిత్రకల్పనలతోను దైవవశంబున పునర్జీవితమై విజృంభించుచున్నది. ఆంధ్రరాష్ట్రప్రశంస లేని ఆంధ్రోద్యమము, చైతన్యము లేని శరీరము! చైతన్య ముండినఁ గాని శరీరాంతర్భాగములు తమతమ విధ్యుక్తకర్మములందు వర్తించుచు మానవునకు సుఖము కలుగఁజేయ నేరవు! అట్లే భాషాప్రయుక్తరాష్ట్ర-విభజన ముండినఁ గాని జాతీయ జీవిత మభివృద్ధి పొంది, జాతి కంతకును సౌఖ్యజీవన మేర్పడ నేరదు. రాష్ట్రనిర్మాణమైనవెంటనే సర్వకళాశాలలు కర్మాగారములు వాణిజ్యము మున్నగు విషయములయందు మార్పులు విధ్యుక్తముగా జరగును. కావున భాషాప్రయుక్త విభజనము పాలకులకును పాలితులకును సర్వవిధముల సౌఖ్యదాయకము. భాషను బట్టి గాని దేశవిశాలమును బట్టి గాని ప్రజాసంఖ్యను బట్టి గాని చెల్లించు శిస్తుమొత్తమును బట్టి గాని జాతియం దుండు మతసాంఘికాచార వ్యవహార వ్యవస్థల ననుసరించి గాని, ప్రత్యేకాంధ్రరాష్ట్ర మవసర మని ప్రభుత్వమువారికి ప్రజోద్దేశమును మహాజరుల మూలమున తెలియఁజేసి, మన కష్టములను నివృత్తి చేసికొనవలెను. ఆయా జిల్లాలయం దుండెడి విద్యార్థు లీ తత్త్వమును జనసామాన్యమునకు విప్పి చెప్పి, సంఘముల నేర్పాటు గావించి వేలకొలఁది లక్షలకొలఁది మహాజరుల ద్వారా "ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణ" మవసర మని పాలకులకు నివేదించుట యవశ్యము.



MEDICAL SCHOOL: VIZAGAPATAM

గవర్నమెంటు మెడికల్ స్కూలు విద్యార్థులు. విశాఖపట్టణము



NATIONAL SCHOOL: RAJAHMUNDRY

జాతీయవిద్యాలయము, రాజమహేంద్రి

W

SOME ANDHRA MEN OF LETTERS



ఆంధ్రవిద్వాంసులు, శతావధానులు

TAYLOR HIGH SCHOOL, NARSAPUR: TEACHERS



నరసాపురం టైలరు హైస్కూలు, ఉపాధ్యాయవర్గము

# ఆంధ్రుల విద్యావ్యాపకము

వేమూరి విశ్వనాథశర్మ గారు, ఎమ్. ఏ.

విద్యావ్యాపకమున నాంధ్రులు వెనుకబడి యుండిరనుటకు సందియము లేదు. 1911-వ సంవత్సరములో వేసిన జనాభా లెక్కల ప్రకారము మన రాజధాని యందు స్త్రీపురుషులు కలసి 1000 కి 75 మంది వ్రాయను చదువను నేర్చినవా రుండిరి. రాజధాని మొత్తము మీఁద పురుషులలో వేయింటికి 138 మంది చదువ నేర్చినవారు గలరు. వేయి మంది స్త్రీలలో 13 గురు మాత్రమే విద్యావతు లుండిరి. ఈ లెక్కలను బట్టియె మన రాజధానిలో విద్య చాల తక్కువ యని స్పష్టము కాఁగలదు. అందులో గ్రుడ్డిలో మెల్ల యని యఱవ జిల్లాలు తెలుఁగు జిల్లాలకంటె నించుక మేలుగా నున్నవి. రాజధానిమొత్తమున వేయింటికి 377 గురు తెలుఁగువా రున్నారు. పచ్చము తెలుఁగు జిల్లాలు తొమ్మిదియె యైనను, గంజాము చిత్తూరు జిల్లాలు కూడ నాంధ్రమండలములోనే చేరును. ఈ రెండు జిల్లాలలో నాంధ్రులే యెక్కువగ నున్నారు. జిల్లావారీగా విద్యావంతుల సంఖ్యలు మదింపువేసినయెడల తెలుఁగు జిల్లాలలోనివె మిక్కిలి తక్కువగ తేలుచున్నవి.

మన రాష్ట్రములోని గంజాము విశాఖపట్టణము గోదావరి జిల్లాలయందు కొంతవఱకు ఏజన్సీ (మన్యము) భాగము లున్నవి. ఈ యేజన్సీలలో 1000 కి 40మంది యైనను విద్యావంతులు లేరు. విశాఖపట్టణము అనంతపురము జిల్లాలలో నూటికి ఆఱుగురు మొదలు తొమ్మిదిమంది వఱకు మాత్రమే విద్య నేర్చినవారు. మిగిలిన తొమ్మిది జిల్లాలలో ఏడు జిల్లాలయొక్క జనసంఖ్యయందు నూటికి 9 మంది మొదలు 11 గురు మాత్రమే చదువ నేర్చినవారు గలరు. ఆంధ్రరాష్ట్రమున కంతకును గంజాము కృష్ణా జిల్లాలలో మాత్రము నూటికి 11 మంది మొదలు 15 గురు వఱకును విద్య నేర్చినవా రున్నారు. దక్షిణాదిని సేలము జిల్లాలో తప్ప మఱియెచ్చటను నూటికి 15 మందికి తక్కువ విద్యావంతులు లేరు. ఐదు జిల్లాలలో నూటికి 23 గురికంటె నెక్కువమంది విద్యావంతు లున్నారు. పురుషుల విద్యాస్థితి యిట్లుండఁగా స్త్రీవిద్య విషయమై చెప్పనక్కఱలేదు. ఆంధ్రరాష్ట్రములో మూఁడు జిల్లాలయందు 1000 మంది స్త్రీలలో విద్య వచ్చినవారు ఆఱుగురికి తక్కువ; నాలుగు జిల్లాలలో 1000 కి 8 మంది గలరు; రెండు జిల్లాలలో 1000 కి 12 మంది యున్నారు. కృష్ణా గోదావరి జిల్లాలలో మాత్రము అక్షరజ్ఞానము గల స్త్రీలు 1000 కి 17 గురు చొప్పున లెక్కలలోఁ గానవచ్చుచున్నారు. స్త్రీవిద్యయందును కూడ తెలుఁగువారే వెనుకబడియున్నారని జనాభా లెక్కలవలన స్పష్టము కాఁగలదు. ఇట్టి హీనస్థితిలో నున్న మన రాష్ట్రమునందు విద్యావ్యాపకమునకుఁ గావలసిన పరికరములఁ గూర్చియు మార్గముల గుఱించియు నించుక యీ వ్యాసమున వ్రాయఁబడును. ఇప్పటి మన విద్యాస్థితిని బట్టి ఉన్నతవిద్య విషయమై యాలోచించుట ప్రస్తుతము మనవసరము. ప్రాథమికశిక్షావిషయము మాత్ర మిందు విచారింతము.

## ప్రాథమిక విద్యా విచారము

ఆంధ్రుల వర్తమానదశను బట్టి యీ విద్యాసమస్యను నాలుగు భాగములుగ విభజింపవచ్చును: (1) విద్యార్థిదశయందుండఁదగిన బాలురకు విద్య (2) వయసు ముదిరి యక్షరజ్ఞానము లేనివారికి విద్య (3) అంత్యజాతులకు విద్య (4) స్త్రీవిద్య. ఈ విషయమై దొరతనమువా రేమి చేయవలెను? ప్రజ లెంతవఱకు వారికి తోడ్పడవలయును?

## బాలుర విద్య

జనసంఖ్యయొక్క మొత్తముమీఁద నూటికి 15 మంది విద్యార్థిదశలో నుండఁదగినవా రని యందాజాగా దొరతనమువారు మదింపు వేయుదురు. ఈ మదింపు ప్రకారము తేలిన సంఖ్య గల బాలుర కందఱకును ప్రభుత్వమువారు పాఠశాలలను స్థాపించుటకు ప్రయత్నము చేయుచున్నారు. బాలుర విద్య ప్రస్తుతము నలుగురి చేతులలో నున్నది: ప్రభుత్వమువారి స్కూళ్లు; పట్టణములలో మ్యునిసిపాలిటీల స్కూళ్లు, తదితరప్రదేశములలో బోర్డు స్కూళ్లు; ఇవి గాక, గ్రాంట్లతో పోట్ట

పోసికొనెడి పల్లెకూటములు. ఈ పాఠశాలలలో నేర్పునది ప్రథమశిక్ష. అనఁగా నిచ్చటి విద్య నాలుగు లేక అయిదు సంవత్సరములలో పూర్తి యగును. కావున సుమారు 10 సంవత్సరముల వయసు వచ్చునప్పటికి బాలుర విద్య పూర్తి యగుచున్నది. విశేష జనులు పల్లెటూళ్లలో నివసించుటచేత నిట్టి బాలురు పై పరీక్షలకుఁ జదువుట కవకాశము లేదు. ఉన్నతవిద్య యంతయు పట్టణముల నాశ్రయించి యుండుటచే సామాన్యులకు దుర్లభ మగుచున్నది. ఇట్టి స్థితిలో పది సంవత్సరములు పూర్తికాకమునుపే విద్యకు సమాప్తి చెప్పిన పల్లెటూరి వాస్తవ్యులు వయసు ముదిరిన తరువాత అక్షరములు మఱచిపోయినను పోవచ్చును. కాఁబట్టి పల్లెటూరి బాలురయొక్క విద్యార్థిదశ యెక్కువ కావలెను. ఇందుకుఁగాను హాయర్ ఎలిమెంటరీ స్కూళ్లున్నవి. ఇందు ఎనిమిది సంవత్సరముల విద్య కలదు. కాని, యీ పాఠశాలలు ప్రస్తుతము మిక్కిలి తక్కువగా నున్నవి. రాజధాని మొత్తముమీఁద సుమారు రెండువందలకంటె నెక్కువ లేవు. కావున ఎనిమిది సంవత్సరములు విద్య నేర్పెడి పాఠశాలలను విరివిగా స్థాపించి ప్రతి పల్లెటూరికిని ఒక్కొక్క స్కూలు చొప్పున నుండులాగు చేయుట ప్రథమకర్తవ్యము. ఈ కార్యమునందు ప్రభువులకు ప్రజలు తోడ్పడవలసి యుందురు. సాధారణముగ ప్రయివేటు స్కూలులో కంటె గవర్నమెంటు స్కూలులో ఖర్చు జాస్తి యగుచుండును. కాఁబట్టి ప్రజలకుఁ గావలసిన పాఠశాలలన్నియు ప్రభుత్వమువారే స్థాపించునెడల ధనవ్యయము మిక్కుట మగును. ఈ వ్యయమునకై యొకవేళ పన్నులు హెచ్చించినను, ఇంత సొమ్ము ప్రోగగునప్పటికి కాలహరణము గాక తప్పదు. ఇట్టి కాలవిలంబము గాకుండుటకు రెండు మార్గము లున్నవి. ప్రతి యూరను గ్రామస్థులు పట్టుపట్టి సాధ్య మగునంత సొమ్ము ప్రోగుచేసి యొక బడి పెట్టవలెను. ఇట్టి స్కూళ్లకిప్పుడు దొరతనమువారు గ్రాంట్లు విరివిగ నిచ్చుచున్నారు. విద్యార్థులలో తలకు రూపాయ వంతునను ప్రతి యుపాధ్యాయునికి సాలునకు 36 రూపాయల వంతునను గ్రాంటు దొరకును. ఉపాధ్యాయునికి ట్రెయినింగు పూర్తి యైనచో సంవత్సరమునకు 48 రూపాయలు గ్రాంటు వచ్చును. గ్రాంట్లు ఇంతకంటె వృద్ధిచేయుటకుఁ గూడ గవర్నమెంటువారు సంసిద్ధులై యున్నారు. ఇట్టి స్థితిలో ప్రయివేటు స్కూళ్లు పెట్టిన వారికి విశేష నష్టము రాఁజాలదు. అట్టి బళ్లవలనఁ గలిగెడి మేలు అపరిమితము.

కాలయాపనము గాకుండ విద్య వ్యాపించుటకు రెండవ మార్గము భూస్వాముల యౌదార్యము. ఆంధ్రరాష్ట్రములో జమీందారులు విరివిగ నున్నారు. ఈ జమీందారీలలోని జనసంఖ్య గూడ పెద్దదియె. వీరు సాధారణముగ తమ జమీందారులనే ప్రభువులుగ భావించి భయభక్తులతో మెలఁగుదురు. కీడుమేలులకు తమ్మే నమ్ముకొని యున్న రాజ్యములోని ప్రజలకు విద్యాసౌకర్యముల నేర్పఱచుట జమీందారులకు విధియై యున్నది. భూస్వాములు తమతమ జమీందారీలలోని రైతుల పిల్లలకు విద్యాదానము చేయుటకై ప్రతి యూర నొక్కొక బడి పెట్టింపవలెను. ఇట్టి స్కూళ్లకు గవర్నమెంటువారు కూడ గ్రాంట్ల నిచ్చుటచేత జమీందారులకు ఎక్కువగ చేతిసొమ్ము తగులుట కవకాశ ముండదు.

ప్రతి పల్లెటూరను నొక హాయర్ ఎలిమెంటరీ స్కూ లుండవలెనని పైని వ్రాసితిని. ఇంతతో పని ముగియదు. ఈ స్కూళ్లలోని ప్రస్తుతపు కరిక్యులము, అనఁగా బోధనా విషయములు, పూర్తిగ మాఱవలసి యుండును. ఈ స్కూళ్లలో నేర్పెడి విద్య పూర్తిగ మాతృభాషలో నుండవలెను. వ్యవసాయశాస్త్రమును గూర్చి యెక్కువ శ్రద్ధ వహింపవలెను. పాఠశాల వదలునప్పటికి విద్యార్థికి తెలుఁగులో మంచి సాహిత్యము కుదిరి సారస్వతవ్యాసంగమునం దభిరుచి పుట్టుటకు తగిన పునాది యేర్పడవలెను. నవీనశాస్త్రములయందును లోకవ్యవహారములయందును ప్రవేశము కలుగవలెను. మాతృభాషలో నేర్పినయెడల నివి యసాధ్యములు కావు.

### యువజనులకు విద్య

ఇతర నాగరక దేశములలోవలెఁ గాక మన దేశమున కూలి నాలి చేసికొని జీవించెడి జాతులు అజ్ఞానమున మునిఁగియున్నవి. వీరిది రెక్క లాడినఁ గాని రోజులు గడవని యవస్థ. ఇట్టి స్థితిలో వీరిని బాలురవలె సక్రమముగ పాఠశాలలకు రప్పించుట యసంభవము. వీరికి వ్రాఁతకోఁతలు నేర్పుట మన ముఖ్యోద్దే

శము కాదు. జ్ఞానము గలిగించుటయె మన సంకల్పమై యుండవలెను. ఇందుకుఁగాను ప్రత్యేకము వీరికై రాత్రి పాఠశాల లుండవలెను. ఈ పాఠశాలలలో బాలురను జేర్చుకొనఁగూడదు. రాత్రిపాఠశాలలలో విద్య నేర్పు కాలము రోజుకు రెండు మూఁడు గంటల కంటె నెక్కువయుండదు. ఇందు మొదటిగంటమాత్రము వ్రాయుటయు చదువుటయు నేర్పి, తక్కిన రెండుగంటలును గ్రంథకాలక్షేపముక్రిందఁ గడపినయెడల నిప్పటి కంటె నెక్కువ జ్ఞానాభివృద్ధి గలుగును. వీరికి ముఖ్యముగఁ గావలసినది లోకజ్ఞానము. ఇది కథల రూపమున చక్కఁగ మనసున నాటును. దేశచరిత్రము, భూగోళశాస్త్రము, పారిశుద్ధ్యశాస్త్రము, పరిపాలనావిధములు, దొరతనమువారియెడలఁ దమకుఁ గల బాధ్యతలు హక్కులు, వివిధదేశములయందున్న పరిపాలనాభేదములు మున్నగు విషయములు కథల రూపమున నేర్పినచో ముగియును గాని తమంతట తాము పుస్తకములనుండి నేర్చుకొనవలె నన్న జీవితకాలము చాలదు. చాలినను, ఓపిక యుండదు. కథల రూపమునఁ జెప్పినయెడల పైవిషయము లన్నియు రెండు సంవత్సరములలోఁ బూర్తి యగును. ఈలోపున అక్షరజ్ఞానము గలిగి చదువుటయందభిరుచి తప్పక పుట్టును. ఇట్లు రెండేసి సంవత్సరముల కొక్కొక్క తుగిడీవంతున కొలఁది కాలములోనే గ్రామస్థుల కందఱికిని విద్య వ్యాపించుట యసాధ్యము కాదు.

జనసామాన్యముయొక్క విద్యకై గ్రంథభాండాగారములు చేయఁదగిన పనులు చాలఁ గలవు. ప్రస్తుతము గ్రంథభాండాగారోద్యమ కార్య నిర్వాహకులు ప్రతి గ్రామమునందును భాండాగారములు స్థాపించుటకును, ఉపన్యాసము లిచ్చుటకును ప్రయత్నము చేయుచున్నారు. ఈ ప్రయత్నములు నెఱవేఱుటకు కొన్ని మార్పులు గావలసియున్నవి. భాండాగారసంఘపక్షమున ప్రత్యేకించి సాంచారికోపన్యాసకు లుండవలెను. గ్రామమున కొక యుపన్యాసము వంతున నిచ్చినచో నుపయోగ ముండదు గాన, నేదో యొక విషయము పూర్తి యగుదనుక, ఆ గ్రామములో నుండి బోధ చేసినయెడల లాభకారిగ నుండును. భౌతికశాస్త్రాది విషయము లీ సాంచారికోపన్యాసకులు నేర్పఁదగినవి. ఏల యన, విశేషధనవ్యయ మగు పరికరములు ప్రతి పల్లెకూటమునను దొరకుట దుర్లభము. ఒక మ్యాజికు లాంతరు కొనుటకు దాదాఁపు వేయి రూపాయలు గావలసియుండును. ఉపన్యాసకుల దగ్గఱ ఒక్క లాంతరుండినచో ననేకగ్రామములు దాని లాభమును పొందఁగలవు ఇట్లే విశేషము ఖరీదు గల పటములు గ్లోబులు మున్నగు పరికరములు రెండు మూఁడు సెట్లు లుండిన ప్రస్తుత ముపకరించును.

భాండాగారోద్యమ నిర్వాహకులు ప్రతి గ్రామమునను గ్రంథాలయముల స్థాపించుటకు ప్రయత్నింపఁగూడదు. అట్లు ప్రయత్నించినను సాధ్యము గాదు. ఏవో పది పుస్తకములు పెట్టి భాండాగార మనిన లాభ ముండదు. జ్ఞానదాయకము లగు పుస్తకములు మాత్రమే గ్రంథాలయముల నలంకరింపవలెను. ఇట్టి గ్రంథాలయములు ధనసాధ్యములు గాని కోరికెలకును మాటలకును లోపడవు. బెజవాడ రామమోహన పుస్తకాలయమువంటిది ప్రతి యూరను సాధ్యమగునా? అంతమాత్ర మైనను లేని భాండాగారము లున్నను జ్ఞానాభివృద్ధికై లేనివానిలోనే జమ. ప్రతి గ్రామమున పుస్తకాలయములను స్థాపించుటకు ప్రయత్నము చేయుటకంటె గ్రంథాలయములను స్థాపింపలేని-యూళ్లను చందాదారులుగఁ జేర్చుకొని యొక గొప్ప భాండాగారకూటమును ఏర్పఱచుట సులభము. గ్రామముమీఁద సాలుకు ఇరువది రూపాయల వంతున పోఁగుచేయుట యసాధ్యము కాదు. చిన్న గ్రామములు పది రూపాయ లిచ్చినను చాలును. గ్రంథాలయకూటములనుండి సంచారోపన్యాసకుల ద్వారా పుస్తకములను చందా గ్రామములకు పంపవచ్చును. తడవకు 50 పుస్తకములు పంపి నెల రోజులు గడువు పెట్టినయెడల చాలును. ఈ నెల రోజులు ఉపన్యాసకులు తమ కార్యముల నెఱవేర్చుచుండవచ్చును. చందాదారు లగు గ్రామములకే పుస్తకములు పంపఁబడును. గ్రామముల మీఁద చందాపద్ధతి యేర్పడినయెడల గ్రంథాలయకూటము శీఘ్రకాలములో నభివృద్ధి చెందుటయే కాక పుస్తకదానములకై గ్రంథకర్తలను పీడించుట కూడ తగ్గిపోవును.

### అంత్యజాతుల విద్య

ఆంధ్రదేశములో నున్న యంత్యజాతులలో నూటి కొకరైనను చదువనేర్చినవారు లేరు. వీరికి ప్ర

స్తుతము వ్రాతకోతలకంటె పారిశుభ్ర విషయములను బోధించుట ముఖ్యము. వీరిని హీనస్థితినుండి తొలఁగించుట ప్రథమకర్తవ్యము. అంత్యజాతి బాలుర విద్య విషయమై యాలోచించునప్పుడు వారి యార్థికదశ గమనింపవలసియున్నది. జీతము లేకుండ చదువు చెప్పిన మాత్రమున వీరిలో విద్య వ్యాపింపదు. బట్టలు పుస్తకములు భోజనాదులు గూడ పాఠశాలాధికారులే సప్లయి చేసినఁ గాని బాలు రందఱు పాఠశాలలకు రాఁజాలరు. ఇట్టిపాఠశాలలు స్థాపించుటకు విశేషధనసహాయము గావలసియుండును. ఒకవేళ ప్రజల యౌదార్యమువలన ధనము ప్రోగుచేసి అంత్యజాతులకు ధర్మ పాఠశాలలు పెట్టినను, జాతీయోద్యమము నెఱవేఱదు. పాఠశాలాధికారుల దయాధర్మబుద్ధి చక్కఁగ నున్నంత కాలము తమ విద్య నిరాటంకముగ జరగుననియు, వారి దయ తప్పినచో తమకు విద్య రాదనియు, నొక విధమయిన దీనభావ మీ పాఠశాలలోని పిల్లల హృదయములయందు నాటుకొనును. ఇట్టి దీనభావములకు బదులు ఆత్మగౌరవము స్వయంసహాయానురక్తి మున్నగు సుగుణములు అంత్యజాతి బాలురయం దుదయించుట ముఖ్యము. మన దయాధర్మభిక్షకు లోఁబడక, చందాలు లేకపోయినను స్కూళ్లు తమ పొట్ట తాము పోసికోఁగల వను ధైర్యము చిక్కిన యెడల బాలురలో నాత్మగౌరవము వృద్ధిచెందును. స్వపోషణార్థమై యంత్యజాతి స్కూళ్లలోని పద్ధతులు తదితర పాఠశాలలలోని వానికంటె భిన్నములై యుండును. అంత్యజాతి స్కూళ్లలో వ్రాతకోతలు నేర్పుట కెంత ప్రాముఖ్య మిచ్చెదరో తదితర పరిశ్రమములకు నంత ప్రాముఖ్యము నిచ్చెదరు. వ్యవసాయము వడ్రంగము నేత మున్నగు చేతిపనులు బాలురచే చేయించుటకు ప్రయత్నము చేయవలెను. పట్టణములలోను వానికి మిక్కిలి సమీపమునం దున్న పల్లెలలోను గల యంత్యజాతి పాఠశాలలలో కూరగాయలు పూలు మున్నగు నుపయోగకరములగు వస్తువులు పండించి వెంటనే విక్రయింపవచ్చును. పల్లెకూటములలో వడ్రంగము కమ్మరము అద్దకములు మున్నగు పరిశ్రమలు నేర్పినచో లాభము గలుగును. ఇట్టి చిన్న పరిశ్రమములు పెట్టుటకు విశేషధన మవసరములేదు. ఈ పరిశ్రమలవలన వచ్చిన ధనము బాలురదే యగుటవలన నొకవిధమయిన ఆత్మగౌరవము పాఠశాలను తామే పోషింపగల మను ధైర్యము ఉత్సాహము మనశ్శాంతి బాలురయం దుదయించును. మిషనరీలు ఇట్టి పరిశ్రామికవిద్యాలయములు కొన్ని స్థాపించి పనిచేయుచున్నారు. దొరతనమువారి రిఫర్మేటరీ స్కూలులో నిట్టి పనులు చేయుచున్నారు. అమ్మకమువలన విశేష ధనము వచ్చినయెడల కర్చులు పోఁగా మిగిలిన లాభములో కొంత భాగము పిల్లలకు పంచిపెట్టవచ్చును. పిల్లలు ఉపాధ్యాయులు పాఠశాలలలోనే కాపురముండుటచేత బాలురు పరిశ్రమలను జాగరూకతతో శీఘ్రకాలములో నేర్చుకొనఁగలరు. పరిశుభ్రత సత్ప్రవర్తనము మొదలగు సుగుణములు బాలురకు తప్పక యలవడును.

## స్త్రీ విద్య

వ్రాయుట చదువుట మాత్రమే పరీక్షయైనచో, మన స్త్రీలు విద్యయం దంత్యజాతులవలె వెనుకఁబడియున్నారు. ఇప్పుడుసాధారణముగ పట్టణవాసములలో ప్రతి పిల్లకును వివాహ మగువఱకు, అనఁగా పది సంవత్సరములవఱకు, విద్య చెప్పించుచున్నారు. కాని, బాలికాపాఠశాలలలో నిప్పుడు నేర్పునది జ్ఞానదాయకమగు విద్య కాదు. కొంచె మించుమించుగ బాలుర విద్యకును బాలికల విద్యకును భేదము లేదు వివాహమైనవెంటనే పాఠశాల మానుటవలన బాలికల విద్య సమాప్తమై యక్షరజ్ఞానము సయితము మఱచుట తటస్థించుచున్నది. కావున, స్త్రీవిద్యాభివృద్ధికై కాపురము చేయు స్త్రీలకు విద్యాసౌకర్యముల నేర్పఱచుట విధాయకమై యున్నది. పాఠశాలలు పెట్టుట యసంభవము. భర్తలు తమ భార్యలకు చదువు చెప్పెద రన్న మాట కలలోని వార్త. చెప్పుట కుత్సాహ మున్నను తీరిక యుండదు. ఓపికి యంతకు ముందె యుండదు. కాపుర గృహకృత్యములు తీరిన తరువాత ప్రతి రోజు కొలఁది మంది స్త్రీ లొకచోటఁ జేరి విద్యావ్యాసంగమునందు రెండు మూడు గంటలు గడపుట కవకాశము లేర్పాటు చేసిన బాగుగ నుండును. వీథి కొకచోట నిట్టి యేర్పాటు లుండి యొక యుపాధ్యాయురాలిని నియమించినచో నెక్కువ లాభము గలుగును.

స్త్రీవిద్యలో మఱియొక మార్పు ముఖ్యమైనది గలదు. బాలురకువలె బాలికలకుఁగూడ ఇంగ్లీషు నేర్పుట

పరిపాటి యగుచున్నది. ఇది గొప్ప తప్పని నా యభిప్రాయము. నవీన సంఘసంస్కర్తలు పరిహాసించినను, స్త్రీసామాన్యమునకు ఇంగ్లీషు భాష యనవసర మని నా మతము. నవీన జ్ఞానసముదాయ మంతయు మన స్త్రీలకు నేర్పవలసినదే. కాని భాషమాత్రము మాతృభాషయై యుండవలెను. ఏల యన, స్త్రీలకు ఇంగ్లీషు నేర్పుట యన దేశభాష లంతరించుటయే. ఈ రెండు వాక్యములకు పదభేదమే కాని యర్థభేదము లేదు. ఇంగ్లీషుభాష నేర్చిన పురుషులు గృహములలో మాత్రము తెలుఁగు మాట్లాడెదరు. స్త్రీలు గూడ ఇంగ్లీషు నేర్చినయెడల నా యవకాశము గూడ పోవును. నేఁటికి కూఁగ హూణవిద్యాపారంగతులలో ననేకులకు మాతృభాషలో వ్రాయుటగాని మాటలాడుటగాని యలవాటు లేదు. ఇట్టి స్థితిలో స్త్రీలు కూడ హూణవిద్యనే యభ్యసించినయెడల, దేశభాష లంతరించి హూణ విద్యావంతు లొకజాతిగను తదితరు లొకజాతిగను ఏర్పడి, పరస్పరసాంగత్యమునకే భంగము గలుగును. కావున ఉన్నతపాఠశాలలలోఁ గూడ స్త్రీలకు విద్య దేశభాషలలోనే చెప్పినయెడల స్త్రీవిద్య వ్యాపక మగుటయే గాక దేశభాషలు గూడ వృద్ధి నొందును.

ప్రభుత్వముచారి సహాయము

దొరతనమువారు విద్యాభివృద్ధికై ధనమును వెచ్చించి బడులను స్థాపించుచున్నా రని పైని వ్రాసియుంటిని. ఇందున కగు ధనమును ముఖ్యముగ జిల్లా బోర్డులకు తాలూకా బోర్డులకు మునిసిపాలిటీలకు నిచ్చుచున్నారు. ఈ జిల్లా తాలూకా సంఘముల యధ్యక్షులే యా ధనమును వెచ్చింతురు. ఈ సంఘముల యధ్యక్షులు సాధారణముగ విద్యా విషయికానుభవము లేనివారై యుందురు. విద్యావిషయమై తగినంత శ్రద్ధ తీసికొనుటకు వీరి కవకాశము కూడ చాలదు. కావున ఈ బోర్డులకు ఇచ్చెడి ధనము ప్రతి జిల్లాలో నొక పంచాయితీ నేర్పఱచి వారిచే కర్చు పెట్టించినచో విద్యాభివృద్ధి త్వరలో కాఁగలదు. ఈ జిల్లా పంచాయితీలలో కొంద ఉద్యోగులు కొంద ఉద్యోగులు కాని వారు నుందురు. విద్యావ్యాపనమే వీరి యుద్యమ మగుటచేత నీ విద్యాశాఖలు శ్రద్ధతో పని చేసి శీఘ్రకాలములో విద్యను వ్యాపింపఁజేయఁగలవు.

రెండు సభలు

నూతనపాఠశాలలు స్థాపించుటకుఁ గాని బోధనావిషయములను చర్చించుటకుఁ గాని రెండు సభలు గావలసియున్నవి. క్రొత్తగా బళ్లు పెట్టుట యిప్పుడు సులభము. ఎటువంటి బడికైనను ప్రభుత్వమువారు గ్రాంట్లు నిచ్చుచున్నారు. అంత్యజాతి పాఠశాలల కెక్కువగ నిచ్చెదరు. కాని, ప్రజ లుపక్రమించుటకు కొంత ధన మావశ్యకము. ఇది సమకూర్చుటకై యొక కార్యనిర్వాహకసంఘము కావలెను. చెన్నపట్టణములో నేర్పడిన యాంధ్ర విద్యాభివృద్ధి సంఘమును లేవ దీసినచో చాలును. చందాలు వసూలు చేయుటకంటె విద్యావ్యాపకమున కిప్పుడు గల వీళ్లు ప్రజలకు బోధించుట ముఖ్యమై యున్నది. చక్కఁగ బోధించినచో గ్రామస్థులు సహాయము చేయక మానరు.

బోధనావిషయములను చర్చించుటకు ఉపాధ్యాయుల సభ యొకటి కావలెను. ప్రతిసంవత్సరము వీరు సభ కూడి బోధనాపద్ధతులయందుఁ గల లోపములను చక్కఁబెట్టుటయే కాక విద్యాభివృద్ధికిఁ గావలసిన మార్గములను గూడ నివేదించినచో, వానిని అమలులోఁ బెట్టుటకు విద్యాసంఘమువారు ప్రయత్నింతురు. విద్యావ్యాపకమున కీ రెండు సంఘములును సహాయములు కాఁగలవు.

# ఉచిత ప్రాథమికవిద్య—మ్యునిసిపాలిటీలు

గా. కో. వేం. కృష్ణారావు బహద్దరు గారు, బి. ఏ.

విద్యావిషయములో మన దేశము మిక్కిలి తక్కువ స్థితియందున్నది. 1909-10-వ సంవత్సరము మొదలుకొని దొరతనము వారు ప్రాథమికవిద్యావిషయమయి యెక్కువ శ్రద్ధ వహించుటకును తగిన యేర్పాటులు చేయుటకును సమకట్టిన విషయ మందఱికిని దెలిసినదే. ఇందు విషయమై విశేష ద్రవ్యము కూడ గేటేట ఖర్చుపెట్టుటకు దొరతనము వారు నిశ్చయించుకొనిరి. అది మొదలు పూర్వముకన్న విద్యావిషయమై యెక్కువ సొమ్ము ఖర్చు పడుచుండుట వాస్తవమే. అయినను, ఈ సొమ్ము విరివిగా పాఠశాలలు స్థాపించుటక్రింద వినియోగపఱుచుటకు మాఱుగా పాఠశాలలను తనిఖీచేయు మార్గములక్రింద నెక్కువగా వినియోగపఱుచుచున్నారు. ప్రాథమికవిద్యావిషయమై కావలసిన సొమ్ము మొత్తములో దొరతనమువారు 1909-10-వ సంవత్సరమున నాల్గవవంతు మాత్రమే భరించిరి. ఇప్పుడు మూఁడవవంతు భరింపవలసివచ్చినది. పాఠశాలలు విరివిగా స్థాపించిన కొలఁదిని దొరతనమువారు ఎక్కువ సొమ్ము ఖర్చుపెట్టవలసి వచ్చును. ప్రస్తుతము దొరతనమువారు ప్రాథమికవిద్యావిషయికమైన ఖర్చు మ్యునిసిపాలిటీలును తాలూకా జిల్లా బోర్డులును భరింపవలసినట్లు అభిప్రాయపడుచు ప్రాథమికపాఠశాలలన్నియు బోర్డులక్రిందను మ్యునిసిపాలిటీలక్రిందను నుండునట్లు చేయుటుచితమని నిశ్చయించుకొనిరి. ప్రాథమికవిద్య నుచితముగాఁ గఱపుటయు, విద్య నేర్చుకొనుట ప్రధానవిధిగా నేర్పఱిచి నిర్బంధవిధానముగ గమనించుటయు సంభవించినఁ గాని దేశముయొక్క మూఢత్వము వదలిపోఁజాలదు. 1870-వ సంవత్సరమువఱకింగ్లాండు దేశములో నిట్టి నిర్బంధము లేకపోవుటవలన, ఆ దేశములో మూఢత్వము మిక్కిలిగా నుండెను. తరువాత విద్యావిషయమై నిర్బంధవిధి యేర్పాటు చేసిన తరువాత దేశ మెట్లభివృద్ధినొంది యత్యున్నత దశకు వచ్చినదో చదువరులే గ్రహింతురు గాక.

ఇంగ్లాండు దేశమున నూఱు సంవత్సరములకు పూర్వము పురుషులలో పదిమంది కొకఁడైనను స్త్రీలలో నిరువదిమంది కొక్కతెయైనను చదువను వ్రాయను నేర్చియుండలేదు. 30 సంవత్సరములకు పూర్వము ఇటలీ దేశములో 100కి 78 గురు ఏవిధ మయిన విద్యాగంధమును లేనివారుగా నుండిరి. కాని, తమ దేశముయొక్క మూఢత్వమును వారు చక్కఁగా గ్రహించి పాఠశాలలు విరివిగా స్థాపించి నిర్బంధవిధానములను గలిగించిన తరువాత నిప్పుడా దేశము విద్యావిషయమయి మిక్కిలి యున్నతదశకు వచ్చినది. జపాను దేశపు స్థితి విద్యావిషయమై యెట్లున్నదో కొంచెము విచారింతము. 1882-వ సంవత్సరములో విద్యావిషయమై తగిన యేర్పాటులు చేయుటకు జపాను ప్రభుత్వమువారు నిశ్చయించుకొని ప్రతి పల్లెయందును పాఠశాలలు స్థాపింప నారంభించిరి. ఈ విధముగా దేశమంతయు పాఠశాలలతో వ్యాప్తమయి నిర్బంధవిధానములవలన ప్రతి స్త్రీపురుషులును విద్య నేర్చుకొనఁదగిన యవసరము కలిగి ప్రస్తుతము విద్య యెఱుఁగనివారు అరుదనుట తటస్థించినది. ప్రపంచములో ప్రస్తుత మభివృద్ధిలో నున్న ప్రతిదేశమందును ప్రాథమికవిద్య నుచితముగాఁ గఱపుటయు అందువిషయమై నిర్బంధవిధానముల నేర్పఱుచుటయుఁ గన్పించుచునే యున్నది. కాఁబట్టి మన దేశమందుఁ గూడ దొరతనమువారీ రెండేర్పాటులను గలుగఁజేసినం గాని, దేశ మభివృద్ధి చెందుటకు కారణము లగపడవు.

దేశాభివృద్ధికి ప్రజాభివృద్ధియు జనుల జ్ఞానాభివృద్ధియు ముఖ్యకారణములు. విద్య వ్యాపించినఁ గాని జ్ఞానాభివృద్ధి కలుగదు. జ్ఞాన మభివృద్ధి నందినఁ గాని జనుల దుస్థితి తొలఁగి ప్రజాభివృద్ధి కలుగదు. కాఁబట్టి విద్య వ్యాపించినఁ గాని ఏ దేశమును ఉన్నత స్థితికి రాఁజాలదు. తమతమ యేలుబడులక్రింద నున్న దేశములను ఉన్నతస్థితికి తెచ్చి ప్రజల నభివృద్ధిపఱిచి జనులను సంతుష్టచిత్తులనుగాఁ జేయుట ప్రతి దొరతనమువారికిని విహితకృత్యము. దేశాభివృద్ధికిని ప్రజాసంతుష్టికిని విద్యాభివృద్ధియు విద్యాప్రచారమును ప్రధానకారణము లని యిదివఱకే చెప్పియుంటిని. కాఁబట్టి విద్యాప్రచారము దొరతనమువారికి విధ్యుక్తమైన ప్రధానకార్యములలో ప్రథమమైనది. విద్యావిషయమై ద్రవ్యమును వెచ్చింపవలసినప్పుడు దొరతనమువా రెంతమాత్రమును వెనుదీయరాదు. అయినను, దొరతనమువారి ధర్మవిషయమై ఇప్పుడు ప్రజలకుఁ గూడ కొంత బాధ్యత తప్పక కలదు కాఁబట్టియే విద్యావిషయికమైన ఖర్చు మొత్తములో నింగ్లాండు దేశంబున దొరతనమువారు రెండు వంతులు భరించుచు తక్కిన భాగమును స్థానికప్రభుత్వములు భరించునట్లు చేసిరి. ఈ విధముగా ప్రతిదేశమందును ప్రజలు విద్యావిషయమై పన్నిచ్చుచు కొంత ఖర్చు భరించుకొని తక్కిన మొత్తము దొరతనమువారివలన ఖర్చు పెట్టించుచున్నారు. కనుక మన దేశము అభివృద్ధి చెందవలయునన్నచో, మనము కూడ కొంత బాధ్యత వహించుటకు సమకట్టి దొరతనమువారి బాధ్యతయు ధర్మమును వారు నెఱవేర్చునట్లు చేయవలెను. ప్రాథమికవిద్య నుచితముగా నేర్పుటకు సాధనములు చేసి తద్విషయమై నిర్బంధవిధానములను కల్పింపవలసినదని మనవా రనేకసంవత్సరములనుండి ఘోషించుచున్నారు కదా! ఇందు విషయమై కీర్తిశేషులయిన గోపాలకృష్ణగోఖలే గారు సామ్రాజ్యశాసనసభలో 1912-వ సంవత్సరమున నొక బిల్లు ప్రవేశపెట్టి చాల దూరము చర్చించిన విషయ మందఱకుఁ దెలిసియే యున్నది. ఆ తరుణమున దొరతనమువారు అందు విషయమై శాసన మేర్పఱచిన

యెడల నిప్పటికి విద్యావిషయమై చాలనభివృద్ధి కలిగియుండును. కాని, యది విశేషధనవ్యయకారణ మని దొరతనమువా రంగీకరింపక విద్యావిషయిక మగు తమ ధర్మమును మాత్రము అంగీకరించి క్రమక్రమముగా ప్రాథమికవిద్య నభివృద్ధిపఱిచెద మని వాగ్దానము చేసిరి. మఱియును జార్జి సార్వభౌములు తమ పట్టాభిషేకమహోత్సవసమయమున విద్యావిషయమై ఖర్చుపఱుచుట కేర్పఱిచిన విశేషద్రవ్యమును వాగ్దానమును అందఱు నెఱిఁగియే యున్నారు. తరువాత ప్రాథమికవిద్య కేవల ముచితముగాఁ జేయుటకు మాఱుగా హీనజాతులుగా పరిగణింపఁబడినవారి కుచితముగా విద్య నేర్ప వలసిన దని విధించి ఇదివఱకు ఏర్పాటుచేసిన జాతులలో మఱికొన్ని జాతులను కలిపినారు. ఇంతే కాక మ్యునిసిపాలిటీ పట్టణములలో బీద పిల్లలు జీత మిచ్చుకొనవలసిన యవసరము లేకుండ మాఫ్ చేయుటకు మ్యునిసిపాలిటీవారికిఁ గూడ నధికార మిచ్చిరి. అందువలన పూర్వముకన్న ప్రాథమికవిద్యావిషయమై యిప్పుడు కొన్ని క్రొత్త సదుపాయములు కలిగియున్నను, కర్తవ్య మింకను కొఱఁత పడియే యున్నది.

చెన్నపురి రాజధానిలో ప్రస్తుతము బడికి పోఁదగిన వయస్సుగల పిల్లలలో మగపిల్లలు 100 కి 40 మందియు ఆఁడుపిల్లలు 100 కి 9 గురును మాత్రమే విద్య నేర్చుకొనుట తటస్థించుచున్నది. ప్రాథమికవిద్య గఱచుచున్నవారు మగపిల్లలలో 100 కి 32 రును ఆఁడుపిల్లలలో 100 కి 9 గురును మాత్రమే కన్పించుచున్నారు. క్రిందటి సంవత్సరపు స్థితియు ఈ సంవత్సరపు స్థితియు పోల్చి చూడఁగా సంవత్సరమునకు మగపిల్లల విషయము 100 కి 1 డు చొప్పునను ఆఁడువాండ్ర విషయము 100 కి 6 గురు చొప్పునను విద్య నేర్చుకొనువారిలో సంఖ్య పెరుఁగుచున్నది. దీనిని బట్టి చూడఁగా ప్రాథమిక విద్యావిషయమై ప్రస్తుత మున్న యేర్పాటువలన విద్య నేర్చుకొనఁదగిన మగపిల్ల లందఱు చదువుకొనుట కవకాశము కలుగుటకు 35 సంవత్సరములును ఆఁడుపిల్ల లందఱును జదువుకొనుట కవకాశము కలుగుటకు 166 సంవత్సరములును పట్టును. ఇంగ్లాండు మొదలగు దేశములలో 30 సంవత్సరములలో ప్రాథమికవిద్య దేశమంతటను వ్యాపింపఁగలిగిన సంగతి అందఱును ఎఱిఁగియేయున్నారు. మన దేశ మిప్పటి కనేక సంవత్సరములనుండి ఆంగ్లేయ ప్రభుత్వముక్రింద నున్నను ఇప్పటి కింకను ముందు చిరకాలమునకుఁ గాని మన దేశమందు ప్రాథమికవిద్య వ్యాపించుట కవకాశములు లేకున్నవి. ఆంగ్లేయ ప్రభుత్వమువారు ప్రాథమికవిద్యా విషయమై తమ దేశములో నేర్పఱిచిన సాధనములను మన దేశమందు కూడ ఏర్పఱిచినఁగాని త్వరితముగా నిందు విషయమై అభివృద్ధి కలుగనేరదు. ప్రస్తుతము నిరుటికంటె మన రాజధానిలో 1,949 ఎలిమెంటరీ పాఠశాల లెక్కువ యయినవి. ప్రాథమికవిద్యావిషయమై నిరుడు 48 లక్షలును ఈ యేఁడు 58 లక్షలును ఖర్చుపడినవి. ఈ మొత్తములో 100 కి 73 రూపాయలు దొరతనమువారివలనను 100 కి 13 రూపాయలు జీతములవలనను తక్కిన సొమ్ము ఇతరమార్గములవలనను వసూలు చేయఁబడి ఖర్చుపెట్టఁబడెను. దీనిని బట్టి చూడఁగా ప్రాథమికవిద్య విషయమై ఖర్చుపఱిచిన సొమ్ములో జీతములుగా వసూలు చేయఁబడిన సొమ్ము అతిస్వల్పము. ఈ స్వల్పపు మొత్తముకొఱకు ప్రాథమికవిద్య నుచితముగాఁ గఱపుటకు సాధనము లేర్పఱుపకుండుట శోచనీయము.

మ్యునిసిపాలిటీలలోని ప్రాథమికపాఠశాల లన్నియు ఆయా మ్యునిసిపల్ సంఘములయొక్క యధికారముక్రింద నుండిన నేర్పఱిచి వాని ఖర్చంతయు మ్యునిసిపాలిటీలే భరింపవలసినట్లు దొరతనమువారి యభిప్రాయము కాని, దొరతనమువారు పాఠశాలలు కట్టించుటకును పాఠశాలలకుఁ గావలసిన పుస్తకములు మొదలగు సామగ్రిని సమకూర్చుటకును కావలసిన సొమ్మును ధారాళముగా నిచ్చుచున్నారు. ప్రాథమికపాఠశాలోపాధ్యాయుల జీతములును ఆయా పాఠశాలలకుఁ గావలసిన పుస్తకములు సామానులు మొదలగునవియు మాత్రమే మ్యునిసిపాలిటీవారు భరింపవలసియున్నది. ఇట్టి పాఠశాలలలో చదువుకొను పిల్ల లీయవలసిన జీతములు కూడ మిక్కిలి తక్కువగా నేర్పఱుపఁబడినవి. మ్యునిసిపల్ సంఘములు ఆయా పట్టణములయందలి ప్రజాప్రతినిధులచే నిండియుండుటచేత మ్యునిసిపల్ వ్యవహారములు తత్పట్టణవాస్తవ్యులే చక్కఁబెట్టుకొనుట కధికారము గలిగియున్నది కదా! ప్రాథమికపాఠశాలల మీఁది యధికార మీ మ్యునిసిపల్ సంఘముల కుండుటచేత ఆయా పట్టణముల వాస్తవ్యులకు ప్రాథమికపాఠశాలలయందు సంపూర్ణాధికారము కలిగియే యున్నది. తమతమ పట్టణముల స్థితిగతులను బట్టియు విద్యాభివృద్ధి విషయమై తమకుఁ గల యభిరుచిని బట్టియు తమతమ పట్టణములయందు చదువుకొను పిల్లల సంఖ్యను బట్టియు మ్యునిసిపల్ సంఘములు ప్రాథమికపాఠశాలలను దమ కుచిత మైన స్థలములయందు తమ కవసర మని తోఁచినన్ని స్థాపించుకొనుటకు మ్యునిసిపల్ సంఘములకు సంపూర్ణాధికారము కలదు. మఱియు బీదవాండ్రని తమకు తోఁచిన పిల్లలు జీత మిచ్చుకొన నవసరము లేకుండ చదువుకొనుటకు సెల వొసంగుటకుఁ గూడ నీ మ్యునిసిపాలిటీ సంఘములవారి కధికారము కలదు. హీనజాతులుగాను మూఢులుగాను నున్న యధమజాతులవారికి కూడ విద్యాలాభము గలిగింప నెంచి దొరతనమువారు అట్టి జాతుల పిల్లలకు జీతము లేకుండఁగను సగము జీతము మాత్రమే యిచ్చుకొనఁగలిగియుండుటకును సదుపాయముల నేర్పాటు చేసిరి. మునుపటికంటె అట్టి జాతుల సంఖ్య యిప్పుడు మిక్కిలి యెక్కువగాఁ జేయఁబడినది. ఈ కారణములవలన మ్యునిసిపాలిటీలలో నున్న ప్రాథమికపాఠశాలలందు చదువుకొను పిల్లలలో చాలమంది జీతము లేకుండ నుచితముగను సగము జీతము మాత్రమే యిచ్చుకొనియు చదువుకొనుట కవకాశము కలిగియున్నది. బీద లని యెంచి మ్యునిసిపల్ సంఘమువారు పిల్లలయొద్ద జీతము లేకుండ మాఫ్ చేయుటకు కూడ అధికారమున్న దని యింతకు మున్నే వ్రాసియుంటిని. కాఁబట్టి ఈ కారణముల నన్నింటిని బట్టియే మ్యునిసిపల్ పట్టణములలో ప్రాథమిక

విద్య నభ్యసించు పిల్లలలో జీతము లిచ్చువారు మిక్కిలి స్వల్పముగా నున్నారు. ఇట్టి పిల్ల లిచ్చు జీతములవలన మ్యునిసిపల్ సంఘములకు వచ్చు నాదాయము కూడ నతిస్వల్పముగ నున్నది. మన రాజధానిలో ప్రస్తుతము 63 పట్టణములు మ్యునిసిపల్ సంఘముల పరిపాలనక్రింద నున్నవి. ఈ 63 మ్యునిసిపల్ సంఘముల యధికారముక్రింద నున్న పాఠశాలలు కళాశాలలు మొదలగు విద్యాస్థానములన్నింటివలనను 2,20,598 రూపాయలు మాత్రమే జీతములు మొదలగు వసూళ్లక్రింద వసూలు అగుచున్నవి. ఇందు విషయమై దొరతనమువారు 7,32,105 రూపాయలు సహాయద్రవ్యముగా నిచ్చియున్నారు. కళాశాలలు ఉన్నతపాఠశాలలు మొదలగు విద్యాస్థానముల మూలమున వసూలయిన సొమ్ము మినహాయించినయెడల నీ 63 మ్యునిసిపల్ పట్టణములలో నున్న కేవలప్రాథమికవిద్యాశాలలయందు చదువుకొను పిల్ల లిచ్చు జీతములవలన వసూలు అగుమొత్తము మిక్కిలి స్వల్పముగా నుండును. ఇట్టి మొత్తము ఒక లక్షకంటె నెక్కువగా నుండు నని తలంప వీలు లేదు. 63 మ్యునిసిపల్ పట్టణములలో నున్న ప్రాథమికపాఠశాలలవలన నొకలక్షరూపాయల యాదాయము ఒక గొప్ప యాదాయము కాదు. కొన్నికొన్ని పట్టణములలో ప్రాథమిక పాఠశాలలవలన సంవత్సరమున కొక 1000 రూపాయ లయిన నాదాయము వచ్చుచుండుట లేదు. ప్రాథమికవిద్యావిషయ మైన ఖర్చు మ్యునిసిపల్ సంఘములవారు భరించుచున్నపుడును, జీతములవలన వచ్చు నాదాయము అతి స్వల్పముగా నుండుటచేతను, ప్రాథమికవిద్య ఉచితముగాఁ గఱపుట కధికారము మ్యునిసిపాలిటీ సంఘములకు లేకపోవుటవలన, లాభ మేమియును గానిపించకున్నది. దేశమందంతటను ప్రాథమికవిద్యను ఉచితముగాఁ గఱపుటకు ఒక్కొక పిల్లవాఁడును ఒక్కొక పిల్లయు ప్రాథమికవిద్య నభ్యసింపక తప్ప దని నిర్బంధవిధానముల నేర్పఱచి, మన దేశమందలి యజ్ఞానమును తొలంగించి ప్రజల నభివృద్ధిపఱచుట విధ్యుక్తధర్మమని దొరతనమువారు గ్రహించియు, అట్టి యేర్పాటులను ప్రస్తుతము చేయుటకు వారు సమకట్టకపోవుట శోచనీయము. అథమాధమము మన రాజధానిలో నున్న యీ 63 మ్యునిసిపల్ పట్టణములలోనైన నుచిత మగు ప్రాథమికవిద్యను గఱపుటకు మునిసిపాలిటీల కధికార మొసంగకపోవుటకు కారణము కనిపింపకున్నది. బడికి పోయి విద్య నభ్యసింపఁదగిన వయస్సు గల బాలురును బాలికలును విద్య నేర్చుకొనకతీఱ దని నిర్బంధవిధానముల నేఱుపఱిచి విద్య నుచితముగాఁ గఱపినం గాని యట్టి పిల్ల లందఱు చదువుకొనుట యెన్నఁడును తటస్థింపదు. ఉచితముగా విద్య గఱపినంతమాత్రమున చదువుకొనఁదగిన పిల్ల లందఱును చదువుకొందు రని నమ్ముట కెన్నఁడు నవకాశము లేదు. అందులో మన దేశముయొక్క దుస్థితిని బట్టియు దరిద్రావస్థను బట్టియు నుచితముగా విద్యను గఱపినంత మాత్రమున బడికి పోఁదగిన బీద పిల్ల లందఱును తమతమ వృత్తులను మానుకొని చదువుకొనరు. మ్యునిసిపాలిటీలలో ప్రాథమికవిద్య నుచితముగాఁ గఱపుటకు మాత్రమే ఆయా మ్యునిసిపల్ సంఘముల కధికారమీయవలసిన దని కోరుచుంటిమి గాని ఆయా పట్టణములలో బడికి పోఁదగిన పిల్ల లందఱు తప్పక విద్య నభ్యసింపవలసిన దని నిర్బంధవిధానముల నేర్పఱుపఁగోరుచుండుట లేదు కదా! అందువలన ప్రాథమికవిద్య నభ్యసించు బాలుర సంఖ్య యమితముగా పెరుఁగు ననియు దానిని బట్టి ప్రాథమిక పాఠశాలల సంఖ్య హెచ్చింపవలసి వచ్చు ననియు అందుమూలమున తద్విషయమై మ్యునిసిపాలిటీ సంఘములకు ఖర్చును దొరతనమువారికీ బాధ్యతయు నెక్కువ వగు ననియు భయపడ నవసరము లేదు కదా! మ్యునిసిపాలిటీలలో నున్న ప్రజలు ప్రాథమిక విద్యావిషయ మైన ఖర్చును బాధ్యతను వహించుటకు పూనుకొని ప్రాథమికవిద్య నుచితముగాఁ గఱపుటకు నిశ్చయించుకొనినపుడు అందువిషయమై స్వల్పముగా బాధ్యత యెక్కువగు నని తలఁచి ఈ యేర్పాటులకు సమ్మతింపకుండుట న్యాయముగా కనుపింపదు. ప్రస్తుతము మన రాజధానియందు 7 జిల్లాలలో 2000 మందికంటె నెక్కువ ప్రజలు గల ప్రతి గ్రామమందును ఒక పాఠశాల స్థాపింపఁబడి యున్నట్లు దొరతనమువారి రిపోర్టువలన తెలియుచున్నది. ఇంకను ఇట్టి యదృష్టము పట్టఁగల జిల్లాలు 17 కనిపించుచున్నవి. తరువాత ప్రతిపల్లెయందును పాఠశాల యుండు భాగ్యము కలుగుటకు ఎంత కాలము పట్టునో తెలియదు. ఇట్టి భాగ్యము ముం దెన్నఁడు కలిగినను ప్రస్తుతము ఈ 63 ముఖ్యపట్టణములలోనైన ప్రాథమికవిద్య నుచితముగా కఱపుటకు దొరతనమువారు మ్యునిసిపల్ సంఘముల కధికార మిచ్చుట ధర్మము.

పల్లెటూళ్లకన్నను చిన్న గ్రామములకన్నను పట్టణములలో నాగరకత యెక్కువగా నున్న దనుటకు సందియము లేదు కదా! పట్టణములలోని ప్రజలు నాగరకత కలవారుగను ఎక్కువ ప్రపంచానుభవము కలవారుగను నుండుట యందఱు నెఱిఁగియున్న విషయమే. ప్రస్తుతము పల్లెలనుండి ప్రజలు పట్టణములలోఁ జేరి అచ్చట లాభకర మగు నితరవృత్తుల నవలంబించుచుండుట మనము చూచుచునే యున్నాము. కాఁబట్టి పల్లెటూళ్లయందును గ్రామములయందును నివసించు ప్రజలకంటె నెక్కువ నాగరకతయు ప్రపంచానుభవమును గల పట్టణములయం దున్నవారి పిల్లలైనను సులభముగా విద్య నేర్చుకొనుట కవకాశములు కల్పించుటకు ప్రాథమికవిద్య నుచితముగా కఱపుట కధికారము లేకుండుట దేశాభివృద్ధికి హానికర మని చెప్పక తప్పదు.

విద్య నేర్చుకొనుటకు ప్రోత్సాహమును కల్పించుటకు సాధనములు రెండే కలవు. అందు మొదటిది విద్యయం దభిరుచియు విద్య నేర్చుకొనుటవలనఁ గలుగు లాభములను దెలిసియుండుటయు. రెండవది బడికి పోఁదగిన పిల్ల లందఱు చదువుకొనక తప్ప దని దొరతనమువారు నిర్బంధవిధానము నేర్పఱుచుట. ఇందు మొదటిది జనులయొక్క నాగరకతను బట్టియు జ్ఞానాభివృద్ధిని బట్టియు ప్రపంచానుభవమును బట్టియు కలుగును. రెండవది దొరతనమువారి శాసనమును బట్టి సంభవించును. ప్రస్తుతము దొరతనమువా రిందువిషయమై శాసన మేర్పఱుచుట కిష్టపడ లేదు. కాఁబట్టి, మన దేశమునందు విద్యా

ప్రచారమునకును జనులు విద్య నేర్చుకొనుటకును వారికి విద్యయందుఁ గల యభిరుచియు విద్య నేర్చుకొనుటకుఁ దగిన సులభసాధనములును మాత్రమే ముఖ్య కారణములుగా నున్నవి. విద్య నేర్చుకోవలయు నన్న కోరిక నాగరకతను బట్టియు ప్రపంచానుభవమును బట్టియు విద్య వలనఁ గలుగు లాభము లిట్టివని తెలిసికొనుటచేతను కలుగును. ఇట్టి యభిప్రాయములును విద్య నేర్చుకోవలయు నన్న యాసక్తియు పట్టణములలో నున్న పిల్లలకు పల్లెలలో నున్న పిల్లలకన్న నెక్కువగా నుండుట కవకాశ మున్నది. కాఁబట్టి అట్టి పిల్లలకు విద్య నేర్పుటకు సాధనములను మాత్రమే ఇప్పుడు కలుగఁజేయవలసి యున్నది. అట్టి సాధనములనైన ప్రస్తుతము కలిగింపకపోయినచో విద్యావిషయమై చేయవలసిన దేమియుఁ జేయుటలేదని చెప్పవలసి వచ్చును. మన రాజధానిలో నున్న పట్టణము లన్నియు స్థానిక ప్రభుత్వ లాభమును పొందియున్న మ్యునిసిపల్ సంఘముల యధికారముక్రింద లేవు. 24 జిల్లాలలో నున్న వేలకొలఁది పట్టణములలో 63 పట్టణములు మాత్రమే మ్యునిసిపల్ సంఘముల యధికారము క్రింద స్థానికప్రభుత్వలాభమును పొందుచున్నవి. అట్టి యీ 63 పట్టణములలోనైన దొరతనమువారు విధ్యుక్తధర్మముగా ప్రాథమిక విద్యాప్రచారవిషయమై యేర్పఱుపవలసిన మార్గములలో మొదటిదగు నిర్బంధవిధానశాసనమును రెండవదగు నుచితముగా విద్య గఱపు సదుపాయమును గాకున్నను, ఈ రెండు మార్గములలో రెండవ దానిని కూడ కొన్ని పట్టణములలోనైనను మ్యునిసిపల్ సంఘముల వారి యనుమతిమీఁదనైన కలిగించుటకు దొరతనమువారు సమ్మతింపకపోవుట న్యాయముగాఁ గనిపింపదు. ప్రజలకు పూర్వముకన్న నిప్పుడు విద్యావిషయమగు నభిరుచి నానాఁటికి హెచ్చుచున్నది. అట్టి యభిరుచి జనులకుఁ గలిగినకొలఁది దొరతనమువారు విద్యాభివృద్ధి విషయమై చేయవలసిన కార్యములను జేయుచు నేఁటేఁట కొన్ని క్రొత్త పాఠశాలలను స్థాపించుచునే యున్నారు. కాని, యింకను ననేకపాఠశాలలు స్థాపింపవలసియున్నది. విద్యాస్థితి నభివృద్ధిపఱుచుటయందు దొరతనమువారు వినియోగించుచున్న శ్రద్ధలో శతాంశమైనను విద్యాప్రచారముకొఱకు వినియోగించుచుండుట లేదని చెప్పవలసియున్నది. ప్రాథమికవిద్యావిషయమున బాగోగుల స్థితిగతులకొఱకు విశేషద్రవ్యమును వెచ్చించి దొరతనమువారు విద్యావిషయమయి ఖర్చుచేయదలఁచిన ద్రవ్యమును వినియోగించుట కంటె విద్యాప్రచారముకొఱకుఁ దగిన యేర్పాటు లొనరించి యేఁటేఁట క్రొత్త పాఠశాలల నెక్కువగా స్థాపించుటయందు ద్రవ్యమును వెచ్చించుట మంచిది. బరోడా మొదలగు స్వతంత్ర రాజ్యములలో ప్రాథమికవిద్యావిషయమయి విశేషశ్రద్ధ వహించి నిర్బంధవిధానముల నేర్పఱుచుటవలనను ఉచితముగా విద్య నేర్చుకొనుటకుఁ దగిన సాధనముల నేర్పఱుచుటవలనను విద్యాప్రచారము మిక్కిలిగాఁ గలిగించుచున్నారు. అట్టి స్థితిలో స్వతంత్రరాజ్యములకంటె నెక్కువ భాగ్యవంతంబును ఎక్కువ నాగరకత గలదియు నగు బ్రిటీషు పరిపాలనక్రింద నున్న మన దేశమునందు మాత్రము ప్రాథమికవిద్యాప్రచారవిషయమై తగిన యేర్పాటులు లేకపోవుట బాగుగా కనిపింపదు.

దేశమందంతటను ఒక్కమాటు విద్యావ్యాప్తి కలుగఁజేయుట సాధ్యము గాకున్నను, మ్యునిసిపల్ సంఘముల యధికారమందుండి స్థానికప్రభుత్వలాభము ననుభవించుచున్న పెద్ద పట్టణములలోనైన ప్రాథమికవిద్యావ్యాప్తికి సాధనములను గలుగఁజేయకుండుట మంచిది కాదు. అట్టి పట్టణములలో ప్రాథమికవిద్యావ్యాప్తి యచిరకాలములోఁ గలిగించుట కూడ నెంత మాత్రము కష్టసాధ్యము కాదు. కాఁబట్టి మ్యునిసిపల్ పట్టణములలో ప్రాథమికవిద్య నుచితముగాఁ గఱపుట కధికారము మ్యునిసిపల్ సంఘములకు దొరతనమువా రొసంగుట ధర్మము. ఇందు విషయమై మనవారు శ్రద్ధ వహించి కర్తవ్యము నాచరింతురుగాక!

# తృప్తి

చింతా శంకర దీక్షితులు గారు

సేవకావృత్తి పరులకుఁ జేయకుండ
పుట్టి బ్రతికినవాఁడె పో! పుణ్యతముఁడు.
వాని మంతన మతని కవచము; వాని
నేర్పు, సత్యము పల్కుట నియతి గల్గి. 1

వాని కింద్రియములు కూలివాండ్రు; వాని
మనము మృత్యువు గని భీతి మాను; వాఁడు
బిరుదములఁ జెంద, లోకానఁ బెంపు నొందఁ
గాంక్ష సేయఁడు; దైవంబుఁ గాంక్ష సేయు. 2

మంచి చేతనో, లేక దుర్మార్గముననో
పరులు పెంపును గాంచిన, వాఁడు మత్స
రంబుఁ జెందఁడు; స్తోత్రపాఠంబు వినఁడ;
మంచి నెయ్యంబుఁ జేయక మానఁడెపుడు. 3

వానిపైఁ గొండెముల్ చెప్పువారు లేరు,
అంతరాత్మయు దేశికుఁ, డట్టివాఁడు
స్తోత్రములఁ బొంగుఁ జెందఁడు, దూషణముల
వగవఁ; డీ రెంటిఁ దా నొక్కభంగిఁ జూచు. 4

శ్రీసతీనాథు సేవించు రెండు ప్రొద్దు
లధికభక్తిని, మాఱేమి యడుగఁడ,
సజ్జనులతోడ మాత్రమే సలుపు మైత్రి;
చదువు సద్గ్రంథచయము నే సమయమునను. 5

ఇట్టివాఁ డుచ్చపదవిఁ దా నెన్నఁబోఁడు;
హీనపద మన్న భయము లే దెప్పటికిని;
తన్నుఁ గల్గిన దొర జమీందారు గాఁడు,
ఏది లేకున్న నన్నియు నితని కుండు. 6

# ఆంధ్రదేశపు ఆర్థికస్థితి

కోన సీతారామరావు గారు, ఎం. ఏ.

ఆంధ్రదేశపు ఆర్థికస్థితిని దెలిసికొనుటకుఁ గావలసిన అంశములు మన చెన్నపురి రాజధాని యంతకుఁ గలసి ప్రకటింపఁబడు దొరతనమువారి రిపోర్టులలో లభించుచున్నవే కాని ప్రత్యేకముగ మన ఆంధ్ర దేశమునకు సంబంధించినవి దొరకుట లేదు. కావున, ప్రస్తుతము మనము ఆర్థికసిద్ధాంతముల చర్చలతోడను అందునకు సంబంధించిన కొద్దిపాటి సాధనసామగ్రితోడను సంతృప్తి చెందవలసియున్నది.

ఆర్థికశాస్త్ర మన నేమి? సంఘముయొక్క భాగ్యాభివృద్ధికిని అట్టి యభివృద్ధిని సాధించుటకుఁ గల కర్తవ్యములకును సంబంధించిన విచారణయే ఆర్థికశాస్త్రము. భాగ్య మనఁగా కేవలము ధనము మాత్రమే కాదు. సామాన్యముగ నది ద్రవ్య మని అభిప్రాయ పడుదురు. ఇది సరి కాదు. లోహములనుండి అనఁగా బంగారు వెండి రాగి మొదలగు పదార్థములనుండి నాణెములను చేసి ఉపయోగించు వాడుక యిటీవల వచ్చినది కాని, అనాదినుండియు వచ్చినది కాదు. డబ్బు లేని కాలమున జనులకు భాగ్యము లేకపోలేదు. ఎవరి కయినను ఏదయిన నొక వస్తువు 'కావలసివచ్చినపుడు తమయొద్ద నున్న వస్తువు నిచ్చి లేనివానిని దెచ్చుకొనుచుండిరి. ఇట్టి యేర్పాటువలన కష్టము లనేకములు కలుగుచుండెను. నాగరకము హెచ్చినకొలఁది నాణెములు కరెన్సీ పత్రములు హుండీలు మొదలగు సాధనములు వాడుకలోనికి వచ్చి యీ బాధలను నివారించినవి. కనుక ద్రవ్యము వస్తువులను కొనుటకు అమ్ముటకు నుపయోగపడు సాధనమే గాని భాగ్యము గాదు. భాగ్యమునకు ముఖ్యముగ నాలుగు లక్షణము లుండవలయును: (1) మానవునియొక్క ఏదోయొక కోరికను తృప్తిపఱచునట్టిదిగా నుండుట (2) మానవుని వినియోగమునకు పనికివచ్చు రూపమున నుండుట (3) మనుజునకు బాహ్యమయినదిగా నుండుట (4) మిక్కిలి యరుదుగ దొరకునదిగ నుండుట.

ప్రస్తుతకాలమున ప్రతివస్తువును ఒక దేశము నుండి మరియొక దేశమునకును, ఒక చేతినుండి మరియొక చేతికిని మాఱుచున్నవి. కనుక మార్పునకు వినియోగపడు వస్తువు లెల్ల భాగ్యమే యగును. ఏలయన, ఉపయోగము లేని వస్తువు లన్నియు నిష్ప్రయోజనములు. అది మనము ఉపయోగించుటకు వీలు కానిదయినచో మనకు లభింపఁజాలదు. బాహ్యముగ లేనియెడల అది యితరుల యుపయోగమునకు రాఁజాలదు. ఎక్కడ పట్టిన అక్కడ దొరకునెడల, దానికి విలువ యుండదు. కావున భాగ్య మనునది మార్పునకు పనికి వచ్చునది. కాఁబట్టి పర్వతములమీఁదను అడవుల యందును పెరుగు వస్తువులును, గనులలో దొరకు లోహములును, భూములయందు పండు పంటలును, పాలు పెరుగు వెన్నల నిచ్చునట్టియు వ్యవసాయమునకు పనికి వచ్చునట్టియు పశువులును గొఱ్ఱెలును, యంత్రశాలలయందు తయారగు వివిధ సామగ్రులును — ఇవి యన్నియు సంఘముయొక్క భాగ్యములే.

ఆంధ్రదేశపు ఆర్థికస్థితిని దెలిసికొనవలయు ననిన, ఈ మూలాధారములను, అవి జనోపయోగముకొఱకే విధముగ నుపయోగింపఁబడుచున్నదియును మనము గనుఁగొనవలయును. ఆంధ్రదేశమున పర్వతములును అడవులును చాలఁ గలవు. కాని, దేశము మిక్కిలి యుష్ణదేశ మగుటచే మన పర్వతములమీఁద పచ్చిక గాని గొప్పగొప్ప వృక్షములు గాని పెరుగుటకు వీలు లేదు. ఆంగ్లేయ దేశముయొక్క భాగ్యము వారి గొఱ్ఱెలనుండి కలుగుచున్న దని చెప్పవచ్చును. ఆంగ్లేయదేశపు ఉన్ని ప్రపంచములోని కెల్ల శ్రేష్ఠమయినది. అందుచే నా దేశస్థులు వ్యవసాయమును మాని భూములను బీడుల

క్రింద వదలివేసిరి. ఈ బీడులయందును అక్కడి పర్వతములమీఁదను శ్రేష్ఠమగు పొడుగైన పచ్చిక మొలచును. అందు గొఱ్ఱెలను మేపుచుందురు. కనుకనే ఆంగ్లేయ దేశము ఉన్నికి ప్రసిద్ధికెక్కినది. కాశ్మీరము మొదలగు హిమవత్పర్వతప్రదేశములలో చల్లగ నుండుటచే గొఱ్ఱెలను విశేషముగ పెంచుచుందురు. కాశ్మీరశాలువులు అనాదిగ జగత్ప్రఖ్యాతి చెందియున్నవి. అట్టి భాగ్యము ఆంధ్రదేశమునకు లభించెడి వీలులేదు. ఇచ్చట తయారగు ఉన్ని, కంబళ్ళు జోరాలు మొదలగు మోటు వస్త్రములను నేయుటకు మాత్రమే పనికి వచ్చుచున్నది. ఈ పరిశ్రమ లయినను నానాఁటికి క్షీణించుచున్నవి. ఏలూరు బందరు తివాచీలు ఇప్పటికిని కొద్దిగ ఆంగ్లేయ దేశమున కెగుమతి యగుచున్నవి. బళ్లారి కంబళ్లు ఆంధ్ర దేశములోని కెల్ల ప్రసిద్ధి చెందియున్నవి. ఈ పరిశ్రమలకు తగినంత ప్రోత్సాహ మున్నయెడల అభివృద్ధి నొందు ననుటకు సంశయము లేదు. దీనికి ప్రథమమున గొఱ్ఱెల జాతిని అభివృద్ధి చేయవలయును. మన దేశమున గొఱ్ఱెలు విస్తారముగ మాంసమునకు మాత్రమే పనికివచ్చుచున్నవి. అందుకయినను అవి చాలినంత మాంసము నిచ్చు శక్తిలేనివిగ నున్నవి. కనుక గొఱ్ఱెలకు ఉన్ని విస్తారము పెరుగునట్లును కండ యెక్కువగ పట్టునట్లును వానిని మంచిజాతితో 'కలపి' అభివృద్ధి చేయవలయును.

## అరణ్యములు

ఆంధ్రదేశమున అడవులు గూడ క్షీణదశకు వచ్చుచున్నవి. కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులు మన దేశమున ముఖ్యమయినవి. కాని, వానియందు విలువ గల టేకు మొదలగు చెట్లను పెంచుచున్నట్లు కనఁబడదు. కొండపల్లి నైజాము సరిహద్దులలోని అరణ్యప్రదేశములలోఁ గూడ మంచి టేకుచెట్లు లేవు. ఇక్కడ నుద్ది వేపె మొదలగునవి కలవు. భద్రాచలము చుట్టుప్రక్కల నుండు అరణ్యములలో టేకుకలప దొరకును కాని, సాధారణముగ మన దేశమునకు బర్మా నుండి విరివిగ టేకుకలప దిగుమతి యగుచున్నది. మన యరణ్యములను బాగుచేసి తగినంత శ్రద్ధ తీసికొనినయెడల మనకు కావలసిన కలప దొరకఁగలదు. అడవులు కేవలము కలపకొఱకే గాక, జనోపయోగమునకు పనికివచ్చు బహువిధము లగు పదార్థముల నిచ్చుటకును, పశువులకును గొఱ్ఱెలకును పనికివచ్చు పచ్చిక నిచ్చుటకును, దేశమును సమశీతోష్ణముగఁ జేయుటకును పనికివచ్చును. ప్రస్తుతము మన యడవులు సామాన్యజనులు చూచుటకు వీలులేకుండ క్రూరమృగములతో నిండియున్నవి. ప్రథమమున నీ జంతువులను వేఁటాడి చంపవలయును. ఇందునకు ప్రజలు ఆయుధములను విరివిగ ధరించుటకు స్వతంత్రు లయి యుండవలయును.

## గనులు

ఆంధ్రదేశమునందలి గనులను గుఱించిన విచారణ యెవరును చేసినట్లు కనఁబడదు. అందుచే నీ విషయమై మన కేమాత్రమును దెలియుట లేదు. మన దేశమున గనుల పరిశ్రమ మొదలుపెట్టవలసియున్నది. నందిగామ తాలూకాయందలి పరిటాల గనియాత్కూరు ప్రదేశములలో గనులనుండి వజ్రములు దీయుచుండిరి. కాని, ఆ గనులలో వజ్రములు అయిపోయినందున వానికి తిరిగి పరిశ్రమ చేసినవారు లేరు. నూజవీడు సమీపమునందలి గొల్లపల్లియొద్దఁ గూడ గొప్పగొప్ప వజ్రపు గనులు త్రవ్వఁబడుచుండెడివి. కృష్ణా గుంటూరు జిల్లాలు అనాదినుండియు గనులకు ప్రసిద్ధి వహించియున్నవి. ముత్యాల పరగణాయందలి పర్వతప్రదేశములలో ఇనుము దొరకు నని వాడుక గలదు. మంగళగిరిలో గంధకము గల దని ప్రతీతి యున్నది. కొండవీడు సింహాచలము తిరుపతి మొదలగు ప్రదేశములయందు ఏ లోహములు దొరకునో కనుఁగొనవలయును. ఆంధ్ర దేశమున టాటావంటి మహనీయుఁడు జన్మింపవలసి యున్నది. గూడూరుదగ్గర అభ్రకపు గనులలోను సింగరేనియందలి రాతిబొగ్గు గనులలోను కొంత పరిశ్రమ చేయఁబడుచున్నది గాని, అవి విదేశీయుల యధీనమున నుండుటచే మన కంత లాభకారులుగ నుండుట లేదు.

అభ్రకపు గనులు జర్మనీవారికి చెందియుండినందున, యుద్ధము ప్రారంభింపఁబడిన తరువాత ఆ పరిశ్రమ అంత రించినది. ఇందువలన మన పరిశ్రమలు విదేశీయుల యధీనమున నుండుటచే మన కెట్టి నష్టము గలుగునో కనుఁగొనవచ్చును.

వ్యవసాయము

ఆంధ్రదేశము ఫలవంత మయిన దని చెప్ప వచ్చును. కాని,కర్షకులు విద్యావిహీను లగుటచే భూము లనుండి తీయఁగలిగినంత సారము దీయలేకున్నారు. కొన్ని వేల సంవత్సరముల క్రింద ఏ యుపకరణముల నుపయోగించుచుండిరో, ఏ పద్ధతుల నవలంబించు చుండిరో, ఏ యెరువులను వాడుచుండిరో, ఆ యుప కరణములే ఆ పద్ధతులే ఆ యెరువులే ఈ రోజువఱకు ఆచరణములో నున్నవి. గవర్నమెంటువారు కోయం బుత్తూరులో నొక వ్యవసాయ కళాశాలను పెట్టిరి గాని, దాని యుపయోగమును సామాన్యజనులు పొందుట కవకాశము లేకున్నది. అందు తయారగు విద్యార్థులు గవర్నమెంటు ఉద్యోగములలో చేరుటకు పనికివచ్చు చున్నారు. ఇట్టి కళాశాలలు సామాన్యపు రైతుల కుపయోగముగ నుండునట్లు మార్పు చేయవలెను. ఆంధ్ర దేశమున కృష్ణా గోదావరి పెన్న నదులకు ఆనకట్టలు కట్టఁబడి, తద్ద్వారా చాల భూములు సాగుబడి చేయఁ బడుచున్నవి కాని, ఇట్టి లాభము దేశము మొత్తమును బట్టి చూచిన, చాల తక్కువ యని చెప్పవలసివచ్చు చున్నది. అనేక లక్షల కోట్ల యెకరములకు సరియైన జలాధారము లేక కేవలము వర్షాధారమునే నమ్ముకొని యుండవలయును. అందుచే దేశము క్షామబాధలకు లోనై మితి లేని కష్టములకుఁ బాలుపడవలసివచ్చుచు న్నది. నవీనకాలమున యంత్రసహాయమువలన కొన్ని జలాధారములనుండి నీటిని తోడి పంటలు పండించు చున్నారు గాని, అట్టి ప్రయత్నములు బహుస్వల్ప ముగ జరగుచున్నవి. ఏ విధమైన నీటి యాధారమును లేని ప్రదేశములలో భూమిలోనికి గొట్టములను దింపి బావులను త్రవ్వి నీటియాధారమును గల్పింపవచ్చును. ఈ పనిని ప్రథమమున దొరతనమువారు చేయవలసి యున్నది. ప్రతి తాలూకా స్థలములందును బోరింగు సామానులను నిలువయుంచి పీలైన గ్రామములయం దెల్ల బావులను త్రవ్వించినయెడల, వాని యుపయోగ మును తెలిసికొని రైతులు స్వయముగనే అట్టి బావు లను త్రవ్వుకొన మొదలుపెట్టెదరు. అందుచే సాధ్యమై నంతవఱకు క్షామదేవతను నివారణ చేయవచ్చును. ఆంధ్రదేశమునందలి గొప్పగొప్ప జమీందారులు, అం దును ముఖ్యముగ విద్యాధికులగు బొబ్బిలి విజయనగ రము కురుపాము పిఠాపురము మునగాల చల్లపల్లి వేంకటగిరి కాళహస్తి మొదలగు మహారాజులు, ఈ విషయమై యెక్కువ శ్రద్ధ వహింపవలసియున్నారు. వారిక్రింద గొప్పగొప్ప జమీనులు ఉన్నవి. తమ రైతు లకు వా రెన్నియో విధముల మార్గదర్శకులు కావచ్చు ను. వ్యవసాయాభివృద్ధి విషయమై మన జమీందారు లును రాజులును మహారాజులును ఏ మాత్రము జోక్యము కలుగఁజేసికొనుచున్నట్లు కనఁబడదు. వారు శ్రద్ధ వహించినయెడల, ప్రజల కెంతయో మేలు చేసిన వార లగుదురు. ఆంధ్రదేశమున వ్యవసాయాభివృద్ధికి మరియొక యాటంకము కలుగుచున్నది. పల్లెటూళ్లలోని గొప్ప రైతుల బాలురు పట్టణములకుఁ బోయి ఆంగ్లేయ విద్య నభ్యసించుచున్నారు. అందువలన నీ భూస్వా ములు తిరిగి తమ గ్రామములకు వెళ్లినయెడల, తాము నేర్చుకొనిన విద్య తమ భాగ్యము నభివృద్ధిచేసికొనుటకు పనికివచ్చుటకు మాఱుగా ప్రతికూలముగ నున్నది. వీరు బస్తీలలో నేర్చుకొన్నది బూట్సు సూట్సు వేసికొను ట,బయిసికల్ మోటారు బండ్లలో నెక్కుట. అందుచే వారు పల్లెటూళ్లకు వెళ్లఁగనే వ్యవసాయమునకు దిగుట అవమాన మని తలఁచెదరు. ఒకవేళ ప్రయత్నము చేసినను దుర్బలశరీరులై పనికివచ్చుట లేదు. వారు నేర్చుకొను విద్య యే తహశ్శీల్దారు కచ్చేరీలోనో 15 రూపాయల గుమస్తాగ నుండుటకు పనికివచ్చును గాని, వ్యవసాయాభివృద్ధి కుపయోగింపదు. అందుచేత పొల ముల నితరుల కిచ్చి అందువలన వచ్చు స్వల్పాదాయ

ములమీఁద నాధారపడియుండవలసినవా రగుచున్నారు. ఇది యెంతయు శోచనీయము. మన విద్యావిధానము మాఱవలయును. భూస్వాములు వ్యవసాయశాస్త్రము నభ్యసింపవలయును. తమ భూములను ఆధునిక పద్ధతుల ప్రకారము సాగుచేసికొనవలయును. ఇంతవఱకుకంటె ఎక్కువ యాధారమును పొందవలయును. అందుకుఁ దగిన సదుపాయములు గవర్నమెంటువారు చేయవలయును.

### పశువులు

వ్యవసాయకులకు పశువులు ముఖ్యము. మన యాంధ్రదేశమున దుక్కిపశువుల విషయమై తగిన శ్రద్ధ తీసికొనుట లేదు. ఒంగోలు పశువులు హిందూదేశమున మిగుల ప్రసిద్ధి చెందియున్నవి. ఈ నడుమ పశువుల సంతలు జరపఁబడుచున్నవి గాని, వానివలనఁ గలుగవలసినంత లాభము కలుగుట లేదని చెప్పుటకు చింతగా నున్నది. ఆంధ్రదేశములోని కర్షకు లందఱు నిట్టి సంతలకుఁ బోయి అచ్చటి కోడెలను ఆవులను కొనివచ్చి తమ ప్రదేశములలోని పశుజాతిని అభివృద్ధి పఱుపవలయును. ప్రస్తుతము ఒంగోలు సంతకు వచ్చు మేలయిన పశువులను అమెరికావారును ఆస్ట్రేలియావారును దీసికొనిపోయి భోజనమున కుపయోగపఱచుచున్నారు. ఇందుచే మన దేశమున కుపకారము గలుగుటకు మాఱుగా, జాతి క్రమముగా నంతరించుచుండుటచే, నష్టము కూడ వాటిల్లుచున్నది.

ఆంధ్రదేశమున దున్నపోతుల విషయమై గూడ తగినంత శ్రద్ధ తీసికొనుచుండుట లేదు. దున్నలు సామాన్యముగా మాగాని పొలములు దున్నుట కుపయోగించుచున్నారు. కాని, బొబ్బిలినుండి వచ్చు గమిని దున్నలు మెఱక వ్యవసాయమునకును బండ్లను లాగుటకును గూడ పనికివచ్చును. ఆవుల సంతతిని అభివృద్ధి పఱచుటకు ఆఁబోతుల నెట్లు కాపాడుచున్నారో, ఆ విధముగనే గేదె జాతికొఱకు దున్నపోతులను గూడ జాగ్రత్త పెట్టవలయును. ఈ విషయమునఁ గూడ జమీందారులు ప్రజలకు చాల సహాయము చేయఁగలరు.

మన దేశమున పశువుల క్షీణదశకు మరియొక కారణము గూడఁ గలదు. కొద్దికాలము క్రిందటివఱకును ప్రతి గ్రామమునకును చాలినంత బీడు ప్రదేశము లుండెడివి. అవి క్రమముగ నంతరించి వ్యవసాయయోగ్యముగ మార్పఁబడినవి. ఈ సందర్భమున మాగాని భూములు గల గ్రామస్థులు మిక్కిలి దూష్యులు. పశువులు విహరించుటకు చాలినంత ప్రదేశము లేకపోవుటచేతను, బలముగల పచ్చిక నిచ్చు స్థలములు శూన్యమగుటచేతను, పశువులు క్షీణించుచున్నవి. అందువలన వ్యవసాయమునకు నష్టమే కాక, ప్రజ లుపయోగించుకొనుటకు పాలు పెరుగు వెన్న మొదలగు పదార్థములు కూడ అదృశ్య మగుటచే ఆంధ్రులు శరీరపటుత్వము లేనివా రగుచున్నారు. ఇది కడు శోచనీయము.

### పరిశ్రమలు

ఆంధ్రదేశమున వ్యవసాయము జనసామాన్యమున కంతకును ముఖ్యపరిశ్రమ యయియున్నది. పూర్వకాలమున మన దేశమునకు కావలసిన సరకులు మన పరిశ్రామికులు తయారు చేయుచుండెడివారు. ఇక్కాలమున కేవల మాహారపదార్థములు తప్ప, మిగిలిన వస్తువు లన్నియును విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్నారు. అందును, మన దేశమున పండు పంట దినుసులను విదేశములకుఁ బంపి వానివలన తయారగు సరకులను తెప్పించుకొనుట కడు విచారకరమయిన సంగతి. ఆంధ్రదేశమునుండి ప్రత్తి, చమురు గింజలు, వస్తువిశేషముగ నెగుమతి చేయఁబడుచున్నవి. వీనిలో ప్రత్తి ముఖ్యము. ప్రత్తినుండి గింజలను దీయుటకును, ప్రత్తిని అదిమి చిన్నచిన్న బస్తాలుగ చేయుటకును కొన్ని యంత్రము లున్నవి గాని, ప్రత్తిని వడికి నూలు తీయుటకుఁ గాని, నూలును నేసి వస్త్రములు తయారు చేయుటకుఁ గాని యంత్రములు బొత్తిగా లేవు. ఆంధ్రులు నూలు నేతకు ప్రసిద్ధి చెందియున్నారు. ఉప్పాడ పెదన చీరాల పుల్లంపేట మొదలగు ప్రదేశములు ఇప్పటికిని నూలునేతకు ప్రసిద్ధి చెందియున్నవి. కాని, మొత్తముమీఁద ఆంధ్ర సాలీ లందఱును వ్యవ

సాయకులుగనో, కూలిపని చేయువారుగనో మాఱిపోయిరి. దీనికి ముఖ్యకారణము విదేశములనుండి దిగుమతి యగు చౌక వస్త్రములే. అక్కడ గొప్పగొప్ప యంత్రములు పెట్టి చేతిపనికంటె పెక్కురెట్లు ఎక్కువ సరకు దిగుబడి చేయుచుండుటచే, మన దేశమునుండి ఎన్నియో ఖర్చులు పెట్టి ప్రత్తిని తీసికొని వెళ్లి తిరిగి అన్ని ఖర్చులు పెట్టి మనదేశమునకు వస్త్రములు దిగుమతిచేసి కూడ చౌకగ నమ్మఁగలుగుచున్నారు. అందుచే పోటీకి ఆఁగలేక మన సాలీలు ఇతర జీవనోపాధిని వెదకుకొనవలసినవారయిరి. స్వదేశోద్యమము ప్రజల మనంబు నాకర్షించిన దాదిగ మన నేత పరిశ్రమ, కొంచెముగ నయినను, మాఱిన దని చెప్పవచ్చును. ఫ్లయి షటిలు మగ్గములు అచ్చటచ్చట ఉపయోగింపఁబడుచున్నవి. వీనివలన ఎక్కువ పని జరగు ననుటకు సంశయము లేదు. మన దేశ మెప్పటికయిన స్వశక్తి మీఁద నాధారపడు కాలము వచ్చినయెడల ఈ ఫ్లయి షటిలు మగ్గములే తరణోపాయము. ఫ్యాక్టరీలవలన అనేకనష్టములు కలుగుచున్నవి. పాశ్చాత్యవిద్యాధురీణులు తమ దేశములలో ఫ్యాక్టరీలు కలిగించు నష్టములను వేనోళ్ల ఖండించుచున్నారు. ఇది కను జాగ్రత్తగ నాలోచింపవలసిన విషయము. అక్కడక్కడ కొన్ని ఫ్యాక్టరీలు వెలసినను, గృహములలో నడపఁబడు పరిశ్రమల నంతమొందింపఁదగదు ఇందుకు గవర్నమెంటువారి పరిపాలనావిధానము మాఱవలసియున్నది. ఇండియా గవర్నమెంటువారికి ఆర్థికస్వాతంత్ర్యము రావలసియున్నది. అపుడే మన పరిశ్రమలకు జీవము కలుగును. ఆంధ్రదేశమున అనేక కర్మశాలలు బయలుదేఱుచున్నవి గాని, అందులో చాల భాగము వడ్లను బియ్యము చేయునవిగా నున్నవి. ఏలూరులోని జూటుమిల్లు, విశాఖపట్టణములోని నాలుగైదు నారయంత్రములు తప్ప, మిగిలినవి దేశమున కంత యుపయోగకరములుగా లేవు. నూలు వడకుటకును నూనె దీయుటకును ఎముకలను పిండి చేయుటకును అనేకకర్మశాలలు పెట్టింపవచ్చును. మన దేశమునుండి నూనెగింజలను ఎగుమతి చేసి నూనెను దిగుమతి చేసికొనుచున్నాము. బియ్యమును ఎగుమతి చేసి స్టార్చిని, దూదిని ఎగుమతి చేసి వస్త్రములను, తవుడు ఎగుమతిచేసి బిస్కట్టులను తెప్పించుకొనుచున్నాము. కావలసినంత చెఱుకును పండించి బెల్లమును బెల్లమునుండి పంచదారయును చేసికొనఁగలిగియు, విశేషముగ పంచదారను విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్నాము. ఆంధ్రదేశమున కంతకును బళ్లారిలో పంచదారను చేయు యంత్రశాల యొకటి మాత్రము గలదు. మన దేశమున పరిశ్రమల విషయమయి గూడ మహారాజులును ధనవంతులును అనేక విధముల సహాయము చేయఁగలరు. బరోడా మహారాజుగారు తమ ప్రజలకు చేయు సహాయమును జూచి యయినను మన ఆంధ్రదేశీయపు మహారాజులు తమ విధ్యుక్తధర్మమును నెఱవేర్పవలసి యున్నది.

## బ్యాంకులు

విదేశములతోఁ బోల్చి చూచిన,హిందూదేశము వర్తక వ్యాపారమునందు చాల వెనుకపడియున్నది. ఆంధ్రులు ఈ విషయములో మిగిలిన హిందూదేశీయులనే పోలి యున్నారు. వర్తకమునకును పరిశ్రమలకును ముఖ్యాధారము ధనము. ఈ ధనము మన దేశమున సామాన్యముగ భూముల తాకట్టుమీఁదఁ గాని ఆభరణముల తాకట్టుమీఁదఁ గాని యియ్యఁబడుచున్నది. కాని, బ్యాంకు లున్నయెడల, ప్రతివారును తమ ధనమును వానికి అప్పుగ నిచ్చుచుండవచ్చును. ఆ ధనమును బ్యాంకులు వ్యవసాయమునకుఁ గాని పరిశ్రమలకుఁ గాని యుపయోగించు నిమిత్తము అప్పిచ్చుచుండును ఇట్టి బ్యాంకులు లేనియెడల, ధనమును ఖర్చుపెట్టుటయో లేక పూడ్చిపెట్టుటయో జరగుచుండును. మన దేశమున నీ రెండు పనులును జరగుచున్న వని చెప్పవచ్చును. అప్పులను గొప్ప సంస్థాపనల ద్వారా యేర్పాటు చేసినయెడల, ఎక్కువ లాభము గలుగును. విశేషభాగ్యవంతులు గాని ఆసాములు గూడ తమ స్వల్పాదాయమును బ్యాంకులకు ఇచ్చినయెడల, అట్టి చిన్న మొత్తములను పోగుచేసి గొప్ప మొత్తములను

చేసి బ్యాంకులు సద్వినియోగములకు ఖర్చుపెట్టు చుండును. ఇందువలన పత్రములు వ్యాజ్యెములు మొదలగు బాధలు తగ్గును. వర్తకము అభివృద్ధి యగును. తద్ద్వారా భాగ్యము వృద్ధి చెందును. మన యాంధ్ర దేశమున జాయింట్ స్టాక్ కంపెనీలును పరపతి సంఘములును అభివృద్ధి కావలయును. ఇంతవఱకు కృష్ణా జిల్లాలో నొక కోఆపరేటివ్ బ్యాంకు దప్ప మరెక్కడను అట్టివి స్థాపించినట్లు కనఁబడదు. ఇట్టి బ్యాంకులు ప్రతిజిల్లాయందును స్థాపింపఁబడవలయును. అందువలన రైతులకు కొంచెము వడ్డీకి అప్పు దొరకుటయే గాక, సకాలమున తమ ధాన్యమును అమ్ముకొని నెమ్మదిగా తమ యప్పులను దీర్చుకొనుటకుఁ గూడ వీలు గలుగును.

### పరిశ్రామిక పాఠశాలలు

దేశమునందు పరిశ్రామికాభివృద్ధియు తన్మూలమున ఆర్థికాభివృద్ధియు కావలయు ననిన, పరిశ్రామిక విద్య వ్యాపింపవలయును. ఆంధ్రదేశమున పరిశ్రామిక పాఠశాలలు 5 మాత్రమే గలవు. మరికొన్ని క్రైస్తవ మిషనరీలచేత అనాథ క్రైస్తవ బాలురకొఱకు ఏర్పఱుపఁబడి యున్నవి. ఈ విద్యాశాలలలో ఆంధ్రజాతీయ కళాశాల ముఖ్యముగఁ బేర్కొనఁబడవలసియున్నది. కేవలము పరిశ్రమవిద్య నభ్యసించినయెడల, లాభము లేదు. పరిశ్రమలకు సంబంధించిన జాతులవారి పిల్లలందఱును తమ తల్లిదండ్రుల దగ్గఱ తమకు తగిన విద్య నభ్యసించుచునే యున్నారు. కాని, అది కేవలము చేతి నేర్పరితనమును అభివృద్ధి చేయునే గాని జ్ఞానము నభివృద్ధి చేయఁజాలదు. అందునకు పరిశ్రమవిద్యతోఁ బాటు సామాన్యవిద్య గూడ నేర్పఁబడవలయును. అప్పుడే పరిశ్రామికులు జ్ఞానవంతులై తమ తెలివిని వినియోగపఱచి పరిశ్రమలను అభివృద్ధి చేయుదురు. నూతన పద్ధతులఁ గనిపెట్టుటకుఁ గాని వానిని ఉపయోగించుటకుఁ గాని వీలగును. కనుక పరిశ్రామికవిద్యతోఁ బాటు సామాన్యవిద్యను గూడ నభ్యసించుట అత్యంత మవసరము. భాగ్యముతో తులతూఁగుచుండు పాశ్చాత్యదేశములలో నీ పద్ధతు లవలంబింపఁబడుచుండుటచేతనే వారి పరిశ్రమలు అభివృద్ధికి వచ్చినవి. ఆంధ్రదేశమున సామాన్యవిద్యయందుఁ గూడ ప్రజలు ఇతర దేశస్థులకంటె వెనుకఁబడియున్నారు. కనుక విద్యాశాలలును పరిశ్రామికాలయములును అభివృద్ధి చెందవలయును. ప్రతి యాంధ్రుఁడును విద్య నేర్చినవాఁడుగ నుండవలయును. ప్రాథమికవిద్యను నిర్బంధము చేసిననే కాని దేశము ఉన్నతదశకు వచ్చుటకు వీలులేదు. అందుకై ప్రతి యాంధ్రుఁడును ప్రయత్నము చేయునుగాక యని ప్రార్థించుచున్నాను.

# సహజలావణ్యము

బసవరాజు అప్పారావు గారు

మోము తీరు సామాన్యమే? ముగుద! కురులు
ముడిచి కుంకుమ బొట్టును మోమున నిడి
నంత నే యింత సొగ సెట్టు లబ్బెఁ? జెప్పు
వే చెలి! వినంగ నా మది వేడ్క పుట్టె.
తీఁగెదీపమ్ము కాంతి నల్దెసలఁ బర్వి
చదల చీఁకటి నిటునటు కదలఁబాఱఁ
జేయుచుండ, నొయారమ్ము చెలఁగ నిలిచి
మాటలాడెడి నీ సొగసు మనము గొనియె.
చెలియరో! దేవలోకమ్ము చేడెల వగు
లోపమే లేని యుత్తమరూపములను
గంటిఁ గాని, యదేమొ నా కన్నులకును
నీదు మూర్తియె మోదమ్ము నించె నిజము
ఉత్తమాకృతి జీవసంపత్తి గలుగు
సహజలావణ్యమున కెట్లు సాటి వచ్చు!

# సంకల్ప సామర్థ్యము

కంచనపల్లి కనకమ్మ గారు

మన దేశమునందు విద్య విశేషముగ వ్యాపింపక పోయినను, విద్వాంసు లనేకులు గలరు. వారు సయితము స్వశక్తినిశ్చయము లేక, విధి ప్రాబల్యమునకు శరణాగతు లయి, పురుషప్రయత్నములు మానుకొని దేశోద్ధరణదీక్షాపరతంత్రులు కాక, తమ కాలమును వ్యర్థపఱచుచున్నారు. ప్రతిసదుద్యమము నకును విఘ్నము లనేకములు కలుగుచుండును. ప్రపంచము ద్వంద్వభూయిష్ఠమై పరఁగుచున్నది. నీడ లేని వెలుఁగును, శీతలము లేని వేఁడిమియు, దౌష్ట్యము లేని సుకృతమును, లోపము లేని నీతియు, శశవిషాణప్రాయ ములే యగును. కేవలదుర్గుణము గాని కేవలసుగుణము గాని స్వభావమునం దభావముగ నున్నది. దోషైక దృక్కుల పరిహాసమునకుఁ బాత్రము గాని విషయ మెద్దియు నుండదు. శత్రుభీతి గాని మిత్రపరిత్యాగము గాని కార్యాచరణమునకు ఆటంకము లై స్వశక్తి నిశ్చయజ్ఞానసంపన్నులకుఁ బరిణమింపవు. స్వసామర్థ్య మునందు మహావిశ్వాసము గల దృఢచిత్తులకుఁ బ్రపంచ మెవ్విధంబుగ కార్యసాఫల్యమునకు మార్గమును గల్పించుచున్నదో, తన్మార్గమునుండి అభ్యంతరము లెల్ల తొలఁగి మటుమాయమై పోవుచున్నవో గమనించిన కొలఁది ఆశ్చర్యము కలుగుచున్నది. తాము చేయఁ జాల మని తలంచినవారికి అట్టి పనిని జేయఁగలుగుట కెట్టి శాస్త్రమును దోడ్పడదు. పరులచేఁ బరిహసింపఁ బడఁజాలని నిర్దుష్టయోగ్యత గల దృఢసంకల్పులకు అపజయము కలుగనేరదు. ఎట్టి దారిద్ర్యము సంభవించినను, విపత్తు కలిగినను, క్లేశ మొనఁగూడినను, దురదృష్టము చుట్టుకొనినను, నిర్భయమనస్కులు ధర్మానుష్ఠానమునుండి చలింపఁజాలరు. ఎట్టి కష్టకాలమునకుఁ దాము లోనైనను, అట్టివారలు తాము దలంచిన కార్యసాఫల్యమునందు తదేకదృష్టి గలవారై, గట్టి పట్టుదలతో ముందునకుఁ ద్రోసికొని పోవుచుందురు.

ఎట్టి సామర్థ్యము గలిగియుండినను, దానిని తిరస్కరించుచు, భంగములనే తలపోసికొనుచు, పరాభవములనే పలుమాఱు వచించుచు, తమ మార్గమందు దుర్ఘటమైన కష్టములు గల వని మొఱపెట్టుకొనుచు, భంగమే ప్రాప్య మగు పథంబున నడుగు లిడుచుండెడు పురుషులు జయశీలు రగుట కెంత కాలము పట్టునో కదా? అట్టివారు కార్యసాఫల్యము నొందుదురని యెవ రయినఁ దలంచెదరా? మన శక్తియందు మన కనుమానము గలిగి నమ్మకము తగ్గుటకుఁ బ్రారంభించిన క్షణముననే శత్రువునకు మనము వశ్యుల మగుచున్నారము. దుర్బలమును, నిష్ప్రయోజకత్వమును, సామర్థ్యలోపమును స్వీకరించుటచే సర్వప్రయత్నముల కాధారభూతమైన ధైర్యము నీరస మగును. ఎంత కాలము అనుమానగ్రస్తులమై, ప్రతికూలబద్ధులమై, ఉత్సాహరహితులమై ప్రపంచమునఁ బ్రవర్తింతుమో, అంతవఱకును భంగము, పరాభవము, అపజయము మనకుఁ దటస్థించుచుండును. అట్టితలంపులను మాని దృఢప్రయత్నముతో ధైర్యోత్సాహపూరితులమై, జయైకదృష్టి కలిగి, కార్యాచరణమునకుఁ గడంగినచో, అన్నియు మన కనుకూలములుగ మాఱుచుండును. ప్రపంచమంతయు నవీన రూపంబున లోచనగోచర మగును. దేనికై మనము సర్వదా ప్రయాసపడుచున్నారమో, దేనిని గమనించి నమ్మి, పొందుటకు కఠినప్రయత్నములు సేయుచున్నారమో, అయ్యది మనకు ననతిదూరమై త్వరితముగ లభించును. బలము, ధైర్యము, ఉత్సాహము, ఉల్లాసము, అభిమానము, పట్టుదల కలిగి సంపూర్ణమైన నిశ్చలసంకల్పముతో, ఏకార్యమును జేయఁబూనినను అయ్యది ఫలవంతము కాకయుండదు. మైత్రి గాని, వంశము గాని, అధికారము గాని, ద్రవ్యము గాని, కార్యసాఫల్యమున సంకల్పసామర్థ్యమునకు సాటి రావు. స్వశక్తినే నమ్ముకొనియుండుట ఉత్తమమైన ధర్మము. పరశక్తిని నమ్మి పని చేయఁబూనుట సాహసము. అపాయమును నగును. తమకంటె శక్తిహీనులుగ నున్నవారు తరుణమును గనిపెట్టి కార్యానుకూల్యము గావించుకొనుచుండఁగ, శక్తి గలవారు పిఱికితనముచే అనుకూలములైన అవకాశములు తటస్థించినను, కార్యమునకుఁ బ్రయత్నింప కుండుటకు వారు తమ సామర్థ్యమును గుర్తెఱుంగ కుండుటయే కాక, తమకు ప్రమాదము పరాభవము భంగము పొరపాటు కలుగునేమో యని భీతిల్లుట కూడ కారణ మగుచున్నది. అశక్తతకంటె, వెనుక కడుగు వేయుట భయము నొందుట, ధైర్యహీనత, కార్యసాఫల్యమునకు మహత్తర శత్రువులుగఁ బరిణమించుచున్నవి. పొందవలసిన పరమార్థమునకే ప్రాధాన్య

ఏయ్యవలయును గాని అట్టి పరమార్థప్రాప్తికి వలయు సదుపాయముల నూహించుట కంత ప్రాధాన్యంబుఁ జూప నవసరము లేదు. మహత్తమమైన శక్తి స్నాయువులందుఁ గాక సంకల్పమునందుఁ గలదు. గొప్ప విపత్తు హఠాత్తుగ తటస్థమైనప్పుడు, మనకు సాధారణముగ నుండు బలముకంటె పెక్కుమడుంగు లెక్కువ శక్తి మనకుఁ గలుగుచున్నది. అప్పు డెట్టి భయము, పిఱికితనము, మనలను బొందుట లేదు. సాధారణముగ నుండుతఱి మన కలవికాని మహాత్కార్యములు, విశేష సమయములందు మానసికశక్తి ప్రబలమై, దృఢసంకల్ప ప్రభావంబున శరీరమునందలి స్నాయువులకుఁ దాత్కాలికముగ నత్యద్భుతబలము గలుగుటచే, నతిసులభముగ మనచే నొనరింపఁబడుచున్నవి. సంకల్ప సామర్థ్యము అపారము, వర్ణనాతీతము, అవాచ్యము.

ఎట్టి పని చేయఁబూనినను, ఎంతవఱకు మనము దానిని చేయఁగల మను నమ్మకము మనకు జనించునో అంతకు మించి మన మొనరింపఁజాలము. మనయందు మనకు నమ్మకము లేక సంశయము గలిగిన, మన మే పనిని కూడ చేయఁజాలము. భంగ మగు నను తలంపు భంగమునకే దారి చూపును. జయ మొందెద మను సంకల్పము జయమునే లభింపఁజేయును. జయశీలతకు సంతోషము, మేలు కలుగు నను సద్భావము, స్వభావములై తనరుచున్నవి. వికసితహృదయారవిందమును ఉల్లాసభరితమానసమును భయసంశయవిచ్ఛేదకములై నూత్నప్రభావమును గలుగఁజేసి కార్యానుకూల్యము గలిగించును. అట్టివానికి సర్వకార్యములు నిర్విఘ్నములుగ జరగును. మనలను పరివేష్టించియుండు దారిద్ర్యమును గాని దురదృష్టమును గాని ఎంతమాత్రము లక్ష్యము సేయక గాఢమైన శ్రద్ధతో పూనిన కార్యసాఫల్యమునకై నిశ్చలవ్రతముతోఁ బ్రయత్నింపవలెను.

మనకు సంభవించిన స్థితిగతులకు మనము లొంగక, మన కవి స్వాధీనము లగునట్లు మన మేర్పఱచుకొనవలయును. మన యాధిక్యమును స్థిరపఱచుకొనవలయును. మన శక్తిని దృఢపఱచుకోవలయును. జయించుటకు మనకు శక్తి కలదని మన కెప్పుడు నమ్మకము గలుగుచున్నదో, అప్పుడే మన సంకల్పములు ఫలవంతము లగుచున్నవి. అట్టి నమ్మకమే మన బలమునకు వృద్ధి. బుద్ధివికాసము మనస్సునకు ప్రభావమును గలిగించుచున్నది. అట్టి నమ్మకముయొక్క అద్భుతశక్తి వలన లభింపని దేది కలదు? దాని మాహాత్మ్యముననే కళలు కల్పనలు శాస్త్రములు విశేషములుగ వెలువడినవి. స్వశక్తిపరిజ్ఞానమే స్వప్రయత్నమును పురిగొల్పును. స్వప్రయత్నమే ప్రతిపురుషునికిని జయోత్సాహమును పూరించును. నమ్మకము దైవసంబంధమైన దివ్యదృష్టిని గల్పించి కార్యానుకూల్యమునకు పరమ సాధన మగుచున్నది. భౌతికసంబంధమైన శారీరకశక్తికంటె, ఆత్మసంబంధమైన మానసికశక్తి సంకల్పమునకు మహోద్బలమైన సామర్థ్యమును గలిగించి సామాన్యుల కసాధ్యమైన కార్యములను ఫలవంతములుగ నొనరించును. అనృతము, అప్రమాణము, మోసము, స్వార్థపరాయణత్వము, క్రౌర్యము మానసికశక్తిని మట్టుపఱచును. సత్యము, ప్రమాణబుద్ధి, నిష్కాపట్యము, స్వార్థత్యాగము, ప్రేమ సంకల్పశక్తిని అభివృద్ధిపఱచును. ప్రపంచమునం దుద్భవించి దేశసేవ సేసి సర్వజనమనోరంజకమగు మార్గ మవలంబించి, అనుదినము మనచే పూజింపఁబడుచున్న మహాత్ములు, తమ భావనాబలముననే మానసికప్రభావముననే కదా, అంధకారబంధురమైన సంశయములు కష్టములు చిక్కులు ఎన్ని సంభవించినను, మహాధైర్యముతో లోకోపకారమతితో నిశ్చలమైన పట్టుదలతో పాటుపడి ప్రకాశవంతములగు దివ్యఫలితములను జనుల కొసంగిరి. మానసికశక్తియందు నమ్మకమే సన్మార్గప్రబోధకము, దుర్మార్గనిరోధకము. దాని ప్రభావము అమానుషము, అత్యద్భుతము. ఇట్టి నమ్మకమును అహంకారముగాను స్వప్రయోజనవాంఛగాను ఎంచఁగూడదు. మన నమ్మకము మనకును అనంతబ్రహ్మమునకును సంబంధము గలుగఁజేయుచున్నది; అపారమైన సంభావనీయతకును అపరిమితమైన శక్తికిని మార్గమును గల్పించుచున్నది.

దృఢసంకల్ప ప్రభావంబున సంశయములు నశించును; విఘ్నములు తొలఁగును, భయ మడుగంటును; భంగము సమసిపోవును, ఛిద్రములు చిందరవందరలై పోవును; వ్యాకులత్వము వదలును, పరాభవము పలాయన మగును, శ్రద్ధ నిష్ఠ ధైర్యము సత్యము అహింస సత్ప్రవర్తన లోకోపకారము, స్వార్థత్యాగము అభివృద్ధి చెందును. సంకల్పముయొక్క సామర్థ్యమే కదా విశ్వసృష్టి? ఇఁక నేమి చెప్పనగును?

# ఆంధ్రుల దేశసేవ

*

వడ్లమాని సుబ్బరావు గారు, బి. ఏ.

ఈ యంశమును గుఱించి కొంతయైనను వ్రాయుటకు నేఁటికి కొంచె మధికారము కలిగినది. సంఘసంస్కరణములోఁ గాని రాజకీయవిషయములలోఁ గాని వార్తాపత్రికావిషయములోఁ గాని విద్యావిషయములోఁ గాని పారిశ్రామిక విషయములలోఁ గాని, మనవారు చేయుచున్న పని వ్యక్తీకరింప నర్హత కలిగియున్నది. ఇండియాలోని యితరభాగములవారు కూడ మనలను జూచి నేర్చుకొనవలసినవి కూడ కొన్ని యున్నవి. అన్ని విధములను మనవారు మేల్కొని యున్నారు. మేల్కొనుటయే కాదు, చేయుచున్నారు. చేయుటయే కాదు, పట్టుదలతో పని చేయుచున్నారు. కొన్నిటిలో మార్గదర్శులుగా కూడ నున్నారు. శౌర్యము వలయు పనులలో కూడ నడ్డి కట్టఁగలవా రనిపించుకొనుచున్నారు. గొప్ప యౌదార్యమును గూడ కనఁబఱచిన యంశము లున్నవి. దేశాభిమానము నాసాఁటి కితరభాగములవారికిఁ దీసిపోకుండ నెక్కువగుచున్నది. తెలివిలో నెవరికిని దీసిపోరని స్పష్టపఱచుచున్నారు. ఇన్నిటికిని మొదట మేలుకొలుపులు పాడినది భూమశకట మనవచ్చును. ఒక్కొక్క యంశమును గుఱించి యాలోచింతము.

అన్నిటికిని వృద్ధికారణ మగు పారిశ్రామికములను గుఱించి యాలోచింతము. ఈ విషయములో చెన్నపురి రాజధానికి మార్గము గనఁబఱచినవి ధాన్యపు మఱ లని మన మనునవి కృష్ణ గుంటూరు గోదావరి జిల్లాలలో కుప్పతిప్పలుగ నున్నవి. వానివల్ల దేశమునకు లాభ మేమనవచ్చును? ఇతర స్థలములనుండి లాభము లనేక వస్తువులకు వచ్చుటయే గాక, ఉపకరించు పనులను జూచి యాంధ్రు లనుకరింపఁగలవా రని స్పష్టమగుచున్నది. వానికి పుట్టినిల్లు గుంటూరు. ఒకరిని జూచి యొకరు అట్టట్టె యెన్నెన్నియో కట్టినారు. వానివల్ల కలుగు అపరిమితమైన లాభ మేమన, యంత్రములను జూచుటయు, వాని పనిని గ్రహించుటయు, వాని మంచిచెడ్డలను అనుభవములోనికిఁ దెచ్చుకొనుటయు, ఆ మఱలు లేకున్న మనవారి కెంత మాత్రమును లభింపకపోయి యుండును. ప్రత్తి యంత్రములు కూడ వానినుండి వచ్చినవే. ఇంత యేల, ఏలూరులోను గుంటూరులోను గల గోనెలు నేయు యంత్రములు కూడ ధాన్యపు యంత్రముల మూలమున కలిగిన పరిచయమువల్లనే వచ్చిన వనుటకు సందియ మేమి? కర్జను ప్రభువుగారి పరిపాలనలోఁ బట్టిన స్వదేశవస్తువుల యందలి యభిమానము కాదు, దీనికి మాతృస్థానము. అది పుబ్బలో పుట్టి మఖలో మాడినది. అక్కడక్కడ సబ్బుబిళ్లలు క్రొవ్వువత్తులు చేయు శాలలు నిర్మించి కొంతవఱకు పని చేసిరి గాని, అవి యన్నియు అప్పుడే అంతరించిపోయినవి. ఇప్పటికిని యంత్రసాధ్యములైన పనులను గుఱించి ప్రశంసించుట గాని ప్రయత్నము చేయుట కాని, ధాన్యపు మఱలు పుట్టి జనసామాన్యమునకు కూడ తెలియుటవల్లనే. బందరులో నున్న ఆంధ్రజాతీయ కళాశాల కూడ దానికి సహకారి యైన పనులను నేర్పుచున్నది. సుమారు పన్నెండు సంవత్సరముల క్రిందట పెన్సిల్ చేయుటకు విశాఖపట్టణము జిల్లాలో ప్రయత్నించిరి. దానికి మార్గమును చూపినవారు మన దేశములో చాల పేరు గాంచిన కే. ఎస్. నారాయణరావు పంతులుగారు, పడరాని శ్రమలు పడి, ఆత్మలాభము ఏమియు చూడక, సంవత్సరముల తరబడి దేశములో పారిశ్రామికాభివృద్ధికై పాటుపడిన మహనీయుఁడు. దేశసేవను పరిశ్రమలలో కనఁబఱచినవారిలో నింతటి స్వార్థత్యాగి మన దేశములో లేఁడని కీర్తిశేషులైన కృష్ణస్వామయ్యరు మొదలగువారు చెప్పియుండిరి. మూఁడు నాలుగు సంవత్సరముల క్రిందట హిందూదేశపు గవర్నమెంటువారి నారాయణరావు పంతులు గారికి పెన్సిల్ చేయుట యిండియాలో సాధ్యమా యను విషయమున ననేక ప్రశ్నలు వేయుచు వ్రాసియుండిరి; దాని కాయన వ్రాసినదానిం జూచి 'వెలలేని' సంగతులను గుఱించి వ్రాసి రని వారికి వందనము లాచరించుచు జవాబు వ్రాసిరి. మండలపారిశ్రామిక సభ ప్రప్రథమమున విశాఖపట్టణమున ప్రతిష్ఠింపఁబడి నేఁటికిని సాగుచున్నది తక్కిన జిల్లాలలో నింకను అట్టి సభలు లేవు. తంజావూరు జిల్లా ధాన్యపు గని కాదా? అయినను, అక్కడ ధాన్యపు యంత్రము లెన్ని యున్నవి? ఎప్పటినుండి? పరిశ్రమలలో నాంధ్రదేశము చెన్నపురి రాజధానిలో నగ్రగణ్యమై యున్నది. ఇంతియ కాదు. స్త్రీలకు పారిశ్రామికవిద్య నేర్పుటకు పాఠశాల యొకటి యుంచుటకు బరంపుర వాస్తవ్యులు రంగాభట్ల గున్నయ్యశాస్త్రులు గారు పడుచుండిన పాటులు మిగుల శ్లాఘనీయములు. బళ్లారిలో నున్న పాఠశాలలో నేర్చుకొనుట కొకయామెను పంపియున్నారు. అది ధనసాధ్యమే కాదా! దానికి సహకారులైనవారిలో భూపతిరాజు వేంకటపతిరాజు గారు ముఖ్యులు. అందు నిమిత్తమై యొక పాఠశాలను విశాఖపట్టణములోనుంచుటకు స్థిరపఱచి వారు బళ్లారికి పంపిన స్త్రీరత్నమును నేర్పుటకయి యేర్పఱచినారు. త్వరలోనే యది యారంభ మగును. ఉపాధి లేని స్త్రీ లెందఱో నేర్చుకొని, స్వతంత్రజీవనము చేయుట కవకాశము కలుగును కదా. పారిశ్రామికోత్సాహము ఆంధ్రదేశమున కాలక్రమమున వృద్ధి కాంచఁగలదు. దీనిని గుఱించి వ్రాయవలసిన యంశము లనేకము లున్నను,

స్థలాతిక్రమణ మగు నను సందియమువలన వ్రాయలేదు.

విద్యావిషయమున జరగుచున్న పని ఉత్సాహజనకమై యున్నది. పెద్ద పరీక్షలలో కృతార్థులగుచున్నవారి సంఖ్య ఎక్కువగుచున్నది. పాండిత్యమున వన్నెకెక్కినవారి సంఖ్య ఎక్కువగుచున్నది. కీర్తిశేషులైన గురజాడ అప్పారావు పంతులు గారును రావు సాహేబు గిడుగు రామమూర్తిపంతులు గారును ఆంధ్రభాషావాఙ్మయములకు వన్నెతెచ్చుటెట్లనుదానిని గుఱించి ఎంతయో పని చేసియున్నారు. వారి యభిప్రాయము జనసమ్మత మయినను కాకున్నను, వారి పరిశ్రమ మాత్రము అనుసరణీయమును, స్తోత్రపాత్రమును. అట్టి సవరణ దేశభాషల కన్నిటికిని అవసరము. తెనుఁగు భాషలో పూర్వము నవలలు లేని లోపము తీరుచున్నది. ఆంధ్రభాష కొక సంపూర్ణమైన నిఘంటువు పిఠాపురము రాజు గారి మహోదార్యమువల్ల ఆంధ్రపరిషత్తువారు వ్రాయించుచున్నారు. విజ్ఞానచంద్రిక మొదలగు గ్రంథప్రచారిణీసంఘము లెన్నియో బయలువెడలి తెనుఁగు దేశమున కత్యంతోపకారము చేయుచున్నవి. ఒక్క నవలలే కాదు. శరీరశాస్త్రము చరిత్ర అర్థశాస్త్రము మున్నగు గొప్ప గ్రంథములు తెలుగున వ్రాసినారు. మండలసభలలో నుపన్యాసములు తెనుఁగున నిచ్చుచు ప్రజలను ముందునకుఁ దెచ్చుచున్నారు. బందరులోని ఆంధ్రజాతీయకళాశాల ఆంధ్రదేశీయుల దేశాభిమానమునకును వితరణకును స్వార్థపరిత్యాగమునకును ధ్వజము కాదా? దానిని స్థాపించి దొరతనమువారివల్ల కూడ మెప్పువడయునట్లు నడపించుచున్న మహనీయులను గుఱించి ఏ దేశ మైనను అతిశయపడవలసినదే. విశాఖపట్టణమున నున్న వైద్యవిద్యాశాలకు దివ్యభవనమును కట్టించిన కీర్తిశేషులగు మహారాజా సర్ నారాయణగజపతిరావు గారి పే రెన్నఁడైన మఱువఁగలమా? ఆ పాఠశాల స్థాపించిన వేళ యెట్టిదో కాని, అది యెందరో యాంధ్రుల కాధారమై యున్నది. నిమ్నజాత్యుద్ధరణార్థము పాఠశాలలు తెనుఁగు దేశమున నెన్నియో యున్నవి. ముఖ్యముగా విశాఖపట్టణమున చేయుచున్న పని చూచితీరవలయును. దానికి ప్రాణప్రతిష్ఠ చేసి విసుగు లేక యొక్కరీతిని పని చేయుచున్న మారేపల్లి రామచంద్రశాస్త్రులు గారి వంటివారు జిల్లా కొక్కొక్క రున్నచో, మరి యా జాతులకు కావలసిన దేమి? ఇఁక హూణ విద్యాశాలలను గుఱించి చూతము. బెజవాడలోని వైశ్యులు కొలఁది కాలము క్రిందట కన్యకా పరమేశ్వరి పేరిట నొక హైస్కూలుంచినారు. 800 ల మంది విద్యార్థు లున్నట్టు తెలియవచ్చుచున్నది. కన్యక పేరనే చెన్నపట్టణమునం దాయుర్వేద వైద్యశాల యొకటి స్థాపించినారు. అది భిషగ్మణి, పండిత డి. గోపాలాచార్యులు గారి జాగ్రదాజమాన్యములో నుండి వన్నెకెక్కినది. గోపాలాచార్యులు గారి ఆయుర్వేద వైద్య విద్యాలయమునం దితర రాష్ట్రములనుండి కూడ విద్యార్థులు వచ్చి చదువుకొనుచుండుట మిగుల ప్రశంసనీయము. ఏనాఁడు ధనికులకు విద్య విషయమై అట్టి యౌదార్యము కలిగినదో ఆనాఁడు దేశము తరించినదే. కాకినాడ వాస్తవ్యుఁడు సత్యలింగము గారు తాను రంగూనులో నార్జించిన విశేషధనములో నేడు లక్షల రూపాయలు ధర్మకార్యములకు వ్రాసెను. అందులో విస్తారభాగము విద్యవిషయమై వినియోగపఱుప నియమించెను. పల్లెపలములోఁ బుట్టినను, విద్యాగంధము లేశమైనను లేనివాఁ డయ్యును, ఆయన కా బుద్ధి పుట్టుట దేశముయొక్క యదృష్టమే కదా? ఇంకను విద్యాభివృద్ధి కెన్నియో నిధు లున్నవి. క్షత్రియుల కొకటి, ఆఱువేల నియోగుల కొకటి, కమ్మవారి కొకటి, వైశ్యుల కొకటి, వీరు వారనకుండ, ఆంధ్రుల కందఱ కొకటి. దేశాంతరమునఁ జదువఁ గోరువారి కిందులోనుండి సాయము చేయుదురు. తల్లిదండ్రులు లేని పిల్లలకొఱకు పిఠాపురము రాజుగారు కాకినాడలో చేసిన యేర్పాటులు వేయి నోళ్ల పొగడఁదగినవి. ఇఁక విశాఖపట్టణములోని కాలేజీ విద్యార్థులకొఱకై హాస్టలొకటి ఎనుబదివేల రూప్యములు పెట్టి కట్టుచున్నారు. ఇది యంతయు పది సంవత్సరములలో జరగిన ముచ్చట. ఇంకను ఉండవలసిన స్థలములలో కాలేజీ లున్నచో, ఇంకను విద్యవృద్ధి కాఁగలదు.

వార్తాపత్రికలు! ఇవి తెనుఁగు దేశమున తక్కిన దేశములలోకంటె నెక్కుడుగా నున్నట్లు కనిపించుచున్నది. ప్రప్రథమమున కృతజ్ఞతతోను గర్వముతోను ఆనందముతోను చెప్పవలసిన వార్తాపత్రిక "ఆంధ్రపత్రిక"! పత్రికాధిపతి గారి కెంత ధననష్టము వచ్చుచున్నను, 'ఔరా' యనునట్లు దానిని వారు నడపించుచున్నారు. ఆంధ్రులు వారికి సహకారులయి యుండనిచో, అది యొక పాతకమని యెంచనగును. "కృష్ణాపత్రిక" యొకటి, వారపత్రిక యయ్యును, దేశసేవలో గొప్ప పని చేయుచు, నాంధ్రుల కృతజ్ఞతను సంపాదించినది. తక్కుంగల వార్తాపత్రికలు దేశమాత, దేశాభిమాని, భారతమాత, హితకారిణి, ఆంధ్రచంద్రిక, ఆంధ్రప్రకాశిక మున్నగునవి యున్నవి. ఇవన్నియు వేయి పాఠశాలల పెట్టు.

రాజకీయసంబంధమైన వ్యాపారములలో ఆంధ్రు లెవరికిని తీసిపోరు. రాజకీయమండలసభలకు ఇండియా యంతటికిని మార్గదర్శి గోదావరి జిల్లా. దానిని జూచి మొదట నేర్చుకొన్నది కృష్ణజిల్లా, ఆపైని విశాఖపట్టణము. దక్షిణ జిల్లాలకంటె నీ యంశమున మనవారు ఆధిక్యము కనఁబఱచినారు. ఇది యటుండ, పులిమీఁద పుట్రవలె, నాంధ్రోద్యమము బైలుదేఱినది. ఆంధ్రమహాసభ యీ మూఁడు సంవత్సరములఁబట్టి యాంధ్రుల పట్టుదలను సామర్థ్యమును ఉత్సాహమును చాటి చెప్పుచున్నది. రాష్ట్ర సభలకంటె నాలు గైదు రెట్లు ప్రజల నాకర్షించుచున్నది. దేశీయమహాసభకుఁ గూడ మొదటి సంవత్సరములలో, మొన్న జరగిన యాంధ్రసభకు వచ్చినందఱు ప్రతినిధులు లేరు. రెండువేల యాంధ్రులు హైదరాబాదు బొంబయి మొదలగు దూరస్థలముల నుండి కూడ వచ్చి యొక సభలో కూడియుండుట సాధ్యమైనది. ఇతర భాషలవారికి అసూయను పుట్టింపఁగల ఎక్కువైన సంగతి! మొన్న డిసెంబరు 31-వ తేదీని బొంబయిలో జరగిన తెలుఁగు సమ్మేళనమును చూడ ముక్కుమీఁద వ్రేలు వేసికొనవలసి యుండును. కొంచెమువంది తప్ప, తక్కినవా రందఱును బొంబాయి

రాజధానిలో నవసించియున్న యాంధ్రులే. వారిలో కొందఱి పేర్లు కూడ తెనుఁగు పేర్లవలె లేవు. ఆ దేశభాష వ్యవహారములలో మాట్లాడుచుండినను ఇప్పటికిని వారి మాతృభాష తెనుఁగే. భాషా వాఙ్మయముల నభివృద్ధిచేయవలయు నని మొన్నటి సభలో తీర్మానించిరి. ఇరువదియైదు వేల రూప్యములు సేకరించి ఆంధ్రుల విద్యాభివృద్ధికై నిధిని కూర్చిరి. నూరుగురు ఆంధ్ర యువతులా యాంధ్రసభకు దయచేసిరి. కొందఱు ఉపన్యాసములు కూడ సలక్షణముగఁ జేసిరి. మనవారిలో నొకరు దేశీయసభాప్రతినిధిగ నింగ్లాండునకు కూడ బోయి పనిచేసిరి. వారే రాష్ట్రీయ శాసనసభలో కూడ పేరువడసినవారు. వారు రావు బహద్దరు శర్మగారు. వారును, రావు బహద్దరు రామచంద్రరావు పంతులు గారును, గో. కృష్ణరావు గారును ఆ సభలో చేసిన పని మెచ్చుకోఁదగియున్నది. మన యాంధ్రభీష్ములు న్యాపతి సుబ్బారావు పంతులు గారును పానుగంటి రామారాయణంగారును సార్వభౌమిక శాసననిర్మాణ సభలో నెంతయో సామర్థ్యము కనఁబఱచి పని చేసిరి. ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికై రామారాయణంగారు చెన్నపురి విశ్వవిద్యాలయమునం దొక నిధిని నెలకొలుపుట కూడ ప్రశంసనీయము. చింతామణిగారు "లీడరు" పత్రికాధిపతిగాఁ గాని, రాజకీయ విషయికోపన్యాసము లిచ్చుటయందుఁ గాని, మిట్టమధ్యాహ్నపు సూర్యునివలె వెలుఁగుచున్నారు. అల్లూరి రామచంద్ర రాజుగారు పట్టపరీక్షయందు కృతార్థులయి, గోఖలే గారి హిందూదేశ సేవకసంఘములో చేరి, ఆత్మలాభము నంతయు వదలుకొని ఆంధ్రదేశమునకై సేవ చేయుచున్నారు. కొండా వేంకటప్పయ్య పంతులుగారు అన్నియు వదలుకొని, ఆంధ్రదేశమునకు తమ బుద్ధిబలములను సమర్పించి యున్నారు. కాశిలో స్థిరనివాస మేర్పఱచుకొని పండితులకు పండితుఁడని ప్రభుత్వము వారిచే కూడ విశేషముగ గౌరవింపఁబడి, ఈనడుమ కీర్తిశేషులైన మహామహోపాధ్యాయ మానవల్లి గంగాధర శాస్త్రిగారి పేరు మన మెన్నటికిని మఱవఁజాలము.

స్త్రీలలో కూడ గొప్ప వ్యవహారజ్ఞానము కలవారాంధ్రులలో ననేకు లున్నారు. 30 లక్షల రూప్యములు రాఁబడి గల విజయనగర సంస్థానమును అలక రాజేశ్వరీ మహారాణీ గారు పురుషులకంటె నెక్కుడుగా నేలిరి. వారు స్వర్గస్థురాలైన పిమ్మట వారి కొమార్తె రీవా రాణిగారు వ్యవహరించిరి. మహారాణీ రెడ్డీ చిట్టిజానికయ్యమ్మ గజపతిరావుగారు తమ సంస్థానమును బహుసామర్థ్యములో నేలిరి. ఇప్పుడా సంస్థానమునే వధ్వాన్ రాణీ గారు మామూలుచున్నారు. తుని సంస్థానమును కూడ రాణీ సుభద్రయ్యమ్మ గారు అందఱును మెచ్చు నౌదార్యముతోను పెంపుతోను నేలుచున్నారు. ఇప్పటి విజయనగరము మహారాణీ గారు ఇంగ్లీషులో నారితేరినవారు.

ఇఁక సంఘసంస్కరణములో తెనుఁగు దేశ మన్నిటికంటె నెక్కుడు పని చేసినది వీరేశలింగముపంతులు గారి పేరు తెలియనివారు లేరు. వైదికసాంప్రదాయమును నడపించుచు పండితులుగా నున్నవారిలోఁ గూడ, సంఘసంస్కరణములో దిగిన మహనీయులు ఆంధ్రులలో నున్నారు. వారిలో నగ్రగణ్యులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయుఁడు శాస్త్రులు గారు. వారి యుపన్యాసము సభకు సమ్మోహనాస్త్రము కదా! వారు రజస్వలావివాహములు కూడు నని ఎన్ని సభలలోనో యుపన్యసించియున్నారు. పరదేశగమనము కూడు నని కొన్ని సంవత్సరముల క్రిందట పండితశ్రేష్ఠులు ముడుంబి నరసింహాచార్యులు గారు సంఘసంస్కరణ సభలో నుపన్యసించియున్నారు.

సంక్షిప్తముగా నుదాహరింపఁబడిన పై విషయములను జూడ, ఆంధ్రు లెవరికిని దీసిపోకుండ నెట్టి పనుల నైనను పూనికతోను సామర్థ్యముతోను చేయఁగలవారని స్పష్టము కాకమానదు. ఆంధ్రరాష్ట్రము వచ్చిననాఁడు గొప్ప యుద్యోగములకు వలయు మనుష్యు లేరీ యను మాట యెంత హాస్యాస్పదమైనదో తెలియవచ్చును. హైకోర్టు జడ్జీ పని చేయుటకుఁ దగినవా రిప్పుడే యున్నారు దానికి తగినవారు గవర్నమెంటు మెంబరుగా నుండుటకు తగినవా రని చెప్ప నవసరము లేదు.

ఇంక మన లోపములను గుఱించి గాని, మన మిఁక నడపింప వలసియున్న పనులను గుఱించి గాని, యిక్కడ చెప్ప నక్కఱ లేదు. రాను రాను అవియే స్ఫురింపఁగలవు. ముండ్లకు వాడి ఎవఁడు దిద్దినాఁడు? పూనిక, సామర్థ్యము—ఈ రెండే ముఖ్యమైనవి. అవి మన కున్నవే.

# మహనీయు లొనరించు సాంఘికపు మార్పులు

పార్నంది జగన్నాథస్వామి గారు, బి. ఏ.

ప్రాణులకుఁ గల విశేషములకును, ఆ ప్రాణుల *చుట్టు నున్న వానికిని సంబంధ మెట్టి దని విచారింపవలయు. విశేషములను చుట్టు నున్నవి పుట్టించు నని కొందఱును, ఉద్భవించియున్న విశేషములను నిలిపి ప్రబలపఱచు నని కొందఱును తత్త్వజ్ఞులు వాదించుచున్నారు. ఎట్లన, జిరాఫీకి మెడ మిక్కిలి పొడవు; ఈ పొడుగుతనము దానికి విశేషము. ఈ ధర్మ ముద్భవించుటకు దాని చుట్టునున్నవి కారణ మని కొందఱును, ఉద్భవించియున్న యీ గుణమును వృద్ధిచేయుటకు చుట్టునున్నవి హేతువు లని కొందఱును వాదించుచున్నారు. జిరాఫీ కాహారముగ నుపయోగపడునట్టి ఆకులు వృక్షములపై నెత్తున నుండుటచేత, ఆ పత్రముల నేరుటకుఁ జూచుచుండుటవలన మెడ దీర్ఘ మయ్యె నని యొకరును, దీర్ఘముగ నున్న మెడ యెత్తున నున్న యాకుల నేరుచుఁ దన దీర్ఘత్వమును వృద్ధిచేసికొనె నని యొకరును వాదించుచున్నారు. సమ్మెట వేయువాని భుజము దిట్టదేఱునట్లు, జిరాఫీ మెడ పొడవైనది, చుట్టునున్నవి తమ ప్రభావముచేతఁ బ్రాణియొక్క యవయవములను లాగఁదీసి, వాని కూర్పును మార్చివేయు నని మొదటివారి వాదము, ఒక శక్తి ప్రాణియందు జన్మమునుండియు నిమిడియుండ, చుట్టునున్న వా శక్తిని వృద్ధిచేయు నని రెండవవారి మతము. అట్లు మహాపురుషుల మహత్త్వము వారి చుట్టుప్రక్కలవాని ప్రభావముచే వారియం దుద్భవించెనా? లేక వారికి జన్మమునుండి గల గుణమును ఈ చుట్టుప్రక్కలవి బయలుపఱచి వృద్ధిచేసెనా?— అని విచారించెదము.

మహనీయులు సంఘములందు మార్పులను కలుగఁజేయుదురు. నూతనమార్గములను గల్పించెదరు. తమ బుద్ధికౌశలముచేత సంఘమున కుచితమగునట్లు ప్రవర్తించుచు, వీరు సంఘాభివృద్ధికిఁ గారణభూతు లగుదురు. మంత్రుల యుపదేశమున దేశమునకు శాంతి గాని యుద్ధము గాని సంభవించును; సేనాధిపతుల నేర్పున జయాపజయములు సిద్ధపడును. మతప్రవర్తకుల ప్రోత్సాహముచే దేశమందలి మతావిర్భావము మార్పులు చెందును. పండితుల బుద్ధిచే శాస్త్రకళాసాహిత్యములలో రాష్ట్రము వన్నెకెక్కు. దేశ మవలంబింపఁదగు మార్గము లనేకము లున్న సమయమున, మహాపురుషుల ప్రభావమున నొక మార్గ మామోదింపఁబడుటచే, మిగిలిన మార్గము లన్నియు నా దేశమున కసంభవము లగును. ఒక మార్గమును పాలించు క్షణముననే, ఇతరమార్గముల కుచితగుణసామగ్రి యెంత యున్నను, అది యంతయు మాసిపోవును. పశ్చాత్తాపము నిరుపయోగము. ఈ సిద్ధాంతము ప్రత్యేకపురుషుల జీవితములందుఁ గూడఁ బ్రత్యక్షము. వివిధజీవనవృత్తులు సమానసంభావ్యములై యున్నపు డొకదానిని నిరాకరించి రెండవదానిని స్వీకరించిన క్షణముననే, ఆ మనుజుని జన్మము యావత్తు నొక రీతిని స్థిరపడె నని మన మూహింపవచ్చును. రాబర్ట్ క్లైవ్ కుఱ్ఱవాఁడై నపుడు చెన్నపట్టణమునఁ జేసిన యాత్మహత్యాప్రయత్నము కొనసాఁగియుండిన, వర్తమానాంగ్లేయ రాష్ట్రము, దాని పరిపాలనము నిట్లుండకపోవును. విక్టోరియా రాణికి బదులుగ ఫ్రెడరిక్ ప్రభువు ఇంగ్లాండ్ చక్రవర్తియైన, యూరోప్ రాజ్యతంత్రము లిట్లుండునా? బెంథమ్ మిల్ మొదలైన ధీవరులు ఇంగ్లాండ్‌లో జన్మింపనియెడల ఆ దేశపు సాంఘిక పాండిత్యస్థితి యెట్లుండియుండునో? బుద్ధుఁడు జన్మింపకపోయిన, హిందూదేశమందలి వేదాంతశాస్త్రము వేఱు మార్గమునఁ బోయియుండును. రామమోహనుఁడు పందొమ్మిదవ శతాబ్దమున నుదయింపనియెడల విద్యమానభారతీయ సంపద లెల్ల నిట్లుండనేరవు. పాశ్చాత్యవర్తకులను మొగలాయిచక్రవర్తి యాదరింపనిచో, ఆంగ్లేయరాష్ట్ర మెట్లుండునో? ఇట్టివారే మహనీయులు. వారు మార్గదర్శకులు. వారు మార్గమును పోల్చి చూపిన పిదప, సామాన్యు లందఱు ప్రవర్తింతురు. ఈ న్యాయము

* ఇంగ్లీషులో Environment (ఎన్‌వైరన్‌మెంట్) అను దానికి సరియైన పదముగ దీనిని వాడుదును.

మహాకార్యములలోనే గాక, యల్పవిషయములలోఁ గూడ ఋజువగును. కొలంబస్ చూపించు పర్యంతము కోడి గ్రుడ్డును నిలుపు మార్గము తెలియలేదు. ఇట్టి మార్గదర్శకులే మహనీయులు.

కాని, మహనీయుల కృత్యము లెల్లప్పుడు జయప్రదముగ ప్రవర్తించు నని చెప్ప వీలు లేదు. మహనీయుఁడు తన యంతశ్శక్తిని విశదపఱచినను, దానిని నిలిపి బాగుచేయుట కతని చుట్టునున్నవి తగినవై యుండవలెను. మహనీయుని ప్రయత్నము లకాలికములు కావచ్చును. తా నొనరించు కార్యమున కుచితకాలమునకు, అతఁడు పూర్వుఁడైనను లేక యతీతుఁడైనను నగుట తటస్థింపవచ్చును. అతని బోధనలు గాని కార్యములు గాని తన సమకాలీనులకు దుర్బోధములగును. బుద్ధుఁడు ఋగ్వేదకాలమున సంభవించునా? శంకరుఁడు బౌద్ధమతపూర్వమున నేమి చేయఁగలఁడు? రామమోహనుఁ డొక శతాబ్దము పూర్వమైనను లేక పరమైనను, అతని ప్రభావము ప్రకాశింపక పోవును. మహాపురుషునకు పూర్వము జరగిన కొన్ని మార్పుల వలన సంఘ మొక స్థితిని చెందుటచే, ఆ ధీవరుని ప్రభ తేజరిల్లును. బ్రాహ్మణముల బోధనలచే ప్రజలెల్ల కర్మల నడఁగినపుడు, కర్మల శత్రు వగు బుద్ధుఁడు జన్మించెను. అప్పుడే యతని బోధనలు ప్రబలించెను. బౌద్ధమత ప్రవచనలచే, గలిగిన స్వచ్ఛందజ్ఞానమత దౌర్జన్యము నడఁచుటకు శంకరుఁడు నిష్కామకర్మస్థాపనను చేయ యత్నించెను. ఇట్టి మార్పు లెన్నిటిచేతనో కలఁత చెందిన హిందూదేశమున పాశ్చాత్యబుద్ధి ప్రసరించినపుడు కలిగిన నూతనావిర్భావమును సరిపెట్ట, రామమోహనుఁ డుదయించెను.

ఇట్లు సమయోచితముగ నొక మహనీయుఁ డొనరించు కార్యము ప్రజల మనస్సులను గ్రహించియుండును. సంఘమం దొక్కొకమాఱు గలిగిన మార్పు మరియొక ధీమంతుని యుపదేశముల సామర్థ్యమును నిశ్చయించును. ఒక మార్పుయొక్క ఫలమును మాపుసేయ నెవరి శక్యము? ఆ మార్పు ఫలముల కనుగుణముగనే యితరప్రయత్నములు కొనసాఁగును. ఒక మొక్కను కొంచెము వంచినయెడల ఆ వంపు దీర్చుట కెన్ని ప్రయత్నములను చేసినను, ఆచిహ్నము నశింపదు. చెట్టుయొక్క నిర్మాణములో ఆ వంపు చేరును. ఇట్టి గ్రహణశక్తి ప్రాణుల విశేషము. బంగారము నెన్నిమాఱులు కరఁగినను, ఆ కరఁగు చిహ్నము లేమాత్రముచు ఆ ముద్దలోఁ గాన్పింపవు. కాని యొక చెట్టు నెన్నిమాఱు లెండకాలము వాడఁబెట్టునదియు, వర్షకాల మెన్నిమాఱులు బ్రతికించినదియు, గాలు లెన్నిమాఱు లిటునటు వంచినదియు, చెట్టు కూర్పును పరిశీలించి చెప్పఁగలము. చెట్టుయొక్క పెంపులో నవి యిమిడి యుండును; చెట్టు ప్రాణము మార్పులను గ్రహించి తనలో నుంచుకొను నని చెప్పవచ్చును, ఆ మార్పులు వాని నాశ్రయించి యుండును. ఆ యాశ్రితఫలములు నూతన ప్రభావములను నిర్ణయించును. ఆ మార్పును గలుగనిచ్చుటకును, నిరోధించుటకును శక్తి యాశ్రయించియున్న మార్పున కుండును. చెట్టును తూర్పునకు గాలి యొకమాఱు వంచిన, తిరిగి పశ్చిమమునకు గాలి వంప యత్నించునపుడు, వంగుటయు వంగక పోవుటయు తూర్పున కుండు వంపును బట్టి కొంతవఱ కుండును. అట్లే సంఘములో మార్పును ప్రవేశపెట్టునపుడు సంఘము దానిని గ్రహింపవచ్చును, లేక. నిరాకరింపవచ్చును. అందుచేతనే యొక సంఘమందు సులభముగ ప్రవేశించు మార్పు మరియొక సంఘమందు నిష్ఫలమగును. జపాన్ దేశములో జాతివైషమ్యముల నొక చక్రవర్తి యొకశాసనముచే తుడిచివేయఁగలిగెను; ఈ దేశమం దెన్ని ప్రయత్నములను చేయుచున్నను, సంఘసంస్కరణకర్తల యుపదేశము లిప్పటి కింకను జాతిభేదస్తంభము నూఁపలేకున్నవి.

ఈ విచారణవలన తేలుచున్న దేమనిన, సంఘమందలి మార్పులకు రెండు కారణములు గలవు. మార్పునాఁటి సంఘముయొక్క స్థితిగతు లొకటి, రెండవది మహనీయుల శక్తిప్రభావము. ఉన్న స్థితిని మార్చు శక్తి సంఘమునకు లేదు. మార్పు నొకదానిని ప్రవేశపెట్టు శక్తి మహనీయులకే కలదు; ఆ మార్పును ప్రవేశింపనిచ్చుటకుఁ గాని నిరోధించుటకుఁ గాని కావలసిన శక్తి సంఘమునకుఁ గలదు. మహనీయుల యుపదేశములు లేనియెడల, నీరు ప్రవహింపక నిలుచునపుడు క్రుళ్లునట్లు సంఘము వృద్ధిచెందక చెడిపోవును. ఆ యుపదేశములను సంఘము గ్రహింపలేక యామోదింపకపోయిన, నీరు లేని మొక్క వాడు రీతిని సంఘము వాడిపోవును. ఈ సిద్ధాంతప్రకారము మహనీ

యులు కొంతవఱకు స్వతంత్రులనియు, ప్రవర్తకులనియు, వృద్ధికి కారణభూతులనియుఁ దేలుచున్నది.

కాని, యీ మతమును ఖండించుటకు ప్రయత్నించిన పండితులు గలరు. తత్వజ్ఞానశిరోమణి యనఁదగు హెర్బర్ట్ స్పెన్సర్ ఇట్లు వ్రాసినాఁడు: "మహనీయుల శక్తిచే సంఘములు పెంపు పొందుచున్న వను మతమున కుదాహరణములు లేవు. మహనీయులను సాంఘికవృద్ధికి కారణముగ నంగీకరింపక, ఆ మహనీయులెట్లు సంభవ మగుచున్నారో విచారింపవలయును. వారి యుత్పత్తి కారణము సహజమా లేక ప్రకృత్యతీతమా? రెండవది కాదు గదా! సహజమైనయెడల, అన్ని కార్యములవలెనే, మహనీయుఁ డతని చుట్టు ప్రక్కల నున్న కారణపుంజమువలన సంభవించె నని చెప్పవచ్చును. అతనిని సంఘము చేయును. అతని యుపదేశములకును ఆ యుపదేశముల జయమునకును సంఘస్థితియే కారణము." ఈ వాదప్రకారము సంఘము యొక్క స్థితిగతులచే మహనీయు లగుచున్నా రనియు, మహనీయుల శక్తి యనునది యా స్థితిగతులనుండి యగు కార్య మనియు మనము గ్రహింపవలెను. ఏ మతముచే ప్రకృతికార్యముల నన్నిటిని సాధింప వీ లగునో, యా మతప్రకారమున ఈ మహనీయు లను విషయమును గూడ సాధింప వీ లగును. ఎట్లన, పిచుక యొకటి పడి చచ్చుటకు అప్పటి గ్రహకూటమును, వేసవికాలమున నీరు కలసి భోజనము సేయుట వారిలో నొకరి మరణమునకును, కారణములుగ స్పెన్సర్ మతానుసారమున నిర్ణయింపవలసివచ్చును. నావ కున్న చిన్న సందున నీరు ప్రవేశించుటచే నావ మునిఁగిపోవుటకు నదిజలము యా వస్తువుయొక్క నొక్కుడు శక్తుల కూటము కారణముగ వర్ణించునట్లు, 1774-వ సం. సెప్టెంబరు 27-వ తేదీని రాధానగరములో రామమోహనుఁ డను బిడ్డఁ డొకఁడు కులీన బ్రాహ్మణుల కడుపున జన్మించుట కప్పటి హిందూసంఘుక్లేశము లన్నియు కారణముగఁ జెప్పవలెను. ఆ నావ సందున నెన్ని గుడ్డముక్కలు పెట్టినను పై నీటి శక్తి తగ్గునంతవఱకు నీటి ప్రవాహము నాఁపలేనట్లు ఆ రామమోహనుఁ డకస్మాత్తుగఁ జనిపోయియుండిన తత్క్షణమే రాధానగరములోఁ గాక పోయినను, మరియొక స్థలమున నొక బిడ్డఁడు పుట్టియుండును. అట్లే దేశముయొక్క యౌన్నత్యమునకు దేశస్థితియే కారణముగ స్పెన్సర్ శిష్యుఁడు ఏలన్ అను నతఁ డుపపాదించెను.

ఒక యుదాహరణ. సార్డేనియా కార్సికా యనెడి ద్వీపములు రెండు మెడిటెరేనియన్ సముద్రము నడుమ నున్నవి. నాతిదూరమున వీని చుట్టును లేటిన్ గ్రీక్ ఫినీషియన్ సేరసన్ మొదలగు నాగరకతలు ప్రబలియుండెను. ఈ ద్వీపముల తీరరేఖ విశాలమై ఖండితమైనది, వానికి ఖనిజసంపద యుండెను. కాని, ముప్పది శతాబ్దములవఱకు నీ దేశమున కేవిధమైన నాగరకతయు చేరలేదు. దేశస్థులకు భాష యున్నను, సంస్కరింపఁబడలేదు; వింత లున్నను, చరిత్ర లేదు; ఆచారము లున్నను, నిబంధనలు లేవు; సముద్రము సమీపమం దున్నను, ఓడ వర్తకము లేదు; కథ లున్నను, పురాణములు లేవు; స్వాభావిక సౌందర్యము లున్నను, వర్ణించు కావ్యములు లేకుండెను. ఈ దేశముల చుట్టుపట్లు వృద్ధికిఁ దగియున్నను, వానికి నాగరకసంపద పట్టలేకుండెను. ఇందుకుఁ గారణ మేమి? అట్టి దేశస్థితికిఁ దగిన మహనీయులు లేమిచే వృద్ధి లేకుండెను. ఇంధన మున్నను చిన్న దైన యగ్నికణము లేనట్లు దేశమం దున్న సహజసంపదల నుపయోగపఱచు బుద్ధిమంతులు లేకుండిరి.

ఇట్లు మహనీయు లుండనిచోట వృద్ధి యుండఁజాలదు. ఎప్పుడో యొకమా ఱొక మహనీయుఁ డుద్భవించిన చాలదు. ఒకఁ డొనరించిన కార్యముల ఫలములు మాసిపోక పూర్వము, మరియొకఁడు తన శక్తి నప్పటి సంఘస్థితి ననుసరించి ప్రవేశపెట్టవలెను. అట్లు సంఘమం దుత్సాహశక్తి చల్లారక ప్రకాశించుచుండిన, సంఘము వృద్ధిచెందును. ఒకమా ఉన్నతపదవికి వచ్చిన సంఘము త్వరలో చెడిపోనేరదు. మన హిందూసంఘ మెన్ని యో సంకటములను దాఁటుచుఁ బూర్వపు వన్నెయొక్క చిహ్నలచే నిప్పటికిఁ గూడ నాగరక సంఘములలో నొకటిగఁ బరిగణింపఁబడుచున్నది. ఆరంభమందు విశేషముగ బుద్ధ్యుత్సాహశక్తులు గావలెను. ఆరంభమైనపిమ్మట సామాన్యులు గూడఁ గొంతవఱకు వృద్ధికిఁ దోడుపడఁగలరు. పూర్వపు మహనీయుల ప్రభావము వీరి హృదయములలోఁ బ్రవేశించి సామాన్యశక్తిని ప్రబలపఱుపఁగలదు. అందులకే మహనీయులు సంఘమునకు మిక్కిలి యవసరము.

# పాశ్చాత్యసంఘవిప్లవము

బారిస్టరు ఎన్. వి. ఎల్. నరసింహారావు గారు, ఎమ్. ఏ. (ఆనర్సు), ఎల్. ఎల్. బి.

ప్రథమమున, పాశ్చాత్యసంఘమునందు జరగిన మార్పులు విప్లవశబ్దార్హములా యని చర్చించుట కొంత వఱ కవశ్యము. సామాన్యముగా విప్లవశబ్దము ప్రళయకాల చిహ్నములను కొంతవఱకు సూచించును. ఏదైన నొక విషయము హఠాత్తుగాను భయపూరితముగాను జరగినయెడల విప్లవశబ్దమును వాడుదురు. విప్లవము బీభత్సరసప్రధానము. రాజ్యములు తలక్రిం దగుతఱిని ఈ పదముయొక్క పూర్ణార్థము వెలువడును. శబ్దరహితమును అగోచరమును నగు సాంఘికపు మార్పులను దౌర్జన్యప్రధానము లగుటచే విప్లవశబ్దాన్వయము లని వాదించుట యతిశయోక్తి యని కొందఱు ప్రాజ్ఞులకు తోఁచకపోదు. ఇట్టి మార్పులను సంఘపరిణామమని యేల చెప్పఁగూడ దని ప్రశ్నింపవచ్చును కాని, యేఁబది సంవత్సరములలో పశ్చిమదేశమందు జరగిన మార్పులను మన దృక్పథమం దుంచుకొనినయెడల, ఈ మార్పులు పరిపక్వచిహ్నములు కావనియు పరిణామమున జరగు మార్పులకన్న తీవ్రతరము లనియు స్ఫురింపకమానదు. ఇట్టి మార్పులు ఏఁబది సంవత్సరములకు పూర్వము కన్పట్టవు. రెండవది, పరిణామమున జరగు మార్పు లెప్పుడు నొక దానికన్న నొకటి శ్రేష్ఠతరమై యుండవలెను. కాని, విప్లవచిహ్నిత వికారములు కీడునకు కావచ్చును, లేక మేలునకు కావచ్చును. ప్రస్తుతము జరగిన మార్పులు పశ్చిమసంఘాభివృద్ధి కని కొందఱు పెద్దలు వ్రాయుచున్నను, ఏతత్సంఘము నాస్తిక మగు చున్న దని సంఘసంస్కర్తలు తీవ్రవాదము చేయుచున్నారు. కావున, పరిణామశబ్ద మిచ్చట నన్వయించు ననుటకు వీలు లే దని నా మనవి.

పశ్చిమవాస్తవ్యులయందు జరగిన తీవ్రమగు మార్పుల తత్త్వమును గ్రహింపవలయు నన్న, కనీసము ఏఁబది సంవత్సరములకు ముందటి స్థితియును తదనంతరస్థితియును పరిశీలించుట యవసరము. ఇట్టి చర్చకు పదునెనిమిదవ శతాబ్దము నూఁతగాఁ గొని తత్పూర్వపు స్థితిని నా శక్తి ననుసరించి కొంతవఱకు వ్రాయ నారంభించెదను. పదునెనిమిదవ శతాబ్దము నేల యూఁతగాఁ గొనవలె నని ప్రశ్నింపవచ్చును. దానికి కారణము లేకపోలేదు. ఈ శతాబ్దముననే ఆర్తరక్షకుఁ డగు భగవానుఁడు పాశ్చాత్యుల దారిద్ర్యమును తొలఁగించుటకు కాఁబోలు ఒక్కమాఱుగా తన యౌదార్య మహిమను చూపుటకు విజృంభించెను. ఈ శతాబ్దమే మేధఃకంపములచే క్షోభిల్లఁజేయఁబడెను. ఈ శతాబ్దమునందే వాట్స్, ఆర్క్‌రైట్ మొదలైన మేధావులు సృష్టికి ప్రతిసృష్టి చేయఁగలమో యన, ఆవిరి యంత్రమును వడుకు యంత్రమును కనిపెట్టి పనిపాట్లలో (పరిశ్రమలలో) వర్ణనాతీతము లైన మార్పులను కల్పించిరి. ఈ శతాబ్దమునందే రాజతంత్రతత్త్వజ్ఞులు తమ చింతనావిజృంభణావధిని చాటుచు నూతనాదర్శన బీజములను వెదఁజల్లిరి. ఈ మహాయుగమునందే రూసో మొదలైన ప్రముఖులు పవిత్రమైన సర్వమానవసమానతను నాగరకతయొక్క కల్మషమును ఎలుఁగెత్తి చాటించిరి. ఈ మహాయుగమునందే ఆంగ్లేయ దౌర్జన్యమునుండి ముక్తి నొంది అమెరికనులు పవిత్రమైన స్వేచ్ఛను సంపాదించిరి. వే యేల? ఈ మహాయుగఫలమే గదా మానవసోదరతను చాటు ఫ్రెంచి సంక్షోభము.

ప్రస్తుత మీ మహాయుగమునకు పూర్వము సంఘస్థితి యెట్లున్నదో కొంచెము చర్చించెదను. ఈ సంఘస్థితి తెలిసికొనుటకు, అచటి భూస్థితి పరిశ్రమలు మూలధనము, ఈ మూఁటి విషయమై కొంత వ్రాయుట యవసరము. ఏల యన, అచ్చటి మార్పు లెక్కువ అర్థసంబంధమైనవి. మన సంఘమునవలె స్త్రీపునర్వివాహము బాల్యవివాహము వర్ణభేదము మొదలగు నుత్కృష్టసమాసములు, వారి యదృష్టహీనతచే కాఁబోలు, వారి సంఘమున లేవు. ఈ కాలసర్పములు మన యార్యావర్తమునందే వృద్ధి నొందఁగలవు కాఁబోలు. సంఘసంస్కరణ మన్న, మన దేశమునందు రాజ్యాంగవ్యవహారము లందు చేరవు మన దేశమునందు రాజ్యాంగసంస్కరణ మనఁబడు సర్వజనులకు విద్య కఱవు సంస్కరణము పశ్చిమదిశయందు సంఘసంస్కరణముగా పరిగణింపఁబడుచున్నది. కావున, రాజ్యాంగ సంస్కరణములను కూడ సంఘసంస్కరణములలో నిమిడ్చితిని. రాజ్యసంస్కరణము సంఘాభివృద్ధికే గదా.

ఈ శతాబ్దమునకు పూర్వము పాశ్చాత్యులకు భూమియే జీవనమునకు ముఖ్యాధారము. సామాన్యముగా ప్రతిమనుజునకును కొన్ని యెకరముల నేల యుండెడిది. దానికి సహాయముగా కొంత సమ్మేళనభూమి చేర్పఁబడెను. ఈ భూమియందు ప్రజలందఱు తమ పశువులను మేపెడివారు. వ్యవసాయము కొలఁది సాధనములతో జరగుచుండెడిది. కొంచెకొంచెపు సేద్యమే విస్తరించియుండెడిది; అశాస్త్రీయముగా కూడ నుండెను. కాని, ప్రజ లందఱు హాలికవృత్తినే యవలంబించి రని చెప్పిన నతిశయోక్తి కానేరదు. ఆహారమును బట్టి ప్రజాసంఖ్య మార్పు చెందు నని మాల్తుస్ చెప్పిన రీతిగా, పశ్చిమదేశ మంత ఫలవంతము కానందున, ప్రజాసంఖ్య చాలవట్టుకు తగ్గియుండెను. కాని, దేశ మంతయు స్వతంత్రజీవనాధారము కలదై యుండెను. భూస్థితిని బట్టి ప్రజల గౌరవము నిర్ణయింపఁబడుచుండెను. ఇఁక పరిశ్రమ యన్ననో ఇప్పటియంత కట్టుదిట్టములలో లేదు. కాని, శ్రమ చేయువానికి తగిన పని దొరకకపోలేదు.

పరిశ్రమసంఘముల కప్పు డవసరము కలుగలేదు. ఆ సంఘమందు కూలిపనిచేతనే జీవించువాఁ డొకఁడును లేఁడు. ప్రతిమానవునికి కొలఁదిగనో గొప్పగనో భూమి యుండుటచే ప్రత్తి వడుకుట మొదలైన చిన్నచిన్న పనులను చేతోడువాసోడుగా చేసికొని జీవించెడువారు. అప్పుడు యంత్రము లేనందున చేతిపనులు నిరంకుశముగా సాఁగినవి కావున, గృహిణులు తమ యర్ధాంగినామమును అర్థపూరితముగా చేయుటకో యన, చేతిపనులచే తమ భర్తల వేతనములను పూరించెడివారు.

ఇఁక మూలధనము. ఈ దేవత యిప్పటివలె పక్షపాతబుద్ధితో కొందఱు మనుజులనే యావరింపక మానవసమత్వమును చూపుచున్నదో యన ప్రతిమానవుని ఆశ్రయించెను. ధన మప్పుడు కట్టుదిట్టము చేయఁబడలేదు. దేశ మంత ధనవంతమై యుండెడిది కాదు. ఆ కాలమందు ఇంగ్లండు బొగ్గును నంచుకొనుచు ఇంత యినుము మ్రింగి సముద్రపు నీరు త్రాగవలసివచ్చెడిది. ఇం తేల? పశ్చిమదిక్కు దరిద్రదేవతకు ముద్దుకూఁతురివలె భాసిల్లుచుండెను.

ఇట్లుండ పదునెనిమిదవ శతాబ్దము మహాసంక్షోభనిదానము దాఁపరించెను. ఈ శతాబ్దము పశ్చిమసంఘమును కలఁతపఱచెను. ఈ సంక్షోభమువలన కొన్ని సమస్యలు వెలువడెను. సంఘ మంతరింపకుండవలె నన్న, సమస్యలను పరిశోధింపవలెను; సంక్షోభమువలన కలఁత నొందిన జనులను శాంతి నొందింపవలెను. ఈ కలఁతలను మాన్పఁ బ్రయత్నించుచు, సంఘము మహోత్కృష్టమైన మార్పులను పొందవలసివచ్చెను. మార్పులు చెందు తఱిని ప్రేక్షకుల కదృశ్య మయ్యెను, తదనంతరము సంఘ మంతయు తఁక్రిం దైనట్లు చూపట్టెను. ఈ మార్పుల ముద్దయే సంఘవిప్లవతత్త్వము

ఈ శతాబ్దమునందు వెలువడిన సమస్యలను క్రమముగ పేర్కొనెదను:—

(1) బహుళముగ దొరకు యంత్రనిర్మిత వస్తువులు గృహకృషులను భగ్నము చేసెను.

(2) కార్ఖానా పద్ధతి ఉద్భవ మయ్యెను. ప్రజ లందఱు తమ గృహపరిశ్రమలు పోవుటచే జీవనాధారము తగ్గి కార్ఖానా లున్న చోట్లకు చేరిరి.

(3) దానివలన పరిశ్రమ విభజనము, ఉద్యోగ శూన్యత, శ్రమాధారులు, బీదల సమస్య మొదలగు సమస్య లుద్భవించెను.

(4) కార్ఖానా పద్ధతివలన "[illegible]యట పూరించుట" యను నది వెలువడినది.

(5) వర్తకాభివృద్ధిచే ధనవంతు లయినవారు స్వల్పభూస్వాములను పారఁదోలి భూమి నంతయు తామే యాక్రమించుకొనుటకు ప్రారంభించిరి.

ఈ సమస్య లొకదానితో నొకటి లీనమైనవి. చర్చించుటకై యిటు విభజింపవచ్చునే కాని, అవి తమ విజృంభణ శక్తిని వేర్వేఱుగ చూపలేదు. కృషియందు జరగిన తీవ్రపు మార్పులచే చేతిపనులు మూలపడవలసివచ్చెను. స్వల్పభూస్వాములు తమ కున్న కొలఁది భూమితో పొట్ట పోసికొనలేక యా భూములు వదలి పొట్ట చేతఁ బట్టుకొని పోవలసివచ్చెను. ఏ ప్రదేశములందు బొగ్గు ఇనుము సమృద్ధిగా ఆ ప్రదేశములలో కార్ఖానాలు వెలసెను. కాని, విగత జీవనాధారుల కెల్ల కార్ఖానాలు సదుపాయములు చేయలేక పోయెను.

ఇది యటుండ, భూపద్ధతియందు గొప్ప మార్పొకటి పుట్టెను. ట్యూడర్ పరిపాలన పూర్వమునుండి "అవధినిర్మాణము" నకై పోరాటము జరుగుచుండెను. ఎవరి భూమికి వారు పొద్దు లేర్పఱచినయెడల వ్యవసాయము లాభకరముగా జరుగఁగల దని జనులు వాదించుటకు మొదలిడిరి. దీని వలన సమ్మేళనభూము లంతరించును, స్వల్ప భూస్వాములు తమ పశువులకు మేఁత లేమిచే భూములు వదలవలసివచ్చును. ఇట్టి యుద్యమము కొంతవఱకు జయప్రదముగా సాఁగెను గాని, తమ ట్యూడర్ కాలమందు భూజీవనము పోఁగొట్టికొని యిటునటు తిరుగుచున్న ప్రజల యిబ్బందులును కొన్ని యూళ్లు నిర్జన మగుటయు చూచి ట్యూడరు రాజులు సరిహద్దులను వేయుట నాఁపివేసిరి. కాని, పొలములు బాగుపడవలె నన్న ఇట్టిది యవసరము. పదునెనిమిదవ శతాబ్దములో ఆ యుద్యమము మరల జీవవతి యయ్యెను. భూమియందు గౌరవము హెచ్చయ్యెను. రాజసభలలో ప్రవేశింపవలె నన్న భూస్వాములు కావలసివచ్చెను. వర్తకముచే ధనమును గూర్చిన వారెంత ధనమైన నిచ్చి భూమిని కొన సమకట్టిరి. లాభయుక్తముగా సేద్యము చేయుటకు కొన్ని క్రొత్త పనిముట్లు వెలువడెను. లేఖకులు సరిహద్దు నిర్మాణము ముఖ్యమని వాదించుచుండిరి. కృషివిప్లవము చేతిపనులను భగ్నము చేయుటచే స్వల్ప భూస్వాములు భూముల నమ్ముకొనవలసివచ్చెను. గోరుచుట్టుమీఁద రోఁకటిపో టన్నట్లు "ధాన్యశాసనములు" స్వల్పభూస్వాముల నప్పులపాలు చేసెను. వీని ఫలితముగా, స్వల్పభూస్వాములు జీవనాధారము లేక తిరుగులాడవలసివచ్చెను. పూర్వము "కలకలనవ్వుచుండిన గృహము లిప్పుడు కావలివానికిని వాని కుక్కకును ఆకరము లయ్యె" నని యొకరు వ్రాసియున్నారు. ఆంగ్లేయ దేశమునకు క్రామ్వెల్ కాలమందు దిగ్గజములవలె నుండి ఆంగ్లేయస్వేచ్ఛను కాపాడిన భూస్వాము లిప్పుడు నామావశేషులైరి. కొందఱకు కార్ఖానాలలో నుద్యోగము దొరకెను. దొరకనివారు దొంగతనమువల్లను బందిపోట్లవల్లను ముష్టివల్లను జీవింపవలసివచ్చెను.

కార్ఖానాధికారులు తక్కువ వేతనముతో హెచ్చుపని చేయించుటకు మొదలిడిరి. పరిశ్రామికులు తమ శ్రమకు తగిన వేతనము సంపాదింపవలె నన్న వారందఱు నైకమత్యముతో మెలఁగుట యవసరము. స్వార్థపరాయణు లగు వర్తకశ్రేష్ఠుల దాడి కోర్వలేక కృషికరులు కృషిసంఘముల నాత్మసంరక్షణార్థమై స్థాపించిరి. ఈ సంఘములు స్వేచ్ఛగా రాచవారి యనుమతిని బడసి విహరించుట కొక శతాబ్దము పట్టెను. వీని చరిత్ర కొంతవఱకు విమర్శించిన బలవంతులు స్వలాభపురస్కృతులై బలహీనుల నెన్ని భంగుల పీడించెదరో తెలియఁగలదు.

ఇట్టి సంఘములు సుమారు 1800 ల సంవత్సరమునం దంకురించినవి. ఏ సంఘము కృషీవలులచే నిర్మితమై వేతనములను హెచ్చించుటకు ప్రయత్నము చేయునో యా సంఘము "కృషిసంఘ" (Trade Union) మని వెబ్ చెప్పెను. ఇట్టి సంఘముల సమ్మేళనము "కృషుల సంఘ" (Trades Union) మందురు.

ఈ సంఘము లిరువదియైదు వత్సరములు కడు దైన్యము నవలంబించినవి. ఎచ్చటెచ్చట అట్టి సంఘములు వెలువడెనో అచ్చటచ్చటి రాచవారు వానిని భగ్నము చేయుచు వచ్చిరి. పిట్ అను ముఖ్యమంత్రి "ఫ్రెంచి" సంక్షోభ జనిత భయాచేతస్కుఁడై ఈ సంఘములు కూడ రాజ్యమును కలఁతపఱచు ననెడి యభిప్రాయముతో క్రూరశాసనములను కొన్నిటిని కల్పించెను; ఇట్టి చట్టములచే నీ సంఘములను నిర్మూలము చేయలేక పోయెను. అవి రహస్యసంఘములుగా పరిణమించెను.

కాని, డైసీ చెప్పినట్లు వాని స్థితి యిట్లుండెను: "గూఢసంఘముల నాశ్రయించుట దుష్కర్మము. కృషిసంఘములు గూడ నట్టి సంఘములుగా పరిగణింపఁబడినవి. అందుఁ జేరు మానవులు మహాపరాధులు. కావున శిక్షార్హులు." ఇట్టి స్థితికి కారణము ధనవంతులు. ఆ దంతయు బలవంతు లగు వర్తకపు దొరల దౌర్జన్యము. కాని, పట్టుదలతో చేసిన పనిని దైవము కొనసాఁగింప కుండునా? 1825-వ వత్సరమున రాజ్యాంగసభ ఇట్టి సంఘము లుండవచ్చు నని సమ్మతింపక తప్పలేదు. తన యునికి యంగీకరింపఁబడిన నాఁటినుండియు అవి విజృంభింప నారంభించెను. 1830-వ సంవత్సరమున క్రొత్త యాదర్శమను పేరున, కృషిసంఘము సలక్షణముగ కృషీవలుల వాంఛలను పూరించుచుండెను. కాని, రాను రాను సంఘములు ఓట్టుబిగిసి పనితనము లేని కృషీవలులను తములోఁ జేర్చుకొనకుండెను. 1850 మొదలుకొని 70 వఱకు ఈ సంఘములు దౌర్జన్యము చూప నారంభించెను. ఎచ్చట చూచినను సమ్మెకట్టుట మిక్కుటమయ్యెను. ఈ సంఘముల కాయుధము సమ్మెకట్టుట. 1850-వ వత్సరమునందే స్త్రీల సంఘము వ్యావసాయకుల సంఘము వెలసెను. కాని, పుట్టుకలోనే వానికి నూరు వత్సరములు నిండెను. సమ్మెకట్టుటవలన దేశము కలఁత నొందెను. రాజకీయవేత్తలీ సంఘములను పరిశీలింప సమకట్టిరి. 70-వ వత్సరంబున నీ సంఘములు నిర్దోషము లని తేలినది. అప్పటినుండియు నీ సంఘములకు కొంత యునికి (పరపతి) యేర్పడినది. ప్రతివృత్తియందు నొక్కొక సంఘము వర్ధిల్ల మొదలిడెను. స్త్రీ సంఘము మరల చిగిర్చెను. వ్యవసాయపు సంఘమునందు మరల నూపిరి పోయఁబడెను. పనితనము లేనివాండ్రకొఱకు కీర్ హార్డీ యొక సంఘము స్థాపించెను. ఈ సంఘము లన్నిటికిని సంవత్సరమున కొకతూరి మహాసమ్మేళనము జరగును. అచ్చట వారువారు తమతమ కష్టసుఖములను ముచ్చటించెదరు. సమ్మెకట్టుట శాస్త్రీయ మని యొప్పుకొనఁబడినది. సంఘములు కుప్పలితెప్పలుగా పుట్టినవి. ఈ విధముగా పనివాండ్రు ధన దౌర్జన్యమునుండి తప్పించుకొనుచున్నారు.

ఇఁక కూలినాలి దొరకక సంచారము చేయువారి విషయమై కొంత వ్రాయవలసి యున్నది. వారిలో కొందఱు దేశము వదలి యితర దేశములు పట్టవలసి వచ్చెను. వారే యిప్పుడు మాతృదేశ పోషిత పరదేశీయులుగా పరిగణింపఁబడి ఆంగ్లేయ రాజ్యమునకు పుష్టి నిచ్చుచున్నారు.

మరికొందఱు భిక్షాటనము చేయ మొదలిడిరి. పూర్వమునుండియు పశ్చిమదిక్కున బీదల రక్షణార్థము మన దేశమునవలెఁ గాక కట్టుదిట్టములు కొన్ని చేయఁబడెను. మన దేశమందు బిడ్డల పోషణార్థము రాజకీయప్రయత్నము లెప్పుడు జరగలేదు. పాశ్చాత్యులన్నో అట్లు కాదు. బీదల సమస్యయొక్క చరిత్ర చాల వింతగా నుండును. అది ప్రతివారును చదువవలె నని నా మనవి. ఈ వ్యాసమునందు ఆ చరిత్రను విపులముగా వ్రాయుట యంత సమంజసము గాదు. కావున క్లుప్తముగా ముగించెదను. పదునెనిమిదవ శతాబ్దమునకు పూర్వము ఎలిజబెత్ కాలమునం దొక చట్టము నిర్మింపఁబడెను. దాని ముఖ్యాంశములు మూడు: (1) బలహీనులకు వృద్ధులకు కూడొసంగుట (2) శక్తి గలవారికి పని కల్పించుట (3) బాలురను పోషించుట. ఈ చట్టమే 1834-వ సంవత్సరమువఱకు నాధారముగా నుండెను. కాని, పదునెనిమిదవ శతాబ్దమునందు జరగిన సంక్షోభము వలన నా చట్టము పనికివచ్చినది గాదు. అందువల్లనే పెద్దలు శాస్త్రములు కాలానుగుణ్యము లని వ్రాసిచ్చెదరు. పూర్వపు చట్టము అమలులో నుండుటవలన బీదలు బహుకష్టముల పాలు గావలసి వచ్చెను. బీదల యవస్థ యెంత నీచముగా నుండెనో 1835-వ సంవత్సరమున వెలువడిన రాయల్ కమిషన్ వారి ప్రకటనమువలన తెలియనగును. శీలము చెడి వివాహమునకు పూర్వము ఇద్దఱు పిల్లలనైనను కనని యాఁడుది లే దని వారి ప్రకటనమువలన స్పష్టము. బీద శరణాలయ మొక కారాగృహమువలె నుండెను. కాని, బీదల నుద్ధరించుదానివలె నుండలేదు. 1834 వ సంవత్సరమునుండి యిట్టి పరిపాలన మాఱినది. ఈ మార్పునకు కారణ మేమన, "స్వబలాధారుల" యొక్క యధికారము రాజకీయ విషయములయందు నిరంకుశముగా సాఁగుచుండెను. ప్రకటనానంతరము సంఘాధారపురస్కృతుల యొక్క యధికారము బలమయ్యెను. అందువలన ఇప్పుడు బీద కుఱ్ఱలకును దిక్కుమాలినవారికిని విద్యాలయము లనేకములు నిర్మింపఁబడినవి. పని లేనివారికి కృషిసంఘములు సాహాయ్యము చేయుచున్నవి. దారిద్ర్యము చాల తగ్గినది. బీదల నుద్ధరించుట కుత్సాహ మెక్కువైనది. బీదల నుద్ధరించుట సంఘమునకు విధి యని యిప్పటికి పాశ్చాత్యులు కనుఁగొనిరి.

ఇఁక ధనము విషయమై రెండు మాటలు వ్రాసెదను. ఇప్పుడు దారిద్ర్యదేవతను పశ్చిమమునుండి యిచ్చటకు పంపి లచ్చి దానిని తన పుట్టినిల్లుగాఁ జేసికొనినది. కాని, ధనమంతయు నొక్క చోటనే కూడినది. అతిదరిద్రులు అతిధనికులు అని రెండు తెగలైనవి. ధనార్జనసంఘములు, తూర్పు హిందూదేశ సంఘము మొదలగు బిరుదములతో బయలు వెడలి, ప్రపంచమును దూరగొనినవి. రాజ్యము లనేకములు సంపాదింపఁబడెను. వర్తకము ప్రబలెను.

విద్య— పూర్వము పాశ్చాత్యదేశములలో విద్య కడు హీన దశయం దుండెడిది. మన దేశమునందలి ప్రస్తుతస్థితిని మనఃఫలకము నం దుంచిన, పాశ్చాత్యుల పూర్వస్థితి తెలియఁగలదు. “నే నెఱుఁగుదును. నా చిన్నతనమునందు ఇంగ్లాండులో వ్రాయను చదువను నేర్చిన పురుషులు నూటికి 10 మందియు స్త్రీలు 100 కి 5 మందియు నుండుట యొక గొప్ప.” అని యొక మహనీయుఁడు వ్రాసినాఁడు. అప్పటికి బీదలకు విద్య అంగోటిజున్ను. భాగ్యవంతులకే యా విద్య హస్తగతము. విద్యాపద్ధతులయందు కూడ కొంత మార్పు ఉన్నది. పూర్వము లాటిన్ కంఠపాఠ మత్యావశ్యము; మతము విద్యలో లీనమై యుండెడిది. అందువలన కళాశాలాధికారు లే మతస్థులో ఆ మతములను గురువులు కూడ నవలంబింపవలసివచ్చెను. ప్రస్తుత స్థితికిని పూర్వస్థితికిని ఇంచుకంతైన సంబంధము లేదు. ఇప్పుడు నూటి కొక్కరైన జ్ఞానహీను లుండరు. పూర్వము మన దేశమందు భోజరాజు రాజ్యము చేయుచుండఁగా పణ్యుఁడు కూడ ఆశుకవిత్వము చెప్పఁగలిగిన కాలమును మనము జ్ఞాపకము చేసికొనినయెడల, వారి ప్రస్తుతపు స్థితి తెలియఁగలదు. పశ్చిమదిశ యంతయు వేల కొలఁది విద్యాలయములతో ప్రకాశించుచున్నది. పశ్చిమదిక్కు ప్రపంచ మునం దున్న అజ్ఞానాంధకారమును తొలఁగించు జ్యోతి యని యనఁదగును; సర్వకళలకు పుట్టినిల్లయి మెఱయుచున్నది. మతమును విద్యలో నిఱికించుట జ్ఞానశూన్యతకు వెల్లడించు నని తెలిసికొనిరి. పాశ్చాత్యులు మతము నిట్లు వేఱు చేయుచుండఁగా, మనవా రిప్పుడు హిందూసర్వకళాశాలలో మతబోధ ముఖ్య మని లోపలి కెక్కింపఁబూనుట కడు చోద్యము. అచ్చట కళాశాలలో స్వభావ యందు విద్య కఱపుటవలన విద్యార్థులు బలిష్ఠులై యుత్సాహము తో చదివెదరు; మనవలె శుష్కశరీరులై యితరభాషలలో విద్య నభ్యసించుటకు మనవంత దురదృష్టులు కారు. ఇప్పుడు ప్రతి బుడుతఁడును విద్యాలయమునకు వెళ్లుట యచ్చట విధియై యున్నది. వారి విద్యాపద్ధతులు రోఁకంటిపాటవలె నుండవు. అనుభవము చేత విద్య కఱపుటకు ప్రయత్నము లెక్కువగా జరగుచున్నవి.

స్త్రీలు — జగత్కారకలును జగత్పోషకలును నగు స్త్రీల విషయమై యింతదనుక తూష్ణీంభావము వహించితిని. దానికి రెండు కారణములు. మొదటిది, ఈ వ్యాసములో ముఖ్యమైన చర్చనీయాంశములలో నిది మహోత్కృష్టమైనది గాన దీని విషయమై ప్రత్యేకము వ్రాయనెంచి యింతవఱకు కూరకుంటిని. రెండవది, ఈ వ్యాసమునందలి కొన్ని యంశములు చెరువరులు కాని పాఠకులకు, అనఁగా లౌకికులకు రుచింపవు. ఈ చప్పని విషయమును గౌరవముగ చేయనెంచి యిప్పటివఱకు దీనిని రంగమునకు తేలేదు.

పూర్వము స్త్రీజనము విద్యయందు కడు హీనదశలో నుండెడిరి. నూటి కయిదుగు రైనను వ్రాయ నేర్చినవారు లేరు. వా రిప్పటివలె స్వతంత్రజీవనము చేయుటకు వీలు లేదు. ఆఁడువారు కార్ఖానాపనులయం దుండెడివారు కారు. వారు పురుషుల వెన్నంటి యుండవలసివచ్చెను. కావున, స్వల్పవయస్సునందే వివాహము చేసికొనెడివారు. మన దేశమందువలె పసికూనల వివాహము లచ్చట ఏ కాలమునను జరగలేదు. అచ్చట స్వల్పవయస్సు, 16, 18 వత్సరములు. ఇట్టి వయస్సునందలి వివాహితలను నేను స్వయముగా చూచి యుంటిని. అచ్చట స్త్రీలకు మూఁడు దశ లున్నవి: (1) శైశవము (2) కన్యాత్వము (3) గృహిణీత్వము. మనకు రెండు తరగతులే: (1) శైశవము (2) గృహిణీత్వము. అందువలన మన స్త్రీలు సామాన్యముగా “శోభనపు గదినుండి కాటికి ప్రయాణ” మని యొకరు వ్రాసియున్నారు.

అచ్చట స్త్రీలకప్పుడు ఇల్లు చక్కఁబెట్టుట పిల్లలను పోషించుట మొదలగు పనులు తప్ప, మఱి యేపనులు నుండెడివి కావు రాజ్యాంగతంత్రము వారికి తెలియదు. వారు మాధ్యదేవతకు ప్రియ శిష్యురాండ్రు.

ఇట్టి మూఢత్వ మంతయు కొలఁది కాలముక్రిందనే మాఱినది. దేశము వృద్ధి పొందవలె నన్న, స్త్రీజనము సజ్ఞానదూరలుగా చేయవలె ననెడి పరమరహస్యమును రాజతంత్రవేత్తలు కనుఁగొనిరి. స్త్రీలకు విద్య నేర్పుటకు విద్యాలయములు స్థాపింపఁబడినవి. స్త్రీలు సర్వకళలయందును పాండిత్యము వహించినారు. కార్ఖానాలలో వీరి సంఖ్య మిక్కుటమయినది. విద్యాలయం దసమానపాండిత్య మహిమను వెల్లడించిరి. స్వాతంత్ర్యము హెచ్చినది. వివాహములు తగ్గినవి. వారు రాజకీయోద్యోగములు కూడ కొన్ని దేశములలో సంపాదించిరి. హాలెండునందు శాసనసిర్మాణసభ్యలుగనుండవచ్చును. యునైటెడ్ స్టేట్సు, ఫ్రాంసు మొదలైన దేశములందు న్యాయవాదినులుగ నుండి వాక్పటుత్వము చూపి క్రేగంటి చూడ్కులతో ప్రతికక్షి వాదమును నిర్మూలము చేసి అర్థపూరితమైన మందహాసములచే న్యాయమూర్తులను మూర్తులుగా చేయవచ్చును. ఇంగ్లాండు దేశమందు కూడ నిట్టి లాభములు పొందవలె నని పాంకహర్ట్సు అను నామెచే “స్త్రీసమ్మతిసంఘము” స్థాపింపఁబడెను. వీ రొకతూరి ముఖ్యమంత్రి యగు అస్క్విత్తును హరింపఁజూచుట వీరి సాహసమును దౌర్జన్యమును చాటుచున్నది. వే యేల? అచ్చటి యాఁడువాండ్రు “మగరాయఁడు” లనఁదగును. మన హిందూదేశము పురుష ప్రపంచ మని యెట్లు చెప్పనగునో పాశ్చాత్యము “స్త్రీప్రపంచ” మని యట్లే చెప్పనగును. అచ్చట ప్రతి యుద్యమమునందును స్త్రీ సహాయ ముండక తప్పదు. ఈ బడబానలతుల్య మహాసంక్షోభమందు చికిత్సాలయములయందును అస్త్రాగారములందును ఇంకను బహుభంగుల స్త్రీలు నిష్కామ సహాయము చేయఁ బూనుటకన్న సంఘవిప్లవమునకు వేఱు తార్కాణ మే మున్నది?

ఇంతవఱకు పశ్చిమసంఘమున జరగిన మార్పులను నా శక్తి ననుసరించి పరిశీలించితిని. ఈ మార్పులకు కారణములు కూడ కొంతవఱకు చర్చింపనిచో నీ వ్యాసము పూర్తియైన దని చెప్పఁగూడదు. ఆ కారణములు క్లుప్తముగా విమర్శించెదను. అవి మూఁడు విధములు: (1) భూగోళ సంబంధము (2) అర్థసంబంధము (3) రాజ్యాంగ సంబంధము.

భూగోళ సంబంధము— పశ్చిమము కొండలచే నావృతమై హిమవంతుని కాకరమయినందున అచ్చటి భూము లంత ఫలవంతము లైనవి కావు. ఇంగ్లాండు దేశము శుష్కపర్వతములకు నెలవగుటచే నాంగ్లేయులు పొట్టను చేతఁ బట్టుకొని దేశాంతరాభిముఖులై పోవలసి వచ్చెను. ఇంగ్లాండు సముద్రము మేఖలముగాఁ గలది గనుక ఆంగ్లేయులు మకరములవలె నిర్భయముగా నీటియందు సంచరింపఁ గలిగిరి. నీటిలో ఏనుఁగునైనను పట్టఁగల మకరి యొడ్డునకు వచ్చిన శక్తివిహీన యగును. అట్లే ప్రస్తుత యుద్ధమందు బ్రిటీషు వారు సముద్రమునకు దొరలైనను, వారు పూర్ణశక్తిని జూపుటకు భూమి పనికిరాదు. వారు మొదటినుండియు నితరదేశములను నమ్మినవారు గనుక పంక్తిభోజనము మొదలైన సాంఘికకంటకములను నిర్మూలము చేసి యితరజాతులకన్న నెక్కువ త్వరగా వృద్ధికి వచ్చిరి. ఫ్రాంసు జర్మని మొదలైన దేశములు కొంతవఱకు ఫలవంతము లైనందున, ఆయా దేశీయులు తమ భూములను నమ్మి యితరదేశములకు పోకుండిరి. వారికి సముద్రము దూరము గాన, సాహసము కొంచెము మందీకృతమయ్యెను. వారికి ఉదారభావము కూడ కొంతకాలము శూన్యము; మిగుల బిఱ్ఱబిగిసి యుండెడివారు. జర్మనీ దేశమున నిట్టి దుర్గుణములు మొన్న మొన్నటిదాఁక నుండెడిని. ప్రష్యను, బవేరియను యొక్క భూమిని కొనిన యెడల, అంతకు పాత్రుఁడయ్యెడివాఁడు. ఇట్టి భేదములచే భూవిప్లవము ఫ్రాంసు మొదలైన దేశములం దంతగా జరగలేదు; జరగినను ఇంగ్లాండులో జరగిన విప్లవానంతరమే జరగెను. ఇంగ్లాండునందువలె జర్మనీదేశమందు ప్రజాసంఖ్య యిప్పుడిప్పుడు వృద్ధి నొందుచున్నది. ఇంగ్లాం డచ్చటచ్చట అధినివేశపు టూళ్లను స్థాపించి తన కష్టములనుండి గట్టెక్కినది. ఇఁక జర్మని యేమి చేయవలయును?

ప్రపంచ మంతయు మానవశక్తికి గోచర మగునంతవఱకు పంచఁబడినది. జర్మని యితరదేశములకు తన పుత్రులను బంపి యన్యజాతులలో వారిని గలపి తన జాతీయతకు భంగ మొనర్పవలసినదా? లేక, కొన్ని యప్రయోజక నిర్మానుష్య దేశములను జయించి తన జాతీయతను వ్యాపింపఁజేయవలసినదా?—ఇదియే ప్రస్తుత ఘోర యుద్ధముయొక్క తత్త్వము. ఇది యుద్ధానంతరము తేలఁగలదు.

పశ్చిమదిశ శీతలము గాన, పాశ్చాత్యులు బలయుతులు గాను కృషి చేయుటయం దుత్సాహులు గాను నుందురు. ఉష్ణదేశములందు మనుజులు సూర్యరశ్మిచే తపింపఁజేయఁబడి శుష్కశరీరులై నిరుత్సాహులుగ నుందురు. అందువలన వారికి కోర్కెలు కూడ కొంత తగ్గును. దానంజేసి తమకు సౌఖ్యభాజనము లగు వస్తువులను సంపాదించుటకై వారు ప్రయత్నములు సల్పరు. మన హిందూదేశమే దానికి తార్కాణము.

ప్రతి మనుజునకు వాంఛ లుండుట విధి. ఎన్ని కోర్కె లుండునో యంత మానుషము. గొంతెమ్మ కోర్కెలవలన ప్రయోజన మేమి యని యడుగవచ్చును. కాని, కోర్కె లెప్పుడు మొలకలెత్తునో యప్పుడు మానవుఁడు వానిని సాధించుటకు ప్రయత్నము చేయును. అట్టి తఱి తన సంఘమునకు కూడ లాభము చేయును. కాని, యా కోరికలు దుర్మార్గములయి యుండఁగూడదు. ఏ మనుజుఁడు తన సౌఖ్యముకొఱ కితరులకు హాని చేయక పాటుపడునో గాతఁడు తనకును సంఘమునకును మేలు చేయుచున్నాఁడు. కోరికలు లేక మేర లేని తృప్తి చెందువాఁడు సంఘమునకు లాభ మేమియుఁ జేయఁడు. తృప్తి యెల్లప్పుడు అశక్తతవలన కలుగఁగూడదు. శక్తుఁడైన నరుఁడు స్వవిషయములో తృప్తి చెందినను, సంఘమునకైన పాటుపడును. ప్రస్తుతము మన దేశమం దున్న తృప్తి అశక్తికి ముద్దుకూఁతురు. కోరికలు హెచ్చగుటచేతనే పశ్చిమ మింత యభివృద్ధి చెందినది. అభివృద్ధికి మూలకారణము అతృప్తి. విద్యార్థి అతృప్తివలననే ప్రపంచమునం దున్న జ్ఞానము నంతయు నాకర్షింపఁ బ్రయత్నించుచున్నాఁడు. అతృప్తివల్లనే ప్రజలు రాజుల దౌర్జన్యము నడంచుచున్నారు. కాని, యతృప్తిహద్దు లేనిది కాఁగూడదు. అతృప్తి జ్ఞానయుక్త మయినంతవఱకు సంఘమునకు శ్రేయస్కరము.

అర్థసంబంధము— ఇది రండు విధములు: (1) లేఖకుల యధికారము (2) కల్పనలు. ఇప్పటికే చదువరుల కధిశ్రమ కలిగించి యుండవచ్చును. ఇఁక ముందు పూర్ణపరిశీలనకుఁ బూనుకొనిన ఛాందసమని తోఁచవచ్చును. కావున సాధ్యమయినంత క్లుప్తముగా నుండెదను. అర్థసంబంధ మయిన కారణములను వ్రాయ సమకట్టినచో నొక చిన్న పొత్తము కూర్పవచ్చును.

అర్థశాస్త్రజ్ఞుల వ్రాఁతలు కొంతవఱకు సంఘమందు కల్లోలము కలిగించిన వని తప్పక చెప్పవలయును. వీరి గురు వనఁదగు ఆడమ్ స్మిత్ ఈ శాస్త్రమునకు కొంతవఱకు రూప మేర్పఱచెను. అతని బోధనలు మనుజులను కొంతవఱకు "స్వబలాధారులు"గ మార్చినవి. ఇతని బోధనల తత్త్వము స్వేచ్ఛ. ఇతని బోధనలను విని రాచవారు కొంతకాలము ప్రజలను వారివారి కర్మఫలములకు వదలిరి. ముఖ్యమంత్రి యగు పిట్టు స్మిత్తునకు శిష్యుఁడై కృషిసంఘములను వాని కర్మఫలములకు వదలెను. అట్లే బెన్థమ్ బోధనలు కూడ సంఘబల పురస్కృతుల ఖండనకు పూర్వము విజృంభించెను. కావుననే పందొమ్మిదవ శతాబ్దపు ప్రథమభాగమున రాజ్యాంగశాసనము లన్నియు "స్వబలాధారము" అను పద్ధతి నవలంబించి స్థిరీకృతము లయ్యెను. ప్రస్తుతశాసనములందుఁ గల మార్పులకు సంఘాధారపురస్కృతుల తత్త్వము కారణము.

కల్పనలు— కల్పనలు సంఘమం దద్భుతమైన మార్పులను దెచ్చినవి. యంత్రములవలన ఫలము వేయిరెట్లధిక మయ్యెను. చేతిపనులు నశించెను. జనులు గ్రామములను వదలి పట్టణము లాశ్రయింపవలసి వచ్చెను. మన దేశమున గ్రామములకు భుక్తి మొదలైన సదుపాయములకు పట్టణము లాధారములు కావు. పశ్చిమమందు ప్రస్తుతపు స్థితి వ్యతిరేకము. గ్రామములకు పట్టణము లాధారము.

రాజ్యాంగ సంబంధము— ఇది రెండు విధములు: (1) లేఖకుల ప్రోద్బలము (2) రాజ్యాంగ విప్లవములు.

లేఖకుల ప్రోద్బలము— రూసో పెయిన్ మొదలైన రాజ్య

తత్త్వజ్ఞు లప్పటి సంఘక్లిష్టములను ఖండించుచు అధికారుల దౌర్జన్యమును బయల్పుచ్చుచు, మానవసమత్వమును బోధించు వ్రాతలచే జనులను తమ స్వాభావనిర్మితమైన హక్కులను సంపాదించుటకు పురికొల్పిరి. వారి వ్రాతలే మనుష్యస్వతంత్రతను సోదరతను స్వేచ్ఛను చాటుచు, అమెరికనులు స్వేచ్ఛకై జరపిన పోరాటము మొదలైన విప్లవములుగా పరిణమించినవి.

విప్లవములు— ఫ్రాంసు దేశము కొంత కాల మతిక్రూరముగ పరిపాలింపఁబడినది. బలవంతులైన కొందఱు దొరలు హీనులైన ప్రజలను తపింపఁజేయుచుండెడివారు. వారి నిరంకుశప్రభుత్వము ప్రజలకు క్షామకారణ మయ్యెను. మనుజుఁ డెంత పిఱికిపంద యైనను పిఱికితనమునకు కొంత హద్దు కలదు. అసహాయుఁడైన మానవుఁడు నిరాశ చెందుటఱను పీడింపఁబడినయెడల నేమి చేయునో అదియే ఫ్రెంచి విప్లవముయొక్క తత్త్వము. ప్రజ లొక్కపెట్టున దాస్యవిముక్తి కొఱకు ఒక్కమాఱుగా విజృంభించిరి. ఇట్టిదియే అమెరికావారు స్వేచ్ఛకొఱకు సల్పిన పోరాటము.

ఈ పవిత్రసంగ్రామములు మానవసమత్వమును చాటి తదితర దేశపు ప్రజలను మేల్కొలిపినవి. అప్పటినుండియు ప్రభునాయక (Lords) ప్రభుత్వము మంటఁ గలసినది. రాజ్యము ప్రజానుగుణ్యముగ జరగవలసి వచ్చెను. ప్రజలు కష్టసుఖములను తమకు తామే సవరించుకొన శక్తులైరి. రాజుల నాశ్రయించు సర్వాధికారము ప్రజల యధీన మయ్యెను.

ఇప్పటికి పాశ్చాత్య సంఘ విప్లవ జనిత వికారములను యథాశక్తి వ్రాసితిని. ఇఁక క్లుప్తముగ మార్పుల నన్నిటిని పేర్కొని నా వ్యాసమును ముగించెద.

సంఘమున జాతిభేదము నశించినది పూర్వము పుట్టుకను బట్టి మానవుని యునికి నియమింపఁబడెడిది. ఇప్పుడు సామర్థ్యము వలన నియమింపఁబడును. నాయకమ్మన్యుల యధికారము వణిజులు లాఁగికొనిరి. వాణిజ్యము వ్యవసాయమును బందీకృతము చేసినది. సంఘమందు చిక్కులు తగ్గినవి. పూర్వమువలె అర్చకులే గాక ఎంత హీనజాతివారైనను విద్య నభ్యసించి యున్నతపదవుల నాసింపవచ్చును. విద్య కఱపుట విధియై యున్నది. స్త్రీలకు స్వతంత్రపు జీవనము లేర్పడినవి. సంఘ మంతయు నాస్తికమును స్వబలాధారమును పవిత్రహీనమును నైనది. కృషివిభజన మిక్కుటమగుచున్నది. దానితోఁబాటొకవిద్యయందే పరిశ్రమ చేయుట కూడ ప్రబలుచున్నది. దేశము ధనవంతమైనది. వివిధవిద్యలు వృద్ధి గాంచినవి. సంఘమందు మన్నన హెచ్చినది గాని దానితో మాయ కూడ హెచ్చినది. ఏసుదేవుఁడు మరల జన్మించిన, తన శిష్యులను జూచి వారి యపవిత్రతకు చింతిల్లక మానఁడు. సంఘ మంతయు వృద్ధి నొందెను. అల్పసంతోషు లువ్విళ్లూరుచుండ, ఖిన్నభాజనులు కొందఱు సంఘమందు పాప మెక్కువైన దని విచారించుచున్నారు. సంఘ మంతయు మతి దప్పి ధనపిశాచము నుపాసించుచున్న దని వారి యభిప్రాయము. "స్వబలాధార" మను నీతి నవలంబించుటవలన మానవులు స్వార్థపరాయణులై తమ పొరుగువారి నాశనమును కోరుదు రని వారి భయము. ప్రస్తుతము స్వస్వతేజోవిజృంభణమునకే గదా యూరపు రాజ్యములు రక్తసిక్తము లగుచున్నవి. ప్రపంచ మేలుదు మనెడి యాశయే యిప్పుడు జరగుచున్న మహావిపత్తునకు కారణము. ఇట్టి సంఘము ప్రపంచమునకు శ్రేయస్కరమా? నెత్తుటికూడు ఆధానముగాఁ గల యిట్టి సంఘమును మరల మార్పవలె నని సంఘసంస్కారులు బయలు వెడలిరి. వారే "సంఘాధారపురస్కృతులు". సంఘము ప్రజలకొఱకని వారి తత్త్వము. మానవుని తన కర్మఫలమునకు వదలఁగూడ దని వారి మతము. పరస్పరసాహాయ్యమే వారి చదువు. మానవసమత్వమొక రాజకీయవిషయములందే గాక ధనవిషయమునఁ గూడ నుండవలయు నని వారి వాదము. మున్ముందు పశ్చిమసంఘమం దెట్టి మార్పులు రానున్నవో చెప్పుట కష్టము. సంఘసంస్కారులు "జాతీయత"ను ఒప్పుకొనక ప్రపంచము నంతయు నొక జాతిగాఁ జేయవలె నని కోరుచున్నారు. ఇఁకముందు "జాతీయత" వృద్ధి గాంచునో, లేక సర్వత్వము ముందునకు వచ్చునో చూడవలసియున్నది.

తూర్పు దిక్కు కూడ మేల్కాంచినది. జపాన్ రాజ్యము నుండి బయలువడి బాలసూర్యునివలె వృద్ధి నొందుచున్నది. కాని, ఆయమ యాంగ్లేయుల ననుసరించుచున్నది. కావున, ప్రపంచమునకు క్రొత్త యాదర్శ మేమియు చూపలేదు. కైపెక్కిన చీనా దేశము కూడ కనులు తెఱచుచున్నది. ఈయమ మేల్కాంచినచో, పాశ్చాత్యుల యాటలు సాగవు. ఈయమ ప్రపంచమున కేమి హితబోధ చేయ నున్నదో తెలియదు.

ఇఁక నొకకాలమందు గొప్ప జ్యోతివలె మండి ప్రస్తుతము తూష్ణీంభావము వహించిన మన హిందూదేశపు సందేశము ప్రపంచము వినవున్నది. నివురు కప్పిన నిప్పువలె నున్న మన దేశము మరల ప్రజ్వరిల్లు చిహ్నములను జూపుచున్నది. సమయ మాసన్నమైనది. సకాలమున మన దేశీయులు మేల్కాంచకున్న మనము మఱొక శతాబ్దమిట్లే యుండవలెను. మన దేశము కొండొక సమయమున ప్రపంచమున కంతకును జ్ఞానాలయమువలె నుండెను. తత్త్వశాస్త్ర మిప్పటికిని ప్రపంచమున మన పూర్వౌన్నత్యమును చాటుచున్నది. ప్రపంచమంతయు మనము పంపనున్న సందేశమున కెదురు చూచుచున్నది. "పశ్చిమదిక్కు అపవిత్రమై, నాస్తికమై, స్వబలాధారమై తూర్పునకు గురు వగునట్టి స్థితియందు లేదు. తూర్పుదిక్కు విజృంభించుచున్నది. తూర్పు పశ్చిమమునకు క్రొత్త యాదర్శములను జూపు నని యువ్విళూరుచున్నా" మని యొకరు వ్రాసిరి. అట్లే మన హిందూదేశము తిరిగి వృద్ధిలోనికి వచ్చు గీఁత యున్నయెడల నూతనాదర్శములను వెలిపుచ్చుగాక! తన మతాధారమైన "పరస్పర సాహాయ్య" మంత్రమును తన యుద్యమములం దెల్ల జపించును గాక!

# స్వపరిపాలనము

భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు, బి. ఏ., ఎమ్. బి. & సి. ఎమ్.

"భారతీయులు మనకు లోఁబడి యుండుటకుఁగాను మనము వారి నజ్ఞానమునం దుంచవలసినదా? లేక ఆశయములను పురిగొల్ప కయే జ్ఞానము నొసంగఁగలమా? లేక ఆశయములను గల్పించి, వాని సిద్ధికి న్యాయమైన మార్గము చూపకుండుట మన యుద్దేశమా? ఈ ప్రశ్నలలో నేనికైన 'అవును' అని యెవరు ప్రత్యుత్తర మియ్యగలరు? * * *

"మన భారతీయ సామ్రాజ్యముయొక్క భావిస్థితి అంధకారనిమగ్నమై యున్నది. చరిత్రలో అపూర్వముగ నున్నట్టియు, తనంతట తాను రాజకీయ పరిణామములో ప్రత్యేకత వహించినట్టియు రాష్ట్రముయొక్క విధి యెట్టిదో యూహించుట కష్టము. దాని యొక్క వృద్ధిక్షయములను నిర్ణయించు ధర్మములు మన కింకను దెలియవు. మన పరిపాలనా విధానమువలన భారతదేశపు బహుజనరాజ కీయప్రవృత్తులు విజృంభించి యా విధానమునకు అతీతము గావచ్చును. సుపరిపాలనవలన మన ప్రజలకు అంతకంటె మంచి పరిపాలన చేసి కొను శక్తివంతులుగ శిక్షణ గఱపవచ్చును. పాశ్చాత్యసువిద్యను సంపాదించి ముందొకనాఁటికి పాశ్చాత్యప్రతిష్ఠాపనలను నిర్బంధముగఁ గోర వచ్చును. అట్టి రోజు ఎన్నఁడైన వచ్చునో యేమో నాకు తెలియదు. కాని, అట్టి దినమును నివారించుటకుఁ గాని ఆలస్యము చేయుటకుఁ గాని నే నెన్నఁటికిని యత్నింపను. ఎప్పటికి రానీ, ఆ దినము ఆంగ్లేయ చరిత్రయందు మహాద్దినము."

నేఁటికి ఈ దినము సంప్రాప్తమైనది.

భారతీయుల సత్త్వలను ప్రథమమున శాసనరూపకముగ గమనించు ఛార్టరు ఆక్టు చర్చింపఁబడు సమయమున నీ వాక్యములు మకాలే గారిచే 1833-వ సం. లో పార్లమెంటు సభయందు పలుకఁబడెను. 82 సంవత్సరములు గతించినవి. కంపెనీ యధీనమునుండి ఇండియా దేశము రాణిగారి పరిపాలనలోనికి 1858-వ సం.న తీసికొనఁబడెను. 274 సం.ల జీవితకాలానంతరము ఈస్టు ఇండియా కంపెని యను వర్తకసంఘము, భారతదేశమును పరుల యధీనము చేసి సమసెను. 1877-వ సం. లో విక్టోరియా రాణి ఇండియా దేశమునకు చక్రవర్తిని యను పదవిని స్వీకరించెను.

1833-వ సం.పు ఛార్టరు ఆక్టులోని వాగ్దానములు 1858-వ సం.లోని రాజ్ఞి గారి ప్రకటనమువలనను, 1877-వ సం.లోని లిట్టను ప్రభువు గారి వాక్కులవలనను ధ్రువపఱుపఁబడెను. ఈ మనోభావములే ఎడ్వర్డు జార్జి రాజులచే తమ సింహాసనారోహణ కాలమందు తిరిగి నుడువఁబడెను.

పాశ్చాత్యవిద్య నభ్యసించి, తమ పూర్వౌన్నత్యమును ప్రస్తుతదైన్యస్థితిని గ్రహించి భారతీయులు, 1885-వ సం.లో నుపక్రమింపఁబడిన దేశీయమహాసభ యొక్కయు తదుపాంగము లగు వివిధ రాజధాని మండల సభలయొక్కయు బలముచే, తిరిగి స్వరాజ్యకాంక్షులై, 1906-వ సం.నుండి అందుకుఁగాను శాస్త్రసమ్మత మగు మహాందోళనముచే సంక్షుభితులై, ఈ నాఁటికి తమ చిరకాలాభీష్టసిద్ధిని బొందనై యున్నారు. కడపటి బొంబాయి మహాసభయందు స్వపరిపాలనావిధానమును నిర్ణయించుట కేర్పాట్లు చేయఁబడెను. ఈ సంవత్సరము జరగిన హిందూ మహమ్మదీయ సమ్మేళనమును వారి యెల్లరి యైకకంఠ్యవాదమును ఈ యభీష్టసిద్ధిని త్వరపఱుపఁగలవు.

ఇట్లు ముప్పది కోట్ల జనులును ఏక మగుటకు కారణము లనేకములు గలవు. 30 సంవత్సరముల క్రింద దేశీయ మహాసభలో ప్రథమమునఁ గోరఁబడిన పరిపాలనాసంస్కరణము లింతవఱకును లభింపకపోవుటయే కాక, ఇంతలో నవి లభించునా యను సంశయమునకుఁ గూడ లోనగుచున్నవి. వ్యక్తిస్వాతంత్ర్యమునకును దేశముయొక్క ఆత్మగౌరవమునకును భంగకర మగు ఆయుధశాసనము నింతవఱకు రద్దు చేయలేదు సరే కదా, ఆ శాసనముయొక్క పరిపాలన ఇంచుకైన ప్రజానుకూలముగఁ గావింపఁబడుట కూడ లేదు. బంగాళా రాజధానియందు శాసనబద్ధు లగు పౌరులకు

అన్ననో, 1884 వ సం. లో ఏ నామరూపములు రిపన్ ప్రభువు వీని కిచ్చెనో అవి ఇప్పటికిని విశేషమగు మార్పుల నందక యథాపూర్వముగ నున్నవి.

ముప్పది సంవత్సరములనుండి పడుచున్న పాట్ల వలన మనము కోరిన మార్పులు మనకు లభింపకపోయినను, స్వపరిపాలనాదర్శము మాత్రము సర్వసమ్మతముగ నంగీకరింపఁబడినది. కాని, ఇది కేవలము ఆదర్శముగనే యుండఁదగు నని పాశ్చాత్యులలోఁ గొందఱు వాదించుచున్నను, వారిలో ననేకులును మనవారును ఈ యాదర్శము కార్యాచరణమునందు సిద్ధి పొందవలసిన తరుణ మాసన్న మయిన దని గట్టిగ నమ్ముచు, గత వత్సరపు దేశీయమహాసభయందు స్వపరిపాలనమును గూర్చి తీర్మానము గావించిరి.

ఈ తీర్మానమునందు నిర్వచింపఁబడిన యంశములనే ఒకదాని పిమ్మట మరియొకదానిని సవిస్తరముగఁ జర్చించెదము.

1. రాజధాని స్వాతంత్ర్యము —— ప్రతిరాజధానికిని తనకు సంబంధించిన అంతరంగ పరిపాలన విషయములందు స్వాతంత్ర్య ముండవలె ననియు, కేవలము దుష్టపరిపాలన జరగుచున్నపుడే ఇండియా గవర్నమెంటువారు జోక్యము కలుగఁజేసికొనవలె ననియు, హార్డింజి ప్రభువు 1911-వ సం. ఆగష్టు 25-వ తేదీనాఁటి దస్త్రావేజులో 3-వ పేరాలో వ్రాసియున్నాడు. రాష్ట్ర (రాజధానీ) స్వాతంత్ర్యము కనడా ఆస్ట్రేలియా మున్నగు దేశములలో పరిపాలనకు సంబంధించిన కొన్ని శాఖలలో మాత్రమే గలదు. జర్మనీ అమెరికా సంయుక్తరాష్ట్రములలోఁ గూడ నిట్టియేర్పాట్లే గలవు. న్యాయపరిపాలన (సివిల్ క్రిమినల్), స్టాంపులు, పోలీసు, రివిన్యూ, ఫారెస్టు మున్నగు శాఖలయం దెల్ల రాష్ట్రస్వాతంత్ర్యము గలదు. కస్టంసు, సేన, నౌకాదళము, నాణెములు, పరరాజ్యములతోడి సంబంధనిర్ణయము, రైళ్లు, టెలిగ్రాఫులు మొదలగు శాఖ లన్నియు ఇండియా(సామ్రాజ్య) ప్రభుత్వమువారి యధీనమునం దుండును. అంతరంగపరిపాలనకు సంబంధించినంతవఱకు ఏ రాజధానియం దుండు ధర్మములు, న్యాయములు, శాసనములు ఆ రాజధాని వలననే నిర్ణయింపఁబడును.

మన దేశము రాష్ట్రస్వాతంత్ర్యముతోఁ గూడిన దేశముగ స్వపరిపాలనము నొందవలె నను పరమావధి సర్వజనాంగీకార మైనప్పుడు, ఇంతకన్న మేలైన రాష్ట్ర స్వాతంత్ర్యనిర్మాణ ముండఁజాలదు. కాని, రాష్ట్రము లప్పుడు ఇప్పటివలెఁ గాక, సహజసిద్ధముగ నుండవలెను. ఇప్పుడు మహారాష్ట్రులు బొంబాయి, మధ్యపరగణాలు, నైజాము——ఇట్లు ముగ్గురిక్రింద నున్నారు. అయితే, ఆంధ్రులు చెన్నపురి, నైజాము, మధ్యపరగణాలు——వీని క్రింద నున్నారు. మఱియు బొంబాయి రాజధానిలో నాలుగు భాషలు. మహారాష్ట్రము, కన్నడము, గుజరాతి, సింధి మాట్లాడు జనులు అన్యోన్యమైత్రి లేకయే యున్నారు. అటులే చెన్నపురి రాజధానిలో ఆంధ్రులు, ద్రావిడులు, మళయాళీలు, కన్నడీలు కలసికలయక యున్నారు. రాష్ట్రస్వాతంత్ర్యమునకుఁ గాని భాషాప్రవృద్ధికిఁ గాని భారతజాతీయతకుఁ గాని ఇట్టి కలగాపులగము అంతరాయమే గాని, సహాయకారిగ నుండఁజాలదు. కావున ప్రథమమున మనము కోరవలసినది భాషాప్రయుక్తరాష్ట్రములు. రెండవది రాష్ట్రస్వాతంత్ర్యము.

2. ఇట్టి రాష్ట్రములందు పరిపాలన మెట్లుండవలె నను విషయమును తరువాత యోచింపవలెను. ప్రస్తుత మున్న శాసనసభను బహుళము చేయవలెను. సీమదేశమందు 4 కోట్ల జనులకు 670 మంది పార్లమెంటులో ప్రతినిధులుగ నున్నపుడు, మన రాజధానికి నూరుగురైన ప్రతినిధు లుండవలెను. ఆంధ్రరాష్ట్రము విడఁదీయఁబడినప్పుడు అప్పటి శాసనసభయందు 60 మంది ప్రతినిధు లుండవలెను. వీ రెల్లరు ప్రజలచే నెన్నుకొనఁబడినవారుగ నుండవలెను. వీరికి ఆదాయ వ్యయములపై పరిపూర్ణాధికార ముండవలెను. వీరి తీర్మానములకును వీరిచేఁ గావింపఁబడు శాసనములకును అధికారవర్గము లోఁబడియుండవలెను. ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు అనఁబడు కార్యనిర్వాహకసంఘము

ఆయుధములు లేకపోవుటచేతనే కదా, అరాజకు లగు యువకులు ప్రజలను చంపుచు దోఁచుకొనుచు భయంకర మగు నూతనశకము నుపక్రమించినారు. శాసనము నతిక్రమించువారలకు ఆయుధము లుండుటయు, శాసనబద్ధు లగువారలకు ఆయుధములు లేకుండుటయు ఈ యాయుధశాసనముచేఁ గల్పింపఁబడిన కష్టములను విస్పష్టముగ తెలియఁజేయుచున్నవి.

ఉన్నతోద్యోగములకు యువకులను నిర్ణయించు పోటీ పరీక్షలను సమకాలికముగ సీమతోఁ బాటు ఇండియాలో కూడ జరపింపవలయు నని 1893-వ సం. లో పార్లమెంటుచేఁ గావింపఁబడిన తీర్మానము ఇప్పటికిని ఆచరణములోనికి రాలేదు.

న్యాయపరిపాలనశాఖయు అధికారనిర్వహణశాఖయు దేని కది విడివిడిగ నుండినఁ గాని దేశముయొక్క పరిపాలన న్యాయవంతముగ నుండఁజాల దని 30 సంవత్సరములనుండి మొఱపెట్టుకొనుచున్నను, ఈ విషయమున మార్పులు ఇంకను మందగతి ననుసరించియే యున్నవి.

దేశములోని యజ్ఞానాంధకారము, జనసామాన్యమునకు ఉచితముగను నిర్బంధముగను విద్య గఱపుట వలననే తొలఁగింపఁబడు నను విషయము, సభ్యత నొందిన ప్రతిదేశమునందును సర్వవిదితమైనను, మన దేశమునందు మాత్రము గోక్లే గారిచే నుపపాదింపఁబడిన స్వల్పప్రయత్నములు కూడ కొనసాఁగుట లేదు.

ఉన్నతవిద్య ధనికులకు తప్ప సామాన్యులకు లభింపకుండుటయు, తత్పరిపాలన మంతయు విదేశీయుల చేతులలోనే యుండి దేశాభిమానమును పురికొల్పు సాధనముగా వర్తింపకుండుటయు, జయప్రదు లగు కొలఁదిమందికి కూడ తగిన జీవనోపాధులు లేకుండుటయు దేశమునం దంతటను అసంతుష్టిని పెంపొందించినవి.

సేనయందు మనకు పెద్ద యుద్యోగములు లేకపోవుటవలన, భారతీయు లొకప్పుడు అసమానప్రజ్ఞావంతు లగు యోధులు వీరులు అను పూర్వసాంప్రదాయమును కూడ మఱచియున్నారము.

రైల్వే టెలిగ్రాఫ్ పోస్టు కస్టంసు పోలీసు సాల్టు ఆబ్కారీ శాఖలయందు దేశీయులకు తగు ప్రోత్సాహము లేకుండుట మన కుండు కష్టములలో నొకటిగ నున్నది.

దేశముయొక్క అనాదిసిద్ధము లగు పరిశ్రమలు చేతిపనులు కళలు నశించుటకు, పాశ్చాత్యసంసర్గముచే ప్రజలకు దేశీయవిద్యలయందుఁ గలిగిన నిరసనమే కారణము. మనకు వలయు ప్రతిపదార్థమునకు పరదేశీయులపై నాధారపడి యుండవలసిన దురవస్థ యుద్ధము ప్రారంభమైన పిమ్మటనే పాలకులకును ప్రజలకును స్పష్టమయినది.

స్వల్పవ్యయముతోఁ గావింపఁబడవలసిన పరిపాలన ప్రపంచములో నెల్ల నెక్కువ వేతనములు పొందు పాశ్చాత్యోద్యోగులవలనఁ గావింపఁబడుటయు, వీరి నియమితకాల మయిన పిమ్మట వీరి విద్యాబుద్ధులును ప్రజ్ఞానుభవములును మన దేశమునకు వినియోగపడక వీ రేఁగు పరదేశముల పా లగుటయు కూడ మన దేశమునకు కూడఁదీయఁజాలని లోపము లని భావింపవలసియున్నది.

ఒకప్పుడు స్వపరిపాలనము గల దేశములలో మన దేశ మొకటి యనుట సంపూర్ణసత్యము కాదు. ఇప్పుడు సభ్యతయు స్వపరిపాలనమును గల దేశములు అనాగరకతయందు మునిఁగియున్న కాలములో భారతవర్షము సభ్యతకును స్వపరిపాలనకును కీర్తి నందియుండెను. అట్టి స్వపరిపాలనమునకు మూలాధారము గ్రామస్వాతంత్ర్యము. ప్రతి గ్రామమును ఒక స్వరాజ్యముగ నుండెడిది. అట్టి స్వాతంత్ర్యసత్వముల నందిన గ్రామములు ఈ నాఁటికి ప్రతి యుద్యోగికి వశమై, స్వసహాయ మన నెట్టిదో మఱచి, పంచాయితీలను గోల్పోయి, సివిల్ కోర్టులకు పాల్పడి, మర్యాదలను ధనమును పోఁగొట్టుకొనుచున్నవి. గ్రామపంచాయితీల స్థాపనము ఇంకను నిర్వివాదాంశముగ భావింపఁబడుట లేదు. ఇఁక మ్యునిసిపాలిటీలు తాలూకా బోర్డులు

(గవర్నరును, తోడి మెంబర్లును) వీరి సభయందు సభికులుగ నుండుచు, వీరి యాజ్ఞలను అమలులోఁ బెట్టుచుండవలెను.

ఇట్టి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలునందుఁ గాని, శాసనసభయందుఁ గాని, ఐ. సి. ఎస్. ప్యాసు అయినవా రుండఁగూడదు. ఎగ్జిక్యూటివ్ కౌన్సిలులో 6 గురు సభికులుండవలెను. వీరిలో ముప్వురైనను ఇదివఱకు సర్కారు నౌకరీ చేయనివారుగ నుండవలెను. తక్కిన ముగ్గురును ఐ.సి.ఎస్. వారు కాక ఇతరు లుండవలెను. ఐ.సి.ఎస్. వారు వివిధశాఖల యధిపతులుగ నుండు నున్నతోద్యోగముఁకన్న ఎక్కువ పదవికిఁ బోరాదు.

రాష్ట్రపరిపాలనము సాధ్య మయినంతవఱకు మాతృభాషలయందు జరగవలెను. ముఖ్యముగ న్యాయపరిపాలనము, రివిన్యూపరిపాలనము, విద్యావ్యాపకము, మ్యునిసిపాలిటీలు, లోకలు బోర్డులతోఁగూడిన స్థానిక స్వపరిపాలనము, పరిపూర్ణముగ మాతృభాషలయందే జరగవలెను. ఇట్టి సంస్కారములకు భాషాప్రయుక్తరాష్ట్రము లనివార్యములు.

(3) ఇట్లు నిర్మింపఁబడు రాష్ట్రములు 14 కన్న నెక్కువ యుండఁజాలవు. వీనిలో నొక రాష్ట్రమునుండి మఱియొక రాష్ట్రమునకు జరగు దిగుమతి యెగుమతుల పై నొకదానిపై మఱియొకటి పన్నులు విధించుట కవకాశ ముండఁగూడదు. కాని, సామ్రాజ్య సభకు ఇండియా దేశమున దిగుమతి యగు సరకులపై దిగుమతి పన్నులు విధించుటకు అధికార ముండవలెను. ఇప్పు డట్టి స్వాతంత్ర్యము లేకపోవుటంబట్టియే కదా విదేశపు సరకులు వర్తకము దేశీయ పరిశ్రమలను నశింపఁజేయఁగలిగినవి.

సామ్రాజ్య (ఇండియాదొరతనమువారి) శాసనసభలు ఒకటా లేక రెండా అను ప్రశ్న అనేకులు వేయుదురు. ఈ ప్రశ్న కొంచెము కష్టమైనది. ఏలయన, సామ్రాజ్యసభయందు ఒక రాష్ట్రప్రతినిధు లే కాక స్వతంత్రరాజ్యముల ప్రతినిధులు కూడ నుండవలెను. మన దేశమునందు నైజాము, మైసూరు, తిరువాన్కూరు, బరోడా, ఇండూరు, పాటియాలా మున్నగు స్వతంత్రరాజులు 600 మంది గలరు. వీరికి ప్రతినిధులు సామ్రాజ్యసభయం దుండుట న్యాయమే. వీ రందఱు ప్రత్యేకముగ నొక ప్రభువుల సభగఁ గూడవలెనా, లేక సీమలోని ప్రభువుల సభకు సరియగు నొక సభయందు వీరి ప్రతినిధు లుండవలెనా? వీరి ప్రాతినిధ్య మెట్లు నిర్ణయింపఁబడినను, సామ్రాజ్యసభలు రెండుగ నుండుట యుక్త మని తోఁచుచున్నది. ఒక దానియందు ప్రజాప్రతినిధు లుండవలెను. వీరిని 5 లక్షల కొకరిని చొప్పున స్వతంత్రరాజ్య ప్రజలును బ్రిటిషు ఇండియా ప్రజలును ఎన్నుకొనవలెను. ఇట్టి ప్రతినిధులు 5 సం.ల కాలము పని చేయుదురు.

రెండవ సభ ప్రతిరాష్ట్రమునం దుండెడి రాజధాని శాసనసభలచేతను స్వతంత్రరాజ్యము లందలి శాసనసభలచేతను నియమింపఁబడిన ప్రతినిధులతోఁ గూడియుండును. వీరలు 30 లక్షల కొక్కొక్కరి చొప్పున నుండి ఆఱు సంవత్సరముల కాలము పని చేయుదురు.

సామ్రాజ్యమంత్రివర్గములో 8 గురు మంత్రు లుండవలెను. ప్రధానమంత్రి సామ్రాజ్యశాసనసభల రెండిటి సభికులచేతను ఎన్నుకొనఁబడును. ఇట్టి సభికుల నుండియే ఎన్నుకొనఁబడు ప్రధానమంత్రి తన నాఁటి మంత్రులను ఆ సభికులనుండి నియమించుకొనును. వీ రెల్లరు 5 సంవత్సరముల కాలము పని చేయుదురు. గవర్నరు జనరల్ రాజుచే నియమింపఁబడి, రాజుగారికున్న అధికారముకన్న ఎక్కువ యధికారము లేకుండ నుండవలెను.

సెక్రటరీ ఆఫ్ స్టేటుకు ఇండియాపై నుండు నధికారము కలోనియల్ సెక్రటరీకి కాలనీలపై నెంతటిదో అంతే యుండవలెను. అంతకు మించి యుండరాదు. ఈయన కౌన్సిలును ఎత్తివేయవలెను. దీనిని మార్పవలెనని కొందఱు చెప్పుదురు. కాని ప్రస్తుతము నిర్మింపఁబడిన రీతిని ఆ కౌన్సిలు దేశముయొక్క అభివృద్ధికి ఎక్కువ యభ్యంతరముగ నున్న దనుమాట నిశ్చయము.

గతవత్సరము బొంబాయిలో నిర్వచింపఁబడిన తీర్మానమును గూర్చి రాఁబోవు ఏప్రిలు మాసమునందు అలహాబాదులో ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీవారు సవిస్తరముగ ఆలోచింపఁబోవు చున్నారు. అప్పటికి దేశమునం దున్న రాజకీయ సంఘములును, పత్రికలును, ప్రజాప్రముఖులును, మన కుండు స్వపరిపాలనము ఈ విధముగ నుండవలె నని తెలియఁజేయవలెను. లేనిచో, మనలను క్రీగంటఁ జూచుచున్న మన యాంగ్లేయ మిత్రులు మన యుపేక్షను చూచి, స్వపరిపాలనకు తమ సహజప్రతికూలవాదమును బలపఱచుకొని యుద్ధానంతరము మనము పొందవలసిన సంస్కారములను క్షీణింపఁజేయుదురు.

ఇంక బ్రిటీషు సామ్రాజ్యమునందు భారతవర్షమున కెట్టి పదవి యుండునో, ఇంగ్లాండులోని పార్లమెంటు సభకు ఇండియా దేశము గూడ ప్రతినిధుల నంపవలసియుండునో, ఈ ప్రశ్నలు సామ్రాజ్యముయొక్క భావిస్థితి ననుసరించి యుండును. కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజీలండు మున్నగు వలస దేశములకెల్ల నిట్టి ప్రాతినిధ్యము సీమలోని పార్లమెంటునం దున్న యెడల మనకు నట్లే యుండును. కాని, రానురాను ఇట్టి సంబంధము లుండఁజాల వని ప్రస్తుతపు మనోవృత్తులను బట్టి తేలుచున్నది. సీమ పార్లమెంటుకు ప్రతినిధుల నేర్పఱచుకొనుటవలన వలస దేశముల పరిపూర్ణస్వాతంత్ర్యము ఇప్పటికన్న తగ్గిపోవును. కావున, నీ మార్పు వలసలచే నంగీకరింపఁబడదు. వలసలకు లేని ప్రాతినిధ్యము మన కుండఁజాలదు. సామ్రాజ్యమునకు సంబంధించిన యుద్ధము ఒడంబడికలు మున్నగు విషయములు, సామ్రాజ్యములోని వివిధాంగము లగు వలసలు ఇండియా మున్నగు దేశములకు ప్రాతినిధ్యము లేని సీమ పార్లమెంటుచే నిర్ణయింపఁబడుటకంటె, ఆయా దేశముల రాయబారులవంటి ప్రతినిధుల చిన్నసభ నొకదాని నేర్పఱచి, ఆ సభచే నీ విషయములను నిర్ణయింపఁజేయుట యెక్కువ యుక్తముగ నుండును.

ఆ విషయము లెట్లున్నను మన స్వపరిపాలనా విధానమును నిర్ణయించునపుడు ఈ విషయములను మనము గమనింపవలెను:

1. రాష్ట్రములు భాషాప్రయుక్తములుగ నుండి, అంతరంగ పరిపాలనమునందు స్వాతంత్ర్యము గలిగి యుండవలెను.
2. సివిల్ సర్వీసు ఉద్యోగులకు శాసనసభలయందుఁ గాని, గవర్నరు గవర్నరు జనరలుల కార్యనిర్వాహణసభలయందుఁ (మంత్రివర్గమునందు) గాని తా వుండరాదు.
3. గవర్నరులకును గవర్నరు జనరలునకును రాజుగారికిఁ గల యధికారమును మించిన యధికారము ముండరాదు.
4. రాష్ట్రమంత్రివర్గమునందును సామ్రాజ్యమంత్రివర్గమునందును ప్రధానమంత్రి ప్రజాప్రతినిధిసభకులచే తమనుండి ఎన్నుకొనఁబడి తదితరులు ఆయనచే నియమించుకొనఁబడవలెను.
5. సామ్రాజ్యప్రభుత్వమునకు తమ యిష్టము వచ్చిన పన్నులను విధించు నవకాశ ముండవలెను.
6. సెక్రటరీ ఆఫ్ స్టేటుయొక్క కౌన్సిలును తీసివేసి, ఆయనకు ఇండియాపైఁ గల యధికారము ఇతర సెక్రటరీల కుండునట్లే యుండవలెను.
7. వలసలకును పార్లమెంటుకును ఎట్టి సంబంధము లున్నవో, ఇండియాకును పార్లమెంటుకును అట్టి సంబంధములే యుండవలెను.
8. సామ్రాజ్యప్రతినిధి సభలు రెం డుండవలెను. అందులో పైసభయందు రాష్ట్రీయశాసన సభా ప్రతినిధులతోఁ బాటు స్వతంత్రదేశీయరాజుల ప్రతినిధులు కూడ నుండవలెను. క్రింది సభయందు ప్రజాప్రతినిధులే పైని చెప్పిన వివరము ప్రకార ముండవలెను.
9. రాష్ట్రీయశాసనసభలు పరిపూర్ణముగ ప్రజాప్రతినిధులతోఁ గూడినవై యుండవలెను. వీరి సంఖ్య లక్ష ప్రజల కొక్కరుగ నుండవలెను.
10. రాష్ట్రములకు సంబంధించిన వ్యవహారములు

సామ్రాజ్య వ్యవహారములనుండి విడఁదీయఁబడవలెను.

11. ఈ సంస్కరణములతోఁ బాటు గ్రామపంచాయితీలు పూర్వము దేశమందున్న రీతిని పునరుద్ధారణమయి, గ్రామపరిపాలనము సాధ్యమయినంతవఱకు గ్రామమును దాఁటకయే జరపఁబడవలెను.

## II చిట్టా సుందరరామయ్య గారు, బి. ఏ., బి. ఎల్.

స్వరాజ్యప్రశంస అంతకంతకు యథార్థమగుచున్నది. ఇపుడు లోకమును తల్లడిల్లఁజేయుచున్న యుద్ధము మన యుద్ధము కూడ ననియు, ఇంగ్లీషు సామ్రాజ్యము క్రింద భారతీయులు శాశ్వతముగా నుండి నిరంతరపురోవృద్ధి పొందఁగలరనియు, యుద్ధానంతరము సామ్రాజ్యమందు భరతవర్షమునకుఁ దగు స్థానమొసంగఁబడవలెననియు, భావములు జనసామాన్యము నావేశించుచున్నవి. అట్టియెడ స్వరాజ్యమేయే రాజ్యాంగశాఖలందుఁ గలుగఁజేయఁబడవలెనో, స్వరాజ్యము జయప్రదముగా నెఱవేఱుటకు దేశపట మెట్లు మాఱవలెనో, ఏయే పద్ధతుల నవలంబించినఁ గాని స్వరాజ్యము వెంటనే నిజముగా చేకూరదో విచారింపవలసియున్నది. ఇట్లు విచారించుటలో ఇపుడున్న పద్ధతులే కొంతకాల మవలంబింపఁబడినచో, ఓిమ్మట నిపుడు లేని క్రొత్త స్థితిగతులేవియో కలుగు నని యూహించుట వెఱ్ఱి. ఇప్పటి యొక రాష్ట్రమును రెండుగా చీల్చినను, ఉద్యోగములలో నొకదానికి బదులు రెండు లభించినను, ఎన్నికలందింకను కొందఱెన్నుకొను నధికారము కలిగినను రాజ్యాంగము మాఱదు. మార్గము సరికానపుడు దూరము పోయిన కొలఁది గమ్యస్థానము సమీపమునకు రాదు. మఱియు నిపుడున్న రాజ్యాంగము చిరకాలమునుండి దేశములో లేదనియు, సాంఘికప్రతిష్ఠాపనలవలె ప్రకృతిధర్మములవలన మూర్తీభవింపలేదనియు, ఆ యా సమయములలో మన పాలకులు తమ యవసరములను బట్టి తాత్కాలికముగా సృష్టించి సంస్కరించినదనియు, మనవారు మఱచుచున్నారు. స్వరాజ్యమును సత్పాలనకొక మార్గమే గాన, రాజ్యాంగయంత్రము తన పనిని నెఱవేర్చుటకు పూర్ణప్రయోజనకారి యగునట్లు వెంటనే మాఱినఁ గాని, దేశముయొక్క పురోభివృద్ధికి వలయు పనులను శ్రద్ధతో ప్రారంభించుటకు వీలు లేదు.

ఇపుడున్న యునికిని భారతదేశమునకు స్వరాజ్య మొసంగఁబడిన, యథార్థముగా ప్రయోజనకారి కాఁగలదా? దేశము నంతను ఒక దేశముగాఁ గాని రాష్ట్రముగాఁ గాని పాలించుటకు వీలు లేదు. కనుక దేశమునకంతకు నొకేవిధమగు స్వరాజ్యమిచ్చుటలో అర్థము లేదు. ఇపుడున్న రాజ్యభాగములకు ప్రత్యేకముగ స్వరాజ్యము వచ్చినదనుకొందము. అది సార్థకముగా నుండునా? అన్ని రాజ్యభాగములును దాదాఁపుగా నైనను ఏ వ్యావహారికవిషయమందైనను సమానముగా నున్నవా? అన్ని రాష్ట్రములవారును జాతీయ వ్యవహారములను నడపుటయందు సమానముగా జోక్యము పుచ్చుకొనఁ గలుగుదురా? మన మద్రాసు రాజధానివంటి ఏ రాజ్యభాగమందైనను జను లందఱు కలిసి స్వరాజ్యమును నడపుకొనఁ గలుగుదురా? నడపినను, ఆయా భాగములలోని ప్రాంతములకెల్ల సమానమైన యభివృద్ధి కలుగునా? ఇవి సాధ్యమనుకొన్నను, దొరతనమువారు ఒకమాఱుగ నాలుగైదుకోట్ల జనులు గల ప్రాంతమును తమ యధికారమునుండి తొలఁగించి సామంతరాజ్యముగ నేలకొనివ్వ నియ్యకొందురా? ఇది కూడ సాధ్యమనుకొన్నను, వందలకొలఁది గల మన స్వదేశసంస్థానముల గతి యేమి? అవి కూడ మన జాతీయాదర్శమందును మన స్వరాజ్యప్రతిష్ఠాపనమందును చేరవలసినవే కదా. ఈ ప్రశ్నలన్నిటికి సదుత్తరము లుండవలయును. కావున, స్వరాజ్యపద్ధతులను మనము నిర్ణయించుటకు పూర్వము, స్వపరిపాలన కనువగు రీతిని దేశము నెట్లు విభజింపవలయు ననియు, ఏయే విషయములలో నేయే పద్ధతులమీఁద మన పరిపాలకులను స్వతంత్రపాలన మడిగిన వా రియ్యకొందురో యనియు, ఏయే సందర్భములలో నిండియాలోని అన్ని జాతులకు అన్ని ప్రాంతములకు సమానమైన యభివృద్ధి చేకూరి సామాన్యమైన స్వాతంత్ర్యము లుండునో యనియు చర్చింపవలసియున్నది.

స్వపరిపాలనము మనకు యథార్థముగా నొసంగఁబడవలెనన్న, ఎంత చిన్నవిషయము లైనను సరే, కొన్ని విషయములలో నైనను యావత్తు భారము దేశీయులకు వదలి, ఇంగ్లీషు దొరతనమువారు సాక్షీభూతముగా నుండి అందు ఏలాటి జోక్యము కలుగఁజేసికొనఁ గూడదు; ప్రజల యధికారముక్రిందఁ బ్రకృతిము వదలుటచే దేశమున కనర్థదాయక మనుకొనఁదగు మిగిలిన విషయములందు మాత్రమే వారు అధికారమును వహింపవలెను. ఏ విషయమందైనను అధికారవిభజనము కూడదు. కొన్ని పనులు ప్రజలచేఁ జేయించుచు అందలి సూత్రములు మాత్రము తమ చేతియందు బిగించుకొనెద మన్న, అందువలన జనుల కేపాటి రుచియు నుండదు. జనులకు రుచి కలిగిన కదా, అందు భక్తిశ్రద్ధలు కలిగి తమ ప్రాణధనముల దానికి సమర్పించుట. తమకు నిజమైన అధికారము లేదని యనుభవమువలనఁ దెలియుటచేతనే గదా, జనులు క్రొత్త పన్నులను విధించుకొనుట కియ్యకొనక, యూనియనులు గాని మ్యునిసిపాలిటీలు గాని మాకు వలదని వాదించుట. మఱియు మన లోకల్బోర్డులలోను మ్యునిసిపాలిటీలలోను శాసనసభలలోను ఇపుడున్నవారికంటె నిజమైన శక్తిసామర్థ్యములును ప్రజావిశ్వాసమును గలవారు చేరఁ

ప్రయత్నింపకుండుటకు, అధికారము పేరునకు మాత్రము వీరియం
దును నిశ్చయమున సర్కారు ఉద్యోగస్థులయందును నుండుటయే
కారణము. కావున మన పాలకులు ఏ విషయములందు తమ యధి
కారమును వెంటనే వదలుట శ్రేయస్కరమో విచారించి, అట్టివాని
యందు సర్వాధికారమును ప్రజానాయకులకే పూర్ణహృదయముతో
నియ్యవలెను. అపుడు కాని, ప్రజలకు సామర్థ్య మమరి, రాజనీతి
నభ్యసించు నవకాశము కలుగదు. అట్టిచిక్కులేని విషయములు ప్రజల
నిత్యకృత్యజీవనమునకు సంబంధించినవిగా నుండును. మఱియు, నవి
స్థానికసంబంధములుగా నుండును. వానిని, అనఁగా విద్యావ్యాపనము
భూవిషయికకష్టసుఖములు ఆరోగ్యాభివృద్ధి దేశైశ్వర్యపోషణము
మొదలగు విషయములను వెంటనే ప్రజలకు వదలి, తక్కిన చిక్కు
విషయములను, భారతజాతి యంతకు సంబంధించినట్టియు పరదేశ
ములకు సంబంధించినట్టియు సేనా నౌకా విషయములు వాణిజ్యపు
పన్నులు టపా తంతి వార్తల విషయములు నాణెములు సర్కారు
పత్రములు మొదలగు వానిని, మన పాలకులే కొంత కాలమువఱకుఁ
దమ సంపూర్ణాధికారము క్రింద నుంచుకొనవచ్చును.

ఇపుడు దేశము పరిపాలన యంత్రము నిండియను సివిలు
సర్వీసువారి హస్తగతమై యున్నది. అది దేశమున కంతకు ఒకటియే
కనుక, ఏకదీక్ష పూని వివిధప్రాంతముల నేకదండనక్రింద బాలించి,
కేంద్రీకృత బలమున జనుల యాశయములను జనుల కష్టసుఖములను
నిర్లక్ష్యము చేయుచున్నది. మఱియు నందులో చాల మంది విదేశీ
యులు గనుక, వారు కంపెనీ కాలమున వర్తకము చేయ నలవాటు
పడి ఆలాభమునకు బదులు అతిశయ వేతనము లొందుచున్నారు.
దూరదేశప్రవాసము క్లేశభూయిష్ఠము గనుకను, మనవారిలో కొంద
ఱందుఁ జేరుచున్నను విజాతీయులతో సమానత్వము నిలుపుకొనుటకు
వారును వారితోఁబాటు జీతముల గ్రహించుటచేతను, ఇండి
యను సివిలు సర్వీసు లోకములోని నౌకరీ లన్నిటిలో వ్యయకర
మైనది. మన దేశము లోకములోని దేశములలో కడు బీదదనియు, వివిధ
జాతులు వివిధప్రాంతములు గల విశాలభూఖండమనియు, నెల్లరకుఁ
దెలిసిన విషయమే. కనుక మనదేశముయొక్క నిత్యకృత్యపరి
పాలనమంతయు సివిలు సర్వీసువారినుండి తొలఁగింపఁబడి దేశీయుల
యధీనము చేయఁబడవలెను. మఱియు ఏ ప్రాంతమువారు వారి స్థితి
గతులకు తగిన యధికారవర్గమును నిర్మించుకొనవలెను. వారు పరిపా
లించు విషయములు స్థానికముగను చిక్కులేనివిగను నుండునుగాన పెద్ద
జీతములు గైకొను సివిలు సర్వీసు వారివంటి యతిసమర్థులతో నవ
సరము ముండదు. వారు దేశాభిమానముతోఁ బని చేయువారుగను, పెద్ద
యుద్యోగమును వారి గౌరవమును బట్టి గాని యధికమైనజీతములను
బట్టి గాక యంగీకరించువారుగను, గౌరవసూచకములగు మితవేతన
ముల గ్రహించు వారుగను నుండవలయును. పెద్ద యుద్యోగముల జీత
ములకు పైమేర యుండి, క్రింది యుద్యోగులకు వారు దుష్పథముల
ద్రొక్కకుండులాగున నొక మితమునకు తగ్గని జీతము లుండవలెను.
అఖండైశ్వర్యము ననుభవించుచున్న జపానుదేశమునం దిట్లే యున్న
దని జగద్విదితము.

మన పాలకుల చేయూఁత లేకుండ మనవారు క్రమముగ
పరిపాలింపవలె నన్న, రాజ్యభాగములు వైశాల్యములోను జనసంఖ్య
లోను చిన్నవిగ నుండవలెను గాని అవి మిగుల చిన్నవిగా నున్న,
రాజనీతి యభ్యసింప నవకాశ ముండక ప్రయోజన ముండదు. ఇపు
డున్న రాజ్యభాగములు యూరపులోని స్వతంత్ర రాష్ట్రములను
మించియున్నవి అందొక్కొక దానియందు వేఱువేఱు జాతు లుండి,
భిన్నభిన్నములగు భాషలు మాటలాడఁబడుచు, శీతోష్ణస్థితులు
భూనైజస్థితులు అతివ్యత్యాసముగా నుండుచున్నవి అట్టి సందర్భ
ముల పరిపాలనా విధానములు చాల చిక్కుగ నుండును. సామాన్య
వేతనములు పుచ్చుకొను సామాన్యోద్యోగియులు వానిని నిర్వహింపఁ
జాలరు. కేవలము దేశభాషలఁ బట్టి రాజ్యభాగము లుండవలె నన్న
కొన్ని కోటానఁగోట్ల ప్రజగల పెద్దదేశములుగా నేర్పడును. మఱికొన్ని
వాని నడుమ నెన్నరాని అల్పప్రాంతములుగా నుండును. మన
యాంధ్రదేశమందు వేఱువేఱు చరిత్రలు గల వేఱువేఱు ప్రాంతముల
వారి నొక యభిమతమువారినిగాఁ జేయుటలో నున్న కష్టములు
అందఱకు ననుభవనీయములే. అది గాక, భాష యొకటైన మాత్ర
మున, దేశస్థితిగతులు ఒకరీతిగా నుండు నని గాని, ఒక దేశ
భాగపు భాగ్యము ఒకదేశభాగపు టవసరములు నింకొకభాగపువాని
వలె నుండు నని గాని, వీనిని వానిని కూడ ఒక పరిపాలన సమర్థింపఁ
గల దని గాని చెప్పుటకు వీలు లేదు. ఇంచుమించుగ హైన సమా
నము గాని రాష్ట్రములు కలిపి, అందఱకు సమానమైన యధికా
రము అవకాశము గల జాతీయ పరిపాలనము నేర్పఱచుట దుస్సా
ధ్యమైన పని. మఱియు మన ప్రభువులు ఇంతింత జనసముదాయ
ముల కొక్క మాఱుగనే సర్వస్వాతంత్ర్యముల నొసఁగి అందువలన
గలుగఁగల కీడులకు సమాధానపడుదు రని మనము ఎంచఁగూడదు.
కనుక పరిపాలనా సౌకర్యమునకును స్వరాజ్య యాథార్థ్యమునకును
ఆయా రాజ్యభాగములు ప్రజల, జాతి విషయములోను భాషావిష
యములోను దేశముయొక్క భౌతిక స్థితిగతుల విషయములోను
సామాన్యలక్షణములను గలవిగా నుండవలయును. అపుడే రాజ్య
పరిపాలన దేశభాషలందు నడపఁబడిన, జనసామాన్యమునకు సంబం
ధించినదిగా నుండును.

ఒక్కొక రాజ్యభాగము మన రాజధానిలో శాసన నిర్మాణ
సభ్యుల నెన్నుకొను జిల్లాల సముదాయ మంత గాని ఇతర రాజ
ధానులలో కమిషనరు డివిజను లంత గాని యుండఁ గలదు.
ఒక్కొక దానిలో సుమారు 40, 50, 60, లక్షల ప్రజ లుందురు;
పాలనకు వ్యయముపడు సొమ్ము సుమారు 2 కోట్ల రూపాయ లుం
డును. అపుడు 7, 8 బంగాళా రాష్ట్రములును 15,16 హిందీరాష్ట్ర
ములును, 3, 4 ఆంధ్రరాష్ట్రములును, 4, 5 అఱవ రాష్ట్రములును,
1 కన్నడరాష్ట్రమును, 1 ఓఢ్రరాష్ట్రమును, 1 మళయాళరాష్ట్రమును
నుండును. తెలుఁగు దేశమున, గంజాము విశాఖపట్టణము జిల్లా లొక
రాష్ట్రముగను, గోదావరి కృష్ణా గుంటూరు మండలము లొక రాష్ట్ర

ముగను, నెల్లూరు చిత్తూరు కడప లొక రాష్ట్రముగను, కర్నూలు బళ్లారి యనంతపురము లొక రాష్ట్రముగను నుండఁ గలిగినపుడు అభివృద్ధి యెంత నిరాఘాటముగా సాఁగునో, పరిపాలన యెంత సుకరముగా నుండునో మనమూహించుకొన వచ్చును. ఒకరాష్ట్రము కేవలము నీటిపారుదలను గుఱించి యతికృషిచేసి పల్లపు పంటలవలని ఆదాయమును గడించి పరిపూర్ణత గాంచవచ్చును. ఇంకొకటి మెట్ట పైరుల గొప్పను గ్రహించి నీటి పాఱుదల విషయములలోఁ గాని ఇంజనీయర్ల విషయములోఁ గాని అనవసర వ్యయము చేయక కృతకృత్యత గాంచవచ్చును. మఱియొకటి పరిశ్రమల కాటపట్టయి అంగునకు వలయు వ్యయము చేసి అఖండ లక్ష్మితో తుల తూఁగ వచ్చును. మఱియు విద్యావ్యాపన లేని రాష్ట్రములోఁ ప్రారంభ విద్య నెలకొల్పఁబడ వచ్చును. విద్యావ్యాపన యున్న చోట ఉన్నత విద్యాలయములు నెలకొల్పఁబడి పరిశోధనలు జరపఁబడ వచ్చును. ఒక రాష్ట్రము సంఘాభివృద్ధికి వలయు శాసనములు చేసికొన వచ్చును. ఇంకొక రాష్ట్రమువారు వాని మాట దలఁపక తమ గమ్యస్థానమునకు వేఱొక దారి తీయవచ్చును. ఎవరికిఁ దగిన యభివృద్ధి వారికిఁ బ్రాప్తించును. ఒకరికొఱ కొకరు నిరీక్షించి యుండ నక్కఱ లేదు. అందఱు ఏకత్వముకొఱకు వేచియుండక వెంటనే యభివృద్ధిమార్గమును ఒట్ట వచ్చును. ప్రజలకును తాము చిన్ననాఁటినుండి ఎఱిఁగిన దేశభాగము నెడల దేశాభిమానము అప్రయత్నముగా జనించి, వారిని సాహసకార్యములకును ప్రాణధనములను దేశక్షేమమున కర్పించుటకును పురికొల్పును

దేశములోని సామాన్య పరిపాలన మంతయు దేశీయుల యధీనము చేయఁబడినపుడు స్వదేశ సంస్థానములకును బ్రిటీషు ప్రాంతములకును భేదము పాటింప నక్కఱ యుండదు. దేశ స్థితిగతులకును దేశపు ప్రజలకును నుండు సామాన్యత స్ఫుటము చేయుటకొఱకు, స్వదేశ సంస్థానములలోని వైశాల్యములను ప్రక్క నున్న బ్రిటీషు దేశములోని వైశాల్యములను కలిపి సవరింపవచ్చును. మళయాళ దేశ మంతయు తిరువాన్కూరుతో కలుపవచ్చును; కన్నడ దేశ మంతయు మైసూరుతోఁ గలుపవచ్చును, అందలి తెలుఁగు దేశమును ప్రక్క నున్న బ్రిటీషు రాష్ట్రముతో కలుపవచ్చును. అట్లే హైదరాబాదువంటి పెద్ద సంస్థానము నైజాము వంశముక్రిందనే యొక మహారాష్ట్ర సంస్థానముగను ఒక తెలుఁగు సంస్థానముగను చేయఁబడవచ్చును. చిన్నచిన్న స్వదేశ సంస్థానములు పెక్కు లున్న చోట్ల వానిని వాని నడుమ నున్న బ్రిటీషు దేశమును కలిపి ఒక పెద్ద రాష్ట్రముగఁ జేయవచ్చును. అపుడు పూర్వపు చిన్న సంస్థానముల యధిపతులు తమ యధికారములను వదలుకొని గౌరవనీయు లగు జమీందారులు కావచ్చును. ఏలయన, మన సామాన్యపు జమీందారీలకన్న తక్కువ ఆదా వచ్చు స్వదేశ సంస్థానములు ఇండియాలో వందలకొలఁది గలవు. తత్సంస్థానేశులు తమ చిన్న దేశములు స్వరాజ్యము గల రాష్ట్ర సముదాయములోఁ జేరఁగలందులకు దేశాభిమానముచే చలింపఁబడి జపానులోని దేశీయ ప్రభువులవలె వదలుకొనుటకు వెనుదీయరు.

బ్రిటీషు దేశములో కూడ దొరతనమువారు క్రొత్తక్రొత్త స్వదేశ సంస్థానములను నిర్మించి రాజ్యభ్రష్టు లయినవారిలో కొందఱిని గాని ఆయా ప్రాంతములోని ప్రఖ్యాతవంశజు లగు ఆనెగొంది రాజుగారి వంటి జమీందారులను గాని సంస్థానాధీశ్వరులుగా నియమింప వచ్చును. ఇట్లు క్రమక్రమముగా భారతదేశ మంతయు స్వదేశ సంస్థాన పుంజముగా చేయఁబడవలెను. ఇండియాలో ప్రత్యక్ష పరిపాలనా భారమును ఇంగ్లీషువారు తప్పించుకొనుట కిదియే మార్గమని పయొనీరు పత్రిక 40 సంవత్సరములనాఁడును, ఇటీవల రాజప్రతినిధిగారి సభలో నున్న స్మిరేటను గారును, చక్రవర్తి గారితో ప్రయివేటు సెక్రటరీగా వచ్చిన సర్ వాల్టరు లారెన్సు గారును వ్రాసియున్నారు. దొరతనమువారును మైసూరు విషయములోను వారణాసి విషయములోను ఈ మార్గమునే అవలంబించి యున్నారు. కనుక దీనిని సాహసోక్తిగా నెంచఁగూడదు.

ఈ పద్ధతిని దేశ పటము మార్చిన, ఇండియా దేశములో చక్కఁగా పరిపాలింపఁబడునట్టియు మిత మైన వైశాల్యము జనసంఖ్య గలట్టియు స్వదేశస్థుల బుద్ధికుశలతవల్ల సమర్థింపఁబడునట్టియు 50, 60 రాష్ట్రములు గాని సంస్థానములు గాని బయలుదేఱును. అపుడు ప్రతిరాష్ట్రమును తనకు వలయు స్థానిక స్వపరిపాలనా విధానమును అధికారవర్గ నిర్మాణమును విద్యావిధానమును నిర్మించుకొనవచ్చును పరిపాలన మంతయు ప్రజానాయకులవల్లనే జరపఁబడును. రాష్ట్రాధిపతి స్వదేశప్రభు వైనను బ్రిటీషుద్యోగి యైనను భేద ముండదు. సంస్థాన మైన, బ్రిటీషుద్యోగి సంస్థానాధిపతికి సలహాదారుగ నుండి సామ్రాజ్యమువారి ప్రతినిధిగ నుండును; రాష్ట్ర మైనఁ బ్రజానాయకు లగు మంత్రుల సలహాతోఁ బని చేయు అలంకారాధికారిగ నుండును. ఏ పదవియం దున్నను సామ్రాజ్య ప్రతినిధికి మన గవర్నరులవలె విశేష వేతనము అవసర ముండదు. ఇపుడు చీఫు కమిషనరు పదవి కుండు జీత మున్న చాలును. అట్టివా రందఱు సామ్రాజ్యపు దొరతనమువారిక్రింద ఒక సివిలు సర్వీసుగ నుందురు. మిగిలిన యుద్యోగు లందఱు ఏ రాష్ట్రమునకుఁ దగునటులు దానికి ప్రత్యేక ప్రత్యేకముగ నుందురు. ఏ రాష్ట్రములోఁ గాని ఏ సంస్థానములోఁ గాని ప్రజలకే అన్ని స్వాతంత్ర్యములు నుండి వారి ప్రతినిధిసభల నాయకులు గౌరవసూచకములు మాత్రమే యగు వేతనములఁ గొనుచు మంత్రిపదవులం దుండి పరిపాలనము చేయుదురు. ఇట్టి పద్ధతులు నెలకొల్పు షరతుల మీఁదనే క్రొత్త సంస్థానములు ఏర్పఱుపఁబడవలెను. ఇదివఱలో నున్న సంస్థానాధీశులును ఇపుడు ఇంగ్లీషు దొరతనమువారికి మార్గప్రదర్శకులుగ నున్నారు గాన, వారి స్వబుద్ధిని గాని సామ్రాజ్యపు దొరతనమువారి సలహామీఁదఁ గాని వారి ప్రజల దృఢమైన కోరికల యొత్తిడి మీఁదఁ గాని యిట్టి పద్ధతులనే నెలకొల్పుదురు. ఏది ఎట్లున్నను ఏ మార్పువలనను ప్రజల కిప్పు డున్న హక్కు స్వాతంత్ర్యములకు భంగము కలుగఁబోదు.

ఇండియా దొరతనమువారు, ఇదివఱలో నిరూపింపఁబడిన

ప్రకారము, చిక్కు గలిగినట్టివియు యావద్దేశ సంబంధములును పరదేశముల స్పర్శ గలుగఁజేయునట్టివియు నయిన ముఖ్యాంశములను స్వయముగాఁ బరిపాలించుటయే కాక, దేశమునందు ఏర్పడు 50, 60 రాష్ట్రముల గాని సంస్థానముల గాని పాలనను దూరమునుండి విచారించి వీక్షించు చుందురు. మఱియు వారు పరిపాలన చిక్కుగ నుండఁదగిన ప్రాంతములను, అనఁగా నిప్పటి రాజధానీ నగరములను సీమా నాకా స్థలములను పెద్ద సముద్రపు రేవులను రైలు కూడలి స్థానములను ఈ యిండియాలో నీశాన్యమునను ఆగ్నేయమున నుండు ప్రాంతరాష్ట్రములను ప్రత్యక్షముగఁ బరిపాలింతురు. రాజప్రతినిధి గారు చక్రవర్తి గారి వంశీయులే యయినయెడల దేశజనుల భక్తివిశ్వాసములు మఱింత ప్రజ్వరిల్లును. ఇండియాలో నుండు పెక్కు రాష్ట్రముల యొక్కయు సంస్థానముల యొక్కయు పైతనిఖీ ఒక రాజప్రతినిధి గారికి దుర్భర మగు పని యనుకొనిన, కొంత కాలమునకును ముగ్గురు నలుగురు గొప్ప వేతనములు గొను గొప్పగవర్నరులు సామ్రాజ్యపుదొరతనమువారిక్రింద నుండు 3,4 రాజధానీనగరములనుండి, యొక రొకరు 10,15 రాజ్యభాగముల యజమాయిషీ గనుఁగొనుచు, వాని దొరతనములవారికి తగు సలహాలను నుత్తరువులను నిచ్చుచు నుండవచ్చును. ఇండియా దొరతనమువారికి సహాయముగా దేశమందుండు సకల రాష్ట్రములయు సంస్థానములయు ప్రతినిధుల నెన్నుకొనుసభయొకటి ఉండవలెను అందు శ్రద్ధతోను నిలుకడతోను పని చేయుటవలన దేశజనులందఱకు నేకజాతియతి యనుభవములోనికి వచ్చి జాతీయ స్వరాజ్యము నభ్యసింపఁజేయుటకు దొరతనమువారికి అవకాశము కలుగును.

ఇట్టి యుద్దేశములను కలిగియే మార్లే ప్రభువు రాష్ట్రీయ ప్రతినిధిసభలకు నుద్యోగులనుండి స్వాతంత్ర్య ముండవలె ననియు, దేశీయ ప్రతినిధి సభయందు దొరతనమువారి యుద్యోగుల యధికారము సాఁగవలె ననియు శాసించెను. మఱియు హార్డింజిప్రభువు దేశీయ స్వరాజ్యవాదులకును ప్రజల కట్టి యధికారము కూడదను నధికారవర్గమువారికిని అనువగు మాధ్యమిక పద్ధతి నేర్పఱచినఁ గాని దేశాభివృద్ధికిఁ దగు మార్గ ముండ దని యెంచియే ఢిల్లీకి రాజధాని మాఱుతతో రాష్ట్రీయ స్వాతంత్ర్యము అవశ్యాచరణీయ మని చాటించెను. వెంటనే పైని విశదీకరించిన పద్ధతికంటెదాని దేనినైన నవలంబించినఁ గాని ప్రజలకుఁ బాలకులయందు శాశ్వత మగు దృఢవిశ్వాసమును, పాలకులకుఁ బ్రజలు దమ్ము నెన్నఁటికైనఁ బాఱఁదోలు కుతంత్రులు కారను గట్టి నమ్మకమును కలుగదు. మనకును మన పాలకులకును శాశ్వతమును యథార్థము నగు నన్యోన్యవిశ్వాసము గుదిరినఁ గాని, యుభయులవలనను దేశమునకు నిజమైన సేవ జరగదు. భారతీయులు ఆంగ్లేయుల శాశ్వతయాజమాన్యము నంగీకరించినట్లు నిష్కపటముగ నిరూపింపవలెను. ఆంగ్లేయులు భారతీయుల యథార్థవిజృంభణమును వామోదించునట్లు నిస్సంశయముగ వెల్లడి చేయవలెను. ఇట్టి యన్యోన్యవిశ్వాసముల కాటపట్టు కాఁగల రాజ్యాంగమును యుద్ధానంతరము నిర్మించుటకుఁ బ్రజలు న్యాయముగాఁ జేయుటకు వీలున్నంత సాహససామగ్ర్యసూచకము లగు దృఢప్రయత్నములు చేయవలెను. అట్టిది లభ్యమైనపుడే భారతీయులకును ఆంగ్లేయులకును నిజమైన శాశ్వతసంధి కుదురును.

## III ఏ. ఎల్. నారాయణరావు గారు, బి. ఏ.

హిందూదేశమందలి బ్రిటీషు పరిపాలనకు ఆదర్శము ఏది యను సంశయమునకు రెండు విధముల యభిప్రాయములు చెప్పఁబడి యున్నవి. కొంత కాలమునకు బ్రిటీషువారికిని హిందూదేశమునకును సంబంధము వీడి, మనవారలే రాజ్యతంత్రము నిర్వర్తించుటయే యాదర్శ మని యొక యభిప్రాయము. దైవసంకల్పము వలన మన దేశము బ్రిటీషువారిక్రిందికి వచ్చిన దనియు, హిందూదేశమునకును బ్రిటీషువారికిని సంబంధ మెప్పటికి నుండవలసినదే యనియు, వీడినయెడల మన దేశమునకు నష్టము గలుగు ననియు, ప్రత్యేకముగ మనకుఁ గలిగెడి యభివృద్ధి వీరల సాహాయ్యమువలన సులభముగను వేగముగను చేకూరు ననియు మఱి యొక యభిప్రాయము. ఇందు మొదటి యాదర్శమును గౌరవించువారు బహుస్వల్పముగ నున్నారు. రెండవ యభిప్రాయమే సర్వజనాభిప్రాయ మని చెప్పవచ్చును. తొలి యభిప్రాయము సులభసాధ్యము గా దనియు, దూరాలోచనకు వ్యతిరేక మనియు నిశ్చయింపఁ దగినది. కావున, రెండవ యభిప్రాయమే యెల్లెడల వ్యాపించి కార్యాలోచనలను పురికొల్పు చున్నది.

అఖిల హిందూదేశీయ మహాసభ మొదటినుండియు హిందూదేశపు స్వపరిపాలనమును గుఱించి చర్చించుచు తీర్మానములు చేయుచువచ్చినది. హిందూదేశీయ స్వపరిపాలన మన నేమియో, అందునకు కార్యక్రమ మేదియో, అది యేవిధముగ సాధ్య మగునో యను సంశయములు సభవారికిఁ గూడ క్రమక్రమముగాఁ దెలియుచున్నవి. 1907-వ సం. న సూరతులో జరగిన యాందోళనము పయిని హిందూదేశ పరిపాలనమునకే గాక హిందూదేశీయ మహాసభకుఁ గూడ నాదర్శమును నిశ్చయపఱిచి, అట్టి యాదర్శము ననుసరించియే పని చేయుట యుక్త మని యోచింపఁబడెను. అందు వలననే సభానంతరము అలహాబాదులో కన్వెన్షన్ సభ యను సంఘము కూడి దేశీయ మహాసభకు బ్రిటీషు సామ్రాజ్యాధికారమునకు లోఁబడిన స్వపరిపాలన మాదర్శముగ నుండఁదగిన దనియు, హిందూదేశీయ మహాసభా సభ్యత కట్టి యాదర్శమందుఁ గల నమ్మకము ముఖ్యమును యోగ్యము ననియు తీర్మానింపఁబడినది. హిందూదేశీయ సభకు కార్యక్రమము నిర్ణయించు విధులును క్రొత్తగ నేర్పఱుపఁబడినవి. అది మొదలు ఈ సభ అలహాబాదు కన్వెన్షను లో చేయఁబడిన విధులను తీర్మానములను అనుసరించియే జరపఁబడుచున్నది. తత్సభ్యులే గాక ప్రతినిధులు సైత మీ యాదర్శముతో

యంగీకరించినట్లు సంతకములు చేయవలసి యున్నారు. అగ్రాస
నాధిపతులు కూడ నీ యాదర్శము విషయమై చర్చించి యంగీకరించి
యుపన్యాసముల నిచ్చుచున్నారు. హిందూదేశస్థులలో నాయకులీ
యాదర్శము ముఖ్య మనియు సుఖదాయక మనియు నవసరము తట
స్థించినప్పుడెల్ల నొక్కి వక్కాణించుచున్నారు. ఈ యాదర్శము
ననుసరించియే హిందూదేశ పరిపాలనమునందు క్రమముగ మార్పులు
గలుగు నని హిందూ మహామ్మదీయ నాయకుల యభిప్రాయము.
1915-వ సం. డిసెంబరు నెలలో బొంబయి నగరమున సమావేశ
మయిన హిందూదేశీయ అఖిలమహామ్మదీయ మహాసభలలో నగ్రాస
నాధిపతు లయిన సర్ స. ప్ర. సింహా గారును మజరుల్ హక్
గారును ఈ యాదర్శమునే దృఢపఱచి గంభీరోపన్యాసముల నొసంగి
యున్నారు. ఇది గాక, ఈ యైరోపా మహాసంగ్రామమునందు
బ్రిటీషువారికిని వారి మిత్రమండలికిని తప్పక జయము నిశ్చయము
గనుకను, ఇతరులతోఁబాటు హిందూదేశస్థులును బ్రిటీషువారి కనేక
విధముల తోడ్పడి యుద్ధభూమికిఁ బోయి ప్రాణాపాయమును
సరకుగొనక భయంకరముగ పోరాడి తమ రాజభక్తి గనఁబఱచుచు
న్నారు గనుకను, యుద్ధానంతరము ప్రపంచమందంతట జరగఁబోవు
మార్పులు జరగక తప్పదు గనుకను, హిందూదేశ పరిపాలనాదర్శ
మునఁ గూడ మార్పులు గలుగక తీర దని, మనవారలే గాక, ఇంగ్లండు
దేశ నాయకులు గూడఁ జెప్పి యున్నారు ఈ నమ్మకము గల్గినందు
వలన నీ గతసభకు ముందు అనిబెసాంటు దొరసాని గారు మిక్కిలి
ప్రయాసపడి హిందూదేశ స్వపరిపాలనా సంఘ మను పేర నొక
సంఘము నేర్పాటుచేయఁ గోరి, అన్ని రాష్ట్రముల యందలి నాయ
కులను ప్రోత్సాహపఱచి సంఘ సభ్యులనుగాఁ జేర్చి, తత్పరిపాలనా
విధుల నేర్పఱచి, యావద్వృత్తాంతమును యుద్ధ మంతమగు లోపున
తయారుచేయ నిశ్చయించి, మహాసభవారి యంగీకారమును గోరిరి
సభవారలు నందుల కంగీకరించి, దేశీయ సంఘమువారును మహామ్మ
దీయ సంఘ ముఖ్యులును ఈ స్వదేశపరిపాలనను గుఱించి యాలో
చించి, ప్రజలకు బోధించి, ఈ 1916-వ సం. సెప్టెంబరు నెల 1-వ
తేదీనాఁటికి పని కొనసాఁగు విధములను చర్చించు కార్యనివేదికను
పంపవలె నని తీర్మానించిరి. అఖిల భారత మహామ్మదీయ సభ
యందుఁ గూడ నిటులే తీర్మానింపఁబడినది. కనుక దేశమందంతట
నుండు నాయకులు ప్రత్యేకముగాఁ గాని సంఘములుగాఁ గాని
తమ యభిప్రాయములను శీఘ్రముగ తెలియఁజేయుట యత్యావశ్యమై
యున్నది. సామాన్యజనము చదివి గ్రహించునట్లు మాతృభాషలో
తెలియఁజేయుట యత్యంత మావశ్యకము క్లిష్టమైన యంశము గాన
మన భాషలో వ్రాయుటయందుఁ గలుగు పొరపాటులు క్షమింపఁ
దగినవి.

హిందూదేశ స్వపరిపాలన మన నేమియో క్రొత్త సంగతి
యనియు, అందువలన నసాధారణములును దురపేక్షితములును నగు
మార్పు లగు ననియుఁ దలంపరాదు. అందువలన పరిపాలనా విప్ల
వము గల్గు ననుట గొప్ప తప్పు. స్వపరిపాలనము క్రొత్త సంగతి
కాదు గ్రామ స్వతంత్ర పాలనము పెక్కు వందల వత్సరములక్రిం
దటనే యేర్పఱుపఁబడి జయప్రదముగ జరగుచు వచ్చినది. గ్రామ
స్వపరిపాలనా సంఘము లుండుటయు అవి యామోదకరముగ పని
యొనర్చుచుండుటయు ఆంగ్లేయులు వ్రాసిన చరిత్రములందును గాన
వచ్చుచున్నది. సర్ హెన్రీ మెయిన్ గారును సర్ మెట్కాఫ్
గారును అవి పిల్ల రాజ్యము లని చెప్పియున్నారు. కనుక నిట్టి స్వపరి
పాలన మెప్పుడును మన మెఱుఁగనిది కాదు అందువలన దేశము
లో నెవ్వ రెఱుఁగని పాలనాంశము లుండవు. చెడుగు రానేరదు.
ఇందుల కొక క్రొత్త నిర్మాణమును నిర్మించుట యనవసరము. ప్రజా
నాయకు లూహించినదియు గోరుచున్నదియు కలోనియలు మాదిరి
స్వపరిపాలనమే బ్రిటీషు సామ్రాజ్యములో పెక్కు రకముల కాల
నీలు గలవు అవి యన్నియు స్వపరిపాలనా లాభముల ననుభవించు
చున్నవి కాని, యా పాలనములలో స్వల్పభేదములు గాన్పించును.
హిందూదేశమున కే కాలనీలోని పరిపాలనమువంటి పాలనము గా
వలెనో నిశ్చయింపవలసి యున్నది. కాలనీలు చతుర్విధములుగ
నున్నవి: (1) రక్షణములో నున్నవి, అనఁగా నింటి వ్యవహారము
లా దేశపు ప్రభుత్వము చేయువారివల్లను అన్యదేశ సంబంధ
వ్యవహారము లింగ్లాండు రాజు గారివల్లను జరపఁబడు చుండును.
(2) అధికారమును పొందిన కంపెనీల ప్రభుత్వము, అనఁగా
వీనియందు పరిపాలనాధికారము కంపెనీల కీయఁబడి, ఆ కంపెనీ
లను ప్రతినిధుల క్రింద నుందురు (3) రాజుగారి సొంత రాజ్యములు.
ఇవి రాజుగారి మంత్రుల క్రిందను ఉద్యోగస్థుల క్రిందను నుండును
(4) స్వపరిపాలనము చేసికొను కాలనీలు, అనఁగా సామ్రాజ్యసభ
వారివలన నీయఁబడిన పాలనాధికారము దేశస్థులే యనుభవించు
చుందురు.

స్వపరిపాలనము చేయు కాలనీలలో ఆంగ్లేయదేశపు ప్రధాన
మంత్రి సలహాపయిని చక్రవర్తిగారివలన నియమింపఁబడిన ప్రతినిధి
యొకఁ డుండును వానికి పరిపాలనమునందు సాహాయ్య మొనర్చుటకు
దేశస్థులలో తగినవారిని మంత్రివర్గముగ నియమింతురు. ఇది బ్రిటీషు
మంత్రివర్గమును బోలి యుండును. మంత్రివర్గము ప్రజాప్రతినిధులకు
పూచీదారులై యుందురు. కాలనీ యొక్కడు విస్తీర్ణము గలిగినపుడు
అది కొన్ని రాష్ట్రములుగా విభజింపఁబడి, ప్రతిరాష్ట్రమునకు నొక
ప్రత్యేకపాలకుఁడును శాసననిర్మాణమునకు ప్రజాప్రతినిధుల సభయు
నుండును ఇందు ముఖ్యాంశ మేది యన, చక్రవర్తి గారివలన నియ
మింపఁబడిన ప్రతినిధి తప్ప నింకే యుద్యోగియు నింగ్లాండున నియ
మింపఁబడఁడు. ప్రతినిధియొక్క వేతనము తప్ప నింకెవ్వరి వేతన
మును ఆ దేశపు మంత్రివర్గముయొక్కయు ఉన్నత కార్యనిర్వాహక
సభా సభ్యులయొక్కయు అనుమతి లేక నియమింపఁబడదు. ఈ కాల
నీల యాదాయవ్యయములలో దేశీయ మంత్రివర్గమునకును ఉన్నత
ప్రతినిధుల సభలకును మాత్రమే సర్వాధికారము గలదు ఇప్పుడు
జరగుచున్న యుద్ధమువలె నితర రాజ్యములతో బ్రిటీషువారికి
యుద్ధము సంప్రాప్తమగునపుడు తగిన సాయము చేయు విధి తప్ప,

కాలనీల పరిపాలనా విషయములలో కాలనీయులకును బ్రిటీషుప్రభుత్వమువారికిని ఏవిధమైన సంబంధమును సూచియూను లేదు. అట్టి స్వపరిపాలనము ననుభవించుచు హిందూదేశ మంతటి విస్తీర్ణము గల్గు దేశములు కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాయు. వాని పరిపాలనా విషయములను జూచి పరిశీలించినమీఁద, ఏ దేశపు పరిపాలనమువలె హిందూదేశ పరిపాలనమును మార్చుట యుక్తమో యోచింపవలెను.

## కెనడా

ఈ మూఁడిటిలో పురాతన మయినదియు బ్రిటీషు కలోనియలు పరిపాలనమునకు మాదిరి యైనదియు కెనడా రాజ్యపరిపాలనము. దీని నేర్పఱచుటకు బ్రిటీషురాజ్య పరిపాలన మాదర్శముగా గ్రహింపఁబడియె. కెనడాలో రాజ్యాధికారి గవర్నరు జనరల్ అని పిలువఁబడి చక్రవర్తి గారివలన నియమింపఁబడును. ఆ గవర్నరు జనరల్ గారు కార్యనిర్వర్తనముకొఱకు ప్రీవీ కౌన్సిల్ అను సంఘమును నియమింతురు. ఆ సంఘములో నొకభాగము కార్యనిర్వాహకమునకు నియమింపఁబడి కాబినెట్ మంత్రివర్గము అని పిలువఁబడును. ఇప్పుడా మంత్రివర్గమున 15 గురు కలరు.

కెనడా పార్లమెంటువారివలన నంగీకరింపఁబడిన ప్రతి బిల్లును గవర్నరు జనరల్ గారి యంగీకారమునకు లోఁబడి యున్నది. శాసన నిర్మాణమునకు, సెనేటు సభ సాధారణసభ యను రెండు సభలున్నవి. సెనేటు సభకు గవర్నర్ జనరల్ గారివలన నియమింపఁబడిన వారు 87 గురు సభ్యులు గలరు. రాష్ట్రముల తారతమ్యములను బట్టి యెన్నుకొనఁబడిన వారి సంఖ్య నిర్ధారణ చేయఁబడును. సెనేటు సభ్యులు 30 సం. ల వయసు గలిగి 4000 డాలర్ల రాఁబడి గలిగి యుండవలెను. వారిలో నొక్కొక్కరికి సం. నకు 2500 డాలర్ల వేతన మీయఁబడును. సాధారణ సభలో 221 మంది సభ్యు లుందురు. వీ రందఱును 5 సం. ల కొక్కొక్క మాఱు ప్రజలచే నెన్నుకొనఁబడుదురు. ధనసంబంధ మగు బిల్లులు గవర్నరు జనరలు గారి సిఫారసు పొందినమీఁద నీ సభలో చర్చింపఁబడును. దేశ వైశాల్యమును బట్టి కెనడా పెక్కు రాష్ట్రములుగా విభజింపఁబడినది. మంత్రివర్గము సలహాపయిని ప్రతిరాష్ట్రమునకును 5 సం. ల కొకమాఱు లెఫ్టినెంటు గవర్నరును నియమింతురు. కాని, ప్రతి రాష్ట్రమును ప్రత్యేకపు హక్కులు గల స్వపరిపాలనమును చేసికొను రాష్ట్రమై యున్నది. ప్రతి దానికొక కార్య నిర్వాహక సభయు నొక శాసననిర్మాణసభయుఁ గలవు. రాష్ట్ర వైశాల్యమును బట్టి కార్యనిర్వాహకసభయందు నల్వురు మొదలు పదునాఱుగురు సభ్యు లుందురు. ఈ సభలో నొక్కొక్క రొక్కొక్క యుద్యోగశాఖ కధికారిగా నుండి, శాసననిర్మాణసభయొక్క నమ్మకము కల్గియుందురు. రాష్ట్రీయ శాసననిర్మాణ సభలో నిర్మాణము కాఁదగిన శాసనములును, కెనడా దేశపు శాసన నిర్మాణసభలో నిర్మాణము కాఁదగిన శాసనములును, వాని యన్యోన్య సంబంధములును కెనడా పరిపాలనా శాసనములో వివరముగా పేర్కొనఁబడినవి. రాష్ట్రీయ శాసన సభలో నంగీకరింపఁబడిన బిల్లులు లెఫ్టినెంటు గవర్నరు గారివలన నంగీకరింపఁబడవలయును. అట్టి బిల్లులను గవర్నరు జనరలు గా రొక సంవత్సరములో నిష్టము లేదని త్రోసివేయ వచ్చును.

## ఆస్ట్రేలియా

ఆస్ట్రేలియా దేశ పరిపాలనా శాసనము పదునైదు సం. ల క్రిందట మాత్రమే నిర్మింపఁబడెను. ఆ దేశపు ప్రజలు తమకుఁ గావలసిన రీతిని స్వపరిపాలనా మార్గముల ననుసరించి తమలోఁ దాము చర్చించి చర్చించి తుద కంద ఱంగీకరించి బ్రిటీషు ప్రభుత్వమువారికి పంపఁగా, వా రా ప్రకారము దాని నంగీకరించిరి. 1901-వ సం. జనవరి నెలనుండి యా చట్ట మమలులో నున్నది. కెనడాయందువలెనే యిచ్చటఁ గూడ రాష్ట్రీయస్వపరిపాలనమును వివిధరాష్ట్రములకుఁ గొన్ని యంశములం దిచ్చి, మఱికొన్నిటిలో మాత్ర మన్నియు నొక పెద్ద కాలనీక్రింద నేకత్వము గలుగఁజేయఁబడినవి. కాని, కొన్ని ముఖ్యాంశములందు మాత్రము భేదములు గలవు. కెనడా పార్లమెంటు సభకు పూర్ణమైన శాసననిర్మాణాధికార మియ్యఁబడి రాష్ట్రీయులకు కొన్ని యంశములందు మాత్రమే శాసన నిర్మాణాధికార మీయఁబడినది. రాష్ట్రముల సభలచే నిర్మాణము చేయఁబడిన చట్టములను గవర్నరు జనరలు గా రంగీకరింపవలయును. ఆస్ట్రేలియాలో పార్లమెంటు సభ కొన్ని యంశములందు మాత్రమే శాసననిర్మాణాధికారము గల్గి, కొన్ని శాఖల రాజ్యవ్యవహారములే చూచుచున్నది. కాని, చాల భాగము శాసననిర్మాణమును రాజ్య వ్యవహార నిర్వర్తనమును పార్లమెంటు సభవారి సంబంధము లేకయే ఆస్ట్రేలియాలోని రాష్ట్రములు చూచుకొనుచున్నవి. కెనడాలో రాష్ట్రీయ పాలకులను గవర్నరు జనరలువలె బ్రిటీషు చక్రవర్తిగారే నియమింతురు. కెనడాలోని రాష్ట్రీయపాలకులకు లెఫ్టినెంటు గవర్నరు లనియు, ఆస్ట్రేలియాలోని రాష్ట్ర పాలకులకు గవర్నరు లనియు పేరు. ఆస్ట్రేలియా గవర్నర్లకు సామ్రాజ్య ప్రభుత్వమువారితోనే సంబంధము గలదు. కెనడాలో రాష్ట్రసభవారు చేసిన తీర్మానమును గవర్నరు జెనరలు గా రొక సంవత్సరములో త్రిప్పివేయఁగలరు. అట్టి యధికార మాస్ట్రేలియా గవర్నరు జనరలు గారికి లేదు. కెనడాలో రాష్ట్రముల వ్యయముల కున్నతప్రభుత్వమువారే పూచీ పొందియున్నారు. అట్టి పూచీ ఆస్ట్రేలియా దేశపు ప్రభుత్వమునకు లేదు. కెనడా రాష్ట్రములకంటె ఆస్ట్రేలియా రాష్ట్రములకు పరిపాలనమునం దెక్కుడు స్వాతంత్ర్యము గలదు; దానితోఁ బాటు పూచీయుఁ గలదు. కెనాడాలోని రాష్ట్రములలోవలెఁ గాక, ఆస్ట్రేలియా రాష్ట్రములలో శాసననిర్మాణముకొఱకు పెద్ద సభ యనియు సాధారణ సభ యనియు రెండు గలవు.

ఆస్ట్రేలియాలో గవర్నరు జనరలు గారిని చక్రవర్తి గారు నియమింతు రని చెప్పఁబడి యున్నది. రాష్ట్రపాలకులను బ్రిటీషు

PRESIDENT AND MEMBERS, RECEPTION COMMITTEE
Indian National Social Conference, 1915



సంఘసంస్కారసభాధ్యక్షులు
స్వాగతసంఘసభ్యులు

LADY VOLUNTEERS, SOCIAL CONFERENCE, 1915



సంఘసంస్కారసభయందు స్వచ్ఛందసేవ చేసిన నారీమణులు, 1915

సామ్రాజ్య మంత్రివర్గమునకును జరగెడు సమాచార మంతయు గవర్నరు జనరలు గారికి తెలియఁజేయవలెను. ప్రతి శాసనమునకు నాతని యంగీకార మవసరము. సర్వదేశ సేనా నౌకా బలముల కాతఁడే యధికారి. కార్యనిర్వహణమున సాహాయ్య మొనర్చుట కొక మంత్రివర్గమును గవర్నరు జనరలు గారు రుంచుకొందురు. అట్టి మంత్రులు ఆస్ట్రేలియా పార్లమెంటులో సభ్యులుగా నుండవలెను. ఇచ్చట సెనేటు సభకు సభ్యులుగా నొక్కొక్క రాష్ట్రమునుండి ఆఱుగురు ఎన్నికోఁబడుదురు. ప్రతినిధుల సభ యని మఱియొక చిన్న సభ కలదు. ఆ సభలో 75 గురు సభ్యులు గలరు. ప్రతి రాష్ట్రముయొక్క జనసంఖ్యను బట్టి చిన్న సభకు ప్రతిరాష్ట్రము నెన్నుకొను సభ్యుల సంఖ్య నిర్ణయింపఁబడును. రెండు సభల సభ్యులలో నొక్కొక్కరికి సం. నకు 600 పౌనుల జీత మీయఁబడును. చిన్న సభలో ఏ యంశమయిన నంగీకరింపఁబడి, సెనేటులో రెండు మాఱు లంగీకరింపఁబడనియెడల, గవర్నరు జనరలు గారు రెండు సభలను నిలిపివైచి వానిని మఱల నిర్మించుట కుత్తరు వీయవచ్చును. క్రొత్త సభలు రెండు నా సంగతిలో నేకీభవింపనపుడు రెండు సభలు కలసి మొత్తముగా వోటు వేయింతురు; మొత్తము వోట్లలో అధిక సంఖ్యను బట్టి తదంశము నిర్ణయింపఁబడును. ఆస్ట్రేలియాలో నాఱు రాష్ట్రములు గలవు. రాష్ట్రమున కొక గవర్నరుండును కార్యనిర్వర్తనమునకు శాసననిర్మాణసభనుండి గవర్నరు గారు కొందఱను నియమించుకొనవలెను.

## దక్షిణాఫ్రికా

దక్షిణ ఆఫ్రికా యూనియన్ పరిపాలన మనునది యన్నిటికంటె క్రొత్తది; ఆలోచనపూర్వక ప్రజాసమ్మతి ననుసరించి యేర్పఱుపఁబడిన స్వపరిపాలనపు చట్టముపై యున్నది. 1908-వ సం. మొదలు 1909-వ సంవత్సర మంతమువఱకు నిది యాలోచింపఁబడి, 1910-వ సం. నుండి యమలులోనికి వచ్చినది. అన్యోన్య మంతః కలహములు గలిగినను, బ్రిటీషు ప్రభుత్వమున కెదురుగ పోరాడుటకు మాత్ర మైక్యమయిన నాలుగు ప్రత్యేకరాష్ట్రముల నొక సంఘముగా చేర్చిన పరిపాలనపై యున్నది. రాజ్యతంత్రములలో నిట్టి తార్కాణ మిదివఱ కెన్నఁడు నుండలే దని బాల్ఫరు మంత్రియు ఆఫ్రికావాసులును చెప్పియున్నారు. దక్షిణాఫ్రికా పరిపాలనము గూడ కెనడా ఆస్ట్రేలియా పరిపాలనములవలెనే యూహింపఁబడినది గాని వానికంటె ననేకవిషయములలో నెక్కుడు స్వాతంత్ర్యము గలిగి యున్నది. దక్షిణాఫ్రికా పరిపాలనములోని ముఖ్యాంశము లెవ్వి యన: (1) పరిపాలనాశాసనముయొక్క యాధిక్యము దానిని సులభముగా మార్పఁ గూడ దనుట (2) పరిపాలనాధికారమును వివిధరాష్ట్రముల యందు నుంచి యన్నిటిపయి యధికారమును యూనియన్ గవర్నమెంటులో నుంచుట. దేశవ్యవహారముల విషయమై యూనియన్ పార్లమెంటు సర్వాధికారము గలిగి యున్నది. దక్షిణాఫ్రికాతో సంబంధించినంతవఱకు యూనియన్ పార్లమెంటునకు సర్వాధికారము గలదు. చట్టములో కొన్ని భాగములు మాత్రము మార్చుటకు సాధారణముగా వీలు లేక పోవుటయు, శాసననిర్మాణమును చేసిన సామ్రాజ్యప్రభుత్వమువారు పార్లమెంటు చట్టమును మార్చివేయుట గాని రద్దుపఱచుట గాని చేయుటయు మాత్రమే యూనియన్ పార్లమెంటువారి యధికారమున కాటంకము లని చెప్పవచ్చును. దక్షిణాఫ్రికాలో నెమ్మది ప్రజాభివృద్ధి సత్పరిపాలనము, వీని కవసరమైన పద్ధతు లన్నియు అవలంబించుటకు యూనియన్ పార్లమెంటు వారికి పూర్తియైన యధికారము గలదు. యూనియన్ పార్లమెంటుయొక్క చట్టమునకు వ్యతిరేకము గాకుండ, ఏపద్ధతి నైనను యూనియన్ రాష్ట్రములలో నేదియైనను చేయవచ్చును. యూనియన్ పార్లమెంటువారు కొన్ని నిబంధనలకు లోఁబడి దక్షిణాఫ్రికా పరిపాలనాశాసనమును గూడ మార్చుట కధికారము గలదు. ఆ నిబంధన లేవి యన, శాసననిర్మాణమునకు సంబంధించిన కొన్ని విధులను కొంతకాలము వఱకు మార్పఁగూడ దనియు, రాష్ట్రీయ శాసననిర్మాణ సభలను మార్చునపుడు చక్రవర్తిగారి యనుమతిని పొందవలయు ననియు; ఇట్టి నిబంధనలకు లోఁబడి యూనియన్ పార్లమెంటునకు సర్వాధికారము గలదు. కార్యనిర్వాహకత్వమునకు దక్షిణాఫ్రికాలోఁ గూడ చక్రవర్తి గారివలన గవర్నరు జనరలుగారు నియమింపఁబడుదురు. ఆయనకు సలహా యిచ్చుటకు బ్రిటీషు కాబినెట్ వంటి 10 మందికి మించకుండు మంత్రివర్గము గల కార్యనిర్వాహకసభ యొకటి యున్నది. ఆ సభ్యులను గవర్నరు జనరలు గారే యూనియన్ పార్లమెంటు సభ్యులలోనుండి నియమింతురు. మంత్రివర్గము యూనియన్ పార్లమెంటునకు పూచీదార్లయి యుందురు. వారి సలహాపైని గవర్నరు జనరలు గారు నడచుకొందురు. మొదటి మంత్రివర్గములో ప్రధానమంత్రియు మిగిలిన రాజ్య వ్యవహారశాఖలలో నొక్కొక్క మంత్రియు నున్నారు. శాసననిర్మాణము నిమిత్తము యూనియన్ పార్లమెంటు, అనఁగా రాజప్రతినిధి గవర్నరు జనరలు గారును, పెద్ద సభ యనఁబడు సెనేటును, చిన్నదగు హౌస్ ఆఫ్ అసెంబ్లియును అయి యున్నవి. గవర్నరు జనరలు గారికి పార్లమెంటు సభా వ్యవహారముల నారంభించుట ఆఁపుట చాలించుట మొదలగు నధికారములు గలవు. సెనేటులో 40మంది సభ్యులు గలరు. అందులో 8 మందిని గవర్నరు జనరలు గారు నియమింతురు. మిగిలిన 32రు యూనియన్‌లో నుండు నాలుగు రాష్ట్రములనుండియు వాని శాసననిర్మాణ సభలనుండి యెన్నఁబడుదురు. సెనేటు సభ్యునకు 30 సం.ల కంటె తక్కువ వయ స్సుండ వలనుపడదు. అతఁడు యూనియనులో నధమము 5 సం.లైన నుండి ఐరోపాదేశీయుల సంతతికి చేరిన బ్రిటీషు కులస్థుఁడయి యుండవలెను. ఎన్నుకోఁబడిన సెనేటు సభ్యునకు 500 పౌనుల విలువ గల యాస్తి యూనియనులో నుండి, చిన్న సభకు వోటరుగా నుండవలెను. సెనేటు సభ కధ్యక్షుని సభ్యు లెన్నుకొందురు. చిన్నసభ యను హౌస్ ఆఫ్ అసెంబ్లీలో 130 మంది సభ్యులుందురు. వేర్వేఱు రాష్ట్రములనుండి జనసంఖ్య ననుసరించి సభ్యుల సంఖ్య నిర్ణయింపఁబడును. ఈ సభ్యుల యధ్యక్షుని గుఱించియు,

ఎన్నఁబడు మార్గమును గుఱించియు యూనియన్ పార్లమెంటువా
రప్పుడప్పుడు నిర్ణయించు చుందురు. సెనేటు సభ్యులకును
చిన్న సభ సభ్యులకును నొక్కొక్కరికి సంవత్సరమునకు 400
పౌనుల వేతన మీయఁబడును. రెండు సభలవారు నంగీక
రించిన బిల్లును చక్రవర్తి గారి తరపున గవర్నరు జనరలు గా రంగీ
కరించుట గాని, అంగీకరింపకపోవుట గాని, చక్రవర్తి గారి చిత్త
మునకు లోఁబఱచుట గాని చేయవచ్చును. గవర్నరు జనరలు గా
రంగీకరించిన పద్ధతిని దేనినైనను చక్రవర్తి గా రొక సంవత్సరము
లో త్రిప్పివేయవచ్చును. రెండు సభలలోని చర్యలు నింగ్లీషు
భాషలోఁ గాని డచ్చిభాషలోఁ గాని జరుపఁబడును. నాలుగు
రాష్ట్రములకును నల్వురు పాలనాధికారులను గవర్నరు జనరలు
గారే నియమింతురు. ప్రతిరాష్ట్రములోనుండియుఁ జిన్న సభ కెన్నఁ
బడు సంఖ్యకు మించకుండ మూఁడు సంవత్సరముల కొకసారి చిన్న
సభకు వలెనే యెన్నఁబడిన సభ్యులతో రాష్ట్రీయసభ యను నొక
సభ గలదు. ఆ సభకు సభ్యులే సభాధ్యక్షు నెన్నుకొందురు. ఆ
సభ గాక కార్యనిర్వాహకసంఘము అను పేర నల్వురు సభ్యులతో
రాష్ట్రపాలనాధికారి యాధిపత్యమున నొక సంఘ మున్నది. రాష్ట్ర
పాలనాధికారియే రాష్ట్రవ్యవహారములకు ముఖ్యుఁడు. కార్యనిర్వా
హకసంఘమువారు రాష్ట్రపరిపాలనముఁ జేయుచుందురు. రాష్ట్రీయ
సభ జరుగు సమయము రాష్ట్రపాలకునివలన నియమింపఁబడును.
వాని యనుమతి లేనిది ధనసంబంధము గల బిల్లు చర్చింపఁ గూడదు.
వాని యాజ్ఞ లేకుండ సొమ్ము వెచ్చింపఁ గూడదు. తక్కిన యంశ
ములఁ గార్యనిర్వాహక సంఘ సభ్యులకన్నఁ గడసారి వోటు
నిచ్చుట తప్ప నెక్కుడు అధికారములు వానికి లేవు. అతఁడు
రాష్ట్రీయసభవారికి లోఁబడిన యధికారి. యూనియన్ గవర్న
మెంటు వారికిఁ గూడ లోఁబడిన యధికారి యై యుండుటవల్ల
వారి యుత్తరువుల నవసర మైనపుడు కార్యనిర్వాహక సంఘము
వారితో నాలోచింపకయే యమలు చేయవలసి యుండును. ఈ
యంశములో ప్రస్తుతము హిందూదేశ పరిపాలనమును గొంతవఱకుఁ
బోలి యున్నది. రాష్ట్రపాలనములకు రాష్ట్రములోని సంగతులను
గుఱించియే యధికారము గలదు. గవర్నరు జనరల్ గారి యను
మతికి లోఁబడి రాష్ట్రీయపాలనములు, ప్రారంభవిద్య, వ్యవసాయము
ధర్మము, వైద్యము, స్థానికపాలనము, రోడ్లు, వంతెనలు, మార్కెట్లు
మొదలుగాఁ గలవానిని యూనియన్ పార్లమెంటువారు నిర్ణయిం
చుట కధికారము గలదు. యూనియనులోని యినుపదారులు హార్బ
ర్లు విషయమయి ప్రత్యేకముగ నొక బోర్డును గవర్నరు జనరలు
గారు నియమింతురు. ఆ బోర్డువారు గవర్నమెంటునకు మిగుల
నుండ నినుపదారుల రాఁబడిని వాని యభివృద్ధి క్రిందనే యుపయో
గింతురు. రాష్ట్రముల హద్దులను మార్చుటకుఁ గూడ యూనియన్
పార్లమెంటువారి కధికారము గలదు.

## హిందూదేశము

వాణిజ్యావసరములనుండి పరిపాలనావసరములకుఁ క్రమము
గాఁ బెరిగిన విధమును హిందూదేశ పరిపాలనా చరిత్రము తెలియఁ
జేయుచున్నది. 1599 సం. నఁ గొందఱు బ్రిటిషు వర్తకుల
కీయఁబడిన పట్టా ననుసరించి వర్తక విషయములకై యేర్ప
ఱుపఁబడిన సంఘమును, ఆ సంఘముయొక్క సభ్యులును,
సభాధ్యక్షులును, వారి యుద్యోగములును, వారి వ్యవహారము
కొఱకు చేయఁబడిన నిబంధనములే రాను రాను దేశపరిపాలన ప్రజా
రక్షణ మొదలగు నవసరముల ననుసరించి మార్పఁబడి నేఁటికి మహా
బహుళముగాను చిత్రముగాను వర్ధిల్లిన హిందూ సామ్రాజ్య పరి
పాలనా ప్రతిష్ఠాపన మై వెలుఁగుచున్నది. వాణిజ్యముకొఱకు మా
త్రమే స్థాపింపఁబడిన వర్తకస్థలము లయిన చెన్నపురి, బొంబయి,
కలకత్తా నగరములే ప్రత్యేకముగ గవర్నరుల యధికారములో నుండి
దేశమును సంపాదించుచు నింగ్లాండులో నుండిన డైరక్టర్ల కోర్టుకు
లోఁబడి యుండెను. దేశము బహుళ మయి పరిపాలనావసరము
తటస్థించిన వెంటనే యనఁగా 1773-వ సం. న కలకత్తాగవర్నరును గవ
ర్నరు జనరలుగా నియమించి నలుగురు సలహాదార్ల నిచ్చి హిందూ
దేశములోని బ్రిటీషుస్థానములను, వాని గవర్నర్లను గవర్నరు జన
రల్ గారికి లోఁబఱచి పరిపాలనావిధమును ఇంగ్లీషుదొరతనమువారు
మార్చిరి. అది మొదలు క్రమక్రమముగ హిందూదేశములోని బ్రిటీషు
వారి యధికారమునకు విస్తారమైన ప్రదేశము రాను రాను కాలాను
సార మయిన మార్పులను చేయుచు వచ్చిరి. 1858-వ సం. ములోఁ
గొన్ని కారణములవలన బ్రిటీషు హిందూ రాజ్యపరిపాలనము డైర
క్టర్ల కోర్టునుండి మార్పఁబడి బ్రిటీషు రాజ్య ప్రభువు సొంతముగ
నెఱవేర్చ నేర్పాటు చేయఁబడి యిండియాలోని గవర్నరు జనర
లును రాజప్రతినిధిగాఁ గూడఁ జేసి బ్రిటీషురాజ్య మంత్రివర్గ
ములో హిందూదేశ రాజ్యాంగమంత్రిని గూడఁ గ్రొత్తగాఁ జేర్చి
హిందూదేశపరిపాలనా విధమును బ్రిటీషు దొరతనమువారు మార్చిరి.
హిందూదేశములోని బ్రిటీషు స్థానముల పరిపాలనముతోఁ బాటు
నింగ్లీషు విద్యావ్యాపనము కూడ నారంభింపఁబడెను. 1858-వ సం.
న పరిపాలనలో జరగిన మార్పుల ననుసరించి హిందూదేశాభిమాన
ము మెండుగఁ గలిగి యుదారమనస్కురాలై ప్రజానురాగముగఁ
జిరకాలము రాజ్యముచేసి కీర్తి వహించిన శ్రీ విక్టోరియామహారాజ్ఞి
గారు హిందూదేశపరిపాలనములో హిందూదేశస్థులు గూడ నర్హతఁ
బట్టి చేర్చుకొనఁబడుదు రనియు హిందూదేశస్థు లనిన కారణమునఁ
గాని యన్యమతస్థు లను కారణమునఁ గాని దేశపరిపాలనమున హిం
దూదేశస్థులఁ దప్పించుట కూడ దనియు సర్వజనులును బరిపాలనా
విషయములో సమానులే యనియుఁ బ్రకటించుచు ప్రోక్లమేషను
చేయించెను. క్రమముగ హిందూదేశస్థు లున్న తాంగ్లేయము నభ్యసించి
పరిపాలనలోఁ జతురత ననేకవిధములఁ గనఁబఱచినారు. అట్లు
గొప్ప యధికారస్థానములలోఁ జతురత గనఁబఱచిన హిందూదేశ
స్థుల పేర్లు తక్కు వైనను బరిపాలనకు హిందువు లర్హు లను
నంశము రూఢి యగును. 30 సం. ల నుండియుఁ బనిచేయు
చున్న దేశీయసభానాయకు లందఱును పాశ్చాత్యదేశపరిపాలనా
ప్రతిష్ఠాపనల కార్యవిధము నెఱింగినవారే. వారిలోనే కొందఱు

గవర్నమెంటులో నున్న తౌధికారస్థానముల నలంకరించి దేశమునకు వన్నె దెచ్చిరి. కాని, హిందూదేశ రాజ్యపరిపాలనమున కాటపట్టయిన ఇండియన్ సివిల్ సర్వీసు నిబంధనలును, దక్కిన పరిపాలనాశాఖలలోని యుద్యోగనిబంధనలును, గవర్నమెంటులోని పెద్ద యుద్యోగములలోఁ జేర్చు విధులును హిందూదేశస్థులను పెద్ద యుద్యోగముల లోనికిఁ బరిపాలనాక్రమము నడపించు శాఖలలోనికిఁ గూడ ధారాళముగఁ జేరుట కవకాశము లేకయే చేయఁబడెను. ఈ యంశము విశేషసమర్థులగు మహనీయులనేకు లాంగ్లేయులును హిందూదేశస్థులును విపులముగఁ దెలిపియున్నారు. హిందూదేశస్థులు పరిపాలనావిషయములలో సమర్థత లేనివారనియు స్వపరిపాలనమున కర్హులు గారనియు దురభిమానము గల యాంగ్లేయులును, దమ సామర్థ్యాతిశయము దెలియలేని స్వల్పసంఖ్యగల హిందూదేశస్థులును మాత్రము చెప్పుచున్నారు. హిందూదేశస్థులు స్వపరిపాలనమున కర్హులని, అర్హులు గారని చెప్పు ప్రతివాదముల నన్నిటిని ఖండించుచు 1916-వ సం. ఫిబ్రవరి నెల మోడరన్ రివ్యూలో 233 పుట మొదలు వ్రాయఁబడిన యంశములు చదువరులు గమనింపఁ బ్రార్థితులు. ఇంతియగాక ఆంగ్లేయులలో నుదారస్వభావు లనేకులు హిందూదేశస్థులు స్వపరిపాలనమున కర్హులనియే గాక స్వపరిపాలనము నిచ్చి పరీక్షించిననే తప్ప హిందూదేశస్థు లర్హులు గారని చెప్పుట యన్యాయమనియుఁ జెప్పియున్నారు. నవంబరు నెల ఏష్యాటిక్ రివ్యూలో జే. బి. పెన్నింగ్టన్ దొరగారీ సంగతియే తెలియఁజేసియున్నారు. మన రాజప్రతినిధి హార్డింజి ప్రభువుగారు సిమ్లావిందు సమయమున భావికాలములో హిందూదేశమును బ్రిటీషు సామ్రాజ్యము నెడఁ గృతజ్ఞత గలిగిన సమానస్నేహితునివలెఁ జూడవలెఁ గాని తక్కువగాఁ జూడఁగూడదనియు, నధికారులలోఁ గొందఱిప్పుడను భవించుచున్న యధికారమును క్రమముగ విడువవలసి యుండునని యు, నట్లు చేయుట హిందూదేశపు రాజకీయ స్వాభివృద్ధి కవసరమనియుఁ జెప్పియున్నారు. దేశములో నన్నిచోట్లను స్వపరిపాలనము వచ్చునని యు రావలసియున్నదనియు ఆశయున్నది.

ప్రస్తుత సమయములో నున్న హిందూదేశ పరిపాలనా నిర్మాణము గత 175 సం. లనుండియు స్వల్పబీజమునుండి పెరిఁగిన మహావృక్షము. బ్రిటీషు దేశ పరిపాలనావిధమువలెఁ గార్యావసరముల ననుసరించి పెరిఁగినది. పైని జూపఁబడిన కలోనియలు పరిపాలనముల లోవలె హిందూదేశములో నిప్పటి ప్రతిష్ఠాపన లన్నియు నున్నవి. కాని పరిపాలనాభిప్రాయము, విధము, ఆదర్శము, దేశీయసమ ఫలము, ప్రతిష్ఠాపనల నిర్మాణము మొదలగు ముఖ్యాంశములందు మాత్రము భేదము గలదు. రాజప్రతినిధి గవర్నరు జనరలు గారును, రాష్ట్ర పరిపాలకులు లెఫ్టినెంటు గవర్నరులును, సామ్రాజ్య రాష్ట్రీయ శాసన నిర్మాణ కార్యనిర్వాహక సభలును, బిల్లులు ప్రవేశపెట్టుటయు, చర్చ జరుగుటయు, ఆదాయవ్యయపట్టికల సభలలోఁ జర్చించుటయు, సభ్యులు ప్రశ్నలు వేయుటయు, దొరతనమువా రుత్తరముల నిచ్చుటయు, సభ్యులు తీర్మానముల నుపపాదించి చర్చఁజేయుటయు మొదలుగాఁగల రాజ్యపరిపాలనాసంబంధములగు చిహ్నములన్నియుఁ గలవు. కాని, రాజ్య పరిపాలనయందలి భావము మాత్రము భేదము. కాలనీలలో రాజ్యతంత్ర మంతయుఁ గాలనీల పూర్తియైన యధికారమునందే జరుగుచున్నది. కాలనీల యాదాయవ్యయములతో బ్రిటీషు దొరతనమువారికి సంబంధము లేదు.

కాలనీల రాజ్యపరిపాలనములోవలె నిప్పుడు హిందూదేశమున సామ్రాజ్య ప్రభుత్వము వారికిని రాష్ట్రీయ ప్రభుత్వములవారికిని జేయవలసిన రాజ్యవ్యవహారములలో విభజన యున్నది. హిందూ సామ్రాజ్య ప్రభుత్వమువారు దేశ మంతటికిని వర్తించు వ్యవహారములను, అనఁగా, అంతిమ తపాల వ్యవహారములు, ఇనుపదారులు, అందఱు నీయవలసిన పన్నులు, కరెన్సీలు, ఋణములు దామే నిర్వర్తించి, రాఁబడి వసూలుచేయుట, విద్యాభివృద్ధి, వైద్య ఆరోగ్య రక్షణ నిబంధనలు, నీటి పారుదలలు, బాటలు, కట్టడములు మొదలగు స్థానిక వ్యవహారములను రాష్ట్రీయ ప్రభుత్వముల కప్పగించి యున్నారు కాని, స్థానిక వ్యవహారములు సరిగా నడచుచున్నదియు లేనిదియు సామ్రాజ్య ప్రభుత్వమువారు తఱుచుగఁ బరిశీలించుచున్నారు. రాష్ట్రీయ పరిపాలకుల బడ్జెట్లను సామ్రాజ్య ప్రభుత్వమువారు ప్రతి సం. ము ముందుగఁ జూచి యవసరమయినయెడల మార్చుచుందురు. ముఖ్యమయిన యుద్యోగము లేవైనను క్రొత్తగ నేర్పాటు చేయునపుడు రాష్ట్రీయ ప్రభుత్వమువారు సామ్రాజ్య ప్రభుత్వమువారి యనుమతిని బొందవలెను. రాష్ట్రీయపు దొరతనము వారి చర్యలవల్ల నష్టముఁ బొందిన ప్రతి యుద్యోగి గాని యనుద్యోగి గాని సామ్రాజ్య ప్రభుత్వమువారి కపీలుచేసికొనుట కవకాశము గలదు. చెన్నపురి బొంబయి బంగాళా రాష్ట్రములలోఁ దప్ప, తక్కిన రాష్ట్రములలో ముఖ్యమైన యుద్యోగస్థులను నియమించుటలో సామ్రాజ్య ప్రభుత్వమువారి యనుమతి యుండవలెను. స్వతంత్ర రాజ్యములలోఁ గొన్నిటి వ్యవహారములు సామ్రాజ్య ప్రభుత్వమువారును, మఱి కొన్నిటి వ్యవహారములు రాష్ట్రీయ ప్రభుత్వమువారును జూచుచున్నారు. హిందూదేశమున సామ్రాజ్యప్రభుత్వ మన రాజప్రతినిధిగారును వారి సభలోని సాధారణ సభ్యులును మాత్రమే యై యున్నారు. ఆ సాధారణ సభ్యులు సేనాధిపతి గాక యాఱుగురున్నారు. కలోనియల్ పరిపాలనములోవలె పైయాఱుగురు సభ్యులకు రాజ్యవ్యవహారములలో వివిధ భాగము లేర్పఱుపఁబడియున్నవి. రాజప్రతినిధిగారు నొక భాగమును, అనఁగా నితరదేశములతోడి వ్యవహారములఁ జూచుచున్నారు. కాని, యీ సభ్యుల యధికారములు మాత్రము కాలనీలలోఁ గాని యింగ్లాండులోఁ గాని యుండెడి మంత్రివర్గముల యధికారములవలె నుండవు. ప్రతి సభ్యుని వ్యవహారశాఖకు నాతఁడధికారియే యై యున్నను రాష్ట్రీయ ప్రభుత్వము వారి యభిప్రాయములతో నేకీభవింపనపుడును ముఖ్యావసరము గలిగినపుడును ఆ యంశము రాజప్రతినిధిగారితో సలహా చేయవలసియున్నది. వివిధశాఖలలోని నన్యోన్యసంబంధములు గలిగిన వ్యవహారములలో నాయా సభ్యు లేకీభవింపనపుడు రాజప్రతినిధిగారి

యాలోచనకుఁ బంపవలసి యున్నది. రాజప్రతినిధిగారి పై సభకుఁ
గార్యనిర్వాహకసభ యని పేరు. కార్యనిర్వాహకసభ నిర్ణీతకాల
ములలోఁ గూడి వ్యవహారములఁ జేయుచుండును. సభ్యులలో నభి
ప్రాయభేదములు గలిగినపు డెక్కువసంఖ్య గల సభ్యుల యభిప్రా
యమే సభాభిప్రాయమై యుండవలసినది. కాని సభాభిప్రాయ
మెట్లున్న నట్టి యభిప్రాయమును ద్రోసివేసి యందులకు వ్యతిరేక
ముగ నడచవలసిన యగత్యము రాజప్రతినిధిగారికిఁ గనఁబడునపు డా
ప్రకారము చేయు నధికార మాతనికిఁ గలదు. రాజప్రతినిధిగారి
సభకు అడిషనల్ సభ్యులను పేర వారిచే నియమింపఁబడిన కొంద
ఱును, రాష్ట్రీయశాసన నిర్మాణసభ్యులచేతను రాష్ట్రములలో
నితర విధములవల్లను ఎన్నుకొనఁబడిన సభ్యులు కొందఱును, గార్య
నిర్వాహకసభయుఁ గలసి శాసననిర్మాణసభగాఁ జేరియున్నారు.
ఈ రీతినే రాష్ట్రయపాలనములు గొన్నిటిలోఁ గూడఁ గార్యనిర్వా
హకసభతోఁ గూడిన శాసననిర్మాణసభ గలదు. సామ్రాజ్యశాసన
నిర్మాణసభలోఁ గార్యనిర్వాహకసభ్యులు గాక 60 మంది సభ్యులు
గలరు. వీరిలో రాష్ట్రీయప్రభుత్వముల ప్రతినిధు లెనముం డ్రుద్యోగీ
యులు, ఇరువదిమందికి హెచ్చకుండ అనుద్యోగీయులు గలిసి రాజ
ప్రతినిధిగారిచే నియమింపఁబడిన 28 మంది సభ్యులును, రాష్ట్రీయ
శాసన నిర్మాణసభ్యులచేతను ఇతర సభ్యులచేతను నెన్నుకొనఁబడిన
25రు సభ్యులును గలరు. రాష్ట్రములలో ముగ్గురు కార్యనిర్వాహక
సభ్యులు గలరు. రాష్ట్రీయశాసననిర్మాణసభలలో నుద్యోగీయులును
దొరతనమువారిచే నియమింపఁబడినవారును, ఎన్నుకొనఁబడిన సభ్యుల
కంటె హెచ్చుగాఁ గలిగి 50 మందికి మించకుండ సభ్యులు గలరు.
సామ్రాజ్య రాష్ట్రీయ ప్రభుత్వములలో ప్రస్తుతపు నిబంధనలవల్ల
శాసననిర్మాణసభా సభ్యులకు రాజకీయ వ్యవహారములలో దొరత
నమువారి యూహలను మార్చి అవసర మయినప్పు డందునకు వ్యతి
రేకముగ దొరతనమువారు నడచునట్లు చేయు నధికార మెంతమా
త్రమును లేదు. ఆర్థికసంబంధ మయిన వ్యవహారములలో నట్టి యధి
కారము బొత్తిగ లేదు. మింటో మార్లీ ప్రభువులు చేసిన నిబంధ
నల సంస్కరణమువల్లఁ గూడ సభ్యుల యధికారము లెంతమాత్ర
మును హెచ్చలేదు. రాజకీయ వ్యవహారములును అందులో ముఖ్య
ముగా ఆర్థిక వ్యవహారములును బూర్తిగ తెలిసిన కీర్తిశేషులును
మాననీయులు నగు గోఖలే యంతటివారి కైనను సామ్రాజ్య ప్రభు
త్వమువారి యార్థిక వ్యవహారములలో నించుకయిన మార్పు గలుగఁ
జేయుట సాధ్యము గాకపోయెను. శాసననిర్మాణసభ్యు లెంత కష్ట
పడినను గార్యము లేదని యట్టి సభ్యు లనేకులు వారిలో ముఖ్య
ముగ చెన్నరాష్ట్రసభాసభ్యులయిన మాననీయు లగు శర్మగారును
రామచంద్రరావుగారును నొక్కి వక్కాణించి యున్నారు. ఆర్థిక
వ్యవహారములలో హిందూదేశలాభము ననుసరించి పరిపాలన జరుగ
వలసి యున్నట్టును ఇప్పటి యేర్పాటులవలన పరిపాలనావ్యయ
మెక్కువగా నున్న దనియు అట్టి వ్యయమును తగ్గించు నవసరము
గల దనియు ననేకులగు నాయకుల యభిప్రాయ మై యున్నది.

పరిపాలనావ్యయము తగ్గించుటకు ముఖ్యమయిన మార్పు హిందూ
దేశములోని యుద్యోగశాఖాధికారులను ప్రస్తుతము ఇంగ్లాండులో
నియమింపఁబడుచున్న యందఱి యధికారులను హిందూదేశము
లోనే నియమించుట. ఇందువలన పరిపాలనావ్యయము చాలవఱకు
తగ్గును. హిందూదేశములోని రాజప్రతినిధిగారిని రాష్ట్రాధికారులను
దప్ప తక్కిన యధికారులందఱును హిందూదేశములోనే నియమింపఁ
బడవలెను. అందువలన రాష్ట్రాధికారులు స్వతంత్రబుద్ధితో మొగ
మోటములు లేకుండ పరిపాలనచేయుటయు మిగిలిన యధికారుల
ఖర్చు తగ్గుటయు జరగును. హిందూదేశ పరిపాలనా స్వాతంత్ర్యము
ననుసరించి సభల సభ్యుల సంఖ్యను వారి యధికారములను హెచ్చు
చేసి పరిపాలనావ్యవహారములలో ప్రజాభిప్రాయము విశేషముగాఁ
బ్రబలి ప్రజలకు లాభకరముగాఁ బరిపాలన జరగు నేర్పాట్లు చేయ
వలయును. సాధారణముగా హిందూదేశ రాజప్రతినిధి గారికిని
ఇంగ్లాండుదేశములోని హిందూదేశీయ రాజ్యాంగమంత్రిగారికిని అభి
ప్రాయభేదములు గలుగ లేదు. హిందూదేశ వ్యవహారము లన్నియును
హిందూదేశములోఁ బూర్తిగాఁ బరిశీలించిన వెనుకనే యింగ్లాండు
దేశమునకుఁ బంపఁబడుచున్నందున హిందూదేశ రాజ్యాంగ మంత్రి
గారికి వేఱే సభ జరగుట లేదు. రాజప్రతినిధిగారు రాజ్యాంగ
మంత్రిగారు వీరి యుభయులలో నొక రూహ చేయుటయు రెండవ
వా రంగీకరించుటయు మాత్రమే జరగుచున్నది. అట్లు వా రేకీభవింప
నప్పు డొకసారి కర్జను ప్రభువుగారు ఉద్యోగము మానుకొనవలసి
వచ్చెను. కనుక హిందూదేశమునకు పూర్తియైన పాలనాధికారము
ఇయ్యఁబడినప్పుడు హిందూదేశీయమంత్రియే యనవసరమై యుం
డును. ఆయనకు వేఱె ఆలోచనసభ బొత్తిగ అనవసరము. హిందూ
దేశపు వైశాల్యము ప్రాముఖ్యము మొదలుగాఁ గల యంశములను
బట్టి ప్రత్యేకపు హిందూదేశీయమంత్రిగారిని ఉంచిన నుంచవచ్చును.

కావున కాలనీల స్వపరిపాలనమువంటి పాలనము హిందూదేశ
మునకు నియ్యవలయు నన్న (1) ప్రథమమున ఇంగ్లాండుదేశములో
నున్న హిందూదేశమంత్రిగారికి సాయ మనుచు నున్నసభను దీసి
వేయుట. ఈ సహాయసభవలన లాభ మేమియు లే దనియు ననవ
సర మనియుఁ గొలఁదికాలముక్రిందట ఈసభను మార్చుటకుఁ జేయఁ
బడిన బిల్లుపయిని జరిగిన చర్చవలన కనిపించుచున్నది. (2) బ్రిటీషు
మంత్రివర్గములో కలోనియల్ సెక్రటరిగారివలెనే హిందూదేశ
మంత్రిగారి స్థానము కూడ నుండవలయును. (3) రాజప్రతినిధిగారు
హిందూదేశమున కంతటికిని వర్తించు పద్ధతులు మార్చునపుడు
మాత్రము బ్రిటీషుపార్లమెంటువారి యనుమతికిఁ బంపించుటకు తప్ప
మఱి యేవిషయములోను సలహాచేయుట కవసరము లేకుండఁ
జేయుట. (4) హిందూదేశములోని ప్రతిరాష్ట్రమునకును బ్రిటీషు
మంత్రివర్గమువలన నియమింపఁబడినపాలకుని పంపుట. (5) ప్రతి
రాష్ట్రమునకును బూర్తిగా ప్రజలచే నెన్నుకొనఁబడిన శాసననిర్మా
ణసభయు అట్టి సభాసభ్యులలోనుండి నియమింపఁబడి రాష్ట్రపరిమితి
ననుసరించి నిర్ణయింపఁబడిన సంఖ్య గలిగిన. కార్యనిర్వాహకసంఘము

నుండవలెను. (6) సామ్రాజ్యశాసననిర్మాణసభ గూడఁ బూర్తిగ నెన్నుకోఁబడినసభ్యులచే నిర్మాణము కావలెను. సామ్రాజ్యశాసనసభకు ప్రతిరాష్ట్రమునుండి పదునేనుమందికి మించకుండ ప్రజల యెన్నికపయిని సభ్యులు నియమింపఁబడవలెను. (7) సామ్రాజ్యశాసనసభ గాక కాలనీలలోవలె సెనేటుసభ యను మఱియొక పెద్దసభ యుండవలెను. సెనేటుసభలో రాష్ట్రమునకుఁ బదిమందికి తక్కువ కాకుండ సభ్యులను రాజప్రతినిధిగారే నియమింపవలెను. (8) సామ్రాజ్యమంత్రివర్గము అనఁగా సామ్రాజ్యకార్యనిర్వాహకసంఘము సెనేటు శాసననిర్మాణసభల సభ్యులలోనుండి రాజప్రతినిధిగారు నియమింపవలెను. (9) సామ్రాజ్యశాసననిర్మాణము విషయమయి ఆస్ట్రేలియాలో సెనేటుప్రతినిధిసభల కుండెడి యధికారము లుండవలెను. (10) రాష్ట్రముల శాసనాధికారములు పాలనాధికారములు ఆస్ట్రేలియాలోని రాష్ట్రములకువలె నుండవలెను. కాని, కనడాలోవలె రాష్ట్రీయపాలకులు రాజప్రతినిధిగారికి లోఁబడి యుండవలెను. (11) సామ్రాజ్యసభలలోని సభ్యులు అయిదు సంవత్సరములకును రాష్ట్రీయసభల సభ్యులు మూఁడు సంవత్సరములకును నొకసారి మాఱుచుండవలెను. (12) నిబంధనలను రాష్ట్రీయ ప్రభుత్వమువారు మార్చునపుడు సామ్రాజ్యప్రభుత్వమువారి యనుమతియును సామ్రాజ్యప్రభుత్వమువారు మార్చునపుడు చక్రవర్తిగారి యనుమతియును బొందవలయును.

ఈ ప్రకారము కలోనియల్ స్వపరిపాలనము మాదిరిని హిందూదేశస్థితికి తగినట్లు మార్పులు చేసి, కెనడా ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికాలకువలె భారావహమయిన యంతఃకరణముతో హిందూదేశనాయకుల యభిమతము ననుసరించి హిందూదేశమునంగు పరిపూర్ణానుగ్రహము గల చక్రవర్తిగారు శాసననిర్మాణము త్వరలో దయచేయుదు రని ప్రార్థన.

పైవ్యాసములో కాలనీల పాలన నిర్మాణాంశములను 1916 సం. జనవరి నెల ఇండియను రివ్యూలో కాలనీల పాలనమును గుఱించి యస్. యమ్. సజ్జాముదారు గారు వ్రాసిన వ్యాసము సాయమున వ్రాయఁ గలిగితిని. అందుకు వారికి వందనములు చేయుచున్నాను.

# సుతస్మృతి

గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు, ఎం. ఏ.

స్వైరసౌఖ్యపు సుమములను
    విస్మయముల వదలఁజేయు విధములు తెలుపన్
అస్మత్ప్రియ పుత్రక! యీ
    విస్మయగతి నన్ను గమను వీడఁగఁజను నే? — 1

క. భోజనపతిఁ గూర్చుండఁగ,
    భాజనముల నెల్ల ముల్చి పసవైచుచు నా
రాజవు నీ వని చీరఁగ
    రాజితవదనంబు చూపరావో కుఱ్ఱా! — 2

ఆ. ఇల్లుగడపదాఁటి చల్లగ నంగణ
    మునకు రాఁగఁ, జూచి ముదమునంది
లోన నుండు నన్నుఁ గానఁగఁ బిల్చెడు
    తల్లి మఱచి చనితొ తండ్రి చెపుము! — 3

క. అప్పప్ప యనుచు నాడఁగ,
    నప్పప్పా యనుచు పిన్న యప్పకు నగుడున్
తప్పొప్పు మాటఁ బల్కెడు
    అప్పఁడ వగు నీవు పోవనగునే తండ్రీ! — 4

ఆ. చిన్నయన్న! నీదు చెన్నుమొగంబైన
    చూడ నోఁచుకోనఁగఁజాలనైతి
మేలు గల్గు ననుచు మేటియాసతోఁ బంప
    చెనఁటి విధియు యిట్లు చెఱచివైచె.

ఆ. అన్న రమ్మని పిల్వ నయ్యదగ్గఱ కేఁగి
    యమ్మవంక నగలి యర్ధ్రతుటిని
వంక నుండుఁ జేర యలరు నవ్వొలయఁగ
    తండ్రి దినుపునట్టి తండ్రీ చనితొ? — 6

ఆ. అన్న యన్న యనుచు నలరారు పల్కుల
    నన్ను పిలఁచె దనుచు ననుఁగుఁదల్లి
మొన్న వినిచె నాకు నన్నరో యింతలో
    నన్న చూపు చూడఁ గనునె చెపుమ? — 7

తే. తండ్రి యీరీతి ప్రాకృతధర్మ మంది
    ఏల ఘోరంపు చింతల నెసఁగఁజేతు
వనె దవోయన్న? ఈ జగద్వనమునందుఁ
    బడిన యనుభవమాయల ఫలము సుమ్ము. — 8

లోకవిషయము ద్రావక వీఁక చెడక
    దర్శనంబున మాత్రిన దఱచి యల్ల
తెలిసి ముక్తికి సులభమౌ తెరువుఁ జూడ
    నగునె యర్భక! యెల్లర కవనియందు? — 9

తరళసుస్వనమాత్రమౌ తంత్రిరీతి
    పొదలు సౌరభశేషమౌ పూవుపగిది
కావ్యరూపంబు దాల్చెడు కవులభాతి
    స్మరణగాత్రంబు దాల్చితే విరతిఁ దండ్రి. — 10

ఎల్లకాలంబు నిట్టులే ఇల్లు గట్టు
    కొనుచు నిల్వఁగ మనుజుఁడు కోరఁగూడ
దనుచు లిఖియించి విరహవేదనను మాన్ప
    మార్గ మేర్పడ విధి సన్నిధనల మరలఁ — 11

జేర్ప నున్నాఁడు గావునఁ జింత వీడు
    మనెడు నీ సూక్ష్మవాక్కుల నదిగొ వింటి;
తేజ మెప్పుడుఁ జెడదండ్రు తేజశకల
    మైన నే నెట్లు పోవంగ నగుదు నయ్య! — 12

యనుచు నర్మిలిఁ జూచెడు ననుఁగుచూపు
    చిన్నియన్నరో! నా కన్న దన్ని నిలిచె;
నింక నే ననువాఁడ నీ యిష్టమునకు
    మాఱు నల్కక నీ పుష్పమాల యిచ్చి
నాఁడు కాలంబు వేచెదనయ్య నేను. — 13

# సామాన్యభాష—సామాన్యగ్రంథజాలము.

కో. వేం. అప్పాశర్మ గారు, ఎం. ఏ.

సామాన్య భాష యనిన, హిందూ దేశమువలె నానాభాషలు గల దేశమున, ధార్మిక సాంఘిక రాజకీయాది విచారణములయందును, ప్రాయసములయందును, విద్యాధికులు భిన్నభాషలు గలవారైనను నుపయోగించుకొనుటకు నిర్ణయించుకొన్న భాషయే గాని వేఱు కాదు. ఈ విషయమున మన విద్యాధికులే కొందఱు 'లింగ్వా ఫ్రెంకా' యను శీర్షికతో కొలఁది కాలము క్రిందట చర్చించినపుడు అపార్థము చేసికొని, "మన దేశభాష లడుగంటవలసినదేనా? అందఱి గ్రంథజాల మే మగును? స్వేతరభాషను ఆబాలగోపాలము స్వభాషవలె మాటలాడ నేర్తురా?" యని వెఱ్ఱి భయములు చూపఁగా, పాశ్చాత్యులలో ఇద మిత్థ మని నిర్ణయించుట కర్హత గలవారే, పై పారిభాషిక పదములకు పైని దెల్పినదే యర్థ మని నిర్ణయించియున్నారు.

ఐరోపియనులకు పరాసు భాషయును, అమెరికనులకు ఇంగ్లీషును సామాన్యభాషలుగా నుండ, మన కట్టిది ప్రచారములో లేకుండుట కడు శోచనీయము. అట్టి భాష యున్ననే గాని ధార్మిక సాంఘిక రాజకీయాది మహోద్యమములలో నైక్యభావ మేర్పడదు. అది లేమిచే సంభవించు నాచరణక్లేశము మున్నటి యాయుర్వేదసమ్మేళనమువంటివానియందు సువిదితమే. అట్టి భాష యున్ననే గాని భిన్నభాషలు గలవారి కందఱికి "మాది" యనుకొనుటకు తగిన గ్రంథజాల మేర్పడదు. 'మా మతగ్రంథము' 'మా ధర్మశాస్త్రగ్రంథము' 'మా శాస్త్రగ్రంథము,' 'మా కావ్యగ్రంథము' అనుకొనుటకు తగిన గ్రంథజాల మున్ననే గాని, ఏకీభావము, జాత్యంతరవ్యావృత్తి ఆత్మగౌరవము మొదలగు స్వతంత్ర జాతిలక్షణము లేర్పడవు. కనుక 'సామాన్య భాష' 'సామాన్యగ్రంథజాలము' అనునవి అన్యోన్యానుబద్ధములు.

ఇపుడు హిందూజాతి పునర్నిర్మాణోత్సాహము ప్రబలుచుండుటచే, కొలఁది కాలముక్రిందట సామాన్యభాష నేర్పాటు చేసికొనుటను గుఱించి చర్చ జరగినపుడు, పత్రికాముఖమున బంగాళీలు బంగాళీభాషయే సామాన్యభాష యగు నని, ఘూర్జరులు గుజరాతీ యగు నని, హిందూస్థానీయులు హిందీ యగు నని ఇట్లు ఎవరెవరి భాషను వారువారు సామాన్యభాషాపదవిచే బహూకరింపఁ దొడఁగిరి. తత్త్వవిచారము మొదలిడిన పిదప నభిజ్ఞులు, బంగాళాదిభాషలు స్వల్పసంఖ్య గల జనులచే వాడఁబడునవి గనుక, కోటానఁగోటుల సంఖ్య గల ఇతరభారతీయుల కవి యుపాదేయములు కావనియు, ఉరుదు హిందూమహమ్మదీయసైనికుల పరస్పరసంఘటనచే నేర్పడినది గనుకను, పట్టి చూచినదియే గనుకను, ఆంగ్లభాష యత్యంతవిదేశీయము గనుకను, సంస్కృతము చాల గొట్టు గనుకను, నివియుఁ గావనియు, నితరభారతీయదేశభాషలకంటె మాటాడు జన మెక్కుడు గల హిందీభాషయే సామాన్యభాష కావలె ననియు నిర్ణయించిరి. ఇందునకు దాక్షిణాత్యులలోఁ గూడ నొక విద్యాధికులు తమ సమ్మతిని జూపిరి. హిందీభాషకుఁ గల హక్కులలో (౧) చాలమంది ఇది వఱకే మాటాడుచుండుట (౨) సంస్కృతమున కత్యంత సమీప మగుట (౩) మహమ్మదీయులకుఁ గూడ పనికి వచ్చుట (౪) ప్రక్రియాక్లేశము చాల తక్కు వగుట వీనిని ముఖ్యముగా నుదాహరించిరి.

ఈ హేతువులను వేర్వేఱ రవంత విచారింతము.

(౧) హిందీభాష దేశభాషలలో నేయొక్క భాషకంటెను కూడ నెక్కువమందిచే మాటాడఁబడుచుండవచ్చును గాని, దానిని క్రొత్తగా నేర్చుకొనవలసిన యందఱికంటెను నెక్కుడుమందిచేఁ గాదు గదా ? ముప్పది కోట్ల జనము గల దేశమున నది యేమాత్రము భేదము చేయఁగల్గును? ఇది యెట్టి హేతువు? (౨) సంస్కృతమునకు దగ్గఱ యను మాట నిజమే గాని, నాల్గవ హేతువును బట్టి చూడఁగా ప్రక్రియాబాహుళ్యము గల సంస్కృతమునకు దూరమే యని తేలును. ప్రకృతులు చాల మట్టుకు సమాన మందురా, అఱవ మొదలు తప్ప, అన్ని దేశభాషలలోను కొంచె మించుమించుగా నంత యెక్కుడుగాను సంస్కృతప్రకృతులు చేరుచునే యున్నవి. ఆ మాత్రమున హిందీ చదువువారికి లేక మాటలాడువారికి, ప్రత్యేకముగా చదువక సంస్కృతము రాలేదు; చదివిన తర్వాత నితరులకంటె నెక్కుడు వచ్చు ననుమాటయు నవిశ్వసనీయమే. ఇంతియ గాక మూఁడవ హేతువున కిది విరోధించును. (౩) పైని దెల్పిన ప్రకారము సంస్కృతశబ్దబాహుళ్యము మహమ్మదీయులకు దీని ననుపాదేయముగనె చేయును. వారు అరబ్బీ పారసీక శబ్దములు మెండు ప్రయోగించినచో నిప్పటి భాషనుండి భేదించి అట్టి వాచకగ్రాంథికభాష హిందువుల కనుపాదేయ మగును. (౪) ప్రక్రియాక్లేశము తక్కువను మాట నిక్కువమే. కాని, ప్రక్రియాలాఘువము సంస్కృతదూరీకరణమునకే హేతు వగు నని పైని జూపితిమి. కాననే, భాషాతత్త్వశాస్త్రవేత్తలగు పాశ్చాత్యులు ఈరెంటిని భిన్నస్వభావములు గలవానినిగ నిశ్చయించి భిన్నకక్ష్యలం జేర్చిరి. ఇంతియ గాక, ద్రావిడకుటుంబములోని భాషలను మాటలాడువారికి, ముఖ్యముగ నఱవలకు హిందీలో నిత్యకృత్యమునకు ప్రధాన మగు విజాతీయ దేశీయ పదము లెంతమాత్రము రుచింపవు.

అటులయిన, సామాన్యభాష లేకుండ నుండుటయే మనగతియా యని యడుగవచ్చును. అట్లు గాదు. పాశ్చాత్యులనుండి క్రొత్తగ నేర్వఁబడి ఇంకను జీర్ణముఖము గాని "మృతభాషా"వాదచాపల్యము, ప్రాచీనసంస్థాపునరుద్ధరణ మనుటతోనే ఆధునికులలో కొందఱినావహించు విరతిపిశాచము, స్వీయవిషయములలో శ్రమకోర్వవలసివచ్చినపుడు వైదము నలసతామూలక మగు వెఱ్ఱి భయము ననమ్మతి—ఇవి మన కనులఁ గప్పనిచో, అట్టి సామాన్యభాష హిందువుల కిదివఱకే యున్నది. యని కనుఁగొనఁగలము. అది యేదియో వేఱె చెప్పవలెనా? తెలియును; సంస్కృతమే. అది యెట్లన్నచో— (౧) సంస్కృత మనాదిగా పూర్వకాలమున సామాన్యభాషగా నుండెను. (౨) హిందూనాగరకత యని భారతీయులు గాని ఇతరులు గాని యనుకొన్నచో, అది యట్టి కాలమున సంస్కృత గ్రంథమూలకముగా నేర్పడిన నాగరకతయే గాని వేఱు గాదు. (౩) సంస్కృతము భరతవర్షములోని సమస్తము లగు ప్రసిద్ధభాషలయందును—అఱవములోఁ గూడ—తద్గతగ్రంథజాలమందును, తత్సమరూపమునఁ గాని తద్భవరూపమునఁ గాని యుభయవిధములఁ గాని వ్యాపించియున్నది. (౪) హిందూధర్మాచరణ మిప్పటికిని సంస్కృతము ద్వారానే జరగుచున్నది. (౫) పండితు లిప్పటికిని సంస్కృతము ద్వారానే చర్చలను సిద్ధాంతములను గ్రంథరచనలను చేయుటయే గాక సభలయం దుపన్యసించుట మాటలాడుట గూడ చేయుచున్నారు. (౬) స్వదేశీయులును విదేశీయులును గూడ ఇప్పటికిని, వక్తృత నభ్యసింపక పోయినను, కడు శ్రద్ధతో నధ్యయనము చేయుచున్నారు. (౭) గ్రీకు, లాటినులు ఐరోపాకువలెఁ గాక మొత్తము మీఁద భారతీయులకందఱకును నదియే "మాతృ" భాష.

ఇట్టిది కల్గియు లే దనుకొనుటకంటె మౌర్ఖ్యము వేఱే కలదా? అయిన, 'దీనికి దేశభాషవలె ప్రచారము లే దని యొప్పుకొనునపుడు హిందీని పరిగ్రహించుట కభ్యంతర మేమి?' యనవచ్చును. చూడుఁడు. వెనుక చెప్పిన హేతువు లటు లుండఁగా, మన ప్రకృతప్రభువులాంగ్లేయు లగుటచే రాజభాష ఇంగ్లీషొకటి చదువవలెను. మన భాషలలో నాధునిక విజ్ఞానము లేకుండుటయు, ఆంగ్లభాష ప్రపంచమున బహువ్యాపి యగుట

యుఁ గూడ కారణములే. దేశభాష చెప్పనే యక్కఱ
లేదు. చదివితీరవలెను. మూలగ్రంథముచదువనిది తత్వ
లాభముకలుగదు గనుక ప్రతి హైందవుఁడును సంస్కృత
మొకటి చదువవలెను. ఇది మీరును నొప్పుకొనెడి
యంశమే. ఇఁక మీరు సామాన్య భాషను చేసితిరి గను
క హిందీ యొకటి చదువవలెను. స్వల్పిన్నుఁ డయి
ప్రకాశింపఁదలఁచినచో, విజ్ఞానలాభము వ్యవహారము
ముఖ్య మయినచో ప్రతి విద్యార్థికి భాషలే నాల్గావశ్య
కములు. ఇఁక శాస్త్రములు, కళలు, వానిలో స్వదేశీ
యములు, విదేశీయములు నేర్చు టెట్లు! ఇట్లు గాక సం
స్కృతమే సామాన్యభాషగా నిర్ణయించినచో, ప్రస్తు
తము ఒకభాష (హిందీ) తప్పును. ఒక భాష యన
చుల్కఁగా నెంచకుఁడు. అదియును ప్రత్యేకముగా నేర్వ
వలయునుగదా! ఆద్యవస్థలలోఁ పడు కష్టములు, గట్టి
ప్రవేశము గల్గుటకు పట్టు కాలము అభ్యసించిన వారికే
యెఱుక. కాలక్రమమున దొరతనమువారు కూడ
'అట్టి' పదవిని సంస్కృతమున కొసంగినచో—అనఁగా
అట్టి పదవి దానికి వచ్చినచో—అధ్యేయములు రెండే
యగును.

అందువలని లాభము లెట్టివి—(౧) దేశభాషా
సముద్ధరణమువలన ప్రపథమావస్థను జాతీయప్రతిభ
నిరాటంకముగ నుపచయ మొందును. (౨) సంస్కృత
భాషాధ్యయనమువలనను తద్గతగ్రంథాధ్యయనము వల
నను, విదేశీయ విజ్ఞానము నేర్వ మొదలిడునప్పటికి,
విద్యార్థి స్వజాతీయాదర్శానుగుణముగనే క్రొత్తజ్ఞానము
నాత్మ సాక్షాత్కరించుకొనుటకుఁ దగిన యోగ్యత గల్గి
యుండును. (3) సంస్కృతసాహాయ్యము లేనిది దేశ
భాషలకు పారిభాషిక వాఙ్మయము లేకపోవుటచేతను,
అరువు గొన్నప్పటికంటె సంస్కృతంబుననే వ్యవహరిం
చినచో లాఘవము గనుకను దేశభాషల ద్వారా సం
గ్రహించిన వైదేశికవిజ్ఞానమును సర్వభారతీయులకు
నుపకరించునట్లు సంస్కృతనిబద్ధమును చేయవచ్చును.
(౪) అనన్యదేశసామాన్య మగు మన ప్రాచీనవేదశాస్త్రా
దులను యథాశక్తి స్వయముగ నభ్యసించి యాత్మవ్య
క్తిగతజాతీయత్వమును నిల్పికొనవచ్చును. (౫) ఇది
వఱకే, ద్రవిడదేశము గూడ శంకరాచార్యాది మహా
నీయులను పుట్టింపఁగల్గునంతగ గీర్వాణభాష భరత
ఖండమున నాసేతుహిమాచలము వ్యాపించియుండు
టచే నతిశీఘ్రముగ నభివృద్ధిలోనికి వచ్చును.
ఇది యంతయు సరియే. సంస్కృత మొన్నటికైనను
మహమ్మదీయుల కుపాదేయ మగునా యనవచ్చును.
కాదు. కాని, కాదనువా రనుకొనునంతగా కాదు.
హిందూస్థానమున వేదాంతాదిశాస్త్రములు నేర్చిన
తురుష్కులు గూడ నచ్చటచటఁ గలరు. అది వేఱే విష
యము. అయిన, మహమ్మదీయులు హిందువులతో
నైక్యమునకు సమ్మతించిరా? వారి యలీఘరు కాలేజీ,
మహమ్మదీయ విశ్వవిద్యాలయములను జూడుఁడు.
అటులే హిందువుల సెంట్రలు హిందూ కాలేజీ సర్వ
భారతీయ హిందూ విశ్వవిద్యాలయమును గూడఁ
జూడుఁడు. మొన్ననే పల్కిన రవీంద్రనాథ ఠాకూరు
తత్త్వవాక్యములను జూడుఁడు. భరతఖండమున నీ
రెండు మహాప్రవాహములును పరస్పరైక్య మొందు
టకు తగిన కాలపరిణామ మేర్పడువఱకును ప్రత్యేకో
పచయమార్గములు తప్పవు.

సరియె; సంస్కృతము అనుకొన్నంత చుల్కగ
నలవడునా?—యనునది తర్వాతి ప్రశ్న. అనుకొన్న
కంటె నెక్కుఁడు చుల్కగనే యలవడును అని ప్రత్యు
త్తరము. ఎప్పుడును కని విని యెఱుంగని యాంగ్ల
భాషలో సుమారు పది సంవత్సరములలో మహాపట్ట
పరీక్షలలో తేలఁగల్గి, యొక యర్ధశతాబ్ద మయిన
కానిదే పాశ్చాత్యులతో సరితూఁగుటకు తగిన యోగ్య
తను సంపాదించిన పురుషాంతరములోనివాఁ డడుగ
వలసిన ప్రశ్నయేనా యిది?—యని ప్రతిప్రశ్నము. మన
బుద్ధులే మరలవలెను గాని తెలివితేటలకు లోపము
లేదు. భాషలు నేర్చుటయందు హిందువులు కడు నేర్ప
రులు అని కోవిదులు వక్కాణించి యున్నారు. అం
దులో సర్వదేశభాషాంతర్యామి యగు సంస్కృతమే
మైనచో వేఱే యడుగవలెనా? కాని, యిప్పుడు ప్రచా

రములో నున్న ప్రవచనమార్గములనే యనువర్తించినచో నట్టి ప్రశ్నల కవకాశము లేకపోలేదు. లక్ష్యములను మార్చుకొన్నపు డుపాయములను మార్చుకొనక పోవుటకు హేతువు లేదు. మార్పకుండుట భావ్యమును గాదు. ఉద్దేశవిధేయములకు వైపరీత్య ముండఁజనదు గదా! అందుచేత ననుశ్రుతమార్గములలో ప్రతికూల మగువానిని పరిత్యజించి వక్తృత్వమును గ్రథకత్వమును సిద్ధింపఁజేయుటకు సిద్ధౌషధ మగు నాధునిక 'సాక్షాన్మార్గము'ను, వ్యాకరణభాగమునకు తగు శ్రద్ధ చూపుచు నవలంబించినచో, శీఘ్రకాలములోనే ఫలము గనఁగలము. ఇది యనుభవైకవేద్యము. చేసి చూచిన చోట్ల నట్టి ఫలము లగపడినవి. ప్రయత్నింపకయే కష్టము కష్టమనుట కేవలశుష్కాలాపము. ఇది యుపాధ్యాయ పరీక్ష నుత్తీర్ణుఁ డయిన ఏయాంగ్లోపాధ్యాయుని సాహాయ్యము గొన్నను పండితులు గూడ నతిసులభముగ నలవరచుకొనఁగలరు. గ్రంథవిస్తరభీతిచే నిట విశేషించి వ్రాయఁజాలను. హిందూవిశ్వవిద్యాలయాదులయందు బహుశః ఈ మార్గమునే యవలంబింతు రేమో యని తోఁచుచున్నది. లేనిచో శ్రమ యల్పఫల మగును. ఇట్లు ప్రాచీనబంధనములనుండి విడిపించి సంస్కృతమును సర్వసుగమముం జేసినఁ గాని జాతీయమోక్షము రాఁజాలదు. దేశభాష లభివర్ధనీయములే. అవి లేక ఈ కార్యమును సిద్ధింపదు. కాని, దేశభాషామాత్రమునకే తృప్తి నొందినచో బోధితులును బోధకులు నుభయులును గూడ స్వజాతిదూరు లగుదురు. ఏలయన, హిందూజాతి కంతకును నాగరకతామూలక మగు సమష్టి యాస్తి యే దన: (౧) సంస్కృతము (౨) తద్గతగ్రంథజాలము (౩) తల్లక్షిత మగు ధర్మము, ఆచారములు తప్ప వేఱు లేవు. కావున, సమష్టి యాస్తిని వదలినవాఁడు హిందూకుటుంబమును వదలినవాఁడగును. దేశభాషలలో నెంత గ్రంథజాల మేర్పడినను ఏకదేశీయమే గాని భారతీయ మెన్నటికిని కాదు. ఇంతియ గాక వైకల్యహేతువు గావచ్చును. భారతీయ సర్వస్వ మగు సంస్కృతమునకు ప్రాధమ్య మిచ్చినఁ గాని, ఐరోపాయందు సంబద్ధభాషలు గల రాష్ట్రములను గూడ నావేశించిన స్థాయివైకల్యమునకు ప్రతీకార మేర్పడదు. అట్లు భారతీయైక్యత వచ్చిననే గాని జీర్ణజాతీయపునర్నిర్మాణము సిద్ధింపదు. కనుక నీ తత్త్వ మరసి నిబంధకు లగు సస్కర్తలును నిర్వాహకు లగు నుపాధ్యాయులును సంస్కృతపునఃప్రచారమునకును ఆధునిక జాతీయగ్రంథజాలనిర్మాణమునకును ప్రయత్నింతురు గాక!

# విషయలోలత

ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రి గారు

ప్రపంచములోని మానవులందఱు, దుఃఖమును గోరక సుఖమునే కోరుచుందురు, యింద్రియానుకూల్య విషయముల నపేక్షించి ప్రతికూల విషయంబుల నుపేక్షించుట యెల్లరకుం దెల్లంబ. ఒకప్పుడు గలిగిన సుఖము ననుభవించి అట్టి సుఖమే తన కెప్పుడుం గావలయు నని కోరుట రాగ మనియు, మున్నొకప్పు డనుభవించిన దుఃఖము తన కెన్నఁడుం గలుగఁగూడ దనుట ద్వేష మనియుఁ జెప్పఁబడును. రాగ ద్వేషముల వలన సుఖ దుఃఖములు గలుగుచుండు. ఈ సుఖ దుఃఖములు అంతఃకరణ ధర్మములు. మనస్సు, విషయ సుఖంబుల మరగి యెల్లప్పుడు విషయ సుఖానుభవముఁ గోరుచుండు. ఈ విషయ సుఖానుభవము వలన సహింప నలవికాని దుఃఖము లొదవు చుండినను, విషయ సుఖంబులం గోరు మానవుని స్థితి యాశ్చర్యకరమై శోచనీయ మగు చున్నయది. మానవుని మనం బింద్రియముల ద్వారా, బాహ్యవిషయములలోనికిఁ బ్రవేశించి విషయ సుఖంబుల ననుభవించుచుండు. కొన్నియెడల ఇంద్రియసహాయంబు లేకున్నను, పూర్వానుభూత విషయంబులఁ దలఁచుకొని గాని క్రొత్త విషయంబుల సంకల్పించుకొని గాని సుఖంబులఁ దేలుచుండు. చిరకాలము ఇంద్రియ సాహాయ్యంబున నసద్విషయంబులం బ్రవేశించి వివిధానర్థంబులం జెందు మనస్సును, వానినుండి మఱలించి సద్విషయంబునం బ్రవేశింపఁ జేయఁ గడంగవలయు. అభిమతార్థంబుల నొసంగి యజమానుని తన స్వాధీనముఁ గావించుకొన నిచ్చగించు సేవకబృందము చందంబున, ఈ యింద్రియ భటవర్గంబును స్వచ్ఛందవనితాది విషయ సుఖంబుల చవిఁ జూపి జీవుని తమ యధీనముఁ జేసికొని యాడింపఁ బ్రయత్నించుచుండు. వివిధానర్థంబులఁ గలిగించు విషయ సుఖంబుల నిచ్చు నింద్రియములకు వశ్యుఁడై వర్తించు పురుషుఁడు, చిరకాలము లంచములఁ దినమరగి యెన్నరాని కీడులఁ గలిగించు సేవకులకు లోఁబడిన యజమానునిపలెఁ బరతంత్రుఁడై యుక్తాయుక్త వివేచనాశక్తి లేక బేలయై చెడిపోవును. పార్థివాణుమహత్త్వముచే సృజియింపఁబడిన మనస్సును ఇంద్రియ వర్గంబును స్వకారణంబులగు నైహిక విషయములం బ్రవేశించి క్రోలుట స్వభావ ధర్మము. విషయసంచయము అను నాహారము లేక యింద్రియ వర్గంబును ఇంద్రియ వర్గంబు లేక మనస్సును నిలువఁ జాలవు. చిత్తంబు విషయాసక్తంబయిన దుఃఖరూపబంధంబునకును, విషయ విముఖమై యీశ్వరాయత్తంబయిన శాశ్వత సుఖం బగు మోక్షంబునకును గారణ మగును. ఇట్లు పరిశీలింపఁగ, విషయ జాలంబ వివిధానర్థంబులకుఁ గారణ మని తేలుచున్నను, కేవల వైరాగ్యసంపన్నుఁ డగు జ్ఞానికిఁ దక్క, లోకయాత్ర సలుపు తదితర మానవ కోటికి విషయ జాతంబును విడనాడుట కడు దుస్సాధ్యము. కావున, విషయములం దెయ్యవి సద్విషయములు ఎయ్యవి దుర్విషయంబులు అని వివేచనా శక్తిచే నిర్ణయించి, ధర్మజ్ఞాన సాధనంబులగు సద్విషయంబుల గ్రహించి, దుఃఖానర్థ కారణంబులగు దుర్విషయంబులఁ బరిత్యజించి, ధర్మరతుఁడై యుండువానిని విషయములు బాధింపవు. విషయములయందలి దోషముల గ్రహించి, వానియం దాసక్తుఁడు గాక, తామరపాకుపై నుండు జలబిందువుం బోలె నంటియు నంటక ప్రవర్తింపవలయు. దయామయుం డగు పరమేశ్వరుఁడు ప్రాణుల హింసింప, నింద్రియంబులను ఇంద్రియార్థంబులను సృజించె నని తలంచుట యవివేకంబు దప్ప వేఱొకటి కాదు. పరమేశ్వరుని సృష్టిలో వ్యర్థమయిన పదార్థ మొకటియును గానరాదు, కాని, వివేక దృష్టిచేఁ బరిశీలించినఁ బ్రతిపదార్థము నేదేనొక యుపయోగముకొఱకే యని బోధపడక మానదు. విషంబు సయిత మొకప్పుడు వైద్యుని యమృతముం బోలె నుపయోగించును. అయ్యది ప్రయోక్త యొక్క బుద్ధికౌశలమును బట్టి యుండును. ఓషధులును అక్షరంబులును కూర్చువానియొక్క ప్రజ్ఞను బట్టి విషంబుగను అమృతంబుగను బరిణమించుచుండు.

భగవంతుండును మానవాదిశరీరంబుల సృజించినపుడు సర్వజ్ఞుం డగుటచేతఁ జక్కఁగ నాలోచించి, ఈ యింద్రియం బిందు కొఱకు సృజించెను. దీని నిందులకు దీని నిందులకు నని యేర్పఱచి యుద్దేశపూర్వకముగానే సృజించెను. వానిని, అనఁగా నే యింద్రియమున కెయ్యది విహిత ధర్మమో దానిని సద్విషయముగాఁ గైకొనఁ దగును. ఈ విషయము తత్త్వసారాయణం బను నామాంతరము గల జ్ఞానవాసిష్ఠమునందు కర్మకాండంబున వివరింపఁబడి యున్నది. మన యిప్పటి యవస్థయందు ఇయ్యది విహితం బియ్యది యవిహితం బను వివేకము కడు దుర్లభంబు. మన యిండ్లయందు అన్నము వండుకొనుట పాలు కాఁచికొనుట నీరు కాఁచుట దీపము వెలిఁగించుకొనుట మొదలగు పచన క్రియలకై యుద్దేశింపఁబడి యుండు నగ్నిని కొంపలఁ గాల్చుటకు పొలములలో గడ్డివాములఁ గాల్చుటకు నుపయోగపఱచుచున్నట్లును, స్నానపానాది కార్య జాతంబున కుపయోగపడుటకై యేర్పడిన నదీ నద కూప తటాకాదికంబులగు జలాశయంబులు కారణవిశేషవశంబున మనుజులందుఁ బడి మునిఁగి ప్రాణంబులఁ గోలుపోవ నుపచరించుచున్నట్లును, పండ్లు కూరగాయలు లోనగు వానిని గోయుట కుపయోగింపవలసిన మన యిండ్లలో నుండు కత్తిపీటలు దుష్టులచేతఁ బడి కుత్తుకలు గోయుట కుపకరించుచున్నట్లును, మన శరీర సంరక్షణంబునకై మన జీవయాత్రకై దయామయుం డగు భగవంతునిచే నొసంగఁబడిన యింద్రియంబులు, దుస్సహవాసవశంబునఁ గలిగిన దుర

భ్యాస బాహుళ్యంబున జనించిన దుర్వాసనా బలంబునకు లోఁబడి, సదా దుర్విషయంబుల వెంటనే పరువిడు చుండును. ఇది కేవలము మన ప్రాగ్భప్రవాహానుగతం బని యెంచఁ దగదు దేని కేని ప్రతీకారము గలదు. లేదేని ప్రత్యక్ష నిదర్శనంబులుగా నుండు వైద్యాది సకల శాస్త్రంబులు వ్యర్థంబు లనవలయుఁ గదా.

కావున నింద్రియార్థంబు లగు విషయములందు సదసద్వివేకము చేసికొన మనము యత్నించి చూతము.

మన శరీరమునందుఁ బది యింద్రియములు కలవు. అందు

1. త్వగింద్రియము (చర్మము) స్పర్శజ్ఞాన సాధనము
2. చక్షురింద్రియము (కన్ను) రూపజ్ఞాన సాధనము
3. జిహ్వేంద్రియము (నాలుక) రసజ్ఞాన సాధనము
4. ఘ్రాణేంద్రియము (ముక్కు) గంధజ్ఞాన సాధనము
5. శ్రోత్రేంద్రియము (చెవి) శబ్దజ్ఞాన సాధనము

} జ్ఞానోదయమునకుఁ గారణములు.

ఇవి యైదును జ్ఞానేంద్రియములు నాఁబడును.

1. వాగింద్రియము (నాలుక) మాటలాఁడు సాధనము
2. పాణీంద్రియము (చేతులు) పని చేయు సాధనము
3. పాదేంద్రియము (కాళ్లు) నడచు సాధనము
4. పాయ్వింద్రియము (మలాదివిసర్జనేంద్రియము) మలము మూత్రము విడుచు సాధనము
5. ఉపస్థేంద్రియము (స్త్రీపురుష జననేంద్రియము) మైథున సాధనము

} కర్మకు సాధనము లింద్రియము లగును.

ఈ యైదును కర్మేంద్రియము లనఁబడును.

జ్ఞానేంద్రియములవలన స్పర్శాది గుణజ్ఞానమును కర్మేంద్రియములవలన వాగాది కర్మజ్ఞానమును నంతఃకరణమునకుఁ గలుగును. ప్రపంచమునందలి సకల విషయములును గుణకర్మ రూపములే యగుట, నవి యెల్ల నిం దంతర్భావముం జెందును. త్వగింద్రియాదు లైదును శరీరసంరక్షణమునకుఁ గాను తత్తద్విహిత ధర్మములతో నియమింపఁబడిన రక్షకభటు లనఁదగును.

1. త్వగింద్రియము—మన శరీరమునకు అనుకూల మగు స్పర్శమును అననుకూల స్పర్శమును వివేచించి తెలుపును. అపుడు అనుకూల మగుదానిని గ్రహించి ప్రతికూల మగుదానిని విడుతుము. పద్మపత్రములు కండ్ల కద్దికొందుము. దూలగొండికి దూరముగఁ దొలఁగుదుము. పృథుమార్గమున నడుతుము పల్లేరుగాయ లుండు దారిని విడుతుము. ఇట్లే శరీరయాత్రకయి శరీరానుకూలము లగు పదార్థములను గ్రహించుటకును తదితరములను విడనాడుటకును త్వగింద్రియము విహితము. ఇది సద్విషయము.

ఇంతియ గాని శరీరానుకూలము లయినవానియందును, శరీర యాత్రామాత్ర ఫలకములు గాక "భోగే రోగభయ" మ్మనునట్లు రోగనిదానము లగు భోగములకుఁ బోవుట యసద్విషయము. శయ్యవలసిన భూతలము చాలును. హంసతూలికాతల్పము భోగార్థము.

2. చక్షురింద్రియము—సనిమిత్తముగా ఖడ్గపాణియయి వచ్చువానిని విరోధి యని యెఱింగించు నీ చక్షురింద్రియభటుఁడు చూత ఫలాదికమును గనఁబఱచి యనుకూలము లని తెలుపును. గురువుఁ జూచి నమస్కరించుమని తెలుపును. త్రోవలో నూయి కలదు, గోయి కలదు, గోడ కలదు, మేడ కలదు, అట్లు పోవలదు, అపాయము కలదని హెచ్చరించును. భోజనపదార్థము క్రిమ్యాదిగ్రస్త మయినచో, నది తెలిపి త్యజించు మనును. ఇట్లు శరీరానుకూల్యమును దెలుపుటయు ప్రాతికూల్యమునుఁ దెలిపి యాపదనుండి తొలఁగించుటయు చక్షురింద్రియ ధర్మము.

వినోదములను జూచుట, వ్యర్థ పదార్థములను ఘోర పదార్థములను వినోదార్థము చూడనోపుట లోనగునవి యసద్విషయము.

3. జిహ్వేంద్రియము—వస్తువుల రుచిని దెలిపి, ఇది శరీరోపయోగి శరీరానుపయోగి యను వివేకము పుట్టించి, శరీర ధారణమునకావశ్యకము లగు పదార్థములను భుజించు మని యీ రసనేంద్రియ భటుఁడు తెలుపును. కావున మామిడిపండు తిందుము. ముషిణిపండు విడుతుము. విషాదిదిగ్ధము లగువానిని తోడనే పట్టియిచ్చును. ఇట్టివి దీనివలని పనులు.

చుట్టలు గాల్చుట కాఫీ తేయాకు గంజాపత్రము తాంబూలము మొదలగు మాదక పదార్థ సేవనము సేయుటకై కాదు. కడుపు నిండ భుజించియుఁ జిరుతిండికై కాదు. సులభముగా జీర్ణములు కాఁదగినట్లు వంటఁ జేసికొని భుజించుటకు మాఱుగా, తీవ్రముగా మసాలా చేర్చియు నేతి వేపడములు చేసియు నిర్నిమిత్తముగా నపూపాదిక మగు భక్ష్య విశేషంబులఁ గూర్చియు మెసవుటకై కాదు. ఇవి యసద్విషయములు: భోగములు రోగ జనకములు.

4. ఘ్రాణేంద్రియము—వస్తువులందలి గంధ విశేషములను దెలుపు రక్షాభటుఁడు. వీనివలన సువాసన గల పండ్లను పదార్థములను భుజింతుము. దుర్వాసన గలవి కుళ్లిన వని విడుతుము. సహజ దుర్వాసన గలవానిని దూరీకరింతుము. పశువులు పులి వాసనను పసిపట్టి పులి యని బెదరి పాఱును. కుక్కలు నట్లే మనుజులకు శరీరాపాయకరము లగువానిని వాసనవలనం దెలిసి తొలఁగింతును. ఇట్టివి సద్విషయములు.

దుర్వాయువులను మఱుగుపఱచు అత్తరు పునుగు, మొదలగు సుగంధద్రవ్యములను సేవించుట దుర్వాసనల సహించి తొలఁగకుండుట లోనగునవి యసద్విషయములు.

5. శ్రోత్రేంద్రియము—ఇతరులు తమ యభిప్రాయావిష్కరణమున కయి పలుకు పలుకుల నాలించి కర్తవ్యం బొనరించుట సదుపదేశ శ్రవణము, హరికథా శ్రవణము, ఏడ్పు మొదలగు నవి విని, కనికరించి సహాయ పడుట, పాము కూఁత విని తొలఁగుట, పులి గాండ్రింపు విని మఱలుట మొదలగు నవి సద్విషయములు. కొండెములు వినుట, చిత్తాపకర్షకంబులగు పాటలు కేవలము లగు లోకాభిరామాయణముల శ్రవణము లోనగునవి యసద్విషయములు.

మఱి కర్మేంద్రియములు

1. వాగింద్రియము—తన యభిప్రాయము దెలుపుట, పెద్దలఁ బొగడుట, భగవద్గుణ కీర్తనము, స్వాధ్యాయము లోనగునవి సద్విషయములు.

ఇతరులను నిందించుట, ఇతరులకు చిత్తాపకర్షకంబు లగు వాక్యములఁ బాడుట, ఇతరులకు మనస్తాపజనకము లగు మాటలను బలుకుట లోనగునవి యసద్విషయములు.

2. పాణీంద్రియము — శరీరధారణోపయోగ మగు కర్మము చేసికొనుట, పెద్దలకు నమస్కరించుట, దానము చేయుట, పతితుల నుద్ధరించుట లోనగునవి సద్విషయములు.

ఇతరులకు బాధకరము లగు పనులు చేయుట, దొంగిలుట, ప్రాణహింస లోనగునవి యసద్విషయములు.

3. పాదేంద్రియము — శరీర యాత్రకు వలయు చోట్లకుఁ బోవుట, దేవ గురు మందిర గమనము, తీర్థ యాత్రాది గమనము లోనగునవి సద్విషయములు.

వినోదములు చూడ నేగుట, తన్నుట, పాద ఘాతమునఁ బుడమిని మొట్టుట లోనగునవి యసద్విషయములు.

4. పాయ్వింద్రియము — దేవబ్రాహ్మణాలయముల దరిని వీధులయందును సస్యాదులందును మలమూత్రముల విడుచుట యసద్విషయము. తదితరము లగు తావుల నొనరించుట సద్విషయము.

5. ఉపస్థేంద్రియము — సత్సంతానసాధనత్వము సద్విషయము; కామాతురత యసద్విషయము.

వీని వివరము మానసిక శాస్త్రాది ఇతర గ్రంథములవలన నెఱుంగందగు. నిరవకాశం బగుట నింతట విరామము. ఇంద్రియములకు విహిత కర్మములనుండి యతిక్రమించి నడచుట వ్యభిచార మనఁబడును. సర్వేంద్రియములను వ్యభిచరింపనీయక స్వస్వధర్మంబులఁ బ్రవర్తిల్లఁజేయుట యావశ్యకము. అది సత్సహవాస బలంబునను సదభ్యాస బలంబునను జేకూఱును.

తాను వివాహ మాడిన ధర్మపత్ని నతిక్రమించి సంచరించుట వ్యభిచరించుట యనఁబడు నని మాత్రము పలువురు వాడుకొందురు గాని, యుపస్థేంద్రియ వ్యభిచారమువలెనే సకలేంద్రియములును వ్యభిచరించు చున్నవి. ఇంద్రియంబు లసద్విషయములందు వ్యభిచరింపకుండునట్లుగ నభ్యాసము చేయుచు వత్తుమేని, విషయలోలత తగ్గి మన యంతఃకరణంబు నిర్మలంబుగా నుండును.

ఈ శబ్దాది విషయంబు లే భూతంబులవలన నుత్పత్తి యయినది యొకించుక విచారింతము. ఆకాశమువలన శబ్దంబును వాయువువలన స్పర్శమును అగ్నివలన రూపంబును ఉదకమువలన రసంబును పృథివివలన గంధంబును, ఈ పంచతన్మాత్రలు గలుగుచున్నవి. ఈ పంచతన్మాత్రలు శ్రోత్రాదీంద్రియములకు విషయములై జీవునకు సుఖముఁ గలిగించుచున్నవి. పాంచభౌతికము లగు నీ విషయములందు బద్ధానురాగు లగు మానవులు స్వకర్మవశంబున వివిధంబు లగు సుఖదుఃఖంబుల ననుభవించుచుందురు. సద్విషయంబులవలన సుఖంబును అసద్విషయంబుల వలన దుఃఖంబును ననుభవింతు రని పూర్వోక్త ఇంద్రియధర్మములఁ జెప్పునపుడు విశదీకరింపఁబడినది. సృష్టియందు ఏకేంద్రియ, ద్వీంద్రియ, త్రీంద్రియ, చతురింద్రియ, పంచేంద్రియ ప్రాణులు గలవు. అందు మానవుఁడు పంచేంద్రియ ప్రాణికోటిలోఁ జేరినవాడు. ఒక్కొక్క ఇంద్రియ గుణంబుచేతనే కొన్ని ప్రాణులు బద్ధానురాగము లయి యనర్థంబులఁ జెందుచున్నవి. గోతిగట్టున నుండి పిల్లనగ్రోవి వాయించు కిరాతుని గీతమును వినుటవలన జింకలు వానివలలోఁ జిక్కుకొనును. కొమ్మలచేతఁ గప్పఁబడిన గోతులపైఁ గన్పడు అరఁటికంబములను ఫలంబులను కరిణిని జూచి వాని ననుభవింపవలయు నను వాసచేఁ, దుండంబున భూస్పర్శ సేయుచుఁ బోయి యేనుఁగులు గోతిలోఁ బడును. ఆకసమున స్వచ్ఛందముగ సంచరించునవి యయ్యు, పక్షులు ఉరులచేఁ గప్పఁబడిన మాంసపుఁ దునకలను జూచి, యాసచే వానిపైఁ వ్రాలి యుచ్చులలోఁ జిక్కుకొనును. నీట సంచరించు మత్స్యము లెఱల రుచి మరిగి, గాలాపు రవ్వల కొనల నుండిన మాంసపు ముక్కలఁ జవిఁ గొని యందు తగులుకొనును. తుమ్మెదలు పూగుత్తుల నెత్తావుల వాసన చూచుచు నందలి తేనియలఁ గ్రోలుచు సంపెంగపువ్వుపై వ్రాలి దాని నాఘ్రాణించి మృతిఁ జెందును. ఇట్లు, శబ్దంబువలన కురంగంబులును, స్పర్శమువలన మాతంగంబులును, రూపమువలన పతంగంబులును, రసమువలన మత్స్యంబులును, గంధమువలన మధుపంబులును నాశాపాశబద్ధము లై యొక్కొక్క యింద్రియగుణంబుచే నశించుచుండ, పంచేంద్రియ గుణంబులకు లోఁబడియుండు మానవుని మాట యే మని చెప్పవచ్చును?

పంచేంద్రియంబులవలనఁ గలుగు ననర్థంబు లన్నియు, నంతరింద్రియం బగు మన పొక్కటియే, తనకుఁ దాను కల్పించుకొని చిక్కువడిన సాలెపురుగు చందంబున, ననుభవించును. కావున ధీరుఁడు, వివేకయుక్తమనంబున నింద్రియార్థంబులకు లోఁబడక, వానియందుఁ గల దోషముల నిర్వర్ణించి విషంబులఁబోలెఁ జూచునది. స్రక్చందనవనితాభరణాంబరాది విషయంబులకన్న నీ విషయంబులఁ గనుఁగొను నింద్రియంబులు శ్రేష్ఠంబులు; ఇంద్రియములకన్న వీని కధిష్ఠాన మై నడపు మనస్సు శ్రేష్ఠతరంబు. మనస్సుయొక్క చాంచల్యమును వికారములను దోషములను గనుఁగొను బుద్ధి శ్రేష్ఠతమము. ధీవృత్తులను ప్రేరేపించుచు నన్నింటికి సాక్షి యైన చైతన్యస్వరూప మగు నాత్మ సర్వోత్కృష్టము. ఇట్లు పరిశీలింపఁగ, విషయేంద్రియ మనో బుద్ధి వృత్తులకు అధిష్ఠాన మై స్వకీయ చైతన్య తేజో విశేషంబున నన్నింటిని ప్రకాశింపఁజేయుచు, అన్నింటి గుణదోషంబులఁ దెలిసికొను నాత్మ యొక్కటియే సర్వోత్కృష్టంబు గావున, అసదర్థంబు లగు నింద్రియార్థంబుల దూరీకరించి, యాత్మస్వరూపానుసంధానము సేయుటవలన మనస్సును విషయములనుండి మరలించి, శాశ్వతానందసుఖదం బగు సత్పథంబునఁ బ్రవర్తింపఁజేయ వలయును. మనస్సు ఏదేని కారణంబునఁ గాలుష్యముఁ జెంది విషాదపూరిత మయినపుడు, విషయంబులు సన్నిధియం దుండినను వానిపైకిఁ బోవదు. మన స్సెవ్విధంబుగ నుండిన, లోకం బా చందంబునఁ గన్పించు. సంతుష్టాత్ములకు సంతోషానందభరితముగను, దుఃఖితాంతఃకరణులకు నెటఁ జూచినఁ దృష్టి లేక వ్యసనాంధకార బంధురితముగను, కామాత్ములకుఁ బ్రణయమయంబుగను, ధనసంపాదనాపరాయణులకు ద్రవ్యమయంబుగను, బ్రహ్మానుభవతత్పరులకు బ్రహ్మమయంబుగను లోకము కన్పట్టుచున్నది. లోకమందలి వస్తువు లేకాకారముగ నుండినను, వారి వారి చిత్తములకుఁ దగినటుల వస్తువు

లాయా విధంబుగఁ దోఁచుచున్నందున, మనస్సు ననుసరించి లోకము విస్తరింపఁబడుచున్నది గాని, లోకము ననుసరించి చిత్త ముండుట లేదు. సుషుప్తికాలమందు మనస్సు లీనమై యుండుటవలన లోకము లున్నను మనోగోచర మగుట కానము. కావున విషయమయం బగు లోకంబు మనస్సు ననుసరించి యున్నది. తరణీమణి నొకతెను గాంచి, స్తన్యపాన మొసంగుటంబట్టి యాహార పదార్థంబని శిశువును, మాతవలెఁ బ్రోచుటంజేసి వాత్సల్య పదార్థంబని బాలకుఁడును, స్వర్లోక సౌఖ్యంబుల నొసంగు భోగ పదార్థంబని తరుణుఁడును, మేదోమజ్జాస్థి మాంస పూరితం బగు శవాకారం బని విరాగియుఁ దలఁచును. కాంత యొకతె యయ్యు, వారి వారి చిత్తవృత్త్యనుగుణంబుగ భావనలు గోఁచినవి. పవిత్ర మగు భాగవత గ్రంథంబును గని, మిఠాయి నమ్ముకొను వర్తకుఁడు దాని బరువును బట్టి యొక మణుఁగు మిఠాయి పదార్థములను పొట్లముగఁ గట్టుట కుపయోగించు కాగితములు కల వనియు, అచ్చొత్తించు వారు దాని కాగితముల రకమును ముద్రింపించుటకగు వ్యయంబులను లాభంబులను గని యింతి వెల సేయు ననియు, బైండు సేయువారు క్యాలికో బైండనియు స్ప్రింగు చర్మబద్ధ మనియు సుందరముగఁ గట్టఁబడిన దనియు మాత్రమే తర్కింతురు. భక్తిజ్ఞానసంపన్ను లగు మహానీయు లందలి భక్తిరసపూరితంబు లగు పద్యంబులను ఆధ్యాత్మిక జ్ఞాన బోధకంబు లగు విషయంబులను భగవన్మహిమను వేనోళ్ళఁ గొనియాడుదురు. ఇట భాగవతగ్రంథం బను విషయ మొక్కటి వారి వారి చిత్తవృత్తికిఁ దగినట్టుల స్ఫురించినది. కావున, లోకంబునఁ గల విషయజాతంబులై, విషయపరాయణులకుఁ గల చూపునకును ధర్మజ్ఞానసంపన్ను లగు జితేంద్రియులకుఁ గల చూపునకును మిగుల భేదము కలదు. తత్త్వజ్ఞాని ప్రతివిషయంబునను దానికిఁ గల వినశ్వరత్వమును క్షణికస్వభావమును దోషమును గని పెట్టుచుండు. విషయాసక్తుఁడు గుణదోష వివేచనా శక్తి లేక, విషయంబులఁ దవిలి వానిని గ్రోలుచు నవి నశించినంతట బేలయై దుఃఖించును. భగవన్మాయ కాంతాకనకరూపముగను వివిధవిషయ నిచయంబుగను పరిణమించి యున్నది. విషయంబులు శాశ్వతములు గాక యస్థిరంబులుగ నుండును గనుకనే, తత్త్వజ్ఞులు వాని స్వభావమును దెలిసికొని విషమువలెఁ జూచి తొలఁగుచున్నారు. జీవనము బుద్బుదప్రాయము, యౌవనము ఝరీవేగ తుల్యము; సంపదలు విద్యుచ్చంచలములు, భోగంబులు రోగనిదానంబులు, ధనములు నిధన దాయకములు, లక్ష్మి దీపశిఖవలె నస్థిర. ఇవ్విధంబున విషయజాతంబునఁ గల దోషము లన్నియు విమర్శించి, వివేకులు విషమువలెఁ జూచి తొలఁగుచు, సక్తులు గాక మంటిలోని కుమ్మరపురుగు వలెను పద్మపత్రములోని జలబిందువువలెను అంటియు నంటక వ్యవహరింతురు. స్రక్చందనవనితాదివిషయజాతముయొక్క స్వరూప స్వభావములు దెలిసినవారు రాకకు హర్షమును పోకకు విషాదమును జెందక సమచిత్తులుగ నుందురు. జనకాదులు గృహస్థాశ్రమమున నుండినను, విషయభోగాన్వితం బగు రాజ్యము నేలుచుండినను, సత్సహవాసంబునఁ గలిగిన యాధ్యాత్మికజ్ఞానబలంబున విషయాసక్తులు గాక, హర్షవిషాదములయందును సుఖదుఃఖములయందును శీతోష్ణములయందును సమచిత్తు లయి యుండిరి. రాజర్షి యగు జనక మహారాజు ఒక పాదమును శ్రీచందనపంకమందును మఱియొక పాదమును సముజ్జ్వలిత పావకమందును నునిచి హర్షవిషాదముల నిట్టుల సహింపవలె నని లోకమునకు నిదర్శనముఁ జూపె. మఱియు, మేడలు మిద్దెలు రథ గజ తురగ ఆభరణాది వివిధ పదార్థముల తోడ పట్టణము దహన మగుచున్న దని సేవకులు తెలిపిన, ఇంచుకైన విషాదముఁ జెందక స్వస్థచిత్తుఁడై యాజ్ఞవల్క్య మహర్షి యొద్ద వేదాంతము శ్రవణముఁ గావించుచుండెను. పట్టణము దహన మగుచుండఁ జింతింప వేల యని మహర్షు లడుగ, "రోగక దుఃఖములు ప్రాప్తించినట్టుల, సుఖములు ప్రాప్తించును; సుఖదుఃఖములు దైవాయత్తములు. మనుష్యుఁడు చింతించి యేమియుఁ బ్రయోజనము లేదు. ధైర్య మవలంబించి సమచిత్తుఁడై యుండవలయు; నా వస్తువు లని వానియందు దృఢాభినివేశము లేదు. పాంచభౌతికము లగునవి నశించుటయే స్వభావముగ కలవి గనుక, చింతించి వాని స్వభావము పోఁగొట్టఁ గలుగుదునా?"యని జనకమహారాజు వారితో నుడివెను. దీనింబట్టి యా రాజర్షికి విషయలోలత లేమిం జేసియే, చింత యా మహానీయుని బాధింపలే దని నిశ్చయించుకొనిరి.

విషయలోలత యన, స్రక్చందన కాంతా కనకాది విషయములలో నేదో యొకదానియందుఁ జిరకాలము సంసక్తచేతస్కుఁడై దాని ననుభవించి, యది నశించిన మఱియొక విషయము ననుభవించి లనివిఁ జెందక యింకను ననుభవింపవలయు ననెడి తృష్ణ. ఈ తృష్ణ కంతము లేదు. అగ్నియం దెన్ని చిదుగులు వైచినను దృప్తి కలుగనట్లు, ఈ తృష్ణాగ్నియం దెన్ని విషయసుఖ సమిధలు వైచినను దనివి కలుగదు. ఇంద్రియములతోడ మనస్సు విషయములమీఁదికిఁ బరుగిడి శక్తిని గోల్పోయి యలయుచు శాంతిఁ జెందక భ్రమించుచుండును. విషయలోలతవలన దుఃఖము లొదవుచుండి బాధపడుచున్నను, విషక్రిమి న్యాయంబుగ చిరకాల పరిచయంబు లగు విషయవాసనల విడువఁజాలక, యా దుఃఖములనే సుఖము లని తలఁచుచు ననుభవించుచుండును. విషయసుఖములఁ జిరకాల మనుభవించి వివిధ దుఃఖములఁ జెంది యందుఁ దనివిఁ జెందక, శాశ్వత సుఖానంద పదార్థ మరయుటకై ప్రయత్నించును. ఇదియ విషయవిముఖత. విషయానుభవమువలనఁ గాని వైరాగ్యము కలుగ దని తత్త్వజ్ఞులు నుడువుదురు. నిండు చెఱువులోని నీరు గండ్ల ద్వారా వెలికిఁ బోయి గ్రామములను భూములను ముంచినట్లు, మనస్తటాకములోని తేజోద్రవము ఇంద్రియముల ద్వారా వ్యర్థముగ వెలుపలికిఁ బోయి యనేకానర్థములఁ గలిగించును. గండ్లు పూడిచి తటాకపు గట్టును బాగు పఱిచి శ్రేష్ఠమయిన జలరంధ్రముల నేర్పఱిచి యుక్తకాలమునఁ బైరులు పండుటకు వలసిన జలమును విడిచి తక్కిన కాలముల యందు రంధ్రములు మూసిన, తటాకములోని జలము సమృద్ధముగ నుండి ప్రాణికోటికి స్నానపానాదుల కుపయోగపడి, వర్షము కురియక క్షామము గలిగినను, దానినుండి యెంతయు రక్షించును గదా? అవ్విధంబున, మనస్తటాకమునందలి జలంబును వ్యర్థంబుగ విషయములమీఁదికిఁ బోనీయక, పురుషార్థంబునకును పరోపకారకార్యములకును దేహయాత్రకును నెంత కావలయు నంతమాత్రము వదలి

తక్కిన కాలమందు ఇంద్రియముల నిరోధించి యంతర్ముఖము గావించిన మనస్తటాకమునం బ్రజ్ఞాజలములు సమృద్ధముగ నుండి ధర్మార్థ కామ మోక్షములు సాధించుటకును యోగశక్తిని బడయుటకును భూతకోటి కుపకరించుటకును దగిన మనోబలము కలుగును. దానివలన నెంతటి కార్యములనైన సాధింప సమర్థుఁడగును దయామయుఁడగు పరమేశ్వరుండు ప్రాణులు కడదేఱుట కింద్రియవర్గంబును మనస్సును నిచ్చి యుండ నద్దాని యుపయోగ మరయక వ్యర్థముగ నుపయోగించు మూఢునికన్న వేఱొక కృతఘ్నుఁడు కలఁడా? భగవదుద్దేశ మరయ వలదా? అమూల్య మగు నింద్రియవర్గంబును మనస్సును యౌవనావస్థయందు విషయవ్యసనార్తుఁడై విషయంబుల పైకిఁ బోనిచ్చి దుర్వినియోగము గావించిన, తురీయావస్థయందు దుర్బలుఁడై యెట్టి కార్యముల నొనరింప సమర్థుఁడు గాక, పరతంత్రుఁడై దుఃఖించును. కాఁబట్టి, లోకయాత్రకును దేహగేహయాత్రలకును మాత్రము ఎంత కావలయు నంత హితమితముగ నుపయోగపఱుపవలయును గాని వ్యర్థముగ నుపయోగించిన, భగవదుద్దేశమునకు వ్యతిరిక్తముగఁ బ్రవర్తించినవార లయి దుఃఖముల పాలగుదురు. ఆరోగ్యమును గాంక్షించువాఁడు పదార్థముల నిచ్చ వచ్చినట్లు భుజింపక హితముగను మితముగను పథ్యరూపముగను బుచ్చుకొనునట్లు, పరమార్థమును గోరువాఁడు హితమితముగను పథ్యముగను విషయముల స్వీకరింపవలయుఁ గాని, భోగాసక్తితోఁ గైకొనిన నమితముగను స్వేచ్ఛగను మెసవి రోగములఁ దెచ్చుకొనినట్లు, భోగంబులవలన దుఃఖరోగములు కలుగును. స్వార్థత్యాగము చేసి, పరోపకారపరాయణుఁడుగ నుండువానికి విషయభోగేచ్ఛ తగ్గి యుండును విశేషముగ ధనము వ్యయముచేసి పిలువ గల బట్టలు కట్టక సామాన్యవస్త్రములు ధరించియు, అభరణములఁ బెట్టుకొనక పరుల కుపకరించుటయే పరమాభరణ మనియు, నెక్కువ భోగము లపేక్షింపక దేహధారణారోగ్యములకుఁ గావలసినంత మితముగ స్వీకరించియు తక్కినదంతయు ప్రాణులకొఱకే యుపయోగించి, వారి యోగక్షేమంబులఁ జూచి యానందించును. అట్టివానికి తన భోగసౌఖ్యములకన్న వేయి మడుంగు లానందము కలుగును. విషయలోలుపుని చిత్తము విషయాసక్తమై దానినే గ్రోలుటవలన, విషయాంతరమునకుఁ బోవఁజాలక దుర్బలమై చెడి యుండును దుర్బల చేతస్కుఁడు మనస్స్థైర్యము లేకపోవుటచే ధర్మకార్యముల నొనరింపఁజాలఁడు. విషయలోలునికి చిత్తస్థైర్యము ధైర్యము మేధ ప్రజ్ఞ ధర్మచింత సత్యప్రవర్తనము పరశ్రేయస్సహనము ద్వంద్వసహనము కలిగియుండవు. జితేంద్రియునికిఁ బైఁ జెప్పిన వన్నియుఁ గలిగి యుండును. ఇంద్రియములకు తాను లోఁబడక యింద్రియముల నన్నింటిని లోఁబఱచుకొని వశవర్తులఁ గావించుకొనినవానికి స్వారాజ్యసౌఖ్యము కలదు ఇంద్రియములనే స్వాధీనపఱచుకొనఁ జాలనివాఁడు పెక్కువేల జనులు గల స్వారాజ్యము నెట్లు పరిపాలింపఁ గలఁడు? విషయలోలత లేనివాఁడు స్వధర్మమునఁ బ్రవర్తించి కులోచిత వృత్తులను లోకోపకారక వ్యాపారములను నభివృద్ధి గావించును. విధివిహితకార్యముల నొనరించుచు, వానిఫలము నపేక్షింపక పరమేశ్వరాంశభూతు లని ప్రాణుల కుపకరించు ధర్మాత్మునికి ద్వంద్వసహనము కలుగును. అప్పుడు లోకుల దూషణభూషణలు గాని లాభనష్టములు గాని సుఖదుఃఖములు గాని స్వత్వ పరత్వ భేదములు గాని పాటింపక, యుదారాశయముతో ననేకమహాకార్యము లొనరించి మానవజన్మసాఫల్యముఁ జెందించుకొనును గాని, విషయలోలుపత్వముచే స్వార్థపరాయణతఁ జెంది పశుపక్ష్యాదులవలె వ్యర్థముగ కాలము బోఁగొట్టుకొనఁజాలఁడు. వ్యర్థజీవి కొలిమి నూఁదు తోలుతిత్తివలె నుండును. మానవుఁడు జనన మందుట, జ్ఞానమును బడసి లోకోపకారక కార్యములను గావించి పుణ్యవిశేషంబున నుత్తమలోకములు గాని పరమేశ్వరు సాన్నిధ్యము గాని పొందుట, ముఖ్యోద్దేశము. అటుగాక, తాను వచ్చిన కార్యమును మఱచి విషయలోలుఁడగుట, పాంథుఁడు యాత్ర సేయుచు మార్గమధ్యంబునఁ గల సత్త్రములలో విడిసి యచ్చటి వైచిత్ర్యములను జూచుచు తదేకాసక్తుఁడై తానుద్దేశించి యేతెంచిన కార్యమును మఱచుటఁబోలె నుండును. పుత్త్రమిత్త్రకళత్త్ర బంధువర్గముకూడి సంగము, బాటసారులందఱు నొక సత్త్రమున విడిసి యించుక కాలము స్నేహమునఁ గలసి మెలసి మఱల వీడి తమ తమ గమ్యస్థానములకుఁ బోవ నుద్దేశించిన విధంబును బోలి యుండు. ఖజానాలోని లక్షల ద్రవ్యమును షరాఫు లెక్కపెట్టుచు తాఁకుచు నుండి, తన ద్రవ్యము కాదని తలఁచునట్లును, రాజపుత్త్రుల నెత్తుకొని యాడించు దాసదాసీజనము ఆబిడ్డలు తమవి కావని యనుకొనినట్లును, వివేకసంపన్నుఁడు పుత్త్ర మిత్త్ర కళత్త్ర గృహ క్షేత్ర స్వర్ణాభరణాంబర వాహనోద్యాన శయ్యాసన ధన కనకాది వివిధ విషయజాతంబుతోడఁ గూడి యున్న నెప్పటికేని వియోగంబు తప్ప దనియు నశాశ్వతంబు లనియు పరిణామ దుఃఖదాయకంబు లనియుఁ దలచి, సంసక్తుఁడు గాక యంటియు నంటనట్టు లుండి, అతిథివలెఁ బ్రవర్తింపవలయు.

మనము విషయములతోఁ గూడి యెంతకాల మున్న నెప్పటికేని వియోగము కలుగక తప్పదు. విషయములు మనలను విడిచినను, మనము విషయములను విడిచినను, రెండు నొక్కటియే కదా యని తలంపఁగూడదు. విషయాసక్తుల మగు మనల నవి విడిచి పోవునపుడు మితి లేని దుఃఖము మనకుఁ గలుగును విషయ స్వరూపస్వభావములను దెలిసి వానినే మనము విడిచితిమేని మేర లేని సుఖము గలుగు. వానిచే మనము విడువఁబడుట కన్న, మనచే నవి విడువఁబడునేని ధీరుల మగుదుము, లేనిచో, బేలల మగుదుము. పురాకృత సుకృత విశేషంబున, విషయసుఖంబులు మనకుఁ బ్రాప్తము లై సుకృతము క్షయించుకొలఁదిని విషయంబులు పోయి దుఃఖములు కలుగుటవలన, విషయ సుఖానుభవమందు సుకృతము క్షీణించుచున్న దని వివేకులు తెలిసికొని యప్రమత్తులై విషయలోలురు కాక యుందురు. సంయోగములు విప్రయోగాంతములు; సుఖములు దుఃఖాంతములు. కావున విషయములు ప్రాప్తంబు లగునపుడు వియోగదుఃఖములు కలుగు ననియే భావింపఁ దగి యున్నది. సప్త విషయ వ్యసనములచే నొక్కొకరు హతులైరి. ద్యూతమువలన యుధిష్ఠిరుండును నరమాంసమందలి యాసచే బకాసురుండును మద్యపానమున యాదవులును జారత్వమున నింద్రుఁడును మృగయావినోదంబున బ్రహ్మదత్త మహీపతియు చోరత్వమున యయా

తియు పరకాంతాసక్తివలన రావణుండును, వీర లొక్కొక్క విషయ వ్యసనముచేతనే మితి లేని కష్టము లనుభవింప, నిందుఁ గొన్ని గాని యన్ని గాని కలిగియున్నవాని విషయ మే మని చెప్పవలయు? విషయాసక్తి కూడ దని భాగవత భాగత భగవద్గీతాది శాస్త్రములయందు విశేషముగఁ దెలిపిరి.

శ్లో. యే హి సంస్పర్శజాః భోగాః దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ నతేషు రమతే బుధః.

అర్జునా! విషయేంద్రియ సంయోగమువలనఁ గలుగు భోగములు దుఃఖమూలకములు; ఆదియు నంతమును గలవి. కావున వివేకసంపన్నుఁడు పరిణామదుఃఖంబు లగు విషయములం దాసక్తుఁడు కాఁ డని భగవద్గీతయందు 5 వ యధ్యాయమునఁ జెప్పఁబడినది విషయంబులఁ దలఁచువానికి వానియం దాసక్తి కలుగును. ఆ విషయాసక్తివలన విషయసుఖంబు లనుభవింపవలయు ననెడి కోర్కె వొడమును ఆ కోరిక కొనసాఁగకున్నను పరులచే నుపహతమయినను క్రోధము కలుగును క్రోధమువలన నొడ లెఱుఁగని యావేశమోహము కలుగును. మోహమువలన స్మృతి చెడును స్మృతి చెడుటవలన బుద్ధి నశించును. ఇవ్విధంబున సకలానర్థంబులకు విషయాభిధ్యానమే మూలకారణ మని భగవద్గీత 2-వ యధ్యాయమునఁ జెప్పఁబడినది. విషయముల ధ్యానించువాని చిత్తము విషయాకారముగఁ బరిణమించి, విషయములు నశించినంతనే చిత్తము సంక్షోభముఁ జెందును. భగవంతుని ధ్యానించువాని చిత్తమున భగవత్కల్యాణగుణములు నెలకొని, ధ్యేతకు శాశ్వతానందసుఖము లొడఁగూర్చును.

అనాద్యవిద్యావాసనవలన చిత్తము చెడి, స్వగతమాలిన్యమున బహిర్విషయములమీఁదికి ఇంద్రియములతోడఁ బరుగిడును. ఇంద్రియగ్రామము, ఎంతటి ప్రజ్ఞావంతు నేని పండితప్రకాండు నేని వివేకశీలు నేని తత్త్వజ్ఞు నేని మోసపుచ్చి, భ్రాంతిఁ గలుగఁజేసి విషయములలోనికిఁ బ్రవేశింపఁజేయు ప్రపంచమున, కాంతాకనకరూప విషయవ్యామోహముతోఁ దుల్య మైనది మఱియొకటి లేదు. దీపాగ్నిని జూచి యాహార మని భ్రమఁ జెంది శలభంబులు దానం బ్రవేశించు చందంబున, కామినీజన హావభావాది శృంగార వికారములకు లోనయి యువకుల మనమ్ములు కామాగ్నిని దహింపఁబడుచుండు. వైణికుండు జలంబుల నుండు మీనంబులఁ బట్టుటకై బడిశాగ్రమునం దామిషముఁ జూపి గ్రహించులాగున, మన్మథధీవరుండు కామినీజన నవ తారుణ్య లావణ్య సంజనిత వివిధ శృంగార చేష్టా సంపత్తిని జూపి, మానవుల మనోమీనంబుల హరించుచున్నవాఁడు. విద్యా వినయ సౌజన్య సౌశీల్యౌదార్యాది సుగుణగణ నికేతను లగు మతిమంతు లనేకులు, అసత్సహవాసంబున కామినీమణుల భ్రూచాప వినిర్ముక్త మార క్రూర నారాచంబు లనం బరఁగు కటాక్షవీక్షణముల విద్ధచేతస్కు లయి మోహజాలములలోఁ జిక్కి, సుగుణసంపత్తిని గోల్పోయి తుదకు బేల లగుచున్నారు. కావున, ధీరు లగు పురుషవరేణ్యులు విషయారణ్యములయందు విచ్చలవిడిగ సంచరించు చిత్తమత్తేభంబును వివేకాంకుశముచే స్వాధీనపఱచుకొనవలయు. మనోమర్కటము సంసారమహీరుహ విషయశాఖాతతియం దనవరతము సంచరించుచుండుఁ గావున, భక్తిగుణంబున వశవర్తిఁ గావించుకొనవలయు మృగతృష్ణికా జలప్రవాహంబులఁ గాంచి, మృగంబులు ప్రధావించు చందంబున మనఃకురంగంబులు విషయాశామరుభూములందుఁ బరుగిడుచుండు. కావున, ధీరులు విషయదోషంబులఁ దెలిసికొని ప్రమాదం బొరయకుండునది.

దుష్టాశ్వంబులం బూన్చిన రథంబు నెక్కి ప్రభువయుండు సుందరోద్యానమందిరంబునకుఁ బోవునెడ, మార్గము నిరుపార్శ్వముల నగాధము లగు గర్తము లున్నను అత్తఱి సారథి నేర్పరి యై పకాడు తేక పగ్గములు చేఁ బూనిన, ఆ హయంబు లభిమతప్రదేశమునకుం గొనిపోయి చేర్చును అటు గాక సారథి మద్యపానపరాయత్తచిత్తుం డైన నీ దుష్టతురంగంబులు పెడత్రోవకు నీడ్చి గర్తంబులోఁ బడవైవ, రథము తుత్తునియ లగుటయే గాక, రథికాశ్వసారథుల శరీరంబులు గాయములతో నిండి తుదకు ప్రాణహానియు సంభవించును. అవ్విధంబున ఇంద్రియ హయంబుల నమర్పఁబడిన శరీరరథము నారోహణము గావించువాఁడు జీవుఁ డను ప్రభువు. బుద్ధి యను సారథి, మనః ప్రగ్రహములను జేఁబట్టి జాగరూకత గలిగి హయంబుల చోదనంబుఁ గావించిన, నీతి న్యాయ క్షుణ్ణమార్గంబునఁ జక్కఁగఁ బోయి శాశ్వతానందభాసురం బగు పరబ్రహ్మానంద మందిరమునకుం జేర్చును. అటు గాక బుద్ధి ప్రమాదావస్థను జెందిన నీ యింద్రియాశ్వంబులు విషయాశా మహాగర్తంబులలోనికి బడఁద్రోయు నెడ బుద్ధీంద్రియజీవులకు మహా దుఃఖంబులు సంప్రాప్తము లగును. కావున, ధీరుం డగు మానవుండు ఇంద్రియంబులు పావుమార్గంబునఁ బోనియక స్వాధీనముం దుంచుకొని భటులను బోలె యుక్తకార్యంబుల నియోగించునది. మనోబుద్ధీంద్రియవృత్తులు తన్నిగ్రహంబు యోగమహిమ లోనగు విషయంబులు మత్కృత మానసిక శాస్త్రంబున విపులముగ విశదీకరింపఁబడినవి. కనుక అటఁ గాంచ నగు నని యిట విరమించితి. జీవదయాపరుం డగు పరమేశ్వరుండు మనయెడ నపరిమిత మగు కృప గలిగి దయ నొసంగిన యింద్రియవర్గంబును మనోబుద్ధులను అసద్విషయములకై వినియోగింపక, పరమేశ్వరాంశ సంభూతు లగు జీవులకును దేశక్షేమంబులకును నుపయోగపఱచి, దేహయాత్ర గేహయాత్ర లోకయాత్ర నిర్వహించుటకు మాత్ర మావశ్యకమయిన విషయజాతంబును హితమితపథ్యంబుగ స్వీకరించి, స్వార్థవిషయంబు లగు భోగంబుల విసర్జించి మానవజన్మమును సాఫల్యముఁ గావించుకొనువాఁడు కృతజ్ఞుఁ డై యీశ్వరానుగ్రహమునకుఁ బాత్రుఁ డగును. అటు గాక, స్వార్థపరాయణతచే విషయలోలుఁ డై భగవదుద్దిష్టముల నాజ్ఞల గ్రహింపఁజాలక ప్రాణికోటికి మే లొనరింపక మనోబుద్ధీంద్రియవర్గమును అసద్విషయంబులఁ బోనిచ్చి భోగంబుల ననుభవించువాఁడు కృతఘ్నుఁ డై తుదిని మేర లేని యిడుమలఁ బొందును. జగదీశ్వరుండును దీనజనావనతత్పరుండును ఆశ్రితభక్తజనపాపహారియు నగు హరి సర్వోత్తముండు కావున, ఆ పురుషోత్తము భక్తితాత్పర్యంబున నాశ్రయించిన, మనోమాలిన్యంబును విషయలోలతను బోఁగొట్టి జితేంద్రియతను మనోదార్ఢ్యమును ధర్మపరాయణతను నిచ్చి ప్రోచుఁ గాత యని యింతటితో విరమించుచున్నాఁడ.

# రూపకల్పన

ముట్నూరి కృష్ణరావుపంతులు గారు

హిందూధర్మసాధనప్రపంచమున విగ్రహారాధనము ప్రధానస్థాన మాక్రమించుకొనినది. హిందూ లోకమునందలి సర్వ సంప్రదాయములవారును విగ్రహములను పూజించుచున్నారు. పండితులును పామరులును, బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును, సన్యాసులును సంసారులును, ఈమార్గమునే త్రొక్కుచున్నారు. విగ్రహారాధనము ఏ కాలమున ప్రారంభమైనదో నిర్ణయించుటకు తగిన యాధారములు లేవు. వేదకాలమున విగ్రహపూజ లేదని కొందఱు చరిత్రకారులనుచున్నారు. కాని, అది యథార్థమని నమ్ముటకు వీలు లేదు. ఇప్పటి దేవాలయముల నలంకరించుచున్న దారు శిలా లోహ విగ్రహములవంటివి ప్రాగైతిహాసిక యుగమున లేకపోవచ్చును. కాని, అనంతమయుని నానా రూపకల్పనలతో వర్ణించియున్నట్లు ఋక్కులయందు చూచుచున్నాము. ప్రతిమార్చన ప్రాచీనయుగమునం దున్నట్లు కొన్ని సూచనలు కూడఁ గన్పట్టుచున్నను, పౌరాణిక కాలమునందు విచిత్రరీతి నభివృద్ధినొందిన దనుట నిర్వివాదాంశము. విగ్రహారాధనముయొక్క చారిత్రమును వ్రాయుట ఈ వ్యాసముయొక్క యుద్దేశము కాదు; దానిని ఖండించుట గాని, సమర్థించుట గాని యుద్దేశము కాదు. నిర్గుణబ్రహ్మతత్త్వ ప్రతిపాదనము చేసిన ఉపనిషత్కాలాంతరమున ఈ విగ్రహములు వృద్ధి నొందుటకు గారణ మేమి? బ్రహ్మసాధనయందు విగ్రహము లెట్లుద్భవించెను? అయ్యవి ధర్మసాధనయొక్క ఉచ్చదశయా, లేక నీచదశయా? అనెడి యంశములు మాత్ర మీ వ్యాసమున సూచింపఁబడును.

విగ్రహములు అనేకరూపములను ధరించి యున్నవి. కొన్ని స్త్రీరూపములు, కొన్ని పురుషరూపములు, కొన్ని ఈశ్వర వాహనములు, కొన్ని యవతారపురుషుల లీలలు. కొన్ని జగన్నాటకమునందలి విచిత్రచర్యలను జూపును. కొన్ని హావభావవిలాసములను బ్రదర్శించును. కొన్ని బీజాక్షరములతోఁ గూడిన యంత్రములు. కొన్ని యే రూపమును లేని శిలలు. కొన్ని భీకరశస్త్రాలంకృతము లైన విగ్రహములు. కొన్ని సౌందర్యమయములు. కొన్ని వికృతాకారములు. కొన్ని స్వాభావసిద్ధములు. కొన్ని అప్రాకృతములు. ఇన్నిరకముల విగ్రహము లున్నను ప్రతివిగ్రహమున కొక ధ్యానశ్లోకము కలదు. శిల్పికాని చిత్రకారుఁడుకాని తా నే విగ్రహమును నిర్మించుటకుఁ బూనుకొనునో, దానికిపూర్వము ఆ విగ్రహమునకు సంబంధించిన ధ్యానశ్లోకమును మనోగతము చేసికొనును. ఈ విగ్రహముల రహస్య మంతయు ధ్యానశ్లోకములయందే కలదు. ఈ ధ్యానశ్లోకములను రచించినదెవరు? ఉత్తమాధికారులా, లేక నిమ్నశ్రేణిలోనివారా? ఆ ధ్యానశ్లోకములందలి యుపాస్యదేవతలెవరు? ఆ యుపాస్యదేవతలు నిరాకారబ్రహ్మతత్త్వమునకు విరుద్ధము లైనవా? లేక గంభీరమైన బ్రహ్మభావముయొక్క ఉపాంగఘటనలా? ఈ యంశమును మనము తెలిసికొనఁ గలిగితిమేని, హిందూదేవతా విగ్రహములయొక్క ఆంతరంగిక రహస్యము హృద్గోచర మగును.

### సాధనప్రణాళి

బ్రహ్మసాధనప్రపంచము అతివిశాలమును గభీరమునై అధికార తారతమ్యమును బట్టి వివిధమార్గములు గలిగి ఒక మహావిశ్వవిద్యాలయమువలెఁ గన్పట్టును. ధర్మసమన్వయమువలెనే సాధనసమన్వయము కూడ అప్పుడప్పుడు కల్గుచువచ్చెను. మొత్తముమీద నీ వివిధసాధనలు జ్ఞాన భక్తి కర్మ మార్గములుగ విభజింపఁబడెను. తిరిగి ప్రతిమార్గమునందును అనేక సోపానములు కనుపెట్టఁబడెను. జ్ఞానమార్గమున శమ

PANDURANGA VITHAL'S TEMPLE PANDHARAPUR



పండరాపురము : పాండురంగ విఠల్ దేవళము

SHANTI NIKETAN, BOLEPUR



శాంతి నికేతనము భోల్పురము: సర్ రవీంద్రనాథ ఠాకూరు స్థాపితము

దమాది షట్కసంపత్తి, సాధనచతుష్టయము, ధ్యాన ధారణ యోగ సమాధులు మొదలగు సోపానము లెన్ని యో పేర్కొనఁబడినవి. ఒక్క యోగమార్గమున అనేక సాధనములు కలవు. భక్తిమార్గమున దాస్య సఖ్య వాత్సల్య మాధుర్య మహాభావములును, ఉద్బోధన స్తోత్ర వందన ప్రార్థన అనుతాప మంగళాది భజనలును, 24 రసములును, అసంఖ్యాకము లగు ప్రపత్తులును, తరంగతరంగములుగ విస్తరిల్లి ఒక యనంతసాగరము వలెఁ జూపట్టును. ఇఁక కర్మమార్గము, చతురాశ్రమము లను పంచమహాయజ్ఞములను అంతము లేని వ్రతము లను విధినిషేధములను యజ్ఞయాగములను జపతప ములను కలిగి, ఒక మహారణ్యమువలె కన్పట్టును. ఒక్క తాంత్రికుల యుపాసనావిధానమునందు 116 విభాగములు సూచింపఁబడినవి. వీని నన్నిటిని గూర్చి తెలిసికొనఁగోరువారు కడు స్వల్పము. వానిని స్వాను భవమున తెలిసికొని పరిశీలింపఁగలవా రంతకంటెను స్వల్పము. ఇవి గ్రంథపఠనమువలనఁ గాని తర్కసాహా య్యమువలనఁ గాని అలవడు విద్యలు కావు. సిద్ధు లగు వారియొద్ద శుశ్రూష చేయువారికే యవి లభ్యమగును.

త్రివిధవేదాంతికోపాసనము

వేదాంతులు ఉపాసనములను మూడు విధము లుగ విభజించిరి. ప్రతీకోపాసన, సంపదకోపాసన, స్వరూపోపాసన యనునవి మూఁడు తరగతులు. అనధి కారులు చేయునది ప్రతీకోపాసన. దీనినే అధ్యాసజని తోపాసన యందురు. "అన్యత్ర దృష్టః పరత్రావభాసః." ఒక వస్తువుయొక్క గుణమును మఱియొక వస్తువునకు ఆరోపించుటయే అధ్యాస. రజ్జువును సర్పముగ భావిం చుట అధ్యాసము. శ్రుతజ్ఞానముచే అనఁగా వినికిడివలన గలిగిన జ్ఞానమును ఘటపటముల కారోపించి పూజ చేయుట ప్రతీకోపాసనము. పూర్వుల యనుభవము లను అనుశీలనము చేయుటే దీని యుద్దేశము. ఇందు అప రోక్షానుభూతి యొంత మాత్రము లేదు. సంపదకోపా సన నిమ్నాధికారులకొఱకు ఉద్దేశింపఁబడినది. ని మ్నాధికారి అనధికారికంటె నెక్కువ చిత్తసంస్కారము కలిగియుండును. స్వల్పవస్తువు మూలమున పెద్ద వస్తు వును ధ్యానము చేయుట నిమ్నాధికారి మార్గము. రెండు వస్తువులకుఁ గల సామాన్యధర్మమును కనుపెట్టి, నిమ్నాధికారి చిన్న దానినుండి పెద్దదానిని, పరోక్షము నుండి అపరోక్షమును చేరఁగలుగును. బాలుఁడు నా రింజపండును జూచి భూగోళముయొక్క ఆకారమును తెలిసికొనును. అటులే సంపదకోపాసకుఁడు సూర్యుని స్వప్రకాశత్వమును జగత్ప్రకాశత్వమును మనోగతము చేసికొని బ్రహ్మముయొక్క స్వప్రకాశత్వమును జగత్ప్ర కాశత్వమును ధ్యానించును. బ్రహ్మము చిద్వస్తువు, నిరాకార స్వరూపము, అవాఙ్మానసగోచరము. ధర్మ మార్గమునందలి ప్రథమావస్థయందు దృశ్యమానపదా ర్థములగు బ్రహ్మాండములను జూచి బ్రహ్మమును ధ్యానిం పఁగలుగుటయు. సూర్యోపాసననుండి మనోపాసనకును, మనోపాసన నుండి ప్రాణోపాసనకును, ప్రాణోపాసన నుండి గురుపూజ లేక అవతారోపాసనకును, క్రమ క్రమముగ కక్ష్యాంతరములను దాఁటుచు నిమ్నాధికారి తుదకు అధికారి కాఁగలఁడు. సంపదజ్ఞాన మొక విధ మగు రూపక మగుటచే దీనియందును ప్రత్యక్షాను భవము లేదు. ఈ రెండు తరగతులును కేవలము సాం కేతికములు. వ్యవహారమునందివి విశుద్ధములుగ నుండఁ జాలవు. ప్రచలితధర్మములందు ప్రతీకోపాసనయు సం పదకోపాసనయు పరస్పరపరిమాణగత ప్రభేదములతో వర్ధిల్లుచుండును. స్వరూపోపాసన ఉత్తమాధికారులకే సాధ్యము. ఆత్మయందు పరమాత్మోపలబ్ధిని పొందు టయే దీని యుద్దేశము. ధ్యానధారణములవలన బ్రహ్మై క్యత నొందుటయే దీని సిద్ధి. చిత్తనివృత్తి యుండినఁ గాని స్వరూపోపాసన సాధ్యము కాదు. చంచలచిత్త మున చిద్వస్తువు ప్రకాశింపదు. ఏకనిష్ఠతో నిజస్వరూ పము నుపాసించునప్పుడే సాక్షాత్కారము లభించును. స్తుతిస్తోత్రములచే చిత్తశుద్ధిని గావించుకొని యోగాభ్యా సమున సమాధి యవస్థను పొందవలెను. ప్రతీకోపాసన యందు ఆత్మానాత్మ విచక్షణ లేదు. సంపదకోపాసన యందుఁ సమాధి యవస్థ లేదు. ఒక స్వరూపోపాసకులకే బ్రహ్మసాక్షాత్కారము సాధ్యము.

నిరాకారవాదము

బ్రహ్మోపాసన - సాధనవిషయము. వివిధసాధ నలయందలి సత్యాసత్యములు స్వానుభవమువలననే తెలియనగును. ధర్మతత్త్వము సాక్షాదనుభూతిగ్రా హ్యము. ఏ తత్త్వమును తర్కమువలన పూర్ణముగ సిద్ధాంతీకరించుటకు వీలు లేదు. తర్కము శ్రద్ధావం తుని శ్రద్ధను దృఢపఱుపవచ్చును. కాని, శ్రద్ధ లేనివారికి

అనుకూలవిశ్వాసమును పుట్టింపఁజాలము. సమగ్రజ్ఞానము మానవుని స్వానుభూతిపై ప్రతిష్ఠింపఁబడియున్నను, మనస్సుచే పురిగొల్పఁబడు తర్కము, మీమాంస, విచారణ, అనుభవమును బయటనుండి మాత్రమే విమర్శింపఁగలుగును. కార్యమును జూచి కారణమును గ్రహించినపుడు బుద్ధికి కనఁబడునది కారణముయొక్క నిజస్వరూపము కాదు. మీమాంస కార్యమువెనుకనుండు కర్తయొక్క రూపమును ప్రతిష్ఠింపఁగలుగును, ఆ రూపము కేవలము సత్తామాత్రజ్ఞేయము అనఁగా, ఉన్నది అని మాత్రమే చెప్పవచ్చును గాని ఆ వస్తుస్వరూపముయొక్క వివర మెట్టిదయినదియు చెప్పుటకు శక్యము కాదు.

"యతో వా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి
యత్ప్రయంత్యభిసంవిశంతి
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ"

అని యుపనిషత్తులు బ్రహ్మతత్త్వమును నిరూపించుచున్నవి. కాని, ఈ వాక్యము బ్రహ్మముయొక్క బహిఃప్రకాశమును మాత్రమే వర్ణించుచున్నది. బ్రహ్మమును దూరమునుండి చూపుచున్నది కాని, దాని స్వరూపమును లోపలనుండి వెల్లడించుట లేదు. బ్రహ్మపదార్థమును మనము తెలిసికొనుచున్నది తర్కసంబంధమైన "అనుమానము" వలననే గాని, అనుభవము వలన కాదు. సూర్యుని తేజస్సును మాత్రము చూడఁగల్గియు ఆయన స్వరూపమును చూడలేనట్లు, మనస్సువలన బ్రహ్మముయొక్క బాహ్యరూపప్రకృతులను కొంతవఱకు తెలిసికొనుచున్నామే కాని, బ్రహ్మదర్శనలాభమును బ్రహ్మస్పర్శసౌఖ్యమును అనుభవింపఁజాలము. దర్శనలాభమును పొందనియెడల బ్రహ్మసాక్షాత్కారము పూర్తి కానేరదు. మనస్సునకు వస్తుతత్త్వము అజ్ఞాతమును అజ్ఞేయమును నగుచున్నది. బ్రహ్మాండముయొక్క కార్యకారణసంబంధము విచారించి, జగద్రూపమునకు వెనుక కారణరూపము కలదని ప్రతిపాదించుచున్నాము. ఆ కారణతత్త్వమునే యుపనిషత్తులు బ్రహ్మతత్త్వ మని చెప్పుచున్నవి. ఆ తత్త్వము నిర్గుణము, నిరాకారము. కార్యకారణసంబంధ విచారణ మనోధర్మము. మనస్సునకు భేదవిచారణయందు సామర్థ్యము కలదు. అభేదప్రతిపాదనము మనస్సుయొక్క యధికారమునకు దాఁటిన పని. మన స్సెప్పుడును, "అవును, కాదు" అను నీరెండు సంజ్ఞలయందే సంచరించుచుండును. కార్యమునకు కారణము గలదు. కార్యము కారణముకంటె భిన్నమైనది, స్వతంత్రమైనది. కార్యము దృశ్యము. కారణము అదృశ్యము. కార్యము ఇంద్రియప్రత్యక్షము, కారణము అనుమానప్రతిష్ఠితము. కార్యము సాకారము, సవిశేషము. కారణము నిరాకారము నిర్విశేషము అను చర్చను చేయఁగలిగినది మనస్సు. తర్కము మనల నీ సిద్ధాంతమువఱకే తీసికొనిపోఁగలదు. "నేతి నేతి" అనియే మనస్సు చెప్పఁగలుగును గాని, ఆ పదార్థముయొక్క స్వరూప మెట్టిది యను ప్రశ్నకు ప్రత్యుత్తర మీయఁజాలదు. నిరాకారవాదము మానవుని మనోమయకోశమునకు మాత్రమే సంబంధించియుండును. మానవుఁ డీ కోశమును దాఁటలేనంతవఱకు నిరాకారనిర్గుణవాదమును అతిక్రమింపఁజాలఁడు. ఈ వాదము మనస్సునే బ్రహ్మ మని తెలిసికొనుచున్నది. "మనో బ్రహ్మేతి వ్యజానాత్." అనఁగా, నీ బ్రహ్మము మనోమయబ్రహ్మము, మానసస్సృష్టి. అది తత్త్వముయొక్క ఒక దిక్కును ఒక యంశమును మాత్రమే వెల్లడింపఁగలుగును.

### సాక్షిచైతన్యము

బ్రహ్మవాదు లీ యంశమును దాఁటి బ్రహ్మపదార్థముయొక్క మఱియొక దిక్కును కూడ ప్రదర్శించిరి. సృష్టి స్థితి లయములయందు బ్రహ్మమును మనము కారణరూపముగ చూచుచున్నాము. దానినే మన జీవనాంతరాళమున వివిధావస్థలందును అశేషపరివర్తనములందును సాక్షిచైతన్యరూపమున చూచుచున్నాము. పరిణామము జగత్తుయొక్క నిత్యధర్మము. జగత్తు ఎల్లప్పుడు తిరుగుచు, చంచలమై విరామములేక ప్రవాహమువలె ప్రవహించుచున్నది. ఇంద్రియము లన్నియు నిరంతరము విషయప్రవాహమున తగుల్కొని కంపించుచున్నవి. దృశ్యవస్తువుల ఛాయలు చక్షువులపై ఒకదాని తరువాత నొకటి పడుచున్నవి, తొలఁగిపోవుచున్నవి. శ్రోత్రములందు భిన్నభిన్నధ్వనులు ఒకదాని తరువాత నొకటి శబ్దించుచు తిరిగి ఆకాశమున నంతరించుచున్నవి. ఇదే విధముగ సకలేంద్రియములమీఁదను ఆయా ఇంద్రియములకు సంబంధించిన విషయసముదాయము నదీతరంగములవలె లేచి పడుచు

వెంటనే తొలఁగిపోవుచున్నది. ఈ ఖండఖండములయిన దృశ్యములును ధ్వనులును రసగంధములును మన యింద్రియముల ద్వారమున జ్ఞానోదయమును గలుగఁజేయుచున్నవి. ఈ విషయస్పర్శ అతిచంచలము. ఇది యెప్పుడును గలుగుచుండును, పోవుచుండును. పూర్వమేది గల్గినను, దానితరువాత నేది వచ్చెనో, ఆ సంబంధము మనలో నిలువనియెడల, పూర్వము గలిగిన దాని యనుభూతితోడ, ఉత్తరక్షణమునఁ గలుగు జ్ఞానమును తెలిసికొనుటకు వీలు లేదు. శబ్ద స్పర్శ రూప రస గంధాదు లగు విషయానుభవములు ఆ సంబంధము లేనియెడల పూర్ణమైన విషయజ్ఞానమును కలుగఁజేయఁజాలవు. మన మనమున నే తత్త్వము చంచలమగు విషయస్పర్శలవలనఁ గలుగు క్షణికానుభవములను జాగ్రత్తపఱచి విషయజ్ఞానమును సంభవింపఁజేయునో, దానినే సాక్షిచైతన్య మందురు. ఇదియే సూత్రాత్మ, లేక సర్వగత మగు పరమాత్మ. శుద్ధసత్తామాత్రజ్ఞేయ మగు బ్రహ్మతత్త్వము సర్వాతీతమే కాక, సర్వగత మగు పరమాత్మస్వరూప మని తెలిసికొనఁగలుగుచున్నాము. కాని, పరబ్రహ్మతత్త్వము సర్వాతీత మనినను, సర్వగత మనినను, దాని పూర్ణస్వరూపము వ్యక్త మగుట లేదు. సృష్టికార్యములవలన పరబ్రహ్మస్వరూపమును, విషయస్పర్శముల క్షణికానుభూతివలన సాక్షిచైతన్య మగు పరమాత్మస్వరూపమును తెలిసికొనుచున్నాము. మనస్సువలన పరబ్రహ్మముయొక్క కారణరూపము నెట్లు తెలిసికొనఁగలుగుచున్నామో, అట్లే విజ్ఞానమువలన సర్వాంతర్యామి యగు పరమాత్మస్వరూపమును తెలిసికొనఁగలుగుచున్నాము. కాని, పరమతత్త్వముయొక్క ఈ రెండు దిక్కులను అనుమానప్రమాణమువలననే తెలిసికొనఁగలుగుచున్నాము; అపరోక్షానుభూతివలన సాక్షాత్కారము చేసికొనుట లేదు.

## ప్రత్యక్షానుభవము

ఈ సాక్షాదనుభూతి గలుగుట యెట్లు? అనుమానప్రమాణమువలన ఇది సాధ్యము కాదని తేటపడినది. ఇందువలననే భక్తులు భగవానుఁ డెవనిపై కృపను చూపునో, అట్టివాఁడే బహుపుణ్యఫలమువలన సద్గురుచరణాశ్రితుఁడై ప్రత్యక్షానుభవమును పొందఁగలుగునని చెప్పుచున్నారు. కాని, లోకహితార్థము బ్రహ్మవిదులు అనేకోపాసనలను కల్పించిరి. ఒక సూర్యకిరణముచే అనంతకోటిస్ఫటికము లొక్కమాఱుగ ప్రకాశించు విధమున, ఎవని యంశస్పర్శచే సమస్తస్థావరజంగమములును ప్రకాశించుచున్నవో, ఎవఁడు ధర్మజిజ్ఞాసయొక్క చరమయుక్తియు ప్రపంచవాసనల పరమనివృత్తియు నై బ్రహ్మాండము నంతను ఓతప్రోతభావమున నిండియున్నాఁడో, ఎవని లీలావిలాసమందు నిఖిలజగత్తు చకితమై పులకితమై విస్మితమై సుమధురక్షీరఖండన్యాయమున కరఁగిపోవుచున్నదో, అట్టి భగవానుని అట్టి పరమసుందరుని అట్టి నిఖిలరసామృతమూర్తిని అట్టి సచ్చిదానందవిగ్రహమును, స్వజీవనమున స్వానుభూతియందు, దర్శించి స్పర్శించి ఆస్వాదించి అమృతపదవి నందిన, సిద్ధులయొక్క చింతనల, భజనల, యోగముల, సమాధుల, రూపకల్పనల రహస్యమును తెలిసికొననే గాని బ్రహ్మసాక్షాత్కారమార్గమున ప్రవేశించుటకే వీలు లేదు.

"చిన్మయస్య ద్వితీయస్య నిష్కలస్య శరీరిణః
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పన."

అని కులార్ణవతంత్రమున నొక సిద్ధపురుషుఁడు నుడివెను. మఱియొక స్థలమున నొకయోగి

"సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పన."

అని వాక్రుచ్చియున్నాఁడు. రూపకల్పన చేయునది సిద్ధులు. వారు ఉపనిషత్కాలమున ప్రబలిన తత్త్వాలోచనలతో తృప్తి నొందక రసాత్మక మగు భక్తిమార్గము నున్నతపదవికి తెచ్చిరి. ఈ సందర్భమున ఆర్యుల యోగసాధన యెట్లు క్రమాగతముగ వృద్ధి పొందినదియు తెలిసికొనుట యుక్తము.

## స్థితి విరోధ సమన్వయములు

వైదికకాలమున ఆర్యులు ఇంద్రవరుణాదిదేవతలను అతిమనోహరముగ వర్ణించిరి. ఈ దేవతలు చాక్షుషమూర్తులు కారు. వీరు రూపులా? అరూపులా? ఈ విచారము అనాదిని లేదు. ఈ మూర్తులు రూపములును కావు, అరూపములును కావు. రూపమును అరూపమును విడఁదీయు భేదబుద్ధి మానవుని శైశవావస్థయందుండదు. అందు కనియే ఆర్యులు మొదట చూచిన దేవతలు రూపము లని గాని అరూపము లని గాని చెప్పుటకు వీలు లేదు. ప్రదోషకాలమున చీఁకటి వెలుతురు కలసియుండునట్లు రూపమును అరూపమును గలసియుండెను. కాని, వరుణేంద్రాదిమూర్తులు ఆర్యుల మనము

నందు క్రమముగ అతీంద్రియదృష్టిని ఉద్బోధించుచునే యుండెను. ఇంద్రియము లెప్పుడును అతీంద్రియుని వంకకు తిరుగుచుండును. ఇది సృష్టిలోని రహస్యము. మానవుఁడు శైశవావస్థను దాఁటినకొలఁది భేదబుద్ధి ప్రబలును, వివేకము హెచ్చును, నిత్యానిత్యవస్తువిచక్షణ తీక్ష్ణవగును, ఆత్మానాత్మ జ్ఞానము వికసించును. ఆర్యులు దేవతలను చూచి చూచి, వర్ణించి వర్ణించి, అరూపమును నిరాకారమును సత్తామాత్రజ్ఞేయమును నగు, అప్రత్యక్ష వస్తువును పొందిరి. దీనిని "నేతి నేతి" వాక్యములతో నిరూపించుచు అజ్ఞాతమును అజ్ఞేయమును నగు మహాశూన్యసాగరమునఁ బడిరి. సాకారనిరాకారభేదము లేని యవస్థనుండి విడివడి నిరాకారతత్త్వమును చెందిరి. ఆ నిరాకారమును పట్టుకొనలేక సత్తు అని గాని అసత్తు అని గాని ప్రతిపాదించుటకు సాహసింపరైరి. అది మహాంధకారము. అది ప్రాణమునకు తృప్తి నియ్యలేదు. బ్రహ్మసూత్రమును కల్పించిన వ్యాసభగవానుని చిత్తము వ్యాకులత చెందెను. అప్పుడు మహాశూన్యసింధువు మథింపఁబడెను. అంతట సకలరూపముల సార మగు లక్ష్మీదేవియు సకలరసముల నిదాన మగు అమృతమును ప్రత్యక్ష మయ్యెను. వ్యతిరేకపథమునఁ బడిన ఆర్యులు తిరిగి అన్వయమార్గమునఁ జేరిరి. శూన్యము పరిపూర్ణతను చెందెను. సాకారము నిరాకారమును, నిరాకారము సాకారమును గప్పివేసెను. శబ్దమం దశబ్దమును, రసమునం దరసమును, స్పర్శయం దస్పర్శయు వేణునాదముతో ప్రబోధించుచు భక్తవత్సలుఁడు ప్రత్యక్షమయ్యెను. ప్రతి ప్రాణియందును యమునానది తరంగతాడితమై పొంగుచున్నది. ప్రతి హృదయనికుంజమునను వేణుగానము ప్రతిధ్వనించుచున్నది. జగత్తు క్షీరఖండమువలె మధురరసమునఁ గరఁగుచున్నది. జ్ఞానము భక్తిగ వికసింపనారంభించెను భక్తి మహాభావమున లీనమయ్యెను. నిరాకారము సర్వాకారముగ విరాజిల్లెను. భగవంతుఁడు అరూపుఁడు కాఁడు, బహురూపి. అప్పుడు చక్షువులు విశుద్ధములై ఇంద్రియవిషయములందు అతీంద్రియరూపములను చూడఁగల్గెను. సర్వరూపములు, స్థావరజంగమములు, సకలజీవులు, రసమూర్తులై భగవల్లీలయందు నృత్యము సలుపుచుండెను. ఉపనిషత్కాలమున కూడ నొకవిధమగు భక్తి కలదు కాని, ఆ భక్తికిని భాగవత కాలమునందలి భక్తికిని భేదము కలదు.

### భక్తిసాధన

"ఈశావాస్య మిదగుం సర్వమ్। యత్కించ జగత్యాం జగత్."

ఈశ్వర ద్వారమున చంచలమగు విషయరాజ్యము నాచ్ఛాదన మొనర్చి ఈశ్వరునితో కామ్యవస్తువులను భోగించుచుందుము.

> "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మయో వేద నిహితంగుహాయామ్ పరమవ్యోమాన్ సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి."

సత్యజ్ఞాన మనంతబ్రహ్మమును అంతర మను ఆకాశమున తెలిసికొని, ఆ బ్రహ్మముతోఁ గూడ సమగ్రమైన కామ్యవస్తువుల నుపభోగింపుము. ఇచ్చట శుద్ధనిర్మలజ్ఞానము భక్తిసిక్తమైనను అయ్యది తన్మయత్వమును పొందించుట లేదు. ఆ యనంతమైన సౌందర్యము ఈ జగత్తుపైఁ బడి జగత్తు సౌందర్యమయమైనను, ఆ పరమసుందరుని స్పృశించుటకు అవకాశము చిక్క లేదు. కామ్యవస్తువులు మధురమైనవే కాని, ఆ మాధుర్యము ఆస్వాదింపఁబడలేదు. అంతరమున బ్రహ్మము ననుభవించినను ఆయనను చక్షువులతో చూచుటకు సంభవింపలేదు. చక్షువుల గభీరపిపాస తృప్తి నొందు టెట్లు?

నేత్రములు అలక్ష నిరంజనుని చూచుటకు భూనభోంతరాళములు వెదకుచున్నవి. ఆ ముఖమండలము ఆ సౌందర్యమూర్తి బయలుపడినఁ గాని హృదయమునకు శాంతి లేదు.

ఇంద్రియ చాంచల్యమునకు కారణ మేమి? ఇంద్రియములు వేనిని కోరుచున్నవో వానిని పొందకపోవుటవలన, యోగి కనులను తెఱవఁడు. కనులను తెఱచినతోడనే ధ్యాననిమగ్నుఁడై హృదయమందిరమున చూచిన యనంతమూర్తిని ఇంద్రియము లెపుడు చూడలేకపోయెనో అప్పుడే యోగి తిరిగి కనులను మూసికొనును. ఎంతవఱకు ధ్యానమూర్తి బాహ్యమున కనఁబడఁడో, అంతవఱకును యోగి అస్థిరుఁడగుచునే యుండును. విషయితో విషయమును, రసముతో నింద్రియమును, మనుష్యత్వముతో మనుష్యుని అనుసంధానము చేసి, విషయరాజ్యమున రసమూర్తిని ప్రతిష్ఠించినఁ గాని, యోగియొక్క అస్థిరత పోనేరదు. "ఈశావాస్య మిదగుం సర్వం" ఈశ్వరుని ద్వారమున సకలమును ఆచ్ఛాదనము చేయు మని ఉపనిషత్తులు చెప్పు భక్తి

మార్గమునం దీస్థిరత లేదు సకలకామములను బ్రహ్మతో భోగింపుఁ డని ఉపనిషత్తులు బోధించుచున్నవి. బ్రహ్మమునే సకలభోగములతో ననుభవింపు మని భాగవతము ప్రబోధించుచున్నది. పూర్వకాలములో అరూపద్వారమున రూపమును భోగించుట. ఇప్పు డన్ననో రూపము ద్వారమున అరూపమును ప్రత్యక్షము చేసకొనుట. పూర్వము అశబ్దమున శబ్దము వినుట, అరసమున రసమును ఆస్వాదించుట, అగంధమున గంధము నాఘ్రాణించుట. ఇప్పు డది యంతయు నతిక్రమింపఁబడినది. శబ్దద్వారమున అశబ్దమును, రసద్వారమున అరసమును, గంధద్వారమున అగంధమును, స్పర్శద్వారమున అస్పర్శమును ప్రబోధించి, హృదయమర్మమునకు లాఁగికొనుము. భక్తవత్సలుఁడు భక్తుల ఆర్తప్రార్థనలను విని ఎట్టి రసజగత్తునఁ బడవేసెను? వేదకాలమున రూపారూపములకుఁ గల యైక్యత అల్పజ్ఞానముపై నాధారపడియుండెను. అప్పుడు వివేకము లేదు. ఆత్మానాత్మవిచక్షణ లేదు. అప్పటి జ్ఞానము ప్రదోషమునందలి వెలుతురువలె నుండెను. ఈ కలయిక అట్టిది కాదు. ఇక్కడ జ్ఞానము పరిపూర్ణ మైనది. ఇక్కడ అనాత్మయందు ఆత్మభ్రమ లేదు. ఈ యైక్యత ఈ యభేదజ్ఞానము అవిద్యచే కల్పిత మైనవి కావు. ఇది రసస్పృష్టి. ఈ మహాసాధనమునందు, రసస్పృష్టియందు, యోగి రూపకల్పనలను చేయును.

### రూపకల్పన

"సాధకానాం హితార్థాయ । బ్రహ్మణో రూపకల్పనా."

రూపకల్పన సాధకులకొఱకు చేయుదురు. కల్పన చేయునది సాధకులు కారు. వారు సిద్ధులు. వారు తమ ప్రసన్నచిత్తమున దేని సాక్షాత్కారమును పొందిరో, ఏరసము నాస్వాదించిరో, దానిని మొదట ప్రతిమల రూపమున ప్రకాశింపఁజేసిరి. సమాధిలో కలిగిన ఆత్మోపలబ్ధితో వారు తృప్తి పొందరు. ఏల యన, సమాధి నిత్యావస్థ కాదు. సమాధి విడిపోయినప్పుడు సమాధిలో ప్రత్యక్షమైన ఇష్టదేవతను తిరిగి చూచుటకు ఇచ్ఛ కలుగును. జాగ్రదవస్థయందు ఆ స్వరూపమును ఇంద్రియ సమక్షమున నుంచుకొనుటకు యోగీంద్రులు రూపకల్పన చేయుదురు. వారు రూపకల్పన చేయునది తమకొఱకే గాని ఇతరులకొఱకు కాదు. ఇంద్రియసంయమముచే చిత్తనిరోధముచే సమాధిని పొంది ఏ యుపాస్యదేవత సాక్షాత్కారము పొందునో, దానిని తిరిగి బైటను ప్రవృత్తియందు శబ్దస్పర్శ రూప రస గంధములయందు ఉపభోగించుటకు యోగి యుత్కంఠుఁ డగును. భక్తుఁడు తన రసమూర్తిని తన యిష్టదేవతను తన హృదయేశుని తన యాత్మమందిరమునందే కాక, జీవనమునందును సంసారమునందును సమాజమునందును వాఙ్మయమునందును శిల్పమునందును కళలయందును గానమునందును కావ్యములందును ప్రతిష్ఠించినఁ గాని, వాని యానందము పూర్తి కాదు. అప్పుడు కాని, వాని సాధన సిద్ధింపదు. ఇది ప్రేమయొక్క సహజలక్షణము. ప్రథమమున ప్రేమ బహుగూఢముగ సంచరింపనారంభించును. ఎప్పుడు ప్రేమ యుదయ మగునో, అప్పుడు లజ్జయు భయమును నంకురించును. ప్రియురాలు మొదట తన ప్రేమను బహిరంగపఱచుటకు ఇష్టపడదు. ఇతరుల దృష్టి దానిపైఁ బడుట కెంతమాత్రమును సహింపదు. సకల బాహ్య సంబంధములును దానికి అంతరాయము లని భావించును. తన మనోనాథుని హృదయమునందలి నిభృతప్రదేశమునందుంచుకొని ఆనందించుచుండును; ఉద్రేకమును పొందుచుండును; సంకల్పసోపానముల నెక్కుచు ప్రియుని సంగమమున రాగనిమగ్న యగును. కాని, ప్రేమ వికసించిన కొలఁది లజ్జ తొలఁగిపోవును. ఇఁక ఏకాంతభావము తృప్తి నియ్యఁజాలదు. ప్రియు నలంకరించి వానిని దూరమునుండి చూడఁగోరును. తన ప్రియుని ఇతరులకుఁ జూపి వారి చూపుతో తన చూపును కలపి, ఆనందము పొందుటకు ఆతురపడుచుండును. తాను జనసంఘమున లీనమై ప్రియుని కీర్తించును. తన శిశువును ఇతరు లెత్తి ముద్దాడినఁ గాని తల్లి కానందము లేదు. ఇది ప్రేమతత్త్వము. ఆంతరంగిక మైనదానిని జగత్తునందు ప్రకాశింపఁజేయుటకు ఏ వ్యాకులత భక్తున కుండునో, ఆ వ్యాకులతయే కవికి కూడఁ గలదు. కవి రూపరసద్వారముల తాను పొందిన దివ్యానుభవములను ప్రకటించుటకు అస్థిరుఁ డగును. తన హృదయమున పొంగి తరంగతాడితమై ప్రవహించు భావలహరిని శబ్దమున ఛందస్సున సంగీతమున ప్రపంచమునకు వినిపించినఁ గాని కవికి తృప్తి లేదు. కవియొక్క ఆవేదన, భక్తునియొక్క వ్యాకులత, ప్రియురాలి విరహము, ఇవి యన్నియు రసజగత్తునందు రూప

కల్పనలను పురికొల్పుచుండును. ఇది ప్రసూతి వేదన వంటిది. ఇది సృష్టికి మూలము. ప్రియుఁడు కవి భక్తుఁడు, ఈ మువ్వురును తమ రసజగత్తును బయట ప్రతిష్ఠించుటకు ప్రయత్నింతురు. కాని, ఆ ప్రయత్నము సఫలము కానేరదు. అది వ్యర్థప్రయాస. రసజగత్తు బహిర్వస్తువు కాదు. అది అతీంద్రియము. దాని లావణ్యము రూపలావణ్యము కాదు. అది భావలావణ్యము. దాని సౌందర్యము భౌతికము కాదు. అది రససౌందర్యము, అనంగము, అరూపము, అనూహ్యమును. ఆ సౌందర్యమును ఆ మాధుర్యమును ప్రకటించుట యెట్లు? ఏ "కేమిరా"యు దాని రూపపటము నెత్తలేదు. ఏ ప్రియుఁడును తన నాయికను చిత్రించి తృప్తి పొంధలేఁడు. ఏ కవియు రసానుభవమును వెలిపుచ్చఁగల భాషను ఛందస్సును కనుఁగొని శాంతచిత్తుఁడు కాలేఁడు. ఏ భక్తుఁడును తన ప్రాణపతమునఁ జూచిన ఇష్ట దేవతామూర్తిని ప్రతిబింబింపఁగల రూపమును ఈ జగత్తులో కనుఁగొని సంతోషస్వాంతుఁడు కాలేఁడు. ఇంద్రియాతీత మైన ప్రేమమాధుర్యమును రససౌందర్యమును భావలావణ్యమును ప్రకటింపఁగల భాష లేదు. ఛందస్సు లేదు. శిల్పము లేదు. ప్రకటింపు మని ఆవేదన యొక మూల ప్రేరేపించుచుండును. ప్రయత్నము వ్యర్థ మైనందునకు ఒకమూల యసంతృప్తి కలుగుచుండును. రసరాజ్యమున, ఆవేదనయు అసంతృప్తియు పొందుచుండుటయే ప్రయోజనము, ఫలము.

భావాంగఘటన

రసమునకు సంసారమే ఆశ్రయము. సంసారము రసముల లీలాభూమి. రసము సంసారమునఁ బుట్టి సంసారము నతిక్రమించును. మహాసాగరమున భిన్న భిన్న తరంగములు దిగంతము వ్యాపించి క్రమముగ అనంతమగు నీలాంబరమున లీనమగు విధముననే, రసము కూడ వ్యక్తియందుఁ బుట్టి సమాజమునకును, సమాజమునుండి విశ్వమునకును వ్యాపించి, తుదకు నిర్విశేషమునఁ గలసిపోవును. మొదట నొక యల్పమగు శిశువు మూలమునఁ గలిగిన వాత్సల్యరసము సకలసంతానము నిండి, విశ్వవ్యాపివఱకును ప్రవహించును. మొదట వాత్సల్యము దేని నాశ్రయించి పుట్టెనో అది విశిష్టవస్తువు. దాని సంగమస్థానము నిర్విశేషము. "ఇది నా తల్లి. అందఱి తల్లి కాదు. నా తల్లిని అమ్మా యని అన్యులు పిలుచుట కధికారము లేదు. ఇది నా సొత్తు. అమ్మ అందఱిది కాదు, నాది." కాని, క్రమముగ నాది యనునది పోయి, నా తల్లిని ఇతరులు కూడ అమ్మా యని పిలుచుటకు నా మనము వ్యాకులత నొందును. అమ్మ యని పిలుచుట కొక కంఠము చాలదు. కోటి కంఠములతో అమ్మా యని పిలువవలెను. త్రింశత్కోటికంఠ కలకల నినాదమున వందేమాతరము మంత్రము ప్రతిధ్వనింపవలెను. నా తల్లి యెవరు? త్రిపురసుందరి, త్రిభువనమోహిని. నా తల్లి నాయందు ఏ ప్రేమను మేల్కొల్పెనో ఆ ప్రేమయే జగజ్జనని రూపమున వెలసినది, వికసించినది. ఈ మాతృమూర్తి నాదే కాదు, అందఱిది: సకలవిశ్వసంతానము నది, సకలసృష్టిది., వేయేల? సకలసృష్టియు నా తల్లిదే. ఈ మాతృమూర్తి మూర్తి లేని అమూర్తి కాదు. ఇది సాకారమును కాదు, నిరాకారమును కాదు.' మాతృమూర్తి యనఁగా, ప్రపంచములోని తల్లు లందఱి కూడిక కాదు. ఆ మూర్తి ప్రతి తల్లియందు నున్నది. అందఱిని అతిక్రమించియు నున్నది. ఎప్పుడు విశిష్టమగు మూర్తి అమూర్తిని స్ఫురింపఁజేయదో, ఆ మూర్తి ఆ రూపము ఆ విగ్రహము అలీకకల్పన, అర్థవిహీన మగు కల్పన. అది కేవలము జడపిండము. ఏ మూర్తి యమృతప్రేరణము సేయఁగలుగునో, అది సమముగ సాకారమును నిరాకారమును నగుచున్నది. ప్రకటితమైనది సాకారము. ప్రకటితము కానిది నిరాకారము. ప్రకటిత మైనదానిని వదలివేసి అప్రకటిత మైనదానిని అనుసంధానము చేయుట యెట్లు? రూపము వినా స్వరూపమును తెలిసికొనుట యెట్లు? సాకారమూలమునఁ గాక నిరాకారమున భావన చేయుట యన నేమి? మన ఋషులు సాకారనిరాకారములను ఛాయాతపములుగ వర్ణించియున్నారు. వ్యష్టిజనని మూర్తి. సమష్టిజనని అమూర్తి. వ్యష్టిసంతానము సాకారము, సమష్టిసంతానము నిరాకారము. వ్యష్టినాయకుఁడు రూపము. విశ్వనాయకుఁడు అరూపము. ఒకదానిని విడిచి మఱియొకటి యుండదు. రూపమునందు స్వరూపము, గతియందు శక్తి, ఆవిర్భావమునందు భావము, శబ్దమున అశబ్దము, స్పర్శయందు అస్పర్శ, గంధమునందు అగంధము, ఛాయాతపములవలె అవినాభావమున నున్నవి. ఈ విశ్వత్వము అంక

గణితమార్గమున గ్రాహ్యము కాదు. ఇది జీవనతత్త్వము. జీవము అంగముల కూడిక కాదు. జీవము ప్రత్యంగమున నున్నది. జీవము ప్రత్యంగమున వ్యాపించి పూర్ణత నొందును. ప్రత్యంగమును జీవమును ప్రేరేపించుచు సార్థకత నొందును. జీవము పరిపూర్ణత నొందుటకు అంగములను సృష్టించును. అంగము లన్నియు ఆనంద మగు జీవమును ప్రకాశింపఁ జేయును. అటులే జగజ్జనని తన పరిపూర్ణతకై భిన్నభిన్నము లైన తల్లులను సృష్టించుచున్నది. ప్రతి తల్లియు రూపము లేని జగజ్జననిని ప్రకాశింపఁజేసి సార్థకత చెందుచున్నది. అంగాంగిసంబంధమున సాకారమును నిరాకారమును సాలంబనమును నిరాలంబమును అన్యోన్యముగ భేదాభేదముల నొందుచున్నవి. నీతి ధర్మము దర్శనము శిల్పము సాహిత్యము ఈ నియమము ననుసరించియే రూపమున స్వరూపమును, భేదమున అభేదమును విశిష్టమున నిర్విశిష్టమును వెదకుచు కనుఁగొనుచు పూర్ణత్వము నొందుచుండును. ఈ దృష్టితోఁ జూచితిమేని, హిందూదేవతావిగ్రహములు సమాధిలబ్ధమైన ఇష్టదేవతామూర్తు లని మన మంగీకరింపక తప్పదు. విశ్వరూపము అర్ధనారీశ్వరుఁడు మహిషాసురమర్దని యుగళమూర్తి నటరాజవిగ్రహము దుర్గ భవాని కాళి జగద్ధాత్రి సరస్వతి లక్ష్మి దక్షిణామూర్తి మొదలగు ప్రతిమలు సర్వాంతర్భావకుఁ డగు నిఖిలరసమూర్తియొక్క భావాంగఘటన లని తెలిసికొనఁగలుగుదుము. ప్రస్తుతము విగ్రహారాధకులు ఈ మూర్తులను ఇట్టి దృష్టితోఁ జూచుచుండిరా లేదా యనునది ప్రస్తుత విషయము కాదు. ఈ విగ్రహములను సృష్టించిన వారు సాధారణమానవులు కారు. వారు బ్రహ్మసాక్షాత్కారమును పొందిన సిద్ధపురుషులు. వారి సమాధికి భంగము కలిగినప్పుడు ఉద్భవించిన ఆవేదనలో తమ ఉపాస్యదేవతలను మంత్రరూపమునఁ గీర్తించిరి. వాని ననుసరించి శిల్పులు దారు లోహ శిలా విగ్రహములను చేసిరి. చిత్రకారుఁడు తన చిత్తరువును లిఖించుటకు పూర్వము పటముపై ముందుగ సఫేదు రంగును పూయును. అటుపిమ్మట తన కుంచెను వివిధములగు రంగులలో ముంచి చిత్తరువులను పూర్తి చేయును. అటులే సాధకుని చిత్తముపై బ్రహ్మభావ ముదయింపవలెను. "ఈశావాస్య మిదగుం సర్వం." ప్రపంచ మంతయు ఒక్క బ్రహ్మభావమున కనఁబడవలెను. మనకు కనఁబడు వస్తుతంత్రము స్థావరజంగమములే యైనను, అవి యన్నియు బ్రహ్మముయొక్క మూర్తులై ప్రకాశించును. కాని, ఇది సాధకునకు ప్రారంభదశ. భక్తి యింకను గంభీరము కాలేదు. నేత్రములనుండి అశ్రువులు రాల నారంభించెను. దృష్టి విడివడినది. కాని, సృష్టి ఆరంభము కాలేదు. సమాధియందు తా ననుభవించిన భావోన్మాదము జాగ్రదవస్థయందు కూడ కొంతవఱకైనను నిలిచినఁ గాని, సృష్టి యారంభము కాదు. "ఈశావాస్య మిదగుం సర్వం." అను వాక్యమునందు బ్రహ్మభావము కలదు గాని, భావాంగసృష్టి ప్రారంభము కాలేదు. భావాంగము కేవలము అనుభవము కాదు. అది కల్పన. అనుభవము ప్రగాఢమైనప్పుడు కల్పనతోఁ జేరి భావమునకు అంగములను సృష్టించును. ధ్యానములో మాతృత్వము అనుభవమైనది. ధ్యానము భంగ మైనప్పుడు ఇంద్రియములు మేల్కొనినప్పుడు ఈ భావము రక్షింపఁబడదు. ఇంద్రియములు భేదబుద్ధిని కలిగించును. ప్రాణ మప్పుడు వ్యాకులత పొందును. అప్పుడు కల్పన సృష్టిచేయ నారంభించును. ఈ కల్పనలు మాతృప్రతిమను ఘటించును. ఇది పరులకొఱకు కాదు. ప్రాణతృప్తికొఱకు. గాఢానుభవము అతీంద్రియతత్త్వమును ఇంద్రియసమ్ముఖమున ప్రతిష్ఠించును. అందు కనియే ఋషులు మంత్రద్రష్ట లగుచున్నారు. నిరాకారవాదులు కూడ నీ మార్గమున నడచి మానసమూర్తులను గలిగించి "త్వమ్ పితా నోసి" అని బ్రహ్మమునకు ప్రణామము చేసి విశ్వపిత యను మానసిక కల్పనను చేసినారు. విగ్రహములను విడనాడిన మానసికోపాసకులు సయితము సున్నితములైన మానసిక కల్పనలకు లోనగుచునే యున్నారు. వారు చేయునది నిరాకారోపాసన కాదు. ఎప్పుడు ఈశ్వరుని చరాచరాత్మకమైన జగత్తు ద్వారమున కీర్తించుచున్నారో, ఎప్పుడు వానిని "తండ్రీ తల్లీ" యని సంబోధించుచున్నారో, అప్పుడు మానసిక కల్పన తప్పదు. ఎప్పుడు పుత్రుఁడు "అమ్మా" యని తల్లిదగ్గఱకు పరుగిడుచున్నాఁడో, అప్పుడు పుత్రుఁడు మాతృప్రతిమను సృష్టించుచున్నాఁడు. ఇది నిమ్నాధికారుల సంపదకోపాసనము కాదు. ఇది బ్రహ్మజ్ఞానసాధనయుఁ గాదు. బ్రహ్మజ్ఞానమునందు బ్రహ్మప్రకాశము మాత్రమే సాక్షాత్కార మగును. స్థావరజంగమము లన్నియు నిష్ట

దేవతయొక్క యేకరూపమును దాల్చును. ఇందు విగ్రహసృష్టి లేదు. సర్వము సమాన మైనప్పుడు, జగత్తంతయు ఒక్క బ్రహ్మరూప మైనప్పుడు, రససృష్టి యెక్కడ? అందు కనియే, భక్తు లీయవస్థను దాటవలె నని చెప్పుచున్నారు. బ్రహ్మప్రకాశముకంటె బ్రహ్మవిలాసము మహత్తర మైనది. ప్రకాశమునందు ఒకటే రూపము. కావున నిరాకారము. విలాసమునందు సర్వరూపము. కావున అనంతకోటి విగ్రహములు, నామములు, అవతారములు, లీలలు. ప్రకాశమున శాంత భావములో ముగింపు. విలాసమున శాంతము ప్రథమ సోపానము. ఆ రసపిపాసకు తనివి తీఱదు. ఆ రసక్రీడయందు ఎప్పటి కప్పుడు నూత్న నూత్న రాగములు, నూత్న నూత్న నృత్యములు, నూత్న నూత్న వేషములు, నూత్న నూత్న విలాసములు. అది యొక మహాయాత్ర. క్షేత్రమునుండి క్షేత్రమునకు, ఆలయమునుండి ఆలయమునకు, విగ్రహమునుండి విగ్రహమునకు, సహస్రనామ సంకీర్తనముతో ప్రణామము లొనర్చుచు, ఆత్మ రసయాత్రకై బయల్వెడలును. భగవంతుఁ డేమి చేయఁగలఁడు? ఎంతకును భక్తునకు తృప్తి లేదు. రసపానము చేసిన కొలఁది రసపిపాస హెచ్చును. భగవంతుఁడు భక్తుని తృప్తిపఱుపక యెట్లుండఁగలఁడు? వాని తృప్తి నిమిత్తము ఈశ్వరుఁ డెప్పటి కప్పుడు నూతనరూపములను దాల్చును. భక్తుఁ డా రూపములను విగ్రహములుగ నొనర్చి, క్రొత్త రూపములకై నిరీక్షించుచుండును. ఆ రసపిపాసకు విరామము లేదు. ఆ విగ్రహసృష్టికిని తెంపు లేదు. ఇది యేకేశ్వరోపాసన కాదా? కాకపోనిమ్ము! భగవంతుని వర్ణించుటకు నాకు ఒక్క నామము చాలదు. వానిని సందర్శించుటకు ఒక్క రూపము చాలదు. వాని సందర్శనానందమున నోలలాడిన కొలఁది నూతనరూపరచనలు తమయంతటతామే యుద్భవించుచుండును. భావము భావాంగఘటన మూలమున పరిపూర్ణత నొందుచుండును. భావాంగఘటన రూపరచనల ద్వారమున విస్తీర్ణమగుచుండును. ఏవి భావాంగఘటనలు కావో అవి విగ్రహములు కావు. విగ్రహములందలి శిలాజ్ఞానము వస్తుతంత్రము. అది ప్రయోజనకారి కాదు. వానిచే ప్రబోధింపఁబడు దేవతాబుద్ధియే బ్రహ్మోపాసనకు సహాయకారి యగును. అందు కనియే విగ్రహములు అనధికారులకు ప్రయోజనకారులు కావు. వారికి అందు శిలాజ్ఞానము తప్ప మరొకటి యుండదు. "సాధకానాం హితార్థాయ." సాధకులు అనధికారులు కారు. ప్రవర్తకులు అనధికారులు. సాధ్యము తెలిసిన వారే సాధకులు. ఒక్కమాత్రైనను తమ జీవితమునందు బ్రహ్మసాక్షాత్కారము పొందినవారే సాధకు లగుదురు. ఈశ్వరసహవాసమును నిత్యానుభూతిగఁ జేసికొన యత్నించువారే సాధకులు. అట్టివారికి విగ్రహములు రసోద్దీపనము గావించి, వారిని ఈశ్వరసన్నిధికిఁ జేర్చును. వారికి ప్రాణప్రతిష్ఠ చేయఁబడిన ప్రతివిగ్రహమును ధ్యేయము.

## మంత్రోపదేశము

గురువులయొద్ద మంత్రోపదేశము నొందినఁగాని యోగాభ్యాసము సాధ్యము కాదు. ప్రతి మంత్రమునకొక యధిష్ఠానదేవత యుండును. విగ్రహము లీ యధిష్ఠానదేవతలయొక్క ప్రతిమలు. కావున, మంత్రోపాసన లేనిది విగ్రహారాధనము సఫలము కానేరదు. విగ్రహ ముపాస్య మగుటకు ముందు దానికి ప్రాణప్రతిష్ఠ కావలెను. ప్రాణప్రతిష్ఠ యనఁగా, ఆ విగ్రహమునకు చెందిన మంత్రముయొక్క బీజాక్షరము గల యంత్రముపై దానిని స్థాపించుట.

"సర్వదేవమయీం దేవీం సర్వమంత్రమయీం పరాం
ఆత్మానం చింతయే ద్దేవీం పరమానందరూపిణీం."

ఇట్లు ధ్యానము సేయునప్పుడు దారుశిలాలోహవిగ్రహములయందు వస్తుజ్ఞానము నశించి, దేవతాబుద్ధియే యుదయించును. దేవతాబుద్ధి యుదయించినతోడనే, సాధకుని అతీంద్రియదృష్టి వికసించి, ఈశ్వరగుణానుభవము కలుగును. కావున విగ్రహముల మర్మములను తెలిసికొనఁగోరువారు ముందర గురువులయొద్ద మంత్రోపదేశమును పొందవలెను. ఈ వ్యాసము నలంకరించిన విగ్రహముల మర్మములను విప్పి చెప్పుటకు ఈ లేఖని జంకుచున్నది. విగ్రహముల మర్మములను వెల్లడించుట యనఁగా, రసస్వరూపమును ప్రకటించుట. ఆ కార్యము చింతనల, భజనల, యోగముల మూలమున అనుభవించి ఆనందింపవలసినదే కాని, దానిని లిపిబద్ధ మెవరు చేయఁగలరు? కవులు చేయఁగలరు. ఋషులు చేయఁగలరు. సిద్ధులు చేయఁగలరు. విగ్రహములయెడ గతానుగతిక మగు మూఢవిశ్వాసమును తొలఁగించి ఈశ్వరసాక్షాత్కారమున కనుకూలమగు శ్రద్ధాభక్తులను గలిగించుటయే వ్యాసోద్దేశము.

జలశాయి క్షీరోదకశాయి శేషశాయి మొదలగు మూర్తులను కల్పించిన యోగీంద్రు లెవరో మనకు తెలియదు. కాని, వారు సృష్టియొక్క మూలప్రకృతులను సృష్టి స్థితి లయములను యోగదృష్టితోఁ జూచిన మంత్రద్రష్టలనుటకు సందియము లేదు. సంహారరూపమును [illegible] దించి కాళికామూర్తిని నిర్మించిన ఋషీశ్వరుఁ డెవఁడో ఎవరు చెప్పఁగలరు? శివుని ప్రళయతాండవమున జటాజూటములచే బ్రహ్మాండములు వ్రక్కలగుచుండ, పదాఘాతమున భూగర్భము చూర్ణీభూత మగుచుండ, పినాకినినుండి ఎగయు ప్రళయ జ్వాలలచే భూనభోంతరాళములు భస్మీపటల మగుచుండ, డమరుకమునుండి ఓంకారనాదము దశదిశల పిక్కటిల్లఁజేయుచుండ, శాంతరసము లొల్క నటరాజుముఖమండలమును వీక్షించి "జగద్రక్షార్థమై నటుఁడు" యని కీర్తింపఁగలిగిన మహనీయుఁ డెవఁడు? ప్రకృతిపురుషుల ఆంతరంగిక లీలను హృదయస్థము చేసికొని యుగళమూర్తిని సృజించి లోకమును పావనము చేసిన పరమభక్తుఁ డెవఁడు? "ఎందరో మహానుభావులు" తమ దివ్యానుభవములను విగ్రహముల రూపమున హిందూధర్మ ప్రపంచమున ఒప్పించి, ధన్యులైరి. ఈ మహదైశ్వర్యమును విడనాడి ఆర్యధర్మమును నవసంస్కారోత్సాహమున నిస్సారముగను కళావిహీనముగను చేయకుందురుగాక!



జగద్ధాత్రి



మహిషాసురమర్దని

# దేవాలయములు — వాని స్థితి

బులుసు లక్ష్మణమూర్తి గారు, బి. ఏ.

హిందూమతమునకు ముఖ్యమైన యాధారములలో దేవాలయము లొకటియై యున్నవి. క్రైస్తవులకు "చర్చి" లున్నను, మహమ్మదీయులకు మసీదులునుబలె హిందువులకు దేవాలయములును పవిత్రములైనవి. ఈ దేవాలయములలో నొక్క ప్రార్థన చేయుటమాత్రమే గాక భగవంతుని రూపము లనబడు విగ్రహములు కూడ స్థాపింపబడుటచే, క్రైస్తవులు "చర్చి" లన్నను, మహమ్మదీయులు మసీదులను నెంత పవిత్రము లైనవని తలంచెదరో, అంతకన్న నెక్కువ పవిత్రమైనవిగా హిందువులు తమ దేవాలయములను చూచెదరని చెప్పినను చెప్పవచ్చును.

దేవాలయములు మొట్టమొదట దైవప్రార్థనకొఱకు కట్టబడినట్లు తోచుచున్నది. ప్రతిమనుజుడును తనయిచ్ఛ వచ్చినప్పుడు పోయి ప్రార్థనచేసికొనుటకును, అందఱు కలసి దైవప్రార్థనచేసికొనుటకును వీలుండునట్లు ఈ దేవాలయములు, అనగా ఈ ప్రార్థనామందిరములు, నిర్మింపబడి యుండవచ్చును. ప్రప్రథమములో దేవాలయములందు విగ్రహము లుంచి రనుట సంశయాస్పదము. ఏలయన, విగ్రహారాధన ఆర్యులకాలమునందు లేదనియు కొంతకాలము క్రిందనే వచ్చినట్లును కొందఱు సిద్ధాంతీకరించియున్నారు. కాలక్రమమున విగ్రహారాధన ప్రబలినప్పుడు, దైవస్వరూపములుగా నెన్నబడు విగ్రహము లుంచుటకు దైవప్రార్థనలకయి వినియోగింపబడు దేవాలయముకన్న పవిత్రమగు స్థల మేది యుండును? కాబట్టి అప్పటి జనులు మతాభిమానపూరితులై ఆవిగ్రహములను దేవాలయములలోనే స్థాపించుచుండిరి.

అయినను, ఏకారణముచేతనో గాని, హిందూదేవాలయముల యొక్క కట్టడము అంత బాగుగా లేదు. అది రెండు విధములు: **1.** గర్భాలయము మీద కోలగా గోపురము కట్టి దానిమీద శిఖరము నుంచుట. (ఉ. పూరీలోని శ్రీజగన్నాథునికోవెల.) **2.** గర్భాలయముమీద చతురశ్రముగా మెట్లవలె అంతస్థులపై నంతస్థులుగా కట్టి కొనకు శిఖరము నుంచుట. (ఉ. తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వరునికోవెల.) ఇంచుమించుగా నుత్తర హిందూస్థానమందు మొదటివిధ మగు కట్టడమును, దక్షిణ హిందూస్థానమందు రెండవవిధ మగు కట్టడమును నుపయోగములో నున్నవి. మొత్తముమీద రెండువిధముల కట్టడములును అంత మంచివి కావు. కట్టడ మెట్టిదైనను, గుడిలోపలి భాగము అంధకారబంధురమై యుండుటయు, ఏమాత్రమైనను వెలుతురును గాని గాలిని గాని లోనికి రానియ్యకుండుటయు నిందునకు కారణములు. ఇట్టి దేవాలయములలోనికి పోవుచున్న, నే చీకటికోణములోనికో పోవుచున్నట్లుండును. కొన్నిచోట్ల నీ దేవాలయముల యడుగుభాగము భూమిమట్టమునకు క్రిందుగా నుండుటచే సదా తేమగా నుండును. ఈ కారణములచే లోపల కావలయునంత శుభ్రముగా నుండుట యసంభవము. అప్పటికి అర్చకపురోహితులు వలసినంత మతావేశపరులగుటచే కోవెలలను శుభ్రపఱచుటయందు కావలసినంత శ్రద్ధ తీసికొనుచుండెడివారు గనుక నవి యొక మోస్తరుగా నుండిన వన్నను అనవచ్చును.

ఇప్పుడో కాలము మాఱినది. ప్రజలు మాఱిరి. ఉద్దేశములు మాఱినవి. శాస్త్రజ్ఞానము అభివృద్ధి యైనది. ఈవృద్ధితో వినని కనని విషయములు పుట్టినవి. మతావేశము తక్కువైనది. [illegible] మనువారు కొందఱు బయలుదేఱిరి. ప్రజలలో కొందఱు ఆస్తికులు, కొందఱు నాస్తికులు. విగ్రహారాధన హీనముగాను తప్పుగాను చూడబడుచున్నది. బ్రాహ్మసమాజమతము, ఆర్యసమాజమతము మొదలగున వెన్నియో బయలుదేఱినవి. ఇవి హిందూమతముయొక్క భాగములే యైనను విగ్రహారాధనకు వీనివలన చాల నష్టము కలిగినది. నిజముగా ఆలోచించిన, విగ్రహారాధనకు వీనివలన కలిగినంత హాని మఱిదేనివలనను కలుగలేదు. ఇంతే గాక, యీ నూతనమతము లభివృద్ధి యైనకొలది విగ్రహారాధన నశించిపోవు ననినను నిజమునకు చాల దూరము గాదు. ప్రజలలో కూడ కొంతవఱకు దేవాలయము లన్న నేహ్యపడువారు కొందఱు బయలుదేఱిరి. కొంద ఱేది యెట్లున్న మాకే మనువారు. ఈమార్పు లన్నిటియొక్క శుభసూచనయు ప్రజలకు మత మను పిచ్చియావేశము తగ్గుటయే. విగ్రహారాధనపై భక్తి తక్కువయ్యు నది నశించుచున్నకొలది ఆ విగ్రహములకు స్థానము లైన దేవాలయములు బాగుపడునా? అందుచే దేవాలయము లనిన ప్రజల కభిమానము తక్కువ. దీనివలనే దేవాలయములయొక్క ధర్మకర్తలకును శ్రద్ధ తక్కువ. కాబట్టి వీరు వాని మంచిచెడ్డలలో వలయునంత జోక్యము కలుగజేసికొనకున్నారు. దేవాలయములను, ధర్మపుసత్త్రములవలె గాక, తమసొంత సత్త్రములవలెగాను ఖర్చుపెట్టిన ధర్మకర్త లెందఱున్నారు? 'యథా రాజా తథా ప్రజా' యనునట్లు వీరిని బట్టియే అర్చకులును. వీరిలో కొందఱు దేవాలయముల తలుపులైనను తీయరు; కొందఱు తీసినను స్వామికి నిత్యారాధనచేయరు. ఈనామములను మాత్రము చక్కగా అనుభవించుచున్నారు. కొంత ధర్మబుద్ధి గల యర్చకులు ఉత్సవముల నాడు మాత్రము, తమకు తీఱుబడి యున్న యెడల, కోవెలతలుపులు తెఱచి, పూజాపురస్కారములు లేక బూజుపట్టియున్న స్వామిపై నున్న గతపత్త్రపు నిర్మాల్యమును తీసి యిన్ని నీళ్లు పోసి యింతపత్రి పెట్టి ఆనాడు వచ్చిన దక్షిణలను పండ్లను కాయలను స్వీకరించి తిరిగి తలుపులు మూసి పోవుదురు. ఇట్టి పరిస్థితులు గల దేవాలయముల గతి యెట్లుండునో ఆ కోవెలలలోని సర్వవ్యాపి యగు భగవంతునికే తెలియును గాని యన్యుఁ డెవఁ డెఱుంగును? కొన్నిచోట్ల తలుపులు లేవు, కొన్నిచోట్ల తాళములు లేవు; మఱికొన్నిచోట్ల దేవాలయములకు గోడలే యుండవు. కొన్ని దేవాలయములు ముండ్లు డొంకలు బలిసి, సర్పములకును వన్యమృగములకును కాకఘూకములకు నాకరమై యుండును. భువనేశ్వరములో నున్న భువనేశ్వరుని కోవెలయొక్కయు, మఱికొన్ని కోవెలలయొక్కయు ప్రస్తుతావస్థ మా[illegible] నెవరి హృదయము నీరు కాదు? ఇట్టి యసహాయకర మగు స్థితిలో నున్న దేవాలయములను సహితము ఏకాంతసేవల కుపయోగించుచు వాని నప్పుడప్పుడు జనాన్వితముల నొనర్చుచుండువారియెడ కృతజ్ఞత చూపవలసినదే మో యాలోచింపవచ్చును.

మఱియు, నిట్లు కట్టుబాటు లేని దేవాలయముల యర్చకుల స్థితిని చూచి తీఱవలసినదె గాని వ్రాయుటకు వీలు లేదు. వీరిలో బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును గలరు. ఈయర్చకసముదాయములో చాలమంది త్రాగుబోతులు, వ్యభిచారులు, కల్లరీఁడులు, దౌర్భాగ్యులు, విద్యాశూన్యులు, మత మన నేమియో తెలియనివారు అనిన, నిజమునకు విశేషదూరమా? వీరు చేయని దుష్కార్య మేదియు లేదు. ఇట్టివారిచేతి ప్రసాదము గాని తీర్థము గాని యేసన్మానవుఁ డిచ్ఛగించును?

'తొమ్మండుగురు కలిసి తోఁక తెగఁగోసి' రన్నట్లు, అర్చకులయొక్కయు, ధర్మకర్తలయొక్కయు, ప్రజలయొక్కయు అశ్రద్ధచే దైవభక్తి కిరవగు దేవాలయముల స్థితి మాఱినది. కోవెలలా శిథిలమగుచున్నవి. ఒకకోవెలయందయినను ఆరోగ్యకరమగు నేర్పాట్లనుసరింపఁబడుచుండుట లేదు. గోడలనిండ ప్రసాదపు మఱకలు, నూనెయాముదములచారిక లేకదా. ప్రతిమూలను కుళ్లిన పువ్వుల ప్రోగులే గదా. కోవెలలోపల ఈఁగలు దోమలు జుమ్మని రొదచేయుచుండును. ఎన్నికోవెలలలో పావురములు గూడులు కట్టి, కోవెలలను దుర్గంధభూయిష్ఠములుగా చేయుట లేదు? జగన్నాథములోని యింద్రద్యుమ్న మహారాజు కట్టించిన గుళ్లను చూచినవారందఱికి ఈ సంగతి అనుభవనీయమే. కొన్నికోవెలలలో పాదము పెట్టిన అంటుకొన్న మకిలి యెంత కడిగినను వదలదు. క్షమించినచో, కొన్ని దేవాలయములలోనికిఁ బోయిన నక్కడిసువాసనచేఁ గాఁబోలు కడుపులో త్రిప్పి వాంతులు కూడ వచ్చును. స్వామి కభిషేక మైనతీర్థమును, ఇంక నితర విధముల స్వామిసన్నిధానమున వాడఁబడు నీరంతయు, గుడి కీవల కోవెలప్రహరిలోనే సోమసూత్ర మనఁబడు నొక పెద్దగోతిలో నిలువ యుండుటందఱకుఁ దెలిసినవిషయమే గదా? ఆసోమసూత్రము భరింపరాని దుర్గంధము వ్యాపింపఁజేయుచు తోఁకపురుగులతో నిండి ముఱికినీటి కుండరమే లనిపించుచుండును. కొన్నిచోట్ల నీపురుగులు ఆసోమసూత్రముయొక్క నాళముగుండ స్వామిసన్నిధానమునకుఁ బోయి యక్కడ దేవునకు తమయొక్క యుద్ధతభక్తిని చూపుచుండును. దేవాలయము లిట్టిస్థితిలో నున్నప్పుడు, ఆ స్థలములు ప్లేగుకలరాలకు పుట్టినిండ్లగుచుండుట వింత కాదు. దీని కంతయు నెవరు పూచీ? మనమే! ముమ్మాటికిని మనమే! ఈ దైవాపచారము, ఈ పాపఫలము మనలను కట్టి కుడుపుచునే యున్నది. ఆలోచించుకొనిన మనకే తెలియఁగలదు.

ఇంతే గాక, దేవాలయపు వ్యవహారములు కూడ పూర్తిగా మాఱిపోయినవి. ఎన్నిచోట్ల దేవాలయపు టాస్తులు తనఖా భోగబందా క్రయము లయిపోయినవి. పెద్ద లేర్పఱిచిన సదావర్తులు పూజ్యము లయినవి. భోగరాగాదులు పూర్వపురీతిగా జరుగుటయే లేదు. దేవాలయమును చూచినతోడనే దాని పూర్వపు ఔన్నత్యము జ్ఞప్తికి వచ్చి దాని ప్రస్తుతస్థితికి వగవనివాఁ డెవఁడుండును? కొన్ని ప్రసిద్ధదేవాలయములు దీపారాధనకు కూడ నోఁచుకొనలేదు. వీనికి రాఁబడి యున్నదా? లక్షలకొలఁది కలదు.

ఈపై యంశము లన్నిటిని బట్టి చూడఁగా తేలిన దేమన, దేవాలయము లెందుకొఱకు స్థాపింపఁబడినవో ఆ సదుద్దేశములను మనము పూర్తిగా మఱచినాము. ఆ యుద్దేశములు పోయినప్పుడు వానిని గుఱించి శ్రద్ధ తీసికొనువాఁ డెవ్వఁడు? కాఁబట్టియే ప్రస్తుతము పూర్వమువలె నూతన దేవాలయములు విశేషముగా కట్టఁబడుట లేదు. వానికి బదులుగా ప్రార్థనామందిరములు బ్రహ్మోపాసనామందిరములు మొదలగునవి కట్టఁబడుచున్నవి.

అయినను, నిట్టి దీనావస్థలో నున్న దేవాలయములను మనము వదలివేయవలసినదేనా? అవి పునరుద్ధారణ చేయు మార్గములు లేవా? లేకేమి? అయ్యలారా! అందఱును నేకమనస్కు లయి సంపూర్ణదృష్టితో ఒకమాఱు ఈదేవాలయముల కేగి చూడుఁడు. ధర్మకర్తలను హెచ్చరింపుఁడు. అర్చకులను కూడ హెచ్చరింపుఁడు. వలయు మరమ్మత్తులను చేయింపుఁడు. లోపలికి గాలి వెల్తురు వచ్చెడి మార్గము లేర్పఱుపుఁడు. వలయునంత దీపారాధన చేయుఁడు. వీలుగానున్నచోట్ల విద్యుద్దీపములు, విద్యుద్వ్యజనములు కూడ నుపయోగింపుఁడు. దేవుఁడు కోపపడఁడు. ఆముదపుమఱకలు నూనెమఱకలు చెఱుపుఁడు. సాంబ్రాణిని కర్పూరమును పుష్కలముగా కర్చుపెట్టుఁడు. ముఱికినీరు దూరముగా పోవు నేర్పాట్లు చేయింపుఁడు. ప్రసాదమును కూడ ఆరోగ్యముగా నుంపుఁడు. అది సద్వినియోగముగా కర్చుపెట్టుఁడు. కోవెలచుట్టుపట్టు లన్నియు నారోగ్యకరముగా నుంపుఁడు. చూడుఁడు క్రైస్తవాలయములు, మహమ్మదీయమసీదులు నెంత యారోగ్యకరముగా, నాహ్లాదకరముగా నున్నవో! వానిలోనికి వెళ్లిన, వచ్చుటకు బుద్ధియే పుట్టదుగదా! నూతనదేవాలయములను నిర్మించుటకంటె పురాతన మైనట్టియు, శిథిలమైనట్టియు దేవాలయములను పునరుద్ధారణచేయుటవలన కలిగెడి పుణ్యము ద్విగుణమై యుండును.

మఱియు వీలైనచోట కోవెల యాదాయములో కొంతభాగము విద్యాదానముక్రింద కర్చుపెట్టుఁడు. దేశోద్ధారణపుణ్యము కూడ దక్కును. ప్రతిదేవాలయము విద్యాదానము చేయుటకు పూనుకొన్నయెడల మనదేశములోని ముప్పదికోట్లమంది జనులును విద్యావంతులు కారా? ప్రస్తుతము మనమతము కూడ క్షీణదశయం దున్నది. దీనిని పునరుద్ధారణచేయుటకు మతప్రచారకులను ఏర్పఱిచి వారిచే ప్రజలకు మన మతధర్మములను బోధపఱుపవచ్చును. అందువలన మనము మన మతమును ఎంత బలపఱుతుమో మీకే తెలియఁగలదు.

అయ్యలారా! పయిని సూచింపఁబడిన రీతిని ఏర్పాట్లు మనము చేయనిచో, మన మతము క్షీణించుటయే గాక, కాలక్రమమున మన ప్రసిద్ధదేవాలయము లన్నియు నామమాత్రావశిష్టము లయి, ఆ స్థలములయందు కొన్నిగోతులు రాళ్లు తప్ప మఱియేమియు నుండకుండుట తటస్థించును. అందువలన మన గృహనిర్మాణశాస్త్రమునకెంతలోపము వచ్చునో మీకే తెలియఁగలదు. అయ్యలారా! అట్టిదశ వాటిల్లకుండఁ జేయుదు రనెడి ప్రార్థనతో విరమించుచున్నాఁడను.

# భరతశాస్త్రము — రాగాధ్యాయము

జేతపూడి ప్రకాశము గారు

ఈశ్వరనిర్మితము లగు సకలవిద్యలలో భరతవిద్య నిఖిల జనాహ్లాదకం బై యిహపరసాధకం బై యున్నది. భరత మనఁగ భావరాగతాళములను గుఱించి చెప్పునది. అందు భావాధ్యాయమున నాయికానాయకవివేచనయును శృంగారాదిరసవిశేషంబులును నేత్రహస్తాద్యభినయ విశేషంబులును దెలుపఁబడియుండును. ఇయ్యవి కావ్యనాటకాదులఁ జెప్పఁబడి యుండుటచేఁ గొంతవఱకు భావాధ్యాయము విద్వత్పరిశీలితం బై యందునకు వలయు రసమంజర్యాదిగ్రంథంబులు చాలవఱకు నిర్దుష్టంబు లయి యున్నవి. రాగాధ్యాయము కేవలము గాయకులవశ మై తాళాధ్యాయము నటులవశ మై యుండినవి. ఈ గాయకనటులు తఱచు సాహిత్యపరులు గాక పోవుటంజేసి యీ రెండధ్యాయములును రానురాను లక్షణశూన్యము లయి యున్నవి. వీనికి సాకల్యముగాఁ దగిన పుస్తకములును లేవు. ఉన్నను నవి యుపలబ్ధభూయిష్ఠంబు లై యనన్వయంబులుగ నుండును. కొందఱు గాయకులకుఁ గొంతకొంత తెలిసియున్నను, నితరులకుం జెప్పక హానిని తమతోనే నశింపఁజేతురు. ఇట్టి రాగతాళాధ్యాయములను గుఱించి తెలియఁగోరి కొందఱు పెద్దలవలనను కొన్నికొన్ని గ్రంథములవలనను గొంతవఱకుఁ దెలిసికొంటిని. అందు రాగాధ్యాయమును గొంతవఱకు నీ సంవత్సరాదిసంచికాముఖమున వెల్లడించుచున్నాఁడను. మహాశయులు లిందలిలోపములను క్షమింతురుగాత!

సంగీతమునకు స్వరము ప్రధానము. స్వర మనఁగా వినువారి చిత్తమును రంజింపఁజేయునది యని యర్థము. ఈ స్వరములు జంత్రిగాత్రములవలన నేడు విధములుగాఁ బలుకఁబడుచున్నవి. ఆ యేడును స, రి, గ, మ, ప, ధ, ని యని యేడక్షరములుగాఁ బలుకఁబడుచున్నవి. ఇందు స షడ్జ మనియు, రి ఋషభ మనియు, గ గాంధార మనియు, మ మధ్యమ మనియు, ప పంచమ మనియు, ధ ధైవత మనియు, ని నిషాద మనియుఁ జెప్పంబడును. షడ్జ మనఁగా మిగిలిన యాఱుస్వరములకు జన్మస్థాన మగుటవలన షడ్జ మనియు, ఋషభస్వరమును బోలియుండుటచే ఋషభమనియు, గాంధారదేశస్థులకుం గడుఁ బ్రియమైనదిగావున గాంధారమనియు, సప్తస్వరములలో మధ్యనుండుఁగాన మధ్యమ మనియు, అయిదవది గనుక పంచమ మనియు, ధీమంతులచేఁ బాడఁబడునదిగాన ధైవత మనియు, స్వరములు తుదకు నిలుచును గాన నిషాద మనియు వీనియర్థములు. ఇవి క్రమముగా నెమలి గోవు మేఁక కొంగ కోయిల గుఱ్ఱము ఏనుఁగు ధ్వనులను బోలియుండును. వీనిలో షడ్జముయొక్క మొదటి ష, స యనియు, ఋషభముయొక్క మొదటి ఋ, రి యనియు, మిగిలినస్వరములకు వాని మొదటియక్షరములను, పాడునప్పు డుపయోగపఱిచెదరు. షడ్జ ఋషభములను ష-ఋ అని పాడుటకును, వినుటకును కూడ కటువుగా నుండుటచే, స రి యని పాడుదురు. మఱియు ష, ఋ లకు స, రి యనువర్ణములు యతులుగా కూడ చెల్ల వచ్చును గనుక పెద్ద లంగీకరించి స, రి యని పాడుచున్నారు. ఈసప్త స్వరములను 22 శ్రుతులుగా చేసి దేవతలు గానముచేయుదురని గ్రంథములవలనఁ దెలియుచున్నది గాని అట్లు పాడుట మనుష్యుల కసంభవము. మనుష్యులు పాడుచుండు పద్ధతి ప్రకారము సప్తస్వరములను పదునాఱు శ్రుతులనుగాఁ జేసి పాడుచున్నారు. షడ్జము శ్రుతిప్రధాన మగు స్వర మగుటవలన నందు భేదంబు లెవ్వియుఁ గలుగవు. మృదంగము తంబుర మొదలగునవి షడ్జములో లీనమయి యుండును. దీనిలో భేదంబు లుండెనేని వేఱొక షడ్జము గల రాగ మారంభించిన, నీ మృదంగము తంబుర మొదలగు శ్రుతు లన్నియు మాఱవలసివచ్చును. కనుక, ఇందు భేదంబు లేమియు లేక యేకరీతిగా నుండితీరవలయును. రిషభము మూఁడు భేదంబు లగుచున్నది. శుద్ధరిషభ మనియు చతుశ్శ్రుతి రిషభ మనియు షట్శ్రుతిరిషభ మనియు వానికి పేళ్లు. ఇవి క్రమముగా నొకదానికంటె నొకటి హెచ్చుగా నుండును. తోడి సావేరి మొదలగు రాగములలో వచ్చునది శుద్ధరిషభము. ఇది మూఁడు రిషభములలో తక్కువ ధ్వని గలది. భైరవి శంకరాభరణములయందు వచ్చునది చతుశ్శ్రుతి రిషభము. ఇది శుద్ధరిషభముకంటె రెండు శ్రుతులు హెచ్చుగా నుండును. నాట, రసికప్రియ మొదలగు రాగములయందు వచ్చునది షట్శ్రుతి రిషభము ఇది రిషభముల మూఁడింటిలో హెచ్చయినది. గాంధారము శుద్ధము, సాధారణము, అంతరము అని మూఁడువిధములు. వీనిలో శుద్ధగాంధారము చతుశ్శ్రుతి ఋషభముతోను, సాధారణగాంధారము షట్శ్రుతి రిషభముతోను సమానధ్వని గలవి. వీణలో చతుశ్శ్రుతిరిషభ శుద్ధగాంధారము లొక మెట్టుమీదను, షట్శ్రుతిరిషభ సాధారణ గాంధారము లొక మెట్టుమీఁదను పలుకుచున్నవి. కనకాంగి వరాళి రాగములలోనిది శుద్ధగాంధారము. తోడి భైరవి రాగములలో వచ్చునది సాధారణగాంధారము. అంతరగాంధారము పయిని జెప్పిన రెండు గాంధారములకంటె హెచ్చుగా నుండును. కాంభోది శంకరాభరణము మొదలగువానిలోని దీ యంతరగాంధారమే. మధ్యమము శుద్ధమధ్యమ మనియు ప్రతిమధ్యమ మనియు రెండువిధములు. శుద్ధమధ్యమమునకంటె ప్రతిమధ్యమము హెచ్చు. తోడి కాంభోది మొదలగు రాగములలోనిది శుద్ధమధ్యమము. కల్యాణి పంతువరాళి మొదలగు రాగములలో వచ్చునది ప్రతిమధ్యమము. పంచమము

కూడ శ్రుతిస్థాన మగుటచేత షడ్జమమువలెనే దీనియందును భేదంబులు గలుగవయ్యె. ధైవతము ఋషభమువలెనే శుద్ధ చతుశ్శ్రుతి షట్శ్రుతి భేదంబులచే ముత్తెఱంగులయ్యె. ఇవియును క్రమముగా నొకటికంటె నొకటి హెచ్చయి యుండును. తోడి మాయామాళవగౌళలలోని ధైవతము శుద్ధము. శంకరాభరణము చక్రవాక రాగములలోని ధైవతము చతుశ్శ్రుతి. నాట రసికప్రియ మొదలగు రాగములలోనిది షట్శ్రుతి ధైవతము. నిషాదము శుద్ధ కైశికి కాకలి భేదంబులచే మూఁడువిధంబులు. ఇవియును క్రమముగా నొకటి కంటె నొకటి హెచ్చుగా నుండును. శుద్ధనిషాదము చతుశ్శ్రుతి ధైవతముతోడను, కైశికినిషాదము షట్శ్రుతి ధైవతముతోడను సమానములై రిషభ గాంధారములవలెనే వీణలో నొక్క మెట్టుమీఁదనే పలుకుచుండును. గాయకప్రియ, మారరంజని మొదలగు వానిలోనిది శుద్ధ నిషాదము. కాంభోజి చక్రవాక మొదలగు రాగములలోనివి కైశికీనిషాదములు. కాకలీనిషాదము హెచ్చు. కల్యాణి మాయామాళవగౌళలలోనిది కాకలీనిషాదము. ఇట్లీ సప్తస్వరంబులును పదునారు భేదంబులయి శ్రుతు లని చెప్పంబడుచున్నవి. పయిని వ్రాసిన పదునారు శ్రుతులలో శుద్ధ మను పేరు గల యయిదు శ్రుతులును, అనఁగ శుద్ధరిషభము శుద్ధగాంధారము శుద్ధమధ్యమము శుద్ధధైవతము శుద్ధనిషాదము — ఈయైదును, షడ్జపంచమములు చేరి, ఈయేడును ప్రకృతు లని చెప్పఁబడును. తక్కిన తొమ్మిది శ్రుతులును వికృతు లనఁబడును. అనఁగ చతుశ్శ్రుతి రిషభము షట్శ్రుతి రిషభము సాధారణ గాంధారము అంతర గాంధారము ప్రతిమధ్యమము చతుశ్శ్రుతిధైవతము షట్శ్రుతిధైవతము కైశికినిషాదము కాకలి నిషాదము అను నీ తొమ్మిదియును వికృతు లనఁబడును. ప్రకృతి వికృతుల మొత్తము పదునారు అయినను, పలికెడుస్థానములు మాత్రము పండ్రెండయి యున్నవి. ఎట్లన? శుద్ధ సాధారణ గాంధారములు చతుశ్శ్రుతి షట్శ్రుతి రిషభస్థానములలోనను, శుద్ధనిషాద కైశికి నిషాదములు చతుశ్శ్రుతి షట్శ్రుతి ధైవత స్థానములలోనను పలుకుటచేత, నాలుగు స్థానములు తగ్గి, పండ్రెండుమాత్రమే యయి యున్నవి. వీనిలో రిషభ గాంధారము లారును ధైవత నిషాదములయొక్క యారు భేదములచేతను ప్రస్తారక్రమముగా 36 భేదము లగుచున్నవి. ఇట్లు శుద్ధమధ్యమముతోఁ గూడి ముప్పదియారును, ఆ భేదములే ప్రతిమధ్యమముతోఁ గూడి ముప్పదియారును, వెరసి 72 భేదంబులగుచున్నవి. ఈ 72ను మేళకర్త లనియు జనకరాగము లనియుఁ జెప్పంబడును. ప్రస్తారక్రమము: పైని జెప్పిన శ్రుతులలో షడ్జపంచమంబులు ఆధారశ్రుతులు గాన నవి యెప్పుడును మారుట లేదు. రిషభ గాంధారంబు లారు భేదంబులును ధైవతనిషాదంబు లారు భేదంబులు నయి యుండుటచేతను, ఒకేరిషభమును ఒకే గాంధారమును గల భేదమునకు ధైవతనిషాదము లారింటిని ఆఱుపర్యాయములు చేర్చినయెడల నారు భేదంబులు గలుగును గనుకను, రిషభగాంధారములలో నేర్పడిన యారు భేదంబులను ధైవతనిషాదములలోఁ గల యారు భేదంబులచే గుణించిన ముప్పదియారు భేదంబులు గలుగుచున్నవి.

ఇందునకు వివరము: శుద్ధరిషభము శుద్ధగాంధారమును గల రాగమునకు శుద్ధధైవతము శుద్ధనిషాద మొకమారును; శుద్ధధైవతము కైశికినిషాద మొకమారును, శుద్ధధైవతము కాకలినిషాద మొకమారును చేర్చిన, మూఁడు భేదంబు లగును. ఇఁక శుద్ధధైవత భేదంబులు రావు. ఇఁక చతుశ్శ్రుతి ధైవతమునకు కైశికినిషాద మొకమారును, కాకలినిషాద మొకమారును చేర్చిన రెండు భేదంబు లగును. చతుశ్శ్రుతిధైవతమును శుద్ధనిషాదమును సమానధ్వని గలిగి యొకస్థానమునందే పలుకుటచేత, చతుశ్శ్రుతిధైవతము గల రాగములో శుద్ధనిషాద ముండదు. కనుక చతుశ్శ్రుతి ధైవతభేదంబులు రెండే అయియున్నవి. ఇఁక షట్శ్రుతిధైవతము మీఁద కాకలినిషాదము వచ్చి యొకే భేద మగుచున్నది. కైశికినిషాదము షట్శ్రుతిధైవతముతో సమానమును, శుద్ధనిషాదము షట్శ్రుతి ధైవతముకంటె తక్కువయును నయి యుండుటచేత, షట్శ్రుతి ధైవతముమీఁద శుద్ధ కైశికి నిషాదము లుండవు. ఇట్లు శుద్ధధైవతముచే మూఁడు భేదంబులును, చతుశ్శ్రుతి ధైవతముచే రెండు భేదములును, షట్శ్రుతిధైవతముచే నొక భేదంబును, వెరసి యారు భేదంబు లగుచున్నవి. ఇట్లు ఒక్క రిషభగాంధారములు గల రాగమే ధైవతనిషాదములచే నారేసి భేదంబు లగుచుండుటచే, నారేసి రాగంబుల నొక చక్రముగా నేర్పఱిచిరి. ప్రతిచక్రమునందును ఆఱేసి రాగము లుండి ముప్పదియారు భేదము లగుచున్నవి. ఇట్లే ప్రతిమధ్యమము చేర్చిన నింకొక ముప్పదియారు భేదంబు లగుచున్నవి. మొత్తము 72 రాగము లగుచున్నవి. శుద్ధమధ్యమముతోఁ గూడిన మొదటిముప్పదియారు రాగములకు ప్రకృతిమండల మనియును, ప్రతిమధ్యమముతోఁ గూడిన తక్కిన ముప్పదియారు రాగములకు వికృతిమండల మనియును పేళ్లు. ఈ డెబ్బదిరెండు రాగములను 12 చక్రములుగా నేర్పఱిచి యొక్కొక చక్రమున నారేసి రాగములయొక్క శ్రుతులను దెలిసికొనునట్లు చేసిరి. ఎట్లన, ధైవతనిషాదములవలన నొక చక్రములోని యారు రాగములును మారినట్లు రిషభగాంధారములు మూఁడుమూఁడుగా నుండుటవలన చక్రము లారుగా మారుచున్నవి. శుద్ధరిషభముమీఁద శుద్ధగాంధారము, సాధారణగాంధారము, అంతరగాంధారము నుండవచ్చును గనుక శుద్ధరిషభచక్రములు మూఁడును, చతుశ్శ్రుతిరిషభముమీఁద సాధారణ అంతర గాంధారము లుండవచ్చును గనుక చతుశ్శ్రుతిరిషభము గల చక్రములు రెండును, షట్శ్రుతిరిషభముమీఁద అంతర గాంధార మొకటే వచ్చును గనుక షట్శ్రుతిరిషభము గల చక్ర మొకటియును గా మాఱి యారుచక్రము లగును. 1-2-3 చక్రములు శుద్ధరిషభమును క్రమముగా శుద్ధ సాధారణ అంతర గాంధారములును, 4-5 చక్రములు చతుశ్శ్రుతిరిషభమును సాధారణ అంతర గాంధారములును, 6-వ చక్రము షట్శ్రుతిరిషభము అంతరగాంధారమును గలవిగా నుండును. ఇట్లు చక్రములలోని రిషభగాంధారములును ఒక్కొక్క చక్రములోని ధైవతనిషాదములును మారుట నీక్రింది చక్రమునఁ జూడఁదగును.

## ప్రకృతిమండలము

| చక్రములు | రిష. ధ | గాం | చక్రములోని రాగములు | ధై | ని |
|---|---|---|---|---|---|
| 1-వ చక్రము | శు | శు | 1-వ రాగము | శు | శు |
| 2-వ చక్రము | శు | సా | 2-వ రాగము | శు | కై |
| 3-వ చక్రము | శు | అం | 3-వ రాగము | శు | కా |
| 4-వ చక్రము | చ | సా | 4-వ రాగము | చ | కై |
| 5-వ చక్రము | చ | అం | 5-వ రాగము | చ | కా |
| 6-వ చక్రము | ష | అం | 6-వ రాగము | ష | కా |

వికృతిమండల మని చెప్పఁబడు 36 రాగములకును మధ్యను మొక్కటియే భేదము. తక్కిన దంతయు నిట్లే. పయిని జెప్పిన ధైవత నిషాద భేదముల మార్పును రిష. ధగాంధారముల చేర్పుఁజేచి చక్ర నిర్ణయమును ధైవతనిషాదముల చేర్పుఁజేచి వ్యత్యయముగా ప్రస్తరించి నను 72 భేదములు వచ్చును; గాని, అప్పు డా రెండు మండలముల యందుఁగల 1-2-3-4-5-6 రాగములు మాత్రము వెనుకటిప్రకారముగా నుండును; తక్కిన 60 రాగములయొక్క స్వరములును భేదమును పొంది వానికవి విరుద్ధముగా నుండును, గనుక, మొదటఁ జెప్పిన ప్రకారమే యీక్రింది మేళకర్తలయొక్క రిష. ధగాంధారాదిస్వరముల నెఱుంగునది. సదరు 72 మేళకర్తలును 12 చక్రములుగా నున్నవి గనుక వానిం దెలియుటకు 2 చక్రముల నీక్రింద వ్రాయుచున్నాను.

## 1-వ చక్రము

| సంఖ్య | పేరు | ష. | ఋ | గాం | మ | పం | ధై | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | కనకాంగి | | శు | శు | శు | | శు | శు |
| 2 | రత్నాంగి | | శు | శు | శు | | శు | కై |
| 3 | గానమూర్తి | | శు | శు | శు | | శు | కా |
| 4 | వనస్పతి | | శు | శు | శు | | చ | కై |
| 5 | మానవతి | | శు | శు | శు | | చ | కా |
| 6 | తానరూపి | | శు | శు | శు | | ష | కా |

## 2-వ చక్రము

| సంఖ్య | పేరు | ష. | ఋ | గం | మ | పం | ధై | ని |
|---|---|---|---|---|---|---|---|---|
| 61 | కాంతామణి | | చ | అం | ప్ర | | శు | శు |
| 62 | రిష. భప్రియ | | చ | అం | ,, | | శు | కై |
| 63 | లతాంగి | | చ | అం | ,, | | శు | కా |
| 64 | వాచస్పతి | | చ | అం | ,, | | చ | కై |
| 65 | మేచకల్యాణి | | చ | అం | ,, | | చ | కా |
| 66 | చిత్రాంబరి | | చ | అం | ,, | | ష | కా |

జ్యోతిశ్శాస్త్రమంత్రశాస్త్రంబులయందువలెనే యీ సంగీత శాస్త్రమునందును కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్టా, అను నియమముచే నాద్యక్షరములంబట్టి యీమేళకర్త యున్నదని తెలిసికొనవచ్చును.

### ఉదాహరణము

మేచకల్యాణి మకారము పాదిపంచలోనిది గనుక, మొదటి యక్షరమునకు 5 వేసికొనునది; చకారము కాదినవలోనిది గనుక, 6 వేసికొనునది. సంఖ్యను ఎడమవైపున వేసికొనునది. ఇట్లు వేసికొనిన 65-వ మేళకర్త యని తెలియుచున్నది. ఈ సంఖ్యనుబట్టి యిది యేమండలములో నేచక్రములోనిదో తెలిసికొనవచ్చును. పిమ్మట దాని మండలసిన రిష. ధగాంధారాదులును తెలిసికొనవచ్చును. ఇంకొక యుదాహరణము గానమూర్తి. గకారమునకు 3 సంఖ్య, నకారమునకు నేమియు సంఖ్యలేదు,కనుక నెడమభాగమున నంకె యుండదు. మూఁడవమేళకర్త యని యెఱుంగునది. ఇట్లు డెబ్బదిరెండుమేళకర్తలకును పేళ్లు గలవు. ఒక్కొక్క చక్రములో నే యే మేళకర్తలు గలవో యదంతయు శ్లోకరూపముననున్నది. గ్రంథవిస్తరభీతి నిట విరమించితి. ఈమేళకర్తలకు జనకరాగము లని పేరు గలదు. వీనికలన ప్రస్తారక్రమమున చాల రాగములు పుట్టుచున్నవి. వానిని జన్యరాగము లందురు.ఇవి మేళకర్తలవలె నారోహణావరోహణములయందు సప్తస్వరములతో నుండవు. ఆరోహణావరోహణములయందు సంపూర్ణ షాడవ ఔడవ భేదంబులతోఁ గూడి ఒక్కొక్కమేళకర్తనుండి 484 భేదములు గల రాగములు పుట్టుచున్నవి. శ్లో. ఔడవః పంచభిః ప్రోక్త ష్షడ్భి ష్షాడవ ఉచ్యతే। సంపూర్ణ స్సప్తభి ర్జ్ఞేయః ఏవం రాగా స్త్రిధామతాః. అయిదు స్వరములు గలది ఔడవము. ఆఱు స్వరములు గలది షాడవము. ఏడు స్వరములును గలది సంపూర్ణ మనఁబడును.

సదరు సంపూర్ణ షాడవ ఔడవ భేదంబులు ఒకటితో నొకటి కలియుటచేత తొమ్మిది భేదంబు లగుచున్నవి.

1. సంపూర్ణసంపూర్ణము—ఆరోహణావరోహముల నన్ని స్వరములు కలది. 1
2. సంపూర్ణషాడవములు—ఆరోహణ కన్ని స్వరములును, అవరోహణకు ఆఱు స్వరములు 6
3. సంపూర్ణౌడవములు—ఆరో. అన్ని స్వరములు, అవ. అయిదు స్వరములు 15
4. షాడవసంపూర్ణములు—ఆరో. ఆఱు స్వరములు, అవ. అన్ని స్వరములు 6
5. షాడవషాడవములు—ఆరో. ఆఱు స్వరములు, అవ. ఆఱు స్వరములు 36
6. షాడవౌడవములు—ఆరో. ఆఱుస్వరములు, అవ. అయిదు స్వరములు 90
7. ఔడవసంపూర్ణములు—ఆరో. అయిదు స్వరములు, అవ. అన్ని స్వరములు 15
8. ఔడవషాడవములు—ఆరో. అయిదు స్వరములు, అవ. ఆఱు స్వరములు 90
9. ఔడవౌడవములు—ఆరో. అయిదు స్వరములు, అవ. అయిదు స్వరములు 225

మొత్తము. 484

ఇట్లు ఒక్కొక్క మేళకర్తవలన నాలుగువందల యెనుబదినాలుగు భేదములవంతున 72 మేళకర్తలవలనను 34,848 రాగములును కలుగుచున్నవి. ఎట్లన, ఆరోహణము సంపూర్ణముగా నుంచి అవరోహణమును సంపూర్ణముగా నుంచిన నొక్క భేదము వచ్చును. ఆరోహణమును సంపూర్ణముగానే యుంచి అవరోహణములో తేపకు నొక్కొక్క స్వరమును వర్జించిన నాఱు భేదంబులును, ఒక్కొకటి వంతున చేర్చిన నాఱు భేదంబులును వచ్చును. ఆరోహణమును సంపూర్ణముగానే యుంచి తేపకు రెండేసిస్వరములను వర్జించిన ఔడవ భేదంబుల పదునయిగిటిని, ఒక్కొక్కటివంతున చేర్చిన పదునైదు భేదంబులు వచ్చును. ఇట్లు ఇరువదిరెండు భేదంబు లగుచున్నది. వర్జించుటలో షడ్జము నెప్పుడును వర్జింపఁగూడదు. షాడవౌడములు ఒకటి రెండు స్వరములు వర్జించుటచేతఁ గలుగుచున్నవి గనుక నాక్రమ మీక్రిందఁ గనఁబఱిచితి:—

ఆరోహణ: క్రిందనుండి పైకిఁ బోవుట. ఉ. సరిగమపధనిస
అవరోహణ: పైనుండి క్రిందికి దిగుట. ఉ. సనిధపమగరిస
} సంపూర్ణము 1 భేదము

షాడవము లాఱు విధములు. ఆరోహణయందుఁగాని అవరోహణయందుఁగాని తేపకు ఒక్కొకస్వరము వర్జించి పాడుట. ఉ: సధపమగరిస। సనిపమగరిస। సనిధమగరిస। సనిధపగరిస। సనిధపమరిస। సనిధపమగస. ఇవియే షాడవమునందుఁ గల యాఱు భేదములును. ఔడవములు పదునయిదు భేదంబులు. ఆరోహణయందుఁగాని అవరోహణయందుఁగాని రెండేసిస్వరములను విడిచి పాడుట. నిషాదముతో నొక్కొకస్వరమును కలుపుకొని వర్జించిన నయిదు భేదములును, ధైవతముతో నొక్కొక్కటి కలుపుకొని వర్జించిన నాలుగు భేదములును, పంచమముతో నొక్కొక్కటి కలుపుకొని వర్జించిన మూడు భేదములును, మధ్యమముతో నొక్కొక్కస్వరము కలిపి వర్జించిన రెండు భేదములును, గాంధారముతో నొక్కొక్కటి కలిపి వర్జించిన నొక్క భేదమును, వెరసి పదునయిదు భేదముల యౌడవములును వచ్చును. ఉ: సధపమగరిస। సధమగరిస। సధపగరిస। సధపమరిస। సధపమగస 5. సనిమగరిస। సనిపగరిస। సనిపమరిస। సనిపమగస. 4. సనిధగరిస। సనిధమరిస। సనిధమగస 3. సనిధపరిస సనిధపగస 2. సనిధమస 1. ఇట్లు ఔడవములు పదునైదు భేదంబు లయ్యె. సంపూర్ణభేద మొకటియును, షాడవభేదము లాఱును, ఔడవభేదంబులు పదునైదును, మొత్త మిరువదిరెండు భేదము లయ్యెను. కనుక నిలువున నిరువదిరెండు గదులును అడ్డమున పదునాఱుగదులును గల చక్రము నొకదానిని వేసి అడ్డగదులలో నారోహణావరోహణముల వ్రాసి, నిలువుగదులలో నీ యిరువదిరెండు భేదములలో నొకదానిని ఆరోహణముగా నుంచి అవరోహణమునకు నీ యిరువదిరెండు భేదములను వ్రాసిన, నిరువదిరెండు విధంబులుగను, ఇట్లిరువదిరెండుచక్రంబులను వేసి ప్రతిచక్రములోను ఆరోహణ మంతకు నొక భేదమును వ్రాసి, అవరోహణమునకు నీ యిరువదిరెండు భేదములను వ్రాసిన, వచ్చినభేదము రాశుఁడ 22×22=484 భేదములు వచ్చును. ఒక చక్రమును వ్రాసిచూపుచున్నాను.

| సంఖ్య | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|
| 1 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 2 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 3 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 4 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 5 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 6 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 7 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 8 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 9 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 10 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 11 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 12 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 13 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 14 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 15 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 16 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 17 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 18 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 19 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 20 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 21 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 22 | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |

ఈతీరున 22 చక్రములను వేసి, అవరోహణమందుఁ గల యిరువదిరెండు భేదముల నొక్కొక్క భేదమును ఒక్కొక్క చక్రములో నారోహణముగా నుంచి యీ యిరువదిరెండు భేదముల నవరోహణముగా నుంచవచ్చును. అట్లు 22 చక్రములవలనను కలిగిన 484 రాగ

ములకే జన్యరాగము లని పేరు. అన్నియు మొత్తము(34,848)ముప్పది నాలుగువేల యెనిమిదివందల నలువదియెనిమిది రాగము లగుచున్నవి. ఏమేళకర్తలో పుట్టినవానికి నామేళకర్తయొక్క రిషభగాంధారాదులే యుండును. ఇవి గాక, వక్రరాగము లని కొన్ని గలవు. అవి యిట్లు ప్రస్తారక్రమమున వచ్చునవి కావు. అవి యిన్ని యని నియమము లేదు. ఒకరాగముయొక్క యారోహణావరోహణముల నుదాహరణముం జూపెద' సరిగమపమధనిస సనిధాపమగామరిస. దీనికి కానడ యని పేరు. ఇది ధీరశంకరాభరణ మను 29-వ మేళకర్తనుండి వచ్చినది. ఇట్టి వక్రరాగములకు ఆరోహణావరోహణములు క్రమముగా నుండక క్రిందికి మీఁదికి స్వరములు మాఱియుండును కనుక వీనికి నియమము లేదు. బుద్ధిమంతు లొక్కొక్క మేళకర్తలోని స్వరములను వక్రగతిగా మార్చి చూచిన క్రొత్తగా నొకరాగముకళ కనుపించును. వారు దానికి వారి యిష్టమువచ్చిన పేరు పెట్టుదురు. ఇదివఱలో వాడుకలో నున్న జన్యరాగములకు పూర్వులే పేళ్లు పెట్టియున్నారు. ఏమేళకర్తలోనుండి గాని క్రొత్తగా నొక భేదము నిప్పుడు పాడఁదలఁచిన వారి యిష్టమువచ్చిన పేరు పెట్టుకొనవచ్చును. మఱియు నీజన్యరాగము లేమేళకర్తనుండి వచ్చెనో విచారింపవలసిన దెట్లనఁగ: దానిలోని మధ్యమమును బట్టి ప్రకృతి వికృతి మండలము తెలిసికొని పిమ్మట రిషభ గాంధారములనుబట్టి అది యెన్నవచక్రమో తెలిసికొని ధైవతనిషాదములవలన చక్రములో నెన్నవదో తెలిసికొనవచ్చును. అప్పుడు మేళకర్తయొక్క సంఖ్య తెలియుచున్నది గాని మేళకర్తయొక్క పేరు గనుఁగొన వీలులేదు. ఏచక్రములో నేయేమేళకర్త లుండెనో వానిశ్లోకములను గ్రంథవిస్తారమగునని వ్రాయలేదు. దానిమోస్తరున కొక్కచక్రముయొక్క శ్లోకమును వ్రాసెదను శ్లో॥ యాగప్రియో రాగవర్ధన్యథ గాంగేయభూషిణీ వాగధీశ్వరిశూలిన్యౌ చలనాటస్తు షష్ఠమే. ఇది యాఱవచక్రము. ఇట్లన్ని చక్రములకును శ్లోకములు గలవు గాని యిట వ్రాయఁబూనలేదు. మఱియు నీజన్యరాగములలో నారోహణావరోహణములలో నొక స్వరమే వర్జమయి యున్నయెడల, నట్టి రాగము లేమేళకర్తలలో జన్యములో చెప్పుటకు వీలులేదు. సరిగపధస సధపగరిస— అను నారోహణావరోహణములు గల మోహన యను రాగమున్నది. దీనిలో మధ్యమము లేదు. శుద్ధమధ్యమ రాగములలోనిదో ప్రతిమధ్యమ రాగములలోనిదో తెలియదు. నిషాదమును లేదు. కైశికి కాకలి నిషాదభేదము గల యేమేళకర్తలోనిదో తెలియదు. ఇప్పుడార్యవ్యవహారం బంగీకరింపవలయు. మేళకర్తల వరుసలో ముందేమేళకర్తలో రావచ్చునో దానిలోనిదని తెలిసికొనవలయును. ఈ రాగము 28-29-64-65 మేళకర్తలలో దేనిలోఁగాని రావచ్చును. 28 లో జన్య మనుట యార్యధర్మము. ఇంక నిందును గుఱించి మేళకర్తల చక్రములను, జన్యరాగచక్రములను, మేళకర్తలలో పుట్టి యిదివఱకు వాడుకలో నున్న రాగములను విడిచి క్లుప్తముచేసి, రాగాధ్యాయముయొక్క రీతి యిట్టిదని చెప్పి యింతట విరమించుచున్నాను.

సీ. భరతశాస్త్రంబున ♦ భావంబు రాగంబు - తాళంబు నీమూఁడు ♦ దనరుచుండు
భావ తాళాంశముల్ ♦ పండిత నటహర్ష - కరములు రాగప్ర ♦ కరణ మెల్ల
గాయకమోదసం ♦ ధాయకమై సర్వ - జనుల చిత్తంబులు ♦ సంతసింపఁ
జేయుఁ గావున దానిఁ జెప్పఁబూనితి నాకుఁ - దెలిసిన సంగతి దెనుఁగులోడ

స్వరములకుఁ గల్గు శ్రుతులును ♦ వరుస మేళ
కర్తలును రాగనిర్ణయ ♦ క్రమము నాంధ్ర
సంచికను వెల్లడించెద ♦ సరసు లెల్లఁ
దప్పు లున్నను మన్నింపఁ ♦ దలఁతు నన్ను.

ఉ. ఓ సరసేంద్రులార, మది ♦ నోపికతోఁ బరికింపుఁ డీసు సం
తోసము మీఱ నాంధ్రపద ♦ ధోరణితో మన గానవిద్య నీ
వ్యాసము చేతఁ బూడి వర ♦ వంశజుఁడైన ప్రకాశ మీక్రియన్
జేసెను రాగపద్ధతిని ♦ జెల్వగు నా భరతోక్తవైఖరిన్.

# ఆంధ్ర చోళుల శాసనములు

కొణిదెన బాలకృష్ణయ్య గారు

చోళులు కొంతకాలము తెలుఁగుసీమలోని కమ్మ రాష్ట్రమునకుఁ బరిపాలకులుగ నుండిరి. వారికి, ఇప్పటి గుంటూరు మండలములోని కొణిదెన (కొట్యదోన యని ప్రాచీననామము) రాజధానిగా నుండెను. ఇయ్యది గుంటూరునుండి ఒంగోలునకుఁ బోవు హైరోడ్డునకుఁ బశ్చిమమున మూఁడుమైళ్ల దూరమున నున్నది. పదునొకండవశతాబ్దమునను, పండ్రెండవశతాబ్దమునఁ గొంతదనుకను, కొట్యదోన (కొణిదెన) చోళులకు ముఖ్యపట్టణముగ నున్నట్టు శాసనములు సూచించుచున్నవి. ఆయూరఁ జోళుల శాసనములు గొన్ని కలవు.

ఆశాసనములకుఁ బ్రతిని దయారుచేయవలయునను తలంపున, నా యశక్తతను బాటింపక కొన్ని నెలలు పరిశ్రమ చేసితిని. కొంతకాలమునకు అసంపూర్ణములుగఁ గొన్నింటిని మాత్రము నా నోటుబుక్కులో వ్రాసికొనఁగలిగితిని నా ప్రయత్నము సఫలముగానందులకు నామనస్సు మిగుల సంకటపడెను. శాసనములు గొన్ని పగిలిపోయియున్నవి. కొన్ని సగము సగము భూమిలోనికిఁ బాతఁబడియున్నవి. కొన్నికొన్ని యొక ప్రక్క నంతటను దేవాలయకుడ్యములలోఁ దాపటము చేయఁబడియున్నవి. కావున నవ్విషయమున నేను గృతకృత్యుఁడఁ గానేరనైతిని. కొంతకాలముక్రిందట నీశాసనములలోఁ గొన్నింటికి, జయంతి రామయ్యపంతులుగారు బహుళ ప్రయత్నముతోఁ జిత్తు ప్రత్యంతరములఁ దీసికొనిపోయి రని కొందఱు పెద్దలు చెప్పుచున్నారు.

రామయ్యపంతులుగారు వీని నే పత్రికలోనైనఁ బ్రకటించిరా యని కొంతశోధన చేసితిని. నా కాజాడ యెద్దియుఁ బత్రికలలోఁ గానరాలేదు. శాసనములలోని కొన్ని వాక్యములను కొన్నికొన్ని శబ్దములను, కొన్ని విశేషణములను, కొన్ని నామములను, కొన్ని పద్యములను దెలిసికొని సంతోషమును, పూర్వోత్తరసందర్భములు దెలియనప్పుడును సమన్వయము గానిపదములు దొరకినప్పుడును ధారాళముగాఁ జదువుచు ముందిఁకేమి విశేషము కానున్నదో యను తమకమున దృష్టి క్రేళ్లుఱుకుచుఁ బోవుచుండ నడుమ నొకచోట రాయి పగిలిపోయి అక్షరశూన్య మగుచుండ దోఁచినపుడును మిగుల వ్యసనమును, నే ననుభవించుచుండెడివాఁడను. ఆసమయముననే మదరాసు ఓరియంటల్ లైబ్రరీలోనికి ఇచ్చటి శాసనములు కొన్ని దొరతనమువారివలన కొనిపోఁబడిన వని యొకమిత్రుఁడు నాకుఁ జెప్పెను. అవియు నసంపూర్ణములుగనే యున్న వని ఇంకొకహితుఁడు చెప్పెను. శాసనములు చదువుటయు వ్రాయుటయు అసాధ్య మని తోఁచినకొలఁదిని, వానిని సాధించుద మను పట్టుదల నాకుఁ గలుగుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు కొన్ని ప్రాఁతపొత్తంబులను జక్కపఱుప నెంచి యొకపేటికం దెఱచితిని. అందున్న కొన్నిసంపుటములను జేత నెత్తి క్రిందఁ బెట్టితిని. అపుడు, కాలుటావు (ఒకకాగితములో నాలుగవవంతు) కాగితపుసైజున వ్రాయఁబడి పొగచూరియుండినపొత్తం బొండు నాకు దృష్టిపథగతం బయ్యెను. అది యూదాసిరాతో వ్రాయఁబడియుండెను. అక్షరములు ముత్యముల కోవలు. అది నాహృదయము నాకర్షింప, చేత నెత్తి చూచితిని; చోళరాజుల శాసనములు అను పేరునఁ జెలంగుచుండెను. ఇఁక నా సంతోషమునకు మితి లేదు. వెంటనే పేటికను మూసివేసితిని. నాకు దొరకిన యా చిన్నపొత్తము నొకపావుగంటలోఁ జదివితిని. నే నదివఱకు వ్రాసియుంచిన అసంపూర్ణశాసనములను ఆగ్రంథముతో సరిచూచితిని. కొన్ని లోపములు లేకపోలేదు; కాని మొత్తముమీఁద నేను వ్రాసినంతవఱకు సరిగానే యుండెను. ఆగ్రంథము కీర్తిశేషులగు నా పెద్దతండ్రి కొణిదెన పెద్దపిచ్చయ్య గారి స్వహస్తమున వ్రాయఁబడినది.

ఇంత కష్టపడి వానిని శోధింప నీ కేమి పని గలిగె నని కొందఱు ప్రశ్నింపవచ్చును. వారికి "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అను నార్యోక్తి ననుసరించి, నా మాతృదేశముయొక్కయు అందును నా నివాసగ్రామముయొక్కయు పూర్వచరిత్రములను తచ్ఛిలాశాసనములవలన నెఱింగి,గర్వించుద మను తలంపున నే నిట్టిపని కొడంబడితి నని మాత్రము జవాబుం జెప్పుచున్నాను. నాకుఁ గలిగిన యానందమును నా మాతృదేశవాసులగు నాంధ్రసోదరులకుఁ గూడఁ గలిగింప నెంచి నా పెద్ద తండ్రి కీర్తిశేష పెద్దపిచ్చయ్యగారు వ్రాసిన పోత్తమున నున్న దున్నట్టుగఁ దూచాలు తప్పకుండఁగ నీసంవత్సరాది సంచికయందుఁ బొందు పఱచుచున్నాను. ఇందుఁ జ్యాతసంస్కారదోషములు పెక్కు లుండియున్నవి. అయినను, ఇటువంటివానిలో విషయము మాత్రమే ప్రధాన మని చరిత్రకారు లెంచెదరు గావున సంకోచింపఁబనిలేదు. మఱియు, అల్పమతి నగు నా కా పని సాధ్యము గా దని యెంచి, తత్సంస్కార భారమును పాఠకప్రపంచమునకును, సమర్థులగు పండితులకును, చరిత్రకారులకును వదలి వేయుచున్నాను. ప్రతిలో నున్నట్టు లిఖించి మీ కనుల యెదుటఁ బెట్టుచున్నాను.

---

I

పంటసాలవద్ద వుత్తరం తూర్పుమూల పాతివున్నటువంటి, శ్రీస్వామివారి గర్భాలయములో నుండు మూర్తికి జేసిన, అలంకారము, దీపారాధనలకు, ఎదురుగా వుండు స్తంభముమీఁద వ్రాసి వున్నది. (పద్యములు) చోడవంశచరిత్రము.

శా. శ్రీమత్కౌస్తుభరత్నభూషణరుచిశ్రీరమ్యవక్షస్థలుం
డామందారలతాంతదామపదదివ్యామోదపాదాబ్జజా
తామేయామరసింధువారిశ్రితపూతాసర్వలోకుండు నా
కాముల్లోకవిభుండు చక్రి గలఁ డైక్యప్రశస్తి దా నాథ్యుఁడై. ౧

ఉ. ఆతరదాల్పునాభిదళితాబ్జమునం దుదయించె బ్రహ్మ సం
ప్రీతిగ నా విరించికి మరీచి జనించె మరీచి కన్వయా
ఖ్యాతుఁడు బుట్టెఁ గశ్యపుఁడు కశ్యపుఁ డన్మని యుద్భవించె లో
కాతతసవ్యమూర్తి కమలాప్తుఁడు సూర్యుఁడు వంశకర్తయై. ౨

మ. ఘనుఁ డా సూర్యున కన్వయాగ్రజుఁ డనంగా రాజధర్మంబ తాఁ
దనువై కల్పితరాజయోగమున నుండన్ బుట్టె వైవస్వతుం
డనఘుం డాతని కుద్భవించె మను వుద్యద్దండశాస్త్రార్థత
త్వనిజాచారసమస్తధర్మనయశాస్త్రప్రౌఢి కాచార్యుఁడై. 3

గద్య. ఇట్టి మనువంశంబున నిక్ష్వాకుండు బుట్టె నిక్ష్వాకువంశంబున గకుత్థుండు బుట్టె, నాతనికిం బృథుం డనపేరఁ గొండి పన పృథుండు బుట్టె, పృథువంశంబున మాంధాతుండు పుట్టె. మాంధాతవంశంబునన్ బురుకుత్సుండు పుట్టె. పురుకుత్సుని వంశంబున సాగరంబు దన పేరం జేసిన సగరుండు పుట్టె, సగరవంశంబున దిలీపుండు బుట్టె దిలీపువంశంబున భాగీరథి తనపేరన్ గొండి నన భగీరథుండు బుట్టె. భగీరథువంశంబున నతీతానాగతవంశకర్త యైన రఘువు బుట్టె. రఘువంశంబున నారాయణావతారుం డైన శ్రీరాముండు బుట్టె. శ్రీరామువంశంబున నలచక్రవర్తి పుట్టె, నలునికిం బుండరీకుండు పుట్టె. పుండరీకువంశంబున నాగ రాజుల... కుండన్...బ్రథుండై...కరికాలచోడచక్రవర్తి పుట్టె. భానువంశంబు కరికాల వంశంబు నాన్ పేరుకొని సతుస్సాగరపర్యంతమహీచక్రంబు నిర్వక్రంబుగా...వాలి...పాత...బాలించె. ౪

కం. కరికాలచోడనరపతి
పరగఁగ నిజలాంఛనములు బలుపిడి హిమవ
ద్గిరితటముల సేతుమహీ
ధరతటముల నిలిపెఁ జక్రధరతుల్యుం డై. ౫

కం. కావేరి గపలుగట్టఁగ
వేవే పల్లవుఁడు దనదుపల్లకి రామిన్
దా వానినుమటికను వోఁ
గా పడిఁ గరికాలవిభుఁడు గాలన్ దుడిచెన్. ౬

కం. ఇనుపదముల నర్చింపగఁ
జనుచోఁ జని యర్ఘ్యమంత్రజలపాత్రలు దా
వినువీధి నాగఁబంచెను
ఘనముగఁ దనయాన దడిచి కరికాలుఁ డిలన్. ౭

కం. అట్టికరికాలనృపతికిఁ
బుట్టెను మహి మానుచోడు భుజ నతిగికిఁ దా
బుట్టిరి గరికాలుఁడు సిరి
కట్టనఁగులు దొండమాఱఘునవశకర్మల్. ౮

కం. ఆకరికాలనరేంద్ర
ప్రాకటవంశమున బుట్టె భాస్కరకులన
త్నాకరచంద్రుఁడు రిపుదయ
భీకరుఁ డధికుండు చోడబిజ్జన విరుదై.

కం. రూఢిగ బిజ్జన దను రెం
డాడిన భూపతుల శిరము లసిముఖమున నెం
డాడు మఁ గయ్యము లిరువన
ఏ డెన్నఁగ బొడిచె జయమహీవల్లభుఁ డై. ౧౦

కం. పల్లవుతో ఘనబిజ్జన
ప్రల్లదమున వచ్చు పాము బట్టెనఁ గని యా
దల్లజుఁ డిచ్చె గుణాంకము
గొల్లభి గొని జనులు గండగోపాలుఁ డనన్. ౧౧

కం. దండిపదాబ్జాగండఁడు
గండరగండండు వీరఖణి బిజ్జనయుం
దండిఙ్...పదుమువ్వుర నొగి
గండం డను దార నిలిపెఁ గటకములోనఙ్. ౧౨

చ. బిరు దనఁ జన్న యా తెలుఁగు బిజ్జన మన్మఁడు మల్లిదేవుఁ డ
చ్చెలు వగుచున్న పొత్తపియు చెన్నగు వీడుఁగ వ్రాలి పాకనా
డిరువదియొక్క వేయిఁ జన నేలుచుఁ బల్లవు దండు గెల్చి త
త్కరివరకుంభమౌక్తికలతాతతిఁ బుచ్చె నిజాసిపుత్రికఙ్. ౧౩

చ. అతనికిఁ బుట్టి రొప్ప మధురాంతక పొత్తపి చోడ సిద్ధిభూ
పతియును మల్లిదేవుఁడును బాహుపరాక్రమవిక్రమక్రముల్
నతనరనాథబాలకదణస్థిరపాదసరోజ వైభవా
వితతసముద్రకాంచిపరివేష్టితభూపరిరక్షణక్రముల్. ౧౪

కం. ధరఁ బొత్తపిసిద్ధినరే
శ్వరునికి నుదయించి భూమి సన నేలిరి స
చ్చరితులు పొత్తపి సోమే
శ్వరదేవుఁడు మల్లిదేవవసుధాధిపుఁడుఙ్. ౧౫

ఉ. భూపదిలీపుఁ డై పఱగు పొత్తపిసిద్ధనితమ్మ మల్లధా
త్రీపతికిఙ్ సమస్తజగతీపతికి న్సుతు లుద్భవించి రా
శాపరిపూర్ణకీర్తులు భుజాబలవంతులు నయిన తొంటి య
య్యోపిలిసిద్ధియుఙ్ గులసముద్ధరణుం డగు మల్లిదేవుఁడున్. ౧౬

కం. ఆపొత్తపిసోమేశ్వర
భూపతికిం దమ్ముఁ మల్లభూపాలునకై
యోపిలిసిద్ధికిఁ దమ్ముఁడు
దీపితసితకీర్తి మల్లిదేవుఁడు పరగెఙ్. ౧౭

చ. పరగిన మల్లిదేవజనపాలుఁడు పొత్తపిచోడవంశశే
ఖరుఁ డినవంశకర్త యనఁగా గడు వాలి విరోధిరాజసం
హరణుఁగు దొంటితాతలక్రియం దగు పొత్తపి రాజధానిఁగా
ధర సకలంబు నేలె విదితం బగు బాహుపరాక్రమంబునన్. ౧౮

కం. ఆ మల్లిదేవునికిఁ గుల
భామాతిలకంబు బుణ్యభామిని గౌరీ
శ్రీమహాదేవికిఁ బుట్టె ద
పోమహిమఫలమ్ము దాన పొడ వైనగతిన్. ౧౯

కం. ఇనుఁ డుదయ మైనయట్టుల
మను వుదయం బైనయట్ల మతి రఘురాముల్
జనియించినట్ల గులవ
ర్ధనుఁ డోపిలిసిద్ధివిభుఁడు దా నుదయించెన్. ౨౦

ఉ. కరికాలోత్తమ చోడవంశమునఁ దా గౌరిమహాదేవికిఙ్
సురభుల్ కల్పకుజాతముల్ సురనదీ...మణుల్
ధర నేకాకృతిఁ బుట్టెనో యనఁగ............
...య్యోపిలిసిద్ధివల్లభుఁడు గర్ణుం డన్న వర్ణింపఁగాఙ్. ౨౧

ఉ. ఓపిలిసిద్ధివల్లభు జయోన్నతు తెంకణచక్రవర్తి నా
జ్ఞాపరిరక్షితాఖిలదిశావలయుఙ్ ఘనదానకర్ణ లీ
లాపరిపూర్ణరమ్యశుభలక్షణమూర్తి జయంతు నర్వశి
క్షాపురుహూతుఁ బేరుకొనఁగా జను జోడకు లైకభూమణున్.

మ. సకలాధీశనతోత్తమాంగమణిభూషారమ్యపాదాబ్జుఁ
......నారాయణు భానువంశనృపచూడారత్న సిద్ధప్ప బం
ధుకవీంద్రద్విజరక్షు గాస్యపసగోత్రుం బాటకవ్రాతమ
త్రకు మాయోపిలిసిద్ధి జెప్పఁదగు నుద్యద్గండగోపాలునిన్. ౨౩

చ. తన నిజవృత్తి యంతి వితతంబుగ యోపిలిసిద్ధి పిన్నసి
ద్ధనకు ననుంగుదమ్ముఁడు ప్రతాపమునం జని కమ్మనాడు సే
కొని గణపతీశుదయ గూడి తదాజ్ఞ వహించి యేలెఁ బా
వన మగు నారువేలును నవక్రపరాక్రమవిక్రమంబునన్. ౨౪

ఇట్లేలి సప్తసంతానంబులు దేవబ్రాహ్మణదత్తులు సమస్త ధర్మంబులు ప్రతిపాలించి, స్వస్తి చరణసరోరుహావిహితవిలోచన త్రిలోచన ప్రముఖాఖిలపృథివీశ్వర కారిత కావేరీతీర, కరికాలకుల రత్న ప్రదీపాహితకుమారగజాంకుశ, యొరయూరిపురవరాధీశ్వర, సూర్యవంశోద్భవ, కాస్యపసగోత్ర, తెంకణాదిత్య, జగదాబ్జగండ, కీర్తినారాయణ....... సమస్తప్రశస్తిసహితంబు ...........శ్రీమన్మహామండలేశ్వర యోపిల సిద్ధనదేవ చోడమహారాజులు స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౧౮౬ అగు తారణసంవత్సరకార్తీకశుద్ధ శ్రీ ఏకాదశి శుక్రవారము గమ్మనాంటిలోన నిజరాజధానియైన కొట్టెయదొన శ్రీ శంకరమహాదేవరకు గణపతిదేవమహారాజునకు ధర్మముగా హవిర్బలి యర్చనలకు నంగభోగరంగభోగాదులకు నందుల మోగడచెర్వు, దేవ భోగ మాచంద్రతారకము స్వీకారపరిహారముగా నిచ్చితిమి. మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ

స్వదత్తం పరదత్తం వా । యో హరేతి వసుంధర
షష్టివర్షసహస్రాణి । విష్ఠాయాం జాయతే క్రిమిః. శ్రీ శ్రీ శ్రీ

II

శ్రీశంకరస్వామివారి యాలయములోపలికి వెళ్లెడి ద్వారము ముందర పడమరవైపు పాతిన రాతిస్తంభంమీద వున్నటువంటి చరిత్ర "గీర్వాణభాషతో"

శ్లో. అవ్యాదవ్యాపదేశానః । ప్రధానపురుషేశ్వరః
యత్కీర్తివల్లి ముకుళా । న్యజాండా న్యఖిలా నివ. ౧

శ్లో. శ్రీనాథో విధి రిందిరాంబుజభవ ప్రాణేశ్వరీ మాతర
శ్శర్వాణీ ద్విరదానన స్తదనుజ స్స్వర్గోగణాః కౌశికీ
మార్తాండో రజనీశ్వరో హుతవహః సంక్రందనాద్య స్సురాః
కుర్వం త్వభ్యుదయాని వృద్ధిసహితాన్నో బ్రాహ్మణాదీ న్సదా.

శ్లో. విష్ణోర్నాభిసరోజతస్సముభవ ద్దేవేశ...ద్విభో
బ్రహ్మ లోకపితామహ స్సమజని స్రష్టు ర్మ...చిస్తతః
తస్మాత్కస్యప వుద్భ...భూపతనయా స్తద్వంశజాత స్సతీ
సోహిచ్ఛత్రమహాగ్రహారవసతి ర్వ్యై రుద్రభట్టశ్రుతః. ౩

గద్య. అసౌ ముక్కంటికా ద్వ్యడ్డినరేంద్రా త్పరిలబ్ధవాఙ్, మారు టూర్నామగ్రామ, శ్రీరట్టభూతలే తస్యానుజః కుప్పనార్యో విష్ణువర్ధనో భూభుజః లబ్ధ్వా దధో క్రాంజనామగ్రామ మమ్మ

నీక్షిణో, రుద్ర తస్యసుత స్తదీయతనయ, శ్రీగుండమూరు ర్బభౌ,
విప్రేంకరయిల్లదాతా, ధరణీపాలా స్మహాశారవా, తే లబ్ధ్వా
సంతత మేకభోగ మచలం శ్రీ కంద్రవాటి క్షితౌ, గ్రామం
గుండిమడాభిధాన మఖిలాశా త్తకీర్తీశ్వరః. ౪

శ్లో. వెండన శ్చామన శ్చాపి, తస్య పుత్రౌ బభూవతుః
చామనస్య సుతో తత్ర, వెండనోగుండన స్తథా. ౫

శ్లో. గుండన స్యాత్మజన్మానా, శ్చత్వార స్తత్ర జజ్ఞిరే
దొమ్మన శ్చామన శ్చాపి, సువ్వనో......మన స్తదా. ౬
దొమ్మనో ద్గౌరమాంబాయామ్, త్రయః పుత్రో విజజ్ఞిరే
ఉత్తరోగుండన శ్చాపి, రాఘవో రాఘవాత్రవాన్. ౭
తత్ర పుత్రత్రయే మిత్ర, పుత్రో తారో జగత్రయే
గుండాఖ్యః పద్మగర్భాండ, భాండమండిత కీర్తిభూః. ౮
శ్రీమత్కాశ్యపగోత్ర, గోత్రమృగసచ్చారిత్ర, పోత్రం క్షమా,
క్షేత్రం దాత్రి మధర్మకర్మలతికా, మూలస్య సూత్రం ధియామ్
విత్రమ్ ధర్మవిధాయినో మిహన్నృణా న్నేత్రమ్ సతాం సర్వదా
చిత్రమ్ మంత్రనిధి స్సుధీ రభిబభౌ గుండాభిధానో భుపిః. ౯
నరరాజ కుప్పాంబికయా శ్రియేవ శ్రీవల్లభ శ్శశ్వ దమాత్యగుండః
గుణప్రచండ స్సహధర్మపత్న్యా, సంతానవత్యా ప్రచయేవ భానుః
తాభ్యా ముభాభ్యా మనన్యాఖ్యః, ప్రభూతగుణ భూ రభూత్
యద్యశో రాశి దుగ్ధాబ్ధౌ, వాకాశః కేశవాయ తే. ౧౧

మంత్రిచూడామణీ! దీనచింతామణీ! రహీనగుణిప్పుణిప్రభో
మణి బంధు ర్బంధూకో నామ్ విభాత్యసౌ. త్రిభువనమల్లక్షితిపా, దిన
కులతిలకా, దిలీపభూపప్రతిమా లబ్ధనృపచిహ్నా మహిత శ్వేతచ్ఛత్ర।
మహాప్రధాన పదవీ విదితే। తత్పుత్ర నన్నిచోడమహీపాల మహామా
త్యపదవీ విరాజిత। అపిచాస, పుణ్యపురుషః, పరిరక్షిత సత్పురుషః,
పరిషద్గుండిమెడ గుండనామాత్యనందనః, కార్యబృహస్పతి, రన్న
నామాత్యోధర్మచికీర్షుః, కమ్మక్షితౌ గ్రామ మెద్దనపూడినామాన
మగ్రహారం ద్విజాగ్రణిభ్యో దత్వా కారయిత్వామ్, అనేకా నీశ్వ
రాలయాని, సపరివారాణి, విష్ణుప్రతిమా ప్రతిష్ఠాపూర్వకమ్, విష్ణ్వా
లయానిచ, నిత్యోత్సవాది త్రికాలపూజాసంయుక్తానిచ, సప్తసం
తానాని ప్రతిష్ఠాప్య, పునరపి, శ్రీపర్వతే శ్రీపార్వతీవల్లభాయ, మల్లి
కార్జునదేవాయ, తత్రైవ శ్రీత్రిపురాంతకాయ, సేతౌ రామేశ్వరా
య, సౌరాష్ట్రే సోమేశ్వరాయ, ద్రాక్షారామే భీమేశ్వరాయ, ధాన్య
వాటియా మమరేశ్వరాయ। గుండిమెడగ్రామే మహాదేవాయ,
త్రిఃప్రయాగే మాధవాయ, ఒడ్డదేశే శ్రీపురుషోత్తమాయ, జహారిగిరౌ
నరసింహాయ ప్రయాంపల్లిగ్రామే శ్రీభావనారాయణాయ, గంజాం
గ్రామె భావనారాయణాయ, చరకూరుత్రివిక్రమాయ, కొట్య
దొన రాజధాన్యామ్ శ్రీశంకరదేవాయ, తత్రైవ కేశవాయ, తత్పరి
పర్వతోపరి కేశవాయ, తామ్రపురి మహాసేనాయ, స్వామిమలస్వామి
కుమారాయ, మద్దిదేవులగ్రామే మారీభట్టారకాయ మపి చాన్యేషుచ,
పుణ్యస్థానేషు త్రినేత్రాయ త్రివిక్రమాయ, ......చాఖండవర్తి
సహిత మాచంద్రతారకం దేదీప్యమానా దీపాప్రాదాత్॥ గుండిమెడ
గుండనార్యా శ్శాన్న నామాత్య సుతో నుత సృజనైః. శ్రీకంఠపాద
పంకజరేణు శ్రీరమ్యకుంతల శ్శశ్వత్. ౧౨

శ్లో. కర్పూరోజ్జ్వలమూ ర్తికీ ర్తిరమణః కుప్పాంబికానందనః
సర్పాధీశ్వరతల్పచక్రధపదాంభోజాతపూజాపరః
నిత్యం సోపి విరాజితో భువి బుధాభీష్టప్రదా శ్శాన్నా
మాత్యో మంత్రిశిఖామణి ర్గుణమణి శ్శిష్టేష్టచింతామణీ. శ్రీశ్రీశ్రీ

ఆంధ్రమున పద్యము

చం. గడుసరి లోభి యర్థ మది కన్నపుగానికి బందిగానికిఁ
బుడమికి నన్యకాంతలకు భూపతికిం జను, మంత్రి యన్ననిఁ
బడసిన యర్థ మిష్టులకు బంధుజనాళికి దీనకోటికిఁ
గుళ్లకు కూపసత్రములకుం జను శుద్ధచరిత్రపాత్రమై.

## III

శ్రీశంకరస్వామివారి ఆలయం యొక్క బహిర్ద్వారం తూర్పువై పున స్థాపింపఁబడిన శిలాశాసనము.

స్వస్తి చరణసరోరుహ విహితవిలోచన త్రిలోచనప్రముఖాఖిల పృధివీశ్వర కారితకావేరీతీర కరికాలకులరత్న ప్రదీపాహిత కుమారాంకుశ శ్రీమన్మహామండలేశ్వర కామచోడ మహారాజులు శకవరుషంబులు ౧౦౫౬ నేటి ఉత్తరాయణ సంక్రాంతినిమిత్తమునఁ గమ్మనాటిలోని పల్లమెట్టలోపుగా, ఉప్పంగొండూరు చతుస్సీమమును, పెద్దగంజామును, కడకుదురును, గూరపాడును, ... చిన్నగంజాములోపయిన యుప్పలముల సుంకమునందు గద్యాణమునం బరుకయు, గనుపరితియందు పులిచెరువును, కొట్యదొనను యాకరాజు చెరువును, నానీరి నేలయును, చెరువు దక్షిణం బండ్రెండుమళ్లపట్టు వెలిపొలమును, నిజరాజధానియైన కొట్టియదొన శ్రీ బల్లేశ్వరమహాదేవరకు నాచంద్రార్కము దేవభోగముగా నిచ్చితిమి. శ్రీ శ్రీ శ్రీ

## IV

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౮౫ నేటి వుత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున శ్రీమన్మహామండలేశ్వర కామచోడమహారాజు అర్ధాంగలక్ష్మియైన శ్రీయాదేవి మహాదేవులు నిజరాజధాని యయిన కొట్టియదొన కామేశ్వరమహాదేవులకు నిత్యం నివేద్యానకు ఆయూర్రం బెట్టిన భూమి ఖ-3, అఖండదీపానకుం బెట్టిన మేఁకలు 50, జన్నిమొదవు 1, దీనిం జేకొని కోల ప్రోలెప్ప పుత్రానుపౌత్రిక మాచంద్రార్కము నడుపంగలవాండు. స్వదత్తం పరదత్తంవా యోహరేతి వసుంధరా షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమి. శ్రీశ్రీశ్రీ

## V

శ్రీశంకరస్వామి యాలయము లోపలికి వెళ్లే మార్గమునకు పడమర జమ్మిచెట్టుకు తూర్పుగా ఉన్న శాసనాక్షరములు.

స్వస్తి చరణసరోరుహ విహితవిలోచన త్రిలోచనప్రముఖాఖిల పృథివీశ్వర కారితకావేరీతీర కరికాలకులరత్న ప్రదీపాహిత కుమారాంకుశ శ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్లదేవ పొత్తపిచోడమహారాజులు శకవరుషంబులు ౧౦౬౪ నేటి దుందుభిసం. ఆశ్వీజామలచట్టియు నాదివారమందుల విషువుసంక్రాంతినాడు గమ్మ

నాటిలోని బల్లికుర్వనిజరాజధాని యైన కొట్టియదొన శ్రీశంకర మహాదేవరకు నాచంద్రార్కము దేవభోగముగా నిచ్చితిమి. ఈ దేవరకు పూజాపురస్కారములకు, హవిర్బలి యర్చనలకు, నఖండ దీపమునకు, సానులకు మానులకు, నావజకానికి, మద్దిళ్ళకొనికి ......సర్వబాధాపరిహారముగా నిచ్చితిమి. యిందుస్థానపతి యైన దొడ్డజియ్యయు, నారసింహుండు, యీ దేవకార్య మెల్ల పిచ్ఛిన్నము గాకుండా దేవరకుం బని చేయంగలవారు.........

శరధి గట్టించి రాక్షసుని జయించి
చనిన శ్రీరాఘవస్వామి మన్మందు
కరికాలవంశశేఖరుఁడు జగదొబ్బ
గండండు పొత్తపి కామభూపతికి.
ధరజ సీతకు నరుంధతి కెన యనఁగ
దగుశ్రియాదేవికిఁ దనయుండు ధర్మ
పరుడు ధీరుడు శత్రుభంజుం డాధి
పతి త్రిభువనమల్ల పార్థివోత్తముడు.
జలనిధిరసవియచ్ఛశిసంఖ్యల దనర
శక నేండ్లు ౧౦౬౭ దుందుభి సంవత్సరమునందు
విలసిత మగు తులావిషుసంక్రాంతిని
వెలసిన కమ్మమేదినిన బల్లికుర్వ
యలకాపురి కెన యగు కొట్యదొనమ
హాదేవరకు నిచ్చె, నాదిత్యవంశ
తిలకుండు, వెంకణాదిత్యుం, డూర్జితుండు,
త్రిభువనమల్లధాత్రినాథుం డుర్వీశ్.

## VI

గ్రామమునకు దక్షిణమున పడిపోయిన అద్దంకమ్మదేవాల యానికి తూర్పుదక్షిణం మూలను మాదిగవాండ్లకు దొరికినశాఁకి వుత్త రమున పూర్వపు ఆలయం సిధిలమై నేలపడియున్న చోట నేలమీద పడియున్న రాతిమీద నున్నట్టి శాసనాక్షరములు....

స్వస్తి చరణసరోరుహ విహితవిలోచన త్రిలోచనప్రము ఖాఖిలపృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్న ప్రదీపాహిత కుమారాంకుశ శ్రీమన్మహామండలేశ్వర త్రిభువన మల్లదేవచోడ మహా రాజులు శకవర్షంబులు ౧౦౭౦ అగు విభవ సంవత్సర చైత్రశు 3 బుధవారమున విషువుసంక్రాంతినిమిత్తమున తనతండ్రి పొత్తపికామ చోడ మహారాజునకుం, దల్లి శ్రియాదేవులకుం ధర్మముగా నిజరాజ ధాని యైన కొట్యదొన శ్రీభీమేశ్వర మహాదేవరకు, హవిర్బలి యర్చ నలకు, సానులకు మానులకు, కమ్మనాండిలోని జొన్నద్రోలూరు ...........ఆచంద్రతారకముగా నిచ్చితిమి......

## VII

శివపాదశేఖర పరాంగనాపుత్ర శ్రీవన్నిచోడ మహారాజులు దమతండ్రి త్రిభువన మల్లచోడ మహారాజులకు తనతల్లి శ్రియా మహాదేవికి శకవర్షంబులు ౧౦౮౭ అగు ప్రభవ.........(శాసనము శిధిలమై పోయినది.)

## VIII

శ్రీశంకరేశ్వరస్వామివారి ఆలయం బహిర్ద్వారంయొక్క సోపానములకు తూర్పు శేషాహిని చెక్కబడినరాయి తూర్పుదక్షి ణపు రెండు ప్రక్కలను వ్రాశివున్న శాసనాక్షరములు.

పద్యము. త్రిభువనగీతకీర్తి నరదేవశిఖామణి కామధాగణీ
ప్రభుతనయుండు మండలికభర్గుఁడు ధర్మపదాబ్జమట్పదుం
డభినవరాము డర్యమకులాగ్రణి గుండియపూడి భక్తితో
త్రిభువనమల్లదేవుడు ప్రతీతిగ శంభున కిచ్చె పేర్మితోన్.

స్వస్తి చరణసరోరుహ విహితవిలోచన త్రిలోచన ప్రము ఖాఖిలపృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్న ప్రదీపాహిత కుమారాంకుశ శ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్ల దేవచోడ మహారాజులు శకవర్షంబులు ౧౦౬౯ అగు నేటివిషువు సంక్రాంతి నిమిత్తమున కమ్మనాఁటిలోని గుండియపూడి నిజరాజధాని యైన కొట్యదొన శ్రీబల్లేశ్వర మహాదేవరకు ఆచంద్రార్కము దేవభోగ ముగా నిచ్చితిమి.

## IX

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦... నేటి ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున శ్రీమన్మహామండలేశ్వర చోడ బల్లయచోడమహారా జులకోడలు శ్రియాదేవిమహాదేవులు నిజరాజధానియైన కొట్టియ దొన బల్లేశ్వరమహాదేవరకు నిత్యనివేద్యమునకు, నాయూరం బెట్టిన భూమి ఖ 3, అఖండదీపమునకు బెట్టిన మేఁకలు ౧౦, జన్నె మొదవు ౧, వీని జేకొని రుద్రజియ్య పుత్రానుపౌత్రిక మాచంద్రార్కము నడపంగలవారు.

## విజ్ఞప్తి

పాఠకోత్తములారా! నాకు దొరకిన గ్రంథము నుండి చోడరాజులయొక్కయు, తద్భార్యలయొక్కయు, అమాత్యులయొక్కయు శాసనములు గొన్నిటిని మా త్రమె ఇందుఁ బొందుపఱిచితిని. ప్రకటనార్హము లగు శాసనము లింకను గొన్ని యున్నను, గ్రంథవిస్తరము నకు జంకి వానిని విందు వదలివేసినందులకు క్షమింపఁ గోరెదను. కొణిదెనయం దున్న శ్రీచెన్నకేశవుని యాలయమునొద్దఁ జాల శిలాశాసము లున్నవి. వాని లోఁ గొన్ని విశేషము లున్నట్లు నా పరిశ్రమవలన నే నెఱింగితిని. నా పెద్దతండ్రి పెద్దపిచ్చయ్యగారు లిఖించిన పొత్తమున నచ్చటి శాసనములు చేరియుండలేదు. వారు వ్రాసియుంచిన గ్రంథమున, చోళులకాలమునాటి పౌరు లయొక్కయు, సేనాధిపతులయొక్కయు, నగరరక్షకుల యొక్కయు శాసనములును, గణపతిదేవునికాలము

నాఁటి అమాత్యప్రభృతుల శాసనములును, మఱికొన్ని యున్నవి. వీని ననుసరించి వానిని బ్రకటింప నుద్యుక్తుఁడ నై యున్నాను. ఈసంచికయందుఁ బ్రకటించిన శాసనములలో లోపములు పెక్కులు లేకపోలేదు. అందులకుఁ గారణములు శిలాశాసనములను జదువ నేర్చినవారికిఁ గాక తక్కినవారి కెల్లు తెలియఁగలవు? మా యూరిశాసనములఁగూర్చి కొందఱు పెద్దలు వివిధముగ నిప్పటికిని దలంచుచున్నారు. కొందఱు సంగ్రహరామాయణమట్లు లిఖింపఁబడియున్న దనుచున్నారు. కొంద ఱందలి లిపి సంస్కృత మనుచున్నారు. ఇంకఁ గొందఱు ద్రావిడ మనుచున్నారు. ఇదంతయు పరిశోధనశ్రమమునకుఁ జోర సహింపనివార మగు మనకు సహజమే యగును. ఈశాసనములయందు గద్యపద్యము లొకదానిలో నొకటి కలసియున్నవి. ఛందోభంగము లున్నవి. వ్యాకరణదోషము లున్నవి. ప్రయోగానర్హపదము లున్నవి. అసంబద్ధార్థశబ్దము లున్నవి. అనన్వయశబ్దము లున్నవి. సంవత్సరవ్యత్యాసము లున్నవి. తాము, ఆలోపములను గట్టిపెట్టి, విషయసంగ్రహమును గ్రహింపుఁడు. అయిన, లోపములగతి యే మని అందురేమో; వానిని సవరింపఁ బండితు లున్నారు. సమన్వయము చేసి చెప్ప చరిత్రకారు లున్నారు. ఇఁక 'మన' కేల భయము? ఏల సంశయము? పండితపరిష్కృతములు గాకుండినయెడల, మన భారతాదిగ్రంథము లెట్లుండఁగలవో మనకుఁ దెలియదా?

# పాణిగృహీతి — పెండ్లము

రామకృష్ణకవులు, పీఠికాపురసంస్థాన కవీశ్వరులు, శతావధానులు

## వధువు — పెండ్లికూఁతురు

శ్రీలం బొల్చువివాహవేళశుభలక్ష్మీవీక్షణవ్యగ్రలై [పఁగాఁ
దాల న్నిల్చినపేరటాండ్రుతన్మయోత్సాహంబు హెచ్చిం
గేలుందమ్ముల కంద వంగు మగనిం గెల్వంగ వేవేఁడిలం
గ్రాలం బోసెడు పెండ్లికూఁతునకు సౌభాగ్యంబు నిండారుతన్.

శా. పేరుల్ చెప్పెడు వేళలన్ వరుఁడు "నా పెండ్లాము నే" నంచుసా
ధారణ్యంబుగఁ బల్క నల్ల నగుమం చా నట్టులే "నేను మా
వా" రంచున్ గడుసుందనంబు వెలయన్ వాక్రుచ్చు దారం గులా
ధారం బెండ్లికుమారుఁ డాదరముచేతం జూచెడుంగావుతన్.

శా. ఏఁ గచ్చేరికి నేఁగఁగావలయు నోసీ! పిల్లనిం బుచ్చుకో
వేగన్ ర మ్మని బొమ్మ యొం డిడు వరున్ విప్రోపదిష్టార్థ నై
యే గీతంబుల నేర్చికోవలయు నేఁ డీ మీ జవా? నెత్తుకో
నీఁగాఁగూడదె? యంచుఁ బల్కు వధు వెం దిష్టాప్తి రంజిల్లుతన్.

శా. దండాడించు తతిన్ వరుండు తనమీఁదన్ గందునో యంచు బ
గ్గుండన్ మెల్లఁగఁ జల్ల, భర్తపయి నక్షుల్ గాఁడునో యంచు నె
ఘ్నుం డప్పాటుగఁ బోయ కాయితముగా బుక్కాములం బట్టి పై
నిండం జల్లెడు పెండ్లికూఁతున కగున్ నిత్యంబుఁ గళ్యాణముల్.

మ. మెఱుఁగుల్ దీరిన మేల్మిబంగరునగల్ మేనం దగన్, జంద్రు న
క్కఱ వారింపఁగలట్టి నెమ్మొగమునం గళ్యాణపుంబొట్టు చ
క్కఁ రహింపన్, బసపంట నొప్పు మధుపర్కంబెంతో బాగీడుఁగా
వరు మెప్పించు నవోఢ బాఢముగ సౌభాగ్యంబునన్ గావుతన్.

## సువాసిని — ఆఁడుపడుచు

మ. తగు చుట్టంబును బంచి నూతనముగాఁ దన్ మామ యేఁడాదిపం
డుగకున్ బిల్చిన వచ్చినట్టి గుణవంతుం డల్లుఁ డల్లంత నే
యగపడ్డన్ జెలికత్తెలన్ విడిచి యొయ్యన్ లోనికిం బోయి యే
దో గతిం దండ్రి నెదుర్కొనంబనుచు కూఁతున్ మాతదీవించుతన్.

మ. ఎదొ మిత్రమ్మును జూడ భర్త చనుచో నీక్షించి విస్రబ్ధయై
గదిగుమ్మమ్మునయందుఁ బాటలను జక్కం బాడుకొంచుండఁగా
నదిగో! నీ మగఁ డంచుఁ జెల్లియలు కూయన్, లోనికిం బాఱి నె
మ్మదిగా సోరణనుండి తొంగి కను లేమన్ బ్రేమముల్ గూడుతన్

మ. అనుజన్మల్ జనకుండు భర్తయును మధ్యాహ్నంబునం దన్నముల్
దినుచోఁ దాఁ దెలనాకులం జిలుక లెంతే నేర్పుగాఁ జుట్టి భో
జన మైవచ్చి మగండు పండుకొను సెజ్జం బెట్టి పొంచుండి యా
తని యాశ్చర్యము హర్షముం గనెడు కాంతల్ సంతసం బొందెడున్.

మ. ఎలమిన్ మేలము సేయఁగా నఱఁదలోయీ! యేదియో నీతలం
గల దన్నం, జెయి వెట్టి చూచుకొనఁబోఁగా బావ, యా వామన
వ్వోలయం బెండ్లము నప్పుడే వెదకికొంచున్నాఁడు నా, నాతఁడ
ట్టెలెత తప్పె నని మోడఁ గుల్కెడు చిఱంటిన్ స్త్రీలు చేపట్టుతన్.

మ. రమణం బొంగిన పాల నీయఁ జిలుకన్ రానొల్ల దిన్నాళ్లు మా
యఁను, నీవచ్చినగోలె నింటిపని సేయం జొచ్చె నీ కేమి లో
పము గాకుండఁగ నంచు మాత వచియింపన్, నవ్వ జామాత, కో
పముకో నందులకా ? యటన్న సుత సంపల్లబ్ధి హర్షించుతన్.

మ. తలి నీళ్లన్నియుఁ దోడి గాఁచి యటుమీఁదన్ గుంకుళుల్ గొట్టి చెం
తలఁ బొంచుండిన కూఁతు "నల్లుతల రుద్దన్ బుల్సఁ బైఁ బోయునం
దులకున్ ర"మ్మన, సిగ్గుచేఁ గునియఁ "గన్నుల్ మూసికొన్నాఁడు లే
యులు కేలా?" యన, నచ్చు ముగ్ధ వరవస్యన్ భర్త కీర్తించుతన్.

మ. ఒకసాయంసమసివారి కేగిన సగం డొక్కింత కే తెంచి ప
ల్వకయే తల్పును దట్టఁగా దయిత "యెవ్వారొవ్వ"రనన్ లజ్జమి
న్నకయుండన్ బతి, "పల్కవే"గని కృతన్యక్కారి యై తల్పుఁ దీ
సికడున్ వెల్వెలఁ బాటిపర్విడు మృగాక్షిన్ భర్తమన్నించుతన్.

మ. అయిదారేండ్లిటు లుండఁ గట్టనిడి యొయ్యన్ మామ గాంపంపఁగా
బయనం బై పతి గుమ్మముల్ దిగిన వెంటన్ మూఁపుపై నీళ్లబిం
దియకోఁ నవ్వ మొగమ్ముతోడ నెదురై తృష్ణాత్రపార్థస్ఫు
న్నయసాజ్ఞంబులఁ జూచు జాయ శకునానందమ్ములం జేయుతన్.

## మధ్యమ — కౌమరాలు

మ. అభిలాషోన్నతిఁ జేసి శోభనదినం బంచింతముల్ రా, వయః
ప్రభవం బయ్యెడు రూపభేదమున భర్తన్ గుర్తుపట్టంగలే
క భయత్వమ్మున నిల్చి, యవ్వ "దిగినారా?" యంచుఁ బ్రశ్నింపఁ ద
న్నిభృతోక్తిన్ విని శంక మైఁ బఱచు నేణీనేత్ర రాణించుతన్.

మ. స్మరసంమిక్కృతవక్త్రి యయ్యును బునస్సంధానహోమక్రియా
పరతంత్రుం డగు నాథు మోము గతవిభ్రాంతిం గటాక్షించుచున్
గురువాక్యమ్మున భర్తకున్ బుడిసిటన్ గొంచెమ్ము నీ ర్వొట్ట ను
ద్ధరణిన్ బైలనె వంచు గోల కగు దీర్ఘాయుష్యసౌభాగ్యముల్.

శా. పౌరోహిత్య మొనర్చు బ్రాహ్మణుఁడు చెప్పన్ భర్తతోఁ దాను నొ
య్యారం బార ఫలప్రదానములు సేయన్ బల్కెం బెత్తితత
ద్భాగం బేమియు నాత్మనాథునకుఁ దోఁపన్ రానియ ట్లెట్టులో
రమోరన్ వ్రేళులు గంపఁ బట్టు సఖి కాయుశ్శ్రీలు వేలయ్యెడున్.

మ. అనువాదమ్ములతోఁ బురోహితుఁడు గర్భాధానఖండం బఖిం
చిననీఁదం గులపాలికల్ తమకుఁ బాసెం బేకపాత్రంబులోఁ
దినఁబెట్టన్ బతి గిన్నెలోన దనచేతిం దాఁకు సారస్యమున్
గని యావైఁ జెయి నేకదా యిఁడని ముగ్ధన్ నేత మోహించుతన్.

శా. మొల్లల్ చుట్టినయట్టి మేలుసిగ యామోదమ్ములం జిమ్మ భా
సిల్లన్ గజ్జెలనాగరమ్ము మిగులం జెల్వారు దుద్దుల్ పిరా
జిల్లన్ గాసుల పేరుఁ గంటెయుఁ బ్రకాశింపన్ సతుల్ పంపఁగా
నల్లన్ గేళిగృహంబు సొచ్చెడు వృషస్యంతిన్ బ్రియుం డేలుతన్.

మ. గురువుల్ నిద్దినయట్లు వేఁకునె మేలొక్కం, చెరు బోధించిరో!
కరుఁ డంక న్నిదురింపు మిండెడి నను నిర్వాసంబుతో జీవితే
శ్వరు పాదమ్ములఁ గన్ను లద్దుకొని సెజ్జన్ డిగ్గి వేఁ గేళినం
దొమున్ వీడెడు మందయానఁ బతి భృత్యీభూతుఁడై కొల్చుతన్.

## స్నుష — కోడలు

మ. కయతిన్ వర్ణన సేయరానియది యాకేళీవిలాసమ్ము ల
క్షయమై యుండెనె నూఁడునిద్దులు కాఁగా సారెయుం జీరయున్
గయికొం చెట్టులొ పుట్టినిల్లు విడి సాక్షాల్లక్ష్మినాఁ గానఁగా
నయి యత్తింటికి వచ్చు క్రొత్తడికిఁ జిత్తాహ్లాద మేపారుతన్.

మ. కడు హర్షమ్మునఁ బ్రాణవల్లభునియాజ్ఞం జక్కఁ గావించు చం
దడుగుం దాఁటక యత్తమామలకు శుశ్రూషయత్నమ్ము లోప మే
ర్పడకుండం బరిచర్య సేయుచును దత్ప్రస్తావముం గాంచి య
య్యడలన్ మన్ననలొందు మానవతినా కీర్తుల్ సుఖంబుంచుతన్.

## గుర్విణి — చూలాలు

మ. కడు మోదమ్మున నత్త కూర్మిసుతు నింక న్నీవు నో కేఁడాదికం
గొడుకుం గాంచెదవన్న నవ్వుకొనుటన్ గూఢమ్ముగాఁ జూచియా
తఁ డొకం డున్నపుడీర లెందులకు నిందాక న్నవుం గొంటి రం
చడుగం జొచ్చెడునట్టి గుర్విణికిఁ బూర్ణాయుష్య మౌఁగావుతన్.

మ. నెల దప్పం బొరుగిండ్లయాండ్రు "కడుపా నీదైన గారాబు కో
డలికిన్? జెప్పవు, చిన్ననాఁట నెయదృష్టం"బన్న చో నత్త "యాఁక
దల లేర్పాటయి లోకులం బడిసఁగాదా? యన్నఁ, దన్నాను డిం
గలతీ కడ్డెడు గోల నేల నడువంగా నిచ్చునే యెట్టిఁడున్.

శా. సంతోషార్థము వింతవారు తమకున్ సంతానమా? నావుడున్
సుంతో సిగ్గున నిష్టు గర్భిణి యటంచుం బల్కు బ్రాణేశు తీ
రం తన్ సోరణనుండి కన్గొనుచు నొయ్యారంబుగా నవ్వుకొ
న్నంతర్వత్నికిఁ బత్ని కూడిగము సేయన్ నేగి లే దేమియున్.

మ. విపరింపన్ మొగమోడు నేమొ యని వేవిళ్లప్పు డాయాయి భ
క్ష్యవిశేషంబులఁ దెచ్చి చాటుగ నొసంగన్ వల్లభుం, డందు మం
చివి మీ కిష్టములం చొకింత గొని యుచ్ఛిష్టంబుఁ దినిపించు న
న్నతలాంగణ్యశరణ్య యైన నవల న్నాథుం డమ్ముద్దాడుతన్.

శా. ఒడ్డుల్ గర్భిణిగాఁ దలంతు రని సిగ్గూహించుచున్ మున్నడల్ -
పడ్డం బెట్టిన నొక్కలొక్కకటిగాఁ బాయించుచున్ జాళువా

యొడ్డాణంబిడుచుండ మాను మని యెంతో భర్త బోధింపఁగా
నడ్డాడంజనలేక నల్లె యను చూలాలెందు మే లొందుతన్.

ఉ. నెల లొక్కొక్కఁడెపండు వెన్నెలలటుల్ నిండారుచో నెన్న, గా
జులు వెట్టింతుము మా సహోదరి కటంచున్ దన్నుఁ గొంపోవు నం
దుల కేతెంచ, బ్రహృష్టచిత్త యయి తోడ్తో విప్రయోగవ్యథా
కులయౌనట్టి కులాంగనన్ గన నతిం గోల్పోవఁడే యెట్టిఁడున్.

ఉ. పొలయల్కన్ మగఁ డున్న దాఁ బురిటికై పుట్టింటికిం బోవఁ గన్
దెలవాఱంగఁ బ్రయాణమున్న పుడు వెండి న్మిమ్ము నేఁ జూడఁగాఁ
గలనో లేనో యటంచు భెగ్గిలి నమస్కారంబుఁ గావించి క
న్నుల నీర్వెట్టెడి యన్న పుత్త్రవతియై నూ ఱేండ్లు వర్ధిల్లుతన్.

మ. నవమాసమ్ములు నిండియున్న తనుఁ గానన్ వల్లభుం డేగుదే
ర నికాసంబును జెంది గాజుల యొయారం బీరు వీక్షింపఁగాం
క్ష వహింతు న్ననుఁ జూడ నిప్పటికి శక్యం బాయె నే యంచుఁ గం
గువ నెగ్గాడుచుఁ గుందు వల్లభరు సంతోషంబు దీపించుతన్.

మ. నెల లై పుట్టినయింట నున్న తతిఁ దన్వీక్షింపఁగా భర్త రా,
నలవోక న్ననుఁ జూడ నిప్పటికి శక్యంబాయెనే యంచు గా
జుల ముంజేతులు చీరచెంగుల నెటో చొప్పింపఁ బో వల్లభుం
డేల నవ్వం, గని సిగ్గు దేలు సఖిఁ బ్రాణేశుం డుభూషించుతన్.

మ. నవమాసంబులు నిండియుండియు మనోనాథుండు పిచ్చేయఁగా
భువిఁ గెంగేలు ఘటించి యెట్టులో కృతాభ్యుత్థానయై లేవ మా
నవు గా! యెన్ని విధాలఁ జెప్ప, నని కిన్కన్ భర్త చూడంగ నే
యవిరో సాకులు పన్ని తప్పుకొను పిల్లా లెప్డు వర్ధిల్లుతన్.

శా. ఆలోలాలకసుందరాననముతో నాపాండుగండమ్ముతో
స్థూలీభావమనోహరోదరముతో శోభావిశేషమ్ముతోఁ
జాలంజాలఁగఁ బ్రాణవల్లభునకున్ సంతోషముం జేయు చూ
లాలిం బ్రేమసుధాప్రణాళి భువనాధ్యక్షుండు రక్షించుతన్.

మ. పసవృందావియు నుల్లి వాసనయు నొప్పన్ గాయపుంగంపు ముం
పెసఁగన్ బుక్కిటి తమ్మలంపుసాగ సెంతే నింపు పుట్టింపఁగా
వసివాళ్వారిన బాహువల్లికలతో వాల్లభ్యసంపూర్ణయై
పసికూనం బ్రియుఁ డెత్తుకో నొసఁగు లేబాలింత మేలొందుతన్.

## కుటుంబిని — ఇల్లాలు

మ. పతి యేదే నొకవృత్తిచే ధనము సంపాదించి యీయన్ సమం
చితరీతిన్ గృహకృత్యముల్ సకలముం జేకూర్చుచున్ బంధుసం
తతి యభ్యాగతపాళి యర్థిజనముం దన్నెంతయో మెచ్చఁగాఁ
జతురత్వంబున నా కుటుంబిని కగున్ శ్రేయస్సానందముల్.

శా. ఇంటన్ దన్విడనాడి భర్త పొరుగూ రేకార్యముం దీర్పనో
యొంటిం బోవఁగ ముద్దుబిడ్డల కెటో యుల్లాసముం గొల్పు చే
వేంటన్ నాథసమాగమాహమునకై వీక్షించుచుం గుందు వా
ల్గంటిన్ గెంటని ప్రేముడిం బ్రియుఁడు వేగన్ వచ్చి లాలించుతన్.

శా. తానున్ భర్తయు నేకశయ్యపయి నిద్రం గూరియుండన్ నిజ
ప్రాణేశుండు విపన్నుఁడైనటులు దుస్స్వప్నమ్మెదో కాంచి తో
డ్తో నాత్మన్ భయమంది మేలుకొని కాంతున్ మెల్లఁగా లేపి దుః
ఖానందంబులఁ గౌఁగిటం బొదువు జాయం బాయరాదన్నఁడున్.

మ. చెలికారమ్మన నాథు నెయ్యదియొ యాక్షేపమ్ము గావించి న
వ్వోలయం జేసియు నాతఁడల్కఁగొనె నే మోయుందు నే న్వెంటను
త్తలపాటుం గని చేరవచ్చి యతివాల్లభ్యమ్ముతో నాదు ప
ల్కులకుం గోపము రాదు గా! యను మృగీలోలాక్షికిన్ క్షేమముల్.

శా. ఆయాకార్యములన్ శ్రమమ్మనకు లోనై భర్త యిల్ సేర నా
యాయాసమ్మఖిలమ్ము దవ్వులకుఁ బాయన్ నవ్వునెమ్మోముతో
డాయంగాఁ జనుదెంచి యేదో పలుకాడం జొచ్చి యెంతెంతయో
హాయిం జేసెడి జాయకంటెఁ గలదే యన్యంబు మాన్యం బిలన్?

శా. ఏకార్యమ్మును గూర్చియో నిజవిభుం డేమో విచారించుకొం
చేకాంతంబున నుండ వచ్చి యగచేతం జేయి సంధించి యే
దో కానీ తలపోయుచున్నటులుగా నున్నారలద్దేదియో
నాకుం జెప్పరె! యన్ వలిక్ని, పతి కానందంబుఁ గల్పించుతన్.

మ. ధనవంతుం డయినన్ దరిద్రుఁ డయినం దారుణ్యసంయుక్తుఁడై
నను వృద్ధుం డయినన్ సురూపయుతుఁడైనన్ రూపహీనుండ యై
నను దన్నుం గయికొన్న భర్తకు నసూనప్రీతి సంధిల్లఁగా
ననయమ్మున్ వినయమ్ముఁ జూపు గుణధుర్యన్ భార్యమన్నింపుఁడా

శా. ప్రాణేశుం డెటు కోరునట్లె తన యావచ్ఛక్తి వర్తించుచుం
గానం గాఁపురమున్న నద్ది యొక స్వర్గంబట్లు తోఁపించి య
త్యానందం బొడగూర్చుచుండెడు ద్వితీయం బోలు తీయంబు లో
కానన్ వేఱొకఁ డున్న దంచు నొడువంగా నేర రెవ్వారలున్.

శా. ఏలా నీకు భయంబుఁ జెందఁ? దలపై నెక్కించుకొందు [illegible]
బాలా, యత్తయు నాఁడుబిడ్డలును నీ పంతంబు[illegible]లింత్రు నా
శ్రీ లన్నింటికి నీవె రాణి వని పేరి[illegible] పెండ్లాడి య
య్యాలిం గూతిపడంతికై వడిఁ [illegible]ణంబు లెట్లొప్పెడిన్?

# భగవద్గీతలు

పారనంది రామశాస్త్రి గారు

ఇవి మహాభారతములో భీష్మపర్వమందు పదునెనిమిది యధ్యాయములు నేడు నూరుల శ్లోకములును గలిగియున్నవి. ఇవి యుద్ధమునకు సిద్ధుఁడై వైముఖ్యము నొందియున్న యర్జును వైముఖ్యమును మాన్పి మరల నతనిని యుద్ధమందుఁ బ్రవర్తింపఁ జేయుటకుఁగాను భగవంతుఁ డగు శ్రీకృష్ణునిచే నర్జునున కుపదేశింపఁబడినట్లుగా నున్నవి. భగవంతునిచే నుపదేశింపఁబడినవి కావున భగవద్గీత లనఁబడును. అధ్యాయాంతగద్యమందు “ఇతి శ్రీశతసహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం మహాభారతే భీష్మపర్వణి భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే” అని కాన్పించుచున్నది కదా. ఈ పదునెనిమిది యధ్యాయముల పరిమితి గల యీ గీతాశాస్త్ర మొక్కటియేనా అనేకములా?—అని విచారింపవలసియున్నది.

ఆ గద్యమందు “భగవద్గీతాసు” అని బహువచనము గాన్పించుచున్నది. గీతాశాస్త్ర మంతయును శ్రీకృష్ణార్జున సంవాదరూపమే కదా సంవాద మొక్కటియే కదా, “గీతాసు” అని బహుత్వ మెట్లు వచ్చినది? దీనిని గుఱించి భాష్యకర్తలు గాని యింక నితరు లగు వ్యాఖ్యాతలు గాని యెవ్వరును ఏమియు స్పష్టపఱచినట్లు లేదు. భాష్యకర్తలలో శ్రీశంకరులు మాత్రము గీతాబహుత్వద్యోతక మగునట్లు తమ భాష్యములో నచ్చటచ్చట వ్రాసియున్నారు. అదియును వారు వేఱు ప్రయోజనముకొఱకు వ్రాసినట్లు కానఁబడుచు నతిగభీరముగ నుండుటచేత విస్పష్టముగాఁ గానరాకున్నను సూచనలఁ బట్టి మనము తెలిసికొనఁదగియున్నది. సూచన లెట్లనఁగా:

గీతాశాస్త్రమూలమందు మూఁడవ యధ్యాయములో “లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ । జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం” అనుదానిలో కర్మ, జ్ఞాననిష్ఠలు రెండును వేఱువేఱు కాలములందు చెప్పఁబడినట్లు తెలియఁగనుచున్నది కదా. నాల్గవ యధ్యాయారంభమందు “ఇమం వివస్వతే యోగం” అనుదానిలో మీఁదఁ జెప్పిన కర్మజ్ఞాననిష్ఠల రెంటిలో నొకటి కర్మయోగ మనునది పూర్వము సూర్యునకు తనచేతనే నారాయణరూపమున నుపదేశింపఁబడినది. అది చిరకాల మగుటచే నష్టమయి యుండున నిప్పుడు ... కా కర్మయోగము నే మరల నుపదేశింతు నని చెప్పె యర్జునున కుప... అది యే ...ష్టది యొకటి మూఁడవది. ఇట్లుపదేశములు మూఁడు. ... యుపదేశ మొక్కొక్క గీతలు కావున బహుత్వ మొందినవి. ఒక్కొక్క యుపదేశ ... బహుత్వముబట్టి వచ్చిన బహుత్వ ... వలయును. ఉపదేశ బహుత్వముబట్టి వచ్చినది కాదు. ... గ్రంథ

వేఱుగ గ్రంథరూపమున లేక కృష్ణార్జునసంవాదరూప మగు నీ మూఁడవ యుపదేశములోనే యనువాదరూపముగ నిమిడి యున్నందున విస్పష్టము గాకయున్నవి. ఈ మూఁడవ గీత శ్రీకృష్ణార్జునసంవాదరూపమున మహాభారతమందుఁ బదునెనిమిది యధ్యాయములుగ నుండుటఁ గానుపించుటచేతను సృష్ట్యాదిని జరగిన రెండుపదేశములకు వేఱుగ గ్రంథములు లేకుండుటను నీ గీతాశాస్త్ర మంతయు నర్జునునికొఱకుఁగా జరగిన యుపదేశ మొక్కటియే యని తలంచుచు “గీతాసు” అను బహుత్వమున కుపపత్తిఁ జెప్పుటలో నానవారు పరిపరివిధములుగఁ జెప్పుదురు. ఏట్లనఁగా:

ఈ గీతాశాస్త్రమునం దనేకవిషయములు చెప్పఁబడియున్నందున విషయబహుత్వమునుబట్టి గీతలకు బహుత్వ మని కొందఱును, అధ్యాయబహుత్వముచేత నని కొందఱును. కాని యే గ్రంథమందైనను విషయబాహుళ్యము అవాంతరగ్రంథపరిచ్ఛేదబాహుళ్యము నున్నందున గ్రంథమునకు బహుత్వము సంభవించునా? అట్లే యైనచో నీ గీతాశాస్త్రముతోఁ గూడియున్న మహాభారతమునం దెన్ని విషయము లున్నవి కావు? ఎన్ని పర్వము లున్నవి కావు? వానినిబట్టి భారతమునకు బహుత్వము వచ్చినదా? కావున నుపదేశసార్థక్యము వలననే గీతలకు సార్థక్య మనునది సమంజసముగా నున్నది. ఉపదేశములు మూఁడు గావున గీతలకు బహుత్వము సముచితము గావచ్చును. ఇట్లాలోచించియే కొందఱు వ్యాఖ్యాతలు పదునెనిమిది యధ్యాయములను మూఁడు షట్కములుగా విభజించి “కర్మషట్కము, జ్ఞానషట్కము, భక్తిషట్కము” అని చెప్పినట్లు తోఁచుచున్నది. కాని కర్మజ్ఞానభక్తులనుబట్టి యధ్యాయములను షట్కవిభాగము చేయుటకు ఏషట్కమందును ఒక్క కర్మ గాని యొక్క జ్ఞానము గాని యొక్క భక్తి గాని కానరాదు. కర్మషట్క మనుదానిలో జ్ఞానభక్తులును, జ్ఞానషట్క మనుదానిలోఁ గర్మభక్తులును, భక్తిషట్క మనుదానిలోఁ గర్మజ్ఞానములును సంకీర్ణముగా నున్నందున నిది యీషట్కమే యని చెప్పుటకు వినిగమము గానరాదు. కాఁబట్టి షట్కబహుత్వమునుబట్టి గీతలకు బహుత్వము చెప్పుట శక్యముగాఁ గానరాదు.

ఇట్లు విషయసాంకర్యమును చూచియే కొందఱు బుద్ధిమంతులు ‘ఈ గీతాశాస్త్ర మంతయు నొక్కరొక్కరికొఱకుఁ జెప్పినది కాదు. భిన్న భిన్న కాలములందుఁ దమతమ యభీష్టవిషయములను తెలుపుచు నెవ్వరో ప్రాచీనవిద్వాంసులు తమ శిష్యులకుఁ గాని లోకమునకుఁ గాని చెప్పిన గీతాభాగముల నన్నిటిని కలిపి భారతములో నెవ్వరో ... రని యూహించి చెప్పుచున్నారు. కాని, వా రట్లు

చెప్పుటకు గీతలలోని విషయసంకీర్ణత తప్ప వేఱొక కారణము గానరాదు. ఇంతియె గాక, యెవ్వరో విద్వాంసులు తాము చెప్పిన గ్రంథములలోఁ దమ నామములను తెలిపియుండఁగా వానిని తీసి వేసి మఱియొక రెవ్వరో ఆగ్రంథములను వేదవ్యాసకర్తృకము మగు మహాభారతములోఁ జేర్చినా రనుటకును, లేక యా గ్రంథకర్తలే తమ నామములను విడిచికొని యా గ్రంథములను చెప్పియుందు రనుటకును వీరి యూహ తప్ప వేఱు ప్రయోజనప్రమాణములు గానరావు. గీతాశాస్త్రమందలి విషయసంకీర్ణతను జూచి యంత మాత్రమున నతిచిరకాలమునుండియు నీ గీతాశాస్త్రము మహాభారతములోనిదిగా విశ్వసించుచున్న యెల్ల ప్రాజ్ఞులకే కాక గీతాశాస్త్రము మహాభారతములోని దని యంగీకరించి భాష్యములు చేసియున్న సతత్ర యాచార్యులకును గూడ నజ్ఞత నారోపింపవలసినచ్చును.

కావున నీ గీతలు మహాభారతములో వ్యాసకర్తృకము లనియే యంగీకరించి వీని బహుత్వమును గుఱించియు సంకీర్ణతను గుఱించియు ఆస్తికు లెల్లవారును ఉపపత్తిని చెప్పుటకు బాధ్యత గలవా రయి యున్నారు. బహుత్వమును గుఱించి పైనఁ గొంత చెప్పఁబడియున్నది. ఇంక సంకీర్ణతను గుఱించి విచారింతము.

ఈ గీతాశాస్త్రము మూఁ డుపదేశములు మూఁడు గీత లయిన వని పైనఁ జెప్పియుంటిని గదా. ఈ మూఁడును భగవంతునిచేఁ జెప్పఁబడినవే కావున నన్నియును భగవద్గీతలే యనఁబడుచున్నవి. ఈ మూఁడు గీతలును గలసి గీతాశాస్త్ర మయినది. ఈ శాస్త్రము యొక్క సముదితాభిప్రాయము ఎల్లవారికిని స్వధర్మమును విధించుట. ఈ గీతలు మూటిలోను మొదటిది సృష్ట్యాదిని వివస్వతున కుపదేశించినది. అందు వివస్వతునకు స్వధర్మము జగత్ప్రకాశన మైయుండును. అది ప్రవృత్తిలక్షణము. రెండవది సాంఖ్యు లగు సనకాదుల కుపదేశించినది. అది జ్ఞానవైరాగ్యలక్షణ మగు నివృత్తి ధర్మము; నివృత్తిపరు లయినవారి కది స్వధర్మము. మూఁడవది ద్వాపరాంతమున నర్జునునకు శ్రీకృష్ణరూపమున నుపదేశించినది—యుద్ధవిధానము; అది అతనికి స్వధర్మము, ప్రవృత్తిలక్షణము. ఈ మూటికి ధర్మత్వసామాన్యముచే నైక్యము గాని వ్యక్తిచేఁ గాదు. అనఁగాఁ బ్రవృత్తిధర్మవ్యక్తి వేఱు. నివృత్తిధర్మవ్యక్తి వేఱు. అందు సామాన్యధర్మమగు ధర్మత్వ మొక్కటే యైనను ప్రవృత్తిత్వ నివృత్తిత్వ విభాజకధర్మములు వేఱగుటను వ్యక్తులు వేఱు. అట్లే వివస్వతున కుపదేశించినదియు నర్జునున కుపదేశించినదియు ప్రవృత్తిత్వసామాన్యధర్మముచే నొక్కటయినను, జగత్ప్రకాశనత్వ యుద్ధత్వ విశేషధర్మములచే నవియును వేఱు గాని ఒక్కటి కావు.

ఈ మూఁ డుపదేశములను సంగ్రహించి వేదవ్యాసులు తన భారతములో శ్లోకరూపమున సంగ్రథనము చేసినప్పుడు వీనికి గీతలని పేరు వచ్చినది. మొదట నీ యుపదేశములు వాగ్రూపములు గాని ఛందోరూపములు గావు. ఈ మూఁటిలో నర్జునున కుపదేశించిన మూఁడవది ప్రకృతము. దానిలోఁ దక్కిన పూర్వపు రెండును ప్రాసంగికములు. అది యెట్లన, ప్రకృతగీతలో నర్జునునకు యుద్ధమును పక్షముచేసి కర్తవ్యత్వమును సాధించుటకు స్వధర్మమును హేతువుగాఁ జెప్పుటలో ముందలి రెంటిను ప్రసక్త మయినవి.

ఆ ప్రసంగములో ధర్మత్వసామాన్యముచేఁ బ్రవృత్తి నివృత్తి ధర్మములను రెంటిని గ్రహించి యుదాహరణముగాఁ జెప్పుటచేత నా మూఁడు ధర్మములును సంకీర్ణము లయి కానుపించుచున్నవి. ఇట్లు ప్రవృత్తిమధ్యమున నివృత్తియు నివృత్తిమధ్యమున ప్రవృత్తియు కానుపించుటచేతనే యర్జునునకుఁ బ్రవృత్తి నివృత్తులను రెంటిని భగవంతుఁ డుపదేశించినట్లు భావింతురు కాని యట్లు కాదు. ప్రవృత్తి, కర్మనిష్ఠ, కర్మయోగము—అనునవి పర్యాయములు. అట్లే నివృత్తి, జ్ఞాననిష్ఠ, జ్ఞానయోగము, సాంఖ్యము—అనునవి పర్యాయములు. అర్జునుఁడు ప్రవృత్తిపరుఁడు కర్మాధికారియుఁ గాని నివృత్తిపరుఁడు, జ్ఞానాధికారియు కానట్టు గీతామూలము వలనను శ్రీశంకరభాష్యములవలనను అర్జునుని ప్రవృత్తినిబట్టియూ స్పష్టము. అర్జునున కుపదేశించిన కర్మయోగ మొక భాగము వివస్వతుని కుపదేశించిన కర్మయోగ మొక భాగము! సాంఖ్యు లగు సనకాదుల కుపదేశించిన జ్ఞానయోగ మొక భాగము. ఈ మూఁడు భాగములు మూఁడు గీత లయినవి. అధ్యాయాంతగద్య మీ యుద్ధమునే సూచించున ట్లున్నది. ఎట్లన, "ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం" అనునది జ్ఞానయోగము. "యోగశాస్త్రే" అనునది వివస్వతునకుఁ జెప్పిన కర్మయోగము. "శ్రీకృష్ణార్జునసంవాదే" అనునది యర్జునున కుపదేశించిన యుద్ధవిధానము కర్మయోగము సముదితగీతాశాస్త్రమం దిట్లు మూఁడు భాగము లున్నవని తెలియఁజేయుటకే యీ గద్యమం దట్లు మూఁడు భాగములు గానిపించుచున్నవి. ఇందు "ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం" అనునది అలుక్సమాసము. ఈ గద్యమందలి "శతసహస్ర్యాం వైయాసిక్యాం" అనునవి "సంహితాయాం" అనుదానికి విశేషణములు. అది "మహాభారతే" అనుదానికి విశేషణ మైనట్లే "ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీకృష్ణార్జునసంవాదే" అనునవి "భగవద్గీతాసు" అనుదానికి విశేషణములు. ఆ విశేషణములు మూఁడును పైనఁ జెప్పిన రీతిని భగవద్గీతలలోని భాగములను తెలియఁజేయును. ఇట్లు విభాగము చేయక యర్జునునకే ప్రవృత్తినివృత్తిధర్మముల రెంటిని ఉపదేశించినా రను భ్రమము నివారింపఁబడదు. అట్టి భ్రమము కొందఱకుఁ గలుగుట వింత కాదు.

ఈ కృష్ణార్జునసంవాదరూప మగు తృతీయోపదేశము సంకీర్ణముగాఁ గానిపించుటచేత నర్జునుఁడే తృతీయాధ్యాయారంభమందు "వ్యామిశ్రేణేవ వచసా బుద్ధిం మోహయసీవ మే" అని శంకించియున్నాఁడు. కావున నట్టి యతని శంకను వారించుటకే పిమ్మట తృతీయాధ్యాయమందే "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" అను దానిలో "లోకే" అనుదానిచేత నీకే కాదను అభిప్రాయమును, "పురా" అనుదానిచేత నిప్పుడే చెప్పినది కాదను అభిప్రాయమును, ఆ శ్లోకపు టుత్తరార్థముచేత అధికారిభేదమునుబట్టి ఉపదేశభేద మున్నదను అభిప్రాయమును తెలియఁబఱచి, నాల్గవ యధ్యాయము మొదలనే "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం" అనియు "స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః" అనియును కర్మత్వసాజాత్యమునుబట్టి యా యోగమే అని చెప్పినట్లు తెలియఁదగియున్నది. ఇట్లుపదేశభేదమునుబట్టి గీతాభాగములకు బహుత్వ ముండుటచేత "గీతాసు" అని బహుత్వము సంగత మయినది.

---

ఈవిషయము నింక ననేకవిషయములును వారు శ్రీశంకరాచార్యాదర్శ మగు భగవద్గీతావ్యాఖ్యానమందు విపులముగఁ జర్చింపఁబడియున్నవి.

# చిత్రాంగి — పాత్రసంపోషణము

తణికెళ్ల వీరభద్రుఁడు గారు, బి. ఏ. (ఆనర్సు)

## చిత్రాంగి — సాధారణదూషణము

ఈ నాటకమున కంతకును, ముఖ్యముగా దీని దుఃఖాంతమునకు, చిత్రాంగిపాత్రము మూలాధారము. చిత్రాంగి దేవి పాత్ర యీ నాటకమునకు ప్రాణమువంటిది. ఆమె లేనిచో రూపకము గమనరహిత మగు నన్న, తప్పిదము లేదు. ఎల్లరకును నీ కథయందు మిక్కిలి పరిచయము కలదు. ఎన్నిమాఱులు నాటకము చదివినను, ప్రదర్శనము చూచినను చిత్రాంగి పొందినంత దూషణము సామాన్యముగా మఱియే నాటకములోని మఱియే పాత్రమును బొందియుండదు. కాని, యీనాటకము శ్రద్ధతో చదివిచూచిన, చిత్రాంగి పాత్రపోషణ మెంత భావగర్భిత మయియున్నదో స్పష్టము కాఁగలదు.

రాజనరేంద్రుఁడు సారంగధరున కీయఁదలఁచిన కన్యను తానే పెండ్లియాడె ననుమాట యటుండనిచ్చి, మనము చిత్రాంగివర్తనమునుగూర్చి యాలోచింతము. చిత్రాంగిగుణగణనము చేయువానికి ఆమెయందు మూఁడు పాపకార్యములు కానిపించుచున్నవి. ప్రథమదోషమేమన, తా నెవరిని వరించినను సరే కాని యగ్నిసాక్షిగా వివాహమాడిన భర్తయందు భక్తి లేకపోవుట. తాను పరిణయమాడఁదలంచిన పురుషుఁడు ప్రాప్తింపకపోవ, వెంటనే భార్యాపు నక్కఱను మఱచి, నూరేండ్లు చింతించినను నుదుట వ్రాసిన వ్రాలు తప్పదు సుమీ యని యూరకట చెందవలెను. పుత్రసమానుఁ డగు సారంగధరుని, తన దుర్మోహమును శాంతిపఱుచుటకయి, మహాపాపమునకు పాల్పడఁ బ్రయత్నించుటయు, వావివరుసలు గణింపక మైమఱచి కుమారుని పొందు గోరుటయు రెండవ దుష్కార్యము. ఆమె యింతటితో విరమింపక, యే కారణముచే నైన నేమి జితేంద్రియుఁడును సద్గుణమూర్తియు నగు సారంగధరుని మరణమున కెక్కు వెట్టుట మూఁడవ దుష్కార్యము. నిజముగా నీ మూఁడు కార్యములు ఘోరపాపము లని యెంచనివాఁ డెవ్వఁడును పృథివి నుండఁడు.

## వైవాహిక సందర్భములు — సారంగధరునిపై ప్రేమ

కాని, మనము నాటక మంతయు బాగరూకతతో చదివిన, చిత్రాంగి నిజస్వరూపమును చూడఁగలుగుదుము. ఆమెను మన మెంతవఱకు నిందింపవచ్చునో, యామె దుర్మోహమున కింతకయిన క్షమాపణ కల దేమో విశదము కాఁగలదు. చిత్రాంగి సౌందర్యాతిశయమునందు జగన్మోహనరూపిణి. ఆ భోజరాజపుత్రి విద్యావతియు గుణవతియు నయి యుండెను. ఆమె బుద్ధి యసమానము. అట్టి సకల సద్గుణవతి యగు యువతికి వివాహార్థము యత్నము చేయుటలో సారంగధరుని వార్త తెలియవచ్చెను. అతని రూపలావణ్యములును సకలశాస్త్రపారంగతయును సర్వసద్గుణసంపత్తియును ధవళయశమును గూర్చిన కథలు వీనుల విందొనర్చెను. అంతే గాక, యా నవమన్మథుని చిత్రపటము నామె చూచినతోడనే తన యాశ లన్నియు నా యాకృతిఁ జెందెననియు తన తపమునకు ఫలము నిచ్చు నీశ్వరుఁ డితఁడే యనియు నతనికి పత్నిగా నుండుటకంటె మహాపదవి వేరొక లోకములో లేదనియు నామె నిశ్చయించెను. ఈ విషయ మామె వాక్కులనుండియే మనము గ్రహింపవచ్చును.

> "సారంగధరా, ఆ బ్రాహ్మణుఁడు నీ రూపపట మిచ్చినది
> మొదలు అంకురించిన మోహాతిశయము లెక్కింపఁజాలను.
> నిన్నుఁ గాకింకొక్కనిఁ బతిగాఁ బడయ నిర్దేశింపను.
> నిన్ను నా పతిగఁ జేయ వేయి దేవతలఁ గొలుతును. అన
> వరతము లోకమోహన మైన నీ రూపమును లోకవిదిత
> మైన నీ ధవళయశమును గూర్చిన చింత మానను." (I-ii)

అట్టి బుద్ధిమతియు సద్గుణవతియు నగు పదునారేండ్ల కన్నియను రాజరాజను నేఁబదియేండ్లకంటె నెక్కుడు వయస్సు గల యొక ముదుసలి పాణిగ్రహణము చేసికొనెను. ఆయమ తండ్రి రాజరాజున కాంతరంగికుఁ డయినందున మీఱరాదని, తా నెంత వలదని ముష్కరభావము పట్టినను మానక, ఆమె కానవెట్టి, బతిమాలి, నిర్బంధపెట్టి, మీఱరాకుండఁ జేసి, యామె నొప్పించెను; కాని, పేరునకు మాత్ర మాతనికి భార్య యయినను, మనసు సారంగధరునియందు తప్పదాయెను. రాణివాసపు నిర్బంధమునుండి యతని నొకనాఁడును జూడలేకపోయినను, అతని రూప మామె కన్నులఁ గట్టినట్టె యుండెను. కాని యామె తన మనస్సును శాంతిపఱుపలే నని తెలిసినచో, వివాహము కాకముందే జాలియటువలె తగిన ప్రయత్నము చేసియే యుండును. ధైర్యసాహసములు కలిగి తన మనోరథము నెట్టు లయినను చెల్లింప నెంచిన కామినులకు

> "గరళంబు న్గరవమ్యెనే, యకట! ఖడ్గంబైనఁ జేఁ జిక్కదే?"

కాని తన భర్త వచ్చినపు డెల్ల నతనియం దతిప్రేమ నభినయించి యాతనిని మోసపుచ్చుచువచ్చెను. రాజు వృద్ధుఁ డగుటయు, వార్ధకమందుఁ గలిగిన చిన్నిభార్య యగుటచే నతఁ డీమెకు జన విచ్చుటయు కారణములు కావచ్చును. లేదా, చిత్రాంగి యెప్పు డయినను తన కపాయము రాకుండ, రాజును నమ్మించి తాను చెప్పిన దెల్ల అతనిచే చేయించుటకు అతనిని జోకొట్టుచున్నదో

---

ఈ వ్యాసము ఆంధ్రనాటకపితామహుఁడు కీర్తిశేషుఁ డయిన ధర్మవరము కృష్ణమాచార్యుల "విషాదసారంగధరము"నకుఁ జెందిన విమర్శనలోని యొక భాగము. ఈ నాటకము నందలి పాత్రపోషణము శ్లాఘనీయము. చిత్రాంగీపాత్రసంపోషణక్రమము మాత్రమే యిక్కడ చర్చింపఁబడినది.

తెలియదు. కాని, యాతనిని జోలపాడుచున్నా ననియు పాపము చేయుచున్నా ననియు నామె కెప్పుడును జ్ఞాపకము వచ్చుచునే యున్నది.

"ఆహా! యెంతటి కపటకృత్యము నభినయింపఁ బాల్పడితిని." (I-ii)

### చిత్తక్షోభము — నైతికతత్పరత

చిత్రాంగిని మనము మొదటఁ జూచిన దెప్పు డనఁగా, ఆమె మనోవేదనపడుచున్నపుడు (I-ii). సారంగధరునియందు బద్ధానురాగ యయి యామె తన మనము నాతనినుండి మరల్చుటకు మనస్ఫూర్తిగ యత్నము చేయుచున్నది. మును ప్రేమో మోహ మున్నను ఇప్పుడు పుత్రుఁడుగా నున్నాఁడని పరితపించుచున్నది. ఆ యనురాగమును జయింపవలె ననియు నీతిమార్గమున వర్తింపవలె ననియు కోరుచున్నది. తామరాకులోని నీటివలె నామె మనస్సు తల్లడిల్లుచున్నది. ఆమె హృదయమం దెట్టి ఘోరసంగ్రామము జరుగుచున్నదో మన మీ క్రింది వాక్యములఁ బరీక్షించిన, చూడఁగలము.

"మనసా! ఈ దుర్బుద్ధి నీకేల? మొదట నేమో మోహాతిశయ ముండెను! ఇప్పుడు కుమారుఁ డయియున్నాఁడే? నీకీ చింత యేల? అకటా! నే నేమి చేయుదును? ఎంత యూరడిల్లుద మన్నను సాధ్యము కాకున్నది." (I-ii)

ఇంతలో నా సారంగధరుని రూపపటము చూచి మది యుప్పొంగ, తాళఁజాలక తన దౌర్భాగ్యమునకు వెత చెంది,

"అయ్యో! నే నెట్లు సహింతును? ఈ జగన్మోహన రూపము నా మనఃపీఠమున నెలకొనియున్నది కదా! అకటా! యిట్టివాఁడు నాకు లభింపకపోయెఁగా? చెల్లి దంపుఁ దగులంపుఁ దమిచే నీ భయమును బాపి యిట్లయిన నీ మనోహరాకారుని 'లోఁబఱచుకొ'న నుద్యమింతును. తమకింతును. యోచింతును. మహాద్రోహమే ఘోరపాపమే యని విలపింతును. మఱియు నుంకింతును. వెత గాంతును. ఏమి సేయుదును?" (I-ii)

### అవాంతరసంఘటనము

చిత్రాంగి మన సిట్టి దురవస్థలో నుండ, రాజనరేంద్రుఁడు మృగయార్థము వింధ్యాటవికి పోవు దినము సంప్రాప్తించెను. రాజూర లేకపోవుటయు తా నొంటరిగా సారంగధరునిఁ గూర్చి తలంచుట కవకాశము కల్గుటయు ఆమె నదివఱకే బాధించుచున్న పుష్పబాణునికి మిక్కిలి సహకారము లయ్యెను. ఆమె

"అయ్యో! ఒకనాఁడు పతి యూర లేకున్న నేమో మతి విభ్రమము గలుగుఁగా! ఇఁకఁ బది దినము లొంటిపాటు గలిగెడునే! ఎట్లు తరింతును?"

అని విలపించుచున్నది. చిత్రాంగి హృదయము మన్మథవికారముతో నిండియున్నది. ఆ యనురాగమునకు ఫలమును బొందు నవకాశము చిక్కినది. ఇఁక నామె చేయున దేమున్నది? ఆహా! అవకాశ మెంత పాటవము కలది. నీతిపరులను దుర్నీతిపరులను చేయుటలో నవకాశమున కున్నంత శక్తి మఱియెవ్వటికిని లేదుగదా! ఎంతమంది సత్పురుషు లనుపించుకొనువారు తమ మనస్థైర్యమును పరీక్షించు సమయము లేకపోవుటచే జితేంద్రియు లగుచున్నారు! చిత్రాంగి యనిమిది రోజులవఱకు కంటినుండి జలధారలు గాల్చుచుఁ గడపినది. ఇఁక నామె భరింపఁజాలదు.

"అనఘ విధంబు వాటిలె ననంగుని బారికి నోర్వఁజాల నీ
యెనిమిది నాళ్లు నొక్కగతి నేడ్చుచుఁ బాపితి; నింకఁదాళ నా
మనసిజరూపవైభవుని మానవతీనవమోహనాంగునిన్
దినకరతేజునిన్ విభవదివ్యబిడౌజునిఁ గూడకుండినన్" (I-iv)

### తీర్మానము

ఆమె యొక నిమిష మయినను పుష్పకోదండుని బారికిఁ దాళ లేక "నేనై ముందు పడినను సారంగధరున కనురాగము నాపైఁ గలుగునా?" యని యతనిని బలవంతపెట్టుటకు సిద్ధపడియున్నది. జాబు వ్రాయుటకు నిశ్చయించినది. ఒక్క విషయ మీ సందర్భమున మనము మఱవఁదగినది కాదు. చిత్రాంగి మొదటినుండియు కన్యాన్వేషణమప్పుడు వచ్చిన విభావసుఁ డను బ్రాహ్మణుఁడు సారంగధరునితో తన రూపాతిశయమును గూర్చియు తన యభిలాషను గూర్చియు చెప్పియుండె నని యూహించియున్నది. తన సందేశ మతనికి చేఁరలే దని యామెకు తెలిసినచో నేమి చేయునో?

### ప్రేమరంగము — నిర్మలానురాగము

ద్వితీయాంకము ప్రథమరంగమునందు చిత్రాంగి ఘనత యంతయు స్పష్ట మగును. ఇక్కడ చిత్రాంగి చిరకాలమునుండి వేచి వేచి చంద్రుని రాకకయి చకోరపక్షివలె, ఆదిభిక్షువు రాకకయి మహాభక్తునివలె, సారంగధరు నెదురుచూచుచున్నది. సారంగధరుఁడు మిగుల వెఱ్ఱివాఁడు. మొదట చిత్రాంగి ద్వంద్వార్థ మిచ్చు మాటలు చెప్పను గాని యతఁ డది గ్రహింపఁజాలఁడు. అతని కవచాదుల విప్పించును. అతనికి ఫలాహార మిచ్చును. తన పడకటిల్లు కూడ చూపించును. కొంతసేపటి కా రాజకుమారుఁ డది స్ఫురించి "తల్లీ! నీ వను మాట మిక్కిలి మర్మముగా నున్న" దని నుడివెను. ఆమె యతని మౌనమునకు విచారపడి కన్యాన్వేషణవిషయ మతనిని ప్రశ్నించెను. నిజము వెలువడిన వెంటనే తాను మోసపోతి నని గ్రహించినది మొదలు, ఈ రంగమందలి రెండవ భాగ మారంభమగును. ఆమె తప్పిదము గ్రహించి యతనిని శృంగారవిషయములను గూర్చి ప్రశ్నించును. తుద కుండఁజాలక "అంత యెందుకు? నేనే నిన్నుఁ

గాముంచి వైచిబడిన వల దని త్రోయుదువా?" యని యామెని బరీక్షించెను. సారంగధరుఁడు చెవులు మూసికొని "కృష్ణ కృష్ణ! తల్లీ! యంత మాట వింటిని!" యని విచారింప, చిత్రాంగి యా రాకుమారునితో దుట్టుమాట లింక పనికిరా వని తన సంతాపంబంతియు వెలిపుచ్చనెంచె; ఇఁక తాళఁజాలక, "నిక్కము దాఁప నేల?" యని యా మన్మథప్రేరితురాలగు వరూథిని తేజోమూర్తి యగు నా ప్రవరాఖ్యుని వేఁడిన చందమున, తన మనోభీష్టమును వెలిపుచ్చెను. ఆహా! ప్రేమ యెంత గాఢమయినది. ఈ దిగువ చెప్పఁబోవు వాక్యములు చూచి, చిత్రాంగికి సారంగునియందు నిజమైన ప్రేమ కలదో లేదో, నిజముగా నామె కతనియందలి యనురాగ మెంత మిక్కుటమో, యామె కామముచేత సారంగధరుని వలచియున్నదో లేక నిక్కువముగా సారంగుని దైవముగా నెంచియున్నదో, సారంగుఁ డామె ప్రాణప్రదమైన యాశను చెల్లింపనియెడల నేమి మూడునో గ్రహింపఁగలము. చిత్రాంగి సారంగధరునితో,

> "నిన్నొకనాఁడైనను గని నిను గ్రహింప ధన్యత నొందవలయు ననియే ప్రాణముల నతిభారముగ మోసికొంటిని. నే నూరక యవిచారమూలమున నీ పట్టు పట్టినదాన ననకుము. ఎంత పాటువడి యెన్ని బాధ లొంది యున్ని దినము లాలోచింపకుండిన, నీ విన్నప మీలాగున నొనరింతును. ఇది యంతయుఁ గల్ల కాదు. ఇందునకు నా మన సొక సాక్షి; దైవ మొక సాక్షి. ఇంకొక సాక్షిఁ జూపెదను — ఇది చూడుమా! నీరూపపటము! దీని నెల్లపుడు ప్రాణప్రదముగ భావించి నిదురించునప్పుడు సైతము స్తనసీమపై ధరించి 'అకటా! పటరూపములకు జీవ మిచ్చి చక్కని ప్రాణులఁగాఁ జేయు మహామంత్ర మే మహాత్ముఁడయిన నాకుపదేశింపఁడా?' అని వందురుచుందును. అనయము ఏఁకరుచుందును. నీ యాన! నే నియసువుల ధరింపఁజాల — పాలముంచినను నీట ముంచినను నీవే!"

ఆహా! దీనినిబట్టి యామె సంగతి పూర్తిగా గ్రహింపఁగలము. చిత్రాంగి క్రమముగా నాలోచించి తాళలేక యీ పని పూనినది. ఆమెకు సారంగునియందు మోహ మెంత గాఢమో విశదము. అది వట్టి కామము కాదు. తాను వరించిన మహాపురుషుని చూచి యానందించి జన్మము సఫలము చేసికొనవలె నని జీవించియున్నది. అట్టివానినే దైవముగా నమ్మి నీట ముంచినను నీవే పాల ముంచినను నీవే యని తనకాయ మతని కర్పితము చేయుచున్నది. ఆహా! అట్టి చిత్రాంగి సారంగధరునికే భార్య యయినచో వారి దాంపత్యమెట్లుండునో కదా!

## భావోద్రేకము -- ఆలింగనాభిలాష

ఆమె యంత చెప్పినను సారంగధరుఁడు చెవిని పెట్టఁడు. ఆమె మనస్సులో సలసల క్రాఁగుచున్నది. మది వెలికి రాక తప్పకపోవ, ఆతనికి తన బాళి యంతయు నగపఱచినది. మన్మథోద్రేకముచే శరీరము సడలినది. మహాపురుషుఁ డని కాని పాప మని కాని భీతి నణఁచినది. దైవ మామెకు జ్ఞాపకము లేదు. శరీరము క్రుక్కుచున్నది. నిట్టూర్పు లధిక మయినవి. ఇఁక నొకింతసేపయినను వేచియుండఁజాలదు ఈ బాధ కంతకును నొకటియే నివారణము. ఆమె సర్వమును మఱచి యాలింగనసౌఖ్య మను మాట తప్ప మఱియేమియు నామెకు జ్ఞాపకము లేక "ఎంత పాపమునకైనఁ దాలుదుఁ గాని, యీ మదనతాపము సహింపఁజాల" నని నుడివెను. సారంగధరుఁడు పోవఁజూచుచుండ పోనీయదు. తన యభీష్టము చెల్లింపక వీలులే దని మఱిమఱి ప్రార్థించుచున్నది.

> "ప్రాణేశా! నీ వే మన్నను ఎంత భీతి చెప్పినను నిన్ను విడువను. నీపాదము లాన విడువను!" (కాళ్లంటఁబోవును. అతఁడు పోఁబ్రయత్నింప, ఉత్తరీయము పట్టి లాగును.) "మనోహరా! చచ్చిన పిమ్మట నే మగుటయు నెవ్వ రెఱుంగుదురు? ఇపుడు పంచబాణుఁడు సతనుత్రాణుఁడై యాశోషిశితికంఖాణుఁడై నా ప్రాణానిలములఁ బోనార్చుచున్నాఁడు. స్త్రీహత్యాదోషమునకు నీ వోర్చుకొందువా?"

ఇంతటితో నామెశక్తి క్షీణించినది. ఆమె చెప్పవలసిన దంతయు విన్నవించినది. సారంగధరుని హృదయము వజ్రముకంటెను కఠినమయిన దగుటచే నామె నిరాశ చెందినది. తా నేమియు చేయఁజాలదు. అతఁ డెంత హితబోధ చేసినను సైరింపకుండ, వేఱు మార్గము లేక వానిం బ్రార్థింపఁజొచ్చెను. అతని కాళ్లంటెను. బలాత్కారమున నైన నాతనిఁ దాకఁబోయెను. ఇఁకఁ దాళఁజాలక చిత్రాంగి,

> "సారంగా! నీ యాన - నా యాన - ఆపదను నాన - నిను మానఁజాల - నీ యాశ్లేషసుఖము గోరు నా కాశాభంగ మొనర్చినందున కొకటే ప్రతిక్రియ! నే నే దాని రాఁదీసి మాఱలాడుదును. (ఆలింగనము చేసికొనఁబోవును.)"

## ఆశాభంగము — ఆగ్రహోదయము

ఇప్పటికైనను సారంగధరుని మనసు కరఁగదు. ఆమెను దూషించి పోయత్నించును. చిత్రాంగి యాసచ్ఛక్తియు ధారవోసినది. విఫలమనోరథ యయినది. రాకొమరుఁ డన్నన్నో, యించుకయినను లొంగకపోవుటయే కాక "తల్లీ! నీ మనము దుష్టకీటకలితముంబోలె నంతకంతకు కెక్కుడగుచువచ్చెను! ఇంక సైఁపఁజాలను" అని యామెను దూషింపఁజొచ్చెను. ఆమె నిరాశ వొడమ, ఆ నిరాశకుద్భవించిన యాగ్రహము పట్టఁజాలక క్రోధానన యయి, మహిషాసురుని చంపు నాదిశక్తింబోలె, నరకాసురుని వధకుద్యుక్తురాలయిన సత్యభామంబోలె నిప్పుల రాల్చు తీక్ష్ణదృష్టితో,

> "ఔనా? నిక్కమా? పోయెదవా? మానిని మాత్రము సాహసింపఁదొడఁగెనా యది యొనర్పఁజాలని కార్యమే లేదు. నీపై నా కున్న బాళి యంతయు వెలిపుచ్చితిని.

నా మనోధనమును గ్రహించితివి. దాని ననుభవింపకున్న
నిను దక్కనీయదు సుమా! నన్ను నీవిటు వెళ్లఁద్రోచుట
కాలాహివాలము ద్రొక్కుట యగు? కడతేఱఁజాలవు.
సాహసమున నీకుఁ బ్రాణాపాయము నొప్పసంఘటింతు."

ఎంత వేఁడినను మెంఱు లాలకింపక మీఁదుమిక్కిలి దూషించుచున్న పురుషునిఁ జూచి కోపదీప్త యయి యట్టి వికారాకారము దాల్చినది.

## పునరనురాగము

ఆమె నిరాశచే జనించిన క్రోధమున నతని తూలనాడెను గాని వెంటనే యామె నిజస్వభావము నిజానురాగమును మఱియొకసారి వెలికి వచ్చెను.

"అయ్యో! సారంగధరా! నన్నెంత మాటలాడఁజేసితివి! ధనమువోలె, సర్వస్వమువోలె, పెన్నిధానమువోలె, దైవమువోలె నమ్మియుండిన నీపైఁ గినియఁజేసితివి! ఇది ప్రణయోన్ముఖసంభాషణంబు గాక నిక్కంపు టలుక గాదు. ఏదీ! నా మనోహరుఁడవే, నా మన్మథమన్మథుఁడవే, నా ప్రాణదాయకుఁడవే, నా సారంగుఁడవే! నీకేల కరుణ రాదు? (సారంగధరుఁడు మానవసమానుఁడే యయినయెడల నతని హృదయము నీదీనాలాపములు తాఁకినంతనే లోహము క్షణములో నవనీత మయియుండును గదా!) ఏల సంశయించెదవు? ఒకసారి నీ యాశ్లేష సుఖ మిచ్చిన మరియొకసారి కోసరను గమ్మా!" (ఆమె ప్రేమసాగరమున లోఁతు లెక్కింప నేరి తరము? అది యనుభవింపవలసినదే కాని వర్ణింప నలవి కాదు.)

మన్మథప్రేరితు లయినవారి మన స్సెంతికంటె చక్కఁగా నెక్కడనైనను చిత్రింపఁబడినదా? ఇట్టి తరుణీమణిని జూచి కనికరము లేనివా రెవ రుందురు? ఆమె సారంగునే దైవముగా నమ్మియుండెనుగా. ఆ ముదుసలి రాజెంత మూర్ఖుఁడో కదా! కన్యాన్వేషణమునకయి పంపఁబడిన విభావసుఁ డెంత క్రూరుఁడు. వజ్రపంజరనిభంబయిన సారంగధరుని హృదయమును భేదించుటకై జవ్వని ప్రయత్నము లన్నియు నిష్ప్రయోజనము లయినవి. నవమోహిని యగు నొక స్త్రీ తన బుద్ధిబలిమి నంతయు వినియోగింప దన్న మాట యటుండ, నట్టి యువతి తనపైఁ బడి యాలింగనము సేయ నెన్ని సారులో ప్రయత్నించినను, ఇంచుకయినను చలనము లేక యామెను మాతృభావములోఁ జూచునంతటి మహానుభావుఁడు మన కీశ్వరసమానుఁడే కదా!

## హంసగీతము

ఇంతటితో చిత్రాంగి బుద్ధివికాసమును మనోనైర్మల్యమును అస్తమించిన వని చెప్పవలెను. మనము ఇంతవఱకు నామె యెట్టి ఘోరకార్యము సేయఁదలఁచినను, ఆమె దృఢానురాగమును మెచ్చుటయు ఆమె సారంగధరుని దైవముగా నమ్మి యతని పాదపద్మములపైఁ బడినపుడు నెనరు చూపుటయు తప్పినవి కావు. ఇంతటితో మనము నిజచిత్రాంగియొద్ద సెలవు తీసికొనవచ్చును. హంసలు తమ యవసానకాలమందు దొక గీతమును పాడి ప్రాణము వాయు నని వింటిమి కదా. ఆరీతినే చిత్రాంగి నిజస్వభావము మన కదృశ్యము కాకమునుపే యామె కడసారి తన యనురాగమును గూర్చి యొక హంసగీతమును గానము చేసి విరమించును. తిరిగి మఱియొకసారి పంచమాంకమందు తప్ప నామె మన దృష్టికి గోచరమే కాదు.

## ఆర్జవము దౌర్జన్య మగుట

సారంగధరునియం దింత గాఢానురాగము కలిగి యాతని ముఖావలోకనమునకయి యీ కష్టజీవనమును భరించుచున్న చిత్రాంగి యతనికి పరమశత్రు వయి యాతనిపాలిటి మృత్యుదేవత యగు విషయ మొక సమస్య. అయినను చిత్రాంగిపాత్రసంపోషణక్రమమును జాగరూకతతో చూచిన నిజము విశదము కాఁగలదు. నాటకకర్తయొక్క కల్పనాశక్తియు తేటతెల్ల మగును.

## చిత్రాంగి ప్రతిభావిశేషము

చిత్రాంగి బుద్ధికుశలత యద్భుతము. సారంగధరుని లోఁబఱచుకొనుటకు యత్నించుచు, 'నవమోహనాంగా! నీ యెనలేని సరసతకును విలాసమునకును నిది ఫలంబె?' యని వేఁడినపుడు ఆమె యప్రతిహత మయిన బుద్ధిని జూచి యాశ్చర్యము నొందనివా రెవ్వరు? రాజనరేంద్రుని మనసున విష మెక్కించిన విధమును, వెక్క శృంగారపు పేర్ల వక్కాణించిన చందమును జూచిన నామె చతురత తెలియఁగలదు. ఆమె విద్యాజ్ఞాన మీ పెను ప్రవర్తనమునందు వినియోగించె నని విచార మొందినను, ఆమె కల్పనాశక్తిని జూచి యద్భుతపడమా? అది గాక యామె జాబు వ్రాయుటయందు చూపిన చమత్కృతియు తన పెనుసడలి యంతయు బయల్పడినను తుదవఱకు ధైర్యము వదలక రారాజుపై కడసారి తన వాల్గంటి చూపను సమ్మోహనాస్త్రమును ప్రయోగించుటయు చూచినపుడు చదువరులును దిదృక్షులును అచ్చెరువొంది "భళిరే! యేమి యీ చిత్రాంగి మేధాశక్తి! ఆమె యాలోచన లెంత భావగర్భితములు. ఆమె వ్యూహములు పద్మవ్యూహములు కదా" యని తమలోఁ తాము చెప్పుకొననివా రెవ్వ రుందురు?

## సాహసము — కార్యనిష్ఠ

చిత్రాంగియందు మన్మథప్రేమ మితి మీఱినది. ఆమె మనసేమో కాని తాఁ దలఁచిన కార్యము కొనసాఁగువఱకు నామెకు నిద్ర పట్టదు. దానినిబట్టి ప్రపంచస్థితిగతులు మాఱవలెను. దేశకాలముల ననుసరించుటకు మనసు చొరదు. కాలానుగుణ్యముగా ప్రవర్తింపని మనస్సే కాకపోయినయెడల, ఆమె సారంగధరునియందలి ప్రథమ మోహము నడంచియే యుండును. తన మనసునకుఁ దోఁచిన కార్యము

పూనుటకు ధైర్యసాహసములును కోరిన పని నెఱవేర్చుటకుఁ దగిన పట్టుదలయు నామెయందు ప్రాముఖ్యము వహించినవి. కావున నామెకు సదుద్దేశ మున్నను దురుద్దేశ మున్నను, ఆమె పూనిన కార్యము నామెకుఁ జేర్పఁగలవు. మఱియు సాంఘికమర్యాద లెటున్నను నీతిశాస్త్ర మెటున్నను తన మనసునకు తట్టిన సంగతి కొనసాగక తప్పదు. ఆ ఫలాపేక్షయం దెంత సాహసకృత్యము నయినను చేయ నుద్యుక్తురా లయియుండును. ఈ విషయము గ్రహింపఁగలిగినచో మనకు చిత్రాంగి పాత్ర స్వభావోద్భవత్వ మఱచేతిలోని యద్దమువంటిది.

## అవమానానుభవము

సారంగధరుఁడు చిత్రాంగి మొఱ నాలకింపక వెళ్లినతోడనే చిత్రాంగి క్రుంగినది. హాహా యని విలపించుచు, "ఇందు నన్మని రాజవరేణ్యుఁ డెందుఁ బోయెనో నా ప్రాణకాంతుఁ డెందుఁ బోయెనో నా జీవమేటి?' కని రోదన మొనరించుచున్నది. కొంచెము సేపటికి తెలివి దెచ్చుకొని తన ప్రస్తుతపు స్థితి చూచి ఖేదపడి,

> "అకటా! నే నెంత పిఱికి నైతిని! ఎంత బేల నైతిని! ఎంత మోసపోయితిని! గాంభీర్యగుణ మింతైన లేక మనోధర్మము దాఁపఁజాలక పలుచదనము దెచ్చుకొంటిని. నా బ్రతు కేఁ కేల? అసువులఁ బాసెదను."

సారంగధరుని నిరాదరణమువలనఁ దనకుఁ గలిగిన యాశాభంగము నోర్వఁజాలకున్నది. అతనికి తన మనమును వెలిబుచ్చుట వలన లాభము రవ్వంతయు లేదు సరికదా కీడు మూడినది. తన మనోరహస్యము బయల్పడుటవలన మోసము వాటిల్లె నని చింతించి తాను పలుచదనము దెచ్చుకొంటి నని హేయపడుచున్నది. ఇంతలో నామెకు ధైర్యమును వదలు కామిని కామిని కా దని తోఁచ, తన్నింత హింసించినవానిని విడువఁగూడ దనియు వానిని శిక్షించు మార్గము కల దనియు స్ఫురింప,

> "ఎంత కట్టడి యనిపించుకొన్నను, ఎంత కట్టడితనము వహించుకొన్నను, ధీరగుణము మాను కామిని యొక కామినియా? నన్నింత రవ్వచేసినవాని విడుతునా? ఎటు చేయఁజాలను? ఆ ముదుసలి నే నేమి చేయుమన్నఁ జేయఁడు. సారంగధరునియందలి మోహమా! ఇక్లే వెడలిపొమ్ము. క్రోధమా! తత్స్థానము నధిష్ఠింపుము. కానీ చూతము."

## క్రోధము — ప్రతీకారచింత

చిత్రాంగి మన స్సంతయు వైరముతో నిండియుండుటయు ఆమె యాగ్రహదేవత నారాధించుటయు చూచితిమి. ఆ యాగ్రహ ముద్భవించుటకు కారణ మేదియో యోచింపవలెను. సారంగధరుని నామె ప్రార్థించినపు డాతఁ డామెను దూషింప నారంభించెను.

> "నీ మతము దుష్టకీటకవిషముంబోలె నంతకంత కెక్కుడగుచువచ్చెను."

చిత్రాంగికి కోపము రాఁగా, "నన్ను నీ విటు వెలార్చుట కాలాహి వాలము ద్రొక్కుట యగు! కడ తేరఁజాలవు. సాహసమున నీకు ప్రాణాపాయము నొసంగింతు" నని చెప్పియున్నది. ఇంతకును సారంగుని చంపఁబూనుటకు ముఖ్యకారణము మఱియొకటున్నది కదా! సారంగధరుఁడే యెప్పుడయిన తన దౌరాత్మ్యమును వెలివెట్టినఁ గాని మఱి యేవిధమున నయిన నది బయల్పడినఁ గాని తనకు ముప్పు కదా యని చిత్రాంగి ముందే జాగ్రత్తపడుట మంచి దని యిట్టి క్రూరత వహించియుండవచ్చును. ఇదివఱలో సారంగధరుఁ డొకసారి,

> "నిక్కముగా మా తండ్రితో నీ యుదంత మంతయు వినరింతును." అని వాక్రుచ్చెను. అతఁడు చెప్పఁడు గాని యొకవేళ నేరీతి నయినను పరులకుఁ దెలిసిన నేమి చేయఁగలదు. దీనికి సహకారిగా,

> "కలుషమానసము నీయెడ నుండుటచే భీతి గలిగి నీ చరితము వెలిబెట్టిన నపాయ మగు నను తలఁపున నాపై నప్పుడే మాయోపాయములఁ బన్నితివా?" యని సారంగధరుఁడు చెప్పుచున్నాఁడు. ఇంతకును నిట్టి ఘోరకార్యము చేయుట కామె సాహసము తప్ప వేఱు కారణము లేదు. పురుషులకంటె స్త్రీలకు సాహస మెక్కు డని పలుమాఱు వినియున్నాము. "పట్టు తీర్పఁగ నెంత పని నయినఁ గావించు తరుణి సాహస మింత తలఁపవలదె?" యని చిత్రాంగి చెప్పిన మాట లబద్ధములా? ఈ సాహసమును గూర్చి పెక్కుసార్లు మనము వినఁగలము.

> చి.— మానిని మాత్రము సాహసింపఁ గోడఁగినా యది యొనర్పఁ జాలని కార్యమే లేదు..................సాహసమున నీకుఁ బ్రాణాపాయము నొసంగింతు.
>
> సా.— మన మిరువురమే యుండువారము గావున నీ వేమి చెప్పినను చెల్లివచ్చు నని సాహసించితివా?.........నీతోడఁ గూడి నరకశ్రేణి డిగనుద్యమింతునా? నీ సాహసము నే మనంగలము. అమ్మా నీ వెంతకుఁ దెగించితివి?

చిత్రాంగి సాహసము చూచి సారంగధరుఁ డేల, మనము మాత్ర మాశ్చర్య మొందుట తప్ప మఱియేమి చెప్పఁగలము? ఇంతకును చిత్రాంగి చెప్పినట్లు ఆశ్చర్యపడ నేల?

> "తనయు వావి గణింపక యెనయు సాహసంబు గల యింతి కన్యతంబు సంఘటించి పడికి నోడక చంపించు సాహసంబు గలుగఁకుండునె యను మాట తలఁపవలదె?"

## ఆత్మరక్షణాపేక్ష — కపటోపాయము

చిత్రాంగి దుర్మోహమునకు లోనయి యొక ఘోరకృత్యమును చేయఁబూనినది. తన పనికి సహకారిగా నుండునటు లసత్యము నారాధించుచున్నది. మేక్బెత్తు ఒకానొక నేరమును జేసి దానినుండి తనకు హాని కలుగకుండ స్వప్రాణరక్షణార్థము మఱికొన్ని నేరములు చేయుట తటస్థించినట్లే, చిత్రాంగి కూడ తన మహాపాపముచే తనకు

కీడు వాటిల్లు నని భీతిల్లి ప్రాణమందలి యాశచే ననేకయుక్తులను పన్నినది. II-ii లో నామె రాజున కీవార్త తెలియఁజేయుచు బొంకులు బొంకి యాతనిని నమ్మించుట యద్భుతము. తనకు సారంగధరుఁడు పరిభవము జరిగె ననుటలో తృప్తినొందక, ఒక మనోన్మత్తుఁడయిన క్రూరుఁ డే కార్యములఁ జేయునో వాని నాకృతి నిచ్చి యట్టి దుష్కృతములను సంభాషణాంశములను వర్ణించి రాజు మనసును విషముతో పూరించినది. ఇట్లు చేయుటవలన చిత్రాంగి యుద్దేశ మేమని యోచించిన, ఆమె చెప్పిన విషయము నంగీకరించుకయిన రాజునకు సందియ ముండుట కవకాశము లేకుండుటయు హేయపు వర్ణనములచే రాజు మనస్సు చెడి యాతనికిఁ దన కుమారునియందు మఱింత యసహ్యత పుట్టుటయు నామెకు ఫలితములు. చిత్రాంగి తలపెట్టిన కార్యము కొనసాగువఱకు ఆమెకు మనశ్శాంతి యుండ దని యిదివఱలో వక్కాణించియుంటిమి కదా. రాజామెను రెండవ సారి యథార్థము చెప్పు మని ప్రశ్నించినపు డామె యుక్తి యే మని చెప్పవచ్చును.

> "రాజేంద్రా! ఏల యిట్లు ఆటోపులు చేసెదు? (పఱపు క్రింద నున్న యుత్తరీయము దీసి) ఇదియే నాకథ యంతయు చెప్పఁగలదు. ...ప్రాణము వాసెదను."

సారంగధరునిమీఁద నింద మోపినను తగినంత కారణ మున్నఁగాని యది నమ్ముట దుర్లభము. పలుమాఱు సారంగుఁ డామె సాహసమును జూచి నిరసనభావముతోఁ బల్కినవాఁడు; తన కేమియు భయము లే దని నొక్కి వక్కాణించినాఁడు.

> "నీవు దండింపఁగల వని విశ్వసించితివా? ఎట్టి మూఢవిశ్వాసము! నీ వేమి చేయఁగలవో చూచెదఁ గాక."
>
> "నిజము కల్లగఁ జేసి నీ వెంత బొంకిన
> వడి నమ్మ వా రుండవలదటమ్మ
> పిన్ననాటనుగోలె నన్నెఱింగినవారు
> పండితు లీ యూర నుండరమ్మ"
>
> "అయ్యో! నీ బెదరింపులకు నాకు నవ్వువచ్చుచున్నది."
>
> "వింటిరే యిట్టి యాశ్చర్యవృత్త మెందు
> నమ్మయఁట! బొంకునఁట! బొంకినంత నమ్మ
> వారలఁట! నమ్మి నన్నుఁ జంపునాగలంట
> మీర లిందుకు సాక్షులు కారె లేరె?"

సారంగధరుని కడతేర్చినఁ గాని చిత్రాంగి జీవించుట కష్టసాధ్యము. సద్గుణమూర్తి యగు పుత్రునియందు అతి ప్రేమ గల రారాజును నమ్మించి సారంగుని మరణము గావింపవలె నన్న, అసత్యములు పల్కి యుక్తులు పన్ని చేఁ బూనిన కార్యము సాధించు టెట్లు?

ద్వితీయాంకము ప్రథమరంగము దాఁటినది మొదలు చిత్రాంగి యనురాగ మంతయు నాగ్రహముగా మార్పుచెందినది. అంతటితో సాధుచిత్రాంగి యదృశ్య మయినది. అప్పటినుండియు కపటచిత్రాంగియే కథానాయిక. సారంగధరుని నిరసన కామె కోపదీప్తమైనది. ఆ మనోహరాకారునియం దామెకుఁ గలిగిన యాగ్రహము వర్ణింప నలవి కాదు. సారంగుఁడు నగరు వెడలిపోయిన తర్వాత దాసి వచ్చి సారంగుని మాట చెప్పునపు డామె యిచ్చిన ప్రత్యుత్తరము చూడుఁడు.

> "సారంగధరుఁ డుండనీ మండనీ! వాని పావురములును
> వాఁడును కాడు చేరనీ! ఈ బహుభాషణ లేల? జా బిమ్ము"

## కాపట్యవిజయము — ఆత్మోల్లాసము

చతుర్థాంకమం దామె చేయున దేమన్న, రత్నాంగి దుఃఖము చూచి రాజుమనసు కరఁగకుండునట్లు చేయుటయే. పంచమాంకమందు చిత్రాంగి చిత్రపటముతో ప్రవేశించినది. సారంగధరునియెడ తన పగ దీర్చికొన్నందుల కామెకుఁ గలిగిన సంతసము వర్ణింప నేరితరము?

> "ఇఁక నైదు గడియలకు నా శత్రువు మడియఁగలఁడు. రత్నాంగి వచ్చిన నీ యుదిరాజున కేమి బుద్ధి పుట్టునో యని బెగడువడియుంటిని. ఇఁక నిరాటంకము. బళీ! చిత్రాంగీ! ఇంత కార్యము నీవు గాకింకెవ్వరు చేసి యుందురు?"

ఔరా! ఇట్లు గదా వ్యూహము పన్నవలయు నని తలఁచి తలఁచి యానందపరవశ యయియున్నది.

## పటప్రభావము — భావపరివర్తనము

ఇంతలో నా నవమన్మథుని చిత్రపట మొకసారి తిలకింప, నామె దృఢమనస్సు క్షణములో నవనీతము కాఁగా "ఆహా! సారంగధరా! నా మాట విన్నవైతివి" అని విలపించుచున్నది. ఆ రాకొమారుని యద్భుతసౌందర్యమో లేక యా మహాపురుషుని ముఖమాహాత్మ్యమో చెప్పఁజాలము కాని, చిత్రపటము వైపు చూచినపు డెల్ల చిత్రాంగి మనస్సు నీరయి, యామెహృదయమందు ప్రేమ పొరలుచుండుటయు నాతని చేరి పాదపద్మములపైఁ బడునంతటి భక్తిప్రేమలు కలుగుటయు వింతగా నున్నది. ఇదివఱలో నొకసారి చిత్రాంగి హృదయము తామరాకులోని నీటివలె తల్లడిల్లు సమయమున, చిత్రపటమువంకఁ జూడ నామె హృదయ మెట్లుండెను?

> "అయ్యో! నే నెట్లు సహింతును? ఈ జగన్మోహనరూపము నా మనఃపీఠమున నెలకొనియున్నది గదా. ఏమి యీ రూపవైభవము!"

ఛాయాపటమందే యిట్టి వింతశక్తి యున్నపు డా నిష్కళంకుని నిజముఖావలోకన మెంత హృదయరంజకముగా నుండెనో గదా!

## పశ్చాత్తాపము

ఈ క్షణము మొదలు చిత్రాంగి పడిన మనోవేదనమును పశ్చాత్తాపమును వర్ణింప నెవ్వరి శక్యము? ఆమె యాత్మగతమును వ్రాయుట మంచిది.

> "అకటా! నే నెంత కార్యము చేసితిని! ఎట్టి నిరప

రాధిని నేలపా లగునట్లు చేసితిని? ............రాజు పుత్రవియోగమున నొక్క నిమిషమైన బ్రదుకఁడు. పతివ్రతాతిలకము నా సవతి రత్నాంగిదేవిని వధింపఁ బాల్పడితిని.

అంగజుభారి కోర్వక మహాఘము నూరక మోపి నిష్కళంక పంకజ దెగించినట్టి ఘనపాప మదెంతని యెంతు సత్కృపా రంగదపాంగదృష్టి నపరాధముఁ ద్రోచి క్షమింపరావె సా రంగధరా మహోజ్జ్వలకురంగధరానన! మారసుందరా! అయ్యో! రాజున కేకపుత్రుఁడే! —నన్నుఁ బోలు సుంద రాంగి యొంటిపాటున పైఁబడినను జలింపని జితేంద్రి యుఁడే.............ఏకపత్నీ స్థిరవ్రతుఁడే! — మహాను భావుఁడే! అక్కటకటా! ఏటు చేసితిని! లేని నేరము మోపితినే! కట్టా! ఎందుఁ బోదును? మా సారంగధరుని నెవరు బ్రతికించువారు? నా వేదన మెవ్వరు దీర్చువారు? రత్నాంగిదేవి హృదయశల్యము నెవరు పుచ్చువారు? మా రాజగాజు నెవరు బ్రతికించువారు? దైవమా! ఘోర పాపమా! — దుర్వేదనమా! — సారంగధరా! చిత్రాంగీ! — (మూర్ఛిల్లును.)"

మనఃపరితాపము హెచ్చ, మూర్ఛిల్లినది కాని, వెంటనే యామె "సారంగధరా! ఒక ముద్దిమ్మా!" అని కలువరించుచున్నది. ఈ యాత్మగతమునం దామె నిజస్వరూపమును స్పష్టముగా చూడ వచ్చును. దీనిని చదివి చూడ, చిత్రాంగిం జూచి జాలిపడనివా రుండరు. శక్యము. కాని మన్మథప్రేమకు లోనయి ఈ యువతి యెంత ఘోరకార్యము సేయనెంచినది. ఇట్టి సుందరాంగి తా వలచినవానిం బరిణయ మాడినచో పరమసుస్వభావగా నుండకపోవుట కించుకయిన నవకాశము కలదా? అట్టి విద్యావతియు గుణవతియు నగు రాకన్నియ యిట్టి మహాపరాధము చేయనెంచినందులకు మాలవిధి కారణ మయియుండ, ఆమెను దూషించి యేమి?

## పునర్దార్జన్యము — ధైర్యసాహసములు

చిత్రాంగిని మనము చూచెడి కడపటి రంగము V-iii. రాజు క్రమముగా నామె దుష్కృతమును దెలిసికొనెను. కాలరుద్రునివలె నామెకడకు పోయి కాలఁ దన్ని మూర్ఛనుండి యామెను లేపఁ జొచ్చెను. సారంగధరుని నిరాదరణమువలనను, తాను చేసిన మహాపాపమువలని భీతిచేతను, ఇది కాక తన ప్రాణకాంతునిఁ జంపించి క్షణమయినను భరింపఁజాల నను చింతచేతను, ఆమె మనస్సునందలి పాటవము క్షీణించినది. మనస్సు కలవరము చెందుటయే కాక, హృదయము చెదిరిపోయెను, ధైర్యము వాసెను. ఇట్టి దుస్థితియందు రాజామెను లేపి క్రూరపు జూపు చూచి ప్రశ్నింపఁదొడఁగెను. ఆమె స్థితి యంతయు గ్రహించి తన యంత్యము మూడిన దని వెత చెందుచున్నను, ప్రాణమందలి యాశచే కపటోపాయములు పన్నుట కారంభించెను. కాని యట్టి సమయమందుఁ గూడ నామెకు మనోనిశ్చలత కల దను మాట మెచ్చఁదగినది. అన్నిటికంటె నొకవిషయము చిత్రమయినది. పట మెట్లు తన పడకపైకి వచ్చె ననియు నానియందు కన్నీరు కురిపించిన మాటయేమనియు రా జడిగినపుడామె ప్రత్యుత్తర మే మని చెప్పవచ్చును. మహాభయకంపితురాలయినను, ధైర్యము వహించి, కపటకృత్యము నభినయించి యా ముదుసలిని మునుపటివలె మోసపుచ్చఁదలఁచి, ప్రియహృత్పుటమును

భేదనం జేసి, బోవర్వఁజాలు కటాక్షవీక్షణమును ప్రసరింపఁజేసి, నవ్వి

"ఆహా! తెలిసెను. వెఱ్ఱి రాజా! ఇం తెఱుఁగవా? ఇది యంతయు రత్నాంగి కృత్రిమము. నా దాసిని లోఁజేసికొని నేను నిదురించు కాలమున నా పడుకపై దీని వేయించి వాని పావుర మిం దుంచునట్లు చేసియున్నది కదా!"

అట్టి సమయమం దతని భుజముపై చేయి వైచి యతనిని మోహింపఁజేయ యత్నించుటయే యద్భుతము.

ఉత్తరమునందలి యాదివర్ణములను అంత్యవర్ణములను సంకేతింపఁబడిన రహస్యము రాజునకుఁ దెలిసినపుడు, తనమహాపరాధము నొప్పికొని "ఆహాహా! దైవమా!" అని మూర్ఛిల్లును. ఇంతలో తెలివి రాఁగా, రాజామెను తలవరుల కిమ్మని యుత్తరువుచేయుచు

"ఏ విచారణము లేకయే విమర్శనము లేకయే ..... కత్తులు కటార్లు వేసిన మూఁతతొట్టిలో దీని నుంచి దిమెుక నాలుగైదుమార్లు దొరలించి యెనిమిది దినములకు ప్రాణము పోవునట్లు చేయుము"

చిత్రాంగి "అయ్యో! అయ్యో!—"అని క్రింద పడి తన్నుకొనును. ఆమె మఱియెంతో సేపీ మనోవేదనమును భరింపఁజాలదు కాని మఱుచటి క్షణమందే సారంగధరుని రక్షణసమయము దాఁటిపోయె నని చెప్పిరి. తన కుమారరత్నము గతించిన వార్త వినినంతనే రాజు 'హా కుమారా సారంగధరా' యని మూర్ఛిల్ల, చిత్రాంగియు కృశించి శల్యమయి యుండిన హృదయమునకు తన ప్రాణనాథుఁడు ఖండింపఁబడె నను వార్త వినఁబడిన క్షణమే యామెయు ప్రాణము వాసినది.

దాసి: "అన్నలారా! ఈ దేవి ప్రాణములు పోయినవి.'

చిత్రాంగి యింత హఠాత్తుగా మరణ మొందుట యొక వింతకాదు. ఆ కుసుమకోమలి మన స్సిదివఱకే ఛేదింపఁబడ, నామె ప్రాణములు వాసె నన్న నాశ్చర్య మేమి?

## పాత్రౌచిత్యసమర్థనము

ఇంతటితో చిత్రాంగి చరిత్రము సమాప్త మయినది. ఆమెను గూర్చి యోచించిన విచార మద్భవించును. చిత్రాంగియొక్క ప్రేమ యతిగాఢమయినచో నామెను దూషింపవచ్చునా? విజ్ఞానవతియు సౌందర్యవతియు యువతియు నగు స్త్రీ తా వలచిన మహాపురుషుని కొఱకయి యింత ఘోరపాపమునకు సిద్ధపడెనుగా! ఆమె చేయున దేమున్నది? ఇంతకును జగదీశ్వరుఁ డంత మిక్కుటమగు ప్రేమ ప్రాణులయందు సృజించినపుడు నిరాయుధు లగు మానవులను దూషించి యేమి? కాని "అతి సర్వత్ర వర్జయేత్" అని శాస్త్రకారుఁడు చెప్పెను గాన, ఎవ్వరికయినను సరే యతిప్రేమ కూడ దని యనేకులు వాదించుట చూచితిమి. ప్రేమ యనునది లోకమందలి ప్రాణులకుఁ గల పరస్పరానుబంధము. అట్టి పరస్పరమైత్రి భార్యాభర్తలయందే గాక యితరజీవములయందుఁ గూడ నుద్భవించుట స్వాభావికము. సతీపతులకుఁ గాని, మాతాపుత్రులకుఁ గాని, మిత్రద్వయమునకుఁ గాని గల గాఢానురాగ మిట్టిది యని వర్ణింప నాదిశేషునకయినఁ దరమా? ఆ ప్రేమసుధారస మనుభవింపవలసినదే. ప్రేమ యనునది యెఱుఁగకపోవుటకంటె ప్రేమించి కోల్పోవుటయే మంచి దని చెప్పిన యా మహాకవీశ్వరుని కెంత స్వానుభవమో కదా!

# నాటక ప్రయోగపరీక్ష

శ్రీపాద కామేశ్వరరావు గారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

క. “మంద మెదఁ గోవిదులకు నొద
వదనుక కా గనఁ బ్రయోగపున్నిపుణత...”—శాకుంతలము.

ప్రస్తుతము నాటకము చూడనివారును, అందలి మంచి చెడ్డలఁ గూర్చి యభిప్రాయము నీయనివారును తఱుచుగా గానఁబడరు. కాని యట్టియభిప్రాయములయందు ఏకీభావము కానరాదు. ఒకరే యంశము బాగున్నదని యూహింతురో అది మరి కొందఱకు రుచింపదు. ఇట్లగుటకు హేతు వేమి యని మన మాలోచించినచో స్పష్టపడు నంశ మెద్ది యన, అభిప్రాయములనిచ్చెడువారు తద్విషయమై దీర్ఘాలోచన సేయక అప్పటికి తోఁచిన రీతిని సిద్ధాంతము చేయుటయే. అనఁగా ఇట్టి యభిప్రాయములకు కారణము “నాకు తోఁచినది” అను మాత్రమే కాని వేఱొకటి కాదు. ఏవిషయ మెటు లుండవలసినదియు ఆదర్శరూపముగా నిర్ధారితము కానందున “జిహ్వా కొక రుచి” అను న్యాయము ప్రజ్వలించినది.

నాటకప్రయోగ మెట్టిదిగా నుండవలయు నను విషయమును గూర్చి యాలోచింపఁగా నాకు స్ఫురించిన యభిప్రాయముల నీ క్రింద పొందుపఱచెదను.

ఇట్టి ప్రయోగమున ముఖ్యాంగములు

1. తెఱలు, సీనులు, దుస్తులు, మిగిలిన యేర్పాటులు.
2. అభినయము, పాత్రముల రీతి.
3. వాచకము. (గద్య పద్యములను ఉచ్చరించు రీతి.)
4. సంగీతము. (పద్యములను చదువునప్పుడును పాటలను పాడునపుడును దీని నుపయోగింతురు.)

మొదటి యంగమును మనవారు రంగప్రసాధన యని వాడిరి. ప్రస్తుతము నాటకసమాజములవారు వీని విషయమై విశేషధనము వ్యయము చేయుచున్నారు. “నాటకము బూటకము” అను మాట వీరు మఱచిన ట్లున్నది. విలువగల దుస్తులు తెరలు మొదలగువానికి పెట్టిన సొమ్ము గోడకు పెట్టిన సున్నము. కొంతవఱకు విడంబన మావశ్యకము. “వెల సులభము, ఫల మధికము” అను న్యాయమాశ్రయింపవలయు. ఈ విషయమున మనవారు జాగరూకులై ధనవ్యయము తగ్గించుట అత్యావశ్యకము. ఇంత సొమ్ము కర్చుచేసినను మన నాటకములయందు వచ్చెడు పాత్రముల కుచిత మగు వేషముల సమకూర్చుట యెక్కడనో కాని సాధారణముగా కాన్పింపదు. ప్రతి ప్రదర్శకుఁడు ను వీలు గలిగినప్పు డెల్ల “రత్నస్థగితదుకూలము”లకై పీఁకులాడునే కాని వేషమున యాథార్థ్యమలవడుటకై పాటుపడఁడు. వృద్ధులు, యువకులు, బంట్రౌతులు మొదలగు వేషములను జాగరూకతతో తయారుచేయరు.

ఇఁక సీనులు. ఇందు కూడ వివేచన మంతగా నుపయోగింపరు. మామటకు మిణుమిట్లు గొలుపుచుండును గాని ఇతరవిషయముల నర్హత యుండదు. చూచువారు పైమెఱుఁగులచే మోసపోక, యేయే రంగముల కెట్టి తెర లుండవలయునో, తక్కిన యేర్పాటు లెట్లుండవలెనో ఆలోచించి పరిశీలన చేయుట యుక్తము. ఒకానొక నాటకప్రదర్శనమున “శ్మశానవాటిక” రంగమై యుండెను. తెఱ యెత్తినతోడనే రెండు కుర్చీలు కాన్పించెను. ఇవి ముందటి రంగమున నర్హములు; ప్రస్తుతము అసంబద్ధములు కావా? కొన్ని విషయములను ప్రయోగించుట కష్టము. వానిని గూర్చి విమర్శకుఁడు జాగరూకుఁడై యుండవలయు. “పాడుచేయుటకంటె మానివేయుట మంచిది” అను న్యాయ మనుసరింపవలయు.

దుస్తులు కాక తదితరోపకరణములు కూడ నర్హములయి యుండవలయు. యుద్ధమున కవచము శిరస్త్రాణము, ధనుర్బాణములు, తూణీరము, కత్తులు, బల్లెములు మొదలగునవి యుపయోగింపఁబడవలయు. వీని నర్హరీతిని ధరించి యుపయోగింపనిచో రంగప్రసాధన మర్హము కాదు. ఈ విషయమున మనవారు చాలవఱకు ఔదాసీన్యము వహించుచున్నారు. అది దిద్దుకొనవలయు.

అభినయము నాటకప్రయోగమందలి ముఖ్యాంగము. వేషభాష లెంత బాగుండినను, అభినయము అర్హముగా నుండనిచో ప్రదర్శకుఁడు నింద్యార్హుఁడు. ఈ విషయమున నభిప్రాయభేదము చాలవఱకు కలదు. సాధారణముగా మేజువాణీలయందు భోగమువాండ్రు ప్రదర్శించునది యొకరీతి యభినయము. ఇది శాస్త్రబద్ధము. ఇందు హస్తవిశేషములు కలవు. ఒక్కొక్క విషయము ననేకవిధముల సూచింపవలయు. కృష్ణుని ప్రశంస వచ్చునపుడు దశావతారములును, ఈశ్వరుని యర్చన వచ్చునపుడు మహాలింగార్చనయు సూచింపఁబడును. ఒక్కొక్క పదము, వర్ణము, జావళీ పాడునపుడును, అభినయించునపుడును హస్తములును, ముఖమునందలి యవయవములును పలుమార్పులఁ జెందును. ఇందు ప్రతిపదమునకును నియమితములగు అభినయమార్గములు పెక్కు లుండును. అట్టిది సూక్ష్మాభినయ మనియు, ప్రదర్శకునియం దిట్టిది యుండఁగూడ దనియు నా యభిప్రాయము. వానియం దుండవలయునది స్థూలాభినయము. కరచరణాదివ్యవస్థ యీ పద్ధతిమాత్రముగా రసోచితముగ మాఱుచుండవలయు. ప్రతివిషయమును హస్తముతో భోగమువారిపోలికని ప్రదర్శింపనక్కఱలేదు. అట్లు సేయఁగూడదు. ఉదాహరణము:

శా. “ఔరా పెన్నెరి వేణి చంద మతశే యా మోమునందంబు మ
ర్ఘూ రే కన్గవసోయగంబు......”

ఈ పద్యము చదువునప్పుడు జడ మోము కన్నులు మొదలగునని చూపింపఁగూడదు. కేవలముఖవికాసముచేతను దృష్టిపాతముచేతనే యూహింపఁజేయవలయుఁ గాని వర్ణింపఁదలఁచిన యంగముల నన్నిటిని చూపించుట నాగరకప్రవృత్తి కాదు. వాఁడు నన్నిట కేల పంపె? అను వాక్యము చెప్పవలసినప్పుడు హస్తచలనముచే ప్రతిమాటను సూచింపనెంచుట మూకప్రదర్శనమున చెల్లునేమో కాని, సాధారణముగా మన రంగస్థలములయం దిట్టి పదాభినయము అయుక్తము; ప్రేక్షకు లించుక బుద్ధిమంతులును మాట నేర్చినవారే గాని మూగవారు కారు. అట్టియెడ సూక్ష్మాభినయ మసంగతము.

రంగస్థలము చేరునది మొదలు విడుచువఱకు తత్తదవస్థనగు అభినయము ప్రతి ప్రదర్శకునియందును కానఁబడుచుండవలయును. చాలమంది తమవంతు వచ్చునప్పుడు కొలఁదిగనో గొప్పగనో అభినయము కనఁబఱచెదరు కాని తమవంతు తీరి యితరప్రదర్శకులు చెప్పునపుడును అభినయించునపుడును కనఁబఱుపరు. ఈ విషయము వారికి తెలియ దని నా యభిప్రాయము. ఇందువలన నా ప్రదర్శకుఁడు తాను నిర్జీవప్రతిమ యగుచున్నాఁ డని భావింపఁడు కాఁబోలు. వీనిని చూచిన చూపఱు లేమనుకొందురు? ఒక ప్రదర్శకుఁడు చూపఱుల కర్థాభినయము చూపించునెడ నీ ప్రతిమ యందుల కెంత ప్రతికూలుఁడో యూహింపఁడు కాఁబోలు! మరికొంద ఱిట్టియెడ విపరీతాభినయము చేయుదురు. వీరిని తట్టి వారిని తట్టి ముసిముసినవ్వులు, తల యాడించుటలు, పండ్లు కొఱుకుటలు, హాస్యపుమాటలాడుట మొదలగు చర్యజరపుచుందురు ఇట్టిది కూడ నసంభావ్యము. కావున రంగస్థలము ప్రవేశించునది మొదలు అక్కడ నేమి జరుగుచున్నదో అందులో తనవం తెంతయో యెఱిఁగి తదనుసరణ మొనర్పవలయును.

ఈ విషయమున మన నాటకసంఘములు తగిన రీతిని కృషి చేయుట లేదు. అభినయము నేర్పెడువారిని నియోగింపరు. అన్ని పాత్రములను అర్హరీతిని అభినయించువారు మంచి నేర్పుగలుండవలయును. అట్టివారు దొరకుటయే యరిది. సామాజికులలో నెవ్వరైన 'ఇద మిత్థ' మని చెప్పిన విందురా? ఎంత దుస్సర్వజ్ఞత్వము! అభివృద్ధి చెంద నుత్సహించువారే లేరు. కాలక్రమమున నభినయమం దభివృద్ధి చెందుచుండెడువారు పదిమందిలో నొకరైన నుండ రని నా నిశ్చయము. పక్షపాతబుద్ధి లేక పరీక్షించినచో నిది సిద్ధాంత మనవచ్చును.

రససూచనము మిక్కిలి కఠినము. నేర్పరులు కానిచో రసభేదముల గుర్తింపలేరు. గుర్తింపనివారు ముఖవికాసమున నెట్లు గనుపింతురు? ఒకానొకప్పుడు అనేకరసములు సమ్మేళన మగును. విచారములో నున్నప్పుడు కోపము, కోపమున విచారము, ఆశ్చర్యము, అసహ్యము, నిస్పృహ మొదలగునవి తటస్థించును; వానిని సూచింపనిచో ప్రదర్శకుఁ డర్హుఁ డగునా? కాని, ఏయే పద్యగద్యములయం దేయే రసము లిమిడియున్నవో యెఱుంగువా రెవ్వరు? దీనికి కారణము మున్ముం దెఱుంగనగును. ఒకవేళ ముందు చెప్పఁబోవు గొప్ప లోపమునకు లోనుగాకున్నను, అభినయ మెట్టు లుండవలయునదియు సరిగాఁ దెలియువారు సామాన్యముగా నరుదు. అభినయ మెట్టు లుండవలయునది షేక్స్పియరు మహాకవి హామ్లెట్ అను తన నాటకరాజమందు ప్రచురించియున్నాఁడు. అభివృద్ధిని కోరు ప్రతిప్రదర్శకుఁడును ఆ విధుల జిహ్వాగ్రమునం దుంచుకొనుటయే కాక, వాని నాచరణమునం దుపయోగింపఁదగును.

అభినయమువలెనే ప్రాముఖ్యము నొందఁదగిన మరియొకయంగము వాచకము. ఇప్పటి నాటకములలోని గ్రంథ మంతయుఁ పద్యములు, గద్యములు, గీతములతోఁ గూడియుండును. ఇందు మొదటి రెండును నాటకకర్తలే సమకూర్చెదరు. మూఁడవ భాగము కొన్ని నాటకములయందు గ్రంథకర్తలే రచించిరి, వేఱొక కొన్నిటియందు సంగీతజ్ఞు లెవ్వరో రచించుచున్నారు. ఈ మూఁడింటియందును సాధారణముగా నుండవలసిన లక్షణములు—స్పష్టత, నిర్దుష్టత, అనర్గళధార, యుక్తమగు విరామములు, ఊఁతము. వీనిని గూర్చి విపులముగా వ్రాయుటకు స్థలము చాలదు; కావున సంక్షేపముగా చెప్పెద. అక్షరములను మాటలను మ్రింగివేయకుండ, తప్పుటుచ్చారణ లేకుండ, చెప్పిన మాటయే చెప్పి కాని, ముక్కలు తోఁచక ఆకస్మికముగా నాఁగిపోయి గాని హాస్యాస్పదుఁడు కాక, అర్థమునకును భావమునకును ననుగుణముగా నాఁపుచు, మాటలను ఒత్తవలసినచోటుల నొత్తి, కంఠధ్వని చూపఱ సంఖ్య ననుసరించి బిగ్గఱగాను మెల్లగాను నుంచి, పద్యగ్రంథమును పుస్తకాపేక్ష లేకయే చెప్పువాఁడు యుక్తప్రదర్శకుఁడు. ఇందు ఆఁపెడుచోటులను ఊఁత ముండవలసిన స్థలములను గమనించి పద్యగ్రంథము చెప్పువారు పదిమందిలో నొక రుండుట కష్టము. ఏల యన, ఇట్టి విషయములను సరిగా నెఱుంగుటకు ప్రదర్శకుఁడు మంచి భాషాజ్ఞానము కలవాఁడును వాచకమును శ్రద్ధతో నభ్యసించినవాఁడును కావలయును. ఎక్కుడు కావ్యపరిచితి లేకపోయినను తా మాడెడు నాటకమయినను ఆమూలాగ్రముగా నర్థము చేసికొనుటయే కాదు, అందలి భావములను గూఢాభిప్రాయములను గురుముఖంబున నేర్చుకొనవలయును. ఇప్పటి ప్రదర్శకులలో చాలమంది పాఠశాలలో పాఠములు చదువలేక మానుకొని హాయిగా నుండవచ్చు నని నాటకసమాజములలో చేరినవారు. వారికి "స్వర్గమునకు పోయినను సవతిపో" రనునట్లు ఇక్కడను శిక్షయేనా?

ఇప్పటి నాటకులకు శిక్షయే లేదు. నోరు విప్పిన నూరు తప్పులు; అందుచే విద్యార్థులు విని సహింపఁజాలరు. వాచకమున తప్పు లేకయుండు ప్రదర్శకులు నే నెఱుఁగునంతవఱకు మన యాంధ్రప్రపంచమున ఐదాఱుగురికంటె హెచ్చు లేరు. వీరికి సర్వసాధారణముగా తప్పు రాదు. "ప్రమాదో ధీమతా మపి" అనిరి కదా పెద్దలు. తదితరులు తప్పు లేకుండ నుచ్చరించుట గగనకుసుమము.

పద్యమున పైని చెప్పిన లక్షణములకు తోడు సంగీత ముండును. ఇందు స్ఖాలిత్యములు మెండు. "రంగస్థలమున సంగీత మెట్టి చోటుల నెట్టు లుపయోగింపనగు?" అను విషయము సావధాన

ముగా చర్చింపఁదగిన విషయము. భగవదనుగ్రహ మున్నచో ముందు సంచికయందు ప్రకటించెద. సంగీత మెట్లుపయోగించినను, పద్యము నందలి భావచమత్కృతి పదగుంభన లాలిత్యము మొదలగు లక్షణముల చెడఁగొట్టఁ గూడదు అను సంగతి నిర్వివాదాంశము కదా. ముఖవైఖరి యథాయోగ్యముగా నుండవలయును. కావున నిర్దుష్టమైనవాచకము రసయుక్తమగు అభినయము—ఈ రెండింటికి తన విషయమున కాని పరుని విషయమున కాని ప్రతిబంధకము లేకుండ సంగీత ముండవలయు అను మహావాక్యముయొక్క సార మెఱింగి యాచరణలోనికి తెచ్చుటకై అందఱును ప్రయత్నించిన దినమే ఆంధ్రనాటకచరిత్రయందు సుదినము.

గీతములనుగూర్చి కొంచెము చెప్పెద. మట్లు మన మచ్చ మాఁపు మన్నవి. పార్సీ మట్లు తెచ్చిపెట్టి పెద్ద దీర్ఘములను బెట్టి మాట వినఁబడకుండఁ జేయుచున్నారు. ఇది మిగుల శోచనీయము. మాట చెడిపోకుండ నుచ్చరించుచు పాడఁగూడదా? కేవలము రాగమే కాని మాట వినవలయు నన్న నా ముచ్చట తీరదు కదా!

ఈపైని వ్రాసిన విషయముల నన్నిటిని గ్రహించి యుచితరీతిని ఆచరించువాఁడే ప్రదర్శకుఁడు అని నా యభిప్రాయము, లేనివాఁడు నాటకుఁడు. నే చెప్పినవానిలో నిరాకరింపఁదగిన విషయము లేదు. ఇవి గాక ఆదరణీయ మగు విషయము చదువరు లెవ్వరైనఁ దెలిపినచో కృతజ్ఞతతో గ్రహింతును. నా యభిప్రాయము సర్వజనసమాదరణీయ మని నా యూహ. అట్లు కాకుండిన, భేదము నెఱిఁగింతురుగాక! రంగస్థలముల యభివృద్ధి కోరినవాఁడను కావున, వాని కపకీర్తి తెచ్చుచున్న ప్రదర్శకులకు సన్మార్గము నుపదేశింప నుత్సుకుఁడనై పరుషవాక్యముల వ్రాసియుందును. చదువరులు మన్నింతురు గాక. అట్లు వ్రాయుట వారియం దభిమానము లేక కాదు. రంగస్థలములయం దెక్కు డభిమాన ముండుటచేతనే యని యూహింపనగు.

ప్రకృతము నాటకప్రదర్శనముల విమర్శించువారు లేరు. ఉన్నవా రందఱు తెఱలను దుస్తులను జూచి భ్రమించిరో, సంగీతము విని మోసపోయిరో, వాచక మెట్లుండవలయునో తెలియకరో, ప్రతినాటకమును బాగుగనే యున్న దనియు, ప్రతినాటకుఁడు ప్రదర్శకుఁడు నిపుణుఁడు ననియు నభిప్రాయపడుచున్నారు. ఇట్లు మనవారు సంతోషించునంతవఱకు, మన రంగస్థలములు మన ప్రదర్శకులును అభివృద్ధి నొందరు. విమర్శకుఁడు నదురు బెదురు లేక గుణదోషములను తన బుద్ధికి తోఁచిన రీతిని తెల్పుచుండవలయు. సామాజికులు విమర్శకులు చెప్పినదానియెడ నిరాకరణము చూపక తథ్యమిథ్యావివేచన గలిగి ప్రవర్తింపవలయు. విమర్శకులు వాచకము అభినయము, ఈ రెండు విషయములను, ముఖ్యములుగా నెంచి తదితర విషయములఁ గూర్చి తగిన రీతిని ముచ్చటింపవలయు. ఇట్టి విమర్శనయే కోవిదులు చేయుచుందురు. వారి మనసునకు నచ్చిన ప్రదర్శనమే నాటక మనఁబడును. అందుచేతనే కాళిదాసు

"ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్"

అని రచించె. ఈ వాక్యమున కాంధ్రీకరణమే యీ వ్యాసమునకు మకుటముగా నెన్నితిని.

## సంగీతసుఖము

బసవరాజు అప్పారావు గారు

ప్రబలమౌ మండు వేసవి ప్రకృతిఁ గాల్చి
చెండుచుండఁగ, చల్లని చెట్టునీడ
రమణి యొక్కతె తాంబూలరసముచేత
నరుణమౌ పెదవులు, నల్లనైన మోము
నింత కుంకుమబొట్టును ముంతకొప్పు
గలిగి యొడి నున్న తడికెలగంపమీఁద
దరువు వేయుచు పాడుచు తళుకు బెళుకుఁ
జూపి నా మది నున్నట్టి సొదను బాపె.
సొదను బాపుటలోఁ గల చోద్య మేమి?
సుందరి యొకర్తె సంగీతసుఖసముద్ర
మందు ముక్కాని లేక యానందవాహ
మై, నదిని నీఁదుచుం బాడు నంచయట్లు
లమలమౌ ప్రణయరాగము నాలపింప,
ప్రకృతి పరవశ గాదె? దైవము వినఁడె?

## ప్రేమకారణము

కారణం బేమనందు నో కాంత! నీదు
ముద్దుమోమందమో, లేక మోహపార
వశత నిటు నటు చలియించు వాలుకనుల
యందమో, కెంపుపెదవుల సందునుండి
తొంగి చూచుచు, వెంటనే తొలఁగి లోని
కేగుచును, మోము నీమపై నిచట నచట
మెఱపు మెఱపించు మవ్వంపు చిఱునగవుల
చందమో, లేక ముంగురులంద మౌనో?
ప్రేమకున్ గల్గు కారణం బేమనఁగల?
మింతిరో, నిన్నుఁ జూడ ప్రేమించుచుంటె సుమి—
ఇంతియే గాని వేర్వేఱ యెంచి చూచి
అందపుందళుక్కులను ప్రేమ నందఁగలనె?
తెలియు మాత్మను ఆత్మను కలిపి కట్టు
దారమే నాదు ప్రేమకు కారణమ్ము.

# నాట్యరంగము

దువ్వూరి జగన్నాథశర్మ గారు

శాంతస్థితి నలరారెడు ప్రతిదేశమునందును నాట్యరంగము లెల్ల కాలమునుండియు వర్ధమానము లగుచున్నవి. మౌఢ్యదేవతాశ్రయ మయి కాని, క్రోధకారణములచేత వివాదాగ్నులు రగిలి కాని, విద్వరోదర్కము సంభావింపఁబడునప్పుడే తక్క నాట్యరంగము లల్పసంఖ్యాకము లగుటకుఁ బ్రాయిక మయిన కారణ మొండు లేదు. ఇతరవిధము లగు కారణము లెవ్వియేని కలిగినను, అవి బలవత్తరములు గాక బుద్ధిమంతులచేత నివారింపఁబడఁదగినవి యగుట, నాట్యరంగములకు మొత్తముమీఁద ప్రాచీనకాలమునుండియు భారతభూమిని వృద్ధియే చేకూడినది వీని వృద్ధికి ఒకే మార్గము కాదు. రాజకీయవిద్వరము లుదయించినప్పు డయినను, వీరరసోద్దీపనములుగా భేరీ పటహ ఝుంఝా దుందుభి డిండిమ శంఖ కాహళాది గంభీర నిస్వనములు శాంతవ్యతిరిక్తము లయి, విస్తృతప్రతిభతో మ్రోయుచున్నవి. ఈ యర్థమును సంభావించితిమేని భరతవిద్య మనదేశమున శుభంకర మను భావనతోఁ బ్రాజ్ఞులవలనఁ బూర్వకాలమునుండియు అతివేలమయిన యాదరణమును బడయుచు వచ్చినట్లు నిర్ణయింపఁగలము. లోకోత్తరనాయకాశ్రయముచేత నుత్తమరసములందలి ప్రధానరసములలో నొకటియైన వీరము భేరీపటహాదులచేత నుద్దీపిత మగుచుండుటవలన దీని విజయభావమును విశ్వసింపఁగలము గదా! అందువలననే శుభకార్యములయిన వివాహాదులందు దీనికిఁ బ్రాపింపవలసిన ప్రాధాన్యత నిర్వివాద మయినదిగా తేలుచున్నది. దీని కైహికఫలము తాత్కాలికమైన ఖేదాపనయము! ఆనందప్రాప్తి! భవిష్యత్ఫల మేమి యనఁగా జయభావనము. ఇందుల కీ రంగస్థలములందలి సర్వవాద్యములను లక్ష్యస్థానములుగాను, ముఖ్య ప్రయోజనములుగాను యోజింపఁగలము. మొత్తముమీఁద సద్యఃఫలముచేతనైన నేమి స్థిరవిజయముచేతనైన నేమి సులభలబ్ధిచేతనైన నేమి భారతీయుల దృష్టికి ఈ భారతీయముకంటె ప్రియమయినది వేఱొం డెద్దియు లేదు.

తౌర్యత్రికాదిశూన్య మయిన దేశమునకు అందలి మనుజులకు ఏదో విధమున చ్యుతి తప్ప దని భరతుఁడు తెలిపియున్నాఁడు. ఈ భావము శాపముగాఁ గొందఱు తలంచుచున్నారు. ఎట్లయినను ఇది వాస్తవముగానే పరిణామము పొందఁగల దని మా విశ్వాసము. సంగీతము లేని మనుజుఁడు, అట్లు గాదేని సంగీతమునకుఁ గరఁగని మనుజుఁడు, ప్రాణిహింసయు రాజద్రోహము ఇత్యాది మహాదుష్కృతముల నొనర్పఁజాలఁ డని ఆంగ్లేయమహాకవి షేక్స్పియరు వ్రాసియున్నాఁడు. కావున "గానవిప్రియము" దాని ప్రతిభనుబట్టి యోచించితిమేని కఠినచేతస్కులకే కాని కాదరా దని నిశ్చయించుకొనుచున్నాము. అందఱకును గానమైముఖ్యము కలుగునేని, అట్లందఱు కఠినచేతస్కులే యగుదు రేని దేశమునకు విప్లవము సంభవించుట ఆశ్చర్యము కాదు. దేశమునం దెల్లరును క్రూరులయిననే గాని దేశము తౌర్యత్రికశూన్యము కాఁజాలదు. కావుననే భరతుఁ డట్లు తెలిపినాఁడు.

> సంగీత సాహిత్య రసానభిజ్ఞః
> సాక్షాత్పశుః పుచ్ఛ విషాణ హీనః.

అనఁగా "సంగీతసాహిత్యరసానభిజ్ఞుఁ డయిన రసాభాసుఁడు తోఁకయుఁ గొమ్ములు లేని పశువు" అని యొక రసజ్ఞుఁడు గానము భావము నెఱుఁగలేని అరసికునిఁగూర్చి చెప్పియున్నాఁడు. ఇట్టి సారస్యము జనబాహుళ్యమునం దరుదగుటకు సర్వేశ్వరుని సర్వదా వేఁడుటకుఁగాను మా పాఠకమహాశయులను ప్రార్థించుచున్నాము.

> ఆవహేచ వివాహేచ యజ్ఞే నృపతిమఙ్గలే
> నాన్దీశబ్ద ముపశ్రుత్య హింస్రా నశ్యంతి చైవహి.
> వాద్యం నాట్యం తథా గేయం చిత్రం వాదిత్ర మేవచ
> వేదమంత్రార్థవచనైః సమం హ్యేత ద్భవిష్యతి.

అనఁగా ఆవహ వివాహ యజ్ఞ నృపమంగళాది సర్వ శుభములందును భేరీవాద్యశ్రుతిచేత దోషపరిహారము కలుగుచున్నది. మృదంగ నాట్య గానాభినయాదుల ఫలము వేదమంత్రాదుల ఫలమునకు సదృశ మగుచున్నది— అని భరతుఁడు వచించియున్నాఁడు. ఈ యర్థమునందు మన భారతీయులకు చాల విశ్వాసము కల దనుటకు సందియము ఏమియు లేదు. ఇందులకు వారి యాచరణములే తార్కాణము. ఋజువును బరిశీలింపుఁడు!

1. సర్వత్ర నృపాలసభలం దిప్పటికిని, అరసికునకు లభించిన సింహాసనముల పొంత తప్పనేమో గాని, వైశికోపచార ఢంకాపటహభేరీవాద్యాది శుభలాంఛనములు సదా కన్పట్టుచున్నవి.
2. వర్తనము ననుసరించి పాత్రములకు దుస్థితి సమీపించియున్న యీనాఁడు కూడ మన నాఁటనున్న మఠమందిరములు, భద్రపీఠములు, దేవాలయములు, పాశ్చాత్యుల మతమందిరాదులందుకంటె మిన్నగా నంత ధనికములు గాకున్నను, నృత్తగీతాదుల నాహ్వానించుచున్నవి.
3. నీతివిదులు పాత్రముల యవగుణప్రాబల్యము నెంతగా దూషించుచున్నను, మన వైవాహికాదిశుభకార్యములు నృత్యగీతాదుల నాహ్వానించుట మానలేదు.

ఇఁక నాటకరాజములందు మనవారల కున్న ప్రీతి అనిర్వచనీయ మైనదియే కదా! ఇట్టి యాదరణమున కంతటికిని మూలకారణ మే మందుము? బాగుగా యోచించి, తౌర్యత్రికమునం దున్న సహజ

సమ్మోహనశక్తిని మనసా భావించి, శుభోదయమును గూర్చిన సమ్మిక యని వక్కాణించుచున్నాము. ఇంతకంటె వేఱు కారణమును మేము ఊహింపఁజాలము.

దుర్మదాంధకారమునఁబడి కన్నుమిన్నుఁ గానక స్వశుభాప్తిని గోరు దారియైనఁ దెలియక దుర్ణయప్రవర్తనమును వీడక మా భాగవతులు, మా వాద్యప్రియులు, మా గాయకులు, మా రంగప్రవర్తకులు, మా శిక్షకులు, మా శిక్షితులు, మా ప్రేక్షకులు, మా సర్వపరివారమును గూడ ఎంత చెడి పెడదారులు ద్రొక్కుచున్నను, ప్రాచీనమయిన యీ భరతశాస్త్రమందు మన భారతీయుల విశ్వాసము మాత్రము శుభోదయమునకు వ్యతిరేకభావముతో మరలలేదు. ఇది యొక కారణముచేత ప్రస్తుతము మేలే చేకూర్పఁగలుగు నని భావించుచున్నాము. ఏ మందురేని, ఈ విశ్వాసము మా భారతీయకార్యములకు బీజభూతము, కావున సమీపవర్తి. అట్లు గనుక ప్రధానబంధము కాఁబట్టి యెన్ని నేరము లయినను మమ్ములను కృపాదృష్టితో వీక్షించుటకే మా భారతీయుల నిప్పుడు శరణము వేఁడుచున్నాము. మా దుర్ణయదేవత మమ్ములను వీడకున్నందున మా ప్రదర్శనములను సమీపింపరా దని కొందఱు వీరవరులు చేసిన మంతనము మాయెడలను ఈ దేశమునెడలను మీ యెడలను కూడ ప్రయోజనకారి కాఁజాల దని ప్రాజ్ఞులు ఎవ్వరు విశ్వసింపరు? దైవానుగ్రహముచేత సర్వ శుభములకు నాలవాలమగుచున్న యీ నూత్నకాలము అన్నిటితో పాటు భరతవిద్యను గూర్చి కూడ శుభవీక్షణమున నలరఁగలదేని నిశ్చితార్థప్రాప్తిని సమీపించు నాసతో నున్నారము.

ఇఁకఁ బ్రధానవిషయమును గూర్చి ముచ్చటింతము. మన ప్రధానవిషయము నాట్యరంగము. భారతీయపరిభాషలో సంగీతము, భరతము, నాట్యము అను శబ్దము లొకే ప్రయోజనము వ భిన్నార్థకము లయ్యు వాడఁబడుచున్నవి. విద్యమానస్థితి కనుకూలించునట్లు సంగీత మనఁగా స్వరరాగగీతవాద్యముల చేరిక యని చెప్పి, గానసభలయందలిదానిని సంగీత మని వాడుటకు మేము ప్రీతిపడుచున్నాము. నాట్య మనఁగా నృత్తనృత్యనాటకరంగములకు సంబంధించిన విషయములుగా భావించుచున్నాము. భరత మనఁగా భావరాగతాళములు గావున, తౌర్యత్రిక మనఁదగి, సంగీతనాట్యములకుఁ జెప్పఁదగిన యావద్విషయములు నిందు చేరు నను నిశ్చయముతో నొకవంక సంగీత మని గాయకలోకమును, ఒకవంక నాట్య మని ప్రదర్శకలోకమును సందర్శించుచున్నాము. మా నాట్యశబ్దనివృత్తివలన వీణా పుష్కరాది సర్వవాద్యములును, సంస్కృతాంధ్రాది సర్వభాషలును శృంగారవీరాది రసములును, భారతీకైశిక్యాది వృత్తులును, నర్మోపాలంభాది అలంకారికోక్తులును, స్త్రీపురుష నృపామాత్య భిక్షుక పరివ్రాజక సేనాధికార విప్ర శూద్ర భృత్యాచార్య కిరాతాది సర్వజనుల కయ్యెడి వేషభాషణములును, సర్వస్వభావములును, ఏకోనపంచాశద్భావంబులును నాట్యరంగమునే దరియుచున్నట్లు తెలియఁగలదు. ఇట్టి వీని ప్రయోజనము చాలఁ గలదు. సర్వశాబల్యమునకును ప్రధానమైన తానక సమకూటవలన నీ రంగములవలన దేశమునకు మహోపకృతి కాలానుగుణ్యముగాను జనానుకూలముగాను సిద్ధింపఁగల దని ప్రాజ్ఞు లెల్లరు నెల్లకాలమునుండియు నమ్ముచున్నారు.

౧. నాటకరంగము——ఇది ఎల్లరును తెలుచుగా చూచుచున్నదియే! దీనిని గూర్చి కొంతకాలమునుండి యభినవ మయిన సంస్కరణమును వృద్ధిని కోరుచు చాల ఆసక్తితోఁ బండితపామరులు పాటుపడుచున్నారు. ఆంధ్రదేశమున బళ్లారి, చెన్నపురి, బందరు, రాజమహేంద్రవరము, కాకినాడ మున్నగు చోట్ల నాటకసంఘములు స్థాపించి సుస్థితిని సమీపింపఁజూచుచున్నారు. ప్రదర్శనము జీవనముగాఁ గల సురభినాటకసంఘాదులందలి స్త్రీ పురుష పాత్రములకు తగు శిక్షణము లేనందునను, పండితులచే విలాసమాత్రముగా స్థాపింపఁబడిన యితరసంఘములందు నటీనటాదినియమక్రమములు లేకపోవుటవలనను, రంగస్థలాధికారమున కర్హము గానివారు ధనవంతు లయిన కారణముననో దాంభికప్రసిద్ధిచేతనో రంగస్థలమునందు ప్రవేశించి పెత్తనము వహించి కథ నడపుటకుఁ దొడరుటచేతను, ఇటువంటి కారణములచేత రంగప్రవేశకాదినియమక్రమము సరిపడక సాముదాయికముగా రూపకములు ఔచిత్యము నెనయుట దుర్ఘట మగుచున్నది. కొన్ని లోపములు రచనమునందును గలవు. మన నాటకముల రచనమును గూర్చి యొకతీరుగను ప్రదర్శనములను గూర్చి యొకతీరుగను విమర్శనముల తీరుగఁ గాని వ్యాఖ్యానముల తీరుగఁ గాని గ్రంథములు వెలువడుట ఇంకమీఁద అవశ్యకర్తవ్యము. గతానుగతికముగా నాంధ్రమున నజ్ఞులు కూడ నాటకరచనమునకుఁ బూనియున్నవారు. ఇది పండితులకుఁ గూడ సులభకార్యము కా దని వా రెఱుంగరు. చాలమంది నాటకములను పోలిన నాటకములను పెక్కిటిని రచించిరి. ప్రదర్శనములును ఈతీరుగనే బైలుదేఱుచున్నవి. నాటకవ్యాఖ్యలు వ్రాయఁబడినచో ప్రదర్శకులకు అవి చాల నుపకరించుటయే గాక వారిలోనే చాలమంది రంగాధికారమునకుఁ దగినవారై నటలక్షణములను పొందఁగల రని నమ్ముచున్నాము. నటీనటాధికారమును మనము గోరుదుమేని అందుల కిదియే మార్గము. నటాధికారమునఁ గాని ప్రదర్శనములందలి లోపము లణఁగవు. అప్పుడు గాని బాగుగా ప్రేక్షకాదరణము సమకూఱదు. నాటకాభివృద్ధి కిదియే బీజము.

౨. నృత్యరంగము——ఇది యేకపాత్రప్రవేశమునఁ బ్రారంభింపఁబడి సహాయపాత్రప్రవేశ మయినపిమ్మట అవస్థానుకరణముచేతను నృత్తసహాయముచేతను ప్రధానరసాధికారముచేతను సభ్యాదరణమును బడయుచున్నది. ఇది యుత్తమ రంగలక్షణము. ఈ రంగమే వివాహాదులం దిప్పుడు మేళ మనెడి రూపమును ధరించి అభినయమను పేరిట నసభ్య ప్రదర్శనములకును అవగుణలబ్ధికిని నిలయమైయున్నది. పరిశీలించితిమేని విజయనగరము, కాకినాడ, రాజమహేంద్రవరము, గుంటూరు, చెన్నపురి ఈమున్నగు పట్టణములందును మఱికొన్ని చోట్లను రంగప్రవేశమున కర్హత గల గణిక

లున్నారు. వారికి శిక్షణము లేదు. కొందఱు రంగమండపమున ఔచిత్యము వీడి ఆంగికములయిన అసభ్యభావములను అనుకరణమునకు దూరములయినవానిని ప్రదర్శించుటచేత మే మొకొకప్పుడు నిర్విణ్ణుల మగుచున్నాము. మా నిర్వేదము నెడఁబాయుటకు సాధన సంపత్తి లేదు. కీర్తిశేషు లయిన పండిత దాసు శ్రీరాములుగారి శిక్షణముచేతను కీర్తిశేషుఁ డయిన సింగరయ్య శిక్షణముచేతను ఏలూరి గణికలకు కొందఱకు ప్రదర్శనమార్గము తెలిసినది. అయినను చెప్పెడి దేమి? వృత్తిధర్మముచేతను అవగుణబాహుళ్యముచేతను గణికలందు జవరాండ్రమేళము మధుకరకులసంవృతమైన తేనెపట్టువలెను, మాణిక్యభూషణప్రశస్తిచేత నలరారెడి శిరోభాగములు గల పన్నగసమూహమువలెను నీతివిదులచే భావింపఁబడుచుండుటవలన, నృత్యరంగముల ప్రేక్షకాధికారము పండితకోటియందు చెడి సామాన్యజనులకు మాత్రమే లభ్య మగుచున్నది. జవరాలి చెక్కు గీటుటయందలి సారస్యము విలాస మెఱుఁగని బాలకుని కబ్బినను, ఏమి ప్రయోజనము? అట్లబ్బుట నెవరు మెచ్చెదరు? విప్రలబ్ధా విరహోత్కంఠి తాది శృంగారనాయికల విప్రయోగావస్థానుకరణము ప్రేక్షించుటకు సామాన్యజనులకా రసాధినాథుఁడు వీక్షణములు ప్రసాదించియున్నవాఁడు? కాఁబట్టి ప్రదర్శకుల యవగుణప్రాబల్యముచేత అనర్హప్రేక్షకలబ్ధియు నృత్యరంగవినాశమును సందర్శింపఁగలిగితి మని విన్నవించుచున్నాము. ఈ యంతకును ప్రదర్శకాధ్యక్షునిర్ణయము లేకపోవుట కారణము కావచ్చును.

3. నృత్తరంగము—ఇప్పుడు నాటక నృత్యరంగములకంటె నృత్తరంగములసంఖ్య బొత్తుగా క్షీణించినది. ఈనృత్తరంగాధికారము దేవాలయములందు దేవదాసినులది. ఆ దేవాలయములు ఆ దేవదాసినులు ఆ యధికారము ఇప్పుడు చెడినవి. కొంత కాలము క్రిందటివఱకు గణికలవలననే నృత్తము అభ్యసింపఁబడుచువచ్చినది. ఈ కాలమున చెన్నపురి, తంజాపురి, బొబ్బిలి ఈ మున్నగు ప్రాంతముల కొలఁదిగా నృత్తజ్ఞు లున్నారు. దేవదాసినుల వృత్తి దేవాలయములలో దేవుని రాఁబడి ననుభవించుచు పవిత్రవృత్తమున నృత్తగీతాదుల నెఱపుటగా ప్రథమమున నేర్పడినది. కాని అది విలోమమయిన కారణమున మొదట దేవుని భార్య లయి ప్రజలకుఁ దల్లులవలె భావింపఁబడిన వీరు నానాఁటికి చ్యుతికిఁ బాల్పడి బజారము నవలంబించిరి. వీరు మొట్టమొదట దేవునిచెంగట పవిత్రజీవన లయియున్నప్పుడు పూజారులను మరగి లక్షితలు కాఁగా నాగివెలుపలకుఁ ద్రోయఁబడి యిట్లయినారు. ఈ సంగతినే మోనియరు విలియము దొరగారు కూడ వ్రాసియున్నారు. ఇట్టి కుల మొకటి పవిత్రమయిన భారతభూమిని బజారమునకై యేర్పఱుపఁబడలేదు. దాసీవృత్తివలనను స్వాతంత్ర్యమువలనను స్త్రీలకు వంధ్యాత్వమో వ్యభిచారమో యేర్పడు నని మన ప్రాజ్ఞులును పాశ్చాత్యవిజ్ఞానులును కూడ ఇప్పు డేకగ్రీవముగ అంగీకరించుచున్నవారు. ఏథీనియను రోమను రాజ్యముల నాశనగతికి, మేష్టరు లెక్కి మేష్టరు గోల్టను అను పాశ్చాత్యవిజ్ఞానులు, స్త్రీల దాసీవృత్తియే స్త్రీల స్వాతంత్ర్యమే కారణ మని నొక్కి వక్కాణించియున్నారు. అట్టిది మొట్టమొదట అనులోమముగా భావింపఁబడినను, స్వాతంత్ర్యముచేత విలోమముగాఁ బరిణమింపఁగల దనుటకు ఏమియును సందియము లేదు. రాజసంస్థానముల దాసీల మని చెప్పుకొను ఇంకొక తెగవారు నృత్తనృత్యముఁ సంబంధము లేకయే పయికారణముచేత వేశ్యల పరిణామము నొందుచున్నవారు.

ఈ ప్రదర్శకులకు చ్యుతి సంఘటించిన పిమ్మట వారితో సంబంధమున కిష్టములేని యుత్తమాచార్యులు విద్య నఱపుటను క్రమముగా మానినారు. ఉత్తములు కార్యమునుండి తొలఁగిననాఁటనుండియు నీ ప్రదర్శనములకు నీ విద్యకు క్షీణగతి సంభవించినది. పవిత్రస్థితికి నృత్తగీతాదు లాలవాల మయియున్న కాలమున దేవదాసినులు, రాజపుత్రికలు, చారణ లను సాంసారికస్త్రీలు బ్రాహ్మణుల యొద్ద నీ విద్య నభ్యసించినట్లు పెక్కు నిదర్శనములు చూపట్టుచున్నవి. ఈ సంగతినే శ్రీమతి ఇందిరాదేవి చౌదురాణీ యను నావె యొకప్పుడు ఒక యాంగ్లేయపత్రికలో వ్రాసియున్నది. నృత్తరంగమున నటి ప్రవేశించి భక్తిబోధకములయిన భావములను వినిపించి వాద్యానుసారముగా నృత్తము నెఱపి అభినయరహితముగా రంగనిష్క్రమణము సేయుట ప్రాచీనాచారము. ఈ యాచార మిప్పుడు లేదు. ఏ మయిన నేమి! నాట్యరంగములందలి వివిధభాగములకు క్షీణగతి వచ్చినది. కళావంతుల ప్రాబల్యము నశించియున్న యీ కాలగతిని గూర్చి విచారించుచు నేను సెలవు గయికొనుచున్నాము.

# చిత్రలేఖనము

పాలపర్తి రామమూర్తి గారు

మన మనోభావములను వ్యక్తీకరించుటకు మార్గములు మూఁడు 1. వాగ్రూపము 2 లేఖనరూపము 3. చిత్రలేఖనరూపము. వాగ్రూపమున వెల్లడించువారు ఉపన్యాసకులు. లేఖనరూపమున తెలుపువారు కవులు. చిత్రలేఖనరూపమున విశదీకరించువారు చిత్రకారులు లేక శిల్పులు. మూఁగివారు లేఖనమువలన తమ యభిప్రాయములను వెల్లడించుచున్నారు. కవులు గ్రంథరచనలచే తమ యుద్దేశమును వ్యక్తపఱచుచున్నారు. చిత్రకారులు పసిబిడ్డలకును విద్యావిహీనులకును సులభముగా తెలియఁగలందులకు సృష్టి నంతను చిత్తరువుల మూలమున విశదీకరించుచున్నారు. మఱియు రథములమీఁదను దేవాలయములమీఁదను, గుడ్డలమీఁదను, కాగితములమీఁదను, భారత భాగవత రామాయణములలోని కథలను చిత్రించి చూపుచున్నారు. కావున అభిప్రాయములను వ్యక్తీకరించుటకు చిత్రలేఖనము కూడ నొక ముఖ్యసాధనము.

తొల్లి యీ చిత్రలేఖనవిద్య మన దేశమున మిగుల ఉన్నతదశయం దుండి యిప్పుడు క్షీణదశకు వచ్చినట్లు చరిత్రమువలనను పురాణగాథలవలనను తెలియవచ్చుచున్నది. అభిజ్ఞానశాకుంతలనాటకములో దుష్యంతుఁడు శకుంతల చిత్రపటమును లిఖించినట్లును, రత్నావళీనాటకములో రత్నావళి వత్సరాజు చిత్రపటమును, ఆమె చెలి యగు సుసంగత ఆ పటమందె రత్నావళీపటమును చిత్రించినట్లును, మురారినాటకములో రావణుఁడు సీతయొక్క పటమును చిత్రించినట్లును లెక్కకు మిక్కుటముగా నిట్టి నిదర్శనములు గానవగును. మఱియు వివాహములయందు వధూవరుల చిత్రపటముల నొకరికొకరు పంపుకొను నాచార మున్నట్లు గ్రంథములవలన తెలియుచున్నది. అదియును గాక రాగిరేకులమీఁద చిత్రవిచిత్రములుగా రేఖలను గీచి నడుమ శక్తిరూపమును లిఖించినట్లును గృహనిర్మాణ విషయికరేఖాకారములు గల గ్రంథము లుండినట్లును, లీలావతి క్షేత్రగణితములో కొన్ని రేఖాకారములను లిఖించినట్లును దృష్టాంతములు గలవు.

చిత్రలేఖనవిద్య బుద్ధుని కాలములో నత్యున్నతదశయం దుండినట్లు ఆకాలమున నిర్మింపఁబడిన దేవాలయములనుబట్టియు స్తూపములనుబట్టియు స్పష్టపడుచున్నది. అప్పటి ఱాతి కట్టడములు, ఱాతి ప్రతిమలు, ఱాతి స్తంభములు, వానిపై మలపఁబడిన జంతుపక్షిజాతములతోఁ గూడిన లతలు, అందమగు నగిషీ పనులు భరతఖండమందలి పెక్కుతావుల నేటికిని చెక్కుచెదరక యున్నవి.

ఎల్లోరా, ఎలిఫెంటా, మహాబలిపురము, అమరావతి మున్నగు క్షేత్రములయందు చిత్రకారులు తమ నైపుణిని దెలుపుచు ఱాతిపై చెక్కిన చిత్రవిచిత్రములగు ఆకారములను, ఒకేకొండను దేవాలయముగాను ఒక్క ఱాతినే రథములు ఏనుఁగులుగాను చెక్కినట్టి నిదర్శనము లిప్పటికిని మనకుఁ గానవచ్చుచున్నవి. ఒకఱాతిమీఁదనే గాక దంతముమీఁదను కొయ్యమీఁదను నగిషీ పనులు చేయుచున్నట్టు లెల్లరకును విదితమే.

తురుష్కుల ప్రభుత్వకాలములో చిత్రలేఖనవిద్య అభివృద్ధిలో నున్నట్టు పెక్కు దృష్టాంతములు గలవు.

అక్బరు చక్రవర్తి ఆస్థానమునందు "దస్వంతు" అను చిత్రకారుఁడు మహాభారతయుద్ధమునాఁటి చక్రవ్యూహమును చిత్రలేఖనమూలమున లిఖించెను. ఈ వ్యూహమునందలి చిత్తరువు లన్నిటిని "ఘులశ" అను చిత్రకారుఁడు రంగులతో చిత్రించెను. ఈ వ్యూహమువట్టి రేఖాకారము గాక ఏనుఁగులు, తురగములు, ఫిరంగిదళము, కాల్బలము మున్నగు యుద్ధపరివారముయొక్క వరుసలతో మిగుల చమత్కారముగా నేర్పాటు చేయఁబడినది.

షాజహాను కాలములో 'హాషిం' అను చిత్రకారుఁడు ఆస్థానమందు కొలువులో నుండి చిత్రవిచిత్రములైన పటములను చిత్రించి చక్రవర్తి నానందింపఁజేసియున్నట్లు తెలియుచున్నది. జహాంగీరు చక్రవర్తి దర్బారు నంతను విద్వతుగా చిత్రించిన పటము బొంబాయిలో రతన్ టాటా గారివద్ద నున్న దఁట. ఆ పటము చిత్రకారుని యొక్క చిత్రలేఖనానైపుణ్యమును వేనోళ్లఁ జాటుచున్నది.

పదునాఱవ శతాబ్దములో "ముకుందు" అను చిత్రకారుఁడు "ధర్మరాజు యమలోకమును దర్శింపఁబోవుట" అను విషయమును ఊహతో వ్రాసెను. ఆ పటము జయపూరులోఁ గలదు. ఇది మిగుల భావానుగుణ్యముగ నున్నది.

1560-వ సం. న అక్బరు కాలములో "మధు" అను చిత్రకారుఁడు రాజపుత్రస్థానమందలి కోటా సంస్థానముయొక్క గవర్నరు అక్బరు చక్రవర్తికి అక్కడి కోటయొక్క తాళపుచెవులను నొప్పఁజెప్పుచున్నట్టు ఒక చిత్రపటమును లిఖించెను. మఱియు అక్బరు రాజపుటానాలోని రణతంబోరు కోటలోఁ జొరఁబడుచున్నట్టు చిత్రించిన చిత్రపటము మిగుల మనోహరముగా నున్నది.

వివిధవిషయములను సూచించుచు వ్రాయఁబడిన చిత్రపటములు మిక్కుటముగా నున్నవి. వీనినిబట్టి తురుష్కుల కాలములోఁ గూడ చిత్రలేఖనవిద్య మంచి దశలో నున్నట్లు స్పష్టపడుచున్నది.

మఱియు పట్టు గుడ్డలమీఁద పలు రంగులతో పురాణగాథలను, శూరుల చిత్రపటములను, రణరంగములను చిత్రించుచున్నట్టు గూడ నిదర్శనములు గలవు.

రంగులతో చిత్రించుటే గాక వస్త్రములను నేయునప్పుడే వివిధరూపములను పురాణములలోని కథలను చిత్రముగా నేయు

నిపుణులు గలరఁట. మరియు కిరీటములమీఁదను, కల్కురాయిల మీఁదను, ఏనుఁగు దంతములమీఁదను, చందనతరువులమీఁదను పులిగోరులమీఁదను, బంగారు వెండి ఆభరణములమీఁదను మంచి నగ్షీ పని చేయువారు అనేకులు గలరు. దీనినిబట్టి యోచింపఁగా పూర్వము చేతిపనిలో మనవారు మంచి నైపుణ్యమును ప్రఖ్యాతిని గడించినట్లు తెలియుచున్నది. ఇప్పటికిని కొన్ని చేతిపనులు అక్కడక్కడ నిలిచియున్నవి గాని పూర్తిగా నశించిపోలేదు.

పూర్వపు మన చిత్రలేఖనమునకును ఇప్పటి పాశ్చాత్య చిత్రలేఖనమునకును భేదము చాలఁ గలదు. మన చిత్రకారులు చిత్రించిన పటములందును, ప్రతిమలందును భావము [హృదయము] సయితము గనఁబడునట్లు విగ్రహమును జిత్రించెడివారు. బుద్ధుని విగ్రహమును జూచిన ప్రతివానికి ఆయనయొక్క బుద్ధత్వము, వైరాగ్యభావము ఆయన విగ్రహమునందు మూర్తీభవించియున్నట్లు గనఁబడును. పాశ్చాత్యచిత్రలేఖనములో నీ భావము గనఁబడుట అరుదు. వారు పైరూపమును మాత్రమే తద్వతుగా నుండునట్లు వ్రాయుటకు యత్నింతురు. కాని భావమును గనఁబఱచుటకు యత్నింపరు. మన చిత్రలేఖనము భావరూప ప్రధానమై యుండును. వారిది రూపప్రధానమై యుండును.

పై విషయములను బట్టి యోచింపఁగా నిప్పటికన్న పూర్వము చిత్రలేఖనవిద్య భరతఖండమున మిగుల ఉన్నతదశయం దుండినట్లు స్పష్టపడుచున్నది. పురుషులే గాక స్త్రీలు సయితము నీ విద్యలో నిపుణులై యుండినట్లు దృష్టాంతములు సెక్కులు గలవు

రాజా రవివర్మ గారు పాశ్చాత్యచిత్రలేఖనమును భారతీయ చిత్రలేఖనమును సమన్వయము చేసి జాతీయభావములతో చిత్రపటములను చిత్రించి ఖ్యాతి గాంచిరి.

గ్రంథములకన్న పటములే పసిబిడ్డలను నాకర్షింపఁగలవు. అక్షరజ్ఞాన ముండినఁ గాని గ్రంథములను జదువుటకు వీ లుండదు. నిరక్షరకుక్షి యైనను, మాటలు రాని పసిబిడ్డయైనను, చిత్రపటములను జూచి కొంత గ్రహింపఁగలఁడు. కావున బాగోగులకు గ్రంథములకన్న చిత్రపటములే ముఖ్యసాధనములు. జాతీయోద్ధరణకు జాతీయ పటములే యుండితీరవలయును. ఎవఁడు జాతీయభావమును జాతీయాచారములను నడవడులను బాగుగా గ్రహించి చిత్రపటములను చిత్రించునో, అతఁడే నిజమైన చిత్రకారుఁడు. అతఁడే నిజమైన దేశభక్తుఁడు, దేశసేవకుఁడు. దేశముయొక్క పూర్వపు ఔన్నత్యము నిలుపువారలు కవులు, చిత్రకారులు. దేశముయొక్క భావిస్థితి వీరిపై నిలిచియుండును. భారతపుత్రులలో రాజా రవివర్మ గారు నిజమైన దేశభక్తు లని చెప్పవచ్చును. భారతభూమి యెల్ల పాశ్చాత్యచిత్రపటములతో నిండి నిబిడీకృతమైనప్పుడు రవివర్మగారు, తమ చిత్రలేఖనాకౌశలముచే స్వజాతీయపటములను చిత్రించి భరతఖండముయొక్క నలుగిశల వెదఁజల్లిరి. రవివర్మగారట్లు చేయనిచో మన జాతీయత్వము అడుగంటియుండెడిది. ఎప్పుడు పరదేశీయపటములు మన గృహములం దలంకరింపఁబడెనో, ఎప్పుడు వారి ప్రతిమలు ఆటబొమ్మలు మన పసిబిడ్డల చిన్నిహస్తములం దుండెనో, ఎప్పుడు వారి పటములు మన దేవాంగణములలోను, శయ్యాగృహములందును దూరెనో అప్పుడే మన జాతీయత నశించినది. మన వేషములు మారినవి. స్వజాతీయధర్మమును వెల్లడించు దుస్తులు తిలకము నామమాత్రావశేషమైనవి. ఒక పురుషులలోనే గాక స్త్రీలలోఁ గూడ మార్పు గలిగెను. మాటలు రాని పసిబిడ్డల హస్తములు సైతము విదేశీయుల ప్రతిమలచే నలంకరింపఁబడుటచే చిన్నతనమునుండి మన బిడ్డలనుస్వజాతీయతనుండి వేఱుపఱచుచున్నా మని తలఁపవలెను. పసిబిడ్డలు మాటలాడఁజాలరు గాని చేత నున్న వస్తువును జూచి గ్రహింపఁగలరు. బొమ్మయొక్క రంగు నందమును జూచి యానందింపఁగలరు. మన కంటికి అనుక్షణము గనఁబడు తల్లిదండ్రుల, అన్నదమ్ముల, అక్కచెల్లెండ్రయొక్క రూపరేఖావిలాసములు వేఱు; తన చేత నున్న ప్రతిమయొక్క రూపము వేఱు. ఒక్కొక్కప్పుడు అట్టివిజాతీయవిగ్రహములు పసిబిడ్డల నానందింపఁజేయుటకు మాఱుగ భీతిల్లఁజేయును. మనము మన బిడ్డలకు పసితనమునుండి విదేశీయరూపపటములతో మైత్రిని గలిగించుచున్నాము. ఎప్పుడు మన దేహముయొక్క ఛాయ మన కుఱుల రంగు మన చేష్టలు మనము ధరించు దుస్తులు మున్నగునవి మన బిడ్డల హస్తమందలి బొమ్మలలోఁ గానఁబడవో, అప్పుడే మన బిడ్డలను మన జాతీయతనుండి వేఱుచేయుచున్నా మని తలంపవలెను. ఒక్క జాతీయతయె గాక, ప్రాచీన భారతమహిమ యంతయు నధోగతి పాలయ్యె నని రూఢిగఁ బల్కవచ్చును. మన జాతీయతను దెల్పు మన భారతవీరాగ్రేసరులయొక్కయు, మన ఋషిసత్తములయొక్కయు, వా రొనర్చిన యజ్ఞయాగాదులయొక్కయు, యోగిపుంగవులయొక్కయు, పురాణపురుషులయొక్కయు, ప్రఖ్యాతి గాంచిన యువతీతిలకములయొక్కయు ప్రతిమలు, పటములు నాశన మొందిన వనియే తలంపవచ్చును.

కాని, విజాతీయచిత్రపట ప్రవాహము భారతభూమి నంతయు నావరించుకొనుచున్నప్పుడు రవివర్మగారు తన చిత్రపటములను సేతువువలె నడ్డుపెట్టి భారతజాతీయతను గాపాడెను. భారత భాగవత రామాయణాది సకల ప్రాచీనగ్రంథములందలి విషయములను చిత్రపటరూపమున చిత్రించి శాశ్వతకీర్తి వడసెను.

చిత్రలేఖనవిద్యను గుఱించి పూర్వులు వ్రాసిన గ్రంథము లంతగా నగపడుట లేదు. ఈ విద్య నశించుటకు హేతువు మనము దీనికి తగిన ప్రముఖత్వము నియ్యకుండుటయే యని తోఁచుచున్నది. ఈ కాలములోఁ జదువే జీవనోపాధి కనుకూలమగు విద్య యనియు, నదియే గౌరవపాత్ర మయిన దనియుఁ దలఁచి ప్రతివారును దానినే యభ్యసించుచున్నారు. ఇప్పుడిప్పుడు మనవారు చిత్రలేఖనము గూడ చదువునకు సహాయకారి యని గ్రహించుచున్నారు. ఈ విద్య పూర్వము నామమాత్రముగాఁ గొన్ని యున్నతపాఠశాలలలో నుండుచువచ్చెను. ఇప్పుడిప్పుడు దీనివలన బాలురకుఁ గలుగు నైపుణ్యమును, ఇది విద్యకుఁ దోడ్పడునట్టి తోడ్పాటును, బాలుని హస్తమునకును నేత్రమునకును గలిగించునట్టి యమోఘమైన చుఱుకుఁదన

మును విద్యార్థులు గ్రహించి, విద్యలలో నెల్ల నిది కూడ నుత్కృష్టమైన దని యెంచి ప్రతిపాఠశాలలోను నిర్బంధపాఠములలో నొకటిగఁ జేసియున్నారు.

పరిపూర్ణమైన జ్ఞానవంతుఁ డనిపించుకొనుట కీ విద్య సహితము నేర్చి యుండవలె నని కొందఱాంగ్లేయప్రముఖులు నుడివియున్నారు. మన సమస్తావయవములును వానివాని శక్తులలో పరిపూర్ణమైనవిగాఁ జేయుటయే విద్య గాని యేదో యొక యవయవమును వృద్ధినొందించునది పూర్ణమైన విద్య యనిపించుకొనదు. జ్ఞానసంబంధమైన విద్య మనస్సు నొకదానినినే వృద్ధినొందించును. వ్యాయామ విద్య శరీరావయవములను మాత్రమే బలపఱచును. చిత్రలేఖనవిద్య మనోనేత్రహస్తములయొక్క శక్తులను వృద్ధి నొందించును. ఎటు లనఁగా, ఒక వస్తువును వీక్షింపఁగనే దాని నిర్మాణము, పరస్పరసంబంధము, ఉనికి, రంగు మొదలగువాని విషయమై యోచింపు మని నేత్రము మనస్సునకుఁ దెలుపును. ఈ రెండు అవయవములు చేరి తమ శక్తులను బూర్తిగా నుపయోగించి యా వస్తువుయొక్క ప్రతిమను మనఃఫలకముపైఁ జిత్రించును. అట్లు చిత్రించినదానిని హస్తసహాయమున మనకు గోచరమగునట్లు చేయును. నేత్రము వీక్షింపనిది మనస్సు యోచింపఁజాలదు. అటులు యోచన లేనిదానిని హస్తము లిఖింప నేరదు. కాన చిత్రలేఖనమందు పై మూఁడు అవయవము లొకదాని కొకటి యనుకూలించియున్నవి. ఈ మూఁడు శక్తులకు మూఁడు నామములు గలవు. కన్నులతోఁ జూచుటను పరిశీలనాశక్తి యనియు, మనస్సుతో నాలోచించుటను యోచనాశక్తి యనియు హస్తముతో వ్రాయుటను హస్తనైపుణీశక్తి యనియు చెప్పుదురు.

గ్రంథావలోకనమువలన నేత్రమున కొకే విధమగు అక్షరములను గుర్తించు శక్తి మాత్రము గలుగుచున్నది. అందు నేత్రముయొక్క తక్కిన శక్తు లన్నియు నడఁగంటిపోవుచున్నవి. నేత్రములో ననేక శక్తు లిమిడియున్నవి. ఒకనిని కొన్ని సంవత్సరములక్రిందట నెక్కడనో చూచితి మనుకొనుఁడు. తిరిగి యాతని విషయమై జ్ఞాపకము వచ్చినప్పుడు గాని లేక అతఁడు తిరిగి మన కగపడినప్పుడు గాని గుర్తింపఁగలుగుచున్నాము. అది యెందువలన? అతని రూపపటము మన కన్నులలో చూచినప్పటినుండి యిమిడియుండుటను బట్టియే గదా! ఫోటోగ్రాఫు యంత్రము తనయెదుట నున్న వందలకొలఁది జనమును చిన్ని అద్దములోని కిముడ్చుకొనురీతిగా, కన్ను చిన్నదైనను దానిలో భూమ్యాకాశములను నిముడ్చుకొను శక్తి గలదు. మనము చూచు ప్రతిదానిని కన్ను తనలోని కాకర్షించుకొనుచున్నది. ఇట్టి శక్తిని మనకు సర్వేశ్వరుఁ డనుగ్రహించియున్నాఁడు. అట్టి శక్తిని వృద్ధినొందింపక నాశము చేయవచ్చునా?

అటులే మనస్సునకును అద్భుతశక్తి గలదు. దానికి యోచనాశక్తి యందురు. యోచనాశక్తివల్ల జలరాశిపై నోడల సహాయమునఁ బ్రయాణము చేయుచున్నారు. పులుగులవలె విమానములలో నెక్కి నింగిని సంచరించుచున్నారు. వాయువేగమున భూమిపై ధూమశకటములను నడపించుచున్నారు. ఇట్టి యద్భుతము లన్నియు యోచనాశక్తియొక్క ఫలితములే గదా!

అటులే హస్తమునకును నద్భుతశక్తి గలదు. లోకములో దైవనిర్మితములు గాక మిగిలిన వన్నియును హస్తమువల్లనే గదా నిర్మింపఁబడుచున్నవి. మనోహరమైన చిత్రపటములును దివ్యసౌధములును ముద్దులు మూటగట్టు చిత్రములైన పింగాణిబొమ్మలును గిన్నెలు మొదలగునవి యన్నియు హస్తమువల్లనే గదా చేయఁబడుచున్నవి. మఱియు నిది చదువునకెట్లు సహాయకారియనఁగా, ఒకఁడు తాను మోయలేని బరువును యంత్ర (బండి) సహాయమున మోయ శక్తివంతుఁ డైనట్లు, బాలుఁ డెంత చదివినను గ్రహింపలేనిదానిని చిత్రలేఖనరూపమున సులువుగా గ్రహింపఁగలుగుచున్నాఁడు. అందులకు నిదర్శనము:

రామాయణకథను బాలురకు రెండు మూఁడు దినములు చెప్పినను వారికి దానిని తిరిగి చెప్ప సామర్థ్య మంతగా నుండదు. దానినే యొకనాఁటి రాత్రి తోలుబొమ్మల మూలమున ప్రదర్శించినచో సులభముగా గ్రహింతురు. తిరిగి యా కథను విశదీకరింప శక్తిమంతు లగుదురు. ఈ శక్తి దేనివలనఁ గలుగుచున్నది? బొమ్మల మూలమున కథను వినుటవలననే గదా? అమెరికా ఇంగ్లండు మున్నగు దేశములలో బాలురకు ప్రకృతిశాస్త్రము లన్నిటిని సినిమటోగ్రాఫ్ యంత్రము ద్వారా బోధించుచున్నారు. మన దేశమందలి బరోడా మున్నగుచోట్ల నదేవిధముగా బాలురకు విద్యలను గఱపుచున్నట్లు తెలియుచున్నది.

మఱియు నొకనికి సింహమును గూర్చి చెప్పఁదలఁచినచో, దానిని గ్రంథమూలమున బోధించినదానికన్న ఆజంతువును జూపి బోధించుట ప్రథమధర్మము. అట్టి జంతువు లభించుట దుర్లభము గనుక దాని రూపపటమును జూపి బోధించిన బాలుఁడు త్వరలో గ్రహింపఁ గలుగుచున్నాఁడు. మఱియు భూగోళశాస్త్రమును పటము (మ్యాపు) చూచి చదివిన దానికి పటము చూడక చదివినదానికి వ్యత్యాసము మన కందఱికి విదితమే. అటులే గణితము దేశచరిత్రములు ప్రకృతిశాస్త్రము శారీరశాస్త్రము మున్నగు సకలశాస్త్రములకు చిత్రలేఖనము తోడ్పడుచున్న దని యెల్లరు నొప్పుకొనక తప్పదు. కనుకనే మన బాలుర చదువు ప్రతిగ్రంథము బొమ్మలతోఁ గూడుకొనియున్నది. అందు పసిబిడ్డల పుస్తకము లగు బాలబోధ మున్నగు గ్రంథములందు పెక్కు పటములు చేర్పఁబడినవి. ఎందు కనఁగా పెద్దవారికన్న పసివారికి బొమ్మలయందు మిగుల ప్రీతి. దీనినిబట్టి యోచింపఁగా చదువువలన మెదడునకుఁ గలుగునట్టి యపరిమితశ్రమ చిత్రలేఖన విద్యమూలమున నొక్కింత తగ్గుచున్నట్టు తోఁచును. మెదడునకు శ్రమ యధికమగుకొలఁది బాలుఁడు బలహీనుఁ డగుచున్నాఁడు. చిత్రలేఖన విద్యవలన మెదడునకుఁ గలుగుచున్న శ్రమలో నేత్రములు హస్తములు కొంత పాల్గొనును. అందువలన మెదడునకు కొంతశ్రమ తగ్గుచున్నట్లు మన మూహింపవచ్చును. ఇట్టి యద్భుతశక్తి యీ విద్యయం దుండుటను బట్టియే ఇంగ్లండు అమెరికా జర్మనీ జపాను దేశ

ములలోని కళాశాలలలో నిది గూడ బోధనాయోగ్యమైన ముఖ్యాంశములలో నొకటిగా చేర్పఁబడియున్నది.

ఇది చదువునకు మిగుల సహాయకారి యని పైని వివరించిన విషయములను బట్టి స్పష్టపడుచున్నది. నేత్రము హస్తములయొక్క శక్తులను వృద్ధిపఱచును దీనివలన మనస్సున కమితానందము గలుగును. జ్ఞానకర్మేంద్రియములకు నీ విద్యవలన చుఱుకుఁదనము గలుగుచున్నది. మఱియు ప్రాచీనగాథల నన్నిటిని చిత్రరూపమున చిత్రించి విశదీకరింపవచ్చును. వీరులయొక్కయు, భక్తులయొక్కయు, దేశోద్ధారకులయొక్కయు, కవీశ్వరులయొక్కయు చిత్రపటములను వ్రాసి యుంచవచ్చును తన రూపపటమును వ్రాయించి దవ్వున నున్న తన బంధుమిత్రులకుఁ బంపవచ్చును పరదేశములోని యందమగు కట్టడమును జూడవలె నన్నను దాని నిక్కడ నిర్మింపవలె నన్నను దాని ప్లాను చిత్తరువులను లిఖించి పంపవచ్చును. యంత్రనిర్మాణాదులను నేర్చుకొనుటకు నూతనయంత్రములయొక్క వివిధభాగములను వివరముగాఁ దెలిసికొనుటకు చిత్రలేఖనము మిగులఁ దోడ్పడును.

మఱియు నిది ప్రతిదేశీయులకుఁ దెలియునట్టి సామాన్యభాష వంటిది అందుల కొక నిదర్శనము కలదు. “కుక్క” అని తెలుఁగు భాషలో నొక కాగితముపై లిఖించి దానిని వంగదేశీయునకు, మహమ్మదీయునకు, అఱవవానికి, ఆంగ్లేయునకు చూపిన, వారు దానిని గ్రహింపలేరు గదా! దానినే కుక్క పటముగా బొమ్మను లిఖించి ప్రతివారును వారివారి భాషలో కుక్కయని చెప్పుదురు. కనుక ఇది లోకములోని ప్రతిమనుజునకుఁ దెలియునట్టి సామాన్యభాష వంటిది. ఒక మనుష్యులే గాక జంతువులు పక్షులు సయితము గ్రహింపఁగలిగినట్టి విషయ మని చెప్పవచ్చును. ఎటు లనఁగా కుక్కను బొమ్మరూపముగాఁ జేసి యొకచోనుంచిన కుక్కలు దానిని చూచి మొఱుగును. ఎందు కనఁగా, ఇది తమ జాతిజంతు వని గ్రహించును. మఱియు మనోభావమును దెలుపవచ్చు ననుట కొక నిదర్శనము గలదు. ఒకసిపాయి యుద్ధములో శత్రువులచేఁ జిక్కెను. సిపాయి మిగుల డస్సియుండెను. ఆఁకలి యగుచుండెను. ఈతనికి వారిభాష రాదు. తనకు కాఫీ కావలె నని అనేకవిధముల చేతులతో అభినయము చేసి చూపెను. కాని వారు గ్రహింపలేదు తుదకు క్రింద నున్న బొగ్గును దీసికొని కాగితముపై ఒక కాఫీ గిన్నె రూపమును వ్రాసి నిండుగా కాఫీ యున్నట్టును వేడివేడిగా నుండవలె ననుటకు పొగ వచ్చుచున్నట్టును కూడ చిత్రరూపమున వ్రాసెను. అప్పుడు వారు గ్రహించి వేడి కాఫీ తెచ్చి యిచ్చిరి.

మన మనోభావములను విశదీకరించుటకు చిత్రలేఖనము ముఖ్యసాధన మని తెలిసికొనియున్నాము. ఈ విద్యను వ్యక్తీకరించుటకు పెక్కు సాధనములు గలవు సీసపు కణికలు (పెన్సిలు), సున్నపుకోపులు, రంగు కణికలు, నీటి రంగులు, నూనె రంగులు, జిగట మట్టి, అట్టలు, కాగితములు, పూసలు, పూలు, విత్తనములు మున్నగునవి. ఎట్టి చిత్తరువు నైనను పైన నుదహరించిన ప్రతిసాధనముతోను విశదీకరింపవచ్చును. ఉదాహరణము — చిలుకను పెన్సిలుతోను సున్నపుకోపులతోను రంగుకణికతోను వ్రాసి చూపవచ్చును. మట్టితో దాని రూపమును జేయవచ్చును అట్టను కాగితమును చిలుక రూపమున కత్తిరించి చూపవచ్చును. దానినే పూసలతో కుట్టవచ్చును, పూలుతో నల్లవచ్చును. విత్తనములతో దాని యాకారమును బెట్టవచ్చును. కావున అభిప్రాయమును పలు రీతుల విశదీకరింపవచ్చును. వీని యన్నిటిలో బాలురకు రంగులతో చిత్రించినవానియందు మిగుల ప్రీతి.

పసిబిడ్డలు మాటలాడలేకపోయినను రంగురంగు పటములను బొమ్మలను జూచి యానందింపఁగలరు. ఈ జ్ఞానము బిడ్డలకు పుట్టుకతోనే గలుగుచున్నది మనవారు పసిబిడ్డలు పరుండు ఉయ్యాలతొట్లపై పాలవల్లిని గట్టి దానికి రంగు రంగుల రసబుడ్లను చిలుకలను వ్రేలాడఁగట్టుదురు. పిల్లలు వానిని చూచి ఆనందించుచుందురు. మఱియు అన్నప్రాశనదినమున బాలునిముందు కలము కాగితము పుస్తకములు బంగారు వెండి ఆభరణములు పలురంగుల పుష్పములు నుంతురు. అందు బాలుఁడు తన కంటికి ఇంపుగా నున్న రంగువస్తువులను హస్తముతోఁ బట్టుకొనును రంగుబొమ్మలతోఁ గూడిన యొక గ్రంథమును పసిబిడ్డచేతి కిచ్చిన, అందు బొమ్మలు గల పుటలను దీసి సంతోషించును. ఏమేమో ముచ్చటించును. వీనినిబట్టి పసిబిడ్డలకు చిన్నప్పటినుండి రంగువస్తువులందు మిగుల ప్రీతి యని స్పష్టపడుచున్నది.

రంగు నేత్రములయొక్క శక్తులను వృద్ధినొందించును. మనస్సునకు సంతోష మొసఁగును. కనుకనే భగవంతుఁడు మన చుట్టు నుండెడి సృష్టి నంతను వివిధములగు రంగులతో నింపియున్నాఁడు. మనము ఆకాశమువంకఁ జూచినచో నేత్రోత్సవము చేయు చిత్రవిచిత్రమైన రంగులు గల మేఘములును భూమివంకఁ జూచిన వివిధమైన రంగులతోఁ గూడిన తరు లతా పుష్ప పక్షి జంతువులును నిండి కన్నులపండువుగా నగపడుచున్నవి. కావున ఈశ్వరుఁడు సృష్టినంతను మన జ్ఞానాభివృద్ధికొఱకె సృష్టించియున్నాఁ డనుటకు సందియము లేదు. భగవత్సృష్టికన్న మిన్నగా నందమిచ్చు చిత్రపటము లెందును లేవు. ఇఁకముందుండఁబోవు. ఎంత నేర్పరి యగు చిత్రకారుఁడైనను సృష్టిలోని చిత్రములను మచ్చుగొనియే లిఖించుచున్నాఁడు. కావున ఈ విద్య నభ్యసింప నుద్దేశించువా రెట్టి గ్రంథములను జూడ నవసరము లేదు. తెలివి గలవారికి సృష్టియే గొప్ప గ్రంథము. సృష్టికన్న వివరముగాఁ దెల్పు గ్రంథము లేదు ఈ గ్రంథమునం దెట్టి తప్పు నుండఁబోదు. ఈ గ్రంథ మింతే యని సమాప్తి నొందించినవాఁ డింతవఱకు లేఁడు. ఇఁకముందుండఁబోఁడు. దేవుఁ డొక్కఁడే సంపూర్ణగ్రంథమును సృష్టించినవాఁడు. యోగి జ్ఞానేంద్రియములతో నీశ్వరునిఁ గనుఁగొని యానందించినట్లు చిత్రకారుఁ డీ సృష్టిని గనుఁగొని యానందించును. బాలునకు వృద్ధునకు పండితునకు పామరునకు నానందదాయక మగునట్టి ఈ చిత్రలేఖనవిద్యను మన బాలురకు నేర్పుట మంచి దని విన్నవించుచున్నాను.

# గోపాలకృష్ణగోఖులుఁడు

చామర్తి రాజశేఖరరావు గారు

నవనవలాడుచు సువాసనల వెదఁజల్లు నతిమనోహరములైన పుష్పములు చాల కాలము నిల్వఁజాలవు, ఒకానొకకాలమున సంపూర్ణజలపూరితములై ప్రవహించు మహానదులు కాలవశమున నిర్జలములు కాకపోయినను దొల్లింటి యున్నతస్థితిని గోల్పోక మానవు; శశికాంతశిలావినిర్మితము లయ్యును రాజమందిరములు సైతము గొంత కాలము గతించినపక్షమున మరమ్మతు గోరుచుండును. వే యేల? కాల మొక్కరీతిగా నుండదు. సర్వమును కాలమున కధీనమై కాలము ననుసరించియే యుండును. లేకున్న యెడల నహోరాత్రము లేల కలుగవలయును? రాకాచంద్రుఁడు పక్షపక్షమునకు నేల క్షీణదశ వహింపవలయును? రమణీయములై శీతలచంద్రికామయములైన యామినీసమయములు తమోమయము లేల కావలయును? అంతియ కాదు. పూర్వకాలమున మహోన్నతవైభవము లనుభవించి, ఖండాంతరులచే సయితము ప్రశంసింపఁబడి పరవీరభయంకరములై యమితైశ్వర్యనిలయములైన హైందవ రోమకాది సామ్రాజ్యములు నేఁటికాలమున చరిత్రములందు సజీవము లయ్యును నామమాత్రావశిష్టములై యుండుటకుఁ గారణ మేమి? ఇది యంతయు కాలమహిమ. ఎంత కాలము మహాపురుషులు దేశమునం దుండియుందురో, యెంతకాలము దేశభక్తులు దేశసేవకై యావచ్ఛక్తిని వినియోగించుచుందురో, యెంతకాలము కార్యరచనాపరాయణులు సర్వసమర్థులు నగు నవతారపురుషులు తమ శరీరకష్టమును బుద్ధికౌశలమును బరమపవిత్రమగు మాతృభూమికై ధారవోయుదురో, యెంతకాలము కాల మనుకూలమై యుండునో, అంతకాలము దేశౌన్నత్యము రవంతయుఁ జలింపక సుస్థిరమై యుండు ననుటకు సందేహము లేదు. కాలము ప్రతికూలముగా నున్నపుడు దేశోన్నతి నశించినను, ననుకూలముగా నున్నపుడు మహాపురుషు లుదయించి మరల నుద్ధరించుచుందురు.

ఇరువదియవ శతాబ్దారంభమున, నంధకారబంధురమైన మన రాత్రికాల మంతయు నంతరించినది. మనపై మచ్చుఁ జల్లి వరవశులనుగాఁ జేసిన గాఢనిద్రనుండి మేల్కొన్నారము. నలుదిక్కుల నావరించుకొన్న ముసిముసి చీఁకటులు దిగంతములకుఁ బాఱిపోవుచున్నవి. ఏవంకఁ జూచినను గాంతిమయముగానే యున్నది. పరమపవిత్రమైన మన మాతృదేశము నూతనోజ్జీవ కళలచే విరాజిల్లుచున్నది. విద్యాధికు లగు హైందవనాయకు లేకమై నిర్మలమైన జాతీయానురాగమును బోధించి మన హృదయకుహరములందు జాతీయభావము నెలకొల్పియున్నారు. జాతీయోద్యమ మన్నతోడనే ప్రతి హైందవయువకుఁడు నుప్పొంగుచున్నాఁడు. స్వార్థత్యాగులును, దేశోపకారపరాయణులును, మాతృసేవాతత్పరులు నగు గోపాలకృష్ణగోఖలేవంటి యవతారపురుషుల పావననామాక్షర శ్రవణమున భారతీయుల యానందరసము వెల్లివిరియుచున్నది. వెల్బీకమీషను ముందు హిందూదేశముయొక్క వ్యయభారము విషయమై ప్రసంగించి, బలాత్కారోచితప్రారంభవిద్యాశాసనము నిమిత్తమై యావచ్ఛక్తి వినియోగింపనెంచి, మాతృదేశోద్ధారమునకై కంకణము గట్టుకొనిన యా వీరపురుషుని పవిత్రజీవితచరిత్రము ప్రతిభారతీయునికి నూతనోత్సాహ మొసఁగుచున్నది. ఆహా! ఆ మహనీయుఁ డింకను గొంత కాలముపాటు జీవించియున్న యెడల భారతమాత యింకెన్ని కళాకాంతులతో, నెంత నూతనోజ్జీవముతో, నెన్ని యున్నతోద్యమములతో, నెంత నవీనోత్సాహముతోఁ దేజరిల్లుచుండెడిదో గదా!

అయినను చల్లని యాంగ్లేయపరిపాలనమున మన మాతృదేశము కొంచెము కొంచెము వృద్ధికి వచ్చుచున్నది. పూర్వకాలమునుండి వంశపరంపరగా వచ్చుచున్న మూఢాచారము లనేకములు మాన్పివేయఁబడియున్నవి. దేశపురోవృద్ధికి నిరంతరము గలుగుచున్న యంతరాయములు తొలఁగింపఁబడినవి. ప్రజాసౌకర్యార్థమై యచ్చటచ్చట నిర్మింపఁబడిన రాజమార్గములు నయోమార్గములు కలవను మాటయే లేకుండఁజేసినవి. అంతియ కాక నలుగడల నావరిరచుకొన్న యజ్ఞానాంధకారముఁ బాఱఁదోలు నాంగ్లభాషాచంద్రికలు విచ్చలవిడిగా వ్యాపించియున్నవి. దేశమునం దెడతెగని శాంతి నెలకొల్పఁబడియున్నది. శత్రువులగు పరజాతీయుల దండయాత్రల వలన మనకు రవంతయు భయము లేదు. మహాభీమములైన సంగ్రామ విషయము లేమియుఁ దెలియవు గావున మనము నిక్కమైన శాంతి ననుభవించుచున్నారము. యుద్ధములవలని తొందరలు మ రేమియు లేకుండుటచేత సాంఘికదురాచారములు ఖండించుకొనుచున్నారము. స్వాతంత్ర్యవాదులును స్వేచ్ఛాభిలాషులును నగు నాంగ్లేయుల రాజ్యాంగనిర్మాణచరిత్రముఁ బఠించుచుండుటచేత మనకును స్వాతంత్ర్యాపేక్ష గలుగుచున్నది. ఒకానొకకాలమున మన మాతృదేశ మనుభవించిన మహోన్నతదశ జ్ఞప్తికి వచ్చి, యప్పటిస్థితికిని ప్రస్తుతస్థితికిని గల తారతమ్యము విశదపఱుచుచుండుటచేత, నప్పుడప్పుడు విషాదము కలుగుచున్నది. తొల్లింటి మహైశ్వర్యము నశించినదనియు, సామాన్యముగా దేశ మంతయు దరిద్రదశయం దున్నదనియు, నచిరకాలములో ననేకదేశములు భాగ్యవంతములైన వనియుఁ దెలిసికొని యుండుటవలన, - వెనుకటి విషాద మినుమడించుచున్నది.

దేశాభివృద్ధికై సమర్థులగు నాయకు లనేకులు కావలసియున్నారు. ఎప్పుడు దేశవాసులు తమ దురవస్థను గ్రహించియుండిరో యప్పటినుండియు వారు నాయకులను వెదకుచుందురు. దేశమునందు

విద్యావంతులు లేకపోలేదు; స్వార్థత్యాగులును పరోపకారపరాయణులును కొఱఁతపడలేదు, దేశసేవాతత్పరు లనేకు లున్నారు. కాని వారేయుద్యమములును దలపెట్టకుండుటచేత, జనబాహుళ్యమునకు నిరుత్సాహకరముగా నుండుట మాత్రమే గాక, దేశౌన్నత్యమునకు దారితీయు తరుణములు చాలభాగము తప్పిపోవుచున్నవి. తామును బ్రపంచములోని యితరజాతులతోఁ గూడ సమానముగాఁ దులఁదూగవలె యు నన్న పక్షమున దేశ మంతయు బాగుపడవలసియున్నది. ఇందులకై వాక్యశూరత్వమును నారంభశూరత్వమును చాలదు, నిక్కమైన క్రియాశూరత్వ మత్యావశ్యకమై యున్నది అట్లయ్యును విజయము నొందుట బహుకష్టసాధ్యము. మార్గమం దనేకవిఘ్నము లున్నవి, కష్టము లున్నవి. వీని నన్నిఁటిని సహింపఁజాలినవారు పూనుకొనవలయును. రాజకీయవిషయములందును సార్థికస్థితియందును, మత సాంఘిక విద్యా విషయములందును మనకు లెక్కలేని లోపము లున్నవి. వీని నన్నిఁటిని సవరించి సంస్కరింపఁగల సమర్థులెవరు? జన్మభూమియందుఁ గల నిష్కపట విశ్వాసముతోడను గాఢమైన పట్టుదలతోడను బనిచేయుచు, దేశాభివృద్ధికి దారితీయుచు, నాశాలతలను బుష్పింపఁజేసి యాదర్శకులైన మహాపురుషులెవ రున్నారు? ఈ సందేహములు దేశదురవస్థను గూర్చి చింతించు ప్రతిభారతీయుని హృదయమున మెదలుచున్నవి. అంతియ కాక భారతవీరుల యున్నతాదర్శములను బ్రపంచమునకుఁ జాటి, మాతృదేశమునకై యావచ్ఛక్తి వినియోగింప నెంచిన శ్రీ గోపాలకృష్ణుఁడు కీర్తిశేషుఁ డయ్యె నను విషాదవార్త పిడుగువలె వినఁబడినతోడనే, జాతీయాభివృద్ధివిషయమై సందేహించు దేశభక్తుఁ డగు ప్రతిభారతీయుని హృదయమునను విషాద ముప్పొంగి బాష్పజలరూపమున నేత్రములనుండి వెలువడి వ్యక్తమగుచున్నది.

గోపాలకృష్ణుఁడు నిక్కమైన దేశభక్తుఁడు. అతఁడు తన మాతృదేశమునకు వర్ణనీయమైన సేవఁ జేసియుండుటచేతను, అతనియం దుత్తమోత్తమములైన కొన్ని మహాగుణములు వాసముచేయుచుండినందువలనను, స్వజాతీయులైన భారతీయులే గాక పరజాతీయులగు నాంగ్లేయులును మఱికొందఱును నాతని నెంతయుఁ గొనియాడియున్నారు. అతని రాజతంత్రజ్ఞతయు, మాతృదేశమునందలి యవ్యాజానురాగమును, బూర్వకాలమునుండియుఁ బేరుపడిన తన యుత్తమదేశములో నాచారవ్యవహారములందుఁ గల శ్రద్ధాభక్తులును, తన దేశవాసుల భావిపరిణామముయొక్క యున్నతస్థితినిగూర్చిన మిక్కిలి నమ్మకమును, నెంతయుఁ బ్రశంసాపాత్రములు. ఆతఁడు తనదేశముయొక్క స్థితిగతులను గూర్చి చక్కఁగాఁ జదివి, లోపాలోపముల విషయమై విశేషముగా విమర్శించియుండెను. ఆతఁ డింతగొప్ప యనుభవజ్ఞుఁడైన రాజనీతిపరాయణుఁ డగుటకు, గతశతాబ్దమునందు దేశభక్తాగ్రేసరుఁ డని ప్రసిద్ధివహించి, యాధునిక హైందవమహాఋషి యని చెప్పఁబడు మహాదేవగోవిందరానడే యను న్యాయమూర్తియే మూలకారణుఁడు. అంతటి మహాపురుషునకు శుశ్రూష చేసియుండుటచేతను, నటువంటి యుత్తమగురుని వాత్సల్యముచే ననుగ్రహింపఁబడుటచేతను, గోపాలకృష్ణుఁ డింతవాఁ డయ్యె నని చెప్పుటలో నతిశయోక్తి లేదు. ఆ మహాపురుషునిదగ్గఱ శిక్ష పొందినవా రందఱును నేదో యొక విషయమునందుఁ బ్రవీణులై స్వదేశమునకు సేవ చేయుచున్నారు. రానడేగా రనినతోడనే హిందూదేశములో ప్రతిభాగమునందు గౌరవింపనివారు లేరు. వారి మహాప్రభావ మేమియో గాని విద్యావంతులగువారు వారి సాన్నిధ్యమున కాకర్షింపఁబడుచుండిరి. వారి యసామాన్యమైన బుద్ధిసూక్ష్మత, సాచుప్రయోగముచేతఁ గార్యము సాధించుట, మొదలుగాఁ గల యుత్తమగుణము లాయనయందు లెక్కకు మిక్కిలియై యుండెను. ఆ గుణములు పరులు గ్రహించి నేర్చుకొనుటకు కష్టసాధ్యములై యుండెను. ఇట్లని గోపాలకృష్ణుఁడే యనేకపర్యాయములు నుడివియున్నాఁడు. గోవిందరానడేగారు తనకు నిజమైన గురు వనియు, తా నేవేళనైన నిక్కమైన దేశసేవ చేసియుండెనేని అట్టి యుత్తమసేవాబుద్ధి తన గురునకే సంబంధించియున్న దనియు అతఁడు స్వయముగాఁ బలికిన వాక్యములు. ఎట్లయినను గోపాలకృష్ణుఁడు రానడేగారియొద్ద చాలభాగము శిక్షనొంది యా మహాత్మునియందు లీనములైన మహాగుణములు గ్రహించియుండెను. దేశభక్తులైన యిటువంటి మహాగురువులును, దేశసేవాతత్పరులైన యిట్టి యుత్తమశిష్యులు నింకను మరికొంద ఱున్నపక్షమున, మన హిందూదేశ మెంత యభివృద్ధిఁ గాంచియుండెడిదో గదా! అయినను తొందరపడ నవసరము లేదు. కాల మెప్పుడును బ్రతికూలమై యుండదు. మనము నిరంతరము వడిగా నడపుటకు గాఢముగా నాలోచించుచున్న దేశీయోద్యమ మను నావ కనుకూలవాయువులు వీవక మానవు. మహాపురుషు లుదయింపక పోరు. మన యాశలు సఫలీకృతములు కాకపోవు.

# బలి

## శ్రీ విక్రమదేవవర్మ గారు

బలంత్యనేన బలిః — బల ప్రాణనే. (దీనిచేత బ్రతుకుదురు) అని బలిశబ్దముయొక్క నిర్వచనము. కనుక బలి యను పదము పూజార్థమయిన కానుకను ప్రజలు ప్రభువులకొసఁగు నిచ్చుకప్పమునకును బర్యాయముగా వాడఁబడుచున్నది.

భూతము లనఁగాఁ బ్రాణులును బిశాచములును; వానికై సమర్పింపఁబడెడి యాహారము "భూతబలి" యనంబడును. కాని, "నరబలి" యను పదమును మాత్ర మట్టు లన్వయింపక, "నరులే బలిగా నగుట" లేక "నరులనే బలిగా నిచ్చుట" యని యన్వయింప వలసివచ్చె. అట్లన్వయించుటకుఁ గారణ మట్టి క్రూరాచార మీ దేశమున నుద్భవిల్లుటయె.

ఖోదువా రను నొకతెగవారీ దేశారణ్యప్రదేశములందు నివసించుచున్నారు. వారలకుఁ బ్రధానదేవుఁడు సూర్యుఁడు, ప్రధానదేవత భూదేవి. వారల పొలములు చక్కగా ఫలించుటకొఱకును వారల గ్రామములందు విస్ఫోటాదిరోగములు గలిగినపుడు తచ్ఛాంతికొఱకును వారలు "భూదేవి" నుద్దేశించి "మెరియా" (నరబలి) నిచ్చుచుండెడివారు. "మెరియా"కు నుపయోగించినవారలకు వయోనిర్ణయమును లింగభేదమును లేకుండెను. మానవమాత్రు లందఱును దానికిఁ బాత్రులె. వార లప్పుడప్పుడు దొంగిలింపఁబడుచుండినను సాధారణముగాఁ గొనఁబడుచుండిరి. ఒక "మెరియా" యొక్క వెల యేఁబది మొదలు రెండు వందల రూపాయలవఱకు నగుచుండెను. "మెరియా"యొక్క విధివిధానంబుల నిట వర్ణించుట యనావశ్యకము. అందులకై తేఁబడినవారలు లెస్సగాఁ బెంపఁబడి, తుదకు నఱకఁబడుచుండెడివారని చెప్పినం జాలును. ఈ భయంకరాచారమును మాన్పుటకు 1837-వ సం. మేజరు కాంబెలు గారు నియమింపఁబడెను. 1841-వ సం. జనవరి 8-వ తేది యమావాస్య యయ్యెను. నాఁడు రమారమి 240 మంది బలి గావింపఁబడినట్లును 1854-56 సంవత్సరముల నడుమ 717 గురు పురుషులును 780 గురు స్త్రీలును బలియయి యమసదనమున కేగక, యతనిచేత విముక్తులై బ్రతికినట్లును నాతని విజ్ఞాపనమువలన మనకుఁ దెలియుచున్నది. ఖోదువా రిప్పుడు "నరబలి"ని మానుకొన్నను, ఎనుపోతులు మొదలగు మెకంబులను గుక్కుటంబులు మొదలగు పులుంగులను బలిగా నిచ్చుటను మాత్రము మానుకొనలేదు. అయ్యో! పాపము! అనాగరులును విద్యావిహీనులు నగు వారలపని కేమి! నాగరులయి విద్దెలచేత విరాజిల్లుచున్న యగ్రజాతులవారును రాజులును జ్ఞానహీను లయి దేవీపూజల కనియు మ్రొక్కుబళ్లకనియుం జెప్పుచు దిక్కులేని జంతువులను సుంతయైనం గనికరము లేక యంతకనిశాంతంబునకుం బంపించుచుండుట కడు శోచనీయము గదా!!

జంతుహింసనం బను దూరాచార మీ దేశమున నెప్పు డెట్లు కలిగెను? ఇవ్విషయ మిక్కడ నొకించుక యాలోచింతము. అనాదులగు వేదములయొక్క మంత్రములందుఁ బశుహింసను గూర్చి చెప్పఁబడియున్న ట్లనంజాలము. కాని, బ్రాహ్మణములయందు నది యందందు గోచరించెడిని. ఆశ్వలాయన బౌధాయ నాపస్తంబ కాత్యాయన ద్రాహ్యాయ నాది శ్రౌతసూత్రంబులయందుఁ బశుహింసతోఁ గూడిన యజ్ఞవిధానంబులు వక్కాణింపంబడియుండుటవలన జైమిని నిజమీమాంసాశాస్త్రంబునఁ బశుహింసనము యజ్ఞమునందు విహిత మనియుఁ దదితరకార్యములందు నిషిద్ధ మనియును సిద్ధాంతీకరించెను. కావునఁ బ్రాచీనులయిన యార్యులు యజ్ఞకర్మమునందె పశుహింసనమును జేయుచు యజ్ఞశేషమాంసమును మాత్రము భుజించుచుండిరి. మఱియుఁ దమ పొట్టకొఱకే జంతువులను గిట్టించుచుండినవారలను క్రవ్యాదు లనియును గౌణపు లనియును దిరస్కరించుచుండిరి. క్రవ్యాదు లనఁగా మాంసభక్షకులు; కౌణపు లనఁగా శవభక్షకులు. యజ్ఞములను దూషించి మానినవా రనార్యులు. వార లిప్పటి గ్రామదేవతాదాసులవలెఁ దమ దేవతలకు జంతువులను బలిగా నిచ్చుచుఁ దినుచుండిరి. అట్టివారలను దస్యు లనియును దాసు లనియు నార్యులు నిందించుచుండిరి. మఱియు నార్యులకు ననార్యులకును ఘోరంబులయిన పోరాటంబు లెన్నియో జరుగుచుండెను.

మాంసాశనప్రలోభనకారణమునఁ గాఁబోలు ఛాగాదివిశసనయుక్తం బయిన యజ్ఞంబు గోమేధరూపమును దాల్చి, పిమ్మట హయమేధాకారంబును బూని, తుట్టతుదకు భయంకరమయిన నరమేధాకృతిని ధరించెను. నరమేధసమాచారము రామాయణాంతర్గత శునశ్శేఫోపాఖ్యానవిదితము.

ఆర్యుల యజ్ఞక్రమ మభివృద్ధిఁ జెందినట్లె యనార్యుల పూజాబలిక్రమము పెంపు నొందసాగెను. పక్షులతోఁ గూడిన బలులు పశువులతోడను, పశువులతోఁ గూడినవి మనుజులతోడను నొప్పెను.

యజ్ఞము విత్తవ్యయప్రయాససాధ్యము. అందుచేతనే కాఁబోలు నార్యులలోని స్మృతికర్తలు పితృకార్యమునందును నతిథిసత్కారమునందును మాంసభక్షణము కర్తవ్య మనిరి. ఆర్యులువోలె యజ్ఞములను జేయలేనట్టియు ననార్యులువోలె క్షుద్రార్చనల నొనర్ప నొల్లనట్టియును దాంత్రికులు వామాచారకౌలాచారములను గల్పించి జీవహింసను వృద్ధిపఱుపం జొచ్చిరి. జంతుసంతతిలో నుత్తమజీవులగు మానవులను మాఱట పాడిగాదని కాఁబోలుఁ దాంత్రికులు వారలను సైతము తమ దేవులకు బలిగా నర్పించుచుండిరి.

ఇట్లీ దేశమున జంతుహింసనము వృద్ధియై పాతకము పెరిగెను. అప్పుడు కృపాపారావారుం డగు జగదీశుండు బుద్ధదేవు నీ

దేశంబునం బుట్టించెను. కరుణాంతరంగుం డైన బుద్ధుండు జీవహింసను దొలంగించుటకుఁ బ్రధానసాధనము యజ్ఞయజనములను మాన్పుటయె యని నిశ్చయించుకొని, వాని నాచరింపరా దని జనులకు బోధించెను. అమ్మహాత్ముని బోధనమువలన హింసాదేవి కొంతకాల మడఁగియుండి మరలఁ దలయెత్తసాగెను. తరువాత జనించిన యశోకవర్ధన మహారాజు "అహింసా పరమో ధర్మః" అను వాక్యమును దన నెమ్మనమున నిమ్ముగా నమ్మినవాఁ డగుటవలన ననేకోపాయంబులచేత హింసాదేవిని మట్టుపెట్టెను. ఆ కాలంబుననే "శ్లో. అశ్వాలంభం గవాలంభం సన్న్యాసం పలపైతృకం। దేవరాచ్చ సుతోత్పత్తిం కలౌ పంచ వివర్జయేత్." అను శ్లోకరాజ మాదిత్యపురాణమున నుదయించియుండఁబోలు!

అశోకవర్ధన మహారాజు సురరాజపురంబున కేఁగినపిమ్మట నిర్దేశంబు హింసాదేవికి మరల నాటప ట్టయ్యెను.

పాఠకులారా! ఇట్లు జంతుహింసనమురాచారోత్పత్తిని గనుంగొంటిమి. మనము దినదినాభివృద్ధిగా జ్ఞానవంతుల మగుచున్నవారము; మఱి జ్ఞానమార్గంబున ముక్తిని సాధింపఁ బూనుకొనినవారము. జ్ఞానమార్గోపదేశకు లందఱును హింస వల దనలేదా? దాని నింకనయినను మనము మానవలదా? కనుక బలిశబ్దముయొక్క తత్త్వార్థమునే గ్రహింతము. భూతబలి యనఁగాఁ బ్రాణులకై సమర్పింపఁబడు నాహార మనియె నిర్ణయింతము.

పరమసాధ్వి యయిన శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారి పరిపాలనకాలమున "నరబలి" రూపుమాసినట్లె కరుణార్ద్రహృదయులగు శ్రీజార్జి చక్రవర్తి గారి పరిపాలనసమయమునఁ "బశుపక్షిహింసనము" నశించునుగాక!

# పీఠికాపురీశుఁడు

సోదరకవులు, పిప్పర

ఎంత తపంబు చేసి మది నెవ్వనిఁ గొల్చితొ? యాంధ్రమాత! జ
న్మాంతరమందు; నీకు సుతుఁడై యుదయించెను పీఠికాపురీ
కాంతుఁ డశేషసజ్జననికాయసుకీర్తితకీర్త్యలంకృతా
కాంతుఁ డుదారసాహసుఁ డహస్పతినందనుఁ డీవి పెంపునన్.

సీ. పోషించుచున్నాఁ డపూర్వకౌతుకవృత్తిఁ
బండితాఖండలమండలంబు;
సేవించుచున్నాఁ డశేషగౌరవయుక్తి
భవదీయమృదుపాదపద్మయుగము;
కావించుచున్నాఁ డఖర్వమేధాశక్తిఁ
గమనీయనూతనకార్యములను;
భావించుచున్నాఁ డపారకారుణ్యాప్తి
దీనుల నిజబంధుదృష్టి నిలిపి;
మఱియు నొనరించుచున్నాఁడు మహిమ మీఱఁ
బెక్కు కార్యంబు; లవి యెల్లఁ బేర్కొనంగఁ
దరమె? యొడలేని పుత్త్రరత్నంబు నీకుఁ
గలిగె నమ్మరో! దేశంబు కఱవు దీర.

సీ. పత్రికావృద్ధి కపార్థివోత్తముఁ డిచ్చు
ద్రవ్య మింతని చెప్పఁ దరము గాదు;
నిర్ధనవిద్యార్థినివహార్థ మా నృపుం
డిచ్చెడు విత్త మింతింత గాదు;
పాఠశాలలకు నా వసుమతీశ్వరుఁ డంపు
వసురాశికిని హద్దు పద్దు లేదు;
గ్రంథమాలాభివృద్ధికరణార్థ మా మేటి
యనుపు ధనాళికి యత్త లేదు;
మఱియు శరణాలయాదిసన్మానముఖ్య
గౌరవంబుల కెంతయు మేర లేదు;
అధికతమమయి పెరిగెడి యతని యీవి
కడలి కారార! చెలియలకట్ట లేదు.

శా. తర్కవ్యాకరణాదిశాస్త్రముల నత్యంతంబు విశ్వాససం
పర్కాలోకనమాధురీమహితుఁ డై పాటించి పోషించుచున్
గార్కశ్యాతిగబుద్ధి నెల్లెడ యశఃకర్పూరముల్ నింపు నీ
యర్కక్ష్మాపతి నీ సుతుం డనెడు భాగ్యం బింతయుం జాలదే!

తే. కలరు దాతలు, నర్థులు కలరు; గాని
కలరె యిట్టిరు? సూర్యాఖ్య గలిగియుంట
కరము లొకవేయి యున్నవో కాని, యెఱుఁగ
మిట్టి దాతృత్వ మెప్పు డెప్పట్టునందు.

తే. మాతరో! పీఠికాపురీనేత సర్వ
కాలమును నీ పదాంభోజకళికలందు
భక్తివిశ్వాసములు గల్గి భవ్యసుఖము
బెరసి మనుఁగాక! యంచు దీవింతు మెపుడు.

# స్త్రీస్వతంత్రజీవనావశ్యకత

చాట్రాతి లక్ష్మీనరసమ్మ గారు

స్త్రీలకు విద్య కూడ దనియు, ప్రయోజనము లే దనియు, హానికర మనియు, స్త్రీలు గృహకృత్యములు నిర్వర్తించినఁ జాలు ననియు, మన పూర్వపు స్త్రీలు ఉద్యోగాదులు చేసియే జీవించినారా యనియు, స్త్రీల కే విషయములోను స్వాతంత్ర్య మీయరా దనియు వాదించువారు మన యాంధ్రదేశంబునం దింకను కొందఱు గలరు. కాని, "మాతేవ రక్షతి పితేవ హితేనియుంక్తే కాంతేవచాభిరమ తేప్యపనీయ ఖేదం కీర్తించ దిక్షు విమలాం వితనోతి లోకే కింకిం నసాధయతి కల్పలతేవ విద్యా" అనినట్లు విద్య యను అమూల్యపదార్థము అర్థుల కొకటి యిచ్చి యొకటి యియ్యకుండునా? దాని వలన ప్రయోజన మొకరి కుండి యొకరికి లేకపోవునా? అమృత మొకరికి హాయి నిచ్చి మరొకరికి హాని కలుగఁజేయునా? ఇందుకు నిదర్శనముగ మన దేశమునందు విద్యావంతు లైన స్త్రీ లెట్లు తమ బిడ్డలను విద్యాభివృద్ధికై ప్రోత్సాహపఱచుచు తమ సుతులను గుణవంతులుగను ఆరోగ్యవంతులుగను చేయఁజూచుచున్నారో, విద్యావిహీన లగు స్త్రీలు తమ పుత్రులు అయుక్తమార్గప్రవర్తకు లైనను మరల్పలేక వారి నే విషయములోను యుక్తప్రవర్తకులుగఁ జేయ సమర్థులు గాకయుండిరో మనము చూచుచునే యున్నాము. "నాస్తి విద్యా న చక్షుః" అన్నట్లు విద్య లేనివా రంధు లని తలఁచెదను. కావున విద్య యను రెం డక్షరములు ప్రతివారును తమ హృదయఫలకమునందు చిత్రించి యుంచుక సూక్ష్మదృష్టితో విచారించినచో విద్యాపద మెంతి హృద్య మైనదియు. ఎట్టి ఫలకారిణి యైనదియు బోధపడకమానదు. విద్యావతు లైన స్త్రీలు కూడ విహితమార్గదూర లై చరించుచుండి రని కొందఱు కుతర్కము చేయుదురు. మనుజుని చెడఁగొట్టునది వాని బుద్ధి గాని విద్య కాదు. మధుర జల మైనను, యూషరక్షేత్రమందు పడిన, ఉప్పునీ రగుచున్నది. ఇందువలన జలమునందు దోష మే మున్నది? అట్లయిన, విద్యవలన ప్రయోజన మే మన, సూర్యోదయానంతరము ఎట్టి తమ స్సైనను విడిపోవునట్లు మనుజు లెట్టి దుర్జను లైనను విద్యావివేకము గలిగి జ్ఞానోదయ మైనచో క్రమక్రమంబుగ దుష్టులు సహితము సుజనులు కాఁగలరు. ఇఁక మన స్త్రీలు గృహకృత్యములు నిర్వర్తించినఁ జాలు ననిన, దీనికైనను విద్య యావశ్యకమే. ఏ మన, గృహములను గృహోపకరణములను పరిశుభ్రముగ నుంచుకొనుటకును, తన దేహమునకును బిడ్డల శరీరములకును ఏ మాత్ర మనారోగ్యము గలిగినను, ఔషధసేవ చేయుటకై వైద్యుల కమితద్రవ్యమును వెచ్చింప నవసరము లేకుండ స్వల్పచికిత్సలచే వ్యాధిని నివారింపఁజేసికొనుటకును, వైద్యగ్రంథము లారయుటకు విద్య యావశ్యకమే. కావున మన స్త్రీలు చదివి యుద్యోగాదులే చేయ నక్కఱలేదు. స్థితిమంతు లైనవో, వారి కింటియందే యుద్యోగము లున్నవి. శిశుపోషణాది గృహకృత్యము లాచరించుటయును, భర్త హితము నెఱిఁగి యుపచరించుటయును, బంధుజనుల నాదరించుటయును ఉద్యోగములు కావా? కావున విద్యవలన ప్రయోజనము లేకపోలేదు. ఇఁక మన పూర్వపు స్త్రీలు ఉద్యోగాదులు చేసియే జీవించినారా యనిన, ప్రాచీనకాలమునకును వర్తమాన కాలమునకును గల మార్పును సకారణముగ విచారించినచో, ఇట్లు వాదించువారి మనంబులం దున్న సందియంబులు నశించుటయే గాక స్త్రీలకు స్వతంత్రజీవన మవసర మని తోఁపక మానదు. ఏ మన, పూర్వము మన సంఘమువారు ఎవరి కులవృత్తులకు వారు లోఁబడి వివిధవృత్తు లాచరించుచు జీవించెడివారు, వ్యాపారము విభాజ్యమై సంఘమునకు భాగ్యమును సౌఖ్యమును కలిగించుచుండెను. రాను రాను, ఏకవృత్తి నవలంబించి వివిధ కులవృత్తులను వదలివేయుటచే వ్యాపారము నశించి సోమరితనము హెచ్చి దేశము హైన్యదశకు పాల్పడుచున్నది. పూర్వము స్త్రీపురుషులు కలిసి యెవరి కులవృత్తులను వా రవలంబించుట కవకాశ ముండెడిది. కాలక్రమమున విదేశీయ స్త్రీపురుషులచే తయారు చేయఁబడిన వస్తువులు వారి నవీనజ్ఞానము పరిశ్రమ మన దేశమునందు ప్రవేశించి మన వృత్తులను నాశనము చేయుట తటస్థించినది. కావున ఎప్పుడు మన దేశమునకు విదేశీయుల వృత్తి వ్యాపించినదో, అప్పుడే మన దేశము దరిద్రదశ నొందినది. ఎప్పుడు మనకన్న నెక్కుడు నాగరకత యెక్కుడు పరిశ్రమ గలవారితో మనకు సంబంధము కలిగినదో యప్పుడే మన స్త్రీలును వ్యాపారవతులై జీవించుట కవసరము వచ్చిన దని గ్రహింపవలెను. మరియు మన స్త్రీపురుషులు, అవసరములను బట్టి మాఱకుండుటవలన, దేశమున కమితద్రవ్యనష్టమును కలుగఁజేయుచున్నారు. ముఖ్యముగ పురుషులకన్న స్త్రీలు నిర్వ్యాపారిణులై పరిశ్రమవలన కలిగెడి యాదాయమునకు మాఱుగ అమితద్రవ్యనష్టమును కలుగఁజేయుచున్నారు. ఇందుకు విదేశీయ స్త్రీలచే తయారుచేయఁబడిన వివిధములగు పూలు దుస్తులను మన స్త్రీ లుపయోగించుకొనుటయే తార్కాణము. పాశ్చాత్యస్త్రీలవలె నాగరకత కనుకూలము లగు మంచి దుస్తులను ధరించుటయే గాని, వారి జ్ఞానమును సంపాదించి వారి నవీనకల్పనాశక్తిని మనవా రభ్యసింపకపోవుటచే తాత్కాలికేచ్ఛానురూప మగు సుఖమే గాని కుడుకు భుజించుట కన్నమును ధరించుటకు వస్త్రమును లేకపోవుచున్న వనెడి సంగతి గుర్తించుట లేదు. పారిశ్రామికవిద్యలవల్లను చిత్తరువులవల్లను, విదేశీయస్త్రీ లెంత శ్రమచేసి తమ భర్తలకు సహకారిణులై దేశాభ్యుదయమును ద్రవ్యాభివృద్ధియును జేయుచున్నారో, దాని కినుమడింతలు మన స్త్రీలు నిర్వ్యాపారిణులై ద్రవ్యమును వెచ్చించుచున్నారు. వారి విద్య లన్నియు మనవా రభ్యసించినచో మన ద్రవ్య మంతయు మన దేశమందే యుండును గదా? కావున ద్రవ్యము పదార్థరూపముగ మాఱినప్పుడే యభివృద్ధి యగును. మనకు మార్పు లెట్లో, అభివృద్ధియు నట్లే మాఱుచుంటుట సహజము. కావున ద్రవ్యమును, శ్రమ అర్థప్రాప్తి పరిగ్రహణక్రియలచే రూపభేదమును స్థానభేదమును పొందించి, ఉపకరణనిర్మాణము చేయవలెను. మన దేశభాగ్య మంతయు అర్థగర్భితమై కడు సంకుచితమును పొందియున్నది. అర్థము తనంతట ప్రత్యేకముగ మన కుపయోగము

నకు వచ్చునట్టిది కాదు. ధనమువలన ప్రయోజనము మనకు వలయు వస్తువులను పరిగ్రహించుటకు సాధనమై యుండుటయే కావున, ఇందుకు నిదర్శనముగ గవర్నమెంటువారు ధనమును సాధనములుగ నిరూపించిరి. మనవా రభ్యసించు కర్మవిద్యయు స్త్రీలకుఁ గూడ నుపయోగకరముగ నుండవలెను. అర్థాభివృద్ధి లేనిది దేశాభివృద్ధియు దేశాభ్యుదయమును కలుగవు. కనుక మన స్త్రీలను పురుషులతోపాటు వివిధవిద్యల నభ్యసింపఁజేసి వృత్తులను కల్పించి వారికి స్వతంత్రజీవనమును కలుగఁజేసినఁ గాని మన దేశ మభివృద్ధి చెందదు. సామాన్యముగ సంఘములో నేమాత్రము స్థితిగతు లున్నను స్త్రీల కెక్కడ లేని రాణివాసమును నిర్వ్యాపారత్వమును కల్పించుచున్నారు. నాగరకత పేరిట సోమరితన మలవడుచున్నది. వృత్తి చేసికొనుట యనునది కేవలము నింద్య మగుచున్నది. పూర్వ మది యుపయుక్తముగ నుండెను; గాని, పైన వ్రాసిన రీతిని నిరంతరపరిశ్రమాభ్యాసకులగు ప్రజలతో సంబంధము తటస్థించినప్పుడు, అభివృద్ధికరము లగు వృత్తుల నే యవలంబింపఁజేయవలెను గాని యాచారము లేని హేతువుచే భ్రష్టులను జేసి దేశద్రోహము చేయరాదు. పాశ్చాత్యస్త్రీపురుషులు బుద్ధికుశలతచేత సమానవిద్యాపరిశ్రమ గలవారై ఔన్నత్యమును బొంది దేశమున కమితోపకారమును జేయుచున్నారు. మన సంఘములో స్త్రీలోకము విశేషముగ స్వాతంత్ర్యవృత్తి లేక కుటుంబమునకుఁ గిట్టుఁబాటు గాని పురుషునియొక్క యాజ్ఞకు పాల్పడుచున్నది. అనఁగా మన కుటుంబములలో ఒకఁడు సంపాదించుటయు పెక్కండ్రు జీవించుటయు సంభవించుచున్నది. ఇందువలన క్రమక్రమముగ ధనము గల కుటుంబములు గూడ దరిద్రస్థితిని జెందుచున్నవి. స్త్రీలకు స్వతంత్రజీవనమును కలుగఁజేయుట కున్నతవిద్య యావశ్యము. మన సంఘములో నెక్కువమంది ఉంఛవృత్తినైన గౌరవించెదరు గాని పురుషులకడ మన స్త్రీల కున్నతవిద్య గఱపుటకును, విద్యావతులైన స్త్రీలను బాలికాపాఠశాలల కుపాధ్యాయినులుగఁ బంపుటకును నంగీకరింపరు. మన స్త్రీ లుపాధ్యాయినులు గాకున్న మన బాలికలకు విద్య గఱపుటకు, పురుషులు గాకున్న స్త్రీ లెట్లు లభించెదరు? మన దేశమందు జీవనము లేక ఉంఛవృత్తివలన జీవించువా రెందరు లేరు? జీవనమునకు లేక తిరిపె మెత్తుకొనుటకన్న ఒకరికి విద్య గఱపి జీవించుట గౌరవమైన వృత్తి కాదా? కావున ఏ పదార్థమైన నుపయోగపడవలె నన్న కాంక్ష ముఖ్యమైన కారణము. కన్నులు లేకున్న చిత్తరువును, చెవులు లేకున్న గానమును నెట్లప్రయోజనమో, వాంఛ లేకుండిన నే వస్తువులును పనికి రావు. నిష్కామి యగువానికి లోక మంతయు నిష్ప్రయోజనమును, మూల్యశూన్యము నై యుండును. అట్టివార లే దేశంబున నుండిన, ఆ దేశము తప్పక నశించు ననుటకు సందియము లేదు. ఇందుకు నిదర్శనముగ హీనకులజులు కట్ట బట్టయును త్రాగుటకింత గంజియును దొరకినఁ జాలు నని తృప్తి నొందుటచే, ఋణ మబ్బినను పరిశ్రమ చేసి ద్రవ్యార్జన చేయక యింక నెక్కువ యొందుకని యుపేక్షించుట చూచుచున్నాము. ఇందుచే వారు వృద్ధి నొందకుండుటయే గాక, దినదినము హీనస్థితికిఁ గూడ వచ్చుచున్నారు. మఱియు మన స్త్రీలు విద్యాశూన్య లగుటచేతనే దీర్ఘదృష్టి లేక సమరసజ్ఞానరహితలై ద్వైతభావమును వహించి వారివారి సొంతకుటుంబములమీఁద తప్ప ఇతరములయెడ వనాదరబుద్ధి గలవారై ఐకమత్యశూన్యలై దేశాభిమానరహితలై వర్తించుచున్నారు. మన సంఘస్థైర్యము శిథిలమైపోవుచున్నది. మఱియు మన స్త్రీల నిర్వ్యాపారత్వమనే సోమరితన మలవడి తాము వ్యాధిగ్రస్తలగుటయు, తమ శిశువులను వ్యాధిపీడితు లగునట్లు చేయుటయు సంభవించుచున్నది. ఇందుకు తార్కాణముగ బీద కుటుంబీకులును హీనకులజులును నిరంతరపరిశ్రమచే ఆరోగ్యవతులగుటయు, సంపన్నగృహిణులు వ్యాధిగ్రస్తలగుటయు మనము చూచుచునేయున్నాము. ఇన్నిటికిని కారణము మన స్త్రీలను, అజ్ఞానబుద్ధి కవకాశం బీయక యావజ్జీవమును బానిసతనమే గత్యంతరముగఁ బాల్పడఁజేయుటయు, జీవచ్ఛవములవలె వర్తింపఁజేయుటయే. కొన్ని నవీనశక్తుల కీ యూహ లుదయించినను, సంఘశక్తిని ప్రతిఘటింపలేక మనోరాజ్య మేలుటచే వారి యూహలు వారితోనే యంతరించుచున్నవి గాని ఫలకారిణు లగుట లేదు. ఎట్టివారు సంఘసంస్కర్త లని పేర్కొనఁబడుదురు. ఏ మన, పక్వమైన పండ్లు సైతము తమంతట వచ్చి మన నోటఁ బడవు. "ఉద్యమేన హి సిద్ధ్యంతి కార్యాణి న మనోరథైః। హస్తే సుప్తప్రబుద్ధస్య నహ్యాయాతి ధనం స్వయం" అని సమస్తకార్యములు ప్రయత్నసాధ్యములై యున్నవి. సాలెపురుగు తంతుసద్మములను నిర్మించునట్లును, తేనెటీఁగలు మధువును గూడఁబెట్టునట్లును, మన స్త్రీల నుద్యోగినుల నగునట్లు చేసినఁ గాని దేశాభ్యుదయము కలుగదు. మఱియు, తన కందని ద్రాక్షపండ్లను పుల్లనివని నక్క నిరసించునట్లు, మన స్త్రీలకు విద్యాభ్యాసమున కనువగు మార్గముల నుపయోగపఱుపలేక విద్యయందు దోషారోపణము చేసి, స్త్రీలకు విద్య కూడ దని తలంచుచున్నారు. మానవజీవితయాత్రలో పురుషుఁడు గృహేతరవ్యాపారములను స్త్రీ గృహాంతరధర్మములను నెఱవేర్చుటకు నిర్ణీతులైరి గాని, విద్యాదివ్యాపారములకు స్త్రీ లనర్హ లని తలంపరాదు. ఇఁక స్త్రీల కే విషయములోను స్వాతంత్ర్య మీయరా దనిన, స్త్రీలకు బానిసతన మొసంగుట పురుషులకు హానియే యని యించుక సూక్ష్మదృష్టితో విచారించిన ప్రతివారికిని బోధపడక మానదు. ఎట్లన ప్రతిజీవుఁడును తన దేహయాత్ర నడపుటకు స్వశక్తి కలుగు పర్యంతము తల్లి పోషణముం దాధారపడియున్నాఁడు. శిశువు ప్రగోభివృద్ధికి తల్లియే మార్గదర్శకురాలుగ నున్నది. "సంసర్గజా పుణ్యగుణా భవంతి" యని తల్లులు విద్యావివేకములు గలిగి స్వతంత్రలై దేహమనోబలములు గలవారైనఁ గాని, బానిసతనమున కలవడిన తల్లిచే పెంపఁబడిన పిల్లలు తీవ్రబుద్ధి గలవారుగను స్వాతంత్ర్యేచ్ఛ గలవారుగను దేశాభిమానులుగను దేశోద్ధారకులుగను నెట్లయ్యెదరు? కావున స్త్రీల కున్నతవిద్యను గఱపి స్వతంత్రబుద్ధి కవకాశం బిచ్చుట పురుషుల శ్రేయోమార్గమునకే గాని స్త్రీల మేలుకొఱకుఁ గాదనియు, అంగాంగిభావమున స్త్రీపురుషు లన్యోన్యాశ్రయులై లోకయాత్ర నడపుచుందు రనియు గ్రహించి, స్త్రీలకు పురుషులతో పాటు ఉన్నతవిద్య నభ్యసించుట కవకాశం బిచ్చి, సమానస్వాతంత్ర్యము సమానగౌరవము నిచ్చి, యెవరి కనుకూలము లగు వృత్తులను వా రభ్యసించునట్లు చేయవలెను; గాని స్వతః ప్రమాణముగ సర్వకాలమును స్త్రీపురుషులకు శాశ్వతమైన యేకన్యాయమును నిర్ణయించి యేకవృత్తిని స్థాపించుటకు వీలు లేదు. దేశకాలావస్థలను బట్టి సర్వమును మార్చుకొనవలసి యుండును గాన, ఎప్పుడు మన స్త్రీలకు వివిధవిద్యలను నేర్పి యాచరణకు దీసికొని వచ్చెదరో యప్పుడే మన దేశ మభివృద్ధి నొందఁగలదు.

# అబలావిలాపము

బుడసుగుంట శివరామయ్య గారు

రణరంగమున శత్రురాజిభీకరముగ
సంచరింపదె మున్న సత్యభామ?
అక్బరంతటి వైరి నాజి జయింపదే
రాణి వీరాబాయి రౌద్ర మెసఁగ?
నిరుపమశౌర్యవార్నిధిఁ గుతుబుద్దీను
దురమునఁ దోలదే కరుణదేవి?
తన బాణనైపుణ్యమున కెఱ సేయదే
సంయుక్త రిపులను సమరమందు?
అట్టి యసమానశూరత్వ మతివలకును
గలుగఁజేయరె తొల్లింటి కాలమునను?
శస్త్రవిద్యల నేర్పక శక్తిహీన
లనుచు వాకొనఁదగునె మహాత్ములార! 1

సీ. శాంతి దీపింప రాజ్యంబుఁ బాలింపదే
వైరులఁ ద్రుంచి భవానిదేవి?
ప్రజలఁ దల్లియుఁ బోలె రక్షింపదే మున్న
రాణి రుద్రమదేవి శ్రమలఁ బాపి?
రాణి విక్టోరియా రాజ్యంబు చేయదే
సౌఖ్యంబు లొందంగ సర్వజనులు?
ధర్మంబు దప్పక ధరణి నేలదె యహ
ల్యాబాయి ధీరయై యరుల గెల్చి?
చక్రవర్తిను లైనట్టి చాన లుండఁ
దరుణు లుద్యోగములు చేయఁ దగ రటంచుఁ
బల్కు టేమిటి? కబలలపైని యింత
పంత మేటికి విడువుఁడీ భవ్యులార! 2

సీ. అతివ లున్నతవిద్య నభ్యసింపఁగరాదు,
ధవుని దైవంబుగాఁ దలఁపవలయు;
సంగీతమును నేర్వ సతులకుఁ గారాదు,
పాటలు సొంపుగాఁ బాడవలయు;
వ్యాయామ మొనరింప నబల లర్హులు గారు,
బండు చాకిరి చేయవలయు నెపుడు;
చనదు స్త్రీ లారోగ్యశాస్త్రంబులను జూడఁ,
బరిశుభ్రముగ నుండవలయు నిండ్లు;
అకట! యిది యేటి యన్యాయ మార్యులార!
తనకుఁ దెలియని విషయముల్ ధాత యైన
చేయఁజాలునె? యిఁకనైన స్త్రీల వివిధ
విద్యలను నేర్పఁజేయుఁడీ ప్రేమతోడ. 3

సీ. సూనులు సత్కార్యశూరులై చెన్నొంద
నెలఁతలు సుగుణలై నెగడవలయు;
తనయులు సుకవులై తనరంగఁ గాంతలు
గ్రంథకర్త్రు లౌచుఁ గ్రాలవలయు;
అరిభయంకరు లౌచు నాత్మజుల్ పెంపొంద
స్త్రీలు ప్రతాపలై చెలఁగవలయు;
బాలురు వితరణశీలురై విలసిల్లఁ
దరుణు లుదారలై తనరవలయు;
దేశభక్తులై బిడ్డలు తేజరిల్ల
దేశసేవకురాండ్రయి తెఱవ లెపుడుఁ
బొదలుచుండంగవలయును; బుత్రులకును
గన్నతల్లుల గుణములే కలుగుకతన. 4

సీ. ఆఁకొన్న యతిథిని నాపూఁట నిల్పంగ
నతివను ముందుగా నడుగవలయు;
అతిరిక్తుఁడౌ రోగి కౌషధం బిప్పింపఁ
బడఁతి యాజ్ఞను బొందవలయు ముందు;
బైరాగికిని నొక్క ప్రాఁత వస్త్ర మొసంగఁ
బొలఁతి శాసనమును బొందవలయు;
పసిబాలునకుఁ బ్రేమఁ బప్పుబెల్లముఁ బెట్టఁ
బూఁబోఁడి యనుమతిఁ బొందవలయు;
ఇంక స్వాతంత్ర్య మనునది యెందుఁ గలదొ
యెఱుఁగఁగారాదు మీకును బురుషులార!
తప్పు లేనిదె పైఁబడి తన్ని తిట్టు
టకును గడుపార భుజియించుటకును దప్ప. 5

సీ. సంస్కారవాదులు సధవలు గానట్టి
కాంతలకై గదా! గర్వు లగుట;
సంస్కారవాదులు స్వాతంత్ర్యహీన లౌ
యబలలకై గదా! యగడువడుట;
సంస్కారవాదులు చానల నుద్యోగి
నులఁ జేయుటకుఁ గదా! పలుచనగుట;
సంస్కారవాదులు సతుల కున్నతవిద్య
గఱపించుటకుఁ గదా! కష్టపడుట;
మడఁతులకు సౌఖ్యములు గూర్ప మదిని దలఁచి
పాటుపడుచుండు పుణ్యులఁ బరులవలెనె
నింద చేయఁగవచ్చునే? నెలఁతలార!
దాన దోషంబు గల్గదే ధరణియందు? 5

సీ. అసమానసాహిత్యులసమాన లైనచోఁ
దమ మాయలందునఁ దగుల రనుచు,
వేదాధికారంబు బిసరుహోతుల కియ్యఁ
దమ దురాచారముల్ దాఁగ వనుచు,
పతి లేని యబలల పరిణయంబులు నేయఁ
బనులచే నిల్లాలు బడలు ననుచు,
బాల్యవివాహముల్ పాసిన ద్రవ్యంబు
సమకూర్చు తంత్రముల్ సాఁగ వనుచు,

వేదవిద్యల నేర్వక వెలఁదులకును
పరిణయస్వేచ్ఛ నియ్యక భంగపఱచి
రండలకుఁ బెండ్లి చేయంగరా దటంచ్రు
స్వార్థపరతను విబుధులు వదలి దయను. 7

సీ. శాస్త్రప్రపంచంబు సమ్మతింపదు సుమీ
విధవావివాహంబు వెలఁదులకును;
శాస్త్రప్రపంచంబు సమ్మతింపదు సుమీ
ప్రౌఢావివాహముల్ పడఁతులకును;
శాస్త్రప్రపంచంబు సమ్మతింపదు సుమీ
చాన లున్నతవిద్యఁ జదువుటకును;
శాస్త్రప్రపంచంబుఁ సమ్మతింపదు సుమీ
శ్రుత్యధికారంబు సుదతులకును;

అని యశాస్త్రీయకర్మంబు లాచరింపఁ
దగ దని వచింప న్యాయమే? తండ్రులార!
ధర్మహీనము లసుఖప్రదంబులైనఁ
పనులనే చేయ, నివి చేలాఁ బాఁడి గాదె? 8

సీ. తనయలఁ దెగనమ్మి ద్రవ్యంబు నార్జింప
వేదంబు లొప్పెనే? విబుధులార!
బాల్యవివాహముల్ పఱపంగ శాస్త్రముల్
సమ్మతిఁ జెందెనే? సరసులార!
వందలాది ధనంబు వరశుల్కమునఁ గూర్ప
శాస్త్రంబు లొప్పెనే? చతురులార!
కూలంగ సత్యంబు కూటసాక్ష్యము పల్క
స్మృతు లొప్పెనే? సుధీశ్రేష్ఠులార!

నీతిబాహ్యంబులును శాస్త్రనిచయములను
గర్హితంబులు నైన యీ కార్యములను
నాచరింపఁగవచ్చునే? యార్యులార!
వీని కన్నిఁటికిని శాస్త్రవిధులు వలదె? 9

సీ. గ్రుడ్డివారికినైనఁ గుంటివారికినైన
ధర్మంబుఁ జేయంగఁదలఁచిరేని,
వనములనైనను బాటలనైనను
దయతోడ నిర్మింపఁదలఁచిరేని,
కూపంబులనునైన గుంటలనైనను
త్రవ్వింపఁగా మదిఁ దలఁచిరేని,
సత్రంబులనునైనఁ జాళ్లనైనను
కట్టింపగా సమకట్టిరేని,

మూర్ఖమానసలైనట్టి ముదిత లపుడు
భర్తలను నిందచేయుచు భంగమొందఁ
జేసెదరు కాన, విద్యను జెప్పి మిగుల
జ్ఞానవతులను జేయుఁడీ మానినులను. 10

సీ. అజ్ఞానవతియైన యతివను బెండ్లాడ
దిన మొక యేడుగా మనుట గల్గు;
అజ్ఞానవతియైన యతివను బెండ్లాడ
నక్కచెల్లెం ద్రశ్న యాస లేదు;
అజ్ఞానవతియైన యతివను బెండ్లాడ
దుర్వ్యయముల్ కావించు ధనము మ్రింగు;
అజ్ఞానవతియైన యతివను బెండ్లాడ
బంధువర్గముతోడి వైర మొదవు;

పెంకియైనట్టి యతివను బెండ్లియాడఁ
బడయఁగల్గును బడరాని బాధ లెల్ల;
కాన, సతులకు విద్యను గఱపుఁడయ్య
సౌఖ్యములు గల్గు మీకును సంతతంబు. 1'

సీ. విద్య చెప్పించిన విజ్ఞానవతు లయి
తగులఁగట్టిన మూర్ఖు దరియ రనుచు,
తరుణు లున్నతవిద్యఁ దగ నేర్చినంతనే
పురుషుని సౌఖ్యంబు లరయ రనుచు,
పొలఁతుల కక్షరంబులు నేర్పినంతనే
కులటలై పతులను గొల్వ రనుచు,
వెలఁదుల దయతోడ విద్యావతులఁ జేయ
విభుఁ డశక్తుఁడు గాఁగ విడుతు రనుచు,

తలఁతు రిది యేటి మౌర్ఖ్యంబు తండ్రులార!
చదువువలనను దోసఁగులు సమసిపోవె?
చదువువలనను సద్బుద్ధి షొదలకున్నె?
చదువు చందంబు తెలిసిన సరసులార! 12

సీ. విద్యచేఁ జెన్నొందు వీరమతీదేవి
వినయంబు దప్పెనే? విబుధులార!
ప్రబలమూర్ఖుండైన పతిని వీడెనె మున్ను
విదుషి సునీతి? యో విజ్ఞులార!
అనుపమవిజ్ఞాని యనసూయ నాథుని
శోకంపఁజేసెనే? సూరులార!
వ్యాధిపీడితుఁడైన వరు విడనాడెనే
నళినీమహాదేవి? నవ్యులార!

నిరుపమంబైన పతిభక్తి నెలఁతలకును
గలుగఁజేయుచు సుగుణత్వగరిమ నిచ్చు
విద్యవలనను జెడుదురు వెలఁదు లనుచుఁ
దలఁతు రిది యేటి మౌర్ఖ్యంబు? తండ్రులార! 18

సీ. విమలసచ్చారిత్ర విమలామహాదేవి
కాంతుని నేపాటి కలఁతపఱచె?
అపరసరస్వతి యన నొప్పు దమయంతి
నాథుని నేపాటి నమలి మ్రింగె?
అతిపరాక్రమశాలి యగు రాణి పద్మిని
ముదితున కేలాటి ముప్పుఁ దెచ్చె?
సంగీతసాహిత్యసరసయౌ సావిత్రి
భర్తను నేపాటి భంగపఱచె?

తక్కఁ గల రామ లందఱు మిక్కుటముగఁ
జదువ నేర్చియుఁ బతుల కసౌఖ్యములను
గలుగఁజేసిరె? యిది యెట్టి కాల మకట!
విద్యవలనను జెడుగులు వీడిపోవె? 14

# వ్యవసాయాభివృద్ధి — జరగవలసిన కృషి

గోటేటి జోగిరాజు గారు

వ్యవసాయమే మన ముఖ్యవృత్తి. వ్యవసాయాభివృద్ధియే మన యైశ్వర్యాభివృద్ధికి ముఖ్య సాధనము. ఇతర నాగరక దేశములలో ప్రజల కృషిచేతను, శాస్త్రజ్ఞుల పరిశోధనలవలనను, పరిపాలకుల సానుభూతి మూలమునను, వ్యవసాయ మెట్లభివృద్ధి గాంచి యున్నదో యింకను నెట్లు దినదినాభివృద్ధి గాంచుచున్నదో మనము వినుచున్నాము. అదే విధముగ మన దేశపు స్థితిగతుల ననుసరించి యుక్త విధమున మన పాలకులును మనమును నెంత కృషి చేసిన నంత శీఘ్రముగ వ్యవసాయ మీ దేశమునఁ గూడ నభివృద్ధి చెందు ననుటకు సందేహము లేదు.

వ్యవసాయాభివృద్ధికిఁగాను ఆంధ్రదేశమున రెండు విధముల కృషి జరగవలసి యున్నది. ఇందు మొదటిది విజ్ఞానాభివృద్ధి, అనఁగా వ్యవసాయదారులు తమ వృత్తితో సంబంధించిన పనుల నన్నిటిని బాగుగ నిర్వర్తించుకొనుటకు వలయు జ్ఞానమును పెంపొందించుట. రెండవది సౌకర్య కల్పనము, అనఁగా వ్యవసాయమున కనుకూలము లగు స్థితిగతులను కల్పించుట.

## విజ్ఞానాభివృద్ధి

జ్ఞానాభివృద్ధికి ముఖ్యసాధనము విద్యావ్యాపనము. మన దేశపు ప్రజలలో చాల భాగము (నూటికి 80 మందికి పైఁగా) విద్యావిహీను లగుటచేతనే వారి కాయా వృత్తులందలి విజ్ఞానమునం దభివృద్ధి లేక యన్ని వృత్తులును హీనస్థితికి వచ్చినవి. ఇంగ్లండు జర్మనీ జపాను మొదలగు దేశములందు కొంచె మించుమించు ప్రజ లందఱును విద్యావంతు లగుటచేతనే వారి విజ్ఞానము దినదినాభివృద్ధి గాంచి యన్ని వృత్తులును మంచి స్థితియం దున్నవి. ఆంధ్రదేశమందును ఆయా వృత్తులకు సంబంధించినవా రందఱును విద్యావంతు లగుటకు తగిన యేర్పాట్లు చేయుటయే వాని యభివృద్ధికి ముఖ్య సాధనము.

ప్రతి మనుజునికిని ప్రపంచమందు మెలఁగుటకు వలయు లోక పరిచయమును నీతిని కలుగఁజేయు సామాన్యవిద్య కొంత యావశ్యకము. ఇది గాక, ఆయా వృత్తులచే జీవించువారల కాయా వృత్తులకు సంబంధించిన జ్ఞానము గలుగుటకు కొంత ప్రత్యేకవిద్య యావశ్యకము. ఇట్టి ప్రత్యేకవిద్యకు సాంకేతికవిద్య యని పేరు. వ్యవసాయ సంబంధ మగు సాంకేతిక విద్య వ్యవసాయవిద్య.

సామాన్య విద్యావ్యాపనమును గూర్చి యిచట నంతగా వ్రాయఁ బని లేదు. దీని యావశ్యకతయు, దీనిని వ్యాపనము చేయు విధానములును పత్రికాపాఠకులకు తెలిసియే యుండును. ఇందుకు తగిన యేర్పాట్లను చేయుటకై మన నాయకులు దొరతనమువారిని తమ శక్తి కొలఁది ప్రోత్సహించుచున్నారు. ప్రజలచేత నున్న కొన్ని యితర ప్రయత్నములును జరగుచునే యున్నవి. కాని, విద్యయం దభిరుచి తక్కువగ నున్న మన దేశమున నిర్బంధవిధానము నమలులోఁ బెట్టినఁ గాని, విద్యావ్యాపనము దేశాభివృద్ధికి వలయునంత శీఘ్రముగ కలుగ నేరదు.

సామాన్యవిద్యయే మిగుల లోటుగ నున్న యీ దేశమున సాంకేతికవిద్య కొఱఁత యగుట వింత గాదు. మన దేశపు రైతులలో వ్యవసాయవిద్యను గూర్చి యెవరేని ప్రశంసించినయెడల వ్యవసాయము గూడ బడికిఁ బోయి నేర్చుకొనవలయునా యని యాశ్చర్యపోవుదురు. ఇంతవఱకు వ్యవసాయదారుల పిల్లలు తమ తండ్రితాతలనుండి వారలతోఁ గలసి పని చేయుచుండుటవలనఁ గలుగు ననుభవజ్ఞానముతోనే వ్యవసాయదారు లగుచున్నారు. కాని, ఇతర నాగరక దేశములందువలెనే మన దేశమునందును వ్యవసాయ మభివృద్ధి నొందవలెనన్న, ఈ యనుభవజ్ఞానమునకు తోడుగ ప్రకృతిశాస్త్రజ్ఞానముతోఁ గూడిన సక్రమమయిన వ్యవసాయవిద్యయు గూడ రైతుల పిల్ల లభ్యసించుటకు తగిన యేర్పాటు చేయఁబడవలయును.

రైతుల పిల్లలకు వ్యవసాయవిద్యను సామాన్యవిద్యతోపాటే గఱపుట మంచిది. మొదటినుండియు వ్యవసాయ మన నేమో తెలియకుండున ట్లిప్పటి పాఠశాలలలో కొంతవఱకు చదివి వ్యవసాయ మన నొక నీచవృత్తిగ భావించు స్థితికి వచ్చిన పిమ్మట వారలకు మరల వ్యవసాయమునం దభిరుచి పుట్టించుట కష్టము.

ఇపు డున్న గ్రామపాఠశాలలందే పిల్లలకు వ్యవసాయ విద్యాప్రవేశమునకు ఏర్పాట్లు చేయవచ్చును. వీనియందు బాలురకు చదువుట వ్రాయుట గణితము మొదలగునవే గాక, బడితోఁటలను నెలకొల్పి యందలి వివిధములగు చెట్టుచేమలను వానిని పెంచు విధానములను పరిశీలించునట్లు చేయుటచేతను, కొంత ప్రదేశమున బాలురే ఆయా జాతులను పెంచునట్లు చేయుటచేతను, వ్యవసాయ విద్యారంభము చేయవచ్చును. రైతుల పొలమునందు కూడ పిల్లల కాయా సస్యములను సాగుచేయు విధానములందు పరిచయమును గలిగింపవచ్చును. ఇపుడే వ్యవసాయమునకు సంబంధించిన ప్రకృతి శాస్త్ర విషయములను గూడ పిల్లల మనసున కెక్కింపవచ్చును. ఇట్లు గ్రామ పాఠశాలలలో 10, 11 సంవత్సరముల వయసు వచ్చువఱకు విద్య గఱచునప్పటికి బాలురకు కొంత ప్రపంచజ్ఞానమును సామాన్య వ్యవసాయ సాంప్రదాయముల పరిచయమును కలుగును. ఇప్పటి పాఠశాలలలో చదువు బాలురకువలె వ్యవసాయమునందు నిరసనభావము జనింపదు.

ఇట్లు కొంత విద్య నభ్యసించి తమ పెద్దలతో పాటు వ్యవ

సాయవృత్తికి దిగువారు పుస్తకపఠనమువలనను పత్రికాపఠనము వలనను అనుభవమువలనను తమ జ్ఞానమును వృద్ధిపఱచుకొని తమ పనులను మెలఁకువతో చేసికొనఁగలరు. ఇతరులచే సూచింపఁబడు వ్యవసాయాభివృద్ధిప్రధానములను సులభముగ గ్రహింపఁగలుగుదురు.

తమ గ్రామమును విడిచి పోఁదగిన వ్యవసాయదారుల బాలురీ విద్యను మరికొంతవఱ కభ్యసించుటకు తగిన యేర్పాట్లు గూడ మన దేశమున జరగవలసి యున్నవి. ప్రత్యేక వ్యవసాయ పాఠశాలలను స్థాపించుట యిందు కొక సాధనము. ఇట్టి పాఠశాల లింతవఱ కాంధ్రదేశమున నెచటను లేవు. కాని, మన సామ్రాజ్యశాసన సభ్యులును ఆంధ్ర జమీదారులలో నొకరును అగు శ్రీ పానుగంటి రామారాయణింగారు కాళహస్తి నగరమున నొక వ్యవసాయ పాఠశాలను స్థాపించుట కేర్పాట్లు చేయుచున్నారు. పాఠశాలకొఱకు చక్కని మందిరము కట్టింపఁబడెను. ఆంధ్రదేశమున పేరునకైన లేని యిట్టి వ్యవసాయ విద్యాలయమును స్థాపించుటయం దందఱికి మార్గదర్శకు లగు శ్రీ రామారాయణింగారి యౌదార్య మెంతయు శ్లాఘనీయము. మచిలీపట్టణమునందలి యాంధ్ర జాతీయ కళాశాలయందుఁ గూడ వ్యవసాయవిద్య గఱపుట కేర్పాట్లు జరగుచున్న వని వినుటకు మిగుల సంతసింపవలసియున్నది.

ప్రస్తుత స్థితి గతులం దిట్టి పాఠశాల లనేకము స్థాపించుటకు వీలు లేకపోవచ్చును. ఎచ్చటనైన నొకటి రెండు స్థాపించిన మాత్రమున నవి యందఱకును నందుబడిగ నుండవు. కావున నిట్టి పాఠశాలలను నెలకొల్పుటకు తోడు ఇప్పటి యున్నత విద్యాలయములందే కొన్నిటియందు వ్యవసాయ విద్యాభ్యాసమునకుఁ గూడ ఏర్పాట్లు చేయుట యుక్తము. ప్రత్యేక వ్యవసాయ పాఠశాలలను నెలకొల్పుటకంటె నిది సులభసాధ్యము. వ్యవసాయమునకు సంబంధించిన ప్రకృతిశాస్త్రములను బోధించుటకు తగిన సాధన సామగ్రి యిప్పటి యున్నతపాఠశాలలం దిదివఱకే చాలవఱ కుండి యుండును. ఒక చిన్న వ్యవసాయక్షేత్రమును జేర్చి యొకరిద్దఱుపాధ్యాయులను నేమించినయెడల నీ యున్నత పాఠశాలలందు సామాన్యవిద్యతో పాటు కొందఱు బాలురకు స్కూలు ఫైనలు తరగతివఱకుఁ గూడ వ్యవసాయవిద్యను గఱపవచ్చును.

గోదావరి జిల్లాలోని కోటరామచంద్రపురమునఁ గల యున్నత పాఠశాలయం దిట్టి యేర్పాట్లు చేయుటకు యత్నములు జరగుచుండె నని కొంత కాలము క్రిందట వినవచ్చెను కాని, యీ కృషి యెంతవఱకు క్రియారూపమును దాల్చెనో తెలియలేదు. పిఠాపురమున శ్రీ రాజాగారి యున్నత పాఠశాలయు వ్యవసాయ క్షేత్రమును ఒకదాని సమీపమున నొకటి యున్నవి. ఈ రెండును నొకేచోట నుండుటచే నిచట వ్యవసాయ విద్యా బోధనమున కేర్పాట్లు చేయుట మిగుల సులభమైన పని. విద్యాభిమాను లగు రాజాగారి యౌదార్యమువలన నిట్టి యేర్పాట్లు శీఘ్రముగ చేయఁబడును గాక!

ఇట్టి పాఠశాలలందు సామాన్య విద్యతో పాటు వ్యవసాయ విద్యను గూడ కఱచువారలు తమ వ్యవసాయము నభివృద్ధి చేసికొనుటకు కొంతవఱకు తామే కృషి చేయఁగలుగుదురు. వ్యవసాయదారులలో చాల భాగ మిట్టివార లగునెడల వ్యవసాయము మిగుల శీఘ్రముగ నభివృద్ధి చెందఁగలదు.

ఈ పాఠశాలలలో నన్ని విషయములును తెలుఁగు భాష మూలముననే నేర్పుట యుచితము. బాలురకు ఇంగ్లీషు నేర్ప నవసరము లేకపోలేదు కాని, మొదట నీ భాషను నేర్పి దీని మూలముననే ప్రకృతిశాస్త్రాదికములను నేర్పఁజూచుటవలన ననవసరమగు కాలహరణమును విద్యార్థుల కధికప్రయాసమును కలుగును. ఇపుడిపుడు తెలుఁగునఁ గూడ ప్రకృతిశాస్త్రగ్రంథములు చాలవఱకు ప్రచురింపఁబడుటచే వీని నింగ్లీషుననే నేర్ప నవసరము లేదు.

ఇంకను నుత్తమ వ్యవసాయ విద్యయు శాస్త్రజ్ఞానమును సంపాదింపఁ గోరువారలకొఱకు ప్రత్యేకముగ వ్యవసాయ కళాశాల లుండవలెను. ఇట్టి కళాశాల యొకటి మన రాజధానియం దిపుడు కోయంబత్తూరులో మాత్రము గలదు. ఇది యాంధ్రదేశమునకు మిగుల దూరస్థ మగుట చేతను, ఆంధ్రదేశపు స్థితిగతులకును కళాశాల యున్న ప్రదేశపు స్థితిగతులకును చాల వ్యత్యాస ముండుటచేతను, ఈ రెంటికంటెను నెక్కుడుగ కోయంబత్తూ రేఁటేఁట ప్లేగువ్యాధి కనఁబడు పట్టణ మగుటచేతను, ఆంధ్రవిద్యార్థుల కా కళాశాల యంత యాకర్షకముగ లేదు. అయినను, ఈ నడుమ కొందఱు తెలుఁగు విద్యార్థులు చొరవచేసి యచటికి పోవుటయు గతసంవత్సరము విద్యార్థులకు పరీక్షల పర్యవసానమును బట్టి యొసంగఁబడిన బంగారు పతకములును ఇతర బహుమతులును అన్నియు తెలుఁగు విద్యార్థులకే లభించుటయు సంతృప్తికరములు. ఇట్టి కళాశాల యాంధ్రదేశ మధ్యముననే యున్నయెడల ఆంధ్ర విద్యార్థులు దీనివలన నింకనెంతయో లాభమును పొందఁగలుగుదురు. ఇట్టి విద్యాలయమును మరియొకదానిని తెలుఁగు దేశమున నెలకొల్పుట ఇప్పటి స్థితిగతులందు సులభసాధ్యము కాకపోయినను, ఇపు డాంధ్రు లందఱు ఆశించుచున్న ఆంధ్రవిశ్వవిద్యాలయముతో పాటైనను ఇది యాంధ్రులకు లభింపకుండునా ?

కోయంబత్తూరునందలి వ్యవసాయ కళాశాల కిపుడు ఏ స్కూలు ఫైనలు పరీక్షవఱకో సామాన్య విద్య నభ్యసించి వ్యవసాయమున నభిరుచి గాని యనుభవము గాని లేశమైన లేనివారలే చాలమంది పోవుచున్నారు. వీరలు వ్యవసాయానుభవమును శాస్త్రజ్ఞానమును గూడ నచట చదువు కొద్ది కాలముననే సంపాదింపవలెను. ఇట్లు గాక, యిదివఱలో ప్రశంసింపఁబడిన ఉన్నత పాఠశాలలందు వ్యవసాయవిద్యను గూడ కఱచినవారలలో సమర్థు లీ కళాశాలకు పోయినయెడల నదివఱకే వ్యవసాయవిషయములు చాలవఱకు తెలిసి యుండుటచే సామాన్య విషయములను విడిచి, యచట మాత్రమే లభించు నుత్తమశాస్త్రజ్ఞానమును సంపాదించుట కెక్కువ యవకాశ ముండును. వీరలు అనుభవమును శాస్త్రజ్ఞానమును గూడ కలిగియుండుటచే నిప్పటి కళాశాలా విద్యార్థులకంటె మన దేశపు వ్యవసాయము నభివృద్ధికి తెచ్చుటయం దెక్కువ సమర్థులయి

యుండురు.

వ్యవసాయదారులకుఁ గాని వారి పిల్లలకుఁ గాని వ్యవసాయజ్ఞానమును గలిగించుటకు మొదట నిట్టి జ్ఞానము బాగుగఁ గలవారు కొందఱుండవలయును గదా. ఈ విజ్ఞానమును సంపాదించుటకును వ్యాపింపఁజేయుటకును దొరతనమువారు తమ పరిపాలనమున ప్రత్యేకముగ వ్యవసాయశాఖ నేర్పఱచియున్నారు. ఈ శాఖచేతనే పాలితమగుచున్న కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలయం దుత్తమపరీక్షయందు తేరు విద్యార్థులు చాలవఱకీ విజ్ఞాన సంపాదనమునందును వ్యాపనమునందును నియోజితులగుచున్నారు.

విజ్ఞానసంపాదనమునకు అన్వేషణ మావశ్యకము. వ్యవసాయ సంబంధములగు విషయముల నన్నిటిని ప్రయోగముల మూలమున బాగుగ పరీక్షించి లాభకరములగు నూతనవిధానముల నరయుటకు వ్యవసాయశాఖవారు పాశ్చాత్యదేశములందు విద్య నభ్యసించిన కొందఱు వ్యవసాయశాస్త్రజ్ఞులను ఇతర శాస్త్రజ్ఞులను నియమించియున్నారు. వీరును వీరి సహకారులును కోయంబత్తూరునందలి వ్యవసాయాన్వేషణశాలయందును ఇతరస్థలములలో స్థాపింపఁబడిన వ్యవసాయ స్థానములందును కృషి చేయుచున్నారు. ఈ కృషితో పాటే వ్యవసాయ కళాశాలయం దేఁటేఁట కొందఱు విద్యార్థులును తయారు చేయఁబడుచున్నారు. వీరి సంఖ్య వృద్ధియయిన కొలఁది అన్వేషణమును విస్తరించుట కవకాశము కలుగును. వ్యవసాయ పాఠశాలలం దుపాధ్యాయులుగ నుండఁదగినవారును తగినంతమంది లభింతురు. ఇప్పటి వ్యవసాయ స్థానములును అన్వేషణమునకు నియమింపఁబడిన యుద్యోగస్థులును . ఈ మహాకార్యమునకు చాలనియే యీనడుమ వ్యవసాయశాఖా విజృంభణమునకు దొరతనమువా రుత్తరువు లొసఁగియున్నారు.

ఇదివఱకే వ్యవసాయశాఖవారి కృషివలన ఆంధ్రదేశమునకు కొంత లాభము కలిగెను. చామర్లకోట వ్యవసాయస్థానమునందలి కృషివలననే గదా, గోదావరి జిల్లాలో తెగులుచే నడుగంట నున్న చెఱకుసాగు, తెగులంతగా పట్టని మారీసు చెఱకు విత్తనము రైతులకు లభింప, మరల తల యెత్తెను. ఎకరమునకు 10-15 కుంచముల వఱకు విత్తులు చల్లి వరిని పైరుచేయు దురభ్యాసము గల కొన్ని చోట్ల రైతులు వ్యవసాయశాఖవారి కృషిచేతనే గదా యిపుడు 3-4 కుంచముల విత్తులతో మంచి పంటలు పండించి లాభమును పడయఁగలుగుచున్నారు! ఆయా వ్యవసాయస్థానములం దాయా సస్యముల నెట్లు పైరు చేయుట లాభకరమో దుక్కి మొదలగు పనులకు ఏ పనిముట్లనుకూలమో ఏ సస్యమునకే యెరువు వేయుట లాభకరమో మొదలగు విషయము లనేకము పరీక్షింపఁబడుచున్నవి. మెట్టనేలల యొక్కయు తోఁటలయొక్కయు దుక్కికి 'మన్‌సూన్' అను నినుప నాగలి యుపయోగకరముగ నుండునని కనుఁగొనఁబడెను. వరికి ముందు జనుము జీలుగు మొదలగు సస్యములను పైరుచేసి పచ్చి యెరువుగ దున్ని వేయుటయు, దీనికి తోడుగ ఎముకల పొడి గాని అధిస్ఫురితములు గాని యుపయోగించుటయు లాభకర మని కూడ తేలెను. పొటాష్ ఎరువులు సామాన్యముగ నవసర ముండ దనియు నిర్ధారణ చేయఁబడెను. వరి జొన్న చోడి కొఱ్ఱ గంటె ప్రత్తి మొదలగు సామాన్య సస్యము లన్నిటిలోను ఎన్నిక నుత్తమమైన వంగడములను ఏర్పఱచి రైతులకు విత్తుల నందఁజేయుటకు యత్నములు జరగుచున్నవి. ఇందున కాయా వ్యవసాయ క్షేత్రములందు జరగుచున్న కృషియే గాక ప్రత్యేక కృషికిఁగాను కొందఱు వృక్షశాస్త్రజ్ఞు లేర్పఱుపఁబడిరి. ఇందొక రిపుడు వరిని గూర్చి ప్రత్యేక పరిశోధనల నారంభించియున్నారు. ఇంకొకరు చెఱకు విత్తులను మొలపించి వానినుండి పుట్టు మొక్కలలో నిదివఱ కున్న రకములకంటె నెక్కువ చక్కెర గలవానిని వృద్ధి చేసి, జావా ద్వీపమునందు వలెనే ప్రశస్తమయిన క్రొత్త రకములను సృష్టించుటకయి యత్నించుచున్నారు. ఈ కృషి యిదివఱకే కొంతవఱకు సఫలమైనది. సామాన్యపు చెఱకు రసములలో నూటికి 15-20 వఱకు చక్కెర యుండ, క్రొత్తగా నేర్పడిన రకములలో 20 పాళ్ల కెక్కువ చక్కెర గలవి రెండు బైలుదేఱెను. ప్రత్తి విషయమున సామాన్యపురకము నూటికి 25 పాళ్ల చొప్పున దూది నిచ్చుచుండ, ఎన్నికవలన నూటికి 29 పాళ్ల వఱకు ప్రశస్తమయిన దూది నిచ్చు వంగడము నేర్పఱచి వృద్ధిచేసి వ్యవసాయశాఖవా రిపుడు తిన్నెవెల్లి జిల్లాలోని రైతులకు విత్తులను పంచిపెట్టుచున్నారు.

ఈ శాఖయందలి రసాయనశాస్త్రజ్ఞుఁ డొకఁడు నేలల విషయమయిన పరీక్షను జరపుచున్నాఁడు. గుంటూరు జిల్లాయందలి డెల్టా భూములలోని ముఖ్యాహార ద్రవ్యముల లోటుపాట్లను కనుఁగొనుట కనేకములగు నేలల నీయన పరీక్షించెను. ఈ పరీక్షకు సంబంధించిన పట్టీలును పటములును కొద్ది కాలములో ప్రచురమగు నని తెలియ వచ్చుచున్నది. ఈ శాస్త్రజ్ఞుఁడే వరి నేలలందు పుట్టు వాయుపదార్థములను గురించి కొన్ని విలువయైన పరిశోధనల నీనడుమ జరపియున్నాఁడు. కొన్ని నేలలలో పచ్చి యెరువు వేసినపుడు పంట హెచ్చుటకు బదులు తగ్గుట, కొన్ని నేలలను మెట్టదుక్కి దున్ని తరువాత వరిపైరు పెట్టినయెడల బాగుగ ఫలింపక పోవుట మొదలగు, ఇంతవఱకు సరియైన కారణము తెలియని విషయము లీ పరిశోధనలవలనఁ దేలునని తోఁచుచున్నది. ఈ పరిశోధన లింకను జరగుచుండుటచే పర్యవసాన మిపుడు నిర్ధారణచేయ వీలు లేదు.

ఈ శాఖయందలి శిలీంధ్ర శాస్త్రజ్ఞుఁడు కృష్ణా గోదావరి జిల్లాలలోని తాటిచెట్ల తెగులును పడమటి సముద్ర తీరమున విజృంభించుచున్న పోక చెట్ల తెగులును నివారించుటకు కృషిచేయుచున్నాఁడు. మలబారు జిల్లాయందును దక్షిణకనరా జిల్లాయందును ఈ శాస్త్రజ్ఞుఁడు చెప్పిన నివారణోపాయము యొక్క లాభము నొక సంవత్సరము చూచి చాలమంది రైతు లిపుడు తమంతట తామే యీ కృషిని కొద్ది వ్యయముతో చేసికొని పోక పంటను కాపాడుకొనుచున్నారు. కొబ్బెర మువ్వలకు పట్టు తెగులును వరిలో క్రొత్తగ బయలుదేఱిన యొక తెగులును మిరపకాయలకు పట్టిన తెగులును అరఁటి చెట్లకు పట్టు తెగులును, ఇట్టి తెగు ళ్లనేకము లీశాస్త్రజ్ఞు

నిచే పరిశోధింపఁబడుచున్నవి.

ఆయా సస్యములకు పట్టు చీడపురుగుల స్వభావమును గని పట్టి నివారణోపాయములను తెలిసికొనుటకీ శాఖయందొక కీటక శాస్త్రజ్ఞుఁడు కృషి చేయుచున్నాఁడు. దక్షిణ హిందూదేశమందలి కీటకములను గుఱించి పెక్కు పటములతో నలరారు నొక యమూల్య గ్రంథమును ఈ పదవియందు కోయంబత్తూరులో ముందుండిన ఫ్లెచ్చర్ అను నాయన రచియించియున్నాఁడు. (వెల రు 6.) ఈ గ్రంథమును చదివినవారికి అన్వేషణ మెంత కష్టమైన పనియో ఒక్కొక నూతన విషయము కనుఁగొనుట కెంత యన్వేషణ మావశ్యకమో తెలియఁగలదు. ఇప్పటి కీటక శాస్త్రజ్ఞుఁడు మామిడిచెట్ల కొక విధమగు చిన్న పురుగులవలనఁ గలుగు తేనె మంచుచేఁ గలుగు నష్టమును నివారించుటకుపాయమును కనుఁగొని సేలము జిల్లాయందలి యొక తోఁటలో పరీక్షించియున్నాఁడు. వరి పైరునందు ఊచ తిరి పురుగులవలనఁ గలుగు నష్టము నివారించుటకును నుపాయ మరయఁబడుచున్నది. కోడు అను వరికి పట్టు తెగులొక విధమగు పురుగు వలనఁ గలుగుచున్నట్లు కనిపెట్టఁబడెను. ఆ పురుగుయొక్క జీవనము పరీక్షింపఁబడుచున్నది. ఈ శాస్త్రజ్ఞుఁడే పట్టుపురుగుల విషయమయి కూడ కొంత విలువయైన కృషి సల్పియున్నాఁడు.

వ్యవసాయశాఖవారిట్లాయా శాస్త్రజ్ఞుల మూలమున వ్యవసాయమునకు సంబంధించిన యన్వేషణము జరగించుచున్నారు. కాని, శీతోష్ణాదిస్థితిగతులందును నేలల స్వభావమునందును ఈ రాజధానియందలి వివిధభాగములలోను మిగుల వ్యత్యాసము లుండుటచే ఈ శాఖవారి కృషి యింతకంటె శీఘ్రముగ ఫలించుటకవకాశము లేకున్నది. ఈ శాఖయందలి యున్నతోద్యోగులు పాశ్చాత్యదేశీయులగుటచే వారలీ దేశపు స్థితిగతులను తెలిసికొనుటలోనే కొంత కాలము గడచిపోవును. మన దేశమునందో యన్వేషణమునకు తగినంత యుత్తమశాస్త్రజ్ఞానము గలవారరుదు. అయినను, ఇపుడిపుడు మన దేశస్థులు గూడ చాలమంది విదేశములకేఁగి ఆయా శాస్త్రముల నభ్యసించి వచ్చుచుండుటచేతను, ఇచ్చటి వ్యవసాయకళాశాలయందును ఇతరకళాశాలలందును అన్వేషణకు తగినంత శాస్త్రజ్ఞానము గలవారు కొందఱు బయలుదేఱుచుండుటచేతను, ఇఁకమీఁద నీకొఱఁత యంతగా నుండరాదు. ఇట్టివారి సంఖ్య వృద్ధియయి వీరలే విస్తారముగ నన్వేషణకు నేమింపఁబడిన, వీరలకీ దేశపు స్థితిగతులు బాగుగ తెలిసియుండుటచే వ్యవసాయశాఖయొక్క కృషిఫలమిప్పటికంటె శీఘ్రముగ కలుగును.

ఇంగ్లాండు మున్నగు దేశములలో వ్యవసాయాభివృద్ధికి పరిపాలనచే నేమింపఁబడిన శాస్త్రజ్ఞులే గాక ప్రజలందే ధనవంతులును అన్వేషణాభిలాషులును నగు కొందఱుదారమతులు గూడ తమ జీవితమును వ్యవసాయాభివృద్ధిమార్గములో నరయుటయందుఁ గడపుచున్నారు. ఆ దేశములందలి వ్యవసాయముయొక్క శీఘ్రాభివృద్ధికిది యొక కారణము. ఆంధ్రదేశమునందును ఇట్టికృషి కొంత జరగుట యుక్తము. కాని, యన్వేషణాభిలాష గలవారికి ధనమును, ధనము గలవారికి శాస్త్రజ్ఞానమును అన్వేషణాభిలాషయు కుదురుటరుదు. ఆంధ్రదేశమునందలి జమీందారులు మొదలగు ధనికులు శాస్త్రజ్ఞానము గలవారిని ప్రోత్సహించి కొంత యన్వేషణమును జరపించి వ్యవసాయాభివృద్ధికి తోడ్పడుదురుగాక.

అన్వేషణమూలమున సంపాదింపఁబడు విజ్ఞానమును, ఇదివఱలో ప్రశంసింపఁబడిన గ్రామపాఠశాలల మూలమునను ఉన్నతపాఠశాలల మూలమునను, బాలురకు కొంతవఱకు కలుగఁజేయవచ్చును. కాని, యిపుడిట్టి విద్య లేకయే వ్యవసాయవృత్తి నవలంబించుచున్న రైతులకును, ఇఁక ముందైనను పాఠశాలలకు పోయి వ్యవసాయ విద్య నభ్యసింపఁజాలనివారికిని, ఈ విజ్ఞానము మఱియొక విధముగ వ్యాపింపఁజేయవలసి యుండును. ఆయా జిల్లాలయందలి వ్యవస్థానములు కొంతవఱకీ విజ్ఞానవ్యాపనమునకు సాధనములగుచున్నవి. అందలి యుద్యోగులు నూతన విధానములను చుట్టుపట్ల రైతులకు చూపి వ్యాపింపఁజేయుచున్నారు. కొన్ని జిల్లాలలో నీ వ్యాపనమునకు ప్రత్యేకముగ కొందఱుద్యోగులు నేమింపఁబడియున్నారు. ఈ కృషికి తోడు దేశభాషలలో నూతన విషయములను గుఱించి కరపత్రములు మున్నగునవి ప్రచురింపఁబడుచున్నవి. ఇంత కృషి చేయఁబడుచున్నను రైతులలో చాల భాగము విద్యాహీనులగుటచే నీ కృషికి వారి సానుభూతి యంతగా లేకున్నది. వారికింకను నీ శాఖోద్యోగులందు తగిన విశ్వాసమును భక్తియు కుదురలేదు. వ్యవసాయశాఖవారును రైతుల సానుభూతి కుదురువఱకును బాగుగ పరీక్షింపఁబడినట్టియు రైతులకు తప్పక యుపయోగించునట్టియు విధానములనే మిగుల జాగ్రత్తతో వ్యాపింపఁజేయుటకు యత్నింపవలెను.

## సౌకర్యకల్పనము

వ్యవసాయము లాభకరముగ నుండుటకు రైతు జ్ఞానవంతుఁడగుటయే గాక యింక ననేక స్థితిగతు లనుకూలముగ నుండవలెను. శీతోష్ణాది స్థితిగతుల యనుకూలత మొదటిది. మనుష్యుల యొక్క గాని, యితర జంతుజాలముల యొక్క గాని, చెట్టు చేమల యొక్క గాని, అభివృద్ధియు నారోగ్యమును చాలవఱకు శీతోష్ణాది స్థితుల ననుసరించియే యుండును. ఈ స్థితిగతులు చాలవఱకు ప్రకృత్యధీనములగుటచే వీనిని మార్చుటకు వ్యవసాయదారుని కంతగా సాధ్యము కాదు. కాని, వ్యవసాయదారుఁడెట్టి స్థితిగతులందు తాను పైరు చేయు సస్యముల నెట్లు పెంచవలెనో తెలిసికొనఁగలుగు శక్తిమీఁదనే వ్యవసాయమువలని లాభనష్టములు చాలవఱ కాధారపడియున్నవి. ఈ శక్తి నిచ్చునది వ్యవసాయ విద్యయే.

వ్యవసాయము లాభకరముగ నుండుటకు వలయు స్థితిగతులలో నేలయొక్క ప్రాశస్త్యము రెండవది. ఇదియు కొంతవఱకు ప్రకృత్యధీనమే యయినను మన ప్రయత్నమున కిందు కొంత యవకాశము గలదు. వ్యవసాయదారులు తమ నేలల భౌతిక రాసాయనిక ధర్మములను గనిపెట్టి యందలి లోటుపాట్లను కొంతవఱకు తీర్చుకొనవచ్చును. ఇందుకు వలయు జ్ఞానమును వ్యవసాయ విద్యామూల

మున కలుగఁదగినదే.

నీటివసతి వ్యవసాయమునకు వలయు సౌకర్యములలో మూఁడవది. ఇదియుం గొంతవఱకు ప్రకృత్యధీనమే యయినను మానవకృషి వలన కలుగఁదగిన సౌకర్యములలో వ్యవసాయమున కింతకంటె నెక్కువగ తోడ్పడునది మఱియొకటి లేదు. నీటివసతి యున్నయెడల రైతు లెల్లప్పుడును నేదో యొక పైరును పెంచి విస్తారముగ లాభమును తీయఁగలుగుదురు. నీటివసతి శీతోష్ణాది స్థితిగతులందలి లోటుపాట్లను కొంతవఱకుఁ గప్పును. నీటి వసతి యున్నయెడల రైతు తన కృషి యెన్నఁడును నిష్ఫలము గాదను ధైర్యముతో మిగుల శ్రద్ధ వహించి పని చేయును. తానెంత పాటుపడినను చివర కొక వర్షము తక్కువయినచో పైరంతయు నెండిపోవలసి వచ్చునెడల రైతున కేమి యుత్సాహ ముండును?

ఇపు డున్న యానకట్టలు చెఱువులు మొదలగు నీటి పనులు గాక యింకను నిట్టి నీటివసతులను నిర్మించుట కాంధ్రదేశమున నెచ్చెచట నవకాశము గలదో శాస్త్రజ్ఞులచే శోధింపఁజేసి తెలిసికొనుటయు తగిన కట్టడములు కట్టించుటయు దొరతనమువారి మూలమున జరగవలసిన పనులు. ఈ విషయమయి ప్రజలు తమ ప్రతినిధుల మూలమున ప్రభుత్వమువారి నెంత ప్రోత్సహించిన వ్యవసాయాభివృద్ధి కంత యనుకూలము.

రైతులు తమంతట తాము నిర్మించుకొనఁదగిన నీటి వసతులు నూతులు. నూతుల యాధారమున కష్టపడి విలువయైన సస్యములను పైరుచేసి ధన మార్జించుటలో మన రాజధానియందలి రైతులందఱిలో కోయంబత్తూరు జిల్లావారు ప్రవీణులు. ఇతరులును వీరి వలెనే సాధ్యమైనంతవఱకు నూతులను నిర్మించుకొని లాభకరమగు సస్యములను సాగు చేయుట మంచిది.

నూతుల విషయమయి మూఁడు చిక్కులు గలవు. బావి త్రవ్వుచోట నీరుపడునో లేదో యను సంశయ మొకటి. ఎంతో వ్యయముచేసి బావి త్రవ్వి పిమ్మట నీరు లభింపనియెడల నట్టినష్టమును భరించుట మిగుల కష్టము. ఇందువలననే చాలమంది రైతు లీ యత్నమే మానుదురు. నీ రెచట లభించునో యెచట లభింపదో తెలుపఁగల యంత్ర మొకటి యానడుమ బొంబాయి రాజధానియందు పరీక్షింపఁబడుచుండె నని తెలియవచ్చెను. ఇది యుపయోగకారియే యైనయెడల వ్యవసాయశాఖవా రిట్టి యంత్రములను కొన్నిటిని దెప్పించి వాని మూలమున రైతులకు నీరు లభించు స్థలములను చూపుటవలన నెంతయో మేలు కలుగును.

కొన్నిచోట్ల గొట్టములను దింపినయెడల పాతాళవాహినులు గాని అవాంతరపాతాళవాహినులు గాని బయలుపడును. చెంగల్పట్టు జిల్లాలో కొన్ని భాగములందు పరిశ్రామికశాఖవారు నాళికలను దింపి పరీక్షించి యిట్టి వాహినులు లభించు ప్రదేశములను సూచించియున్నారు. చాలమంది రైతు లా ప్రదేశములందు నూతులు త్రవ్వి గొట్టములను దింపించుటచే విశేషజలము లభించుచున్నది. ఇట్టి ప్రదేశము లాంధ్రదేశమునందును ఉండకపోవు. గోదావరి జిల్లాలోని సామర్లకోట ప్రాంతములందు కొన్ని వాహిను లిట్టివి గలవు. ఆ చుట్టుపట్టులను ఇంక నితర ప్రదేశములను శోధించి యిట్టి వాహిను లుండఁగల ప్రదేశములను నిర్దేశించినయెడల రైతులు మిగుల లాభము పడయఁగలరు. ఈ పని యిఁకమీఁద పరిశ్రామికశాఖనుండి వ్యవసాయశాఖకు మార్పఁబడుట కుత్తరువు లయియుండుటచే కొంత చుఱుకుగ జరగవచ్చును. నూతుల నిర్మాణమునందలి కష్టము వాని వృద్ధికి మఱియొక యవరోధము. మంచి జలలు పడుచోట్ల కట్టుపని జరుగునపుడు నీటిని చుఱుకుగ తోడివేయు సాధనములు లేక కట్టు తగినంత లోఁతునకు దిగకమునుపే యొడ్లు విఱిగిపడి నూయి పూడిపోవుటయు నితర ప్రమాదములును తటస్థించుచుండును. వీనికి భయపడి పెక్కు నూతులు పైపైనే కట్టఁబడుచున్నవి. ఇందువలన వీని నుండి తగినంత నీరు లభించుట లేదు. కావున వ్యవసాయశాఖవారు నూతులను నిర్మించుకొనువారలకు నీరు తోడుటకై తైల యంత్రములను కర్షకయంత్రములను సులభముగ లభించుట కేర్పాటు చేసినయెడల నూతుల సంఖ్య యిప్పటికంటె కొంత చుఱుకుగ నభివృద్ధి చెందును.

నీటిని నూతుల నుండి పైకి తోడుటయందలి కష్టము నూతుల క్రింది వ్యవసాయము విస్తరించుటకు మరియొక యాటంకము. కాని, తగిన కృషి చేసినయెడల నీ కష్టమునకు తగిన ఫలము గలుగును. నూతు లెల్లప్పుడును నీటి నిచ్చుటచే వీని క్రింద సర్వకాలములందును సస్యములను పైరు చేయుచునే యుండవచ్చును. సామాన్యపు బావులలో నీటిని తోడుటకు ఏతమును మోటయు నుపయోగింపవచ్చును. మంచి జలలు గాని అవాంతర పాతాళవాహినులు గాని గల నూతులనుండి నీటిని తోడుటకు తైలయంత్రములను మధ్యావర్తక జలాకర్షక యంత్రములను నుపయోగించుట లాభకరము. ఈ సందర్భమున రైతు లొక విషయమును జ్ఞాపక ముంచుకొనవలెను. నూతిలో నీరు తక్కువగ నున్నదని ఏదో యొక చిన్న యంత్రమును తెచ్చి పెట్టునెడల అది వడ్డీరూనెతో సరిగా పనిచేయక మిగుల చిక్కులు పెట్టును. $6\frac{1}{2}$ మొదలు 9 గుఱ్ఱముల శక్తికి తక్కువ గల యంత్రములు గాని 3 అంగుళముల కంటె చిన్న గొట్టము గల జలాకర్షక యంత్రము గాని కొనుట మంచిది కాదు. వీనికి తగినంత నీరు లేని యెడల మోట నుపయోగించుటయే యుచితము. పారిశ్రామిక శాఖవారికి 10 రూపాయల రుసుము కట్టినయెడల నీ విషయమయి తగిన సలహా నిత్తురు. వర్షకాలమున నీరు తోడు పని లేనపుడు తైలయంత్రముల నితరమగు పనుల కుపయోగింపవచ్చును. దీనిచే బియ్యపు మఱలను తోలింపవచ్చును. ఇందుకు 14 గుఱ్ఱముల శక్తికి తక్కువ గల యంత్రములు పనికిరావు. చెఱకు గానుగను త్రిప్పుటకుఁ గాని ప్రత్తి రాట్నమును నడపుటకుఁ గాని చొప్ప కత్తిరించు మఱను త్రిప్పుటకుఁ గాని తైలయంత్రము పని లేని కాలములలో నుపయోగించును.

జలనిర్గమన మార్గముల నేర్పఱచుట వ్యవసాయాభివృద్ధికి తోడ్పడు సౌకర్యములలో మఱియొకటి. పైరు బాగుగ నెదుగుటకు నీ రెంత యావశ్యకమో యది యమితము గాకుండుటయు నంత

యావశ్యకమయి యున్నది. ఎక్కువ వర్షము కురిసినప్పుడు నీరు త్వరలో నడిచిపోవుటకు వీలు లేనియెడల నది నిలుచుటచే సస్యములకు మిగుల నష్టము గలుగును. ఇట్టి నష్టము డెల్టా నేలలలో నెక్కువగ నున్నది. దీనికి ప్రతీకారముగ దొరతనమువారు కొన్ని కొన్ని పనుల నిదివఱలో చేసియున్నను, ఇంకను జరగవలసిన కృషి కొంత యున్నది. ఇప్పటి యేర్పాట్లు చాల వనుటకు కృష్ణా డెల్టాలో గత సంవత్సరము అధికవర్షములవలనఁ గలిగిన యపరిమిత నష్టమే సాక్షి. కావున జలనిర్గమన విషయమునఁ గూడ దొరతనమువారు తగినంత కృపచేయుదురు గాక.

ఈ విషయమున రైతులు గూడ తమలో తాము కొంత కృషి చేసి మురుగు బోదుల నేర్పఱచుకొనవచ్చును.

వ్యవసాయదారులు తాము పండించిన దినుసులను విక్రయస్థలములకుఁ గొనిపోవుటకు వీలగు బండిబాటలు కాల్వలు రైలు మార్గములు మొదలగునవి నిర్మింపఁబడుట వ్యవసాయాభివృద్ధి కెంతయో తోడ్పడును. ఇట్టి సౌకర్యము లున్నయెడల రైతునకు మంచి వెల లభించి యాతని పాటునకు తగిన లాభము గలుగును. బాటలు మొదలగువాని నిర్మాణము చాలవఱకు జిల్లా తాలూకా బోర్డుల పనియై యున్నది. గ్రామస్థులును ఇందుకు తగిన కృషి చేయవలసి యున్నారు. రైతులు వీలును బట్టి ఎవరి పొలమున వారు పంట దినుసులను ఎరువుల నొకచోటనుండి మఱియొకచోటునకు తోలుటకు తగిన చిన్న బాట లేర్పఱచుకొని యొకరి పొలములోని బాట మఱియొకరి పొలములోని బాటతోఁ గలియునట్లేర్పాట్లు చేసికొన్నయెడల వీలుగ నుండును.

రైతుల నేల లేకఖండములుగ నుండక చిన్న చిన్న చెక్కలుగ చెదరి యుండుట వ్యవసాయాభివృద్ధికి కొంత యవరోధము. ఇందువలనఁ గలుగు కష్టముల నన్నిటిని ఇచట వివరించుట యనావశ్యము. పొలములకు సరియైన విలువ గట్టుకొని రయితులు తమలో తాము నేలలను మార్చుకొని సాధ్యమైనంతవఱకు ప్రతి రైతు పొలమును నేకఖండముగ నుండునట్లు చేసికొనుట యుక్తము. జపాన్ దేశమునను కొన్ని యిరోపీయదేశములందును ఈ పనికి పరిపాలకులే కొంతవఱకు పూనుకొని కృషి చేయుచున్నారు.

రైతు తన వ్యవసాయమును బాగుగ నడపుటకు తన పొలమునందే నివసించుట యవసరము. వరిపొలములలో నిట్లు నివసించుటకు వీలు లేకపోయినను మెట్టనేలలందును తోఁటభూములందును రైతులిండ్లు కట్టుకొని యచటనే నివసించుటకు ప్రారంభింపవలెను. రైతుల పొలము లేకఖండముగ నుండకపోవుటయు దొంగల భయమును ముఖ్యాటంకములు. కాని, వీనిని క్రమక్రమముగ తగ్గించుటకు ప్రజలును పాలకులును గూడ కృషి చేయవలసియున్నారు.

రైతుల యార్థికస్థితి బాగుపడుటకు సాధన మేర్పఱచుట వ్యవసాయాభివృద్ధికిఁగాను కల్పింపవలసిన మఱియొక గొప్ప సౌకర్యము. ఎందఱో రైతులు వ్యవసాయమునందు తామెంత ప్రవీణులైనను డబ్బువిషయమున సాహుకారులచేతిలో చిక్కి, యడుగంటి పోవుచున్నారు. సహకార ధర్మవ్యాపనమే యీ దుస్స్థితికి తరణోపాయము. దొరతనమువారీ యుద్యమవ్యాపనమునకై కొందఱుద్యోగస్థులను నేమించి కొన్ని గ్రామములందు సహకార పరపతిసంఘములను స్థాపించుటచే నచటి రైతులకు మేలు గలుగుచున్నది. కాని, యీ సహకార ధర్మవ్యాపనమునకు రైతులును విద్యాకంటకులు నన్యోన్యవిశ్వాసము గలవారు గాకపోవుటయే యవరోధముగ నున్నది.

సహకారసంఘములు రైతులను ఋణవిముక్తులను చేయుటకు మాత్రమే గాక వారలు విత్తులు పనిముట్లు ఎరువులు మొదలగునవి కొనుటయందు కూడ తోడ్పడఁగలవు. సరకుల విక్రయములందును సహకారమున కెడము గలదు. నీటివసతులు జలనిర్గమన మార్గములు బాటలు మొదలగువాని నిర్మాణమునందును సహకారమున కవకాశము గలదు. దొరతనమువారు రైతుల యార్థికసౌకర్యమునకే నూతులను గట్టించుకొనుట మొదలగు పనులకు రైతుల కనుకూలములగు షరతులమీఁద బదుళ్ళ నిచ్చుట కేర్పాట్లు చేసియున్నారు కాని, రైతులు చాల భాగము విద్యావిహీనులగుటచే నీ బదుళ్ళ సొమ్ము యత్నమారంభమైనది మొదలు వారలచేతులలోఁ బడు నప్పటికి చాల కాలము పట్టుటచేతను ఎందఱో యుద్యోగస్థుల నాశ్రయించినఁ గాని పలుకుబడి లేనివారికీ బదుళ్లు సులభముగ లభింపకపోవుటచేతను నీనివలన నింకను తగినంత లాభమును రైతులు పడయలేకున్నారు.

## ఉపసంహారము

ఇంతవఱకాంధ్రదేశమున వ్యవసాయదారులు గలుగఁజేసికొనవలసిన సౌకర్యములను గుఱించియు, వారలును విజ్ఞానవంతు లగుటకు చేయఁదగిన యేర్పాట్లను గుఱించియు సంగ్రహముగ వ్రాయఁబడెను. ఈ వ్యాసమును ముగించుటకు ముందు మఱియొక విషయము గూడ తెలుపవలసియున్నది. వ్యవసాయదారుఁ డెన్ని సౌకర్యములను గలిగియున్నను ఎంత విజ్ఞానమును గలిగియున్నను, తన పనియందు శ్రద్ధయు తాను పాటుపడి యన్ని పనులను బాగుగ చేయఁగల శక్తియు తన పనివాండ్రచే బాగుగ పనిచేయించుకొను నేర్పును గలిగియుండని యెడల, అవి నిష్ప్రయోజనములు. వ్యవసాయదారుఁ డీ సుగుణములను గూడ నలవడఁజేసికొనవలెను. ఒక రూపాయ వ్యయముతో కావలసిన పనిని రెండు రూపాయలతోఁ గాని జరగించుకొనలేని వ్యవసాయదారుని కెన్ని నూతన వ్యవసాయ విధానములు తెలిసి యున్న నేమి ఫలము? వానిని మితవ్యయముతో నమలులో పెట్టఁ గలిగిననే గదా వానివలని లాభమును పడయుట? ఈ లోపము చిన్నతనమునందుండి వ్యవసాయమునందు మెలఁగుచుండిన సామాన్యపు రైతులందుకంటె వ్యవసాయ మన నేమియో యెఱుఁగకుండ పాఠశాలలందు కొన్ని సంవత్సరములు చదివిన పిమ్మట నీ వృత్తికి దిగు నాజూకు వ్యవసాయదార్లయం దెక్కువగ నున్నది. ఇట్టివారిలో చాలమందికి నవనాగరకత మూలమున కల్గిన వ్యామోహము లెక్కువ. నిలుకడగ తాము పాటుపడలేరు. తమ పనివాండ్రయందుత్సాహము

పురికొల్పి వారలు బాగుగ పనిచేయునట్లు నడపుకొను నిపుణతయు వీరికి తక్కువ. ఇట్టివారు తమకు తెలిసిన నూతనవిధానములవలన తీయఁగలుగు లాభముకంటె నీలోపములచేఁ గలుగు నష్టమే యెక్కువగ నుండును. కావున, నిట్టివారు తఱుచు రైతులచే పరిహాసమునకు పాత్రు లగుచుందురు. కొంత కాలమునకు వీరు నిరుత్సాహు లయి వ్యవసాయమును గట్టిపెట్టుటయు రైతులకు నూతన విధానములందు విశ్వాసము మఱింత తగ్గుటయు తటస్థించును. కావున, మన దేశపు వ్యవసాయాభివృద్ధికిఁగాను పాటుపడు విద్యావంతు లీ విషయమును గమనించి తమ విజ్ఞానమునకు తగినంత శ్రద్ధయు నిపుణతయుఁ గలిగి తాము చేయు కృషి విఫలము గాకుండుటకై మిగుల పాటుపడ వలయును.

## II వెన్నలకంటి అప్పారావు గారు

“ఇంగ్లాండులోని కార్షికుఁడు పెక్కు సందర్భములలో, తన పొలముకలన జీవనము చేయఁగలయట్టియు, తన బిడ్డలను పోషించి వారు అర్హులని తేలునట్టి వృత్తులకు సిద్ధముచేయఁగల విద్య చెప్పింపఁగలయట్టియు స్వతంత్రాదాయము కలిగి, స్వేచ్ఛావృత్తి గలవాఁడుగా నున్నాఁడు.”—విల్లింగ్డను ప్రభువు గారు.

ప్రస్తుతము వ్యవసాయశాఖను రెండు అంతశ్శాఖలుగా విభాగింపఁదగును: (1) పరిశోధనశాఖ (2) పరిశోధనఫలములను వ్యాపకము చేయు శాఖ. పరిశోధన పని పరిశోధకశాలలో జరగవలసియుండును. ప్రస్తుత మా పని మన రాజధానియందు కోయంబత్తూరు వ్యవసాయకళాశాలలో జరగుచున్నది; ఇండియా కంతకు పూసాలో జరగుచున్నది. ఇది గాక, ప్రతి రాజధానియు ప్రతి దేశమును స్వయముగా పరిశోధనశాలల నియమించి పని జరపుచున్నవి. ప్రతిదేశమందును పరిశోధకశాలలో తేలు నూత్నవిషయములు వేఱొక యంతశ్శాఖచే వ్యాపకము చేయఁబడుచున్నవి. ఆ కార్యము మన రాజధానియందు డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చరు గారివలన నిర్వహింపఁబడుచున్నది. మన రాజధానియందలి ఆదర్శక వ్యవసాయ క్షేత్రము లన్నియు వీరి విచారణ క్రిందనే యున్నవి. వీరికిని వీరి క్రింది యుద్యోగులకును వ్యవసాయ క్షేత్రవిచారణయే ముఖ్యమైన పని. కొలఁది మాసముల క్రిందట ఇండియా స్టేట్ సెక్రటరీ గారివలన శాంక్షను చేయఁబడిన వ్యవసాయాభివృద్ధి సవరణలో నీ యాదర్శకక్షేత్రములే ముఖ్యస్థానము వహించియున్నవి. వ్యవసాయాభివృద్ధులను గుఱించి కరపత్రములు ముద్రించి వానిని ధర్మార్థముగా పంచిపెట్టుట ముఖ్యమే కాని, ఆదర్శకక్షేత్రములవలన వీనికంటె వేయి మడంగు లధికలాభము లొనఁగూడు ననుటకు సందియము లేదు. కనుకనే యాదర్శకక్షేత్రములను గూర్చి యొకింత వ్రాయఁబూనితిని. ఆదర్శకక్షేత్రము లని యిందుఁ జెప్పఁబడు క్షేత్రములు ఇంగ్లీషున డిమన్‌స్ట్రేటివ్ ఫారమ్స్ అని పిలువఁబడుచున్నవి.

పరిశోధనశాఖకు వలయు వ్యయ మింతంత యనుటకు వీలు లేదు. దాని కెంత కర్చుచేసిన నంత లాభము. ఆ లాభము కంటి కగపడునది కాదు. కనుక దానికై యెన్ని లక్షలు కర్చుపెట్టినను మనము చింతింపవలసినది కాదు. కాని, ఆదర్శకక్షేత్రము లట్టివి కావు. ఇవి సర్కారుకు నష్టము తెచ్చునవిగా నుండఁగూడదు. గవర్నమెంటు ద్రవ్యమే మాత్రమును వీనికి వ్యయపఱుపఁగూడదు. ఒక్క క్షేత్రము మాత్రము గవర్నమెంటు సేకరించి క్షేత్రాధికారిపరము చేసినఁ జాలును. ఏల యన, వ్యవసాయమును గుఱించి లెక్క చూచునపుడు పశువుల వెలమీఁద వడ్డియు వ్యవసాయపు కర్చులును పోను మిగులు లాభమును జూచుకొనినఁ జాలును. ఇప్పుడు క్షేత్రాధికారికి నెల 1-కి రు. 60 లకు తక్కువ కాని వేతనము నీయవలసియుండును. ఇంతమాత్రమైన నీయనిది ఆంగ్లవిద్యయు వ్యవసాయవిద్యయు గడించినవాఁడు విలక్షణముగా జీవించుటకు వలనుపడదు. కనుక, గవర్నమెంటువారు వ్యవసాయవృత్తిని ఆంగ్లవిద్యాధికు లవలంబించునట్లు చేయవలె ననిన, ఆదర్శకవ్యవసాయక్షేత్రములు జయప్రదములుగా నుండవలెను. అవసర మని తోఁచినచో మిక్కిలి ప్రశస్తముగా నుండు ప్రదేశములనే గవర్నమెంటువారు “ఎక్వైరు” చేసి క్షేత్రాధికారిపరము చేయవలెను. క్షేత్రపు జమాకర్చు లెక్కలు ప్రజల తనిఖీకి తయారుగా నుండవలెను. క్షేత్రాధికారి జీతము పోను లాభ మెంత తేలునదియు ఆయా సంవత్సరముల లెక్కలను బట్టి స్పష్టముగా తేలవలెను. ఇట్లు చేసినచో గవర్నమెంటువారికి ఒక్కమాఱే కర్చుండును గాని ప్రతి వత్సరమును కర్చుండదు. ఈ పద్ధతియే క్రమముగా ఏర్పాటైనచో పై తనిఖీయును అంత యధికముగా నుండవలసిన యవసర ముండదు ఇట్లనుటచే గవర్నమెంటువారు క్షేత్రములకు సాహాయ్యము చేయఁగూడదనుట కాదు. క్షేత్రములకు వారి సాహాయ్యము మితముగా నుండవలెను. సాధారణముగా గొప్ప రయితు ఎట్లు చేయుచున్నాఁడో క్షేత్రాధికారియు నట్లే చేయవలెను. సాధారణపు రైతు మామూలు పంటలు పండించుకొనుచు చవిటి భూములను వేపపిండి మొదలగు వెల గల ఎరువు లుపయోగించి బాగుచేసికొనుచున్నాఁడు; మిట్ట ప్రదేశములలో గడ్డతీరు తీయించుచున్నాఁడు; కట్టలు పోసియు ఆ కట్టలకు రాయి కట్టియు ఏటివెల్లువలు మొదలగు ప్రవాహముల నాఁపుచున్నాఁడు; పైరులకుఁ బట్టు చీడ మొదలగు వ్యాధులకుఁ బ్రతిక్రియ వెదకుచున్నాఁడు. ఈ పనులే కాక, వందల రూప్యములు వ్యయము చేసి బావులు త్రవ్వించి రాయి కట్టించుచున్నాఁడు. మఱియు పండని సంవత్సరముల నష్ట మనుభవించుచుఁ దన గృహమందు శుభాదికార్యములను జరపుకొనుచు పైఁగా ధనవంతుఁడుగ నున్నాఁడు. వ్యవసాయకులలో లక్షాధిపతు లెందఱో యున్న సంగతి పాఠకులకును విదితము, ఇది కాక, మన యిండియాలోఁ

గూడ నందందు నీటి యంత్రములను దెప్పించి వానిచే బావులలోని నీరు తోడి పైరుల కుపయోగించుచున్నారు. ఇవి యన్నియు మనము కండ్లయెదుట చూచుచున్న సంగతులే. యూరపు అమెరికా దేశములలో వ్యవసాయ మత్యున్నతస్థితియందున్నదని వినుచున్నాము. కాని, వానిని గురించి కాక మన దేశమును గురించియు, అందును కాలవర్షము బొత్తిగా లేని నెల్లూరుమండలమును గూర్చియు, యుక్తమని తోఁచు సంగతులు మాత్రము వ్రాయువాఁడను. ఈ గ్రామములలో పైరుజొన్న యను నొకవిధమైన జొన్న సాధారణముగా నవంబరు నెలలో పైరుపెట్టఁబడుచున్నది. దీని కొక యదను కలదు. ఆ యదనునకు, చివరకు, వారము రోజులు ముందైనను వెనుకైనను పైరుజొన్న పండ దనుట నిశ్చయము. అదును కాక, సాధారణముగా నాలు గైదు సంవత్సరముల కొక మాఱు జొన్న చెడిపోవుచునే యుండును. ఈ పైరు పైరగాలిచేతను మంచుచేతను పండు నని యిచ్చటి జనులు చెప్పుదురు. ఈ పైరు జొన్నకు అదును మార్చుట సాధారణముగా సాధ్య మని తోఁచుట లేదు. అయినను దీని నాసించు చీడలు తొలఁగించుటకు మాత్రము మార్గములు వెదకవలసియుండును. ఇది యొక స్థలవిశేషము గనుక దీని నివారణపద్ధతుల నారయుటకు ఒక శాస్త్రపరిశోధకుని గవర్నమెంటువారు ధనసాహాయ్యము చేసి, పంపవలసియుందురు. దేశమంతయు నొక యదునున జొన్న వేసి పండించుకొన, గవర్నమెంటు క్షేత్రాధికారి వేఱొక యదునున వేసి పాడుచేసికొనుట హాస్యాస్పదము కాదా! ఒక్క సాధారణవిషయములో క్షేత్రాధికారి యనుభవము లేనివాఁడని తేలిన, పెక్కువిషయములలో ఆతఁడు సమర్థుఁడై లాభము చూపినను, జనులాతని పనులయందు విశ్వాస ముంచరు ఇది జనుల మూఢత్వము కావచ్చును. కాని, వారి మూఢత్వమును మనము మాన్పఁజాలనపుడు క్షేత్రాధికారి ప్రతివిషయములోను తన శాస్త్రజ్ఞానమును జూపి నష్ట మనుభవించుటకన్న, ఆయా స్థలములం దత్యున్నతస్థితియందున్న వ్యవసాయపద్ధతు లవలంబింపవలసియుండు నని తెలిసికొనుటయే మేలు. దీనివలన నవమాన మేమియు లేదు. ఒక్క లోపమువలననే లోకులకు విశ్వాసము లేనపుడు తప్పులు వ్రాసి దిద్దుకొను నయ్యవారివలె, డిమన్‌స్ట్రేటివ్ ఫారములలో అన్నియు లోపములుగను అంతయు నష్టముగను తోఁచిన, జను లెట్లు గవర్నమెంటు పద్ధతులందు విశ్వాస ముంతురు? దీనినిబట్టి ఆదర్శకక్షేత్రములలో లాభము చూపఁజాలనట్టి క్షేత్రాధికారి ఆ పదవి కనర్హుఁడు కనుక నుద్యోగమునుండి తొలఁగింపఁబడవలసియుండును. లాభకరముగ క్షేత్రములలోఁ బని చేయుటకు కళాశాలలు విద్యార్థులను సిద్ధము చేయవలసియుండును. అట్లు కళాశాలలు విద్యార్థులను సిద్ధము చేయఁజాలకపోయిన, ఆ కళాశాలలతోఁ గాని ఆ క్షేత్రములతోఁ గాని దేశమునకును వ్యవసాయకులకును బొత్తిగా నవసరము లే దని రూఢిగఁ జెప్పవలెను. ఇట్లు పనికిమాలిన పనికిఁగాను వ్యయపడు లక్షలు దేశోపకారకంబగు పను లెన్నిటికో కర్చుచేయవచ్చును. ఇవియే వ్యావసాయికుల యభిప్రాయములు. ఇంతకన్న లోఁతుగఁ బోవుట ఈ వ్యాసమునకు సరిపోదు.

కనుక, పైని చూపింపఁబడిన పద్ధతుల ప్రకారము ఆదర్శక క్షేత్రములను గవర్నమెంటువారు స్థాపించిన, గవర్నమెంటుకు నష్ట ముండదు; జనులకు లాభ ముండును. ఇప్పుడు గవర్నమెంటు విచారణశాఖలలో (1) సైనికశాఖ (2) డీ. పీ. డబ్ల్యూ. శాఖ (3) విద్యాశాఖ (4) పోలీసు శాఖ — అనునవి మాత్రమే ముఖ్యమైన కర్చు చేయించు శాఖలుగా నున్నవి. డీ. పీ. డబ్ల్యూ. శాఖను గూడ కర్చు చేయించు శాఖ యనుటకు వీలు లేదు. తక్కిన వన్నియు, స్వల్పవిషయములలోఁ దప్ప, గవర్నమెంటుకు ఆదాయమునే తెచ్చుచున్నవి. అన్ని శాఖలలో మిక్కిలి జనోపయోగమైన పోస్టల్ డిపార్టుమెంటు కూడ గవర్నమెంటుకు నష్టము లేక లాభమునే తెచ్చుచున్నది. ఇన్ని డిపార్టుమెంటులు లాభము తెచ్చుచుండ, వ్యవసాయపు డిపార్టుమెంటు గవర్నమెంటుకు నష్టమేల తేవలెను? నష్టము రాకుండునట్లు చేయుటచే "ఎఫిషెన్సీ"యు ఉపయోగమును అధిక మగునపుడు, పాలకులేల దీని కొప్పుకొనఁగూడదు? కాని, వా రొక్కటి మాత్రము చేయవలసియుండును. వ్యవసాయకళాశాల పద్ధతులను పూర్ణముగా మార్చి విద్యార్థులను వ్యావసాయికులనుగాఁ జేయవలసియుండును. ఇప్పుడు కోయంబుత్తూరు కళాశాల, సాధారణ విద్యా కళాశాలలవలె, గుమాస్తాలను రివిన్యూ ఇన్స్పెక్టర్లను తయారు చేయుచున్నదే కాని, వ్యవసాయదారులను తయారు చేయుట లేదు. వ్యవసాయమందు నా చూపినట్టి యాదర్శకము అసాధ్య మని పాఠకులు భావింతు రేమో! అట్లెన్నటికిని కాదు. మేడి పట్టి దున్ననట్టియు, పార పట్టి నోకనట్టియు బ్రాహ్మణవ్యావసాయికు లెందఱో కలరు. వీరి యింటి స్త్రీలు కొన్నిచోట్ల పొలములకు వెళ్లి గడ్డి తెచ్చుట కూడ లేదు. అయినను ఈ బ్రాహ్మణవ్యావసాయికులు మిక్కిలి సమర్థులు. వీరు తోడి వ్యవసాయకులకన్న నెక్కువ బుద్ధిని వినియోగించుచుందురు. ఒక్క క్షణమైనను గూర్చుండక పొలములు తిరిగి విచారణ చేయుచుందురు శూద్రులకన్న వీరికి ఇంటికర్చులు ద్విగుణమును త్రిగుణమును నగుటచే, శూద్రులకన్న వీరు భాగ్యవంతులనుటకు వీలు లేదు కాని, వ్యవసాయములో నష్టమును మాత్ర మనుభవించుట లేదు. ఆంగ్లవిద్య యను వాసన లేని బ్రాహ్మణులలో కొందఱు వ్యవసాయముచే స్వతంత్రజీవనము చేయుచుండ, ఆంగ్లవిద్యయు వ్యవసాయశాస్త్రజ్ఞానమును లోకానుభవమును పాలక సాహాయ్యమును గలవా రేల వ్యవసాయమునందు లాభము చూపింపరాదు?

ఎంతటి విద్యావంతుఁడైనను స్వహస్తములతోఁ బనిచేయనిది భూదేవి మెచ్చదు కనుక, ఎవ్వరు వ్యవసాయవృత్తి నభిలషింతురో, వా రవశ్యము తమ కరములను భూదేవి సేవకై అప్పగించుటకు సంసిద్ధులై యుండవలెను. ఇదియే నా తుది మనవి.

## III చింతమనేని భావయ్యా గారు

శ్లో॥ ప్రథమం కృషివాణిజ్యం ద్వితీయం పైన్యపోషణం - తృతీయం విక్రయం వక్రం చతుర్థం రాజసేవనం.

లోకమందు వ్యవసాయముమీఁదనే జీవనము చేయుచున్న దేశములలో, అనఁగా ఇంగ్లాండు అమెరికా జపాను మొదలగు దేశములలో, ఉన్నంత యభివృద్ధి మన యాంధ్ర దేశమున లేదు. మన దేశమందు రైతులు చాలమంది విద్య లేనివా రగుటచే వ్యవసాయాభివృద్ధికి తగిన సాధనములను గ్రహింపలే కున్నారు. కావున ఇతర దేశములవలె మన యాంధ్రదేశమును విద్యాభివృద్ధిని గాంచునఁటకు మన వ్యవసాయము వృద్ధిని గాంచఁబోగు.

### ఎరువు

పశువుల ద్వారా లభించు ఎరువే రయితు పంట పండించుకొనుటకు ముఖ్యమైన ఆధారముగా నున్నది. మంచి యెరువును తోలి పొలమును బాగుగా దున్నినపుడే మంచి పంట పండి రైతుకు లాభము కలుగును. కావలసినంత యెరువు జలము లభించిన యెడల ఆంధ్రదేశమున పైరుపచ్చలు అపరిమితముగా పండు ననుట నిర్వివాదాంశము. ఎరువు నీరు అన్యోన్యాశ్రయములుగా నుండును. అనఁగా, పొలమునకు ఈ రెండును అవసరమే. ఒకటి యుండి యింకొకటి లేకపోయినచో లాభము లేదు. మన దేశములో రైతులకు కావలసినంత యెరువు లభించుటే లేదు. లభించినను అది మంచి సత్తువ యిచ్చునదిగా లేదు. ఎరువుగా ఉపయోగించుకొను పదార్థములను జాగ్రత్తచేసి కాపాడి యుంచుకొననందుననే ఇది యింత స్వల్పముగా లభించుచున్నది. కనుకనే సారహీనముగా కూడ నున్నది.

### ఎరువు, వంటచెఱుకు

వంటచెఱుకు లభింపని ప్రాంతములలోను గొప్ప పట్టణముల చుట్టుప్రక్కల గ్రామములలోను పశువుల పేఁడలో చాల భాగము పిడకలు చేసి విక్రయింపఁబడుచున్నది. అపుడు ఈ పిడకల బూడిద మాత్రమే యెరువుగా మిగిలియుండును. పట్టణములలో నేర్పడు పిడకల బూడిద యెరువునకై రయితులకు లభించుటకు వీలుండదు. రయితులే యీ పిడకలను వంటచెఱుకుగా ఉపయోగించినపుడు ఈ బూడిదను బయలులో చేర్చి యుంచుకొనెదరు. ఇది ఎండకు ఎండి వానకు తడసినందున దీనిలో నుండు సారమంతయు పోయి వట్టి నిస్సారమైన పదార్థ మగును. పేఁడను పిడకలు చేసి యమ్ముటచేతను వంటకుపయోగించుకొనుటచేతను రైతులకుఁ గల్గు ద్రవ్యలాభము మిగుల స్వల్పము. నష్టము విశేష మనుట స్పష్టము. కోయంబుత్తూరులోను సేలములోను రైతులు చేసినట్లు అన్ని జిల్లాల రైతులు తమ పొలముల చుట్టు కంచెలను పెంచుటచేతను, లేదా కొంత భూమిలో వంటచెఱుకున కుపయోగించు చెట్టుచేమలు పెంచుటచేతను, వారికి వలసినంత వంటచెఱుకు అమరుటకు వీలు కలదు. ఈ విధముగా పని చేసి పేడను కాల్చివేయు దురాచారమును నిల్పివేయవచ్చును. గొప్ప పట్టణములకు సమీపములో వంటచెఱుకునకు ధర హెచ్చుగా నుండుటచేత, అందు కుపయోగించు చెట్లను పెంచువారికి మంచి లాభము వచ్చును.

### ఎరువును జాగ్రత్త చేయుట

మరియు రైతులు పేఁడను పైకప్పు లేని బయలులో వేసి యుండనిచ్చెదరు. అది యెండలో నెండి గడ్డలు కట్టును. వర్షము కురిసినప్పుడు దాని సారమంతయు కొట్టుకొనిపోవును. ఇట్టి యెరువు నిస్సారమై స్వల్పలాభము నిచ్చును. రైతు తన గృహమునకు దూరముగా నొక బావిమోస్తరుగా గుండ్రపు గోతిని త్రవ్వించి రాతితో కట్టించి అందు పేఁడను వేసి మూఁతవేయుట యుత్తమము. తెలిసిన రైతులు కూడ చేయనందులకు చింతిల్లుచున్నాను.

### వరి విత్తనములు

కొన్ని చోట్ల సాధారణముగా వరి విత్తనములను చేతికి వచ్చినట్లు చల్లెదరు. ఒక్కొక్కవేళ మొలక విత్తనములను విదిలించెదరు. మరికొందఱు ముందుగా నారుమళ్లలో నారును పెంచి పిదప ఆ నారును మళ్లలో నాటెదరు. ఈ మూఁడు విధములందును నారుమళ్లలో నారును పెంచి పిమ్మట దానిని మళ్లలో నాటుటే మే లని చాల చోట్ల పరిశోధనవలన నిశ్చయింపఁబడినది. ఇట్లు చేయుటే లాభమని సిలోనులోను జపానులోను వ్యక్తపడినది. దీనిలోఁ గల లాభ మిట్టిది: విత్తనములు విశేషముగా మిగులును, పొలములో సులభముగా కలుపు తీసికొనవచ్చును, పైరు బాగుగా పెరుగును, తద్ద్వారా ఫలము హెచ్చుగా లభించును. ఇటువంటి లాభమైన పనిని మన దేశములో ఇంకను కొంద ఱవలంబింపకయే యున్నారు.

### నారు నాటుట

ఒక నారుమొక్కను ఒక పాదులో నాటినయెడల దానికి 20 మొదలు 30 పిలకలు పుట్టును. జపానులో నొక నారుమొక్కకు 60 మొదలు 70 పిలకలు పుట్టుటయుఁ గలదు. వీనిలో నొక్కొక్క పిలకలోను 10-12 వెన్నులు బయలువెడలును. మన దేశమునందు ఒక్కొక్కపాదులో ఒక్కొక మొక్కను నాఁటిన యెడల జపానుకంటె ఎక్కువ ఫలము గలుగు నని పరీక్షించి నిశ్చయింపఁబడినది. ఒక పాదులో పెక్కు మొక్కలను నాటుటచేత ఫలము తగ్గును. ఈ విషయమును గుఱించి వరిపైరులు వేయు రైతులు బాగుగా నాలోచింపవలయును. ఒక పాదులో ఒక చెట్టును నాటవలయు ననుట కృషిశాస్త్రములోని గొప్ప రహస్యము ! ఈ రహస్యమును గ్రహించి జపాను జావా దేశస్థులు గొప్ప లాభమును పడయుచున్నారు. కనుక, సాధ్యమైనపు డెల్ల రైతు లీ పద్ధతిని వాడుకలోనికి తెచ్చుకొనవలయును. ఇట్లు చేయుటచేత కాలము దేహ

శ్రమ ఖర్చులు అన్నియు కూడివచ్చును. ఆయా జిల్లాలలోఁ గల పొలముల స్థితిగతులను సయిత మాలోచించుకొనవలయును.

## పొగాకునకు తగిన భూమి

అడుగున గులకరాయి గలిగి పైన బంకమట్టి పొర గల చలువ భూమి పొగాకు పంటకు మిక్కిలి ప్రశస్తమైనది. మధుర జిల్లాలో దిండిగల్లువద్ద నుండు భూమి యెఱ్ఱమట్టిపొర గాని బూడిదరంగు మన్ను గాని గలిగి పైన చెప్పిన రకముగా నున్నది. కృష్ణా గోదావరి జిల్లాలలో కేవలము ఒండ్రుమట్టి గల భూములే దానికి శ్రేష్ఠమైనవిగా నెంచఁబడును. కృష్ణా జిల్లాలో విశేషముగా పాటిమట్టి భూములలో పొగాకు పండించెదరు. చాల ప్రదేశములలో ఉప్పు నీళ్ల బావిక్రింద పెంచఁబడు పొగాకు మంచి రకమని యెంచఁబడును. దిండిగల్లు సమీపమున రైతులు సెప్టెంబరు నెల లోఁగా మొదటి పంట ధాన్యమును పండించి, రెండవ పంటకు పొగాకును నాటెదరు. భూమిని 6 అంగుళముల లోఁతుగ తెగునట్లును గడ్డలు నలిగి పొడిపొడి అగునట్లును 8 పర్యాయములు దున్నెదరు వర్షము కురిసిన వెంటనే దున్నినయెడల ముద్దలు కట్టును గాన, అప్పుడు దున్నరు. పైన చెప్పిన ప్రకారము ఉండెడి భూము లన్నియు మిక్కిలి ప్రశస్తమైనవి.

## ఆముదపు పైరు

ఇది మిగుల లాభకరమైన పైరు. దీనిని పెంచుటలో శ్రమ యేమియు లేదు. కనుకనే మన దేశములో ననేకస్థలములం దిది ఫలించుచున్నది. కొందఱీ పైరును మాత్రమే పొలములో వేసెదరు. ప్రాయశః దీనిని ఇతరధాన్యములతో కూడ కలిపి చల్లుచుందురు. సముద్రమువద్ద ఎత్తుగా నుండు కొండలలో ఇది పెరుగును. ఈ పైరును (కాటర్ ఫిల్లర్) గొంగళిపురుగు పాడుచేయుట కలదు. కనుక, ఈ పొలములను చలికాలములోనె దున్ని యుంచవలెను. అపుడు లోపల నుండు పురుగులు నాగటిచాళ్లలోనికి వచ్చును. ఇదియే సమయ మని పక్షులు మొదలగునవి వీనిని బట్టి చంపి తిని పోవును. ఈ విధముగా గొంగళిపురుగు నష్టమై యీ పైరు క్షేమపడును. ఈ విధముగా దున్నిన భూమిని విత్తనములు చల్లు సమయము వచ్చువఱకు నెల కొకసారి దున్నుచుండవలెను. ఒక యెకరములో ఆముదాలు పైరు చేయుటకు 10 రూపాయలకంటె ఎక్కువ వ్యయము తగలదు. ఈ పైరునకు సాధారణమైన యెరువే చాలును. వానలు పడఁగనే భూమిని దున్ని ఒక్కొక్క యడుగు దూరములో చాళ్లు ఏర్పఱచి వానిలో విత్తనములు చల్లవలెను. చల్లిన యొక వారము పది దినములలోనే విత్తనము మొలచును పైరు పెరిగి నాలుగు నెలలలో కాపెక్కును కాయలు

కొంత పచ్చిగ నుండఁగనే ఆ కాయలను కోయవలెను. బాగుగా పండువఱకు వీనిని కోయకపోయినయెడల, కాయలు ముదిరి పండి గింజలు రాలిపోవును కోసిన కాయలను ఎండఁబెట్టవలయును. అపుడివి యెండును, గింజలు సులభముగా తీయ వచ్చును. ఈ గింజలను మన దేశస్థులు ఉడుకఁబెట్టి ఆముదము తీయుదురు కొందఱు గానుగలో త్రిప్పి ఆముదము తీసికొనెదరు మూడు రతుల విత్తనములలో సాధారణముగా ఒక రతి ఆముదము దిగును. క్వీన్సులండు మొదలగు ప్రాంతములలో ఈ పైరును మిగుల శ్రద్ధతో పెరచుచున్నారు. ఉపయోగకరమైన పైరు గనుక మన దేశమందు రైతులును దీనిని విశేషముగా పెంచి లాభమును పడయుటకు యత్నింపవలెను. ఆముదము దీపములకును ఔషధములకును యంత్రములకును నుపయోగించును మన దేశములోనికి కిరసనాయిలు విశేషముగా వచ్చినను అనేకగ్రామములలో ఆముదమునే ప్రజలు వాడుకొనుచున్నారు. ఆముదాలు పెద్దవి చిన్నవి అని రెండు విధములు గలవు. పెద్ద రకము గింజలలోనే ఆముదము విశేషముగా వచ్చును. ఇది కొంచెము మందముగా నుండును. చిన్న గింజలనుండి తీయఁబడిన ఆముదము పలుచగా నుండును. ఆముదము తీసిన పిప్పి పైరులకు ఎక్కువ లాభకరమైన యెరువు.

## రైతుల కర్తవ్యము

వ్యవసాయముమీఁదనే జీవనము చేయుచున్న బీద రైతులకు ధనవంతు లగు గొప్ప రైతులు తమ సాధ్యమైనంత సాహాయ్యము చేయుట తమ విధిగా భావించుకొని వారికి తెలియని క్రొత్త పద్ధతులకు మార్గము చూపించుచు వారు కూడ తమంత ధనవంతు లగువఱకు వారియందు పరిపూర్ణ కటాక్షము గల్గియుండినఁ గాని వారి కష్టములు తొలఁగి దేశసేవ యొనర్పలేరు. ప్రతి గ్రామమందు నంను రైతులు సంఘీభావము గల్గి తమకుఁ గల్గెడి కష్టములను విమర్శించి వానిని తొలఁగించుకొనుటకు సాధనములను కనుఁగొనవలెను. మన దేశమందు శాస్త్రజ్ఞానవేత్తలు తక్కువగుటచేతను, ఉన్న కొద్దిమందికి అనుభవము తక్కువగుటచేతను, మన వ్యవసాయ మభివృద్ధి నొందలేక యున్నది. ఇంగ్లాండు అమెరికా జపాను మొదలగు రాష్ట్రములయందు శాస్త్రజ్ఞానవేత్త లధికమగుటచే ఆయా దేశములయందు శాస్త్రజ్ఞాన ముపయోగింపఁబడుచున్నది

మన దేశమం దుండు ప్రతి రైతును సాధ్యమైనంతవఱకు తన బాలురకు విద్య చెప్పించినఁ గాని, వారు తమంతట తామే వ్యవసాయాభివృద్ధికి తగిన సాధనములను గ్రహించి తమ కార్యములను చక్కఁగా నెఱవేర్చుకొన యత్నింపలేరు.

*

కోటిసూర్యుల కాంతి మెఱయుచు
మేటి చుక్కయు మెఱయ నింగిని
ఒడ లెఱుంగని గాఢనిద్రను
    మెఱసె లోకంబుల్. 5

చూడనైరా చుక్కసొంపును
చూడరైరా శోభ యెల్లను
అడవిఁ గాసిన వెన్నెలట్టుల
    అమరెఁ దత్కాంతుల్ 6

అరుణకాంతులు ఆకసంబున
అల్లుకొనియెను నంతమున్నే
మెఱపువోలెను మెఱయు చుక్కయు
    రాలిపడె నింగిన్. 7

చుక్క రాలెను; కాంతు లెల్లను
ఒక్కపెట్టున మాయమయ్యెను—
చొక్కి లోకం బెల్ల నయ్యెడ
    సుప్తి నిదురించెన్. 8

ప్రొద్దుపొడిచెను; తెల్లవాఱెను;
మేలుకొలుపులు కోడి కూసెను,
కలకలంబులఁ బులుఁగు మూఁకలు
    తెలిపె రాతిరి వృత్తముల్. 9

కాచియున్న యదృష్టవంతులు
చుక్క సొంపును శోభ పెంపును
వేయినోళుల మెచ్చుచుండఁగ
    విని జనము లెల్లన్, 10

తెల్లఁబోయిరి; యొకరి నెమ్మొగ
మొకరు చూచుకొనంగడంగిరి;
చుక్కశోభను జూడఁజాలమి
    దుఃఖపడి రంతన్. 11

ఎక్కడైతే చుక్క వెలిఁగెనో
అక్కడొక్కటి కాంతి వెలసెను,
అఱ్ఱు లెత్తి జనంబు లెల్లను
    అద్భుతంబునఁ జూడఁగన్. 12

II

నిండు ఆమని యిచట లే దని
నీరసంబున రోసి చెవులకుఁ
బండు వైనరుచుచున్న కోయిల
    పాఱిపోయెనుగా!
        అకటా! పాఱిపోయెనుగా! 13

బడుగు దుర్విటులట్లు బిడ్డలు
ప్రాఁతమాటల నేర్పు చూపఁగ
ముద్దుమాటల మురువు నించిన
    పుత్రుఁ డేఁగెనుగా!
        హాహా! పుత్రుఁ డేఁగెనుగా! 14

గాజుపూసలు కంఠమందున
రోజు రోఁతగఁ బెట్టుచుండఁగ
మంచి ముత్యాల్కానుక యిచ్చెడి
    మాన్యుఁ డిఁక లేఁడా?
        అయ్యో! మాన్యుఁ డిఁక లేఁడా? 15

కొయ్యబొమ్మలె మెచ్చు కనులకు
కోమలాంగుల సౌరుఁ గూర్చిన
అప్పరాయ కవీంద్రచంద్రుం
    డవని విడినాఁడా?
        కట్టా! అవని విడినాఁడా? 16

కాంచి పెంచిన తల్లి! నీ గతిఁ
గాంచి కన్నుల నీరు నించిన
పుత్రరత్నము కడుపు చిచ్చిడి
    పోయె; దిక్కెవరో?
        తల్లీ! నీకు దిక్కెవరో? 17

III

ఊరడిలు మో యాంధ్రలక్ష్మి!
యూరడిలు మో గీతికన్యా!
యూరడిలుఁ డో యాంధ్రులారా!
    యూరడిల్లుండీ! 18

అప్పరాయకవీంద్రచంద్రుం
డవని వీడిన, నతని తేజము
ఆంధ్రలోకం బెల్ల నిండుచు
    నద్భుతంబుగ వెలిఁగెడిన్. 19

ఆ వెలుంగే కనువెలుంగుగ
ఆంధ్రపుత్రులు ముందు నడతురు,
భాగ్యవతులను భాగ్యవతివై
    వఱలెదవు తల్లీ! 20

చిక్కియున్న భవత్స్వరూపము
దిక్కు లెల్లను నిండి వెలుఁగును,
అఱుతఁ దగు ముత్యాల సరముల
    నప్పరావు వెలుంగఁగన్. 21

# ఆంధ్రదేశము — వ్యాయామక్రీడలు

చిల్లరిగె శ్రీనివాసరావు గారు, బి. ఏ.

## శరీరవ్యాయామమువలని కీర్తి

మన యాంధ్రదేశమునందు విద్య యనఁగా కేవలము పుస్తకపఠనమే యను నభిప్రాయము పరువు గలవారిలో నొకప్పుడు బలసిపోయినది. ఇప్పటికిని విద్యాధికు లైనవారిలో శరీరవ్యాయామములందు శ్రద్ధ తీసికొనువారిని గూర్చి దురభిప్రాయము లేకపోలేదు. దేశగౌరవము నార్జించుటకు మేధాశక్తి కెట్టి యధికారము కలదో భుజశక్తికిఁ గూడ నట్టి యధికారమే కలదు. ఇందు కొక తార్కాణము: భారతవర్షమునందును విదేశములందును గూడ రాజకీయధురంధరులకంటెను గ్రంథకర్తలకంటెను కవులకంటెను మున్ముందు భీమబలసంపన్నుఁ డగు ప్రొఫెసర్ కోడి రామమూర్తి గారే ఆంధ్రదేశమునకు గౌరవము సంపాదించి పెట్టి రని నిస్సందేహముగ చెప్పవచ్చును. ఆంధ్రదేశీయులు నిజముగ మేధాసంపత్తిచేతనే ముందుగ ప్రసిద్ధి సంపాదింపవలసి యుండినను, రామమూర్తిగారి సాహసముచే మనము ముందుగ బాహుబలమునకే ప్రసిద్ధిని చూరగొంటిమి. ఈ కారణముననే పయిని చెప్పఁబడిన దురభిప్రాయము దూరముగ తొలఁగి పోవుటయే కాక మన యువజను లుత్సాహపూరితులు కూడ నగుచున్నారు.

## భారతవర్షము, వ్యాయామస్థితి

మన యాంధ్రదేశముయొక్క బలవిషయమును గూర్చి చెప్పుటకు ముందు ప్రపంచరంగమున మన భారతవర్షీయులయొక్క బలవిక్రమాదులను గూర్చి కొంచెము ముచ్చటించుట యుచితము. కొన్ని సంవత్సరముల క్రిందట అలహాబాదు మొహితీలాల్ నేమా గారు గులామ్ అను ప్రసిద్ధి చెందిన పహిలేమానును ప్యారిస్ ఎగ్జిబిషనుకు తీసికొని వెళ్లిరి. ఈతఁడు ప్రసిద్ధి కెక్కిన అహమ్మద్ మద్రాలి అను తురుష్కదేశపు పహిలేమానును అనాయసముగా చిత్తు చేసెను. ఇప్పటికిని ఈ గులామ్‌తో సరి కాఁగల వస్తాదు ప్రపంచమునందు మరియే దేశస్థుఁడును లేఁడు.

## ఇంగ్లాండు, భారతమల్లులు

1909-వ సంవత్సరములో బెంజమన్ అనునాయన గామా గాము ఇమాంబక్షా అహమ్మద్‌బక్షా అను పహిలేమానులను ఇంగ్లాండు దేశమునకు తీసికొనివెళ్లెను. గామా డాక్టర్ రోలర్ అను అమెరికాదేశపు పహిల్మానుతోడను, గామా తమ్ముఁ డగు ఇమాంబక్షా స్విట్జర్లాండు పహిల్మానగు జాన్ లెమ్ అను వానితోడను పోట్లాడిరి. మన దేశీయులతో తలపడిన విదేశీయు లిద్దఱును ప్రపంచమున పేరు సంపాదించినవారు. ఇంగ్లాండుదేశమునందు ప్రతివారును మన వారికి చాల పరాభవము కల్గునని తలంచిరి కాని, జరగిన పర్యవసానము మాత్రము అందుకు తలక్రిందైనది. గామా రోలరును ఇరువది నిమిషములలో నోడించెను. ఇమాంబక్షా పండ్రెండు నిమిషములు కాకముందే లెమును చిత్తు చేసెను. ఇందు గామాకు ధరావతుసొమ్ము 1000 పౌనులును గేటు వసూలులో నూటికి 70 చొప్పునను లభించెను. ఇమాంబక్షాకు 500 పౌనులును గేటువసూలులో నూటికి 70 చొప్పునను వచ్చెను. తరువాత రషియన్ సింహ మని పేరొందిన హ్యాకెన్ స్మిత్తు అను నాయన అప్పు డింగ్లాండులో నుండెను. కొందఱెలాగైన నతనికిని మన భారతవర్షీయునికిని మల్లయుద్ధము నేర్పఱచి చూడఁగోరి 7000 పౌనులు ధరావతు పెట్టెద మని చెప్పినప్పటికిని, ఆ రషియను సింహము అందు కంగీకరింపలేదు. ఈ సంగతి యంతయు విని ఆస్ట్రియానుండి జబిస్కో అను మల్లవిద్యావిశారదుఁడు వచ్చి గామాతో పోట్లాడుటకు సిద్ధపడెను. ఈ పోరాట మొకనాఁడు రెండు గంటల నలువదియైదు నిమిషములు జరగినది. గామాకంటె జబిస్కో చాల బరువును చాల లావును కలిగి యున్నప్పటికిని, పై పేర్కొనఁబడిన కాల మంతయు గామా తన శత్రువును నేలమీఁదనే కాలిక్రింద త్రొక్కియుంచెను. కాని, గెలుపు మాత్రము నిశ్చయము కాలేదు. తిరిగి వారు మరునాఁడు పోట్లాడవలసి యుండెను. కాని, యా తెల్లవాఱు జాముననే జబిస్కో ఎవ్వరితో చెప్పకుండ రైలెక్కి వెడలిపోయెను. గామాకే బహుమాన మియ్యఁబడెను.

1912-వ సం.లో ప్రొఫెసర్ రామమూర్తిగారు తమ పహిల్మానులతో ఇంగ్లాండు దేశము వెళ్లిరి. కుస్తీలయందు భారతవర్షీయుల పేరు విన్న, యూరోపు దేశపు పహిల్మానులకు భయకంపము లుదయించుచుండెను. మునుపటివలె సాహసించి యెవ్వరును సామాన్యముగ ముందునకు రారైరి.

రెండు సంవత్సరముల క్రిందట గోచార్ అను నామాంతరము గల జ్యోతీంద్రచరణగుహ అను నాతఁడు యూరోపియన్ పహిల్మానులతో పోట్లాడుటకు ఇంగ్లాండు వెళ్లెను. ఈయనకును జిమ్మి ఎస్సెన్ అను నాతనికిని ఎడింబరో పట్టణమందు కుస్తీ జరగెను. ఇందు మొదటిసారి గోచార్ ఓడించెను. యూరోపు దేశములో మూఁడు సారులు పోరాడి రెండు సారులు గెలువకలెను. కాఁబట్టి రెండవసారి పోరాటములో ఎస్సెన్ గోచారును తన పిడికిలితో కొట్ట నారంభించెను. అప్పుడు మధ్యవర్తి పోట్లాటను ఆఁపి బహుమానమును గోచారున కిప్పించెను. గోచారు ఉపయోగించు ముద్దరలను సామాన్యముగ నే యింగ్లీషు దేశీయుఁడు నెత్తలేఁ డని ఇంగ్లీషు పత్రికలు వ్రాసి యున్నవి. అతఁడు 160 పౌనుల బరువు గల రాతి కుండిని మెడకు ధరించి మేడమీఁద కెక్కి క్రిందకు దిగుచు వ్యాయామము చేయు

నని తెలియవచ్చుచున్నది. ఈతనియొక్క వయస్సు సుమారు పాతిక సంవత్సరములు మాత్రమే.

## రామమూర్తిగారి శక్తి

పైవారు గాక, భారతవర్షమునం దనేకు లగు బలసంపన్నులును మల్లవిద్యాధురీణులును గలరు వీరిని బట్టియే మన మాతృభూమి తాను కన్న సంతానమువలన కొంతవఱకు ధన్యురాల నని తలంచుకొనుట కవకాశము కల్గుచున్నది కాని, యందఱిని గూర్చి ముచ్చటించుట కిచ్చట స్థలము చాలదు. మనకు చేరువ నున్న ప్రొఫెసర్ రామమూర్తి గారిని గూర్చి స్మరింపనిదే ఈ యంశమును పూర్తి చేయుటకు వీలు లేదు వీరు తమ రొమ్ముపై 8000 పౌనుల బరువు నెత్తెదరు 22 గుఱ్ఱముల పవరు గల మోటారు బండిని ఆఁపెదరు తమ చేతికండరములను బిగించి 1/16 అంగుళము గొలుసును త్రెంపెదరు

## బినోట్ లేక జిజుత్స్యూ

మన భారతవర్షము పైయంశములను బట్టి చూడ, మల్లవిద్యయందు అగ్రస్థానము నలంకరించియున్నది ఇకముందును ఆ స్థానమును నిలుపుకొనఁగలదు. జపానీయుల జిజుత్స్యూ దీనిముందర గొప్పది కాదు భారతవర్షీయుల కుస్తియొక్క శాఖయే జిజుత్స్యూ దానిని భారతవర్షీయులు బినోట్ అని వాడెదరు ఈ విద్య తగిన ప్రోత్సాహము లేక ఇప్పుడు కృశించిపోవుచున్నది పూర్వము మన జమీందారులును రాజులును మహారాజులును ఇట్టి విద్యలను ప్రోత్సాహ పఱచుచుండెడివారు ఇప్పుడో అట్టి విద్యలు మోటుదన మని తలంచి, నాజూకు విద్య లగు టెన్నిస్ బాడ్మింటనులకు ధనము నెంతైన ఖర్చుపెట్టుచున్నారు

మన దేశముల అభిమానవ్యాయామవిద్య యగు మల్లవిద్య యటుండ, ముష్టియుద్ధమునందును జిమ్నాస్టిక్సునందును గూడ మన దేశస్థులు ప్రసిద్ధిని సంపాదించుచున్నారు పరదేశక్రీడ లగు కాల్బంతి క్రికెట్టు మొదలైనవానియందును మన దేశస్థు లీనడుమ ఎక్కువ యభివృద్ధిని కనఁబఱచుచున్నారు

## ఆంధ్రదేశము, మల్లవిద్య

ఇక మన యాంధ్రదేశమునందలి శరీరవ్యాయామములను గూర్చి విచారించునపుడు, ఈ విషయమును రెండు శీర్షికల క్రిందకు విభాగింపవచ్చును. మొదటిది మల్లవిద్య రెండవది క్రీడలు. మల్లవిద్యయందు 1915-వ సం॥వ బందరులో జరిగిన దసరా యుత్సవమునకు 116 రూపాయలు బహుమతి ప్రకటింపఁగా, వచ్చి చేరినవారిలో మొదటివారు ఈశాకు పూసారి ఈశాకును పూసారియు ఒక్క యఱగంటయే పోరాడిరి ఆ యఱగంటలో పూసారి ఎంతవఱకును కలియఁబడక తప్పించుకొనుటకే ప్రయత్నము చేసెను. ఫలితము తేల లేదు. ఈశాకు ఎక్కువగా పరిగణింపఁబడి, మొదటి బహుమాన మతనికొసంగఁబడెను. ఆంధ్రదేశస్థులయందు కుస్తీ పోట్లాడువారిలో ప్రస్తుతము వీరిద్దఱే పేరు గలవారుగా కనఁబడుచున్నారు. మల్లవిద్య ఆంధ్రదేశమునందు తక్కువగ నున్న దని వేఱుగ చెప్పనక్కఱ లేదు. దీనికి తగిన శ్రద్ధ తీసికొని రామమూర్తిగారి వంటివారు పనిచేసిన యెడల మిక్కిలి యభివృద్ధి కాఁగల దనుటకు సందేహము లేదు. వారిక ముందు మన యాంధ్రదేశమునం దట్టియుద్యమము నిర్వహింపఁగల రని వినవచ్చుచున్నది. వారి ప్రపంచానుభవము ఆంధ్రదేశమునకీ విషయమున ఉపకరించును గాక!

## ఆంధ్రదేశము, కాలిబంతి యాటలు

ఆంధ్రదేశమునందలి క్రీడలు రెండు అంతశ్శీర్షికల క్రింద విభాగింపవచ్చును దేశీయక్రీడలు విదేశీయక్రీడలు. కాలిబంతి మొదలయిన పరదేశక్రీడలయందు మన ఆంధ్రయువకులు చాల పరిశ్రమ చేసియున్నారు కడచిన వేసవి కాలములో విశాఖపట్టణమునందు జరగిన కాలిబంతి యాటలకు ఆంధ్రదేశముయొక్క ముఖ్యపట్టణములనుండి పెక్కు సంఘములవారు వచ్చి తమ క్రీడానైపుణ్యమును చూపించియుండిరి ఇంకను బందరునందును ఏలూరునందును బెజవాడ గుంటూరు రాజమహేంద్రవరము లందును సంఘము లేర్పడి వెండిగిన్నెలకొఱకు తఱచుగ నాట లాడుచు తమ క్రీడాచాతుర్యమును వృద్ధి చేసికొనుచున్నారు ఇట్టి సంఘములలో గట్టివారిని ఏరి కలిపి ఆంధ్ర పాదకందుక క్రీడాసంఘముగ నేర్పాటు చేసి ఏ సెలవు దినములలోనో భారతవర్షమునందలి గొప్ప స్థానములకు తీసికొనిపోయి వీరి చాతుర్యమును తక్కిన దేశభాగములవారి దానితో పోల్చి అప్పుడప్పుడు చూచుకొనవలసి యున్నది ఈ లాగుననే క్రికెట్టునకును హాకీకిని ఆంధ్రసంఘముల నేర్పాటుచేసి భారతవర్షమునందు వ్యాయామములకు ప్రసిద్ధి చెందిన స్థలములను చూడవలెను

## దేశీయ క్రీడలు

ఇక దేశీయక్రీడ లగు బల్చెడుగుడి వ్యూహభేదము మొదలైన యాటలను గౌరవస్థానమునకు తీసికొని రావలసి యున్నది వానిని గూర్చి స్పష్టమయిన పద్ధతులను కొంద ఱేర్పాటు చేసి అచ్చువేసి పంచిపెట్టవలసి యున్నది. పై చెప్పిన రెండు ఆటలను మన ప్రాచీనులయొక్క యుద్ధ లక్షణములను తెలియఁజేయుచున్నవి. పూర్వము యుద్ధమునందు శత్రుసైన్యములు రెండును చేరి రెండు వైపుల నిలిచియుండ, ఒక్కశూరుఁడు శత్రుసైన్యముపైఁ బడి వారి నందఱిని చెల్లాచెదరుగ చేసి తన పరాక్రమమును గనఁబఱచి పట్టువడకుండ తిరిగి స్వసైన్యమును చేరుట ననుసరించియే బల్చెడుగుడియాట యేర్పడినది చెట్టుపట్టీ యనఁబడు వ్యూహభేదము కూడ, శత్రుసైన్యముయొక్క వ్యూహములోనికి పోయి యొక్కరును వారికి పట్టుపడకుండ తిరిగి తప్పించుకొని వచ్చు లక్షణము ననుసరించి యేర్పాటయిన యాట యై యున్నది. చిట్టచివరకు గోడిబిళ్ల యాట కూడ పూర్వము బాణమును దూరముగ వేయుట ననుసరించియే యేర్పాటయినది. కాఁబట్టి మన యాట

లన్నియు పరదేశపు ఆటలవలెనే వీరరసమును వృద్ధిచేయుటకే యుద్దేశింపఁబడినవి.

## బాలుర క్రీడాసక్తి

మన దేశములో బాలుర క్రీడాసక్తి తగ్గుటవలన దేశమునకెంతయో నష్టము వాటిల్లుచున్నది. బాలుర ధైర్యగుణమును మనము చిన్నతనమునందే చంపివేసి పెద్దలైన తరువాత ధైర్యము లేనివారు మన దేశీయులని యనిన నేమి ప్రయోజనము? విద్యాలయములలో ఉపాధ్యాయులు విదేశీయక్రీడల నాడిన సంతోషింతురు గాని దేశీయక్రీడల నాడిన నెంతయో నిరసింతురు. చిన్న పిల్లలు సైతము ఆటలాడుకొనునప్పుడు తమ యుపాధ్యాయులను చూచిన పాఱిపోవుదురు. ఆట లాడుకొనుట చేయరాని పని యనెడి యనుమానము వారి మనస్సును బాధించుటయే దానికి కారణము. సహజముగ ఆటలమీఁద నుండు బాలుర కాంక్షను దీర్చుటయే పెద్దల విధి. చిన్నతనమునందు పిల్లలయొక్క సహజమైన క్రీడావాంఛ న్యాయమైనదని పెద్ద లెప్పు డెఱుంగుదురో, అప్పుడే తాము తప్పు చేయుచున్నామను భయము పిల్లల మనస్సున చొచ్చుట కవకాశ ముండదు. అప్పుడే పిల్లలు ధైర్యవంతులు కాఁగలరు. ఆంధ్రజాతీయ విద్యాలయమునందు చదువుకొనుచున్న యొకపిల్లవాఁ డొకనాఁడు గోడిబిల్ల ఆడుచుండెను. నేను దారిని పోవుట తటస్థించెను. నన్ను చూచినతోడనే బిళ్లను కఱ్ఱను చప్పున తీసికొని తన వెనుక దాఁచుకొని ఏమియు నెఱుఁగనివానివలె నటించెను. నేనువానిని చూచి నా యెదుటకు వచ్చి నిర్భయముగ నాడు మని బోధించితిని. తరువాత నెప్పుడును ఆ పిల్లవాఁ డాటలాడు నప్పుడు దొంగవలె ప్రవర్తించుట మానివేసెను. ఒక చిన్న పిల్లవాఁడు, ప్రతిదినమును సాయంకాలము వ్యాయామము చేయవలె నని ఆజ్ఞాపింపఁగా, తన తల్లికి తెలియకుండ దొంగతనముగ చేసెద నని చెప్పెను. వ్యాయామము దొంగతనముగ చేయ నవసరము లే దని చెప్పితిని. ఆటలు దొంగతనముగ నాడుటవలన మరింత నష్ట మని పెద్దలు తెలిసికొనవలెను. ఆటలవలన మనుజుఁడు ధైర్యవంతుఁడును న్యాయానువర్తియు కావలెను గాని దొంగ కాఁగూడదు, పిఱికివాఁడు కాఁగూడదు.

## ప్రారంభపాఠశాలలు - వ్యాయామావశ్యకత

మన దేశమునందు శరీరపటుత్వమును తద్ద్వారా ధైర్యశౌర్యాదిగుణములను వృద్ధి చేయవలె ననిన, సకలవిధములైన వ్యాయామములను ప్రోత్సాహపఱుపవలెను. మన దేశీయ వ్యాయామములకు విస్తారము ఖర్చు లేదు. శుభ్రమైన స్థలము స్వల్పముగ దొరకిన చాలును. ప్రతి గ్రామమందును వ్యాయామసంఘములు నెలకొల్పవలయును. పిల్లలను విద్యాలయములకు పంపినట్లుగానే తల్లిదండ్రులు తమ పేటలలోను వీథులలోను తాలెముల నేర్పాటుచేయించి వారిని ఉదయముననే చీఁకటితో లేపి ఆ తాలెములకుకూడ పంపించవలెను. లేనియెడల, విద్యాలయములను ప్రధానముగ వ్యాయామాలయములుగనే చేయవలెను. ప్రతి చిన్న విద్యాలయములోను బాలురు అయిదు గంటలకే వచ్చి వ్యాయామము చేసి ఏడు ఘంటలవఱకు ఆడుకొని ఇంటికి వచ్చి భోజనము చేసి తిరిగి పుస్తకపఠనమునకు ఎనిమిది ఘంటలకు వెళ్లి యొక ఘంటసేపు విద్యాలయములో నుండి చదువుకొని రావచ్చును. మధ్యాహ్నమును కొంత కాలము చదువున కుపయోగించి, తక్కిన కాలము వ్యాయామమున కుపయోగింపవచ్చును.

## ప్రత్యేక వ్యాయామ సంఘములు

పై చెప్పిన విషయము మల్లవిద్యాభివృద్ధి చిన్న వయస్సునందలవడఁజేయుటకు తగిన విధానములను కొంతవఱకు సూచించుచున్నది. ఇఁక పెద్దవారు దేశమునందలి మల్లవిద్యానైపుణ్యమును గాని ఇతరవ్యాయామములను గాని వృద్ధి చేయుటకు ఏమి చేయవలెనో విచారింపవలసియున్నది. ఎవరెవర కేయే వ్యాయామమునం దభిరుచి కలదో వారాయా వ్యాయామమున కొక సంఘముగా నేర్పడి అట్టి వ్యాయామమునకు సహాయము చేయుటకు బయటి దేశములనుండి వచ్చినవారిని ఆదరించుటవలనను నేర్చుకొనఁదలఁచుకొనువారికి కావలసిన సామానులు చేర్చుటవలనను భవనములను కట్టించుటవలనను విశాలములైన ఆరామములను నిర్మించి వ్యాయామములకు విడిచిపెట్టుటవలనను చాల పని చేయవచ్చును. ఈ పనులను చేయుటకు మొట్టమొదట ధన మెచ్చటనుండి రాఁగల దని చాలమంది అనుమానించి భయపడవచ్చును. అట్టి సంఘములవారు పదిమంది పదిరూపాయల చొప్పున చందా వేసికొని మంచి వస్తాదులను పిలిపించి పట్టణములందు పోట్లాడించి టిక్కెట్లు పెట్టినయెడల చాల డబ్బు రాఁగలదు. అందు కొంత ఖర్చయినను తక్కినది ఫండుగ నుంచి ప్రతిసంవత్సరమును పని చేయుచుండినయెడల చాల డబ్బు సమకూడఁగలదు. ఇంకను భాగ్యవంతులు తమ పిల్లలు బలవంతులును బుద్ధిమంతులును కావలె నని ఎఱింగినయెడల నెంత పని యైన నిందు విషయమై చేయఁగలరు.

## ఉన్నత విద్యాలయములు - మల్లవిద్యా శిక్ష

మన విద్యాలయములందు చదువుచున్న విద్యార్థుల యవస్థను విచారింపవలసియున్నది. రోజుకు ఆఱు గంటలు కేవలము పుస్తకపఠనమే. అయినప్పటికిని విద్య నేర్చుకొనుచున్నా మని యను విద్యార్థులలో నూటికి 99 మంది ఉన్నతవిద్య ఎటులును నేర్చుకొనుట లేదు. వారును విద్య సమాప్తము చేయుసరికి శరీరపటుత్వమును గోల్పోయి వ్యర్థజీవులైపోయి యే మహాకార్యమును గాని తలపెట్టుటకు ధైర్యబలములు లేనివా రగుచున్నారు. చిన్నతనమునందు సరియైన వ్యాయామము లేదు అనేకులు దురభ్యాసములచే బలహీనులును వీర్యహీనులును అయిపోవుచున్నారు. ఉదయముననే విద్యార్థులను లేపి వారిచే సరియైన వ్యాయామమును చేయించుట మొదలైన పనులు ఉపాధ్యాయుల విధి కా దని చాలమంది అనుకొనుచున్నారు. దేశముయొక్క సంతానమును పౌరుషవంతముగ

చేయు మహాకార్యము తమది యని గర్వపడఁగలవారు ఉపాధ్యాయ పదవిని స్వీకరింపక, జీతముకొఱకు మాత్రమే ఆ యుద్యోగమును కోరువారు వహించుచున్నారు క్రైస్తవమిషనరీలు తాము క్రైస్తవధర్మమును ప్రచారము చేయుటకే యుద్భవించితి మనియు అందుకొఱకే విద్యాలయములను స్థాపించితి మనియు బహిరంగముగ చాటుచుండుటవలన వారు బాలురయొక్క ఇతరమైన యభివృద్ధిని కోరఁగలరని మన మెదురుచూడము. ఇఁక మనదేశీయులచేత స్థాపింపఁబడిన విద్యాలయములు చాలఁ గలవు. వానియందు మనవారు చాల పని చేయుట కవకాశ మున్నది. ఉపాధ్యాయులు దగ్గఱ నుండి బాలురను ఉదయముననే లేపి కుస్తీ చేయించి స్నానము చేయించి బలవంతులుగను బుద్ధివంతులుగను చేయవచ్చును. విద్యాలయముల కన్నిటికిని ఇప్పుడు చాల డబ్బు వచ్చుచున్నది. వ్యాయామములందు చాలడబ్బు ఖర్చుపెట్టవచ్చును. స్వల్పసముపాయములును స్వల్పధనమును గల ఆంధ్రజాతీయ కలాశాలయందు విద్యార్థిభవనములో నున్న ఏఁబదిమంది విద్యార్థులును ఉదయముననే లేచి కుస్తీ చేసి స్నానము చేసి తెల్లవాఱునప్పటికి తమ ప్రాతఃకాలోపాసనకును పాఠములకును సిద్ధముగ నుందురు. విద్యార్థిభవనమునం దుండువారు గాక పట్టణమునుండి వచ్చెడి విద్యార్థులు సాయంకాలము దేశీయ మల్లవిద్యను నేర్చుకొనుచున్నారు. బీద విద్యాలయమే యిట్టి యవకాశమును పొందియుండినప్పుడు జీతములచేత చాల ధనము నాకర్షించుచున్న విద్యాలయములు తలఁచుకొన్నయెడల ఎంత పని చేయఁగలవో యూహించుకొనవచ్చును.

## బందరు దసరా సంఘము

ఈ సందర్భమున బందరునందు ఇప్పటికి పది సంవత్సరముల నుండి యవిచ్ఛిన్నముగ వ్యాయామ ప్రోత్సాహమునకు చేయఁబడుచున్న దసరా యుత్సవములను గూర్చి ముచ్చటింపవలసియున్నది. బందరునందు దసరా సంఘము వ్యాయామప్రోత్సాహమునకై 1906-వ సంవత్సరమున నేర్పాటైనది. ఈ సంఘమువారు అప్పటినుండియు విడువకుండ ప్రతిసంవత్సరమును వ్యాయామములను జరపించుచు బహుమానముల నిచ్చుచున్నారు. క్రిందటి సంవత్సరము మిక్కిలి యుత్సాహముతో నీ ప్రదర్శనము జరపఁబడినది. ఆంధ్రదేశము నందలి గొప్ప వస్తాదులు చాలమంది వచ్చియుండిరి. అంతే కాక, విద్యార్థులకు ప్రత్యేకముగా కుస్తీ బహుమానములు ఏర్పాటుచేయఁబడినవి. కాకినాడనుండి యొక విద్యార్థియు బెజవాడనుండి యొక విద్యార్థియు వచ్చియుండిరి. విద్యార్థులయొక్క కుస్తీయందు ఆంధ్రజాతీయకళాశాల విద్యార్థులు విజయము పొందినను, ప్రోత్సాహము చేయుటకు పతకములు విద్యార్థు లందఱకును సమానముగానే యియ్యఁబడెను. ఈ సంవత్సరము చాలమంది విద్యార్థులు వత్తురని ఎదురుచూచుచున్నారు. కాఁబట్టి ఇందుకొఱకు విద్యాలయాధికారు లందఱును తమ బాలురను ప్రోత్సాహపఱతురని నమ్ముచున్నాను. ఈ బందరునందు ఏర్పాటుచేయఁబడిన సంఘమువలెనే అన్ని పట్టణములందును సంఘముల నేర్పాటు చేసి దసరా సమయమున మల్లవిద్యావైశద్యమును దేశమునందు వృద్ధి చేయవలెను.

## ఆంధ్ర అథ్లెటిక్ అసోసియేషన్

ఈ సంఘమువారు రాజమహేంద్రవరములో ఈఁత పందెములను పెట్టి ప్రోత్సాహము చేయుచున్నారు. మన బాలురు గాని పెద్దలు గాని ఎక్కువగా ప్రోత్సాహము చేయవలసిన మంచి వ్యాయామము ఈఁత. ప్రతి సంవత్సరమునందును ఈఁతకు ప్రత్యేక సంఘము లేర్పాటై ప్రజ కానందమును కలుగఁజేయవచ్చును. ఈ సంవత్సరము అథ్లెటిక్ అసోసియేషన్‌వారు పెట్టిన పందెమును ఆంధ్రజాతీయకళాశాల విద్యార్థియొకఁడు సంపాదించియున్నాఁడు. ఈ పందెమునకు చాలమంది విద్యార్థులు ఇంకను రావలసియున్నారు. అప్పుడే ప్రజలలో నుత్సాహ ముదయింపఁగలదు. పై విద్యార్థియే బందరునందలి ఈఁత పందెమును గూడ గెల్చినాఁడు.

'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అను న్యాయప్రకారము దేశీయులయొక్క శరీరారోగ్యవిషయములను విచారింపని విద్యాపద్ధతి గాని రాజ్యాంగపద్ధతిగాని యే ధర్మమును నెఱవేర్పఁగలదు? కాఁబట్టి ఆర్యు లందఱును మన దేశమునందు బలసంపన్న మగు జాతి యుద్భవించుటకు మార్గము లరయఁ బ్రార్థితులు.

# నీవు లేని ప్రకృతి యదేల?

బసవరాజు అప్పారావు గారు

పశ్చిమంబున నెల్లెడఁ బర్వె నరుణ
కాంతు, లపరూప మైనట్టి కాఱుతినము
గలిగి కొండలలోనుండి జలజల మను
మృదులగానముతో సెలయేళ్లు వాఱి,
దవ్వులనె నిల్చి తాళబృందములు మెల్ల
వీవనలు వీచుచుండఁగ విసువు లేక
హాయి యని యిటు లటు లూఁగు నలలతోడ
పూర్ణమై పోవు యమునలో పోయి చేర.
అతివరో, ప్రకృతి యంతయు నసుర సౌఖ్య
దాయకం బయి, అల్లదె కోయిలయును
వింతయై మును పెన్నఁడుఁ విని యెఱుఁగని
వలపు గానము నింపుగా చిలుకుచుండె;
హృదయ ముప్పొంగి యుప్పొంగి నీవు లేమి
క్రుంగు, నిఁక నీవు లేని ప్రకృతి య దేల?

# కవితిక్కన

వడ్డాది సుబ్బరాయఁడు గారు

సిరి యజురాశి కూర్మి నివసించుటయున్, శివవిష్ణుభక్తు లొ
క్కరవున నుంట, గొంట కృతి యిచ్చుట, లౌకికవైదికక్రియా
చరణము లుత్తమస్థితి నెసంగుట, దుర్లభ మొండెడం గనన్,
బిరుదసమాఖ్యుఁ డౌ నుభయమిత్త్రుఁడు తిక్కనయిక్కఁ దక్కఁగన్. 1

తే. ఉభయకవిమిత్త్రబిరుదంబు నొరుఁడు పేరి
యిడుకొనుఁగా కతఁడు సోమయాజి యగునె ?
కట్టుకొనెఁ బిచ్చుకయు నీలకంఠబిరుద
మయ్యెనే దానిచే నది యిష్టమూర్తి? 2

చ. చెవులను గుండలాలుఁ, గుడిచేతను గంటము, డాకరంబునన్
గవిలె, పొకప్లు సంచికయుఁ, గమ్మయు, సూరెలఁ జామరగ్రహుల్
సవిధమునన్ బుధోత్తములు, సత్కవులున్, వ్యవహారదక్షులున్
వివిధమహీధవుల్, గల కవిన్ మనుమాధిపుమామ నెన్నెదన్. 3

చ. పలికినకబ్బపుంబలుకు ప్రాబలు కట్టు ప్రమాణమే గదా
తెలుఁగున, నర్చ లొందు నఁట దేవరపెట్టియ గంటమున్, స్వహ
స్తలిఖితపత్త్రఖండములు దండనమస్కృతి గాంచు నంట హా!
వెలసినవేల్పు కాక పృథివిం గవిమాత్త్రుఁడె తిక్కయజ్వ దాన్ 4

చ. ఇతరులు రాజమంత్త్రులు కవీంద్రులచేత మహాప్రబంధముల్
కృతులను బొందు చుండ్రు బుధకీర్తితులై మృతజీవు లౌట క
ద్భుత మెదఁ బొంగు దండిబిరుదుం గవియుం బొగ డొందఁ గందు నం
చతులయశుండు తిక్కసచివాగ్రణి కంకితఁ జేసె సత్కృతిన్. 5

చ. పదముల నర్థరీతి నిడు భారతి తిక్కనకైత, "నేమి చె
ప్పెదు" నని మీఁదు దోఁప కన మొల్చినయట్లది విశ్రమస్థలిన్
గుదిరెఁ గదన్, దెరం దెఱవఁ గోలలలెక్కఁ గనంగఁ దాఁకె మైఁ
బ్రదరము లం డ్రదె హా యతనిభారత మేరితరంబు పేరుకోన్. 6

చ. కవి కనసూయ కంథికిని భారత లేమి యటన్న పండిత
ప్రవచన మొండ్లపట్ల నెటువంటిది మైనను గేవలం బవా
స్తవ మది తిక్కయజ్వకడఁ దథ్యము నన్నయచోటఁ దద్బుధ
ప్రవరుఁడు చూపు గౌరవభరం బిది చాటదె వేమొగంబులన్. 7

మ. కృతులా రెం డవి రామభారతకథల్, కృత్యంబా వేదోదిత
క్రతుసంప్రీణిత సత్రభుక్కులము మంత్రం బన్న సంగ్రామ ని
ర్జితరాజన్నిజరాజవై భవపునర్నిర్మాణకర్మక్షమం
బతిలోకంబు లహో మహామహుఁడు తిక్కామాత్యుచారిత్రముల్. 8

ఉ. చక్కని శైలి భావములు చక్కని వేకథపట్టు దీపినన్
మిక్కిలి పారవశ్యము నమేయసుఖం బగు భారతంబునన్
దక్కటిసత్కవీంద్రులకు దారి తపఃఫల మాంధ్రభూమికిన్
దిక్కన జీవనౌషధము తెల్గున కింకిట వేయు నేటికిన్. 9

తే. అన్నమాకొమ్మనామాత్యు లాది నేమి
పున్నె మొనరించిరో తిక్కపుత్త్రుఁ బడయఁ,
బావనము సల్పుకొనెఁ గవిబ్రహ్మఁ బాగడి
రసన వసురాయకవి రాజరాజనగరి. 10

## II అబ్బూరి రామకృష్ణరావు గారు

కవికులపుత్త్రు లేయెడల గానము సేతురొ కాని, నేఁడు కై
తవకవితాప్రసూనముల తావులె మమ్ముల నావరించు; మా
ర్దవ ముడుఁగంటియున్న కవితాలత కృత్రిమశోభ చూచి చూ
చి విసుగు వచ్చు నీవలె సృజించు నుదాత్తమనమ్ము లేమిచేన్

ఉ. నీ మహనీయగానరమణీయత వీనులఁ గ్రోలి, పూత కృ
ష్ణామలతోయమందలి ప్రశాంతపు రాగము లాలకించి, శా
ధామలినమ్ము లో బడుఁగుదల్లుల వృత్తము లెల్లఁ గాంచి, యే
సీమల నెవ్వరేని వెలసేయరుగా కవితాప్రపూర్తులన్! 2

ఉ. రాచకులమ్ము ప్రల్లదపు రాగములన్ జపియింప నేర్చి, లో
కాచరణమ్ములన్ సరళమై ప్రవహించెడు జీవవాహినీ
వీచికలం దడంగిన నవీనమనోజ్ఞత లెల్లఁ జూడఁగా
నోఁచని శుష్కమానవమనోగతులన్ గవిత ల్వరించునే? 3

ఉ. నీ కవితాప్రపంచమున నిల్చి దిశ ల్పరికింప, విస్మయ
వ్యాకులలీల నా మది స్వభావమనోహరసస్యసంపదం
జేకొని వెల్గు పర్వతపు సీమలు నిల్చినయట్లు దోఁచు, వీ
ణాకలనాదముల్ రణరణన్మధురంబుగ సందడింపఁగన్. 4

శా. నీ లా వెన్నఁడొ చెల్లిపోయె, నయినన్ నిత్యోదయం బందు శో
భాలీనమ్మగు బాలభూమి, ఋతువుల్ ప్రాపించు; కల్యాణరా
గాలాపమ్ముల సత్కవీశ్వరులు నేయుంజూతు, రట్లైనఁ బ్రా
చీలాలిత్యము లందునే చరమరోచిశ్శ్రేణి యా భానునిన్! 5

తే. చిఱుత లగు మాకు నీదు విస్తృతకవిత్వ
నాగరకత శాశ్వతపుఁ గాణాచిఁ జేసి,
కడచనిన నీ యుదాత్తసంకల్పములను
దలఁపఁ దలఁప నే యానంద మొలయఁబోదు! 6

చ. ప్రణయిని ప్రౌఢదృష్టిఁ దల వంచి, రహస్యమునందు మెల్లమె
ల్లన మధురాధరమ్ము కదలన్ గడుఁ దీయని మాట లాడ నెం
చిన సుకుమారికిం బలె, స్ఫురించు తలంపుల నెల్లఁ జెప్పనో
పని తమితోడ, నాతిరసవంతములై సరిపోవు నా నుడుల్ 7

ఉ. ఓ కవిచక్రవర్తి! వినయోచితవందన మందుకొమ్ము, స్వే
చ్ఛాకవితాప్రచారములఁ జక్కని నీ కవితాప్రసక్తి నెం
దాఁక స్మరింతు, నందలి యథార్థమునన్ ముద మందనేర్తు, నం
దాఁకఁ బవిత్రభావములఁ దాల్తు యశంబు తృణీకరించుచున్. 8

చ. ఎఱుఁగఁగరాక మాటికి స్పృశించు తనూలత నూఁచు భావబం
ధుర మగు శక్తికిన్ వెరవు దోఁపఁగఁ జక్కని రాయబారివై,
తరుణుల నూతనంపుఁ గవితాహృదయంబుల దివ్యగీతముల్
వరపుము, దారిఁ జూపుము కళాజగతీస్థలి నాంధ్రబాలకున్ 9

చ. హిమవదుపాంతపుం బొడుపుటేళ్ళ సితాంబువులం గదల్చు హం
సములవలెన్, భవత్తనయసంతతి శోభితమయ్యె; వింత పు
ష్పములు గృహమ్ములందుఁ దమ వాసనలన్ వెదఁజల్లె సోదర
ప్రముఖుల సోదరీమణుల పావనరాగము లుల్లసిల్లఁగన్ 10

# గ్రామసీమల దుస్థితి — నివారించు మార్గములు

నాగేశ్వరము సుందరము గారు

భారతవర్షాభ్యుదయమునకై దేశబాంధవు లనేక విధముల బహుకాలముగా కృషి సల్పుచున్నందులకు వారికి కృతజ్ఞతను జూపుట విధాయకము. దేశపురోవృద్ధికై పరిశ్రమ చేయుచున్న అమ్మహానీయులకు దేశీయులు సర్వవిధముల తోడ్పడి తా మభివృద్ధి నొంది వారిని మఱవకుండుటయే నిజమగు కృతజ్ఞత. ఇట్టి కృతజ్ఞతను చూపి మన దేశీయులు దేశభక్తులకు తోడ్పడుచున్నారా? దేశాభిమాను లిదివఱకు దేశాభివృద్ధికై సలిపిన కృషి ఫలవంత మైనదా? కానిచో, కారణ మేమి? దేశాభ్యుదయమునకై ప్రస్తుతము విద్యార్థుల కర్తవ్య మేమి?— అని భారతీయు లందఱును విచారింపవలసి యున్నది.

దేశపురోవృద్ధికై విద్యార్థు లేయే ప్రయత్నములు చేయుచున్నారో, ఇప్పటికిని దేశీయులలో నూటికి తొంబదిమందికి తెలియనే తెలియదు. తెలిసిన స్వల్పసంఖ్యాకులలో సైతము నిజమగు దేశాభిమానము జనింపలేదు. జనసామాన్యము తోడ్పడలే దని వారిని దూషించెదరే కాని, విద్యార్థులు తమ డాంబికమును వదలి జనసామాన్యముతో మైత్రి గలిగించుకొని వారిని జ్ఞానవంతులుగ నొనర్చి వారు తమ యుద్యమములకు తోడ్పడునట్లుగ ప్రయత్న మొనరించిగా? లేదు. జనసామాన్య మనిన మూఢు లనియు పామరు లనియు విద్యార్థులు తలంతురు. విద్యార్థు లనిన కపటు లనియు శుష్కవాదప్రియు లనియు జనసామాన్యము తలంచును. వీరి యభిప్రాయభేదములు నశించి యిరువురకు మైత్రి కుదిరినఁ గాని జనసామాన్యము విద్యార్థులకు తోడ్పడఁజాలదు. కావుననే యిదివఱకు తోడ్పడలేదు. ఇట్టి మైత్రిని కలిగించుటకు జ్ఞానవంతు లగు విద్యార్థులే మున్ముందు ప్రయత్నించుట ధర్మము.

ఇఁక దేశబాంధవు లొనర్చిన కృషి ఫలవంత మైనదా యనిన, నవశక్తి ప్రభావమువలన నూతనచైతన్య ముద్భవించి దశదిశలను వ్యాపించుటవలన దేశీయులలో నూటికి పదిమంది యైనను దేశాభిమానులకు తోడ్పడి సాహాయ్య మొనర్చుటచేతనే మన జాతీయ మహాసభ రాష్ట్రీయసభలు మండల తాలూకా సంఘములు సంస్కరణసమాజములు సాహిత్యపరిషత్తులు మొదలగునవి అత్యుత్సాహముతో స్థాపింపఁబడి కొలఁదిగనో గొప్పగనో కృషి చేయుచున్నవి. దేశభాషాభిమానములు ప్రబలి విద్యార్థులయం దైనను కొన్ని మార్పులను గలిగించి జాతీయాభిమానమును కలుగఁజేసినవి. ఇట్టి స్థితి కలిగినందుకు సంతసింపవలసినదే గాని, పై సంస్థాపన లన్నియు ఏ పట్టణములలోనో స్థాపించుటచేత, గ్రామసీమలయం దుండు జనసామాన్యమునకు వానితో సంబంధము కలుగలేదు. కావుననే, జనసామాన్యము పై సంస్థలవలన పొందఁదగిన యుపకారమును పొందలేకపోయినది. కనుకనే, మన గ్రామములు యథాప్రకారముగ నున్నవి. మన గ్రామసీమల దుస్థితిని జూచినచో ఎటువంటి దేశభక్తులకైనను దేశ మభివృద్ధి చెందుచున్న దనుటకు నోరాడునా? కడచిన యర్ధశతాబ్దమందలి మన గ్రామముల స్థితికిని నేఁటి స్థితికిని వ్యత్యాసమంతగా కనుపించుట లే దని దేశాభిమానులు తెలుపుచున్నారు. ఏ పట్టణములనో చూచి దేశ మభివృద్ధి చెందుచున్న దని సంతసించిన లాభము లేదు. కటకటా! ఏమి యీ గ్రామసీమల శోచనీయ వస్థ. అట్టి స్థితిని గనిన, ఏ దేశబాంధవునకు దుఃఖము గలుగకుండును? ఏ దయామయునకు కరుణ గలుగకుండును? తల్లీ! భారతమాతా! నీ పుత్రుల కట్టి దుస్థితి గలిగినది? పగ లంతయు కష్టపడినను త్రాగుట కింత గంజి యైనను దొరకని పాటకపు జనులును, తాతల నాఁటి ప్రాఁత పద్ధతులు వదలలేక లాభము లేని వ్యవసాయమును చేయు కర్షకులును, మొండిధైర్యముతో లాభనష్టములను గణింపక వాణిజ్య మొనరించి ధననష్టమును పొందు వర్తకులును, ఏ దేశమందును లేని హెచ్చు వడ్డికి తమ ధన మిచ్చి ఋణగ్రస్తుల కొంపలు దీయు వడ్డీ వ్యాపారులును, లేనిపోని కక్షలచే తలలు బ్రద్దలుకొట్టుకొని న్యాయస్థానముల కెక్కి సొమ్మును వమ్ముచేసికొను భూస్వాములును, పెద్ద లార్జించిన ధనమును సకలవిధముల దుర్వ్యయముల పాలు చేయు నిర్వ్యాపారు లగు లక్ష్మీపుత్రులును, అనవసరకలహములను సృష్టించి కక్షలు పెంచి ఐకమత్య మంత మొందించి వారిని సర్వవిధముల నధఃపతితులఁ జేయు అగ్రజన్ము లగు కలహకారులును, విలువ గలిగిన తమ కాల మంతయు చీట్లాటలతోడను జూదములతోడను అవాచ్యసంభాషణలతోడను ఆత్మస్తుతి పరనిందలతోడను గడపుచు నాగరకాగ్రేసరుల మని విఱ్ఱవీఁగు సోమరులును, ప్రభుత్వమువారు గ్రామాభివృద్ధికి తమ్మేర్పఱచి రని మఱచి తమ విధికృత్యములను న్యాయముగా నిర్వర్తింపక ప్రజలయొక్క క్షేమమును సౌఖ్యమును అభివృద్ధిని ఆలోచింపక ఏది యెట్లు పోయిన మన కేమని యుపేక్షించు గ్రామోద్యోగస్థులును, గలిగి అంధకారబంధుర మై, క్రూరమృగనివాసయోగ్య మై, ఉగ్రకంటకలతాపరివ్యాప్త మై యుండు ఘోరారణ్యము పగిది గ్రామసీమల స్థితి యున్నది. పాఠకమహాశయులారా! మన గ్రామసీమ లిట్టి స్థితియం దున్నప్పుడు విద్యార్థుల కృషి కేవలము ఫలించిన దని చెప్పుట కవకాశ మున్నదా? మన గ్రామసీమల దుస్థితిని మాన్పి జనసామాన్యమునకు విజ్ఞానము గలుగఁజేయనిచో, దేశ మభివృద్ధి చెందు ననుట కల్ల! ఏ గ్రామవాసులు ఆ గ్రామాభివృద్ధికై కృషి సల్పిన

చో, అచిరకాలముననే దేశ మభివృద్ధి చెందు ననుటకు సందియము లేదు. కావున, దేశాభివృద్ధిని గోరు విద్యార్థులు ప్రస్తుత మొనర్పవలసిన కార్యమేమనిన—ఇదివఱకే దేశాభివృద్ధికై అత్యుత్సాహముతో స్థాపించిన మండల తాలూకా సంఘముల సభ్యులగు విద్యార్థులు తమ మండలము తాలూకాలలోఁ గల గ్రామముల నన్నిటిని విభజించుకొని ఎవరి వంతు వచ్చిన గ్రామములకు వారేఁగి ఆ గ్రామోద్యోగస్థులను పెత్తనదారులను ప్రముఖులగు తదితరులను పిలిచి వారిలో వారికిఁ గల అంతఃకలహములను కక్షలను అసూయలను తమ శక్తియంతయు ధారవోసి మాన్పి యైకమత్యము గలుగఁజేసి ప్రతిగ్రామమునం దొక్కొక గ్రామసంఘ మేర్పఱుపవలెను. ఈ గ్రామసంఘమునందు తుదకు ఇంటి కొకరైన సభ్యుఁడుగ చేరుట మంచిది. పిమ్మట గ్రామాభివృద్ధికై ఆ గ్రామసంఘపక్షమున "గ్రామరక్షణనిధి"ని తప్పక స్థాపింపవలెను. ఈ నిధి లేనిచో ఆ గ్రామాభివృద్ధి గగనకుసుమమే! ధనము లేక యనేక సదుద్యమము లడుగంటినవి. కొన్ని యుద్యమములు జీవచ్ఛవములై యున్నవి. ధనము లేనిచో ఎట్టి ప్రయత్నమును ఫలవంతము కాఁజాలదు. మన మెన్ని సంఘములు స్థాపించినను, ఎంత దృఢతరప్రయత్నము లొనర్చినను ధన మున్నఁ గాని మన యత్నములు సఫలీకృతములు గావు. కనుక "గ్రామరక్షణనిధి" అన్నిటికన్న ముఖ్యమని తలంచి స్థాపింపవలెను. ఈ నిధికి ధన మెచ్చటనుండి వచ్చునని విచారింప నక్కఱ లేదు. ఇదివఱకు మన గ్రామములలో "లంకవేలము పాటలు కోలగారపు పాటలు మొదలగు విధముల వచ్చిన ధనము గ్రామాదాయ మని పిలువఁబడుచు జాతరలకు కొలుపులకు డి. పి. డబ్ల్యూ. వారి ముడుపులకు భూతవైద్యులకు—ఈ మొదలగు అపాత్రదానములకై వృధాగా వ్యయము చేయఁబడుచున్నది. అట్టి వ్యయమును మాన్పి ఆ ధనము నెల్ల "గ్రామరక్షణనిధి"కి తప్పక చేర్పవలెను. ఇంకను, గ్రామసంఘసభ్యుల చందాలు ఇతర ధర్మచందాలు వీని నన్నిటిని పై నిధికి చేర్పవలెను. పిమ్మట ఈ నిధి సాహాయ్యమువలన, ఆ గ్రామముయొక్క స్థితిగతులను బట్టి ప్రథమమున (1) పంచాయితీసభ (2) ప్రారంభోచితవిద్యాశాల (౩) ధర్మపుస్తక భాండాగారము.—వీనిని స్థాపించి ఇవి సర్వజనోపయోగములగునట్లు చేయవలెను. ఇవి తగు సమర్థులచేత నిర్వహింపఁబడనిది ప్రయోజన ముండదు. కావున, కొంచెము జాగ్రత్త గలిగియుండుట యుచితము. పంచాయితీ సభవలన కలహములు నశించి ఐకమత్యము చేకూరునట్లును, ప్రారంభోచితవిద్యాశాలవలన అవిద్య నశించి విద్యయభివృద్ధి చెందునట్లును, ధర్మపుస్తకభాండాగారమువలన చదువరుల జ్ఞానము వృద్ధియగునట్లును, గ్రామసంఘమువారు ప్రబల ప్రయత్నములు చేయవలెను. ఇట్టి ప్రయత్నము పట్టుదలతో చేయనిది ఎన్ని సంఘములు నిధులు స్థాపించినను ప్రయోజనము లేదు. చదువుకొననేనివారిని, ఉపన్యాసముల పురాణముల హరికథల మూలమున, జ్ఞానవంతులను చేయవలెను. ఇట్టి స్థితిని గలిగించి గ్రామసంఘోపయోగమును దృష్టాంతపూర్వకముగ చూపవలెను గాని, సంఘ ముండియు లేనట్లుండుటకంటె మొదలే లేకుండుట మేలు గదా? అటు పిమ్మట, ఆ గ్రామసంఘముయొక్క యభిప్రాయము ననుసరించియు గ్రామరక్షణనిధియొక్క అభివృద్ధిని బట్టియు, క్రమముగ బాలికాపాఠశాల రాత్రిపాఠశాల పరపతిసంఘము మొదలగునవి గ్రామాభివృద్ధికై స్థాపింపవలెను. తరువాత, నిమ్నజాత్యుద్ధరణము అనాథరక్షణము వికలాంగాగంతుకజన సాహాయ్యము మొదలగు దేశోపకారకార్యములను జేయుచుండవలెను. అప్పుడప్పుడు సమర్థులను రప్పించి, "వ్యాయామము ఆరోగ్యరక్షణము గ్రామ పారిశుధ్యము సత్యమతోపదేశము సన్మార్గ ప్రవర్తనము సర్వసౌభ్రాతృత్వము దేశాభిమానము మొదలగు విషయములను వారు బోధించునట్లు చేయవలయును. ప్రతి గ్రామమునను విద్యార్థు లిట్టి కృషి ప్రారంభించి పిమ్మట ఆ భారమును ఆ గ్రామసంఘములవారిపై నిడిన, వారు తమ గ్రామాభివృద్ధికై ప్రబల ప్రయత్నము లవిచ్ఛిన్నముగఁ జేసి సఫలమనోరథు లగుదురు. మన గ్రామములయం దిట్టి కృషి జరిగినచో, అనతికాలముననే జనసామాన్యమునకు విజ్ఞానము గలిగి విద్యార్థు లొనర్చు ప్రతి యుద్యమమునకు వారు సాయపడెదరు. అట్లు సాయ మొనర్పఁబడెనేని శీఘ్రకాలముననే మన దేశ మభివృద్ధి చెంది తీరును. ఇట్టి స్థితి గలిగినపుడు మన సభలలోని తీర్మానములు ప్రజా సమ్మతములు గావనియు విద్యార్థు లీ తీర్మానములను ప్రజాపరముగ చేసి పంపుచున్నారనియు వచ్చియున్న యపనిందలు తొలఁగి ప్రజలే యీ తీర్మానములు చేయుచున్నారని ప్రభుత్వమువారును గ్రహించి, మన సభలు కోరుచున్న స్థానికస్వపరిపాలనము భాషాప్రయుక్తరాష్ట్రములు దేశభాషా విశ్వవిద్యాలయములు మొదలగు న్యాయమగు కోర్కెలను సఫలీకృతము గావించెదరు. ఇట్టి దేశసేవను చేయుటకు విద్యార్థులు కొంచెమైనను స్వార్థత్యాగము చూపవలసియున్నది. ఇట్లు మన విద్యార్థు లందఱును ప్రయత్నింపవలెను గాని, ఏ మండలసంచార కార్యదర్శులవల్లనో, ఏ నలుగురు దేశసేవకాసంఘ సభ్యులవలననో యీ మహాకార్యము నిర్వహింపఁబడుట కవకాశము లేదు. తాము విద్యార్థులైనందుకు తమ మాతృదేశసేవ నే మాత్రమైనను చేసి దేశమాత ఋణము దీర్చుకొనుటకు విద్యార్థు లందఱును ప్రతినపూనవలెను. కావున, దేశాభిమాన మాననీయులగు నో విద్యాధురీణులారా! మీ మాతృదేశమును సకలవిధముల నభివృద్ధి నందఁజేసి ప్రాచీనౌన్నత్యమును చేకూర్పఁదలఁచితిరేని, మీరు సభలయందిచ్చు గంభీరోపన్యాసములు హృదయపూర్వకము లగునేని, మాతృదేశారాధనతత్పరులై స్వార్థత్యాగులై నిష్కామసేవావ్రతులై దేశమాత నొక్క పర్యాయము మనశ్శుద్ధితో తలంచుకొనుఁడు. భారత మహాపురుషుల నాదర్శముగ నుంచుకొనుఁడు. మీరు నిర్మింపఁబూనిన జాతీయసౌధమునకు పునాది యనఁదగినట్టియు నిమ్నస్థితియం దున్నట్టియు గ్రామసీమల యభివృద్ధికై ముమ్మరము ప్రయత్నింపుఁడు. దేశోద్ధారకు లని యశము గాంచుఁడు. భరతమాతకు సంతసము గలిగింపుఁడు.

# కవి ధూర్జటీ

ముట్నూరి సుబ్బారాయఁడు గారు

స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో
యతులితమాధురీమహిమ?— యం చొకనాఁ డల కృష్ణరాయభూ
పతి భవదీయదివ్యతరవాగ్రచనావిభవంబుఁ గాంచి తో
షితహృదయాంబుజుం డయి వచింపఁగనే "భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారసం
తతమధురాధరోదితసుధారసధారలఁ గ్రోలుటన్ జుమీ"
క్షితిపతి! యంచు నొక్క కవిశేఖరుఁ డల్లన నా సమస్య పూ
రిత మొనరించె; నిక్కము నెఱింగి వచించెనొ? హాస్యమాత్రక
ల్పితముగఁ జెప్పినాఁడొ? పృథివీపతి మెచ్చఁగ నోర్వలేక నీ
వితతయశోపురంధ్రిని వివేకము మాటఁ దలంపకే కళం
కిత మొనరింపఁబల్కెనొ? యొకింతయునున్ నిజ మిట్టి దంచుఁ బం
డితజను లెవ్వరేనియు గణింపఁగలే; రటు లైనఁ గాని య
ప్రతిమకవిత్వతత్త్వమున భక్తిరసోచితభవ్యకావ్యసం
తతులఁ గరంబుఁ గూరిచి సుధాకరమౌళిసమర్పణంబు గాఁ
గుతలమునన్ బ్రతిష్ఠ నెలకొల్పిన నిన్నల పద్య మొంచి నిం
దితు నొనరించి పల్కెదరు నేఁటి జనంబులి దేటి పాపమో!
మతిఁ దలపోయఁబో రకట! మానుగ నవ్వులపట్లఁ గ్రీడ లా
డు తరుణమందుఁ గ్రోధముఁ గడున్ గనినప్పటి పల్కు పాడియే?
అతితరహాస్యకల్పనల నన్నరపాలుని ప్రోలఁ జాల ధీ
చతురతఁ జూపి సర్వకవిసంఘము నిట్టులె కీడ్వడంగఁ గు
త్సితుఁ డయి యోర్వ కొక్క కవి చెప్పిన పద్యము నమ్మఁజెల్లునే?
ప్రతిభఁ దనర్చు నీదు శివభక్తిపరాయణతామహత్త్వ మం
చితగతి నెంచరాదె యపనింద ఘటి పకముందు? నిక్క మే
గతిఁ గనుఁగొంద్రు! నీ మెడను గట్టితి వక్కట తావళంబు, ది
ద్దితివి విభూతి పుండ్రములు తీరుగ; శంకరుఁ గీర్తనం బొన
ర్చితి విటు మూఢభక్తిని జరించితి వంతియ; బాహ్యచిహ్నవ
ర్జితముగ దేవదేవుని భజించు టెఱుంగవు, నీదు భక్తిప
ద్ధతులు రుచించునే యిపుడు? తప్పిద మింకొక టున్న, దాంధ్రభా

రతిఁ(1) గనుమా: "యురోజములు రాయఁగ రాపడెరో" మ్మటంచునే
కతమునఁ గాళహస్తిశతకంబున వ్రాసితి? వంతఁ బోక యే
కతన "వధూనఖాగ్రములఁ గాయలు గాచెను కాయ" మంచుఁ బ
ల్కితి? విఁక సందియంబు లవవేశము లే, దపరాధమున్ స్వయం
కృత మయిపోయెడిన్, నగవ నేల? వధూపద మన్యకామినీ
గత మయిపోయినప్డు రసికత్వము వేశ్య వినా జగంబునం
దితరము లేనియప్డు, జను లిట్టి విమర్శకు లైనయప్డు, శా
శ్వతముగ ధాత్రిలో నపయశంబు ఘటిల్లదె నీకు ధూర్జటీ!
"సతతము దాఁటు బిత్తరుల చన్నుల దండకుఁ గోతి రీతిగా
నతితరళంబు మానస"(2) మటంచును గావ్యముఖంబునందు వ్రా
సి తనదినట్టి కూచి నరసింహము నెంతటి నిందఁ గూర్చె మున్
బతితునిఁ జేతురో గద సెబాసిఁక ముందు విమర్శకాగ్రణుల్!

(1) ఆంధ్రభారతి పత్రిక—1913
(2) గౌరాంగ చరిత్రము

# శ్రీరామ జననము

కిరణము గుండురావు గారు

శ్రీ తారక బ్రహ్మమూర్తియు శ్రీ మహావిష్ణ్వంశ సంభూతుఁడును నగు శ్రీరామచంద్రుఁడు ఎప్పుడు నన్ను సంహరించు నని సనత్కుమార మహామునులను రావణ బ్రహ్మ ప్రశ్న చేయఁగా, ఈ దిగువ నుదాహరించిన చొప్పున ప్రత్యుత్తర మియ్యఁబడెను.

సీ. వేల్పులు గావించు విన్నపంబులు వించు
హరి నన్ను వధియింప నాత్మ నెంచు
రవికులాబ్ధి జనించు రామనామము గాంచు
తపసి జన్నము గాచు రిపుల నొంచు
శిలఁ జెల్వ నొనరించు శివుని చాపముఁ ద్రుంచు
జానకి వరియించు సంతసించు
జామదగ్నిఁ గలంచు జనకాజ్ఞఁ బాలించు
మునివృత్తి ధరియించు వనిఁ జరించు
నీ సహోదరి ముక్కు ఖండింపఁ బంచు
సరగ ఖరదూషణాదుల సంహరించు
అవనిసుత నీవు గొనిపోవ నాగ్రహించు
అది నిమిత్తంబుగా రాముఁ డని వధించు.

శ్లో. తతశ్చ ద్వాదశే మాసే చైత్రే శ్రీనవమీ తిథౌ
నక్షత్రే దితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోకనమస్కృతమ్.

స్వస్తి శ్రీ త్రేతాయుగాంతే శ్రీ విళంబినామసంవత్సరే చైత్ర బహుళ నవమీ గురువాసరే పునర్వసునక్షత్రే సూర్యోదయానంతరే అభిజిద్వేళాయాం కర్కాటకలగ్నే ఇనవంశపయఃపారావార దివ్యరాకాచంద్రసదృశశ్చ భక్తబృందమానసకల్పతరు శోభాయమానఫలసదృశ శ్రీరామచంద్రపరబ్రహ్మమూర్తి రావిర్భూయాత్.

తత్కాలగ్రహసంపత్తిః

| | | | |
|---|---|---|---|
| శు | గ | బు | |
| | కర్కటకరాశిః | | చం గు. ల |
| కు | | | |
| | | శ | |

స్వస్తి సన్మంగళానిభవంతోబ్రువంతు. నిత్యశ్రీనిత్యమంగళమ్.

# జర్మని చక్రవర్తి

విలియము కైయిజరు

పుష్పములకు పరిమళమువలె వ్యక్తులకును, గుణదోషములు సహజసిద్ధములు శ్రీరాముని సుగుణసంపదయును రావణుని దుర్నయంబులును ప్రారబ్ధకర్మఫలములు మనుజుల సుకృతదుష్కృతములకు ప్రారబ్ధము మూలబీజము దేహికి సంచితమైన కర్మములకుఁ దగిన దేహము పరిస్థితులు సహజముగఁ గలుగుచుండును ఆత్మవికాసమునకై కర్మవిపాకమునకుఁ దగిన చిత్తవృత్తులు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు జీవములకు సంభవములు సాముద్రికశాస్త్రజ్ఞులు రూపరేఖావిలాసములను బట్టియు ముఖరూపశాస్త్రజ్ఞులు ముఖవైఖరిని బట్టియు మనుజుల భాగ్యభోగములను శీలములను నిర్ణయించుచుందురు వంశానుగతంబైన రూపము శీలము వంశజులందు వికసించుట ప్రకృతిధర్మము విత్తునందు చెట్టువలె వ్యక్తియందును చిరకాల సంవర్ధితంబులైన గుణధర్మములు సంప్రతిపాదితములు



1½ సంవత్సరము

కైయిజరు రూపమునందు హోహెంజొల్లెరిన్ వంశజులకు సహజములైన రూపవిలాసములు ముద్రితములు శీలము ప్రతిపాదితము ధర్మము సంస్థాపితము జర్మను జాతీయోద్ధరణమునకును లోకకల్యాణమునకును హోహెంజొల్లెరిను వంశజులు తమ శక్తిసామర్థ్యములను ధారవోసిన విషయము ఇతిహాసప్రసిద్ధము పరస్పరవైషమ్యముల కాలవాలమై దుర్బలదూషితములైన జర్మనురాష్ట్రములం దేకజాతీయభావము నుదయింపఁజేసి ఫ్రెడరికు మహామహుఁడు సర్వరాజ్యాధికారమును ప్రష్యారాజ్యమునందు కేంద్రీకృతము చేసెను ఆ మహామహుఁడు నాటిన బీజమును పోషించి పెంచిన రెండవ విలియము చక్రవర్తి హోహెంజొల్లెరినులందు సహజముద్రితములైన గుణరూపశీలంబులను బడసెను వర్తమానకాలమునందు జర్మను చక్రవర్తిపేరు లోకవ్యాప్తమైన ప్రసిద్ధిని బడసినది జర్మను దేశమునందు ప్రజలకు చక్రవర్తియందు సంపూర్ణవిశ్వాసము గలదు చక్రవర్తి ప్రతిపక్షులును జర్మనుసామ్రాజ్యమునందు వాని నిరుపమాన సామర్థ్యమును శ్లాఘించెదరు లోకవినాశకరంబైన భీకరసంగ్రామమువలన చక్రవర్తిగుణావగుణంబులు లోకమునకు వ్యక్తములు

మనుజుల జీవితములు దురవగాహములు వివిధగుణపరిశోభితులైన జనులు పుట్టుచు గిట్టుచుందురు స్వార్థపరాయణులు పరార్థఘటకులు, ధీరులు భీరులు, శ్రీమంతులు దరిద్రులు, పండితులు మూఢులు లోకపరిణామప్రాప్తికై పుట్టుట సృష్టివైచిత్ర్యము భావిపురుషలక్షణములు బాల్యదశయందును నుపలక్ష్యములు క్షేత్రమునందు నాటిన బీజములు భావికాలమున ఫలిం

చును బీజములు సారహీనములైన, ఫలము సారరహితము బీజములు రసవంతములైన ఫలము రసవంతము. జర్మను చక్రవర్తియందు వ్యక్తములైన గుణబీజములు వర్తమాన కాలమునందు పరిపక్వత నొందినవి. బాల్యదశయందును విలియమునందు అసహనము కార్యనిర్వాహణ పరత్వము అధికారాభిమానము స్వోత్కర్షాభిలాష నిర్దాక్షిణ్యము సువ్యక్తములు రుష్యా మంత్రి గోర్ట్షకాఫు జర్మను రాకొమారుని గుణంబుల నిట్లు వర్ణించెను:

"హెూహెన్ జొల్లెర్న్ రాకుమారుని ప్రతిభ పూర్వరాజుల ప్రతిభ నతిక్రమించును ఆయన జర్మను సామ్రాజ్యమునకు కీలకమగును వాని శక్తిసామర్థ్యములు లోకమునకంతకును వ్యక్తము లగును కాలము సంప్రాప్తమైనపుడు యూరొపునకు విభ్రమమును బుట్టించును'



10 వ సంవత్సరము

ఆ భావములు జర్మను దేశ చరిత్రవలనను కెయిజరు జీవిత చరిత్రవలనను వ్యక్తీకృతములు రెండవ విలియమునకు ఆత్మవిశ్వాసము, వ్యగ్రోత్సాహము, అసహనము, అభిమానము సహజగుణములు యూరపు రాజులందు కెయిజరునకుఁ గల సర్వతోముఖమైన ప్రజ్ఞ మరెవ్వనికి లేదు. [illegible] ప్రజ్ఞాప్రకర్షమునందును కెయిజరునకు ప్రతిమాన నైపుణ్యము గలదు. మూఁడవ ఫ్రెడరికు 1888-వ సంవత్సరమున కాలధర్మము నొందెను. [illegible] రెండవ విలియము సామ్రాజ్య సింహాసన మధిష్ఠించెను [illegible] గతించిన 27 వత్సరములనుండి జర్మను సామ్రాజ్య ప్రభుత్వ [illegible] [illegible] [illegible] చిన్ననాటినుండియు [illegible] రిను వంశజునియందు సైన్యశిక్షణ రాజసమ ప్రదీపితము. సైన్యవ్యవస్థలు నౌకాదళసంస్థాపనలు హృదయప్రమోదములు. ఏడవ యేటను రాజభటులు నమస్కృతులు చేయనపుడు కుపితుఁడై తండ్రికిఁ దన యవమానమును దెలిపెను. సైన్యవేషధారులు సామాన్యవేషధారులకు నమస్కృతుల నొనర్చుట సైన్యశిక్షణ ధర్మమునకును గౌరవమునకును విరుద్ధమని తండ్రి తెలిపినపుడు బాలునకు సంతృప్తి గలిగెను. చక్రవర్తియందును సైన్యవర్గమునందును, సుస్థిరస్థాపితమైన రాజసాభిమానమునకే యుదంతము నిదర్శనము. బాల్యమునందు నాటిన గుణబీజములు కాలప్రవర్థితములై ఫలవంతము లయినవి.

విలియమునకు డాక్టరు హింజ్పీటరు గురువు. గురు వసహనశీలుఁడైన రాజపుత్రునకు శమాది గుణసంపదల నభ్యస్తము చేయఁ బ్రయత్నించుచుండెను. ఫరాసులు 1871-వ సం నందు ప్యారిసు సుందరనగరమును జర్మనుల వశము చేసిరని విలియము వినినపుడు పట్టలేని సంతోషముతో టోపీ నెగరవేయుచు చిందులు త్రొక్కుట కుపక్రమించెను. గురువు శిష్యుని యుద్ధృతమును జూచి శాంతస్వభావముతో నిట్లు మందలించెను.

"నగరసమర్పణము చేసిన ఫరాసులు భాగ్యోపహతులు వారు శౌర్యప్రతాపములతో పోరాడిరి ధైర్యస్థైర్యములతో నిలువఁబడిరి లాభము గలుగకున్నను మన యానందము వారి సైన్యమునకుఁ గారణ [illegible] రాజపుత్రా [illegible] "

[illegible] 1878-వ సంవత్సరమున ప్రచ్ఛన్నముగ [illegible] [illegible]

జితులై ఏఁడేండ్లు గతించినవి. మూఁడు వందల కోట్ల రూప్యములు జర్మనులకు సమర్పణ చేయఁబడినవి. కాని, మహాప్రదర్శనమునందు పరాసుజాతి ప్రకటించిన విజ్ఞానము, నైపుణ్యము, గాంభీర్యము, వైభవము విస్మయదాయకములు. ప్యారిసునగరసమ్మోహము, పరాసు రక్తబాంధవ్యము విలియము హృదయక్షేత్రమునందు ఫ్రాన్సుదేశముపట్ల స్నేహబీజమును నాటినవి.

భావిసామ్రాజ్యాధీశున కుచితమైన విద్యాశిక్షణమును విలియము పొందుట కేర్పాటులు చేయఁబడినవి. ప్రజాభావ పరిజ్ఞానమునకు ప్రజల సన్నిహిత సాహచర్యము సాధనము. ఏకాంతవాసులకు, రమ్యహర్మ్యవిహారులకు ప్రజల కష్టసుఖములు భావశీలములు అపరిచితములు; అజ్ఞాతములు. యూరపు రాజ్యములందు రాజపుత్రులు సామాన్య పాఠశాలలలో విద్య నభ్యసించుట వాడుకకు వచ్చుచున్నది. విలియము విద్యాభ్యాసమునకై సామాన్య పాఠశాలయందు చేరినపుడు జర్మను దేశమునందు కులీనులు రాజకుటుంబమునకుఁ గళంక మనిరి; సామాన్యులు రాజుల వంచనోపాయ మనిరి; మధ్యస్థులు వశీకరణోపాయ మనిరి. విలియము ఫ్రెడరికు మహామహుని మనుమఁడైనను, కాసెలు జిమ్నాజియం పాఠశాలయందు సామాన్యజనులతో సమానముగ విద్య నభ్యసించెను. సామాన్య విద్యార్థులవలె దుస్తులను ధరించెను. బొగ్గులను మోసెను. బూడిదను ఎత్తివేసెను. కాలకృత్యములను నెఱవేర్చెను. పాఠశాలను వదలునపుడు శాలాధికారులు విలియము వివేకమును సమయనిష్ఠను పరిశ్రమశీలమును మెచ్చుకొనుచు నొక పతకము నొసంగిరి. విలియము 1877-వ సం.నందు బను కళాశాలలోఁ జేరి నాలుగేండ్లు విద్య నభ్యసించెను. శాస్త్ర విద్యాభ్యసన కాలమునందును విద్యార్థిదశ కనువగు ద్రవ్యమును మాత్రమే విలియము పొందుచుండెను. భావిచక్రవర్తి మితవ్యయశీలుఁడై సకల విద్యల నభ్యసించెను. చదువు చాలించిన తరువాత విశ్రాంతికై ప్లాస్ప్రింకెనౌ అను స్థలమునకుఁ బోయెను. ఆస్థలము ష్లెస్విగుహోల్‌స్టీను రాజులది. ఆ రాజుల రాజ్యమును జర్మను లపహరించి స్వీయసామ్రాజ్యమునం దుఁ జేర్చిరి. విలాసవతియైన అగస్టా విక్టోరియాం రాకుమారి ఆ వంశజుఁడైన ఫ్రెడరికు ప్రభువునకు తనయ. ఆ సుందరాంగిని జూచి సమ్మోహితుఁడై పెండ్లిని నిశ్చయించెను. రాజ్యము సంపదలు లేని రాకుమారిని పెండ్లియాడుట తగదని బంధువులు విరోధించిరి. పరిణయమే రాజ్యాపహరణమునకుఁ దగిన ప్రతీకార మనియు, సాంత్వనోపాయ మనియు విలియము నిశ్చయించెను. విలియము అగస్టసు విక్టోరియా రాకుమారిని 1881-వ సంవత్సరమునందు మహావైభవముతో పెండ్లియాడెను. పరిణయము వలన హోహెన్‌జొల్లెరను వంశజులకును హోల్‌స్టీను వంశజులకును గల శత్రుత్వము పోయి మిత్రత్వము కుదిరినది.


14-వ సంవత్సరము

విలియము రాకొమరునకు బాల్యదశనుండియు జర్మను సైన్యబలమునందు సంపూర్ణాభిమానము గలదు. భావిరణరాజునకు సైన్యవృత్తి గౌరవభాజనము, సమాదరణీయము. సైనికుల శిక్షణమునకై ఎండను వానను మంచును దుమ్మును పాటింపక నాయకత్వమును బూనుచు మైలుల దూరము పోవుట విలియమునకు సామాన్యము. రాజపుత్రుని వేషమును శీలమును

వృత్తిని జూచి శాంతికాములు "అల్లదిగో రణరాజు పోవుచున్నాఁడు" అని గుసగుసలాడుచుండిరి.

ఉద్ధృతకృత్యములు దురంతములు; జనాపవాద కారణములు. శ్రీ విక్టోరియా మహారాజ్ఞి జూబిలీ మహోత్సవమునకు చక్రవర్తియు రాజపుత్రుఁడును పిలువఁబడిరి. జర్మను చక్రవర్తి కంఠరణబాధ పడుచుండియు నత్తగారి పిలుపును నిరాకరింపఁజాలక లండనునగరమునకు మహోత్సవసందర్శనార్థమై పోయియుండెను. విలియము రాజపుత్రుఁడును స్వతంత్రించి మహోత్సవ సందర్శనమునకై లండను నగరమును జేరి తండ్రికి విస్మయమును గలిగించెను. రాజుల యుత్సవశ్రేణియందు తండ్రిని దాఁటిన గౌరవమును బడయుటకై విలియము చేసిన ప్రయత్నములు జనాపవాదమునకు గుఱియైనవి. తండ్రి పక్షావలంబనులు విలియమును నిందించిరి. రాకొమారుఁడీ యపవాదమును నిర్లక్ష్యభావముతో నిరాకరించెను. విలియము ప్రవర్తన తండ్రికిని కొడుకునకును మనస్పర్ధను గలిగించెను.



22-వ సంవత్సరము

మూఁడవ ఫ్రెడరికు 1888-వ సం. జూను 15-వ తేదిని కాలధర్మము నొందెను. మరణవార్తను వినిన వెంటనే విలియము సైన్యనివహంబులతో రాజగృహము నాక్రమించుకొనెను. ఈ విచిత్రకృత్యము లోకమున కచ్చెరువును బుట్టించినది. ప్రజలు పరిపరివిధముల భావించిరి. జనకుని మరణము పుత్రుని రాజమందిర సైన్యాక్రమణము. ఎన్ని యూహల నైనను కల్పింపవచ్చును. కాని, నిజము తెలిసినపుడు ప్రజలు విలియమును శ్లాఘించిరి. తండ్రికి పుత్రుని గుణశీలంబులు సరిపడకుండెను. తండ్రి ముప్పదేండ్లుగ వ్రాసిన చరిత్రయందు పుత్రుని దుర్నయములను దుశ్శీలమును వర్ణించెను. ఆ చరిత్రను ఫ్రెడరికు పక్షావలంబనులు ప్రకటింపవలయు నని ప్రయత్నించిరి. విలియము తన యుక్తిస్థైర్యములవలన నా చరిత్ర నపహరించి తన గౌరవమును గాపాడుకొనెను.

సింహాసనము నధిష్ఠించిన కెయిజరు సైన్యమునకుఁ బ్రకటించిన యాజ్ఞాపత్రము జర్మను చక్రవర్తి యొక్క సహజస్వభావమునకుఁ బ్రమాణము. "మన యుభయులకు నాకు సైన్యమునకు సన్నిహితసంబంధము గలదు. మన మన్యోన్య లాభమునకై యవతరించితిమి. భగవత్సంకల్పము మనకు శాంతిని బ్రసాదించుటయైనను సంరంభమును సమకూర్చుట యైనను సుస్థిరముగను నభేద్యముగను మనము నిర్వహించెదము." ఈ యుద్ధరతవాక్యములు లోకమును కలవరపఱచుటయందు వింత లేదు. కెయిజరు తన సంకల్పప్రాప్తికి ప్రజాసాహచర్య మవసర మని బాల్యదశనుండియు గ్రహించెను. ప్రజాసభ్యత జర్మను దేశమునందు విశేషవ్యాప్తిని గాంచినది. ప్రజాసభ్యవాదులను చేరఁదీయుటకు కెయిజరు చేసిన ప్రయత్నములు విఫలము లైనను కెయిజరు స్వభావనిరూపణమునకు నిదర్శనములు. కెయిజరు ప్రజలకు సమర్పించిన రాజాజ్ఞాపత్రమునం దీ వాక్యములు గలవు "నేను సర్వేశ్వరుని సాన్నిధ్యమున నీ ప్రతిజ్ఞను జేసితిని: నా పూర్వజుల రీతిని నా ప్రజలను ధర్మమార్గమున దయతో నేలుదును. దైవభక్తిని పాపభీతిని గలిగించెదను. శాంతిని గాపాడెదను. దేశక్షేమము

నభివృద్ధి చేసెదను. దీనులను బోషించెదను. దురదృష్టవంతుల నాదరించెదను. శిష్టులను రక్షించెదను."

ఈ భావసంసిద్ధి సులభసాధ్యము గాదు. సకల ప్రజలకు సంతుష్టిని గలిగించుట సర్వశక్తిసంపన్నుండైన సర్వేశ్వరునకు సయితము సాధ్యము గాదు. ప్రజాసభ్యత్వవాదుల ధన్యవాదములను బడయుటకై కెయిజరు సకలజాతీయప్రజాసభ్యత్వవాదుల మహాసభను సమావేశము చేసెను. జర్మను సామ్రాజ్యనిర్మాతలలో నగ్రగణ్యుఁడైన బిస్మార్కు మంత్రిపుంగవునకీ సభాసమావేశ మసమ్మతము. బిస్మార్కు కఠినాత్ముఁడు. నిశ్చలచిత్తుఁడు. దృఢవ్రతుఁడు. చాణక్యునివలెను రిషెలివలెను కుటిలతంత్రజ్ఞుఁడు. కాని, బిస్మార్కు తన ప్రజ్ఞను పాండిత్యమును దేశసేవకును రాజసేవకును వినియోగించెను. సంపూర్ణస్వాతంత్ర్యాభిమానము గల వ్యక్తులకు సంఘర్షణము సహజము. చక్రవర్తికి మంత్రిసత్తమునకు భేదభావము గలిగినది. ప్రజాసభ్యత్వవాదుల మహాసభ బర్లిను నగరమునఁ బిస్మార్కు మందిరమునఁ గూడినది.



25-వ సంవత్సరము

చక్రవర్తికిని ప్రజాసభ్యత్వవాదులకును సంయోజము గలుగలేదు. భేదము స్థిరపడినది. చక్రవర్తి భావములప్రశస్తములైనవి. బిస్మార్కు భావములు విజయమును బడసినవి. బిస్మార్కు పక్షావలంబనులు చక్రవర్తి బాలిశభావమును బరిహసించిరి. చక్రవర్తి హృదయమునందు క్రోధానలము రగుల నారంభించెను. ఉభయులకును ప్రచండమైన వాగ్వివాదము గలిగినది. బిస్మార్కు మంత్రిత్వమును జాలించుకొనియెద నని బెదరించెను. కెయిజరు మంత్రిమాటలను నిజముగ గ్రహించి మంత్రిని పదచ్యుతునిఁ జేసెను. మంత్రిత్వాధికారమును చక్రవర్తి వశపఱచుకొనెను. కెయిజరు "స్వయం రాజా స్వయం మంత్రీ" యను నార్యోక్తిని ధ్రువపఱచెను. లోకమంతయును కెయిజరును కృతఘ్నుఁడని తూలనాడినది. సామ్రాజ్య నిర్మాణకుఁడును ప్రతిఘటనసమర్థుఁడు నగు బిస్మార్కు మంత్రిశేఖరుఁడు అవమానితుఁడయ్యెను. ప్రజాసభ్యత్వాభిమానమును బూననెంచిన జర్మను చక్రవర్తి సర్వాధికారాభిమానమును బూనెను. చక్రవర్తి సర్వాధికారాభిమానమే అప్రతిమానమైన జర్మను సామ్రాజ్యాభివృద్ధికిని తదనురూపమైన పతనమునకును గారణమైనది. రాజ్యాంగరంగమునుండి బిస్మార్కు నిష్క్రమణము కెయిజరు ప్రతిభను హెచ్చించెను. జర్మను రాజ్యాంగమునందు కెయిజరు రాజ్యాధిపతి, కోశాధిపతి, సేనాధిపతి, నౌకాదళాధిపతి, విదేశాంగమంత్రి, స్వదేశాంగమంత్రి. సామ్రాజ్యసాంఘికజీవనమునందు చక్రవర్తి యోధాగ్రేసరుఁడు, మతబోధకుఁడు, కవిశేఖరుఁడు, కళాభిజ్ఞుఁడు, పరిశ్రమనిర్మాణకుఁడు, వాణిజ్యవ్యాపకుఁడు, వ్యవసాయసంరక్షకుఁడు.

జర్మను జాతీయాకాంక్షితములు భావములు జర్మను చక్రవర్తియందు మూర్తీభవించినవి. గతించిన 25 ఏండ్లలోను చక్రవర్తి సామదానభేదదండనోపాయములను స్వదేశపరదేశములందు సమయోచితముగ నుపయోగించి సుశిక్షితమైన సైన్యబలమును నౌకాబలమును స్థాపించి రణరాజను ప్రతీతిని గడించెను. జర్మను సామ్రాజ్యమును వ్యాపింపఁజేసెను. వాణిజ్యమును విజృంభింపఁజేసెను. పరిశ్రమలను బలపఱచెను. ప్రజ

లయందు మాతృదేశారాధన సాధనంబైన దేశభక్తి నుదయింపఁజేసెను. ఈ మహాత్కార్యపరంపరలను, బలమును ప్రకటించినను, దండనోపాయమువలనఁ గాక సామోపాయమువలననే సాధించెను. చక్రవర్తి యాశ హద్దు దాఁటినపుడు సామోపాయ మనుపయోగమై దండనోపాయ మవసరమై వర్తమానమహాసంగ్రామ దావానలము లోకము నావరించినది. దావానలప్రజ్వలనమునకు కెయిజరు మూలకారకుఁ డని ప్రాజ్ఞులు నమ్ముచున్నారు. పట్టాభిషేక సమయమున "భగవత్సంకల్పము మనకు శాంతిని ప్రసాదించుట యైనను సంరంభమును సమకూర్చుట యైనను సుస్థిరముగను నభేద్యముగను మనము నిర్వహించెదము" అని కెయిజరు ఉద్ఘోషించిన గంభీరభావవిస్ఫురణ క్రమారూఢమున పరిణమిల్లుచున్నది.



49-వ సంవత్సరము

ప్రఖ్యాత పురుషుల గుణావగుణములను విమర్శించుట దుస్తరము. కెయిజరు గుణములను పరిగణించుటకును దోషముల నెన్నుటకును విశేషజ్ఞులు సమర్థులు. ప్రపంచమునందు సర్వగుణ సంపన్నుల ప్రసంభవ మపురూపము. సుగుణసంపన్నులును నవగుణాన్వితులు. దుర్మార్గులును సుగుణసంకలితులు. ప్రఖ్యాతపురుషుల జీవితములందును గుణదోషములు ప్రకృతిసిద్ధములు. పందొమ్మిదవ శతాబ్దమునందు రణకోవిదుడు నెపోలియను మహామహుఁడు ప్రఖ్యాత పురుషుఁడు. ఇరువదవ శతాబ్దమునందు రణరాజు విలియము ప్రఖ్యాత పురుషుఁడు. కెయిజరునకు నెపోలియనునకు గల విపరీతమైన తృష్ణగలదు గాని రణనీతి విజ్ఞానము లేదని పండితుల మతము. కెయిజరునకు నెపోలియనుకు గల సైన్యవిన్యాస కౌశలము గాని, ప్రస్థాన వ్యూహకౌశలము గాని కల వని నమ్ముటకు నిదర్శనములు లేవు. కెయిజరు పట్ల దండనాయకులకు గౌరవ మున్నను నెపోలియను పట్ల దండనాయకులకు గల సంపూర్ణ విశ్వాసము గానరాదు. అసహిష్ణుత జర్మను చక్రవర్తియందు మూర్తీభవించిన దనుటకు బిస్మార్కుపట్లఁ జూపిన యవినీతియును దండనాయకులపట్లఁ జూపుచున్న యసహనమును నిదర్శనములు. చక్రవర్తికి స్వోత్కర్ష సహజశీలము. తండ్రికిఁ జూపిన యవిధేయత స్వీయ సామర్థ్యమునందు విపరీతమైన విశ్వాసమునకు ప్రమాణము. కెయిజరునకు నిరతిశయ వ్యవసాయ పరాయణత్వమునకు జర్మను బలములు, జర్మను పరిశ్రమలు, జర్మను నౌకాదళములు, జర్మను ప్రతిభ నిదర్శనములు. చక్రవర్తి దేశౌన్నత్యమున కవసరమైన సమస్త వ్యవస్థలను నిర్ణయించుట కుపక్రమించును. ఈ యహంభావమే జర్మను సామ్రాజ్య విప్లవమునకును యూరపు బల విప్లవమునకును బీజము. పాశ్చాత్యాహంకారము జర్మను చక్రవర్తియందు మూర్తీభవించినది. చక్రవర్తియు ప్రజలు జర్మనుల భోగభాగ్యములకై యూరపు ఖండము ఇతరఖండములు గల వని నమ్ముచు లోక సంహారమున కుపక్రమించిరి. చక్రవర్తియొక్క మతావేశమునందును, లాభాపేక్షయందును, బలదర్ప ప్రదర్శనమునందును పాశ్చాత్యాహంకారము ప్రత్యక్షము. శ్రీరామచంద్రుని బోలిన ధీరోత్తములకు గల పితృభక్తి, కృతజ్ఞత, త్యాగము, నిగ్ర

హము: ఆత్మసంయమనము జర్మనుచక్రవర్తియం దపురూపములు. అహంకారము, మమకారము, బలము, దర్పము రాజస భావములు. యూరపు రాజ్యములందు యథేచ్ఛగ విహరించుచున్న రాజసమునకు కైజరవతారమూర్తి. ధర్మాధర్మములకు వలె సాత్విక రాజసములకు సంఘర్షణము సహజము. ఆ సంఘర్షణము నందు రాజసమునకు పరాజయము సాత్వికమునకు విజయము ధ్రువము. దశావతార చరిత్రలను జదివిన వారలకీ భావము విదితము. కైజరు యుగ సంధియం దవతరించెనే రావణాదులను బోలిన ధీరుఁడుగాని ధీరోత్తముఁడుగాఁడు. ధీరు లహంకార ప్రేరితులు ధీరోత్తము లహంకార విముక్తులు. జర్మను చక్రవర్తి ప్రతిభ వర్తమాన కాలమునకు సమ్మోహజనకమైనను ధర్మాయుత్తమైన లోకాభ్యుదయమునకు ప్రతికూలము. భయంకరము.

# హిందూ విశ్వవిద్యాలయము

గో. రమాకాంతాచార్యులు గారు

వసుయుతుఁడు గవీంద్రుఁ డదె ప్రాగ్దిశనుండి నిజ ప్రకాశము
ల్లసితముఖప్రతీచికి సలాపముగా వెదఁజల్లి తన్నుతిన్
వెసఁ గొనుచున్నవాఁడు, రిపువీరులపైఁ జనినట్టి నీ కుమా
ర సముదయం బమానుషపరాక్రము లై నిను నీగమాశ్రయం 4
బు సకలభూజనుల్ పొగడ స్తోత్రము సైకొనుచున్నవారు, నీ
వ్యసనము లింకఁ దీఱఁగల వంచు ధునాతనధీరు లాత్మ సం
తసపడుచున్నవార; లయినన్, బురుషార్థ సమన్వయంబునన్
బస గల వర్థకామము, లనశ్వము పేక్ష్యము ధర్మమోక్షముల్ 8
వసుధ సమస్తజాతులు నవార్యబలాబల తారతమ్యల
బ్ధసుఖులు గాన—నంచుఁ బెడదారికి నీడ్చెద రేము నిన్ను నీ
దు సుతు లె; యర్థకామములు దుస్త్యజముల్ తనుధారణార్థమై
యసదృశ ధర్మమోక్షములో యాత్మ సుఖా భవదంగయష్టి, కో 12
ఋషి జనయిత్రి! యార్యజనయిత్రిరో! యెన్ని గతించె రాజ్యముల్
పస చెడి ధర్మలోపమున!! "భారతవిశ్వకళాలయంబు" నీ
యసమ మహత్త్వతత్త్వ విశదైకమతిన్ ప్రభవించెఁ గాక, సం
చి సమయ మబ్బె నీ కిఁక, ఋషిప్రవరుల్ తొలి నెందుఁ జేరి మా 16
నపమున సర్వలోకపిత నమ్మి భజించి తదీయసత్కృపా
రసమున జ్ఞానభాస్కరకరప్రకరోజ్జ్వలకాంతిసంతతుల్
దెసల వెలుంగఁజేసి రో, యదే హిమశైలశిరస్సరస్సుధా
ప్రసర పవిత్రగాంగఝుర రంగదభంగతరంగరంగలా 20
లస పవనావళీపరిమళంబు బది సోఁకినఁ బ్రాణికోటిజ
న్మసఫల మౌఁ, దదీయరసమాధురిఁ జొక్కిన జీవితోదయం
బు సమకుఱున్; భవత్సుతులు పూతచరిత్రము బ్రహ్మచర్య మ
భ్యసనముచేసి నేర్చికొని,యందు శ్రుతిస్మృతులన్ బురాణముల్ 24
లసదితిహాసముల్ కరతలామలకంబుగ సంగ్రహించి, యా
ర్ష సమయసంప్రదాయములు స్వాంతములన్ గ్రహియించి, యన్యదే
శసముది 'తార్థకామ' పురుషార్థరహస్యములన్ గ్రహించి, వా
ని సముచితార్యపద్ధతి వినీతిఁ దొలంగక యన్వయించినన్ 28
బుధు లుదయింపరే మరల నీ ఘనగర్భమునందు? నర్జునా
ది సములు నస్త్రశస్త్రసముదీర్ణులు క్షత్త్రియు లుద్భవింపరే?
మెసలుదురే పరుల్ భవదమేయమహామహిమంబుఁ జూచి? లో
న సహాన మున్న క్రమింగుదుర యంతియెకాని; యిఁకొక్కవిన్నపం బి 32
[illegible] సలిపెదన్ శ్రుతిస్మృతులపూర్ణరహస్య మెఱింగియే, విశా
లసరణి, నుత్తరోత్తరవిలక్షణధర్మముఁ జేర్చి వేదని
శ్వసనుఁడు కృష్ణమూర్తి, భగవానులు వ్యాసపరాశరుల్, మహా
ధిషణుఁడు బుద్ధదేవుఁడు, సుధీరులు శంకర మధ్వలక్ష్మణుల్ 36
ఋషిమత ముద్ధరించి నడపించిరి నేర్పున నార్యసంఘమున్
గొనకు సమస్తజాతులను గూడిన యిక్కలికాలమందు నీ
దు సుతులు వర్ణభేదములు ద్రోచినఁ గాని బలంబు రాదటం
చు నెంచుచున్నవా రగును స్మృతులే యితరార్యులగ్రవ 40
ర్ణసదృశు లైన పిమ్మటఁ బరస్పరమేళనలాభకారి కా
ని, సకల మూరకేక మగునేని సనాతనధర్మనాశమే
పొసఁగును గాన, నెవ్విధినిఁ బొం దొనరించెనొ! నీకు నంద ఆలో
క్కసమునౌ గానఁ దీర్పఁగల కార్యము నీవియు చూపె· చిన్నలన్ 44
గసర సుదారభావమునఁ గారుణికత్వముతోడ విద్యల
ప్పసముగఁ జెప్పఁ బెద్దలకుఁ బల్కము, జ్ఞానలవప్రమత్తులై
యసహనబుద్ధిఁ బెద్దలకు నాగ్రహముం గలిగింపకుండ బో
ధ కలుపు చిన్నబిడ్డలకుఁ, దక్కిన మేళన క్షీరనీరరీ 48
తి, సులభసాధ్య మై తుదకుఁ దేజము గూర్చెడి నార్యజాతి కిం
పెసక మెసంగ, నప్పుడె సుమీ, ధర వేలకొలంది యేండ్లు క
క్కసపడుచున్ మహాసుజలఁ గార్శ్యము నందిన నీశరీర నీ
రసపుటవస్థ విక్టోరియరాణి సహోదరవత్సలత్వమున్ 52
గొనరెడు దృష్టిఁ గాంచి తనకుం గల దెల్లను ధారవోసి నీ
కసటుఁదనంబు మార్చి కుతుకం బొడఁగూర్చిన సార్థకంబు; నీ
యసువుల నిల్పినట్టి జగదంబ!! తదీయపవిత్రనామమున్
నిసియుఁ బవల్ మనంబునను నిల్పి స్మరింపనియట్టివాఁడు లేఁ 56
డు సుమి భవత్కుమారకులలో; భవదాయతజీవనాదిలోఁ
బస గనిపింప దంచు నొకప్రాజ్ఞుఁడు శ్రీ దరభంగరాజ రా
జసభ నృపోత్కరార్పిత లసద్వసురాశిఁ దయారుచేసి కు
స్పె, సరిగఁ గట్టి యిచ్చెఁ జుమి విశ్వకళానిలయంబు పేర నం 60
బ! సరస మౌ వసంతకుసుమాకరదివ్యమహావధంబు, నీ
ముసలితనంబు వో, మదనమోహనలీలఁ గుమారవీగసు
ప్రసవమునన్ "మహోదయము" ప్రాప్తమగున్ మతిమాకు నట్టి నీ
నిసుపులె ధర్మశాసకులు నిర్మలరాజ్యరమాధురంధరుల్. 64

# తురుష్క సామ్రాజ్యము

## వృద్ధిక్షయములు

సంకల్పము ఉత్సాహము క్రియ సిద్ధికి సాధనములు. కార్యసిద్ధికి స్థిరసంకల్పము బీజము. ఉత్సాహము శక్తి. క్రియ కీలకము. మనుజుల సకలప్రయత్నములు సంకల్పప్రభవములు. ఉత్సాహవర్ధితములు. క్రియాయత్తములు. సంకల్పశక్తి ఉత్సాహశక్తి క్రియాశక్తి చేరికవలన ప్రయత్నములు సఫలములగుచున్నవి. స్థిరసంకల్పము లేని యుత్సాహమును ఉత్సాహము లేని కార్యమును నసాధ్యములు. మనుజుల చిత్తక్షేత్రములందు సంకల్పాంకురములు దృఢతరముగ నాటినపుడు కార్యములు సఫలములగుచున్నవి. సంకల్పాంకురములు లోకప్రవృత్తి ననుసరించి పలు రూపములను దాల్చుచున్నవి. సంకల్పాంకురములు మనుజులచిత్తక్షేత్రములందు సంస్కారసదృశముగ పుట్టిపెరిగి నశించుచుండును. సంకల్పబీజములకు సుఖారాధనము, యశోలాభము, మతాభిమానము, రాజ్యలాభము, ధనార్జనము, జ్ఞానసంపాదనము, ధర్మానుష్ఠానము శక్తిప్రదములు. మహమ్మదీయులు మతావేశపరవశులై ప్రతాపాగ్నిని బూని దిగ్విజయములను జేసి సామ్రాజ్యములను స్థాపించిన విధము తురుష్కుల చరిత్రవలన బాగుగఁ దెలియుచున్నది.

తురుష్క సామ్రాజ్య చరిత్రము విభ్రమావహము. పూర్వ పశ్చిమార్ధగోళములం దప్రతిమాన ధైర్యప్రతాపములను జూపి సామ్రాజ్యములను స్థాపించిన తురుష్కుల చరిత్రము అత్యద్భుతము, ఉత్సాహ సమన్వితము. తురుష్కు లాదిని ఆసియాఖండవాసులు. కాస్పియన్ సముద్రప్రాంతములు వారి జననస్థానములు. ఆసియా ఆఫ్రికా యూరపుఖండములందు విజృంభించి మహారాజ్యములను స్థాపించిరి. వర్తమాన యుగమునందు యూరపుఖండవాసులు విజృంభించి లోకమునంతను నాక్రమించుకొనిరి. ఆసియానివాసులైన తురుష్కులు మాత్రము యూరపుఖండములో 1355-వ సం. నందు ప్రవేశించి నేటికిని సుస్థిరముగ నున్నారు. తురుష్కసామ్రాజ్యమునకు రాజధానియైన కాన్‌స్టాంటినోపిలు 1453-వ సం. నందు తురుష్కుల వశమైనది. కాన్‌స్టాంటినోపిలును స్వాధీనము చేసికొనుటకై జరగిన యుద్ధములకు నష్టపడిన ప్రజలకు మితి లేదు. తురుష్కసామ్రాజ్యవిజృంభణమును దెలిసికొనుటకుఁ బూర్వము కాన్‌స్టాంటినోపిలు వృత్తాంతమును దెలిసికొనుట యవసరము.

యూరపుఖండమునందు ప్రప్రథమమున నాగరకతను బొందిన ప్రజలు గ్రీకులు. గ్రీసుదేశ మొక స్వల్ప రాజ్యము. క్రీ. శ. పూర్వము 750 ప్రాంతములందు మధ్యధరా సముద్రతీరములలో జిబ్రాల్టరు మొదలు అలెగ్జాండ్రియావఱకును గ్రీకుల కధినివేశస్థలము లుండెడివి. గ్రీకులు వర్తకులుగను నధినివేశస్థలవాసులుగను నల్లసముద్రతీరములందును ఏజియనుద్వీపములందును నివసించుచుండిరి. చాల్సీడియ, హెల్లెస్పాంటు, సైనోపు, అబిడాసు, సినికసు, క్రెపీజస్, డయోస్క్యూరియస్, పేంటిసిపియమ్, ఫేసిస్, క్రిమియా మొదలగు స్థలములను గ్రీకులు క్రమక్రమముగ నాక్రమించుకొనిరి. ఒక తెగవారైన మెగారానగరవాసులు యూరపు ఆసియా ఖండముల నడుమ బాస్ఫరసు ముఖద్వారమునం దున్న సుప్రసిద్ధమైన బైజాంటియము నగరమును స్థాపించిరి. గ్రీకుల స్వతంత్ర మంతరించి యౌన్నత్యదశ తొలఁగి రోమకసామ్రాజ్యము వ్యాప్తినిజెందినపుడు బైజాంటియము రోమకులవశమై కాన్‌స్టాంటినోపిలు నామమును గైకొని నేటికిని ఆపేరిట విరాజిల్లుచున్నది.

పరిషియను రాజేంద్రుఁడు డరయను గ్రీసురాజ్యములపై దాడివెడలినపుడు బైజాంటియమును వశపఱచుకొని పాడుచేసెను. యుద్ధానంతరము స్థలమునకుఁ గల వ్యాపారసౌకర్యమువలన బైజాంటియము పునరుద్ధా




తురుష్క-సామ్రాజ్యము: 15-వ శతాబ్దము

రితమై బలసంపదలకు నిలయముగ నుండెను. దిగ్విజయ పతుఁడు అలెగ్జాండరు మహాపురుషుఁడు పరిషియ బాక్ట్రియ ఇండియ ఈజిప్టు దేశములందు గ్రీకులకు నివాసస్థలములను నిర్మించెను. క్రీ. పూ. 400-100 సం. వఱకును గ్రీకుల మాహాత్మ్యము లోకాదర్శముగ నుండి, కళలు సారస్వతము రాజ్యాంగములు తత్త్వజ్ఞానము వృద్ధి చెందెను. గ్రీకులు హిందువులు పూర్వకాలమునం దన్యోన్య విజ్ఞానమును గ్రహించినటులు నిదర్శనములు గలవు.

బలము విజ్ఞానము ప్రజాసంవర్ధితములు. ప్రజా బాహుళ్యము లేని రాజ్యములకు వృద్ధివలె క్షయమును త్వరితగతిని సంప్రాప్తించుట సహజము. సుస్థిర రాజ్య పోషణమునకు విజ్ఞానము బలము సాధనములు. బలము ప్రజాధీనము. క్రీస్తుశకమునకు పూర్వ మొకటవ రెండవ శతాబ్దములందు రోమక సామ్రాజ్యమునకును గ్రీకురాజ్యములకును సంఘర్షణ మేర్పడినపుడు గ్రీకుల బలము పడి రోమనుల బలము విజృంభించినది. కాలక్రమమున మెసిడోనియ, సిరియ, ఈజిప్టు, కారింతు, తీబ్సు, చాల్సిసు రోమక సామ్రాజ్య బలములకు స్వాధీనములైనవి. మారియసు, సుల్లా, పాంపె, ఏంటొనె, జూలియస్ సీజరు, అగస్టసు రోమకసామ్రాజ్యమును వ్యాపింపఁజేసి బలపఱిచిరి. క్రీస్తుశకానంతరము రెండవ శతాబ్ద మంతమునందు ఆసియా మైనరు, ఆర్మీనియ, మెసపొటేమియ, సిరియ, ఈజిప్టు దేశములందు రోమకపాలనము సుస్థిరస్థాపితము. రోమకపరిపాలనము స్థాపితమైన ప్రాగ్దేశము లందును గ్రీకుల భాష, భావములు, విజ్ఞానము, ఆచారవ్యవహారములు వ్యవహరింపఁబడుచుండెను. రోమక గ్రీకు దేశములకు ప్రజల క్రైస్తవమతావలంబనమువలన సామాన్యపాశబంధ మేర్పడినది. పాశ్చాత్యులు రాజ్యలాభమునకు కలహించినను మతాదర్శములందు భేదభావము లున్నను సామాన్యమైన క్రైస్తవమత పాశబద్ధులు.

ప్రాచీ ప్రతీచీ సంఘర్షణము చిరకాలాగతము. ఒక యుగమునందు పూర్వరాజ్యములు ఒకయుగమునందు పశ్చిమరాజ్యములు ప్రబలుట చరిత్రవలన స్పష్టము. పరిషియనులు యవనులను, యవనులు పరిషియనులను, రోమనులు యవనులను పరిషియనులను, తురుష్కులు రోమనులను, రుష్యనులు తురుష్కులను జయించుట చరిత్రప్రసిద్ధము. ఆ సంఘర్షణము నేఁటికిని అవిచ్ఛిన్నముగ జరగుచున్నది.

క్రీస్తుశకమునందలి మూఁడవ శతాబ్ద మంతమునందు రోమకసామ్రాజ్యము పశ్చిమ సామ్రాజ్యముగను పూర్వ సామ్రాజ్యముగను పాలనా సౌకర్యమునకై




తురుష్క-సామ్రాజ్యము: 16-వ శతాబ్దము

రెండు భాగములుగ విభజింపఁబడినది. నాలుగవ శతాబ్ద మారంభమందు కాన్‌స్టాంటైను పూర్వ రోమక సామ్రాజ్యమునకు బైజాంటైనును రాజధానిగ చేసెను. కాన్‌స్టాంటైను చక్రవర్తి 325-వ సంవత్సరమునందు కాన్‌స్టాంటినోపిలు నగర నిర్మాణమున కుపక్రమించెను. గతించిన 16 వందల యేండ్లయందును కాన్‌స్టాంటినోపిలు విజయార్థము భీకర ఘోర సంగ్రామములు జరగినవి. వర్తమాన మహాసంగ్రామ కారణంబులలో ఈ నగరరత్న లాభంబును నొక కారణంబుగ నున్నది.

కాన్‌స్టాంటైను కాలమునుండి రోమక సామ్రాజ్యమునకు కేంద్రస్థానము రోమునుండి కాన్‌స్టాంటినోపిలునకు మాఱినది.

థియడోజియసు కాలమనంతరము పూర్వ రోమక సామ్రాజ్యము నుండి ప్రాచీన రోమక సామ్రాజ్యము విడిపోయినది. పశ్చిమ సామ్రాజ్యము 476-వ సంవత్సరముతో నంతము నొందినది. రోమక సామ్రాజ్య వైభవము విజ్ఞానము కాన్‌స్టాంటినోపిలునకు మాఱినవి.




తురుష్క-సామ్రాజ్యము: 17-వ శతాబ్దము

కాన్‌స్టాంటినోపిలు, తురుష్కుల స్వాధీన మగునంతవఱకును, పాశ్చాత్య విజ్ఞానమునకు వికాసమునకు వైభవమునకు మతధర్మములకు సాంప్రదాయాచారములకు నిలయము. చిరకాల సంచితములైన రోమక సామ్రాజ్య సంపదలు, కళాకౌశల నిర్మాణములు, బలవైభవములు, నూతన నిర్మితమైన నగరాలంకరణమునకై వినియోగింపఁబడినవి. పదునొకండు శతాబ్దము లవిచ్ఛిన్నముగ పూర్వ రోమక సామ్రాజ్యము జరగినది. తురుష్కులు 1453-వ సం. నందు కాన్‌స్టాంటినోపిలును నశపఱచుకొనిరి. మహమ్మదీయ బలమునకు నేఁటికిని కాన్‌స్టాంటినోపిలు కేంద్రస్థానముగ పరిగణింపఁబడుచున్నది.

స్థలములకును పురుషులకువలె ప్రతిష్ఠ శోభాయమానంబైన పరిస్థితివలనఁ గలుగుచున్నది. కాన్‌స్టాంటినోపిలు నిర్మితమైన స్థలము యూరపు ఆసియా ఖండములకు నడుమ నున్నది. మూఁడు ప్రక్కలను సముద్రజలములు, ఒక ప్రక్క బలమైన భూభాగము గలవు. స్థలము దుర్భేద్యము; వశీకరణమునకు ప్రబలమైన నౌకాబలము సైన్యబలము ముఖ్యము; ఆసియా యూరపు ఖండముల వ్యాపార గమ నాగమనములకు ప్రధానమైన విక్రయస్థానము; పదునాలుగవ శతాబ్దమువఱకును యూరపు ఆసియా ఖండ రాజ్యముల విప్లవకారులైన మహాథ జాతులకును నాశహేతువులైన రణరంగములకును దూరస్థము. సహజ సంరక్షితంబును రమణీయంబును విభవాభిరామంబును నైన కాన్‌స్టాంటినోపిలు చరిత్రము గంభీర భావ భరితము.

రోమక సామ్రాజ్య విచ్ఛేదనమునకు రోమనుల దౌర్బల్యము ప్రథమకారణము. రోమనుల దౌర్బల్యమునకును, గాథుల విసిగాథుల లోంబార్డుల బలమునకును, తురుష్కుల బలమునకును సంఘర్షణము గలిగినపుడు, బలమునకు విజయము గలిగినది. దుర్బల పక్షమునకు వినాశము గలిగినది. రోమకసామ్రాజ్యము నశించినది. యూరపు రాజ్యములు తురుష్క-సామ్రాజ్యము స్థాపితములైనవి.

మహమ్మదీయ విజృంభణము విభ్రమజనకము. అరాబియా యెడారులందు జనించిన మహమ్మదు మహాత్ముఁడు లోకవ్యాప్తమైన మతమును సామ్రాజ్యనిర్మాణదక్షులైన జాతులను నిర్మింపఁగలిగెను. లోకచరిత్రము

700 1700 ల సంవత్సరముల పర్యంతము మహమ్మదీయ విజృంభణ సంకలితము. ఆ కాలమునందు మహమ్మదీయ ప్రతాపాగ్ని యప్రతిహతము. అన్ని దిశల యందును వ్యాపించినది. మూడు ఖండముల యందును స్థాపిత మైనది. ఆ దూరదేశము నవిచ్ఛిన్నముగ నైదువందల యేండ్లు మహమ్మదీయులు పాలించిరి, పారసీకమును అఫగనిస్థానమును తురుష్కస్థానమును అరాబియాను ఈజిప్టును ఆర్మీనియాను సిరియాను అబిసీనియాను నేటికిని ఏలుచున్నారు. ఈ మహద్వ్యాప్తికి బీజము మతావేశము. ఆవేశము భ్రమప్రమాదములకు మూలమైనను కార్యనిర్వహణమునకు సాధనము. ఆవేశము ఉత్సాహజనితము. ఉత్సాహము విఘ్నపరంపరలను జయించి విజయమును గాంచును. మహమ్మదీయుల విపరీతోత్సాహము లోకపీడకు కారణమైనను భిన్నదేశీయుల యేకమతభావమును మానవసౌభ్రాతృత్వభావమును శౌర్యాగ్నిని స్థాపించుటకు సాధనభూతమైనది. మహమ్మదీయులు పరాజిత రాజ్యములకు రెండు గత్యంతరములను ప్రసాదించిరి. పరాజితులు మహమ్మదీయమతమును స్వీకరించి కప్పమును గట్టవలెను లేదా కృపాణధారకు బలి గావలెను. కారకోరము పర్వతప్రాంతములనుండి డాన్యూబు నదివఱకును వ్యాప్తమైన విశాలదేశమునందు మహమ్మదీయమతము ప్రబలినది.




తురుష్క సామ్రాజ్యము 18 శతాబ్దము

ఎనిమిదవ శతాబ్దమారంభమందు సరాసనులు జిబ్రాల్టరునుండి స్పెయినునందును బాస్ఫరసుముఖమున కాన్స్టాంటినోపిలునందును ప్రవేశింప నుద్యమించిరి. స్పెయిను దేశమును జయించి చిరకాల మా దేశము నేలిరి. పూర్వదిశయందు 80,000 సైనికులతోను 1,800 నౌకలతోను కాన్స్టాంటినోపిలును పండ్రెండు మాసములు ముట్టడించి విఫలమనోరథులై సరాసనులు మరలిరి. యూరపుఖండమున కేడువందల యేండ్లవఱకును మహమ్మదీయ విప్లవభయము తొలగినది.

పదునొకండవ శతాబ్దమునందు సెల్జూకు తురుష్కులకును పాశ్చాత్య రోమక సామ్రాజ్యమునకును సన్నివేశము గలిగినది. సెల్జూకులు తురుష్కదేశస్థులు. సెల్జూకు వంశజులు పదునొకండవ శతాబ్దమునందు మహమ్మదీయ మతమును స్వీకరించిరి. అల్పుఆర్స్లాను కాలమునందు సిరియ ఆర్మీనియలను జయించిరి. రోమక సామ్రాజ్యబలములను 1071వ సంవత్సరమందు యూఫ్రటీసు నదీతీరమునందున్న మాంజిక్రటు దగ్గర నోడించి ఆ యాసియాఖండములోని రోమకసామ్రాజ్య భాగమున కేలికలైరి. ఆ కాలమునుండి తురుష్క సుల్తాను మహమ్మదీయులకు నాయకుడని ప్రతీతి గలిగినది. సెల్జూకులు పలస్తీను దేశమును జయించి జెరూసలమును ఆక్రమించుకొనిరి. జెరూసలము క్రైస్తవ పుణ్యక్షేత్రము. తురుష్కులు క్రైస్తవ యాత్రాసేవకులను నిర్బంధదౌర్జన్యములకు పాలుచేసిరి. క్రైస్తవమతస్థులు మహమ్మదీయ ప్రతాపమునకు ప్రతిక్రియగ మతసంరక్షణయుద్ధముల కుపక్రమించిరి. రెండువందల యేండ్లు యూరపుదేశస్థులు మతావేశమును పూని పుణ్యక్షేత్రరక్షణమునకై సుఖములను విసర్జించిరి. కష్టముల నుత్సాహముతో ననుభవించిరి. సంపదలను సమర్పించిరి. ప్రాణములను ధారవోసిరి. పుణ్యభూమియోని




తురుష్కసామ్రాజ్యము 19-వ శతాబ్దము

పుణ్యక్షేత్రములను స్వాధీనము చేసికొనిరి పదునాలుగవ శతాబ్ద మారంభమున సెల్జూకులు దుర్బలులై తురుష్కరంగమునుండి నిష్క్రమించిరి

పదునాల్గవ శతాబ్ద మారంభమున ఓటమన్ తురుష్కులు రంగమునందు ప్రవేశించిరి ఓస్మాను వంశజులైన తురుష్కులకు ఓస్మానులు ఓటమనులు అను పేరులు గలిగినవి ఓటమనులు సెల్జూకులను గోమక బలములను నిర్జించి తురుష్కసామ్రాజ్యమును స్థాపించిరి తురుష్కసైన్యములు కాలక్రమమున పూర్వరోమక సామ్రాజ్య భాగములను స్వాధీనము చేసికొని 1453-వ సంవత్సరమునందు కాన్‌స్టాంటినోపిలు నగరమును వశపఱచుకొనెను ఆ నగరరాజము స్వాధీనమగుటం జేసి తురుష్కుల ప్రతిభ యూరపు ఆసియా ఆఫ్రికా ఖండములందు వ్యాపించినది పాశ్చాత్య విజృంభణమునకు రెండు శతాబ్దములు ప్రాకారమువలె నష్టుపడినది

తురుష్కులు మంగోలియను జాతీయులు కాని, యూరపుఖండమునందు సామ్రాజ్యమును స్థాపించుటవలన జాతి మిశ్రమ మైనది ఆర్మీనియనులు, అల్బేనియనులు, గ్రీకులు, బల్గేరియనులు, పోలులు, రుష్యనులు, యూదులు మొదలగు విజాతీయులు బలిమిని చెలిమిని మహమ్మదీయ మతమును స్వీకరించిరి తురుష్కులకును నూతన మతప్రవర్తకులకును గలిగిన సంబంధ బాంధవ్యములవలన నూతన తురుష్కజాతి గలిగినది భిన్నజాతీయుల సంయోగసాహచర్యములవలన సంజాతమైన తురుష్కులకును ఆసియాఖండవాసులైన మహమ్మదీయులకును వేషమునందు భాషయందు రూపమునందు భావములందు ఆచారవ్యవహారములందు వ్యత్యాసము గలదు తురుష్కులకు చిరకాలసంవర్థితంబైన పాశ్చాత్యసంసర్గమువలన పాశ్చాత్యాదర్శములం దభిమానము గలిగినది స్వాతంత్ర్యేచ్ఛ గలిగినది ఆత్మగౌరవ మేర్పడినది ఆత్మవిశ్వాస ముదయించినది.

తురుష్క సామ్రాజ్యచరిత్రమునం దైదు ముఖ్య యుగములు గలవు మొదటి యుగమునందు తురుష్కులకు ఆసియాఖండభాగముల విజయము, యూరపుఖండమునందలి గెలిపోలి ఆడ్రియనోపిలు కాన్‌స్టాంటినోపిలు మొదలగు స్థలముల లాభము గలిగినవి

రెండవ యుగమునం దప్రతిహత పరాక్రమముతో యూరపుఖండమునందు తురుష్కులు సామ్రాజ్యవ్యాపనమును చేసిరి పదునైదవ శతాబ్దాంతమునకు పూర్వము బోస్నియ సర్వియ అల్బానియ క్రిమియ తురుష్కుల స్వాధీన మైనవి పదునాఱవ శతాబ్ద




తురుష్కసామ్రాజ్యము 20-వ శతాబ్దము

Mrs. BERTHA KRUPP



శ్రీమతి బెర్తా క్రప్: జర్మనుక్రప కర్మాగారమున కధిపతిరాలు

Miss. EDITH CAVELL



ఎడిత్ కేవల్ కన్య

Dr. Miss KUGLAR



డాక్టరు కుగ్లరు దొరసాని, గుంటూరు

Miss L. H. HART



కన్యా హార్టుదొరసాని, మదనపల్లి

మారంభమున సుల్తాను సలీము ఈజిప్టును జయించెను. ఆ విజయమువలన మహమ్మదీయ మతాధిపత్యము కూడ మను తురుష్క సుల్తానులకు సంక్రమించినది. తురుష్క సామ్రాజ్యము నత్యున్నతస్థితికి సులైమాను మహామహుఁడు తెచ్చెను. ఆ సుల్తాను 1520-1566-వ సం. వఱకును తురుష్క సామ్రాజ్యము నేలెను. సులైమాను పదుమూఁడు దిగ్విజయయాత్రలు చేసెను. ఆసియాఖండమునందు పారసీకమువఱకును సామ్రాజ్యమును వ్యాపింపఁజేసెను. ఆఫ్రికాయందు మొరాకులో తురుష్క ధ్వజము స్థాపించెను. యూరపునందు హంగేరియనుల నోడించి బూడాయందు చంద్రధ్వజము నిలిపెను. సులైమాను మరణకాలమునకు తురుష్కసామ్రాజ్యము జర్మనీ సీమాంతమునుండి పారసీకమువఱకును, అట్లాసు కాకససు పర్వతములనుండి ఏజియను ద్వీపములవఱకును వ్యాపించినది. ఇంతటి మహాసామ్రాజ్యమును స్థాపించిన సులైమాను కేవలము శూరుఁడు మాత్రమె కాఁడు. సులైమాను పండితుఁడు. రాజ్యతంత్రజ్ఞుఁడు. సత్పరిపాలకుఁడు. సామ్రాజ్యమునందు కేంద్రీకృతాధికారాధీనమైన స్థిరపరిపాలనమును స్థాపించుటకు ప్రయత్నించెను. ఆ ప్రయత్నమున కనివార్యములైన యాటంకములు రెండు గలవు. సామ్రాజ్యప్రజలు నానాజాతి సంకలితులు. దృఢతరమైన మతభేద భావబద్ధులు. మూర్ఖక్రైస్తవులకును మూర్ఖమహమ్మదీయులకును సానుకంపము దుస్సాధ్యము. తురుష్కసామ్రాజ్య విప్లవమునకీ రెండు కారణములును జతపడినవి.

సులైమాను మరణకాలమునుండి పదునేడవ శతాబ్దమంతమువఱకును తురుష్కసామ్రాజ్యము శత్రుసంత్రాసితమయ్యును ప్రక్షీణము గాక నిలిచియుండెను. ఆ కాలములో పీటరు మహామహుని పాలనమునందు రుష్యా విజృంభణ మారంభమయ్యెను. రుష్యనులు అజోవు నాక్రమించుకొనిరి. తురుష్కులు మోరియ, పొడోలియ, ట్రాన్సిల్వానియ, హంగరి, స్లవోనియ దేశములను కార్లోవిట్జు సంధి ననుసరించి యూరపురాజ్యముల కర్పించిరి.

తురుష్క సామ్రాజ్య చరిత్రమునందు నాలవ యుగము పదునెనిమిదవ శతాబ్దమంతమువఱకును వ్యాపించుచున్నది. ఆ యుగమునందు క్రమక్రమముగ రాజ్యము లుప్తమైనది. బలము క్షీణించినది. సామ్రాజ్యసీమాంతములందు ప్రబల శత్రువులు చెలరేఁగి సామ్రాజ్యవిలయమున కుపక్రమించిరి. తురుష్కులకు ప్రబలవైరులు రుష్యనులు. రుష్యనులు 1774, 1778 సంవత్సరములందు తురుష్కుల నోడించి రాజ్యభాగముల నాక్రమించుకొనిరి. పదునెనిమిదవ శతాబ్దమంతమందు తురుష్కులకును ఫరాసులకును శత్రుత్వమేర్పడెను. కాని, యచిరకాలములోనే తిరిగి మిత్రత్వము కుదిరినది. 1814-వ సం. న కూడిన వియన్న కాంగ్రెసునందు తురుష్క సామ్రాజ్య సంరక్షణమునకై యంతర్జాతీయ నియమమును చేయవలయు నను సంకల్పము గలిగినది. కాని, ఆ నియమములు స్వాతంత్ర్యస్థితికి భంగకరములుగ తోఁచి సుల్తానున కసమ్మతములైనవి.

అయిదవ యుగాదిని తురుష్క సామ్రాజ్యమునందు ఆసియామైనరు, మెసపొటేమియ, సిరియ, అరేబియ, ఈజిప్టు, ట్రిపోలి, ట్యూనిస్, ఆల్జీరియ, బాల్కను ద్వీపకల్పము, మోల్డేవియ, వలేషియ చేరియుండెను. అందు యూరపు ఖండమునందలి భాగము స్వల్పము. ఆ స్వల్పభాగమును చీలిపోయెడి తరుణ మేర్పడినది. చీలిపోయిన భాగములందు మొదటిది ఈజిప్టు. తురుష్క రాజ్యాధికారము ఈజిప్టునందు లుప్తమైనది. ప్రజలు ప్రతిఘటించిరి. సుల్తాను 1806-వ సం.నందు దేశమున శాంతిని స్థాపించుటకై మహమ్మదాలిని నియోగించెను. మహమ్మదాలి శాంతిని స్థాపించిన పిదప స్వాతంత్ర్యము నవలంబించెను; మీఁదు మిక్కిలి సిరియాను ఆక్రమించుకొనుట కుపక్రమించెను. ఆంగ్లేయుల ఫరాసుల యొత్తిడివలన సిరియాను విడిచెను. సుల్తాను సార్వభౌమత్వము నంగీకరించెను కాని, తన కుటుంబీకులకు వంశానుగతంబైన రాజప్రతినిధి పదవిని సంపాదించి ఖెడీవు బిరుదమును గడించెను. ఈజిప్టు వర్తమానకాలమువఱకును సామంతరాజ్యముగ నుండినది. వర్తమాన మహాసంగ్రామమునందు తురుష్కులు శత్రుకోటిలో చేరినపు డాంగ్లేయులు సామంతత్వము నుపసంహరించి ఈజిప్టు స్వాతంత్ర్యమును ప్రకటించిరి.

ఆఫ్రికా ఖండమునందు ఆల్జీరియ ట్యూనిసు దేశములను ఫ్రాన్సు రాజ్యమును, ట్రిపోలి సైరెనిక దేశములను ఇటలీ రాజ్యమును, విజయమువలనను ఆక్రమణమువలనను స్వాధీనము చేసికొనెను.

యూరపు ఖండమునం దొక భాగము తరువాత నొక భాగము స్వాతంత్ర్యము వహించెను. స్వాతంత్ర్యమును పొందిన రాజ్యములందు మొదటిది సర్వియ. రుష్యా యొత్తిడివలన తుర్కీ 1830-వ సం.నందు సర్వియ స్వతంత్రత నంగీకరించెను. నావరినో విజయానంతరము రుష్యా ఫ్రాన్సు ఇంగ్లాండుల ప్రోద్బలము మూలమున గ్రీసు స్వాతంత్ర్యమును పడసెను. పిమ్మట మోల్డేవియ వలేషియ దేశములు స్వతంత్రతను బొందెను. క్రమక్రమముగ రుమేనియ మాంటినీగ్రో బల్గేరియ మాసిడోనియ ఆల్బేనియ దేశములు స్వాతంత్ర్యమును బొందెను. పందొమ్మిదవ శతాబ్దమునందు రుష్యా దేశమునకును తుర్కీ రాజ్యమునకును అనేకములైన యుద్ధములు జరిగినవి. ఆ యుద్ధములవలన రుష్యాప్రతిభ హెచ్చినది. తురుష్కుల ప్రతిభ క్షీణించినది. ఈ కాలమునందు ఇంగ్లాండు సైప్రసును ఆస్ట్రియా బోస్నియ హర్జగోవినలను నాక్రమించుకొనెను. ఇటీవల సంభవించిన బాల్కను యుద్ధ మంతమునందు క్రీటు గ్రీసునకు సంక్రమించినది. ఆల్బేనియ స్వతంత్ర రాజ్యముగ నిర్మితమైనది. సర్వియ బల్గేరియ రుమేనియ దేశములు శేషించిన తురుష్క సామ్రాజ్య భాగముల నాక్రమించుకొనినవి. సులైమాను మహామహుండు స్థాపించిన తురుష్క మహాసామ్రాజ్యము క్రమక్రమముగ క్షీణించినది. ఇపుడు యూరపు ఖండమునందు స్వల్పప్రదేశము ఆసియఖండమునందు ఆసియ మైనరు మాత్రము నిలిచియున్నవి. వర్తమాన మహాసంగ్రామమునందు తుర్కీ శత్రు కోటిలో చేరినది. దాని ఫలము యుద్ధాంతమునందు నిర్ణయింపనగును. రుష్యా ఫ్రాన్సు ఆస్ట్రియ ఇటలి ఇంగ్లాండులకు తురుష్క సామ్రాజ్య భాగములు కారణాంతరములవలన సంక్రమించినవి. జర్మనీ దేశము తురుష్క సామ్రాజ్యమునం దభినివేశము కల్పించుకొనినది. కాన్‌స్టాంటినోపిలునుండి బాగ్దాదునకును రైలు మార్గమును నిర్మించినది తురుష్కుల సైన్య శిక్షణమునకై జర్మను నాయకులను నియమించినది. యుద్ధోపకరణముల నందజేసినది. అప్పుల నిచ్చినది. ధనాశాపరులైన తురుష్క నాయకులను చేఁదీసినది. మీఁదు మిక్కిలి స్వకీయశ్రేయఃప్రాప్తికై తురుష్క సామ్రాజ్యమును యుద్ధమునందు చేర్చినది.

తురుష్క సుల్తానులు నిరంకుశాధికారులు. సుల్తానుల నిరంకుశాధికారము మహమ్మదీయ మత ధర్మ సూత్ర బద్ధము. సుల్తానులు పూర్వదేశ పాలకుల వలె నాడంబర ముదితులు. సామ్రాజ్యమునందలి అంతర్భాగాధికారులను రాజప్రతినిధులను సుల్తాను నియమించును. పూర్వము యూరపు రాజ్యములందు వ్యాప్తం బయిన భూస్వామ్యానుసంధిత పాలనము ప్రయుక్తము. అధిక సంఖ్యగల మతాంతరులు వారి మత ధర్మ సూత్రముల ననుసరించి పాలింపఁబడుచుండిరి. మతాంతరులైన యూదులు గ్రీకులు పన్నులను వసూలు చేయుచు పాలకుల కర్పించుచుండిరి. రాజ్యము క్షీణించినకొలఁది ప్రజల భారము హెచ్చుచుండెను. సుల్తానులు నిరంకుశాధికారులై సులైమాను కాలము నుండి అబ్దులు హామిదు కాలమువఱకును పాలించుచుండిరి. అబ్దులుహామిదు సన్నిహితమైన విప్లవమును దాఁటుటకు 1876-వ సం. న నియమితపాలన నిర్మాణము నంగీకరించెను. సంకల్పసిద్ధి కలిగినపుడు నియమిత పాలనమును విసర్జించెను. అబ్దులు హామిదు విప్లవ భీతిచే, తిరిగి 1908-వ సం. నందు నియమిత పాలనమును స్థాపించెను. యువజన తురుష్క సంఘము 1909-వ సం.నందు సైన్య సాహాయ్యమున అబ్దులు హామిదును రాజ్యభ్రష్టునిఁ జేసి అయిదవ మహమ్మదును సింహాసనాసీనునిఁగ చేసెను. శేషించిన తురుష్క సామ్రాజ్యమునకు అయిదవ మహమ్మదు వర్తమానమున నియమిత పరిపాలకుఁడు. ఇతర నియమిత పాలకులవలె మహమ్మదు సుల్తాను తురుష్క రాజ్యమును మంత్రుల సాహాయ్యమున పాలించుచున్నాఁడు. పాలనమునకై శిష్టుల సభ ప్రజాప్రత్యామ్నాయ సభ స్థాపింపఁబడినవి. యువజన తురుష్కవర్గ హస్తమునందు పరిపాలనాధికారము గలదు. జాతి మత భేదములు లేక పరిపాలనమును నిర్వహించుటకు ప్రయత్నములు చేయఁబడుచున్నవి. పరిపాలన పద్ధతులు సంస్కరింపఁబడుచున్నవి. సైన్యములు సుశిక్షితములు చేయఁబడుచున్నవి. సామ్రాజ్యము పునరుద్ధారితమై తురుష్క జాతీయానన్యత్యమును పునరుత్పన్నము చేయుటకు విశ్వ ప్రయత్నములు చేయఁబడుచున్నవి. నూతన సంస్థాపన నిర్మాతలందు ఎవ్వరు పాషా ప్రముఖుఁడు. తురుష్క యువజనులుదారభావ ప్రేరితులు. ఉత్సాహబలోపేతులు. నూతనాదర్శ శోభితులు. కాని, అనుభవ రహితులు. కార్య నిర్వహణ సామర్థ్య రహితులు. యూరపురాజ్యతంత్రజ్ఞ

లకుఁ గల నీతి బల సామర్థ్యములు తురుష్క యువకులకు లేవు. యువజనుల సంస్కరణ ప్రయత్నముల కారంభదశయందే మహా ప్రళయమువలె మహాసంగ్రామము దాఁపురించినది. ఫలము యుద్ధాంతమునందు నిర్ణయము కాఁగలదు.

తురుష్క సామ్రాజ్య బల దౌర్బల్యములకు యూరపు రాజ్యముల బల దౌర్బల్యములు మూలకారణములు. పదునాలుగు పదునైదవ శతాబ్దమునందు రోమక సామ్రాజ్య మత్యున్నతమైన పిదప యూరపు రాజ్యములను కేంద్రీకృతాధికార మపరూపమైనది. భూస్వామ్య పరిమిత సామంత రాజత్వము ప్రబలినది. భూమి గల భూస్వాము లందఱును పాలకులు, ఖండాధీశులు, మండలాధీశులు, రాష్ట్రాధీశులు. వారు రాజ్యాధీనులవలె స్వతంత్ర పరిపాలకులు. సామంత రాజత్వమునకు మత ద్వేషము తోడ్పడి యూరపు రాజ్యములు బలరహితములైనవి. పదునైదవ శతాబ్దమునందు తురుష్కులు శూరాగ్రేసరులు, బాహుబల సంపన్నులు, మహోత్సాహ సమన్వితులు. తురుష్కులందు కేంద్రీకృతాధికారము సుస్థాపితము. ఈ కారణంబున తురుష్కులకు యూరపురాజ్య విజయము సులభసాధ్యము. పదునాఱవ శతాబ్దాంతమునకు సామంత ప్రభుత్వ పద్ధతి తగ్గినది. పదునేడవ శతాబ్దాంతమునకు యూరపు రాజ్యములు కేంద్రీకృతాధికారమును కలిగి ప్రకృతరూపమును దాల్చినవి. ఫ్రాన్సు ఇంగ్లాండు ఆస్ట్రియ జర్మని రుష్యా ప్రబలరాజ్యములై విజృంభణమున కుపక్రమించినవి. తురుష్క సామ్రాజ్యాంతర్భాగములందు జాతి భేదము మత మాత్సర్యము పెరిగినవి. భోగారాధన వశులైన తురుష్కులందు శౌర్య ప్రతాపాగ్ని చల్లారినది. యూరపు రాజ్యములకు తురుష్క సామ్రాజ్య వాసులైన క్రైస్తవులపై సానుభూతి కలిగినది. యూరపు రాజ్యములకు తురుష్క సామ్రాజ్య క్రమ వినాశము సమ్మతమైనది. కాని, తురుష్క సామ్రాజ్య ప్రాబల్యము గాని సమీపస్థ యూరపు రాజ్యముల ప్రాబల్యము గాని సమ్మతము గాలేదు. ఈ పద్ధతి యూరపు రాజనీతి తంత్రమునందు "సమబల రక్షణతంత్రము" అని ప్రసిద్ధి పడసినది. రుష్యనులకును ఆంగ్లేయులకును, ఫరాసులకును ఆంగ్లేయులకును, ఈ తంత్రసిద్ధాంతమును స్థాపించుటకై భీకర సంగ్రామములు జరగినవి. ఆంగ్లేయులు ఫరాసులు ఆస్ట్రియనులు చేరి రుష్యా బారినుండి టర్కీ దేశమును గాపాడిరి. వర్తమాన సంగ్రామమునందు జర్మనుల ప్రాబల్యము నాఁపుటకై రుష్యనులకును ఆంగ్లేయులకును ఫరాసులకును సాహచర్యము కలిగినది.

సుస్థితమైన కాన్‌స్టాంటినోపిలు నగరము తురుష్క సామ్రాజ్యమునకు కేంద్రస్థానము. యూరపు రాజ్యములకు కామితార్థము, కలహకారణము. వర్తమాన సంగ్రామ నిమగ్నులైన జర్మనులు రుష్యనులు బల్గేరియనులు గ్రీకులు కాన్‌స్టాంటినోపిలు లాభము నపేక్షించుచున్నారు. కాన్‌స్టాంటినోపిలు ప్రభువులకు యశోలాభము వ్యాపారలాభము రాజ్యలాభము గలుగుట సహజము. ఈ నగరలాభమునకై 2500 సంవత్సరములనుండియును మిక్కుటమైన పోరాటములు జరగినవి. వర్తమాన సంగ్రామాంతమునందు విజయ మే పక్షమునకుఁ గలిగినను భావికాల కలహ కారణములను నిలుపుటకై కాన్‌స్టాంటినోపిలును తటస్థ నగరముగ చేసి తురుష్కుల వశమునం దుంచుట ధర్మము, క్షేమకరము.

మహత్తరంబైన తురుష్క సామ్రాజ్య మిపుడు క్షీణదశయం దున్నది. ప్రకృతికి వృద్ధిక్షయములు కార్యసాధనమునకై నిమిత్త మాత్రములు. భాగ్యోపహతులైన తురుష్కులు పునరుద్ధారితులై లోక కల్యాణ నిర్వహణమునందు భగవ దుద్దిష్ట భాగధేయమును యథాయోగ్యముగ నిర్వహించెదరు గాత!

# జపాను దేశ విజృంభణము

ఒంగోలు శేషగిరిరావు గారు

లోకము దర్పణప్రాయము. కాలము లోకపారదము. విషయము పారదావాప్తము. పారదము రసపూరితము. రసము ఉత్సాహప్రబోధము. ఉత్సాహము నిర్మలము; సర్వపూజ్యము; ప్రకాశవంతము. ఉత్సాహము లేని మానవదేహము మృణ్మయమాత్రము. కాలపారదమే లోకాదర్శమునకు ముఖ్యరత్నము, తేజస్కారము, విషయగోచరమునకు మూలాధారము. ఈ యమూల్యరత్నము జపానుదేశ విజృంభణమునకు మూలకారణమైనది. జపానుదేశ మీ యంత్రమునఁ జూడనంత కాలమును ప్రకాశహీనమై సర్వాగోచరమై యుండెను. ఈ యంత్రబలమున నది ప్రకాశతను గని లోకపూజ్యమైనది.

సుమారు నలువది యేండ్ల క్రిందటివఱకును జపాన నెట్టిదో, అది యేలోకమున నుండెడిదో, కొండయో, మృగమో లోకమున ననేకులకుఁ దెలియదు. నిజముగా మన హిందూదేశమున రష్యాజపాను యుద్ధకాల మనఁగా 1900 ల సంవత్సరమువఱ కెవ్వరికిని దెలిసియుండలేదు. ఈ నలువది యేండ్లలో నీ చిన్నదేశ మింతటి మార్పు నొందెనా యని భారతీయు లాశ్చర్యపడక మానరు. ప్రస్తుత మిగి మహాబలవంతమై సర్వాభేద్యమై లోకమున నగ్రస్థానము గణించి యలరారుచున్నది. దీని వైశాల్యము మన భరతదేశమునఁ బదునైదవ పాలుండును. నలువది యేండ్లకు ముందీ దేశస్థితికిని, బ్రిటీషు పాలనమునకు ముందు మన దేశస్థితికిని, విశేషభేద ముండదు. ఇట్టి దేశ మింత స్వల్పకాలములో నిట్టి దశ నెట్లు పొందెనని విచారింప హైందవులు కుతూహలు లగుదురనుటకు సందియము లేదు.

ప్రస్తుత మహోన్నతస్థితికిఁ బూర్వ మీదేశ మెట్లుండెనో ముమ్ముందు విచారింతము. క్రీస్తునకుఁ బూర్వము సుమారేడవ శతాబ్దమునుండియే యీ దేశచరిత్రము మనకుఁ దెలియుచున్నది. అప్పుడు జిమ్ముటెనో యను చక్రవర్తి దేశమును బాలించుచుండెను. ఇతఁడు టెన్షోడైజీను లేక సూర్యదేవత సంతతివాఁడని కుటుంబసంప్రదాయము. ఇతని తరువాతి చక్రవర్తు లందఱును దేవతావంశసంభూతు లనియు, దేశజను లందఱును దేవపుత్రు లనియుఁ బ్రజల నమ్మకము. దేశము దేవతాభూమి యగుటచే విదేశీయు లా దేశమునకు రాఁగూడదనియు, వచ్చినవారిని జంపుటయో తఱిమివేయుటయో చేయవలయు ననియు వీరి నియమము. జిమ్ముటెనో సంతతివారు క్రీస్తుశక మేడవ శతాబ్దమువఱకుఁ బ్రజారంజకముగాఁ బాలించిరి. ఆవల కలవర మారంభించెను. ఏడవ శతాబ్దానంతరము చక్రవర్తి దేశపాలనము సర్వమును ఫ్యూజివారా యను మంత్రుల కిచ్చి తా నేమియుఁ జేయక యూరకుండెను. పదునొకండవ శతాబ్దమంతమువఱకీ మంత్రులు రాజ్యభారము వహించి యుండిరి. తదనంతరము దేశయోధులు కొందఱు వీరితోఁ బోరి బలముచే దేశపాలనముఁ దాము చేకొనిరి. పండ్రెండవ శతాబ్దమారంభమున యోధముఖ్యుఁడు యొరిటోమో యనునతఁడు పాలించుచుండెను. ఆ కాలపుఁ జక్రవర్తి యతనికి శోగ నను బిరుదము నిచ్చి గౌరవించెను. అతఁడు రాజ్యాంగమున సర్వాధికారము గలిగి కామకూర యను నగరమును రాజధానిగాఁ జేసికొని యథేచ్ఛగా దేశ మేలుచుండెను. చక్రవర్తియు రాజ్యాంగమున నే పాలును గొనక పేరునకుఁ జక్రవర్తియై కియోటో నగరమున నింద్రునివలె నివసించుచుండెను. చక్రవర్తి యన్ని విషయములందును శోగను ననుమతియం దుండెను. పండ్రెండవ శతాబ్దమంతమున యొరిటోమో సంతతిని దిగనాడి యింకొక సంతతివారు రాజ్యభారమును దీసికొని పదునెనిమిదవ శతాబ్దారంభమువఱకు నేలిరి. ఇట్లు సామ్రాజ్యపూజ్యుఁడగు చక్రవర్తి యొకచోటను, శోగ నింకొకచోటను దేశ మేలుచుండిరి.

పదునాఱవ పదునేడవ శతాబ్దములలో జపాను నౌకాశ్రయము లందు యూరపు నౌకలు రాకపోకలు సలుపుచుండెను. రోమను క్యాథొలిక్కు మతగురువులు దేశమును జొచ్చి క్రైస్తవమతవ్యాప్తిఁ జేయుచుండిరి. విమతవ్యాప్తివలన సామ్రాజ్యము నిలువఁజాలదని భయమంది పాలకులు విదేశీయులను క్రైస్తవుల నాయుధములకు బలి యీయ సాగిరి. అన్యదేశమున నిట్టి భయమునకు వెఱచి డచ్చివారు తక్క విదేశీయు లందఱును దేశమును వదలి పోయిరి. డచ్చివారును దమ పనిపాటలఁ దాము చూచుకొనుచు జనులజోలికిఁ బోవక కాలము గడపుచుండిరి. స్వదేశీయులు దేశమును విడిచిపోవఁగూడదనియు విదేశీయులు దేశసామీప్యమునఁ గనఁబడఁగూడదనియు రాజశాసన మొకటి వెలువడెను. పెద్ద యోడలను నిర్మించుటకుఁ బాలకుల యనుమతి కావలసియుండెను. ఇట్టి కఠినశాసనములవలన జపాను విదేశవాణిజ్యము నిశ్శేషముగా నంతరించెను. ఇట్లు 220 ఏండ్లు గడచెను.

ఇఁక రాజ్యాంగమున శోగను సర్వాధికారి. దేశమున మూఁడవ భాగ మతని పాలనమునం దుండెను. మిగిలిన రెండు పాళ్లను 260 మంది సామంతప్రభువులు స్వతంత్రముగా నేలుచుండిరి. వీరిలో నొక్కొక్కని రాష్ట్రమునందు నతని ప్రత్యేకసేనయు నొక రాజప్రాసాదము నుండెను. వీ రందఱును శోగను నానతికి లోఁబడి, యతని సహాయప్రభువులై యుండిరి. సామాన్య జనుల జీవనమున కట్టి యాధారమును లేకుండెను. వారి కష్టములవలన సామంతులును వారి సైనికులును జీవించుచుండిరి. వారు గాని నిమ్నజాతివారు గాని సైనికులతోనైనను సామంతులతోనైనను ఎదురుగా నిలిచి మాటాడఁగూడదు. స్వప్రాణరక్షణమునకైన నాయుధముఁ బూనఁగూడదు.

ఇట్టి కష్టకాలమున నొక్క మహాపురుషుఁడు దేశసంస్కారణమున కాయువు ధారవోసెను. శోగనుసంతతివాఁడొకఁడు దేశారాధనము సేయఁబూని కొందఱు పండితుల సాహాయ్యమువలన జపాను దేశచారిత్ర మంతయు వ్రాసెను. అందతఁడు "చక్రవర్తియే సర్వాధికారి యనియు, శోగను బలముచేతనో యుక్తిచేతనో ఆ యధికారమును దీసికొనె ననియుఁ, జక్రవర్తి పాలనము స్థాపింపనంతకాలము దేశానర్థముఁ దొలఁగఁబాల" దనియు వ్రాసెను. ఈ యుత్కృష్టగ్రంథము దేశమున నందఱికిని బఠనీయగ్రంథమై ఖ్యాతిఁ జెందెను. దీనివలనఁ బ్రజలలో రెండు కక్షలు బయలుదేఱెను. శోగను సర్వాధికారి యనువారు కొందఱును, జక్రవర్తి సర్వాధికారి యనువారు కొందఱును. ఈ యంతఃకలహములు బలవంతములై నూతనానర్థములఁ దెచ్చిపెట్టెను.

శోగను నిర్బలుఁడయ్యెను. చక్రవర్తి బలము నానాఁటికి వృద్ధి నొందుచుండెను. ఇదివఱకుఁ బాఱఁదోలఁబడిన విదేశీయు లొక్కపట్టున దేశముపైఁ బడఁజొచ్చిరి. జాతీయవ్యక్తి నిలుపుకొనుట కష్టమయ్యెను. 1863-వ సంవత్సరమున బ్రిటిషువారు శాట్సుమా రాష్ట్రమును ముట్టడించిరి. రెండు సంవత్సరము లావల బ్రిటిషు డచ్చి ఫరాసు యునైటెడుస్టేట్సు వా రేకమై చోష్యు రాష్ట్రమును ముట్టడించిరి. రెండు రంగములందును జపానీయులు విజితులయిరి.

ఇట్టి యనర్థకాలము జపానీయుల నుద్బోధించెను. వారు కన్నులను దెఱచి ఇతరదేశములను జూడసాగిరి. వారి దౌర్బల్యమును బాపు దివ్యౌషధము జాతీయైకమత్య మని స్పష్ట మయ్యెను. ద్విపాలన మున్నంతకాలము జాతీయైకమత్య ముండుట కష్ట మని వారు తెలిసికొనిరి. కొందఱు సామంతప్రభువు లీ ముఖ్యసూత్రము నెఱిఁగి "యేకపాలనము జాతీయవ్యక్తికి ముఖ్య"మనియు, "ద్విపాలకపద్ధతి యున్నంతవఱకది నిలువఁజాల" దనియు శోగనునకు విజ్ఞాపించిరి. శోగనును నయనములు దెఱచికొని, ద్విపాలనాపద్ధతికిఁ దాను గారణ మని యెఱిఁగి జ్ఞానియై సర్వాధికారమును జక్రవర్తికి నివేదించి యా పదవిని వీడి తాను నొకసామంతుఁడయ్యెను. ఆవల సామ్రాజ్యస్థాపనమున కిదియే పునాది యయ్యెను.

ఇట్టి సమయమునఁ జక్రవర్తి మరణించెను. ప్రభువు లందఱును బసిబాలుఁడగు నాతని కుమారునిఁ బట్టాభిషిక్తునిఁ జేసిరి. దేశాభ్యున్నతికిఁ దగు మార్గములే పసిపాపని యుగ్గుపాలయ్యెను. పదునాఱేండ్లు వచ్చినవెనుక బాలుఁడయ్యును జక్రవర్తి సర్వాధికారమును జేఁబూని తన ప్రజ్ఞానైపుణ్యములఁ బ్రకటింపసాగెను. 1868-వ సంవత్సరమున విదేశరాజప్రతినిధు లందఱికిని జక్రవర్తి దర్శన మిచ్చు నని యొక ప్రకటనము ప్రచురింపఁబడెను. వా రందఱు నట్లు వచ్చుచుండఁగా విదేశీయులందలి యసూయచేఁ గొందఱు దుర్మార్గులు వారి నెదిరించి పోకుండ నాటంకపఱచిరి. వారిలో నొకరిద్దఱు హతులైరి. మఱునాఁడు రాజనగరునఁ జక్రవర్తి యందఱి నెదుర్కొని యాదరించి విదేశీయులు జపానుదేశమున వర్తకము చేసికొనవచ్చు ననియు, వారికి జను లే మాత్రము హానియుఁ జేయగూడ దనియుఁ జెప్పెను. అప్పటినుండి విదేశీయులను దేశీయులు మర్యాదతోఁ జూచుచుండవలయు ననియు, వారియెడ నెట్టిక్రోధమును జూపఁగూడ దనియు, వారికి హాని చేయువారికిఁ దగు శిక్ష విధింపఁబడు ననియుఁ బ్రచురింపఁబడెను. ఐనను దేశీయులు క్రైస్తవమతము నవలంబింపఁజన దనియు, నట్టి వారు శిక్షాపాత్రు లనియుఁ గూడ ప్రచురింపఁబడెను.

ఆ చక్రవర్తి పాలనావసరమున రాజ్యాంగమున నూతనశకమారంభ మయ్యెను. మునుపటివలె చక్రవర్తి కూపస్థమండూకము గాక రాష్ట్రరాష్ట్రమునఁ బర్యటనము చేయుచు, స్వయముగాఁ బ్రజల స్థితిగతులను గూర్చి విచారించుచుండెను. ప్రజలును జక్రవర్తిని దర్శించి వారివారి విజ్ఞాపనములను నివేదింపవచ్చును. దేశపాలనాక్రమమునఁ జక్రవర్తికి సాహాయ్యము చేయుటకు మంత్రిసంఘ మొకటి స్థాపింపఁబడెను. సామంతప్రభువులు చక్రవర్తితో నెట్టి సంబంధము లేక సర్వథా స్వతంత్రులై యుండుట దేశానర్థముగా నుండెను. అప్పుడు చక్రవర్తి సామంతవర్గమును రావించి వారిఁకముందు తమతమ రాష్ట్రములను వదలి టోకియో నగర భవనములందు నివసించుచుండవలయు ననియు, వారికి వచ్చుచుండిన రాఁబడిలోఁ బదియవ పాలు భృతిగా నీయఁబడు ననియుఁ దమ రాష్ట్రములందు సర్వస్వమును జక్రవర్తికి సమర్పింపవలయు ననియుఁ జెప్పెను. ఈ శాసనమునకు ముందే నలుగురు సామంతులు తమ రాజ్యములను జక్రవర్తి కిచ్చి యితరులకు మార్గదర్శకులైరి. ఇట్లు చక్రవర్తి సార్వాధిపత్యమును వహించి యేకచ్ఛత్రముగా దేశ మేలుచుండెను. ఇట్టి యధికారము గలిగిన వెంటనే చక్రవర్తి తన పాలనమునందలి జను లందఱును సమాను లనియు, నందఱి హక్కులు అనుభవములు స్థిరము లనియు, నిఁక న్యాయాన్యాయవిచారము బాగుగా జరగుచుండు ననియు, నందఱును విద్య నేర్చి పాటుపడి జాతీయవ్యక్తిని గాపాడవలయు ననియుఁ బ్రకటించెను.

వారి యదృష్టవశమున నింగ్లండునుండి "సర్ హారిఫా"క్సను నతఁడు విదేశమంత్రిగా జపానుకుఁ బంపఁబడెను. ఈతని యమూల్యసాహాయ్యముచేతనే దేశము సర్వోత్కృష్టదశకు రాఁగలిగెను. సర్వరాజకీయవిషయములందు నితని యనుమతి యత్యగత్యముగాఁ బాటింపఁబడుచుండెను. ఇతఁడును జపానుదేశజాతీయవ్యక్తి నన్నివిధములఁ దోడ్పడుచు, నా దేశమును స్వదేశముగా భావించి యప్రమత్తుఁడై పని చేయుచుండెను.

ఇతఁడు మంత్రిత్వమునకు వచ్చినతోడనే, నౌకాదళశిక్షకులను నౌకానిర్మాతలను జిత్రభవనకర్మకులను రావించి వారిచే దేశసేవ చేయించుచుండెను. భవనాదినిర్మాతలు దేశమున నయోమార్గములను దీపస్తంభములను విద్యుచ్ఛాలలను జలయంత్రములను నెలకొల్పిరి. కొందఱు క్రొత్తనాణ్యములను టంకసాలలను స్థాపించిరి. మఱికొందఱు కాగితపుయంత్రములను ముద్రాశాలలను దేశమున నుంచిరి. యునైటెడు స్టేట్సువారు సందేశవాహకశాలలను

విద్యానిలయములను విశ్వవిద్యాలయములను స్థాపించిరి. పరాసు వారు సైన్యశిక్షకులను నౌకానిర్మాణనిపుణులను రావించిరి. జర్మనీ వారు వైద్య రాజ్యాంగ శాస్త్రములను బోధించిరి. ఇటలీవారు రాయిధశాలలను మందుఁ జేయు కర్మాగారములను స్థాపించిరి. ఇట్లు పాశ్చాత్యదేశరత్నములు జపానుదేశోద్ధరణమునకుఁ గంకణముఁ గట్టుకొని పాటుపడెను. జపానునుండి వివిధదేశములకు విద్యార్థులు దేశవ్యవస్థల నేర్చికొనఁ బంపఁబడిరి. విద్య నేర్చుకొనుట సంపూర్ణ దేశాభిమానమువలననే గాని మనవలె నాలుగుడబ్బులు గణించి పొట్టఁబోసికొనుటకుఁ గాదు. క్రైస్తవమతాచారులు తమ పనిఁ దాము చేయ నిలువఁబడినను విమతనిరసన మింకను నశింపలేదు. ఇట్లు జపాను సామ్రాజ్యము లోకనాగరికతను గ్రహించుచుండెను.

దౌష్ట్యనివృత్తికిని సన్మార్గప్రవృత్తికిని శిక్షాస్మృతియు న్యాయశాస్త్రమును ముఖ్యము లని వారుఁ బ్రకటించిరి. దీనివలన జనసామాన్యులు క్రియాన్యాయపచారమును దుష్కార్య నిరసనమును నలవడ జేసికొనిరి. కొందఱు హాంగ్ కాంగ్ సింగపూరు మొదలగు ప్రదేశములకుఁ జని కారాగృహనిర్మాణమును కారాగారచర్యయును నేర్చికొని స్వదేశమున నా పద్ధతులఁ బెంపొందించిరి. ప్రస్తుతము జపానులోని బంధనాగారపద్ధతి లోకమున నత్యుత్తమ మని ప్రఖ్యాతిఁ గనినది. శిక్షకు ముందు సంస్కరణమునకుఁ గడు విచ్చు పద్ధతి స్థాపింపఁబడెను. నూతనన్యాయశాలలు నెలకొల్పి వానియందుఁ బ్రత్యేకన్యాయాధికారులను నియమించిరి. న్యాయశాలలును న్యాయవాదవృత్తి యొకటి స్థాపింపఁబడెను. దేశవ్యక్తి స్థాపించుకొనుటకు సైనికబలము ముఖ్యము. ఇంతకుఁ బూర్వము ప్రభువులు తమ రాష్ట్రములందే ప్రత్యేకసేన గలిగి యుండిరి. చక్రవర్తి కడ సైన్యమే మాత్రమును లేకుండెను. ప్రభువులు స్వరాష్ట్రములను వీడుటచే వారి సేనలన్నియుఁ జక్రవర్తి క్రిందఁ జేరెను. ఇంతియే కాక 1872-వ సంవత్సరమునఁ గ్రొత్తగా నిర్బంధసైనికవృత్తి ప్రారంభింపఁబడి సైనికబలమును వృద్ధిచేసెను. ఇరువది యేండ్లు నిండిన ప్రతి పురుషుఁడును మూఁడేండ్లు సైనికవృత్తి నుండవలయును. ఆవల రెండేండ్లొక నిశ్చలసేనాభాగమునందును, మఱి రెండేండ్లు మఱియొక సేనాభాగమునందును బనిచేయవలయును. అనంతరము వారు యథేచ్ఛముగఁ బ్రత్యేకవృత్తులఁ దమ తమ పనిపాటులఁ జేసికొనవచ్చును గాని, నలువదియేండ్లవఱకును బిలిచినప్పుడు యుద్ధరంగమునఁ జేరవలయును. ఈ శాసనము వలన జనసంఖ్య వృద్ధినొందుచుండ సైనికబలమును వృద్ధినొందుచుండెను.

విద్యావృద్ధి యీ దేశమున జరగిన ట్లింకే దేశమున నెన్నఁడును జరగియుండలేదు. విద్యాహీనమైన గ్రామము గాని, గ్రామమున విద్యాగంధము లేని కుటుంబము గాని, కుటుంబమున విద్యాభూషణములేని జనుఁడు గాని యుండఁగూడ దని వారి నియమము. పాలకుల ధనసాహాయ్యమును విచారణయును లేకయే విద్యాశాలలు ప్రబలెను. ప్రతి తండ్రియును దన బిడ్డలను దప్పక పాఠశాలలకుఁ బంపుట తన విధి యని గ్రహించెను. ఇట్టియెడ విద్యావ్యాపనము నిర్విఘ్నముగాఁ గొనసాగ నన్న నేమి యాశ్చర్యము? పాలకులును ఈ విషయమునఁ బ్రాలుమాలి యుండలేదు. వారును రాజ్యాంగసభయందుఁ బ్రత్యేకముగా విద్యామంత్రి నొకనిని నియమించి వాని వలన విద్యావ్యాపనము చేయించుచుండిరి. 1871-వ సంవత్సరమున వా రమెరికా మార్గముల ననుసరించి నిర్బంధ విద్యాశాసనము నొకదానిని బ్రకటించి విద్యావ్యాపనమునకుఁ దోడ్పడిరి. ఇట్లు దేశమున విద్య సర్వసామాన్య మయ్యెను.

సత్య మగు పరిపాలనమునకుఁ బ్రజాభిప్రాయమే మూలమంత్రము. ఈ మంత్రముఁ బఠించుటకుఁ బ్రజాప్రతినిధి సంఘములును వానియందు రాజకీయ విషయ చర్చలును ముఖ్యములు. జపానీయు లీ యమూల్యజ్ఞానమును విదేశములనుండి గ్రహించి యట్టి సంఘములను దమ దేశమునందు స్థాపించిరి. 1869-వ సంవత్సరమున శాసననిర్మాణసభ యొకటి నెలకొల్పఁబడెను. కొంతకాలములోఁ బరిపాలకులు దీనిని సంస్కరించి ప్రస్తుత మింగ్లండు మున్నగు దేశములందుఁ గల "పార్లమెంటు"సభవలెఁ జేసిరి. వా "రీటో" ప్రభువును ఐరోపాఖండ దేశములందలి పాలనా విధానమును నేర్చికొని వచ్చి స్వదేశమున నట్టి పాలనము స్థాపింపఁ బంపిరి. ఇతఁడును విదేశములకుఁ బోయి వచ్చి దేశమునఁ గార్యనిర్వాహక సంఘము నొకదాని నిర్మించెను. దీనియందలి సభ్యులందఱును వివిధశాఖల మంత్రులు. పార్లమెంటు సభ రెండు భాగములుగా విభజింపఁబడెను. ఒక భాగము ప్రభుసంఘము. ఇంకొకటి ప్రజాప్రత్యామ్నాయసంఘము. ప్రభుబిరుదము గలవారందఱును ప్రభుసభాసభ్యులు. ప్రభుబిరుదము ప్రభుసంతతివారికే గాక దేశసేవఁ జేసి మెప్పువడసినవారి కందఱికిని లభించుచుండెను. పాలన మింకను బాగుగా స్థిరపడలేదు. పార్లమెంటు సభల తీర్మానములను సామ్రాజ్యసభ్యులు త్రోసివేసి తమ తీర్మానములనే శాసించుచుండిరి. ఇట్టి స్థితి మరల కలతలకుఁ గారణ మయ్యెను. రెండు మూఁడు సారు లా 'పార్లమెంటు'సభలను నిర్నిమిత్తము లని త్రోసివేసిరి. ఇరు కక్షులవారును దగవులాడుకొనుచు నున్మాదమును బ్రకటించుచుండిరి.

ఇట్టి యనర్థకాలమునఁ జైనా దేశముతో యుద్ధము తటస్థించెను. ఇంతవఱకును పాలనావిధానమును గూర్చి తగవులాడుకొనుచుండినవారీ బెబ్బులిని జూచి యైకమత్యము నొంది సమరసిద్ధులై పోరిరి.

యుద్ధానంతరము రాజ్యపరిస్థితులం దెట్టి మార్పును గలుగలేదు. ప్రజ లింక నాందోళనముఁ జేయుచుండిరి. శాంతిస్థాపనాకంకణమును బూని ప్రధానమంత్రి యగు నీటో ప్రభువును మఱికొందఱు ప్రభువులును జేరి సత్పాలనాసంఘము నొకదానిని స్థాపించి బలపఱచిరి. ప్రజాభిప్రాయమునకుఁ బ్రాముఖ్యము నీయవలయు ననియు, ప్రజాపక్షవాదులు పాలకపక్షవాదులు అను విచక్షణలు లేక యుక్తమగు వానికి మంత్రిత్వ మీయవలయు ననియు వారి వాదము. దీనివలనఁ బాలనావిధానమునఁ గొంత సంస్కరణము జరగెను

ఇతర జాతీయసంస్కరణముల నీ క్రిందఁ గ్లుప్తముగాఁ బొందు

పఱచెదను. అందుఁ గ్రైస్తవనిరసనాపద్ధతి నిర్మూలముఁ జేయుటయు నిష్టసుతానుసరణతంత్రము నెలకొల్పుటయు ముఖ్యమైనవి. ఇంతవఱకును విదేశీయులను నసహ్యాపనోఁ జూచుచు హీనజాతులుగాఁ బరిగణించుచుండిరి. వారి సాహాయ్యము లేక యొక్కదినమును గడువకుండెను. పాలనాక్రమమునకు వారే యాధారులై యుండిరి. ఇట్టియెడ నన్యదేశీయులను దమతో సమానముగాఁ జూడనిది దేశోన్నతి లభింప దని యందఱును గ్రహించిరి. చక్రవర్తి, పాలనాక్రమమునం దన్యదేశీయులను స్వదేశీయులనుగాఁ జూచుచుందుమనియు, స్వదేశీయులకుఁ గల హక్కులు వారికిని గలవనియు, వారి నగౌరవముచేయు దేశీయులు శిక్షాపాత్రు లనియుఁ బ్రకటించెను. ఇట్లు స్వదేశీయులకును విదేశీయులకును బరస్పరానుకూల్యము స్థాపింపఁబడెను. చక్రవర్తి స్వహస్తలిఖితసూత్ర మన్న దేశీయులకు వేదవాక్యము. ఒక్క యక్షర మతిక్రమించినయెడల యమలోకదండనము ప్రాపించు నని వారి మతము. చక్రవర్తియుఁ గాలానుసరణముగా నొక్కొక శాసనమును బ్రతిపాదించుచుండెను. వీనివలన విదేశీయులతోడి మైత్రియు స్వదేశీయుల గౌరవము నతఁడు నిలిపెను.

వర్తక మనిన హీనవృత్తి యని వారి యభిప్రాయము. ప్రస్తుతము వర్తకదేశములలో నగ్రగణ్యమని చెప్పఁదగినను ఇప్పటికిని జపానీయులు వర్తక మనిన హీనవృత్తియే యని భావించుచున్నారు. ప్రస్తుత యుద్ధసమయమున జర్మనీనుండి మనకు వచ్చుచుండిన సరకు లన్నియు జపానీయులు తమ దేశమునఁ జేసి మనకుఁ బంపుచున్నారు. వర్తకమునందలి హీనభావము క్రమముగా నశించుచున్నదని చెప్పవచ్చును. ఇంతకుఁ బూర్వము వీరి వర్తక మంతయుఁ బట్టును తేయాకును మైనము నై యుండెను. 1834-వ సంవత్సర ప్రాంతమునందుఁ బరాసుదేశమున పట్టుపురుగులం దొకవిధమగు ప్లేగు జాడ్యము ప్రబలి వారి పట్టువర్తకము క్షీణించెను. వారు పట్టు నింకొక దేశమునుండి తెప్పింప నొల్లక పట్టుపురుగులను మరలఁ దెప్పించి పట్టు చేయఁ జూచిరి. జపాను దేశమున మంచి పట్టుపురుగు లుండెడి వని ప్రఖ్యాతి యుండెను. పరాసువారీ దేశమునుండి మంచి పట్టుపురుగు లన్నియుఁ దీసికొనిపోయి పనికిరాని పురుగులను దేశమున నుంచి పోయిరి. ఈ మోసమును దేశీయులు కనుఁగొనరైరి. కొంత కాలమునకుఁ బరాసు దేశమునఁ బట్టువర్తకము మగల వృద్ధి నొందెను. జపాను దేశమున నది క్రమముగా క్షీణించెను.

దేశము పూర్వము వ్యవసాయ దేశముగా నుండెను. ఎప్పటికిని వ్యవసాయమువలననే వారు జీవించుచుండిరి. వ్యవసాయ లాభములవలన నిప్పు డుపయోగ మగపడకుండెను. బొక్కసమున ధనము సున్న యగుచుండెను. నానాఁటి కప్పుఁ దెచ్చుకొను దినము సమీపించుచుండెను. దేశమంత్రు లీ యనర్థమును జూచి దీనిని బాపుకొను మార్గము నాలోచింప సాగిరి. కాగితపు ద్రవ్య మమలులోనికిఁ దెచ్చి, యొకచోట కాగితపుద్రవ్య మిచ్చు ధనాగారమును వేఱొకచోట స్వర్ణరూపధనమిచ్చు స్థానమును స్థాపించిరి. కాగితపు ద్రవ్యము విలువ తగ్గింపఁబడెను. కొంత కాలమువఱకు కార్థికవ్యవస్థలఁ బరిశీలించి వ్యయము చేయుచుండిరి. పన్నులు స్వల్పముగా నెక్కువ చేయఁబడెను. దేశమున ఫలించుదానినిఁ బరిపాలకులు కాగితపు ద్రవ్యముచేఁ గొని విదేశీయులకు స్వర్ణరూపధనమున కమ్మసాగిరి. ఇట్లు పాలకసంఘము వర్తకసంఘముగాఁ బరిణమించెను. శీఘ్రకాలములోనే బొక్కసము మరల పూర్ణ మయ్యెను. వాణిజ్య మభివృద్ధి నొందెను. నానాఁటికి లక్ష్మి వారి ధనాగారములఁ దాండవ మాడసాగెను. వర్తకమువలని లాభముల నందఱికిని బంచి యిచ్చిన నొక్కొక్కని పాలునకు 18½ ఎన్ను లయ్యెను. మనదేశమున నన్నను దేశలాభమును బంచిన నొక్కొక్కనికి సుమారు మూఁడు రూపాయలు మాత్రమే గిట్టుచున్నది. ఎన్న ఇంచుమించుగా నొక్క రూపాయకు సమాన మని చెప్పవచ్చును.

దేశమున సర్వవిధ పరిశ్రమలను నెలకొల్పిరి. విదేశములఁ జేయఁబడుచున్న వస్తువు లన్నియు నిక్కడఁ జేయఁబడుచున్నవి. ప్రస్తుత మీ దేశము వ్యవసాయ దేశము గాక పారిశ్రామిక దేశమై సర్వసంపత్స్థానమై యలరారుచున్నది.

# ఆంగ్లేయ సామ్రాజ్యము

ఎస్. వేంకటరంగయ్య గారు, ఎమ్. ఏ.

## ప్రస్తావన

ప్రపంచమందు ఒక్కటే రాష్ట్రముపై అధికారమును చెల్లించుచుండు ప్రభుత్వములు కొన్నియు, ఏక కాలమందు అనేకరాష్ట్రములపై అధికారమును చెల్లించుచుండు ప్రభుత్వములు మఱికొన్నియు కలవు. డెన్మార్కు నార్వే స్వీడన్ పర్షియా మొదలగు దేశములలోని ప్రభుత్వములు మొదటి రకములోను, ఇంగ్లండు రష్యా జపాన్ మొదలగు దేశములలోని ప్రభుత్వములు రెండవ రకములోను చేరియున్నవి. ఈ రెండవ రకములోని ప్రభుత్వములకే సామ్రాజ్యప్రభుత్వము లనియు, ఇట్లు ఒకే ప్రభుత్వమునకు లోఁబడియుండు అనేకరాష్ట్రముల సముదాయమునకే సామ్రాజ్య మనియు పేర్లు. అనాదినుండి ప్రతి ఖండమందును ఇట్టి సామ్రాజ్యములు గలవు. సామ్రాజ్యాధిపతు లగుటచేతనే హరిశ్చంద్రాదులకు చక్రవర్తు లను ప్రఖ్యాతి కలిగినది; ఈ హేతువుచేతనే రాముఁడు ధర్మరాజు మొదలగువారు అశ్వమేధ రాజసూయాది యాగములు చేయఁగలిగిరి. పౌరాణికకాలమందలి క్షత్రియులకు వీనిని సంపాదించుటయే కులధర్మమై యుండెను. చంద్రగుప్తుఁడు అశోకుఁడు విక్రమాదిత్యుఁడు శ్రీహర్షుఁడు అక్బరు ఔరంగజీబు మొదలగు రాజశ్రేష్ఠులు వంశానుగతముగ తమకు లభించిన రాజ్యమునే గాక ఇరుగుపొరుగులం దున్న స్వతంత్రరాష్ట్రముల నెన్నిటినో జయించి కూడ వశపఱచుకొని, మన భరతఖండముపై నంతటను సామ్రాజ్యాధిపత్యము వహించిరి. ఇట్లే మన దేశమందు మాత్రమే గాక, దేశాంతరములయందును జరగుచుండెను. క్రీస్తు పుట్టుటకైదు వందల సంవత్సరములకు పూర్వము పారసీకులు సింధునది మొదలు మధ్యధరాసముద్రమువఱకును గల దేశముల నన్నిటిని స్వాధీనపఱచుకొని రెండు వందల సంవత్సరములు వాటిని నిరంకుశముగ పరిపాలించిరి. ఈ సామ్రాజ్యమునే ఓడించి దాని స్థానమున శూరుఁ డగు అలెగ్జాండరు గ్రీకుల సామ్రాజ్యమును స్థాపించెను. పూర్వకాలమం దిట్టి సామ్రాజ్యము లెన్నియో ఉండినను, వీని యన్నిటిలో నిరుపమానవైభవము ననుభవించి అద్వితీయమైన దని పేరుపొందినట్టిది ఒక రోమన్ సామ్రాజ్యమే. విస్తీర్ణమం దేమి, పరిపాలనాపద్ధతియం దేమి, సత్ఫలసముదాయమం దేమి, దానిని చెప్పియే ఇతరసామ్రాజ్యములను చెప్పవలసియుండును.

ప్రస్తుతకాలమందు వృద్ధిదశలో నుండు సామ్రాజ్యములలో ఒక జపాన్‌వారిది తప్ప మిగిలిన వన్నియు పాశ్చాత్యు లగు ఐరోపాఖండవాసులచేతనే సంపాదింపఁబడి వారి స్వాధీనమందే యున్నవి. వీని అన్నిటిలోను మన ప్రభువు లగు ఇంగ్లీషువారి సామ్రాజ్యమే అగ్రగణ్యమై అనేకవిశేషములతో కూడియున్నది. జనసంఖ్యయందును విస్తీర్ణమందును ఐశ్వర్యమందును దీనిని పోలినట్టిది మఱియొకటి లేదు. ఇంగ్లీషువారు నివసించు దేశము చాల చిన్నదైనను ప్రపంచముయొక్క పాతిక భాగము వారి పరిపాలనకు లోఁబడియున్నది. ఇంగ్లండు దేశము ఐరోపాఖండములో చేరినదైనప్పటికిని, ఒక జిబ్రాల్టరు మాల్టా అను చిన్న ప్రదేశములు తప్ప ఐరోపాలోని మఱియే దేశములును ఇంగ్లీషువారి స్వాధీనమందు లేవు; కాని, ఎన్నియో వేల మైళ్ల దూరమం దున్నట్టియు జాత్యంతరుల నివాసస్థానమైనట్టియు ఆసియా ఆఫ్రికా అమెరికా ఆస్ట్రేలియా ఖండములందు వారి పరిపాలనలో ఎన్నియో దేశము లున్నవి. ఆంగ్లేయసామ్రాజ్యమం దున్న ప్రజలలో కనఁబడు నన్ని భేదములు మఱిదేనియందును కనఁబడుట లేదు. కొన్ని భాగములయందు క్రీస్తుమతము నవలంబించి ఇంగ్లీషు భాషను మాటలాడునట్టి తెల్లవారును, మఱికొన్ని భాగములయందు బ్రాహ్మణ బౌద్ధ మహమ్మదీయాది మతముల నవలంబించి వివిధభాషల మాటలాడు నల్లవారును, కొన్ని ప్రదేశములలో రాజకీయ విషయములందు సర్వస్వాతంత్ర్యము కలిగిన ప్రజలును, మఱికొన్నిటిలో ప్రభుత్వమువారి నిరంకుశాధిపత్యమునకు లోఁబడియుండు ప్రజలును అగపడుచున్నారు. సామ్రాజ్యములో ఒక భాగమం దున్న ఆచారవ్యవహారములు మఱియొక భాగమందు లేవు. ఇన్ని విధముల వేఱువేఱుగ నుండు దేశములను పరిపాలించుట సామాన్య విషయము కాదు. ఇది గాక, ఈ దేశములలో చాల భాగము నూరు సంవత్సరములలోపుగా వశపఱచుకొనఁబడినది. మూఁడు వందల సంవత్సరములకు పూర్వము ఆంగ్లేయ సామ్రాజ్యమే లేక యుండెను. ఇంగ్లీషువారప్పు డొక ఇంగ్లండునకు మాత్రమే పరిపాలకులై యుండిరి. బహుశీఘ్రకాలములో వా రెంతయో గొప్ప సామ్రాజ్యమును స్థాపింపఁగలిగిరి.

ఆంగ్లేయసామ్రాజ్యచరిత్రమును చదివినయెడల ఈ విశేషముల కన్నిటికిని కారణము లేవియో చక్కఁగ బోధపడుటయే గాక, సామ్రాజ్యముయొక్క పరమార్థ మిది యనియు, దానివలన మన దేశములోను ప్రపంచమందలి ఇతరరాష్ట్రములలోను ఏలాటి మార్పులు కలుఁగఁగలవో ఆ విషయమును మనకు తెలియఁగలవు. ప్రస్తుత స్థితిగతులను స్పష్టపఱచి భావికాలపు స్థితిని సూచించునట్టిదే కదా దేశచరిత్రము.

## II పునాది

వ్యాపారము చేసి విశేషధనమును గడింపవలె నను అభిలా

GENERAL BIRDWOOD



జనరలు బ్ర్డ్వుడ్

GENERAL SIR JAMES WILCOCKS



జనరలు సర్ జేమ్సు విల్ కాక్సు

LORD DERBY



డర్బీ ప్రభువు

GENERAL SIR LESLI RUNDLE



జనరల్ సర్ రండెల్

మయు, దేశాంతరములలో స్థిరనివాసముల నేర్పఱచుకొని అచ్చట నే కాఁపురము చేయ మొదలిడినయెడల ఎక్కువ సుఖముగను స్వతంత్రముగను జీవనము చేయవచ్చుననెడి నమ్మకమును, ఇంగ్లీషువారిని సామ్రాజ్యస్థాపనమునకు పురికొల్పిన కారణములలో ప్రధానములై యున్నవి. తెల్లవారు నివసించుటకు తగిన చల్లని దేశములు ప్రపంచమందున్న వని ఇంగ్లీషువారికి తెలియకపోవుటవలనను, వ్యాపారము చేయుటకు తగిన విదేశము లుండినను వానిలో వ్యాపారము చేయుటకు వారికి కావలసిన అవకాశములు లేని కారణముచేతను, స్వాతంత్ర్యమును సౌఖ్యమును అనుభవించుటకు దేశాంతరములకు వెళ్లవలసినంతటి అగత్యము వారికి లేకపోవుటవలనను, 1500 ల సం. నకు పూర్వము ఇంగ్లీషువారు పరదేశములను సంపాదించుటకు ఏలాటి ప్రయత్నములను చేయలేదు. 1500 ల సం. ప్రాంతమున వారి జ్ఞానమందును వారి స్థితిగతులయందును కొన్ని మార్పులు కలిగి, అవి వారిని విదేశములకు వెళ్లునట్లు ప్రోత్సాహపఱచినవి. 1492.వ సం. లో కొలంబసు అప్పటివఱకు తెల్లవారికి తెలియనట్టి అమెరికా యను క్రొత్త ఖండము నొకదానిని కనిపెట్టుటయు, 1498.వ సం. లో వాస్కోడె గామా మన దేశమునకు చక్కని సముద్రపు మార్గము నొకదానిని కనుఁగొనుటయు, 1521.వ సం. తర్వాత ఐరోపా ఖండమందు క్రీస్తుమతములో ఒక గొప్ప విప్లవ ముత్పత్తియై ఇదివఱకు ఏకముగ నున్న క్రైస్తవులలో అనేకశాఖాభేదము లేర్పడుటయు, ఈ మార్పులలో ముఖ్యము లైనవి. ఇట్టి మార్పు లప్పుడు జరగక యుండినయెడల సామ్రాజ్యమును స్థాపించుటకు ఇంగ్లీషువారికి అవకాశము లేకపోయి యుండవచ్చును.

ఇట్టి మార్పులు 1500 ల ప్రాంతమున ఏల కలుగవలయు? 1500 ల సం. వఱకు ఐరోపావారు మన దేశముతోను మిగిలిన తూర్పు దేశములతోను విస్తారమైన వ్యాపారము చేయుచుండుటయు, ఈ వ్యాపారమును నిరాటంకముగ నడపించుటకు ఐరోపానుండి మన దేశమునకు సముద్రపు మార్గము నొకదానిని క్రొత్తగా కనిపెట్టవలసిన అగత్యము 1400 ల తర్వాత వచ్చుటయు, ఇట్టి మార్గ మొకటి దొరకని పక్షమున అదివఱకు జరగుచుండిన వ్యాపార మంతయు నిలిచిపోవు నను భయమును, ఈ మార్పులలో మొదటి రెంటిని కలుగఁజేసినవి. ఎన్నియో వేల సంవత్సరములనుండి మన దేశమునకును ఐరోపా దేశములకును ఇంతంత అనరాని వర్తకము జరగుచుండెను. ఐరోపా ఖండమందు గోదుమలు మొదలగు సామాన్యపు పంటలే పండుటవలనను, మోటు రకమైన వస్త్రములను గృహసాధనములను చేయుటయందు మాత్రమే తెల్లవారికి ఆ కాలమందు నేర్పు ఉండుటవలనను, ప్రశస్తపదార్థముల ననేకములను, బుద్ధిచాతుర్యము లేనిదే చేయుటకు వీలుండని అనేక వస్తువులను వారు తూర్పు దేశములనుండియే కొనవలసియుండిరి. లవంగము జాజికాయ జాపత్రి ఏలకుపండ్లు మిరియము మొదలగు సువాసనపదార్థములును, వజ్రములు కెంపులు పచ్చలు పగడములు ముత్యములు మొదలగు రత్నములును, విలువగల ఔషధములును, అపురూపమైన మూలికలును, గంధము కస్తూరి మొదలగు సుగంధద్రవ్యములును, రవసెల్లాలును, ప్రశస్తమైన నూలు పట్టువస్త్రములును, చిత్రవిచిత్రము లయిన కంబళ్లను శాలువలును, ఇన్నియేల, ధనికులును రాజాధిరాజులును వేనిని భోగపదార్థము లని యెంచెదరో, వేనిని సంపాదించుటకై ధనరాసులను క్రుమ్మరించెదరో, ఏ పదార్థములను చేయుటకు బుద్ధిసూక్ష్మతయు అనుభవజ్ఞానమును కావలసియుండునో, వాని నన్నిటిని అనాదినుండి ఇండియా పర్షియా చైనా మొదలగు తూర్పు దేశస్థులవద్దనే ఐరోపా దేశస్థులు సంపాదింపవలసి యుండిరి. ఇందు నిమిత్తముగనే తూర్పు పడమటి దేశములకు ఏఁటేఁటను కోట్లకొలఁది రూపాయల విలువగల వ్యాపారము జరగుచుండెను. ఈ వ్యాపారమువలన ఐరోపా వర్తకులకు కలుగుచుండిన లాభమునకు మితి లేకయుండెను.

ఈ వర్తక మంతయు ఆసియా ఖండములోని పెక్కు మెట్ట మార్గములమీఁదుగ నడచి, ఈజిప్టు దేశములోని అలెగ్జాండ్రియా పట్టణమును, రోమ్ సామ్రాజ్యమునకు చిరకాలము ప్రధానపట్టణముగ నుండిన కాన్‌స్టాంటినోపిలును, మధ్యధరాసముద్రపు తూర్పు తీరమందున్న ఆంటియోక్ స్మిర్నా మొదలగు పట్టణములను చేరి, అచ్చటినుండి మధ్యధరాసముద్రముమీఁదుగ నడచి, తుదకు ఐరోపాలోని సమస్తదేశములను చేరుచుండెను. లాభమును ఆశించిన ఐరోపా వర్తకు లందఱు ఈ పట్టణములకు వెళ్లి, అచ్చట సరకులను మొత్తముగ కొని, అచ్చటినుండి ఐరోపా దేశము లన్నిటికిని వానిని తీసికొని వెళ్లి అమ్ముచుండెడివారు. వారి వ్యాపారమునకు మూలము మధ్యధరాసముద్రపు తూర్పు తీరమందున్న పట్టణములై యుండెను; వ్యాపార మంతయు ఈ సముద్రముమీఁదుగనే నడచుచుండెను. ఈ కారణముచే, ఈ సముద్రము చుట్టు నున్నట్టి దేశములవారు విశేషలాభమును పొందుచుండిరి. ఎన్నియో వందల మైళ్ల దూరమందు ఐరోపాఖండములో ఎక్కడనో ఒక మూలలో ఉన్నట్టి ఇంగ్లీషువారికి లాభము పొందుటకు విశేష మవకాశము లేకయుండెను.

1400 ల సం మొదలు ఈ వ్యాపారమున కంతకు ఒక గొప్ప ఆటంకము సంభవించెను. అనాగరకులై దేశద్రిమ్మరులై క్రొత్తగ మహమ్మదీయ మతము నవలంబించి క్రీస్తుమతస్థు లన్న అత్యంతాసహ్యతను చూపుచు, పౌరుషవంతులకు యుద్ధము చేయుటయే ఉచిత మని వర్తకవ్యాపారములు నీచవృత్తు లని గర్హించుచుండిన తురకజాతివారొకరు మధ్యధరాసముద్రపు తూర్పు తీరమందు రాజ్య మొకదాని నేర్పఱచుకొని, గ్రీసు బల్గేరియా సర్వియా మొదలగు దేశముల నాక్రమించి, క్రమక్రమముగ ప్రాక్ పశ్చిమ ఖండ వ్యాపారమునకు మూలాధారములై యున్న కాన్‌స్టాంటినోపిలు అలెగ్జాండ్రియా మొదలగు రేవు పట్టణముల నన్నిటిని వశపఱచుకొని, క్రైస్తవులను వారి మతవ్యాపారములను నిర్మూలము చేయ దీక్ష వహించి, యుద్ధములు చేయఁబూనిరి. ఈ కారణముచే తూర్పు దేశపు సరకులను కొనుటకు అలెగ్జాండ్రియా మొదలగు పట్టణము

లకు వెళ్లుచున్న ఐరోపా వర్తకు లెవ్వరును అచ్చటికి వెళ్లుటకు సాహసింపరైరి. సాహసించి కొందఱు వెళ్లినయెడల వారి ఓడలును సరకులును తురకల పాలగుచుండెను. ఇందుచే తూర్పు దేశములతో ఇదివఱకు జరగుచుండిన వ్యాపారము క్షీణింపసాగెను. దారిదోఁపిడిగాండ్రు మార్గమధ్యమం దున్నప్పుడు ఆమార్గమున ఎవరు నడువఁగలరు?

వ్యాపారము క్షీణించుచుండినను తూర్పు దేశపు సరకులయందు ఐరోపావారికిఁ గల ప్రీతి మాత్రము తగ్గలేదు. తురకలు ఆక్రమించుకొన్న దేశములతో ఏలాటి సంబంధము లేని సముద్రపు మార్గము నొకదానిని ఇండియాకు కనిపెట్టినయెడల వ్యాపారము యథాప్రకారముగను నిరాటంకముగను జరపవచ్చు నను ఆశతో ఇటలీ స్పెయిన్ మొదలగు దేశములలోనివారు బహుశ్రద్ధతో అనేక ప్రయత్నములు చేయఁదొడఁగిరి. ఇండియాకు తప్పక మఱియొక మార్గ ముండు నని వారు దృఢముగ నమ్ముటకు కూడ అప్పుడే అవకాశము కలిగెను. మనము నివసించు భూమి గుండ్రనైన గోళమనియు అందుచే మన మెక్కడనైన నొకచోట బయలుదేఱి చక్కఁగ తూర్పు దిక్కుఁగ వెళ్లినను లేక పడమటి దిక్కుఁగ వెళ్లినను కొంత కాలమునకు తిరిగి బయలుదేఱిన స్థలమునకే వచ్చి చేరదమనియు ఐరోపా ఖండములోని శాస్త్రజ్ఞు లప్పుడే సిద్ధాంతము చేసిరి. ఇదివఱకు ఐరోపానుండి తూర్పు దిక్కుగా మధ్యధరాసముద్రము మీఁదుగా ప్రయాణము చేసి వర్తకు లందఱు ఇండియా మొదలగు తూర్పు దేశములకు వచ్చుచుండిరి. ఇట్లే ఇప్పుడు పడమటి దిక్కున వెళ్లినయెడల ఇండియాను చేరవచ్చు నని అనేకులు నిశ్చయము చేసికొనిరి. కాని, పడమటి దిక్కున ప్రయాణము చేయు టెట్లు? అచ్చట భయంకరమైన అలలతో నిండిన అట్లాంటిక్ మహాసముద్ర ముండెను. అలలు లేని సరస్సువలె నుండు మధ్యధరాసముద్రములో ప్రయాణము చేయుటయందే అనుభవము గలిగియుండిన వీరు మహాసముద్రములమీఁద ప్రయాణము చేయుటకు భయపడిరి. సముద్రమధ్యమందు దిక్కులు తెలిసికొనుట యెట్లు? ఈ మున్నగు సంశయములు వీరికి తోఁచుటకు మొదలిడెను. కాని, అప్పుడే దిక్కులను సూచించు మారినర్సు కంపస్ అను యంత్రము నొకదానిని శాస్త్రజ్ఞులు కనుఁగొనిరి. కనుక ఒక సంశయము తీరెను. ఇది గాక, మహాతరంగముల నైన ధిక్కరించి వడిగా ప్రయాణము చేయఁగల గొప్ప ఓడలను కట్టుటకు అనేకులు నేర్చుకొనిరి. జ్ఞానము అతిశయించిన కొలఁది ఉత్సాహమును ధైర్యమును వృద్ధియగుచుండెను. అప్పుడే భూగోళశాస్త్రజ్ఞులు కొందఱు ప్రపంచ పటములను కొన్నిటిని తయారుచేసి ఆఫ్రికాఖండపు మధ్యభాగముండుండి ఇండియాకు మఱియొక మార్గ ముండు నని ఊహింప మొదలిడిరి. పుస్తకములను అచ్చువేయుటకు యంత్ర మొకదానిని అప్పుడే ఐరోపావారు కనిపెట్టిన కారణమున నూతనవిషయములను గుఱించిన జ్ఞానము ఒకదేశమునుండి మఱియొకదేశమునకు అతిశీఘ్రముగ ప్రయాణము చేయఁగలిగియుండెను.

1400 ల సం. తర్వాత ఇండియా దేశమునకు క్రొత్త దారి నొకదానిని కనుఁగొనుటకు ప్రయత్నము చేసినవారిలో నెల్ల పోర్చుగల్ దేశస్థులును స్పెయిన్ దేశస్థులును ప్రధానులై యుండిరి. మధ్యధరాసముద్రము అట్లాంటిక్ మహాసముద్రముతో కలియునట్టి ప్రదేశమందు ఈ రెండు దేశము లుండుటవలనను, అట్లాంటిక్ మీఁదుగ క్రొత్త దారిని కనుఁగొనిన పక్షమున ఈ దేశములకే యెక్కువ లాభమును సంపాదించుట కవకాశ ముండుటవలనను, వీరు ఎక్కువ ఆసక్తితో పనిచేయ సాగిరి. ఇది గాక, స్వమత మగు క్రీస్తుమతమందు వీరి కున్నంత అభిమానమును, తురకమతమందు వీరి కున్నంతటి ద్వేషమును అట్లాంటిక్ మహాసముద్రతీరమందు నివసించుచున్న మఱియే దేశస్థులకును లేకయుండెను. పెక్కు వందల సంవత్సరముల నుండి తమ దేశములను జయించి పరిపాలించుచున్నట్టి తురకలతో పోర్చుగీసువారును స్పెయిన్ వారును పోరాడి, తుదకు 1500 ప్రాంతమున వారిని ఓడించి స్వాతంత్ర్యమును సంపాదించినవారగుటచే, ఇప్పుడు తురకవారి దేశములకు వెళ్లి తురక మతమును నాశనముచేసి ప్రపంచమం దంతటను క్రీస్తుమతమును వ్యాపింపఁజేసి దానిని ఉద్ధరింపవలె నన్న ఉత్సాహము వీరియం దమితముగా నుండెను. ఇండియాకు క్రొత్త దారి మొట్టమొదట కనిపెట్టినయెడల వ్యాపారము వలన ఇహసుఖములనే గాక, ఇతరమతస్థులను క్రైస్తవులుగ చేసి పరసుఖమును గూడ పొందవచ్చు నని వీ రుద్దేశపడిరి.

ఇట్టి స్థితిలో 1492-వ సం. నందు కొలంబస్ అను నావికుఁడు స్పెయిన్ దేశపు రాజుయొక్క అనుజ్ఞను పొంది ఇండియాకు పశ్చిమమార్గమును కనుఁగొనవచ్చు నను దృఢనిశ్చయముతో అట్లాంటిక్ సముద్రముమీఁద రెండు మాసములు ప్రయాణము చేసి చేసి తుదకు కొన్ని ద్వీపములకు వచ్చి చేరెను; ఇవియే ఇండియా యని అతఁడు భ్రమపడి 1493-వ సం. లో తిరిగి మఱియొకమాఱు అదే మార్గమున ప్రయాణము చేసి మఱి కొన్ని ద్వీపములకు వచ్చి చేరెను. కాని, భూగోళశాస్త్రమునుండి అదివఱకు ఇండియాను గుఱించి నేర్చుకొన్న విశేషము లేవియు ఈ ద్వీపములలో కనఁబడని కారణముచే ఇవి ఇండియాలో చేరినవి కా వనియు, వీనిని దాటినఁగాని ఇండియాకు వెళ్లుటకు వీ లుండ దనియు క్రమక్రమముగ స్పష్ట మాయెను. కొలంబస్ ఆశాభంగమును పొంది మిక్కిలి విచారపడుచు 1498-వ సం. లో ఆ ద్వీపములకు మూఁడవ ప్రయాణమును చేసి మఱికొన్ని ప్రదేశములను కనుఁగొని వాని కన్నిటికిని వెస్టిండీస్ (పశ్చిమ ఇండియా) అని పేరుపెట్టెను. ఇవియే అమెరికాలోని ద్వీపములు; ఐరోపియనులు ఈ విధముగ పశ్చిమభాగమందు ఒక గొప్ప ఖండ మున్న దని కనుఁగొనిరి. ఈ యమెరికా ఖండముయొక్క నిజస్థితి యెట్టిదో తెలిసికొనుటకై అది మొదలు స్పెయిన్ వారు అనేకులను పంపి వారి సాహాయ్యముచే దానిలో దేశముల ననేకముల కనిపెట్టిరి.

ఇదివఱకే పోర్చుగీసువారు తమ దేశమునుండి దక్షిణదిక్కున వెళ్లిన యెడల ఆఫ్రికాఖండమును దాఁటవచ్చు ననియు అచ్చటి

నుండి ఇండియాకు కొక మార్గ ముండఁగల దనియు ఊహించి అందుకై విశేషద్రవ్యమును ఖర్చుపెట్టి అనేక నావికులను పంపుచుండిరి. కాని, వీరి ప్రయత్నము లన్నియు విఫలము లగుచువచ్చెను. అయినప్పటికిని 1492-వ సం. లో కొలంబస్ చేసిన ప్రయాణమువలన పశ్చిమదిక్కునందు సులభమైన మార్గ మొకటి లే దని తెలిసిన తర్వాత పోర్చుగీసు నావికులు ఎప్పటికంటె ఎక్కువ శ్రద్ధతో ఆఫ్రికామీఁదుగ ఇండియాకు మార్గమును కనిపెట్టుటకు పనిఁ జేయ మొదలిడిరి. తుదకు 1497-వ సం. లో వాస్కోడిగామా అను వాఁడు ఇందునిమిత్తమై పోర్చుగలులో బయలుదేఱి, ఆఫ్రికాయొక్క పశ్చిమతీరమందు ప్రయాణము చేసి, దానియొక్క దక్షిణపు కొనయందున్న "గుడ్ హోపు" అగ్రమును దాఁటి అచ్చటినుండి కొన్ని నెలలకు 1498-వ సం. లో మళయాళతీరమందున్న కళ్లికోట పట్టణమునకు వచ్చి చేరెను. ఎన్నియో సంవత్సరములనుండి పాశ్చాత్యులు మన దేశమునకు వచ్చుటకై వెదకుచున్న సముద్రపు మార్గము తుదకు దొరకెను. అది మొదలు వంద సంవత్సరములవఱకు తూర్పు దేశములతోడి వ్యాపార మంతయు పోర్చుగీసువారి అధీనమం దుండెను.

ఇండియాకు క్రొత్త మార్గమును కనిపెట్టవలయు నని ప్రయత్నములు చేయుచున్న ఐరోపియనులు ఇప్పుడు రెండు ఫలములను పొందఁగలిగిరి. ఇండియాకు తురకలతోడి సంబంధము లేని మార్గము దొరకుటయే గాక, బ్రహ్మాండమైన అమెరికా ఖండ మొకటి వారికి లభించినది. అయినప్పటికిని, ప్రప్రథమమున ఈ ఖండముయొక్క ప్రయోజనము వారికి తెలియకపోవుటచే వారు దానిని గుఱించి విశేష ముత్సాహమును పొందక ఇండియాతో వ్యాపారము చేయుటకు త్రోవను కనిపెట్టిన పోర్చుగీసువారే ధన్యు లని భావించుచు వచ్చిరి. కాని, క్రమక్రమముగ స్పెయిన్‌వారు అమెరికా ఖండములోపల ప్రవేశించి దాని మహిమ యంతయు కనుఁగొనఁగలిగిరి. సమస్తైశ్వర్యములతో కూడిన సామ్రాజ్యములును, విశాలమైన పట్టణములును, అనంతమైన వెండి గనులును, సారవంతమైన భూమియు, వారి కండ్లకు పొడగట్టెను. అందుమీఁదట వీనిని సంపాదింపవలె నన్న యుద్దేశము వారికి కలిగినది. క్రమక్రమముగ స్పెయిన్‌వారి సేనాధిపతులు మెక్సికో పెరు మొదలగు దేశముల నన్నిటిని జయించి నిరుపమానమైన సామ్రాజ్యమును స్థాపింపఁగలిగిరి. అదివఱకు సామాన్యరాజ్యములలో నొకటిగ ఎంచఁబడిన స్పెయిన్ రాజ్యము అతిశీఘ్రకాలముననే ఐరోపాదేశములలో నెల్ల అగ్రపదవిని పొందెను. ఏఁటేటను అమెరికానుండి స్పెయిన్ దేశమునకు వచ్చుచున్న వెండికి మితి మేర లేక యుండెను. ఈ కారణముచే స్పెయిన్‌వారి సైన్యములును నావలును లెక్కకు మీఱి అందఱికిని భయము కలుగఁజేయుచుండెను.

పోర్చుగీసువారు కూడ ఇదియే విధముగ తూర్పు దేశములయందు తమ యధికారమును వ్యాపింపఁజేయ ప్రయత్నించి, అదివఱకే దేశములతో విశేషవ్యాపారము చేయుచున్న అరబ్బీలను ఓడించి, కొలఁది కాలములోపలనే ఏడెన్ పట్టణము మొదలు జావా మొలకస్ ద్వీపములవఱకును తమ వ్యాపారస్థలములను స్థాపింపఁగలిగిరి. మన దేశములోని గోవా డయ్యూ మొదలగు పట్టణములును, సింహళద్వీపమును, మలాకా రాష్ట్రమును వారికి స్వాధీన మాయెను. ఇంతటితో తృప్తి పొందక వారు అమెరికా ఖండమునకుఁ గూడ వెళ్లి దానిలోని బ్రెజీలు దేశమును ఆక్రమించుకొని స్పెయిన్‌వారివలెనే మిక్కిలి ఐశ్వర్యవంతులు కాఁగలిగిరి.

ఇట్లు అట్లాంటిక్ సముద్రమునుమీఁదుగ ఇండియాకు త్రోవ ఏర్పడుటయు, ఆ సముద్రమున కావల అమెరికా ఖండ మున్న దని తెలియుటయు, ఐరోపాదేశస్థుల చరిత్రలో వర్ణనాతీతమైన మార్పును కలుగఁజేసినవి. 1600 ల సం. వఱకు ఐరోపా ఖండమందు ప్రముఖతను పొందిన దేశము లన్నియు మధ్యధరాసముద్రపు తీరమం దుండినట్టి గ్రీసు ఇటలీ మొదలయినవి. ఇతరదేశములతో వ్యాపారము చేసి ధనమును సంగ్రహించుటకును, దాని మూలమున సైన్యాదుల నభివృద్ధి చేసి ఇతరరాష్ట్రములను జయించుటకును వానికి ఉన్నంత యవకాశము మఱియే దేశములకు లేకయుండెను. వ్యాపారమున కెల్ల మధ్యధరాసముద్రమే రాజమార్గమై యుండిన కారణముననే, ఇంత వైభవమును ఇటలీ మొదలగు దేశములనుభవించుటయు, ఆ సముద్రమునకు దూరమందున్న పోర్చుగల్ ఇంగ్లండు హాలండు మొదలగునవి వెనుకఁబడి యుండుటయు సంభవించినది. కాని, ఇప్పుడు అట్లాంటిక్ మహాసముద్రమే అన్నిటికిని రాజమార్గ మాయెను. ఇండియాకు వెళ్లవలయు నన్న, ఆ సముద్రముమీఁదుగనే వెళ్లవలసియుండెను; అమెరికాకు వెళ్లవలసినను అదియే మార్గ మాయెను. ఈ కారణముచేత మధ్యధరాసముద్రపు తీరమందలి దేశము లన్నియు తమ ప్రముఖతను కోలుపోవలసిన వైనవి; ఈ హేతువుచేతనే అట్లాంటిక్ సముద్రతీరమం దున్న పోర్చుగల్ ఫ్రాన్సు ఇంగ్లండ్ మొదలగు దేశములు ధనమును రాజ్యములను సంపాదించుటకు, ఇదివఱ కెన్నఁడును లేనట్టి అవకాశములను పొందఁగలిగినవి. పోర్చుగల్ స్పెయిన్ దేశములు అతిశీఘ్రకాలమందే ఎంతయో గొప్ప సామ్రాజ్యములను స్థాపించుట దీనికి నిదర్శనముగ నున్నది.

1600 ల సం. వఱకు ఇంగ్లీషువారు తూర్పు దేశములతోడి వ్యాపారమును మొదలిడ లేదు. ఏలనఁగా, ఆ కాలమందు ఐరోపాదేశస్థులలో ఒక విధమైన మర్యాద యుండెను. ఒక దేశమునకు ఐరోపావారిలో ఎవరైన ఒకరు ఒక క్రొత్త మార్గమును కనుపెట్టిన యెడల దానిలో నడచుటకును దానిని ఉపయోగించుటకును వారికే హక్కు కల దనియు, వారి యనుమతి లేనిదే మఱియెవరును దానిని ఉపయోగింపఁగూడ దనియు, ఆ కాలపువారు తీర్మానము చేసికొని యుండిరి. ఈ మర్యాద ననుసరించినవా రగుటచేతనే ఇంగ్లీషువారు అట్లాంటిక్ తీరమందున్నప్పటికిని పోర్చుగీసువారు కనిపెట్టిన మార్గముమీఁదుగ ఇండియాకు వెళ్లి వ్యాపారము చేయుటకు ఇష్టపడక, పోర్చుగీసువారివలెనే తాము గూడ మఱియొక క్రొత్త మార్గమును

కనుపెట్టినఁ గాని ఇండియాతోడి వ్యాపారలాభము కలుగఁజాలదని, అందుకై ఐరోపాకు ఉత్తరమందున్న ఆర్కిటిక్ మహాసముద్రముమీఁదుగా తూర్పు దిక్కున కొందఱు నావికులును పడమటి దిక్కున మఱికొందఱు నావికులును ప్రయత్నములు చేయ మొదలిడిరి. ఎన్నిమార్లు ప్రయత్నము చేసినను ఈ సముద్రము మంచుగడ్డలతో కప్పఁబడియుండు కారణమున ఇంగ్లీషువారు దానిమీఁదుగ విశేషదూరము వెళ్లలేక, క్రొత్త మార్గమును కనుపెట్టఁజాలరైరి. మఱి దీనివలన ప్రయోజనము లేదని నిశ్చయము చేసికొని ఏలాగైన ఇండియాతో వ్యాపారము చేయఁ దీర్మానించుకొన్నవారగుటచే, అట్లాంటిక్ మహాసముద్రముమీఁదుగా పోర్చుగీసువారు కనిపెట్టిన మార్గముననే వెళ్లుటకు సిద్ధపడిరి. ఇంగ్లీషువా రిట్లు చేయుటకు పూర్వమే హాలెండు దేశస్థులయిన డచ్చివారు అదివఱకు క్రొత్తమార్గములను గుఱించి యేర్పడియున్న మర్యాదను గౌరవింపకయే పోర్చుగీసువారి త్రోవ నుపయోగించి తూర్పు దేశములతో వ్యాపారమును జరపుచుండిరి. డచ్చివారు చేయుచున్నది మనము మేల చేయఁగూడదని యోచించి ఇంగ్లీషువారు కూడ 1600 వ సం. మొదలు అట్లాంటిక్ మీఁదుగ ఆఫ్రికా ఖండమును చుట్టి ఇండియాతో వ్యాపారము చేయసాగిరి. ఈ వ్యాపారమే ఇండియాలోని ప్రస్తుతపు ఆంగ్లేయ సామ్రాజ్యమునకు మూలకారణము.

కొలంబస్ అమెరికా ఖండమును కనుఁగొనినప్పటినుండి ఎక్కడ లేని బంగారమును వెండియు స్పెయిన్ దేశములోనికి వచ్చి చేరుచుండుటయు ఆ కారణముచే స్పెయిన్‌వారి యైశ్వర్యము దినదినాభివృద్ధి గాంచుచుండుటయు చూచి, తాము కూడ అమెరికాతో వ్యాపారము చేసినయెడల లాభకరముగ నుండు నని ఇంగ్లీషువా రభిప్రాయపడి అందుకై ఓడలు మొదలగువానిని తయారుచేసి కావలసిన ప్రయత్నములు చేయుచుండిరి. కాని, ఇంగ్లీషు వర్తకులు అట్లాంటిక్ సముద్రమును దాఁటుట గాని, తమ స్వాధీనమందున్న అమెరికాలోని దేశములతో వారు వ్యాపారము చేయుట గాని, స్పెయిన్‌వారి కించుకమాత్రమును ఇష్టములేకపోయెను. ఈ కారణముచే ఇంగ్లీషు వర్తకులు లెక్కసేయక సాహసించి వ్యాపారము చేయుచుండినయెడల వారి యోడలను పట్టి వారి వర్తకమునకు స్పెయిన్‌వారు విశేషనష్టమును కలిగించుచుండిరి. ఇందువలన ఇంగ్లీషువారికిని స్పెయిన్‌వారికిని అమెరికాతోడి వ్యాపారము నిమిత్తమై విరోధము సంప్రాప్తమాయెను.

ఈ విరోధము వృద్ధియగుటకు మఱికొన్ని కారణములు కూడ నుండెను. 1521-వ సం. మొదలు ఐరోపాఖండమందలి క్రైస్తవులలో నొక గొప్ప విప్లవ ముత్పత్తియాయెను. అదివఱకు ఐరోపాలోని పశ్చిమమధ్యభాగములందున్న క్రైస్తవు లందఱు రోముపట్టణమందున్న పోప్ అనువారిని మతగురువుగ భావించుచు, మత విషయములయందు వా రేలాగు చెప్పిన నాలాగు నడచుకొనుచుండిరి. కాని, అనేక కారణములవలన 1521-వ సం. తర్వాత పోప్ యొక్క అధికత తగ్గిపోయి క్రైస్తవులలో రెండు శాఖలు బయలుదేఱుటకు హేతువాయెను. ఒక శాఖవారు పోపును మతగురువుగ భావించినఁ గాని మోక్షము లభింప దనియు, రెండవ శాఖవారు అట్లు కా దనియు వాదింపసాగిరి. పోప్ యొక్క ఆధిక్యమును అంగీకరించినవారికి కతోలిక్కు లనియు, దానిని నిరసించి వేఱుపోయిన వారికి ప్రొటెస్టాంటు లనియు పేర్లు కలిగెను. దేశము లన్నిటిలోను నూతన మగు ప్రొటెస్టాంటు మతమును మొట్టమొదట స్వీకరించినది ఇంగ్లాండే; ప్రొటెస్టాంటు దేశము లన్నిటిలోను ఇంగ్లండే ఆ కాలమందు అగ్రగణ్యతను పొందియుండెను. ఇట్లే కతోలిక్ మతము నవలంబించినవారిలో నెల్ల స్పెయిన్‌వారు అగ్రగణ్యులుగ నుండిరి. వీరి సాహాయ్యముచేత ప్రొటెస్టాంటులను నిర్మూలముచేసి స్వాధికారమును పూర్వమువలె అన్ని దేశములయందును వ్యాపింపఁజేయవచ్చు నని పోపు అభిప్రాయపడియుండెను. ఆ కాలమందు ఐరోపాలో ఎక్కడ చూచినను మతసంబంధ యుద్ధముల కన్నిటికిని కారణ మాయెను. రోమన్ కతోలిక్ మతమును నిర్మూలముచేయవలె నని ప్రొటెస్టాంటులును, ప్రొటెస్టాంటు మతమును నిర్మూలముచేయవలె నని కతోలిక్కులును కంకణము కట్టుకొని పరస్పరము యుద్ధములతో కాలము గడపుచుండిరి.

ఇట్టి సందర్భములో ఇంగ్లీషువారికి స్పెయిన్‌వారితో యుద్ధము తప్పదాయెను. స్వదేశమును స్వమతమును స్వాతంత్ర్యమును రక్షించుకొని, ఖండాంతరములతో వ్యాపారముచేసి, తమ యైశ్వర్యమును వృద్ధిపఱచుకొనుటకు స్పెయిన్‌వారి బలమును నాశనముచేయుట తప్ప మఱి యే మార్గము గాని ఇంగ్లీషువారికి లేకపోయెను. కనుక 1570-వ సం. మొదలు దేశాభిమాను లగు ఇంగ్లీషువారిలో అనేకులు ఇందు నిమిత్తమై వడివడిగ ప్రయాణము చేయఁగలిగినట్టియు యుద్ధము చేయుట కనుకూలముగ నున్నట్టియు ఓడలను తయారుచేసికొని, స్పెయిన్‌వారి అధికత కంతకును అమెరికానుండి వారి దేశమునకు వచ్చుచున్న వెండిబంగారములే ప్రధానకారణము లగుటవలన ఈ లోహములను తెచ్చు ఓడలను పట్టుకొని వానిలోని ప్రశస్తపదార్థముల నన్నిటి నపహరించుటయే స్పెయిన్‌వారి బలమును నశింపఁజేయుటకు తగిన మార్గ మని తీర్మానించి, ఇందు నిమిత్తమై అట్లాంటిక్ సముద్రపు మార్గములయందు వేచియుండి, సమయము దొరకినప్పు డెల్లను స్పెయిన్‌వారి యోడలను పట్టుకొని వానిలోని వెండి బంగారులను దోఁచుకొని, ఓడలను ముంచి, స్పెయిన్ దేశస్థులకు విశేషనష్టమును కలుగఁజేయుచుండిరి. ఈ కారణముచే, అమెరికాఖండమందు గనులలో పని చేసి లోహమును సంపాదించి అట్లాంటిక్ సముద్రమునకు తెచ్చి వివిధములైన కష్టములు పడువారు స్పెయిన్ దేశస్థులుగను, వారి కష్టమువలన కలిగిన ఫలము నంతయు ననుభవించువారు ఇంగ్లీషువారుగను, ఏర్పడెను. ఇందువలన కలుగుచున్న నష్టమును ఏ మాత్రమును సహింపలేక స్పెయిన్ దేశపు రాజు ప్రొటెస్టాంటు మతస్థులును సముద్రముమీఁద తిరుగువారును అగు ఇంగ్లీషువారిని శిక్షింప నెంచి, అందునిమిత్తమై ఎన్నియో ప్రయత్నములఁ జేసి తుదకు 1587 లో అదివఱకు ఎవరు

గాని కని విని యెఱుఁగనంతటి గొప్ప నౌకాబలము నొకదానిని తయారుచేసి ఇంగ్లండుపై దాడివెడలుటకు సంసిద్ధుఁడాయెను. కాని, కడు సాహసులగు ఇంగ్లీషునాయకులలో కొందఱు స్పెయిన్ దేశపు టోడరేవులలో ప్రవేశించి, ఈ నౌకాబలమునందలి అనేక నావలను అగ్నిహోత్రునిపాలు చేసి, కడు నేర్పుతో తిరిగి స్వదేశమునకు వచ్చి చేరిరి. స్పెయిన్ రాజు మాత్రము తన పట్టుదలను విడిచినవాఁడు కాఁడు. విశేషపరిశ్రమ చేసి, అపరిమితధనమును ఖర్చుపెట్టి మఱియొక నౌకాబలము నతివేగముగ సమకూర్చి 1588-వ సం. లో ఇంగ్లండుపై దాడి వచ్చెను.

కడచిన యిరువది సంవత్సరములనుండియు ఇట్టి యుపద్రవము తనకు కలుగునని ఇంగ్లీషువారెఱిఁగియుండిరి. కనుక వారు కూడ తమ యోడలను సిద్ధముచేసి స్పెయిన్వారి బలము నంతటిని ఇంగ్లీషు చానెల్ అను సముద్రభాగమం దెదుర్కొనిరి. ఘోరయుద్ధ మొకటి సంప్రాప్త మాయెను. కాని, సముద్రయుద్ధమందు ఇంగ్లీషువారికి ఎక్కువ నేర్పుండుటవలనను, ఇంగ్లీషువారి యోడలు ఎక్కువ వేగముగా ప్రయాణము చేయఁగలవగుటచేతను, స్పెయిన్వారి యోడలలో మందు గుండు మొదలగు యుద్ధసామగ్రులు విశేషముగ లేకపోవుటచేతను, ఇంగ్లీషువారికి పరిపూర్ణజయము లభించెను. స్పెయిన్వారి యోడ లనేకములు సముద్రుని పాలాయెను. మిగిలిన యోడలు స్వదేశమునకు తిరిగి వెళ్లుటకు ప్రయత్నము చేయుచుండఁగా సముద్రమధ్యమందు తుపానొకటి సంభవించి అనేక నౌకలను నాశము చేసినది. తుదకు ఏవియో కొన్ని యోడలు మాత్రము స్పెయిన్ దేశమును చేరఁగలిగినవి.

ఇంత గొప్పజయ మదివఱకెన్నఁడు గాని ఇంగ్లీషువారికి కలిగినది లేదు. ఇంత గొప్ప పరాభవమును అపజయమును స్పెయినువా రదివఱకు పొందిన వారు కారు. ఇది మొదలు ఇంగ్లీషువారి యాధిక్యము ఖండములయం దంతటను వ్యాపింపఁ దొడఁగెను. ఇదియే ఆంగ్లేయ సామ్రాజ్యమునకు పునాదిగ నేర్పడెను. వాస్కోడిగామా కొలంబసు మొదలగు శూరులవలన, ఇండియాతోను అమెరికాతోను వ్యాపారముచేసి లాభమును సంపాదించుటకు అట్లాంటిక్ మహాసముద్రముఖమం దున్న తెల్లవారి కందఱికిని అవకాశము కలిగియుండినను, స్పెయిన్వారు బలవంతులై అట్లాంటిక్ సముద్రమార్గముల నన్నిటిని ఆక్రమించుకొని యుండిన కారణముచే ఇంగ్లీషువారు అమెరికాకు వెళ్లుటకు ఇదివఱకు భయపడుచుండిరి. ఇది మొదలు అది అంతయు మాఱిపోయెను. ఇంగ్లీషువారు స్వేచ్ఛగా అమెరికాకు వెళ్లి దానిలోని దేశములతో వ్యాపారముచేసి వానిలో రాజ్యమును సంపాదింప మొదలిడిరి. సముద్రముమీఁద ఇంగ్లీషువారితో సమానముగ ఎదుట నిలిచి యుద్ధము చేయఁగలవా రొకరును లేకపోయిరి. 1600 మొదలు కొంతకాలము డచ్చివారితోను మఱికొంతకాలము ఫ్రెంచివారితోను ఇంగ్లీషువారు సామ్రాజ్యార్థమై పోరాడవలసి యుండిరి కాని, 1588 లో స్పెయిన్వారిని ఓడించిన తర్వాత ఇతర శత్రువులతో సముద్రముమీఁద యుద్ధముచేయుట గాని ఇతర ఖండములలో రాష్ట్రములను సంపాదించుట గాని వారికి బహు సులభమాయెను. కనుకనే 1588 లో ఇంగ్లీషువారికి కలిగిన జయము వారి సామ్రాజ్యమున కంతకును పునాది యని చెప్పుటకు తగియున్నది.

## III సామ్రాజ్య చరిత్ర: 1600—1750

### ప్రథమాధ్యాయము

ఆంగ్లేయసామ్రాజ్యమందు ప్రస్తుతము రెండు రకముల రాష్ట్రము లున్నవి. మొదటి రకములో చేరినవానికి "కాలనీ" లనియు, రెండవ రకములోనివానికి (డిపెండెన్సీలు) సామంతరాష్ట్రము లనియు పేర్లు. ఈ రెంటికిని ఏయే యంశములయందు భేదము లున్నవో మనకు తెలిసినఁ గాని సామ్రాజ్యాభివృద్ధియొక్క నిజతత్త్వమును స్వభావమును మనకు బోధపడఁజాలవు. కనుక అందువిషయమై రెండు మూడు మాటలు చెప్పవలసియున్నది.

(1) సమశీతోష్ణములు గలిగి తెల్లవారు స్థిరముగ నివాసముల నేర్పఱచుకొని కాపురము చేయుటకు యోగ్యములై ప్రస్తుతము విశేషముగ ఇంగ్లీషువారిచేతనే కాపురము చేయఁబడుచున్నట్టి దేశములే "కాలనీ"లలో చేరియున్నవి. కనడా ఆస్ట్రేలియా న్యూజీలండు దక్షిణాఫ్రికా మొదలగు దేశము లిట్టివి గనుకనే వీనికి "కాలనీ" లను పేరు కలిగినది. ఇండియా ఈజిప్టు మొదలగు సామంతరాష్ట్రములు ఇట్టివి గాక మిక్కిలి యుష్ణప్రదేశములై తెల్లవారి నివాసమునకు యోగ్యము గాకయున్నవి.

(2) కాలనీలలో ఇప్పుడు తెల్లవారు గాక మరియే వర్ణస్థులును విశేషముగ లేరు. కనడాలో నల్లవారు లేనే లేరని చెప్పవచ్చును. ఆస్ట్రేలియా న్యూజీలండులందు కొందఱున్నారు గాని వారి సంఖ్య మిగుల స్వల్పము. దక్షిణాఫ్రికాలో తెల్లవారి సంఖ్యకంటె నల్లవారి సంఖ్యయే యెక్కువగ నున్నప్పటికిని, నల్లవారు మిక్కిలి అనాగరికులై జ్ఞానశూన్యులుగ నుండుటవలన వారికే నాఁటికిఁ గాని ఆధిక్యము కలుగుట కవకాశము లేదు. సామంతరాష్ట్రములలోని స్థితి ఇట్టిది కాదు. వీని యన్నిటిలోను ప్రజ లందఱు నల్లవారే. యుద్ధభటులుగను ఉద్యోగస్థులుగను వర్తకులుగను ఎవరో కొందఱు తెల్లవారు ఈ రాష్ట్రములయందు వచ్చియుండెదరు గాని వీరి సంఖ్య మిక్కిలి తక్కువ; వీరిలో కూడ ఈ రాష్ట్రములను మాతృదేశములుగ భావించి, వీనియందే స్థిరముగ తరములకొలఁది కాపురము చేయు నుద్దేశము గలవారు ఎవరును లేరు. వీరందఱు ఉద్యోగకాలము ముగియఁగనే మాతృదేశ మగు ఇంగ్లండునకు వెళ్లువారే. కనుక కాలనీలలోనివా రందఱు తెల్లవారనియు, సామంతరాష్ట్రములలోనివా రందఱు నల్లవారనియు దీనిని బట్టి తెలియుచున్నది.

(3) సామంతరాష్ట్రములయందుండు ప్రజలు నల్లవారైనను వీరు అనేకవిషయములయందు ప్రభువులగు ఇంగ్లీషువారితో సమానులని చెప్పవచ్చును. మతమందును, శాస్త్రజ్ఞానమందును, తెలివితేటలయందును, శౌర్యపరాక్రమములయందును వీరు ఇంగ్లీషువారికి తీసిపోవువారు కారు. ఇంగ్లీషువారు మిక్కిలి మోటువారుగ నున్న స్థితిలో కూడ వీరు మిక్కిలి నాగరికత గాంచినవారని ప్రఖ్యాతి వహించిరి. కాలనీలలోని నల్లవారిట్టివారు కారు. వారందఱు ఇప్పటివఱకు మిక్కిలి అనాగరికులుగను జ్ఞానశూన్యులుగను ఉన్నారు.

(4) ఈ కారణముచే ఇంగ్లీషువారు కాలనీలను సంపాదించుటయందు పడిన కష్టములకును సామంతరాష్ట్రములను సంపాదించుటయందు పడిన కష్టములకును విశేషభేదము లున్నవి. కాలనీలలోని స్వదేశస్థులు మిక్కిలి అనాగరికులై ఉత్తమాయుధములు లేనివారై యుద్ధకుశలులు గాకయుండుటచే వారితో యుద్ధములు చేయవలసిన అవసరము లేకయే ఇంగ్లీషువారు వారి దేశములను స్వాధీనపఱచుకొనఁగలిగిరి. కాలనీలను సంపాదించుటలో ఇంగ్లీషువారు స్పెయిన్ ఫ్రాన్సు హాలెండు మొదలగు దేశములవారితో పోరాడిరే గాని విశేషముగ స్వదేశస్థులతో పోరాడినది లేదు. సామంతరాష్ట్రములను వీరిట్లు సంపాదింపలేదు. స్పెయిన్ ఫ్రాన్సు మొదలగు దేశస్థులను ఓడించిన తర్వాత కూడ ఎన్నియో సంవత్సరములు ఇంగ్లీషువారు ఈ రాష్ట్రములలోని స్వదేశప్రభువులతో యుద్ధము చేయవలసియుండిరి. ఇండియాను పరిపూర్ణముగ స్వాధీనము చేసికొనుటకు పూర్వము వీరు మహారాష్ట్రులు సిక్కులు మొదలగు వారితో చేసిన యుద్ధములే దీనికి నిదర్శనము.

## ద్వితీయాధ్యాయము

కొలంబసు అమెరికా ఖండమును కనుపెట్టినప్పటినుండియు దానిలో కాలనీలను సంపాదించి ఐశ్వర్యవంతులు కావలయునని స్పెయిన్ పోర్చుగల్ ఫ్రాన్సు ఇంగ్లండు హాలెండు మొదలగు అట్లాంటిక్ సముద్రసమీపమందున్న దేశములవారందఱు ప్రయత్నములు చేయసాగిరి. కాని, తుదకు ఇంగ్లీషువారి ప్రయత్నములే పరిపూర్ణముగ ఫలింపఁగలిగినవి. ప్రప్రథమమున వీరు చేయుచున్న ఉద్యమములకు స్పెయిన్‌వారు ఎట్టి యాటంకములు కలుగఁజేయుచుండినదియు, వానిని గమనింపక ఇంగ్లీషువారు పట్టుదలతో స్పెయిన్‌వారిని ధిక్కరించి 1588 లో ఘోరమైన సముద్రయుద్ధమందు వారి నౌకాబలము నెల్ల నాశము చేసి స్వసామ్రాజ్యమును సముద్రము మీఁద నెలకొల్పినదియు, వెనుకటి ప్రకరణములో చెప్పియుంటిని. అప్పటినుండియు అమెరికాలోని దేశములను స్వాధీనము చేసికొని స్పెయిన్‌వారికంటె అధికులు కావలయునన్న అభిలాషతో ఇంగ్లీషువారనేకులు అనేకవిధములుగ పనిచేయసాగిరి. అమెరికా ఖండమందెక్కడ చూచినను వెండి బంగారుగనులున్నవనియు, అక్కడికి వెళ్లినవారందఱును సునాయాసముగ ధనరాసులను సంపాదించి బహుత్వరితముగ కుబేరులు కాఁగలరనియు, ఆ కాలపు ఇంగ్లీషువారు భ్రమపడియుండిరి. ఇట్టి భ్రమకు లోనైనవారనేకులు మాతృదేశమును వదలి అమెరికా ఖండతీరమందు కాలనీ నొకదానిని స్థాపించుటకు సముద్రమును దాఁటి 1590 ప్రాంతమున వెళ్లిరి కాని, వీరి యుద్యమము సఫలము కాకపోయెను. వెండి బంగారుగనులగపడుటకు మాఱు వీరికి కాఱడవులును ఘోరమృగములును దేశద్రిమ్మరులగు అడవిజాతి మనుష్యులును కనఁబడిరి. ఈ యడవులను నఱికి, మృగములను పాఱఁదోలి, భూమిని బాగుచేసికొని యుండిన యెడల, వీరికి అపరిమిత లాభమును సౌఖ్యమును క్రమక్రమముగ లభించియే యుండును. కాని, వీరందఱు పెద్ద యిండ్లలో పుట్టి కాయకష్ట మన నేమియో యెఱుఁగనివారగుటచేతను, సులభమార్గమున వెండిబంగారములను సంపాదింపవచ్చుననెడి అడియాసతో ఇంత దూరము వచ్చినవారగుటచేతను, సోమరులై కొందఱు రోగపీడితులై కొందఱు శత్రువుల పాలై, తుదకు అందఱును నశించిరి.

ఇట్లు కొంత కాలము జరగిన తర్వాత ఇంగ్లీషువారిలో ప్రముఖులు కొందఱొక సంఘముగా నేర్పడి ప్రభువుయొక్క ఆజ్ఞను పొంది ఉత్తర అమెరికాలో ఇంగ్లీషు కాలనీ నొకదానిని ఏలాగైన సంపాదింపవలయునని దీక్ష వహించిరి. మాతృదేశమును వదలి దేశాంతరములకు వెళ్లుట కిష్టపడువారెందఱో యున్నఁ గాని, కాలనీ యొకటి యేర్పడుటకు వీలు లేదు. కాలనీలలోని ప్రజలందఱు మాతృదేశమగు ఇంగ్లండును వదలి అచ్చటికి వెళ్లిన ఇంగ్లీషువారుగను వారి సంతతివారుగనే యున్నారు. ఈ విషయము చదువరులు జ్ఞాపకముంచుకొనవలయును. కాలనీలోనికి వచ్చి అక్కడ జీవనము చాల కష్టముగానున్నదని భయపడి పోయినయెడల కాలనీ యెన్నఁటికిని ఏర్పడఁజాలదు. ఇది యంతయు ఆలోచించి 1605 లో ఏర్పడిన పై సంఘమువారు, ఇంగ్లండును వదలి అమెరికాకు వచ్చి చేరునట్టివారిని కొన్ని సంవత్సరముల పర్యంతము తామే అన్నవస్త్రముల నిచ్చి పోషించెదమనియు, అటుతర్వాత వారికి కావలసినంత పొలమును ఇచ్చి వ్యవసాయము చేయుటలో తోడ్పడెదమనియు ఒడంబడి పనిచేయసాగిరి. ఈ సంఘమువారియొక్క పట్టుదలవలన కొంత కాలమునకు "వర్జీనియా" అను కాలనీ యొకటి అమెరికాయొక్క తూర్పు తీరమందు ఏర్పడెను. ఇంగ్లీషువారు కొందఱు స్వదేశమును వదలి ఈ కాలనీకి వచ్చి కాపురము చేయసాగిరి. వీరు భూమిని బాగుచేసి, సేద్యమును ప్రారంభించి, నేల మిక్కిలి సారవంతమైనదగుటచే తగిన ఫలమును పొందసాగిరి. ఇది గాక, అదివఱకు పాశ్చాత్యులెఱిఁగియుండనట్టి "పొగాకు"ను వర్జీనియాలోనివారు క్రొత్తగ పండించి అందువలన క్రమక్రమముగ మిక్కిలి ధనవంతులైరి. వర్జీనియాలోని భూమి ఈ పంటకు మిక్కిలి యనువైనదగుటచే ఆ కాలనీయొక్క ఐశ్వర్యమున కంతకు అదియే మూలకారణమాయెను.

అమెరికా ఖండమందెక్కడ చూచిన అక్కడ వెండి

బంగారుల గనులు లేకపోయినను భూమి మిక్కిలి సారవంతమై వ్యవసాయమునకు బహుయోగ్యమైనదని ఇంగ్లీషువారికి క్రమక్రమముగ బోధపడుచు వచ్చెను, వారిలో అనేకులు ప్రథమమున అచ్చటికి వెళ్లి కాపుర ముండుటకు సాహసింప రైరి. ఈ సాహసము ఎంత కాలము ఇంగ్లీషువారియందు లేకయుండెనో అంత కాలమువఱకు అమెరికాలోని రాష్ట్రములు ఇంగ్లీషువారి స్వాధీనమగుటకు వీలు లేకయుండెను. ఏలనఁగా, ఈ విషయములో కాలనీలకును సామంతరాష్ట్రములకును ఒక గొప్ప భేద మున్నది. లాభమును సంపాదింపఁగోరియే కదా దేశాంతరములను వశపఱచుకొని స్వసామ్రాజ్యమును వృద్ధిపఱచుకొనుటకు ఎవరైన ఉద్యుక్తు లగుట! ఈ లాభమును సంపాదించుటలో సామంతరాష్ట్రములయందు చేయవలసిన పనికిని కాలనీలయందు చేయవలసిన పనికిని ఒక వ్యత్యాస మున్నది. ఇంగ్లీషువారు కాలనీలను స్థాపింపనెంచిన ప్రదేశములన్నియు వారి రాకకు పూర్వము కొన్ని జనశూన్యములుగను, మరి కొన్ని దేశద్రిమ్మరులై ధనధాన్యములను సంపాదించు మార్గములు తెలియక వేఁటయే ప్రధానజీవనోపాయముగఁ గల యనాగరికులకు నివాసస్థానములుగను ఉండినవి. ఇట్టి ప్రదేశములయందే ఇంగ్లీషువారు తమ కాలనీలను స్థాపించుకొనిరి. ఈ ప్రదేశములను వశపఱచుకొనుటయందు స్పెయిన్ వారిని ఓడించిన తర్వాత ఇంగ్లీషువారికి ట్టి కష్టములును కలుగలేదు. ఏలనఁగా, అమెరికాలోని స్వదేశస్థులు ఇంగ్లీషువారితో సమానముగ నిలిచి యుద్ధము చేయునట్టి స్థితిలో లేరు. ఈ ప్రదేశము లీ హేతువుచే సులభముగ ఇంగ్లీషువారికి లభించినను, ఇట్లు వశమైనంతమాత్రముననే వీనివలన ఇంగ్లీషువారికి లాభ మేమియు కలుగలేదు. జనశూన్యమైన ప్రదేశములు స్వాధీనమైన మాత్రముచేతనే లాభ మెట్లు కలుగఁగలదు? ఇవి మిక్కిలి సారవంతములై యున్నను వీనిలోని అడవులను నఱికివేసి, పల్లపు ప్రదేశములను మిట్టు చేసి, వ్యవసాయము మొదలగు పనులకు కావలసిన వసతుల నేర్పఱచుకొనినఁ గాని, వీనినుండి లాభమును సంపాదించుట కవకాశము లేకపోయెను. ఇట్టి సందర్భమున కావలసినది యే మనఁగా, ఆ ప్రదేశములకు కూలి చేసికొనునట్టియు వ్యవసాయము చేయఁగలిగినట్టియు ప్రజ లనేకులు వచ్చి కాపురముండుటయే. దేశము సుభిక్షముగ నుండఁగల దని తెలిసినపుడు దానివలన లాభము పొందుటకు ఇది తప్ప వేఱు మార్గము లేదు. ఇంగ్లండు దేశమునుండి ఎందఱు రైతులు ఈ ప్రదేశములకు వచ్చి చేరిన యెడల, అవి యంత శీఘ్రముగను విశేషముగను సంపద్యుక్తములు కాఁగలవు. లక్షల కొలఁది ఎకరముల భూమి ఒక జమీన్ దారుని స్వాధీనమం దున్నను దానిని సేద్యము చేయుటకు రైతులు లేని యెడల ఆ భూమి యుండియు లేనట్లుగనే మనము భావింపవలసిన విధముగనే, జనశూన్యములైన ప్రదేశము లెన్ని వశమైనను వాని వలన ప్రభుత్వమువారికి లాభ మేమియు లేదు కాలనీలను సంపాదించుటయందు గొప్ప యేమియు లేదు; ఆ కాలనీలకు మాతృదేశము నుండి అనేకులు వెళ్లి ఆ ప్రదేశములను బాగుచేసి ధనము గడించుటయందే గొప్ప. జనసంఖ్య వృద్ధి యగుకొలఁది కాలనీయొక్క యైశ్వర్యము కూడ వృద్ధి యగుచుండును.

సామంతరాష్ట్రములలో చేరిన ప్రదేశముల స్థితిగతులు వేఱుగ నున్నవి. ఇంగ్లీషువారు రాకపూర్వము ఇవి నిర్జనప్రదేశములు కావు. ఇందలి ప్రజలు మోటువారు కారు. ఈ ప్రజలు మిక్కిలి నాగరికులై ధనధాన్యవంతులై గొప్పగొప్ప పట్టణములలో మిద్దెలయందును మేడలయందును మిక్కిలి వైభవములతో నివసించుచుండినవారు. ఇట్టివారిని స్వాధీనపఱచుకొనుట కొంత కష్టమే. కాని, స్వాధీనమైనప్పటినుండి పరిపాలకులకు విశేషలాభము కలుగుచుండును. ప్రజలు ధనవంతులును ధనమును సంపాదించుటకు తగిన నేర్పు కలవారును అగుటచే, వారిని స్వాధీనము చేసికొన్న ప్రభుత్వమువారు వారిపై పన్నులను విధించి విశేషలాభమును సంపాదింపవచ్చును. కనుక ఈ విషయములో సామ్రాజ్యమును స్థాపించ నెంచినవారు సామంతరాష్ట్రములకు విశేషసైన్యముల నంపవలయును. ఇండియా ఈజిప్టు మొదలగు దేశములవలన ఇంగ్లీషువారు లాభమును పొందఁగోరిన యెడల, ఇంగ్లీషు రైతులును ఇంగ్లీషు కూలివాండ్రును స్వదేశమును విడచి, ఈ దేశములలో స్థిరముగ కాపురము చేయవలసినది లేదు. ఇంగ్లీషు సైన్యములు కొన్నియు ప్రభుత్వము చేయుటకు ఇంగ్లీషు ఉద్యోగస్థులు కొందఱును వచ్చిన చాలును.

కనుక మనము తెలిసికొనవలసిన దె మనఁగా, కాలనీల యభివృద్ధి కంతకు జనబాహుళ్యమే ప్రధానహేతువు. ఏ దేశమందు జనసంఖ్య యక్కువగ నుండునో ఏ దేశములోని జనులు నిర్భయముగ స్వదేశమును విడిచి దేశాంతరములకు వెళ్లి తమ స్థితిగతులను బాగుచేసికొనవలయు నను నిశ్చయమును పట్టుదలను ఎక్కువఁ కలిగి యుందురో, అట్టి దేశములవారి కాలనీ లెప్పుడును ఉన్నతస్థితియందుండఁగలవు. ఈ సదుపాయములు లేనివారు కాలనీలను సంపాదింపఁగలిగినను వానివలన విశేషలాభమును సంపాదింపలేరు. స్పెయిన్ వారు ఇంగ్లీషువారికంటె అనేకసంవత్సరములకు పూర్వము నుండి అమెరికాయందు విస్తారమైన రాజ్యమును సంపాదించినను, అమెరికాకు వెళ్లి అచ్చటనే స్థిరముగ నివాసము చేయుట కిష్టపడిన ప్రజలు స్పెయిన్ దేశమందు విశేషముగ లేని కారణముచేతను, అట్లు వెళ్లుట కిష్టపడినవారి విషయమై స్పెయిన్ ప్రభుత్వమువారు అనేకనిర్బంధములు కలిగించిన కారణముచేతను, అమెరికాలోని స్పెయిన్ వారి కాలనీలు ఇంగ్లీషువారి కాలనీలవలె వృద్ధి చెందుట కవకాశము లేకపోయెను. ఇట్లే పోర్చుగల్ దేశమువారు కూడ ఇంగ్లీషువారికంటె పూర్వమే కాలనీల సంపాదించుటకు ప్రారంభించినను, పోర్చుగల్ మిక్కిలి చిన్న దేశ మగుటవలనను, అందులోని జనసంఖ్య మిక్కిలి తక్కువ యగుటవలనను, కాలనీలలోనికి వెళ్లి వానివలన లాభమును సంపాదించుటకు కావలసినందఱు ప్రజలు లేకైరి. ఈ కారణముచేతనే విస్తీర్ణమందును, జనసంఖ్యయందును, దేశాంతరములకు వెళ్లవలయు ననెడి ఉత్సాహమందును, పోర్చుగీసువారిని

అతిశయించిన ఇంగ్లీషువారు కాలనీలను సంపాదించుటకు వారికంటె ఆలస్యముగ ప్రారంభించి వారికంటె అధికమైన లాభమును పొందఁ గలిగిరి. పోర్చుగీసువారి కాలనీలు ఈ కారణముచేతనే స్వల్పకాలమున క్షీణతను పొందినవి. ప్రస్తుతకాలమందు కూడ ఫ్రెంచివారి కాలనీలు ఇంగ్లీషువారి కాలనీలవలె మిక్కిలి యుచ్ఛస్థితిలో ఉండకపోవుటకు ఆంగ్లేయుల జనబాహుళ్యమును వారి యుత్సాహమునే ప్రధానకారణములు. కాలనీల వృద్ధియందు జనబాహుళ్య మెంత యవశ్యమో దీనిని బట్టి మనకు స్పష్టమగుచున్నది.

స్వదేశమగు ఇంగ్లండును వదలి అమెరికా ఖండమునకు అనేకులు వెళ్లినయెడల ఆంగ్లేయసామ్రాజ్యము వృద్ధి కాఁగల దనియు, అట్లు చేయుట దేశభక్తి గల ప్రతి యింగ్లీషువానికిని విధి యనియు, అందువలన దేశమునకే గాక వెళ్లువారికి కూడ విశేషలాభమును పొందుట కవకాశ మున్న దనియు, 1580 మొదలు ప్రముఖు లగు ఇంగ్లీషువా రనేకులు ప్రజలకు బోధించుచున్నప్పటికిని, ఆ కాలమందు ఇంగ్లండులో అనేకులు జీవనాధారములు లేక కూలిపని గూడ దొరకక మూఁడుపూఁటలు ఆహారము లేక భిక్షుగాండ్రై దేశద్రిమ్మరులుగ తిరుగుచుండినను, అమెరికాకు వెళ్లుటకు కావలసినంత యుత్సాహసాహసములు వారియందు లేని కారణముచే, అమెరికాలోని ఇంగ్లీషు కాలనీలు వృద్ధి యగుటకు విశేష మవకాశము లేనట్లగపడెను. దూరదేశములకు వెళ్లుటకు పూర్వము ఈ ప్రకారముగ సంకోచించుట కొంతవఱకు మనుష్యస్వభావ మనియే చెప్పవచ్చును. ఇప్పుడు మన గ్రామములలో కూలి నాలి లేక తిరుగువా రందఱో యున్నారు గదా? బొంబాయి అహమదాబాద్ కాన్పూరు మొదలగు పట్టణములలో రోజుకు రూపాయ కూలి ఇచ్చెద రని తెలిసినప్పటికిని, వీరిలో నెందఱు ఆ పట్టణములకు వెళ్ల సాహసింతురు? అట్లే ఆ కాలపు ఇంగ్లీషువా రుండిరి. స్వదేశముతోడియు బంధువులతోడియు బాల్యమిత్రులతోడియు బంధమును త్రెంచుకొని, వందలకొలఁది మైళ్ల దూరమం దున్న అమెరికాకు ఎవరో కొందఱు మాత్రము వెళ్లుచుండిరి గాని, విశేషముగ అనేకులు వెళ్లుట లేకపోయెను.

ఇంగ్లీషువారి యదృష్టవశమున క్రమక్రమముగ ఇది యంతయు మాఱఁజొచ్చెను. దీనికి ప్రధానకారణము 1600 ప్రాంతమున ఇంగ్లీషువారి మతములో కలిగిన గొప్ప మార్పులు గనుక, వాని విషయమై ఒకటి రెండు మాటలు చెప్పవలసి యున్నది.

1500 తర్వాత క్రైస్తవులలో (1) కతోలిక్కు (2) ప్రాటెస్టాంటు అను శాఖలు రెండు బయలుదేఱిన వనియు, ప్రాటెస్టాంటు మతమును స్వీకరించినవారిలో నెల్ల ఇంగ్లీషువారే ప్రధాను లనియు, ఈ కారణముచేతనే వీరికి స్పెయిన్ వారితో ప్రబలవిరోధము సంభవించి ఆంగ్లేయ సామ్రాజ్యమునకు పునాది యేర్పడిన దనియు, వెనుకటి ప్రకరణములో చెప్పియుంటిని. మోక్షమును సాధించుటకు పోపును మతగురువుగ భావించి ఆ పీఠమునకు బద్ధులై యుండుట అవసరము లే దని ప్రాటెస్టాంటులును, అట్లు చేసినఁ గాని యెవఁడును నిజమైన క్రైస్తవుఁ డని యనిపించుకొనుట కర్హుఁడు కాఁడని కతాలిక్కులును వాదించి, ఈ రెండు శాఖలుగ నేర్పడిరి. ప్రాచీన మత మగు కతాలిక్కు మతమును ధిక్కరించి వేయుటయందు ప్రాటెస్టాంటు లందఱు ఏకీభవించిరి గాని ఆ స్థానమున ఎట్టి మతమును స్వీకరింపవలయు నను విషయమందు వీరిలో వీరికి పరస్పరాభిప్రాయ భేదములు కలిగి కలహములకు కారణ మాయెను. వేదమున కిది యర్థ మని శంకర మతస్థులును, ఇది యర్థ మని రామానుజమతస్థులును, ఇవి రెండును కా వని మాధ్వులును పోరాడునట్లు బైబిలు మొదలగు మతగ్రంథములలోని ధర్మముల విషయమై ఇట్టి భిన్నాభిప్రాయములు కలిగినవి. ఇట్టి సందర్భమున ఇంగ్లండుదేశపు రాజులు తమ యధికారమును అధికము చేసికొనుటకై, ఇదివఱకు మతమున కంతకు పోపు గురువుగ నెంచుకొన్నట్లు ఇఁక మీఁదట ఇంగ్లండులోని ప్రాటెస్టాంటు లందఱు ఇంగ్లీషు ప్రభువును మతగురువుగ నెంచుకొనవలసిన దనియు, ఇదియే క్రైస్తవధర్మ మనియు, అట్లు భావింపక మతవిషయములయందు ప్రభువుయొక్క ఆజ్ఞను శిరసా వహింపనివారు దండనార్హు లగుదు రనియు అనేక శాసనములను గావించిరి. ఈ శాసనములకు బద్ధులై ఇంగ్లీషువా రనేకులు ప్రవర్తించుచుండిరి. ఇట్టివారికే ఆంగ్లికను లనియు వీరి మతమునకే ఆంగ్లికన్ మత మనియు పేరులు కలిగెను. మతవిషయములయందు తమ ప్రభువును గురువుగ అంగీకరించుటయే గాక వ్రతములు మొదలగు కర్మలవలన మోక్షము సాధింపవచ్చు ననియు, కనుక ప్రాటెస్టాంటు లందఱు కర్మలు చేయవలసిన దనియు, ఈ యాంగ్లికనులు వాదించిరి. కాని, ప్రాటెస్టాంటులలో మఱికొందఱు భిన్నాభిప్రాయములు కలవారైరి. మతవిషయములయందు ఎవరికి వారే గురువు లని కొందఱును, ఇట్టి విషయములయందు పండితుల సభయే గురువు గాని ప్రభువు ఎన్నఁటికిని గురువు కాఁజాలఁ డని మఱికొందఱును, కర్మలవలన ఎట్టి ప్రయోజనమును లే దనియు జ్ఞానమును నిర్మలమైన హృదయమును మాత్రమే మోక్షసాధకము లనియు వీ రందఱును, వాదించిరి. ఇట్టివారికి ప్యూరిటను లని పేరు కలిగెను. ఈ ప్యూరిటనులలో కూడ ఎన్నియో యుపశాఖలు పుట్టినవి.

ఆ కాలమందు ఇప్పటివలె ఐరోపా దేశములలో మతసహనమను నది మందునకు కూడ లేకయుండెను. ప్రతి మనుష్యుఁడును తన మతమే సత్యమైన మత మనియు స్వమతవిరోధులను బలవంతపఱచి తన మతములో చేర్చుకొనుట తనకు విధి యనియు, ఒక రాజ్యమందు అనేకమతములవా రుండుట రాజ్యబలముయొక్క క్షీణతకు హేతు వనియు అభిప్రాయపడియుండిరి. ప్రతిదేశమందలి రాజును తా నే మతమును స్వీకరించునో ఆ మతమునే దేశమం దంతట నాటవలె ననియు అట్లు చేయుటయే రాజధర్మ మనియు నమ్మకము గలిగియుండెను. ఈ కారణమును బట్టి ఇంగ్లండు దేశపు రాజు లా కాలమున ఆంగ్లికన్ మతమును స్వీకరించినవా రగుటచే తమకు విరోధులైన ప్యూరిటనులను అనేకవిధముల బాధించుచుండిరి.

ప్యూరిటనులు వారి దేవాలయములకు వెళ్లఁగూడ దనియు వారి గ్రంథములను ప్రచురించి వారి మతమును ఇతరులకు బోధింపఁగూడ దనియు ఆంగ్లికనులు చేయుచుండు కర్మల నన్నిటిని వారు కూడ చేయవలసిన దనియు ఇంగ్లీషు ప్రభువులు అనేకశాసనములు చేసిరి. ప్యూరిటనులు స్వమతోద్ధరణమునకై పడుచున్న బాధలు ఇన్నన్ని కావు. వారిలో అనేకులు కారాగృహములందే తమ యావజ్జీవమును గడపవలసియుండిరి. అనేకులు చెవులు ముక్కులు మొదలగువానిని కోలుపోయి కురూపులైరి. ఇట్లు అనేకవిధము లయిన శిక్షలకు వారు పాత్రులగుచుండ, ఇఁక తమ జన్మము వృథా యనియు తాము ఇంగ్లండులో నుండువఱకు స్వమతధర్మముల నాచరించుటకు వీలుండ దనియు, పరమతధర్మములను స్వీకరించిన నరకప్రాప్తి కాఁగల దనియు, ఇహసుఖము లెన్ని యున్నను పరసుఖమార్గము లేనప్పుడు జీవించియుండుటకంటె మరణమే మే లనియు నిశ్చయము చేసికొనిరి.

ఈ ప్యూరిటనుల దురవస్థలే ఇంగ్లీషువారి కాలనీల యభివృద్ధికి కారణ మాయెను. నిలుచుటకు స్వదేశమందు నీడ లేక, ప్రభువుల ప్రబలవిరోధమునకు పాత్రులై, మతనిరతులైన ప్యూరిటనులు ఇంగ్లండునందుండి సమస్తబాధలు పడుటకన్న దేశాంతరములకు వెళ్లి యథేచ్ఛముగ స్వమతధర్మముల ప్రకారము జీవింపనగు నను నెడి యభిలాషతో, అమెరికా ఖండమందు నిర్జనప్రదేశము లెన్నియో యున్నవి గనుక అచ్చటికి వెళ్లినయడల మతవిషయములయందు తమ్ము నిర్బంధింపవా రెవ్వరు నుండ రని, మాతృదేశమును వదలుటకు తీర్మానించుకొనిరి. ఈ ప్యూరిటనులు మిక్కిలి పట్టుదల గల మనుష్యులు; వీరికి స్వాతంత్ర్యమం దున్నంత ప్రేమ మరి దేనియందును లేదు. వీ రందఱు మిక్కిలి ధనవంతులును మిక్కిలి దరిద్రులును గాక కష్టపడి పనిచేసి గృహస్థధర్మములను నిర్వర్తించుటయందు మిక్కిలి యాసక్తి గలిగినవారు. అమెరికాలో కాఱడవులును క్రూరమృగములును గల వనియు, ప్రప్రథమమున ఎంతయో కష్టపడిన గాని తమకు జీవనాధారములు కలుగఁజాల వనియు వీ రెఱిఁగియుండినను, ఈ కష్టములను వీరు గమనింపక, స్వమతమును నిరాటంకముగ నవలంబించి స్వధర్మమును ఇష్టమువచ్చినట్లు పాటింపవచ్చును గదా అనెడి యుత్సాహముతో వీరు 1620 మొదలు అమెరికాకు వెళ్లుటకు ప్రారంభించిరి. 1628 మొదలు 1640 లోపుగా ఇరువదివేల ప్యూరిటనులు ఆలుబిడ్డలతో కూడ ఇంగ్లండును విడిచి అమెరికాకు వెళ్లి స్థిరనివాసముల నేర్పఱచుకొనిరి. వీరే వర్జీనియాకు ఉత్తరభాగమందు ప్లిమత్, మెసుచెసుట్సు, రోడ్ ఐలండు మొదలగు కాలనీలను స్థాపించిరి. 1640 తర్వాత కొన్ని సంవత్సరములవఱకును ప్యూరిటనులు ఇంగ్లండును విడిచి అమెరికాకు వెళ్లుట మానిరి. ఏలన, 1640 తర్వాత ఇంగ్లండులోని ప్యూరిటనులు తమ ప్రభువగు మొదటి చార్లెసుయొక్క దుష్పరిపాలనమును భరింపలేక, అతనితో కలహించి గొప్ప సైన్యములను కూర్చి యుద్ధమం దతని నోడించి తుదకు నతని నురితీసి 1649 లో ఇంగ్లండునందు ప్యూరిటన్ ప్రభుత్వమును స్థాపించిరి. 1660 వఱకు వీరి ప్రభుత్వమే సాగుచుండుటవలన ఇంగ్లండును వదలి అమెరికాకు వెళ్లుటకు వీరి కవసరము లేకపోయెను. 1660 లో మొదటి చార్లెసు కుమారుఁడైన రెండవ చార్లెసు తిరిగి ఇంగ్లండునకు రాజై ఆంగ్లికన్ మతమును స్థాపించి ప్యూరిటనులను బాధపెట్టుటకు మొదలిడెను. కనుక పెన్సల్వేనియా మొదలగు కాలనీలలోనికి మరికొందఱు ప్యూరిటనులు వెళ్లిరి. మతబాధల నోర్వఁజాలక అమెరికాకు వెళ్లినవారలు ప్యూరిటనులు మాత్రమే కాదు. 1632 లో కతొలిక్కులు కొందఱు అమెరికాకు వెళ్లి మేరీలాం డను కాలనీని స్థాపించిరి. 1750 నాఁటికి అమెరికాలో ఇంగ్లీషువారి కాలనీలు పదుమూఁడుండినవి. ఇందులో సుమారు ఎనిమిది కాలనీలను స్థాపించుటకు ప్యూరిటనులును కతొలిక్కులును కారకులు.

వేలకొలఁది ఇంగ్లీషువా రిట్లు అమెరికాలో చేరి ధనవంతులగుచుండుటను చూచి, పూర్వముకంటె ఎక్కువ సాహసముతో వ్యాపారమునకును వ్యవసాయము చేసి ధనము గడించుటకును మఱికొందఱు ఇంగ్లీషువారు వెళ్లిరి. ఈ కారణముచేతనే 1750 నాఁటికి పదుమూఁడు ఇంగ్లీషు కాలనీలు ఆ ఖండమందు ఏర్పడినవి.

## తృతీయాధ్యాయము

ఇంగ్లీషువారి కాలనీలు ఈ విధముగ వృద్ధి యగుచుండుట చూచి స్పెయిన్ హాలెండు ఫ్రాన్సు మొదలగు దేశములవారు మిక్కిలి అసూయపడసాగిరి. కాని, 1558 తర్వాత వారి బలము క్షీణించుచుండుటచేత స్పెయిన్‌వారు ఇంగ్లీషువారి కేలాటి యాటంకమును కలుగఁజేయలేకపోయిరి. ఇది గాక, ప్యూరిటనులు తమ యధికారమును ఇంగ్లండులో స్థాపించిన కాలమందు 1655 లో ఇంగ్లీషువారు స్పెయిన్‌వారిని తిరిగి యోడించి, వారి స్వాధీనమం దున్న అమెరికాలోని జమైకా యను ద్వీపమును వశపఱచుకొనిరి.

హాలెండు ప్రజ లగు డచ్చివారిని ఓడించుట ఇంగ్లీషువారి కింత సులభము గాకపోయెను. ఇంగ్లీషువారివలెనే ఈ డచ్చివారు కూడ ప్రొటెస్టాంటు మతమును స్వీకరించిరి. వారివలెనే వీరు కూడ సముద్రయానమందును సముద్రయుద్ధమందును కడతేఱినట్టివారు. స్వమతమును స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకై 1600 కు పూర్వము డచ్చివారు సుమారు ముప్పది సంవత్సరములు తమ కప్పుడు పరిపాలకులుగ నున్న స్పెయిన్‌వారితో ఘోరయుద్ధము గావించి, తమ దేశము మిక్కిలి చిన్న దైనను, స్పెయిన్ రాజుల కున్నంత బలము తమకు లేకపోయినను, తమ శౌర్యపరాక్రమములచేతను, స్వాతంత్ర్యమును గక్షించుకొనుటయందు తమకుఁ గల యుత్సాహముచేతను, స్పెయిన్‌వారి బలము నెల్ల నాశనముచేసి, స్వాతంత్ర్యమును సంపాదించుకొని యుద్ధవిషయములయం దనుభవమును పొంది అసమానమైన యుద్ధకౌశలము గలవా రను ప్రఖ్యాతి గాంచిరి. 1600 వఱకు ఊరు పేరు లేక పరుల యధికారమునకు లోఁబడియుండిన ఈ డచ్చివారు స్వబలమును ఇప్పుడు తెలిసికొని, దేశాంతరములతో వ్యాపారము చేయ సమకట్టి, ఇండియా మొదలగు తూర్పు దేశములకు పోర్చుగల్‌వారు కనుపెట్టిన మార్గమున తమ యోడలను పంపి, విశేష ద్రవ్యమును గడింపసాగిరి. ఇంతే గాక, తూర్పు దేశములనుండి యిరోపాకు వచ్చు సరకు లన్నియు వీరి యోడలలోనే వచ్చుచుండెను. వ్యాపారమునకు మాత్రమే గాక, వీరు కాలనీలను స్థాపించుటకు కూడ ప్రయత్నించి అమెరికాలో ఇంగ్లీషువారి కాలనీల మధ్యమున రెండు

కాలనీల నేర్పాటు చేసికొనిరి. వీరు స్పెయిన్ వారితో స్వాతంత్ర్యముకొఱకై యుద్ధము గావించుచున్న కాలమందు ఇంగ్లీషువారు వీరికి మిత్రులై విశేషసాహాయ్యము చేసినప్పటికిని, వీరును ఇంగ్లీషువారును ఒకటే (ప్రొటెస్టాంటు) మతస్థులైనప్పటికిని వ్యాపారము నిమిత్తముగను కాలనీల విషయమందును వీరికి పరస్పరవిరోధము సంప్రాప్తించెను. తూర్పు దేశములతో వ్యాపారము చేయవలయునని ఇంగ్లీషువారు కూడ 1600 లో తూర్పు ఇండియా (వర్తక) సంఘము నొకదానిని ఏర్పాటు చేసి ఇండియా జావా సుమాత్రా మొదలగు ప్రదేశములతో వ్యాపారము నారంభించిరి ఈ కారణముచే తూర్పు సముద్రములయందు వ్యాపారము చేయుచున్న డచ్చి వర్తకులకును ఇంగ్లీషు వర్తకులకును కలహములు కలిగి 1613 లో కొందఱు ఇంగ్లీషువారు డచ్చివారిచే ఈ తూర్పు ద్వీపములయందు చంపఁబడిరి. అది మొదలు ఈ విరోధము వృద్ధియై తుదకు రెండు దేశములవారి యుద్ధములకు కారణ మాయెను. ఈ యుద్ధము లన్నిటిలో మూఁడు ప్రధానము లయినవి. 1652_1655 వఱకు మొదటి యుద్ధమును, 1664_1667 మధ్యమున రెండవ యుద్ధమును, 1672-1674 మధ్యమున మూఁడవ యుద్ధమును జరిగెను వీనియందు డచ్చివారే మిక్కిలి పరాక్రమము చూపినను కొన్ని సమయములయందు ఇంగ్లీషువారు గొప్ప నష్టములు పొందినను, తుదకు జయము ఇంగ్లీషువారికే లభించినది. ఉత్తర అమెరికాలోని డచ్చి కాలనీలు రెండును ఇంగ్లీషువారి వశమయినవి అదివఱకు తూర్పు దేశములతో డచ్చివారు చేయుచున్న వ్యాపారము చాలవఱకు తగ్గెను-

1680 తర్వాత డచ్చివారివలన ఇంగ్లీషువారి కేలాటి భయమును లేకపోయెను. సమస్తవిషయములయందును ఇంగ్లీషువారితో వీరు సమానులుగ నుండినను, వారివలె వీరు గొప్ప సామ్రాజ్యాధిపతులు గాకపోయినందునకు కొన్ని బలమయిన హేతువులుండినవి. అట్లాంటిక్ సముద్రమునందే ఇంగ్లండు దేశ ముండుటవలన ఆ సముద్రమార్గమున వ్యాపారము చేయుటకు ఇంగ్లీషువారి కున్నంత అవకాశము డచ్చివారికి లేకపోయెను. ఇది గాక, హాలెండు ఐరోపా ఖండమం దొక దేశమై అన్ని వైపుల బలవంతులగు శత్రువులచే బాధింపఁబడుచుండెను ఇంగ్లండు అట్లు గాక, మహాసముద్రమం దొక ద్వీపముగ నుండుటవలన, ఇంగ్లీషువారికి ఐరోపా ఖండమందు శత్రువు లెందఱున్నను, ఇంగ్లండుపై ఎత్తి వచ్చువా రొకరును లేరైరి. ఈ కారణముచే ఇంగ్లీషువారు విశేష ద్రవ్యమును సైన్యములకొఱకై కర్చుపెట్టక తమ నౌకాబలమునే వృద్ధిచేసికొని, తద్ద్వారా తమ వ్యాపారమును ఖండాంతరములయందలి తమ సామ్రాజ్యమును పెంచుకొనఁగలిగిరి. డచ్చివారి కిట్టి సదుపాయములు లేవు. వారిది చిన్న దేశము. వారికి పొరుగున బలవంతులగు ఫ్రెంచివా రుండిరి. ఈ ఫ్రెంచివా రెల్లప్పుడు హాలెండును స్వాధీనపఱచుకొనుటకు ప్రయత్నించుచుండిరి. ఈ కారణముచే స్వదేశమును ఫ్రెంచివారినుండి రక్షించుకొనుటకును విశేషసైన్యములు డచ్చివారికి కావలసియుండెను. సైన్యములు లేనియెడల తమ దేశము ఫ్రెంచివారి స్వాధీన మగునట్లుండెను. కనుక వారు తమ ద్రవ్యమును నావలకై ఖర్చుపెట్టక సైన్యములకొఱకును కోటలకొఱకును కర్చుపెట్టవలసి యుండిరి. అందువలన కొలఁది కాలములోనే వారి నౌకాబలము ఇంగ్లీషువారి నౌకాబలమువలె వృద్ధి కాలేకపోయెను. నౌకాబలము లేకుండ సముద్రమార్గమున వ్యాపారము చేయుట అసాధ్య మగుటవలన, 1680 తర్వాత డచ్చివారు ఇంగ్లీషువారితో వైరము మాని అది మొదలు వారియందు మిత్రభావము గలిగి ప్రవర్తించుచుండిరి ఫ్రెంచివారివలన కలుగుచుండు అపాయము హెచ్చగుచుండుటవలన ఇంగ్లీషువారి సాహాయ్యముచే ఫ్రెంచివారిని ఓడించుట సులభ మని డచ్చివారు 1680 మొదలు ఇంగ్లీషువారికి మిత్రులుగనే యుండిరి.

## చతుర్థాధ్యాయము

స్పెయిన్ వారిని డచ్చివారిని ఓడించి 1680 నాఁటికి ఇంగ్లీషువారు మిక్కిలి బలవంతులై యుండిరి. సముద్రములమీఁద వీరి నెదిరింపఁగల సమర్థులు ఎవరును లేకపోయిరి. వీరి వ్యాపారము హెచ్చుచుండెను; వీరి కాలనీలు కూడ క్రమక్రమముగ వృద్ధి యగుచుండెను. వీ రిట్టి మంచి స్థితియం దుండ, ఫ్రెంచివారు తమ వ్యాపారమును సామ్రాజ్యమును వృద్ధిచేసికొనుటకై ప్రయత్నించి ఇంగ్లీషువారి యాధిక్యమునకు కొన్ని యాటంకములు కలుగఁజేయుచుండిరి. కనుక 1680 తర్వాత ఇంగ్లీషువారు ముఖ్యముగా ఫ్రెంచివారితోనే యుద్ధములు చేయవలసినవారైరి.

1680 నాఁటికి అనేకవిషయములయందు ఐరోపా దేశస్థులందఱిలోను ఫ్రెంచివారే మిక్కిలి ఘనతను చెందియుండిరి. ప్రజలందఱు అంతఃకలహములు మాని ఐకమత్యమును దేశభక్తియు కలిగియుండిరి. అప్పటికే వారు స్పెయిన్ దేశస్థులను జర్మనులను అనేక యుద్ధములందు ఓడించి స్పెయిన్ రాష్ట్రములను కొన్నిటిని జర్మన్ రాష్ట్రములను మరికొన్నిటిని వశపఱచుకొని, ఐరోపా ఖండమందలి రాజ్యము లన్నిటిలో మిక్కిలి బలము గల దని ప్రఖ్యాతి గాంచిన రాజ్యమును సంపాదించిరి ఆ కాలమందు ఫ్రెంచిరాజ్యమును పరిపాలించుచున్న లూయీ అను ప్రభువు మిక్కిలి శక్తిసామర్థ్యములు గలవాఁడై తన యధికారమును ఐరోపా ఖండములోని ఇతర దేశము లన్నిటిపై స్థాపించి, ఖండము నంతటిని తన వశములో నుంచుకొనవలయు ననెడి పేరాసకు పాత్రుఁడై యుండెను. ఈ ప్రభువు దగ్గఱ అప్పటికి అద్వితీయ మగు సైన్యములును సైన్యాధిపతులును మంత్రులును ఉండి, అతని యాజ్ఞలను శిరసా వహించి, ఫ్రాన్సు దేశముయొక్క ఘనతను వృద్ధి చేయు విషయమం దాతని కెంతయో యుత్సాహముతో తోడ్పడుచుండిరి. లూయీ రాజ్యమునకు వచ్చునప్పటికి ఫ్రెంచి రాజులు విస్తారమైన సైన్యములనే కలిగియుండిరి కాని, నౌకాబలమును వృద్ధిచేసికొని సముద్రములపై తమ యధికారమును స్థాపించుటకు ప్రయత్నించినవారు కారు. లూయీ అట్లు గాక, అతిశీఘ్రకాలమున యుద్ధనౌక లనేకములు తయారుచేసి, అమెరికా ఖండమందు ఫ్రెంచి కాలనీలను కొన్నిటిని స్థాపించుటకును, తూర్పు దేశములతోడి ఫ్రెంచివారి వ్యాపారమును బలపఱచుటకును మొదలిడెను. ఇది యంతయు చూచి ఇంగ్లీషువారు సహజభీతిని పొంది, లూయీయొక్క యుద్యమములు

సఫలము లైనయెడల తా మెంతయో కష్టపడి సంపాదించిన కాలనీలును తూర్పు దేశములతోడి వ్యాపారమును తమ వశమందు నిలువకపోవుటయే గాక తమ దేశస్వాతంత్ర్యమునకు కూడ అపాయము కలుగఁగల దని ఉద్దేశపడిరి. 1688 లో వారి కదివఱకు ప్రభువుగ నుండినట్టి రెండవ జేమ్సును ఇంగ్లీషువారు సింహాసనభ్రష్టునిఁ గావించి, తమకు అనురక్తుఁ డైనట్టియు అప్పుడు హాలెండునకు ప్రభువుగ నున్నట్టియు మూడవ విలియమునకు ఇంగ్లీషు రాజ్యము నిచ్చి దానిని పరిపాలింపవలయు నని కోరిరి. ఈ కోరిక ప్రకారము మూడవ విలియము హాలెండునకు మాత్రమే గాక ఇంగ్లండునకు కూడ ప్రభు వగుటను చూచి, ఫ్రెంచి రా జగు లూయీ చాల క్రోధము చెంది, విలియము ఇంగ్లండునకు రాజుగా నుండుటను తా నెంత మాత్రమును ఒప్పుకొనఁజాల ననియు, రెండవ జేమ్సును తిరిగి ఇంగ్లండునకు బలవంతముగ రాజును చేసెద ననియు బెదరింప సాగెను.

ఇది గాక, ఈ లూయీ హాలెండు బెల్జియము దేశములను స్వాధీనపఱచుకొనవలె ననియు, ఇంగ్లండు పరిపాలనలో నున్న ఐర్లాండును ఇంగ్లండునుండి వేఱుపఱుపవలె ననియు ప్రయత్నము చేసి అందుకు తగిన వ్యూహములు పన్నుచుండెను. హాలెండు బెల్జియము దేశములను లూయీ జయించినయెడల ఫ్రెంచివారు ఇంగ్లండుపై దండెత్తివచ్చుట సులభ మనియు, ఆ కారణముచే తమ స్వాతంత్ర్యమునకు నష్టము కలుగు ననియు, ఇట్టి సందర్భములో ఊరక యుండుట ధర్మము కా దనియు ఇంగ్లీషువారు ఫ్రెంచివారితో యుద్ధమునకు పూనిరి. 1689 మొదలు 1697 వఱకు యుద్ధము జరిగెను. ఇందువలన ఆంగ్లేయుల సామ్రాజ్య మభివృద్ధి చెందకపోయినను లూయీయొక్క ప్రయత్నముల కన్నిటికిని విఘ్నములు కలిగెను. కాని, లూయీ మాత్రము తన తొలి యుద్దేశములను విడనాడిన వాఁడు కాఁడు. 1700 లో స్పెయిన్ దేశపు రాజు చచ్చుటకు సిద్ధమై యుండఁగా, తన మనుమనిని స్పెయినుకు రాజుగ చేసి, ఫ్రెంచి సామ్రాజ్యమును స్పెయినునందును అమెరికాలోని స్పెయిన్ వారి కాలనీలయందును స్థాపింపవలె నని లూయీ పట్టుపట్టెను. ఇంత గొప్ప సామ్రాజ్యము లూయీకి దొరకినయెడల, ఇంగ్లీషువారి కపాయము కలుగు నని, ఇంగ్లండుకు రాజైన మూఁడవ విలియమును ఇంగ్లీషు ప్రజ లందఱును ఫ్రెంచివారితోడి యుద్ధ మవసర మని, 1700 లో దానిని ప్రారంభించిరి. 1700 మొదలు 1713 వఱకు ఈ యుద్ధము జరిగెను. ఇది ఇంగ్లీషువారు ఫ్రెంచివారి ప్రయత్నములను భంగపఱచుటకుఁ గాను చేసిన రెండవ యుద్ధము. ఇందులో కూడ ఇంగ్లీషువారికే జయము కలిగెను. యుద్ధాంతమున ఫ్రెంచివారును తమ మిత్రులగు స్పెయిన్ వారును ఇంగ్లీషువారికి తమ వశమం దున్న ప్రదేశములను కొన్నిటిని ఇయ్యవలసినవా రైరి. హడ్సన్ బే అకేడియా న్యూఫౌండ్లాండు అను అమెరికాలోని రాష్ట్రములను ఫ్రెంచివారును, జిబ్రాల్టరు మైనార్కా అను ఐరోపాలో మధ్యధరాసముద్రమందలి ప్రదేశములను స్పెయిన్ వారును ఇచ్చివేసిరి. కనుక ఈ యుద్ధమువలన ఫ్రెంచివారి యాశలు భంగము పొందుటయే గాక అమెరికాలోని ఆంగ్లేయసామ్రాజ్య మభివృద్ధి గాంచెను; ఇంతే గాక, అట్లాంటిక్కునుండి మధ్యధరాసముద్రమునకు పోవు మార్గములో నున్న జిబ్రాల్టరు ఇంగ్లీషువారి వశ మగుటవలన అది మొదలు మధ్యధరాసముద్రమందు ఇంగ్లీషువారి నౌకాబలము స్థిరముగ నాటుకొనెను.

1713 మొదలు 1756 లోపున ఆంగ్లేయ సామ్రాజ్యము విశేషమైన అభివృద్ధిని పొందలేదు. కాని, ఫ్రెంచివారితోడి వైరము మాత్రము దినదినము హెచ్చుచుండెను. 1742 మొదలు 1748 వఱకు మఱియొక యుద్ధము వీరికి జరిగినది గాని, ఇందువలన ఇంగ్లీషువారికి విశేషలాభము కలుగలేదు. 1756 మొదలు 1763 వఱకు ఇంగ్లీషువారికిని ఫ్రెంచివారికిని నాల్గవ యుద్ధము జరిగెను. ఇదియే ఈ యుద్ధము లన్నిటిలోను ప్రధాన మైనది. ఇందువలననే ఆంగ్లేయ సామ్రాజ్య మనేకప్రదేశములయం దభివృద్ధి చెందఁగలిగినది.

1600 మొదలు 1750 వఱకు తూర్పు దేశములతో ఇంగ్లీషువారు వ్యాపారము చేయుచుండిరి. ఇందుకై 1600 లో వారు తూర్పిండియా వర్తక సంఘ మొకదానిని స్థాపించిరి. ఈ సంఘమే మన దేశమందు ఆంగ్లేయ సామ్రాజ్య స్థాపనకు ప్రధాన కారణము. 1750 కి పూర్వ మిందువిషయమై ఈ సంఘమువా రేమి చేసినదియు మనము తెలిసికొనవలయును.

ఈ సంఘమును స్థాపించుటలో ఇంగ్లీషువారి యుద్దేశము వ్యాపారము చేయుటయే గాని దేశములను సంపాదించుట కాదు. ఇంతే గాక వ్యాపారము చేయుటలో కూడ, ఇండియాతోఁ గాక, దీనికి తూర్పునం దున్న జావా మొదలగు ద్వీపములతో వ్యాపారము చేయుటవలన ఎక్కువ లాభమును సంపాదింపవచ్చు నని మొదట ఈ సంఘమువారు ఆ ద్వీపములకే వెళ్లుచుండిరి. కాని, ఇంగ్లీషువారికి పూర్వమే డచ్చివారు ఆ ద్వీపములతో వర్తకము ప్రారంభించి యున్న కారణమున వారు ఇంగ్లీషువర్తకులకు విశేషనష్టమును అపాయమును కలిగించి 1613 లో ఇంగ్లీషు వర్తకులను కొందఱిని చంపివేసిరి. ఈ కారణముచేత తూర్పుద్వీపములతోడి వర్తకమును మాని తూర్పిండియా సంఘమువారు ఇండియాతో వ్యాపారమునకు మొదలిడిరి. అప్పుడు గూడ మన దేశమును జయించి పరిపాలింపవలయు ననెడి ఉద్దేశము వీరికి లేదు. తాము ఇంగ్లండునుండి దీసికొని వచ్చినట్టియు ఇండియాలో కొని ఐరోపాకు తీసికొనిపోవునట్టియు సరకులను పెట్టుకొనుటకు గొప్పగొప్ప పట్టణములయందు కొన్ని వర్తకశాలలను ఏర్పాటుచేసికొని, ఈ శాలలను రక్షించుకొనుటకై వాని చుట్టు కోటలను కట్టుటకు మొదలిడిరి. ఈ విధముగ 1639 లో చెన్నపట్టణపు కోటను వీరు కట్టిరి. 1660 లో పోర్చుగీసువారు వీరికి బొంబాయి పట్టణము నిచ్చిరి. 1698 లో వీరు కలకత్తా కోటను కట్టిరి 1750 వఱకు ఈ సంఘమువారు వ్యాపారమునందే శ్రద్ధ వహించియుండిరి కాని, రాజ్యము సంపాదింపవలె నన్న యుత్సాహము వీరియందు లేదు. కాని, అప్పటికి మన దేశములోని స్థితిగతులు మాఱఁదొడఁగినవి. మొగలాయీల ప్రభుత్వము క్షీణించెను. ఫ్రెంచివారు దేశమును తమ స్వాధీనము చేసికొనవలె నని ప్రయత్నించిరి. ఇట్టి సందర్భములో తా మూరకయున్న తమ వర్తకమున కపాయము కలుగు నని ఇంగ్లీషువారు కూడ రాజ్యము సంపాదించుట కుపక్రమించిరి. ఇది యంతయు 1750 తర్వాత జరిగెను.

# ఆంధ్రగ్రంథాలయోద్యమము

అయ్యంకి వేంకటరమణయ్య గారు

పాశ్చాత్యనాగరకతవలన మన దేశమున కల్గిన మహాభాగ్యములలో సహవాసేచ్ఛ యొకటి యని భావించుచున్నాము. కాని, మన దేశముయొక్క సాంఘిక జీవనమునందు పూర్వము కూడ సహవాసేచ్ఛ ప్రాధాన్యము వహించి మన ప్రాచీనుల జీవితములను యశోవంతములుగఁ జేసెను. వర్ణాశ్రమధర్మము లా కాలమున స్నేహబుద్ధి కెంత మాత్రమును ఆటంకములుగ పరిణమించి యుండ లేదు. అయినను, ఈ కాలమున ప్రాచీన ప్రతిష్ఠాపన లన్నియు నశించియుండుటచే ఆ కాలమునాఁటి చాతుర్వర్ణములే ఇప్పుడు సంఘానర్థదాయకము లై యున్నవి. అందుచేత, సహవాసమువలన సహజముగఁ గలుగవలసిన మనోహరత్వమును ఆనందమును నశించిపోవుటయే కాక, పరస్పరద్వేషభావము లంకురించి ప్రజ్వరిల్లుచు దేశము నంతను దహించుచున్నవి.

ఇంతే కాక, ఉద్యోగస్థులు సామాన్యజనులను జూచిన నేవగించుకొనెదరు. వర్తకులను జూచిన విద్యాధికులకుఁ గిట్టదు. మన దేశముయొక్క యైశ్వర్యమున కంతకును ఆధారభూతులగు వ్యవసాయదారుల స్థితి మిక్కిలి హీనముగా ఉన్న దని చెప్పుట కెంత మాత్రమును సందియము లేదు. విద్యయందును సంఘమునందును కూడ సమానమైన స్థితియం దున్నవారితో నైన కలసిమెలసి యుండుట తమ గౌరవమునకు హానికర మని ఉద్యోగస్థులు తలంచుచున్నారు. సామాన్యజను లన్ననో, ఉద్యోగుల యధికారమును జూచి భయపడుచున్నారు. దేశమునందు జరగుచుండు వివిధోద్యమములకు విశేషద్రవ్యసాహాయ్యము వ్యవసాయదారులును వర్తకులును చేయుచున్నను, వాని నిర్వహణమునందు వారి కెంత మాత్రమును జోక్యము లేకున్నది. ఈ విధముగ పరస్పర విశ్వాసాభావముచే జను లందఱికిని సంబంధించిన విషయములందు కూడ, నిజమగు సంఘీభావ మేర్పడుటకు ఎంత మాత్రమును అవకాశము కలుగుట లేదు.

ఈ దుస్థితిలో ఉన్న సంఘమును సంస్కరించుట ఎట్లు? దీనిని సంస్కరించుటకుఁగాను సంఘీభావ మేర్పడుటకు సహాయపడు సాధనముల నెల్ల మనము సమకూర్పవలెను. ఆకస్మికముగా తటస్థించు సాధనములను గూర్చి ఇచ్చట మనము చర్చింప నక్కఱ లేదు; కాని, జను లందఱును సంఘీభావము కలిగి యుండుటకును, అన్యోన్యపరిచయము నభివృద్ధిచేసికొనుటకును, సమత్వమును సంపూర్ణముగఁ గలిగియుండిన ధర్మపఠనమందిరములు గ్రంథాలయములు వస్తుప్రదర్శనశాలలు మొదలగు వివిధసంఘములను ఇందుకు సాధనములుగా దేశమునం దెల్లెడలను విరివిగ స్థాపింపవలెను. భిన్నములగు తరగతులకుఁ జెందిన జను లందఱియొక్క ఉద్దేశములను ఏకముఖమునఁ బెట్టుట కై, ఇట్టి సంఘస్థాపనము మిక్కిలి ప్రయోజనకారి. ఇట్టి సంఘము లెట్లుండవలెనో నిరూపించుటకు ప్రయత్నింతము.

ప్రపంచమునం దేయే భాగములం దేయే విశేషములు జరగుచుండునో, అవి యెల్ల ప్రతిదినమును వార్తాపత్రికలయందు చదువుచుండుటకుఁ గాని, గ్రంథభాండాగారమునం దుండు వివిధగ్రంథములను జదివి అందలి యమూల్యరత్నములను సంపాదించుకొనుటకుఁ గాని, ఉద్యోగస్థులు నిరుద్యోగులు వర్తకులు సామాన్యజనులు విద్యాధికులు పూర్వాచారపరాయణులు సంఘసంస్కర్తలు ఉన్నతజాతులవారు అంత్యజాతులవారు, వారు వీ రన నేల, సకలజనులును ఎచ్చోటికి వివక్షత లేకుండ పోఁగలుగుదురో, అట్టి స్థలమె సార్వజనికగ్రంథాలయము. విద్యాధిదేవత యగు సరస్వతీదేవికి జాతిమతవివక్ష గాని, గొప్పతనము బీదతనము అను భేదబుద్ధి గాని ఎంత మాత్రమును లేదు. న్యాయవాది కానిండు, ఉపాధ్యాయుఁడు కానిండు, ఈనాందారుఁడు కానిండు, వర్తకుఁడు కానిండు, ఇంకను ఎవరైన కానిండు, ఆమె పాదపద్మముల సన్నిధిని మోకరించి జ్ఞానామృతమును తనివిదీర గ్రోలవచ్చును. విజ్ఞానపిపాసను దీర్చుకొను నుద్దేశముతో చనుదెంచు బీదవానితో సరిగా కూర్చుండి చదువుకొనిన తన పరువు తక్కువగు నని భాగ్యవంతుఁ డెంత మాత్రమును భావింపరాదు. ఈ విశాలోద్దేశములను నెఱవేర్చుటకు సంఘములను తగినంత పునాది గలవిగ స్థాపింపవలెను. గ్రంథములను పత్రికలను ఏర్చునప్పుడు అన్ని తరగతుల జనులయొక్క రుచులను కనిపెట్టవలెను. జనుల సాంఘికజీవనమునం దేకభాజనముగ పనిచేయవలె నని తలంచు సంఘము సార్థక మగుటకు ఈ విషయములందు నిష్పాక్షికముగ నుండవలెను. ఈ విధముగ ధర్మగ్రంథాలయములును, పఠనమందిరములును, ఒక గ్రామముయొక్క గాని పట్టణముయొక్క గాని సర్వజనులకును ఉపయోగించు సాంఘికప్రతిష్ఠాపనలై వెలయవలయును.

జను లందఱును ఒకచోట సమావేశమై పరస్పరము భావములను వెల్లడించుకొనుటయొక్క ప్రాముఖ్యమును గణుతింప శక్యము కాదు. ఇట్లు సమావేశ మగుటవలన మానవుని జీవితమును నడతను అంటియుండు స్వల్పము లగు అనేకదుర్గుణములు రాలిపోవును. భాషావిషయము గాని, శాస్త్రవిషయము గాని, రాజకీయవిషయము గాని, సంఘవిషయము గాని చర్చించునపుడు దీర్ఘాలోచనాయుతుఁడగు మేధావంతుఁడు ఇతరులను సరియైన మార్గమునఁ బెట్టఁజాలి యుండును.

కాని, ఆంధ్రదేశమునం దిప్పుడు విలసిల్లియున్న గ్రంథాలయ

V. V. JOGAIAH PANTULU B.A.B.L.
BERHAMPORE



వి. వి. జోగయ్యపంతులుగారు, బరంపురం

V. RAMALINGASWAMY PANTULU B. A. BOBBILI



వి. రామలింగస్వామి పంతులుగారు బి. ఏ. బొబ్బిలి

DR K. V SUBBA RAO M. B. (HOMEO)



డాక్టర్ కె. వి. సుబ్బారావుగారు ఎం. బి. (హోమియోపతి)

G. SREENIVASA RAO PANTULU B.A., B.L.



గోవిందరాజుల శ్రీనివాసరావుపంతులుగారు

ములలో నిజముగ సార్వజనికగ్రంథాలయము లని పిలువఁదగినవి బహుస్వల్పముగ నున్న వని చెప్పిన, అతిశయోక్తి యని తలంప రాదు. ఈ వాక్యము పల్లెటూళ్లయం దున్నవానికే గాక పట్టణములయం దుండువానికిఁ గూడ వర్తించును. గ్రంథాలయము లుండు స్థలములు మిక్కిలి రంజకములై హృదయాకర్షకములుగ నుండవలెను. సర్వసాధారణముగా జనులు పగ లంతయు తమతమ వ్యాపారములను జూచుకొని సాయంసమయమునందు గ్రంథాలయమునకుఁ గాని పఠనమందిరమునకుఁ గాని విచ్చేయుదురు. అందుచే అది బహిరంగ ప్రదేశమునందు గాలి విరివిగా వచ్చుట కనుకూలముగ నుండవలయును. దాని చుట్టును చెట్లను పెంచిన జనప్రియముగ నుండును. గ్రంథములు అందఱికిని సులభముగ అందుఁబా టగునట్టు చేయవలయును. గ్రంథభాండాగారికుఁడు చదువరుల రుచులను కనిపెట్టి ఎవరికి తగిన గ్రంథములను వారి కందఁజేయుచుండవలెను. అతఁడు ఉల్లాసవంతుఁడై మిక్కిలి రసజ్ఞుఁడుగ నుండవలెను. గ్రంథాలయమున కాతఁడు ప్రాణము; దానియొక్క సఫలతకు ఆతఁడే మూలము.

చదువుకొనఁగలిగినవారికి గ్రంథముల నిచ్చునంత మాత్రముననే గ్రంథాలయముయొక్క ధర్మము పూర్తి కాలేదు. దురదృష్టవశముచే మన దేశమునందు చదువుకొనఁజాలనివారు పురుషులయందే అనేకులు కలరు. అట్టివారిలో వయస్సు మీఱినవారికి చదువు చెప్పుట మిక్కిలి కష్టమగు కార్యము; కాని, వారిని జ్ఞానవంతులుగ చేయుట మనకు చేతనయిన పనియు ధర్మమునునై యున్నది. గ్రంథాలయములయందే గాక, వారు నివసించుచుండెడు గుడిసెలకు సైతము పోయి గ్రంథములను పత్రికలను జదివి బోధించి, వారి జ్ఞాననేత్రము వికసించునట్లు చేయవలెను. అప్పుడే గ్రంథాలయముయొక్క ధర్మము పూర్ణముగ నెఱవేఱిన దని చెప్పవచ్చును.

స్త్రీలకును పిల్లలకును కావలసిన ఏర్పాటులు మన గ్రంథాలయములయందు లేవు. స్త్రీలు సాంఘికులుగ చేరుటకు మాత్ర మభ్యంతరము లేదు. కాని, వారికి కావలసిన ప్రత్యేకమగు ఏర్పాటులు లేనిది లాభ మేమి? స్త్రీని మనము గృహాధిదేవత యనియు, అర్ధాంగలక్ష్మి యనియు పిలుచుచున్నారము. పురుషులతో సమానముగను సంఖ్యయందు ఎక్కువగను కూడ ఉన్న ఈ లక్ష్మీదేవతలను నిరసించిన మన కిహపరములు రెండును లేవు. సంఘశరీరమున సగపాలు చలనరాహిత్యమై యుండిన, ఆ శరీరము విశేషకాలము నిలువఁజాలదు. కావున, వారు గూడ అభివృద్ధి నొందుటకు కావలసిన ఏర్పాటులను జేయుట అత్యంతావశ్యకమై యున్నది.

కొన్ని గొప్ప పట్టణములయందు స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములును పఠనమందిరములును తదితరసంఘములును ఏర్పడుచున్నవి. ఇది శుభసూచకమే కాని, దేశమునం దున్న స్త్రీ లందఱును గాఢాంధకారమున మునింగియున్నప్పుడు ఈ స్వల్పమగు పని ఆవగింజయం దఱభాగమైనను కాదు. కావున, చందా యేమియు తీసికొనకుండఁగనే స్త్రీలు చదువుకొనుటకు గ్రంథములను పత్రికలను వారి గృహములకు పంపు నేర్పాటును ప్రతి గ్రంథాలయమును ప్రతి పఠనమందిరమును చేయవలసియున్నది. ఈ విషయమున ఆంధ్రదేశమునఁ గల కొన్ని గ్రంథాలయములవారు పరిశ్రమ చేయుచుండుట మిక్కిలి ప్రశంసనీయము. కావలసిన గ్రంథములను పత్రికలను ప్రతిదినమును వారికి అందఁజేయుచుండవలెను. ఇంతే కాదు. స్త్రీ లందఱును విద్యావతులు కారు; అందుచే, విద్యావతు లగు కొందఱు స్త్రీల నేర్పాటు చేసి వారిని గృహములకు పంపి, చదువుకొనఁజాలని స్త్రీలకు వారు చదివి వినిపించునట్లు ఏర్పాటు చేయవలెను.

పిల్లలు కూడ వచ్చుటకు మన గ్రంథాలయములయందు బొత్తిగా ఆకర్షణసాధనములు లేవు. స్వాభావికముగ జిజ్ఞాసను సంతృప్తిపఱచుకొనుటకును జ్ఞానపిపాసను దీర్చుకొనుటకును పెద్దలకువలె పిల్లలకును గ్రంథములును పత్రికలును అత్యంతావశ్యకములు. విద్యాభివృద్ధికై పెద్దలకంటె పిల్లలకే ఎక్కువ యవకాశములను కలుగఁజేయవలెను. మఱియు దేశము నుద్ధరింపఁగల మహాపురుషులును స్త్రీలును కూడ వారినుండియే బయలుదేఱుదురు. భావిదశ యంతయు వారిమీఁదనే ఆధారపడియున్నది. కావున, వారిని నిరసించుట భారతజాతి యను మహావృక్షముయొక్క వేళ్లను పెకలించుటయే. అట్టి కార్యముయొక్క ఫలము వేఱె చెప్పవలయునా? పాశ్చాత్యదేశములయం దెల్ల, అందును ముఖ్యముగా అమెరికాదేశమునందు, పిల్లలకు ప్రత్యేక గ్రంథములును పత్రికలును గూడ విశేషముగ కలవు. గ్రంథాలయములయందు వారు చదువుకొనుటకు ప్రత్యేకమందిరములును, వారికి బోధించుటకు ప్రత్యేక భాండాగారికులును కూడ కలరు. ఆ దేశములయం దున్న గ్రంథాలయములలో పిల్లలు చదువుకొనుట కెన్ని సౌకర్యములు కలవో ఊహించుటకైన మనకు శక్తి లేదు. ఏమందురా? అట్టి సౌకర్యములు మన దేశమునందు పెద్దలకు కూడ లేవు.

మన దేశమునం దితరభాషలలో పిల్లలు చదువుకొనఁదగిన ప్రత్యేకగ్రంథములును పత్రికలును కొంతవఱకైనను కలవు. కాని, ఆంధ్రభాష ఈ విషయమున మిక్కిలి వెనుకఁబడి యున్నది. ఈ విషయమై తగినవారు పూనుకొని పనిచేయవలసి యున్నది.

ఈ విధముగ గ్రంథాలయములకు, సాంఘికౌన్నత్యమునకు, వలయు సౌకర్యముల నెల్ల కల్పించుట విధియై యున్నది. ప్రారంభదశయందు మన మీ సౌకర్యముల నన్నిటిని సమకూర్పలేకపోవచ్చును. అంత మాత్రముచేత నిరాశ పొందవలసిన యగత్య మెంత మాత్రమును లేదు. స్వల్పముగ మనము ప్రారంభించినప్పటికిని, దాని యుపయోగము, పట్టుదలతో పనిచేయుచుండినచో, క్రమక్రమముగ నభివృద్ధి యగును.

ప్రతిపట్టణమునందును పల్లెయందును గూడ, గ్రంథాలయము నైన పఠనమందిరము నైన స్థాపించుటకు దేశాభివృద్ధి కోరువా రందఱును నిరంతరము పాటుపడుచుండవలెను. ఉద్యోగస్థులను నిరుద్యోగులను, పూర్వాచారపరాయణులను నవీనసంస్కర్తలను, అగ్రవర్ణములవారిని అంత్యవర్ణములవారిని, పిల్లలను పెద్దలను, అందఱను అచట

చేయుటకు ప్రయత్నింపవలెను. ఏ జాతియొక్క నాగరకతాభివృద్ధికైనను, సాంఘికౌన్నత్యమే ప్రధానము; ఈ సాంఘికౌన్నత్యమునకు సంపూర్ణ సార్వజనిక గ్రంథాలయములు ప్రధానసాధనములు.

కావున, సంపూర్ణ సార్వజనిక గ్రంథాలయములు ఆంధ్రదేశమునం దంతటను నెలకొల్పుటకు దేశాభిమానులును భాషాభిమానులును అగు మహాజనులు ప్రయత్నింతురుగాక!

## II సూరి వేంకటనరసింహము గారు

ఆంధ్రదేశీయుల యభివృద్ధికొఱ కిప్పుడు పాటుపడుచున్న యుద్యమములలో గ్రంథాలయోద్యమ మొకటి. క్రీస్తుశకము 1905 వ సంవత్సరము ఆ ప్రాంతమున మన భరతఖండమున నుద్భవించిన స్వదేశాందోళనము ఆంధ్రదేశమున కూడ వ్యాపించి, ఆంధ్రుల మనంబులలో స్వదేశవస్తువులయందును భాషయందును అభిమానమును పుట్టింపసాగెను. ఇందుకు ఫలితముగ, అదివఱకు దేశభాషలయెడ మిక్కిలి యౌదాసీన్యము వహించెడు ఆంగ్లవిద్యాపారీణులలో కొందఱు తమ శక్తియుక్తులను ఆంధ్రభాషాభివృద్ధికొఱకు వినియోగింప మొదలుపెట్టిరి. దేశభాషాపత్రికలు కొన్ని విద్యావంతుల యాజమాన్యము క్రిందికి వచ్చి సర్వజనాహ్లాదకరముగ ప్రచురింపఁబడసాగెను. ఇంతే గాక, ప్రకృతిశాస్త్రసంబంధమైనట్టియు, మహాపురుషుల జీవితములను గూర్చినట్టియు, దేశచరిత్రలను గూర్చినట్టియు గ్రంథములు, వానికొఱకై ప్రత్యేకముగ స్థాపింపఁబడిన సారస్వతసంఘముల పక్షమున గ్రంథమాలారూపముగ ప్రచురింపఁబడసాగెను. నూతనముగా వెలువడుచున్న ఈ గ్రంథములను దేశభాషాప్రకటనలను తెప్పించి చదువుకొనుటకై అచ్చటచ్చట పట్టణములందును పల్లెలందును సంఘము లేర్పడ మొదలుపెట్టెను. ఈ సంఘములే రానురాను అభివృద్ధి చెంది తుదకు మన సార్వజనిక ధర్మగ్రంథాలయములుగ పరిణమించినవి. ఈ గ్రంథాలయము లన్నియు జనసామాన్యమునందు విద్యావ్యాపకము చేయుటయే ముఖ్యోద్దేశముగాఁ గలవై యున్నవి. ఈ యుద్దేశమును నెఱవేర్చుటకు వేఱువేఱు సంఘములు వేఱువేఱు మార్గముల నవలంబించుచున్నవి. ఇట్లు ఈ సంఘముల సంఖ్య రానురాను హెచ్చుచు, తమతమ యుద్దేశములను కార్యాచరణలోనికి తెచ్చుట కవలంబించు మార్గములు పలు తెఱంగుల ప్రసరించుచుండ, బెజవాడయందలి రామమోహన ధర్మపుస్తకభాండాగార సంఘముయొక్క సభ్యులు, ఆంధ్రదేశమందలి గ్రంథాలయములనుండి ప్రతినిధులను రావించి యా ప్రతినిధుల సభలో గ్రంథాలయోద్యమముయొక్క యభివృద్ధిని గూర్చి ముచ్చటించినచో నుద్యమవ్యాపనమున కెక్కువ యుపయోగకరముగ నుండు నని తలంచి, అట్టి సభను ద్వితీయాంధ్ర మహాజనసభతో పాటు 1914-వ సం. ఏప్రిల్ 10-వ తేదీని బెజవాడ పట్టణమున సమావేశము చేయించిరి. ఆ సభలో, ఆంధ్రదేశమందు ప్రస్తుత మున్న గ్రంథాలయముల నభివృద్ధి నొందించుటకును, క్రొత్త గ్రంథాలయములను స్థాపించుటకును, గ్రంథాలయోద్యమము ప్రఖ్యాతి గాంచిన దేశములయం దీ విషయమున జరగు కార్యక్రమమును మన దేశమందుఁ గూడ దేశకాలపాత్రములకు తగినట్లు మార్పుచేసి ప్రవేశపెట్టుటకును, "ఆంధ్రదేశ గ్రంథభాండాగార సంఘ" మను పేరతో ఒక సంఘము స్థాపింపఁబడి, యద్దానికి బెజవాడ కార్యస్థానముగా చేయఁబడెను.

ఈ సంఘమువారు మొట్టమొదట పూనుకొనిన పని యాంధ్రదేశమందలి గ్రంథాలయము లన్నిటియొక్క చరిత్రను వీలైనంతవఱకు సంపాదించి, గ్రంథరూపముగ ప్రచురించుటయై యున్నది. ఇందుకొఱకై 30 ప్రశ్నలతో కూడియున్న కాగితములను తెలిసినవఱకెల్ల సంఘములకు పంపి జవాబులు తెప్పింపఁబడినవి. సంఘమువారికి తెలియని గ్రంథాలయముల చరిత్రను పంపుటకు ఆయా సంఘముల కార్యదర్శులు పత్రికాముఖమున ప్రార్థింపఁబడిరి. ఇట్లు సంపాదింపఁబడిన చరిత్రవలన 1915-వ సంవత్సరము ఏప్రిల్ నెలవఱకు 163 గ్రంథాలయము లున్నట్లు లెక్కకు వచ్చినవి. ఇందు 1914-వ సం. ఏప్రియలు మొదలు 1915-వ సం. ఏప్రిల్ వఱకు 30 సంఘము లేర్పడినవి. 1915-వ సం. ఏప్రిలునుండి యిప్పటివఱకు 70 సంఘములు నూతనముగా స్థాపింపఁబడినవి. ఈ సంఘము లన్నిటియొక్క చరిత్రయు నూతనముగా తయారు చేయుటకు తిరిగి ప్రశ్నపత్రములు సంఘములకు పంపఁబడినవి. అవి యన్నియు చేరిన పిమ్మట తిరిగి నూతనముగ ఆంధ్రదేశగ్రంథాలయ చరిత్ర ప్రచురింపఁబడును. ఇట్లే యీ యుద్యమముయొక్క యభివృద్ధిని తెలిసికొనుటకుఁగాను ప్రతి సంవత్సరము చరిత్ర ప్రచురింపఁబడుచుండును. ఈ వ్యాసమునం దియ్యఁబడు సంఖ్య లన్నియు 1915-వ సం. ప్రచురింపఁబడిన చరిత్రమునుండియే గ్రహింపఁబడినవి. 1915-వ సం. ఏప్రిల్ నెలవఱ కేర్పడిన 163 గ్రంథాలయములలో నైదు స్త్రీల యుపయోగముకొఱకు స్త్రీలవలననే స్థాపింపఁబడినవై యున్నవి. తక్కినవానిలో చాల సంఘములయందు పురుషులును స్త్రీలును గూడ సామాజికులుగ నున్నారు. ఈ సంఘము లన్నిటియందును ప్రజాసామాన్యమున కందఱకును ధర్మముగా పుస్తకములను వార్తాపత్రికలను ఉపయోగించుకొను నధికారము గలదు. 19 సంఘములకు సొంత భవనము లున్నవి. 12 సంఘములచే పాఠశాలలు గూడ నిర్వహింపఁబడుచున్నవి. 22 సంఘముల యాజమాన్యము క్రింద పురాణపఠనము జరగుచున్నది. కొన్ని సంఘములవారు మాజిక్కు లాంతరు సాహాయ్యముతో ప్రజాసామాన్యమున కుపయోగ మగునట్లు ప్రకృతిశాస్త్రములను గూర్చియు ఆరోగ్యశాస్త్రమును గూర్చియు నీతిసంబంధమైనట్టియు ఉపన్యాసముల నిచ్చుచున్నారు. గంజాము జిల్లా రంభ యను గ్రామమందలి గ్రంథాలయసంఘము గ్రామమునందు దీపములు పెట్టుటకు సదుపాయముల నేర్పఱచి పట్టణపారిశుధ్యమును గూర్చి పాటుపడుచున్నట్లు తెలియుచున్నది. ఒక సంఘమువారిచే పారిశ్రామిక వస్తుప్రదర్శనము జరపఁ

బడినది.' పది సంఘములవారు బహుమతి పరీక్షలను జరపి తన్మూల మున విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నారు. నాలుగు సంఘముల వారు గ్రంథములను కరపత్రములను ప్రచురించుటకు పూనియున్నారు.

ప్రతి గ్రంథాలయమందును కొలఁదిగనో గొప్పగనో గ్రంథములును వార్తాపత్రికలును ఉండును. ఇం దన్నిటికంటె నెక్కువ గ్రంథములు గల గ్రంథాలయమందు 5,000 గ్రంథములును, చిన్న గ్రంథాలయములయందు 200 గ్రంథములును గలవు. ప్రతి సంఘమునకును దానికి తగినట్లు గ్రంథసామగ్రితో పాటు కట్టుసామానులును తదితర పరికరములును కలవు.

గ్రంథాలయములను జిల్లాలమీఁద భాగించినచో నీ క్రింది యంశములు తేలుచున్నవి:

| జిల్లా | | | గ్రంథాలయసంఖ్య |
|---|---|---|---|
| కృష్ణాజిల్లా | ... | ... | 48 |
| గుంటూరుజిల్లా | ... | ... | 33 |
| నిజాము రాజ్యము | ... | ... | 12 |
| విశాఖపట్టణము జిల్లా | | ... | 6 |
| కర్నూలు | ,, | ... | 2 |
| సేలము | ,, | ... | 2 |
| గోదావరి | ,, | ... | 33 |
| నెల్లూరు | ,, | ... | 12 |
| గంజాము | ,, | ... | 6 |
| కడప | ,, | ... | 3 |
| బళ్లారి | ,, | ... | 2 |
| నాగపూరు | ,, | ... | 1 |
| | | మొత్తము | 160 |

ఆంధ్రసారస్వతమం దున్న గ్రంథనామముల నన్నిటిని వీలైనంతవఱకు సంపాదించి వానియందుఁ గల యంశములను బట్టి యా గ్రంథములను విభజించుట యీ సంఘమువారు పూనుకొనిన రెండవ పని. ప్రస్తుతము బరంపురము వాస్తవ్యులగు వెలిదండ్ల శ్రీనివాసరావు గారీ సంఘపక్షమున నీ పనిని నిర్వర్తించి యాంధ్రలోకము యొక్క కృతజ్ఞతకు పాత్రులైరి. ఇదివఱకు 4,000 గ్రంథములు విభజింపఁబడినవి. మిగిలిన గ్రంథనామములను కూడ సంపాదించి విభజించుటకు ప్రయత్నములు జరగుచున్నవి.

గ్రంథాలయశాస్త్రము నాంధ్రదేశమందు వ్యాపింపఁజేయుటకును, మన యాంధ్రవాఙ్మయ మిదివఱ కేయే మార్గముల నవలంబించి యెట్లభివృద్ధి నొందెనో పరిశోధనవలన గ్రహించి సజీవముగా నుండి దేశాభివృద్ధికి సాధనముగాఁ జేయవలె నన్న మన సారస్వత మేయే మార్గముల నవలంబింపవలెనో అందుకు మన మెట్టి ప్రయత్నములు చేయవలెనో, యీను విషయములను లక్ష్య లక్షణ సమన్వితముగ చర్చించుటకు "గ్రంథాలయసర్వస్వ" మను పేరుతో సంవత్సరమునకు నాలుగు పుస్తకములు ప్రచురించుట, గ్రంథాలయసంఘమువారు మొదలిడిన మూఁడవ పనియై యున్నది. ఈ గ్రంథము లిదివఱకు రెండు వెలువడినవి ; మూఁడవ గ్రంథము సిద్ధమగుచున్నది. ఈ గ్రంథమాల దినదినాభివృద్ధి గాంచుచు మైసూరు మొదలగు దూరదేశంబులందలి యాంధ్రుల మనంబులను సైత మాకర్షించుచున్నది. పరమేశ్వరుఁ డీ గ్రంథమాలాసంపాదకులకు తగిన యుత్సాహమును కార్యదీక్షయు నిచ్చి గ్రంథమాల నభివృద్ధి చేయుఁగాత !

ఆంధ్రదేశమం దున్న గ్రంథాలయముల నభివృద్ధి నొందించుటకును, నూతనగ్రంథాలయముల నేర్పఱచుటకును సంచార కార్యదర్శుల నేర్పఱచుటను గూర్చి యాలోచించుట సంఘమువా రుపక్రమించిన నాల్గవ పని. కార్యదర్శుల నేర్పఱచుటను గూర్చి యాలోచింపకముందు, ఆంధ్రదేశము నంతను వేఱువేఱు భాగములుగా విభజించి యొక్కొక్క భాగమం దొక్కొక్క సభ్యుఁడు సంచారము చేసి యచ్చటి గ్రంథాలయోద్యమాభివృద్ధిని గూర్చి పనిచేయున ట్లేర్పఱుపఁబడెను. ఇట్లు పలు సంఘములు సాంఘికులచే దర్శింపఁబడుటయు కొన్ని నూతనసంఘములు స్థాపింపఁబడుటయు జరిగినది. ఆంధ్రదేశ మంతటను తిరుగుట కొక్క సంచారకార్యదర్శి నేర్పఱచినచో పని తృప్తికరముగ జరగదు గావున, కొన్ని చోట్ల తాలూకా కొకరును, మరికొన్ని చోట్ల జిల్లా కొకరును ఏర్పడుట ముఖ్యకర్తవ్యము. ఇట్లు కొన్నికొన్ని తాలూకాలకు సంచారకార్యదర్శు లేర్పడుచున్నారు.

ఇంతవఱ కీ యుద్యమముయొక్క చరిత్ర కొంతవఱకు తెల్పుపఁబడినది. ఇఁక నీ యుద్యమముయొక్క ప్రాప్య మెద్దియో, ఆ ప్రాప్యమును కార్యరూపమున పరిణమింపఁజేయుట కీ గ్రంథాలయ సంఘము లెట్లు సాధనములు కాఁగలవో చెప్పవలసియున్నది.

జనసామాన్యమునం దంతటను విద్య వ్యాపింపఁజేయుటయే ఈ యుద్యమముయొక్క పరమావధి. ఇంతవఱకు మన దేశమున విద్య వ్యాపింపఁజేయుటకు పాఠశాలలే ముఖ్యసాధనములుగా నున్నవి. ఈ పాఠశాలలవలన జను లందఱికి విద్య యబ్బుట లేదు. మరియు పాఠశాలలందు విద్య నభ్యసించినవారలు కూడ జ్ఞాన మనంతము గనుక యావజ్జీవము జ్ఞానసముపార్జనమునకై ప్రయత్నింపవలసినవారుగా నున్నారు. చక్షురక్షురసంయోగమువలన జ్ఞాన సముపార్జనము చేయుట కశక్తు లగువారికిని విద్యావంతులకును కూడ విద్యాభివృద్ధి చేసికొనుటకు గ్రంథాలయములు మిక్కిలి యుపయుక్తములు.

పరిశీలించినచో మన దేశమునందలి జను లందఱి నాలు భాగములుగా విభజింపవచ్చును. ఆంగ్లభాషయందు పాండిత్యము వహించి తన్మూలమున జీవనోపాధి కల్పించుకొని సామాన్యముగా పట్టణములం దుండెడివారు మొదటి తరగతి. ఏ స్కూలు ఫైనలు పరీక్షవఱకో చదివి చదువు తుదముట్టక విఫలమనోరథులై యభ్యసించిన విద్య వృత్తికారి గాక, పల్లెలను పట్టణములను ఆశ్రయించియుండువారు రెండవ తరగతి. ఎలిమెంటరీ స్కూలులలో చెప్పెడి విద్యను మాత్రమే

యభ్యసించి పిమ్మట చదువక సాంప్రదాయకముగా తన యింట వచ్చుచున్న వ్యవసాయమునో మరియే యితరవృత్తినో అవలంబించువారు మూఁడవ తరగతి. పొట్ట పొడిచిన నక్షరము లేనివారు నాలవ తరగతి. మన పూర్వసాంప్రదాయముల ప్రకారము సంస్కృతమందును ఆంధ్రమందును ఉన్న విద్య నభ్యసించి విద్యావంతులుగ నున్నవారైదవ తరగతి. మన పాఠశాలలయందు విద్య నభ్యసించెడువారు ఆఱవ తరగతి. ఈ యాఱు తరగతులవారును తాము విద్య నభ్యసించుచు, తక్కిన తరగతులలో చేరిన తమ సోదరులకు విద్యాదానము చేయుటకు గ్రంథాలయసంఘములే పరమసాధనములు. మొదటి తరగతివారగు నింగ్లీషుభాషాకోవిదులు తామిదివఱకు సంపాదించిన జ్ఞానము నభివృద్ధి పొందించుకొనుటకును రూఢిపఱచుకొనుటకును గ్రంథాలయములను సేవింపవలసినవారై యున్నారు. వారు తాముద్గ్రంథములయందు తెలిసికొనిన విషయములను జనసామాన్యమునకు తెలియునట్లుపన్యాసరూపమున తేటతెల్లముగ బోధించినచో తమకును తమ సోదరులకును ఎంతయో యుపయోగకరముగ నుండును. ఆంగ్లవిద్యను కొంచెముగా నభ్యసించి విఫలమనోరథులైన పల్లెటూళ్లవారు తమ గ్రామస్థుల నందఱను గ్రామసంఘముల యాదరణ క్రింద చేర్చి తాము చదువుకొనిన ప్రకృతి శాస్త్రపాఠములు చరిత్రలు మొదలుగాఁ గల గ్రంథములను ఆంగ్లమునఁ గాని, యాంధ్రమునఁగాని చదివి బోధించినచో మితి లేని లాభము కలుగును. అట్టివారు తమ గ్రామమందలి పండితుల సాహాయ్యమున సంస్కృతాంధ్రముల నభ్యసించి మన దేశసాంప్రదాయములను భాషామర్యాదలను గ్రహించి కృతకృత్యులు కావచ్చును.

ఇట్లు గ్రంథములనుండి చదివి యితరులకు బోధించుటచే నిరక్షరకుక్షులు గూడ జ్ఞానమును సంపాదించుకొనుటకు మార్గమగును. గ్రంథములనుండి చదువుటవలననే గాక మ్యాజిక్కు లాంతరు మొదలగు యంత్రసాహాయ్యములవలనను జనసామాన్యమునకు తెలియునట్లు ప్రకృతిశాస్త్రము పారిశుద్ధ్యము మహాపురుషుల జీవితములు మొదలగు నంశములను గూర్చి యీ సంఘముల యాజమాన్యము క్రింద నుపన్యాసరూపమున బోధింపవచ్చును. సంస్కృతాంధ్రపాండిత్యము గల విద్వాంసులు పురాణపఠనరూపమునను తదితరముగను తామభ్యసించిన విద్యను తమ సోదరులకు బోధించుచు ఆంగ్లభాషాపరిచయము గలవారి సాహాయ్యముతో నూతనముగ పరిశోధనముచే కనిపెట్టఁబడు ప్రకృతిరహస్యములను గూర్చియు చరిత్రాంశములను గూర్చియు జ్ఞానసముపార్జనము చేయవచ్చును. ఇఁక ఆఱవ తరగతివారగు బాలురున్నారు. కొంచెమీడు గల బాలురు గ్రంథముల నుపయోగించుకొను శక్తి గలవారై తన్మూలమున లాభమును పొందుదురు. శిశువులుం కూడ గ్రంథాలయములవలన పొందదగు లాభములు కడు మెండు. ఉపాధ్యాయుల సాహాయ్యముతో గ్రంథాలయములకు పసిపిల్లలను రావించి చిత్రపటముల మూలమునను కథారూపమునను వారికి జ్ఞానమలవడునట్లు చేయుట కూడ గ్రంథభాండాగారాధికారుల విధియై యున్నది. ఇంతే గాక, వారి కథలు భజనలు మొదలగువానివలన జ్ఞానము దేశ మంతటను వెదఁజల్లవచ్చును. ఇట్లు గ్రంథాలయములు అన్ని తరగతుల జనులకును విద్యాదాయకములై దేశాభివృద్ధికి ముఖ్యసాధనములుగా వెలయుచున్నవి.

కావున, గ్రంథభాండాగారము లన పుస్తకములను చేర్చిపెట్టు స్థలములును గ్రంథభాండాగారికుఁ డన ఆ పుస్తకములను భద్రపఱచు కాపరియు కారను సంగతి విశదమగుచున్నది. గ్రంథభాండాగారమున్నట్లు జను లందఱికి తెలియుటకై ప్రచురము చేయుటయు, వారి నా గ్రంథాలయమున కాకర్షించి వారివారి రుచులనుబట్టియు అధికారములను బట్టియు జ్ఞానోపార్జన చేసికొను సదుపాయములను వారికి కల్పించుటయు గ్రంథాలయాధికారుల విధియై యున్నది.

ఇంతవఱకును గ్రంథాలయముల పక్షమున జరగఁగల్గినట్టియు జరగవలసినట్టియు పనిని గూర్చి చర్చింపఁబడినది. ఇఁక ముందు ప్రస్తుత మేర్పడియున్న సంఘముల పక్షమున జరగుచున్న పనిని గూర్చియు అందువలనఁ గల్గుచున్న ఫలమును గూర్చియు ప్రస్తావింపఁబడును.

చాలవఱకు గ్రంథాలయములు సంవత్సరోత్సవములు జరపుచున్నవి. ఇందు కొన్ని గ్రంథాలయము లొక దినమును కొన్ని రెండు దినములను కొన్ని మూఁడు దినములను గూడ నీ యుత్సవముల జరపుచున్నవి. ఈ సందర్భమున దూరముగ నుండు విద్వాంసులను రావించి సకలజనులకు నుపయుక్తముగను నాహ్లాదకరముగను నుండునట్టి విషయములను గూర్చి యుపన్యాసములు జరపఁబడుచున్నవి. ఈ సంవత్సరోత్సవముల మూలమున కలుగుచున్న లాభములు కడు మెండు. మన దేశమందలి విద్వాంసు లెవరో దేశ మంతటికిని తెలియుట కాధారముగ నున్నది. ఆంధ్రరాష్ట్రమందలి యొక భాగమునుండి మరియొక భాగమున కాహ్వానము చేయఁబడి విద్వాంసు లరుదెంచుచు నుపన్యాసము లిచ్చుచుండుటచే, ఆంధ్రదేశమం దంతటను సమిష్టిభావ మభివృద్ధి నొందించుటకీ యుత్సవములు సాధనము లగుచున్నవి. నైజాము రాష్ట్రములోని హైదరాబాదునందు నెలకొల్పఁబడియున్న కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయ సంఘమువారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిని తమ సంఘవర్ధంత్యుత్సవమున కగ్రాసనాధిపత్యము వహించుట కాహ్వానము చేసి తదంగముగ వారికా రాజధానిపట్టణమందు సన్మానపత్రము నొసంగినపుడు నైజాము రాష్ట్రమందలి యాంధ్రుల మనంబులందును బ్రిటీషు పరిపాలనలో చేరిన యాంధ్రుల మనంబులందును నెట్టి యుత్సాహము జనించెనో అట్టి భావ మనుభవైకవేద్యము. ఇందువలన ప్రపంచయందైక్యభావమును పుట్టించుటకు మాతృభావ పరసవేదివంటి దను నంశము వ్యక్తీకరింపఁబడె ననుట సాహసము కాదు. గౌరవనీయులగు పింగళి వెంకటరామారెడ్డిగారు బెజవాడ రామమోహన భాండాగారభవన ప్రవేశ మహోత్సవ సమయమున నగ్రాసనాధిపత్యము వహించినప్పుడును ఇట్టి భావమే వ్యక్తీకరింపఁబడినది.

ఇట్టి సంఘములు జనులయందు దైకమత్యమును సత్ప్రవర్తనను అభివృద్ధి చేయుచున్నవి. జ్ఞానాభివృద్ధి చేసికొనుటకు జను లొక సంఘముగఁ గూడినపుడు తాము సంపాదించుకొను జ్ఞానము తమ తోడివారలకుఁ గూడ నలవడునట్లు చేయుటకు తగిన విధానములను కల్పించుటకు ప్రయత్నించుట సహజమే కదా? ఈ సంఘముల యాజమాన్యము క్రింద రాత్రిపాఠశాలలును, బాలికాపాఠశాలలును, బహుమతీపరీక్షలును, గ్రంథములయొక్కయు కరపత్రములయొక్కయు ముద్రణమును జరుగుచుండుట యిందుకు తార్కాణముగ నున్నది. ఇంతే గాక, తాము చదువుకొని తెలిసికొనిన యంశములను రూఢిపఱచుకొనుటకును, తమ తోడివారలకుఁ గూడ బోధపఱచుటకును, ఈ సంఘముల పక్షమున వారమున కొకతూరి సాంఘికులు తాము చదివి గ్రహించిన యంశములను ఉపన్యాసరూపముగ చెప్పునట్టి యేర్పాటు లున్నవి.

మరియు నీ సంఘములలో కొన్ని చట్టముల ప్రకారము రిజస్టరు చేయఁబడినవి. ఈ సంఘము లన్నియు సామాన్యసంఘముచేతను కార్యనిర్వాహకసంఘముచేతను పరిపాలితము లగుచున్నవి. ఈ సంఘము లన్నియు నిబంధనలకు లోనై నడపఁబడుచుండును. ఆదాయవ్యయములు తెలియుటకును, సంఘముయొక్క ఆస్తి తెలియుటకును తగిన లెక్క లుంపఁబడి, సంవత్సరాంతమున నీ లెక్క లన్నియు నాడిటరుచే సరిచూడఁబడి, ఆదాయవ్యయములను తెలియఁజేయు పట్టిక ప్రచురింపఁబడుచుండును. సభ లెట్లు జరపవలెనో, తీర్మానములను ప్రవేశపెట్టుట యెట్లో, దానిని నిర్వహించు టెట్లో సంఘములందు సాంఘికులు నేర్చుకొనుచున్నారు.

ఆధునికాంధ్రగ్రంథాలయోద్యమము స్వదేశాందోళనముతో పుట్టిన దని చెప్పియుంటిమి. ఇందువలన మా యభిప్రాయ మేమన: గ్రంథాలయస్థాపన, ప్రత్యేకోద్యమముగా మన దేశమున వ్యాపించుటకు ప్రారంభించినది 1905-వ సం. ప్రాంతమున అని గాని, అదివఱకు ఆంధ్రగ్రంథాలయములు మన దేశమున లేవని కాదు. 1892-వ సం.న కీర్తిశేషురా లయిన విక్టోరియా మహారాజ్ఞి గారి డైమండు జూబిలీ సందర్భమున కృష్ణా జిల్లా భీమవరపు తాలూకా కుముదవల్లి గ్రామమున వీరేశలింగకవిసమాజ మను పేరుతో ప్రస్తుతగ్రంథాలయముల కుండునట్టి యుద్దేశములతోనే ఒక సంఘము స్థాపింపఁబడి దినదినాభివృద్ధి గాంచుచున్నది.

మునగాల యెస్టేటు జమీందారు గారును, కీర్తిశేషు లగు రావిచెట్టు రంగారావు గారును 1901-వ సం. సెప్టెంబరు 1-వ తేదీని నైజాము రాష్ట్ర రాజధాని యగు హైదరాబాదునందు "కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము"ను స్థాపించియున్నారు. ఈ సంఘము 1500 గ్రంథములతోను నూటయేఁబదిమంది చందాదారులతోను రు 1166-0-0ల మూలధనముతోను విరాజిల్లుచున్నది.

1900 ల సంవత్సరమున ప్రస్తుతము "సార్వజనికగ్రంథాలయ" మను పేరఁ బరఁగుచున్న "వీరేశలింగపుస్తకభాండాగారము" నాళము కృష్ణారావు గారిచే రాజమహేంద్రవరపట్టణమున స్థాపింపఁబడి 5,000 గ్రంథములతోను 150 మంది పాఠకురాండ్రతోను 206 మంది మగ చందాదారులతోను విరాజిల్లుచున్నది.

ఇంతవఱకు ఈ యుద్యమముయొక్క చరిత్రయు ఇందువలన దేశమునకుఁ గలుగు లాభములును ఈ యుద్యమపక్షమున జరుగుచున్న కృషియు ప్రస్తావన చేయఁబడినవి; ఈ యుద్యమమునందు దేశాభివృద్ధికి ముఖ్యసాధనములగు బీజము లిమిడియున్నవి. ఇందువలన రాఁగల లాభమంతయు దేశమునకు చేకూరవలె నన్న ఇప్పు డిందుకై పాటుపడుచున్న కొలఁది సంఖ్యగల యువకు లీ పనిని నిర్వర్తించుటకు చాలరు. ధనవంతులు ధనము నర్పింపవలెను. విద్యావంతులు తమ విద్యను ధారవోయవలెను. విశ్రాంతి కలవారు తమ విశ్రాంతి సమయము నిందుకొఱకే వినియోగింపవలెను. అప్పుడే మన యాంధ్ర రాష్ట్ర మభివృద్ధికి వచ్చును. అప్పుడే మన దేశమునుండి యజ్ఞాన దేవతను పాఱఁదోలఁగల్గుదుము. అప్పుడే ఆంధ్రులు ప్రత్యేకవ్యక్తి కలవా రనియు వారికిఁ గూడ ప్రత్యేకవిజ్ఞాన ముండియున్న దనియు తోడి జాతులవారు గ్రహించుటకు అవకాశము కల్గును. అప్పుడే ఆంధ్రులకు పూర్ణమైన సభ్యత లభించును. కావున నో యాంధ్ర మహాజనులారా! దేశాభిమానులారా! భాషాభిమానులారా! ఈ శైశవావస్థయం దున్న గ్రంథాలయోద్యమమునకు తాము కేలూఁత నొసఁగి దానిని దేశాభివృద్ధి సాధకముగఁ జేయుఁడు.

సత్తు నసత్తు నాక నవసంఖ్యయుఁ బోలె ననేకసంపదా
పత్తతి తన్ గుణించిన, స్వభావగుణాం బెపుడున్ వికల్పతా
వృత్తిని రూపభేదగుణవృద్ధుల నొందిన నొందుఁ గాక, తా
మొత్తముమీఁదఁ గోల్పడదు ముల్మొనయంతయు నాత్మభావమున్.

చ. పరవిషయంబులం దొకని భావము నిర్మలతార్జవంబులన్
బరఁగును గాక, యయ్యదియె స్వార్థమునన్ బ్రసరించునంతనే
యురుకుటిలత్వ మూని కల యునికి బయల్పడ రంగు లీనఁగా
దొరఁకొను, గాజుపల్పలకఁ దోఁచు ప్రభాఋజురేఖ చాడ్పునన్.—కా. గో. రా.

# విజయనగరము మహారాజు గారి కళాశాల

ఈ కళాశాల మొట్టమొదట 1857-వ సం. న విజయనగర సంస్థానాధీశులును మహాపండితులును విద్యాభిమానులును నగు మహారాజా సర్ విజయరామ గజపతి గారిచే చిన్న పాఠశాలగా స్థాపింపఁబడినది; 1868-వ సం. న ఉన్నతపాఠశాలగా చేయఁబడినది; 1879-వ సం. రెండవ తరగతి కళాశాలగా స్థాపింపఁబడినది. ఆ మహామహులు విజయనగరమును విద్యానగరము చేయవలె నను కుతూహలముతో సంస్కృతవిద్య నేర్పుటకు మఱియొక కళాశాలను కూడ స్థాపించిరి. చిరకాలమువఱకు విజయనగరము ఆంధ్రదేశమునకు నవద్వీపముగా నుండినది.

వారి తర్వాత వారి కుమారులు మహారాజా సర్ ఆనంద గజపతి గారు తండ్రివలెనే విద్యావిశారదులును విద్యాభిమానులును నగుటచే, ఈ రెండు ప్రతిష్ఠాపనలను పోషించుటయే కాక యాంగ్ల కళాశాలను మొదటి తరగతి కళాశాలగా చేయించి పట్టపరీక్షలకు విద్యార్థులను పంపుచుండుట గావించిరి.

ఆనందగజపతి మహారాజు గారి యౌదార్యమును వారి విద్యాభిమానమును వర్ణింపఁదరము కాదు. వారు సంస్కృతము ఇంగ్లీషు పెర్షియన్ మొదలగు భాషలను వాఙ్మయములను బాగుగా నేర్చినవారు. ప్రస్తుతము కోటలో నున్న పుస్తక భాండాగారమే వారి పూర్వోక్త గుణములకు నిదర్శనము.

మొట్టమొదట సి. చంద్రశేఖర శాస్త్రి బి.ఏ. గారు కళాశాలకధ్యక్షులుగా నుండిరి. తర్వాత కిళాంబి రామానుజాచార్యులవారిని విజయనగరము మహారాజా గారే యభివృద్ధిలోనికిఁ దెచ్చి ప్రథమమున వైసు ప్రిన్సిపలుగాఁ జేసిరి. సుమారు 20 సంవత్సరములనుండి రావు బహదూరు రామానుజాచార్యులు గారే కళాశాలాధ్యక్షులుగా నున్నారు. కళాశాలకు చేరిన యున్నతపాఠశాల దినదినాభివృద్ధిఁ జెందుచున్నది. ఈ సంవత్సరము డిసెంబరు నెలనాఁటికి దాదాపు 1300 మంది విద్యార్థులు గలరు.

మొదట బి. ఏ. పరీక్షకు గణితశాస్త్రమును రసాయనశాస్త్రమును తర్కశాస్త్రము నుండెను. మూఁడు సంవత్సరములనుండి గణితశాస్త్ర ప్రధానోపన్యాసకులుగా నుండిన మాధవరావునాయఁడు గారుద్యోగము మాని యుపకారవేతనమును బొందుచున్నారు. కాఁబట్టి గణితశాస్త్రమందు విద్య నేర్పుట లేదు. 2 సంవత్సరముల క్రిందట చారిత్రకశాస్త్రము పెట్టవలె నని కాకినాడ కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా నుండిన ఎమ్. వేంకటరంగయ్య ఎమ్. ఏ. గారిని తీసికొనివచ్చి చారిత్రక శాస్త్రమునకు ప్రధానోపన్యాసకులుగాఁ జేసిరి. తర్కశాస్త్రోపన్యాసకులుగా నుండిన వేంకటరాయశాస్త్రి గారు స్వర్గస్థు లగుటచే వారి స్థానమందు ఎన్. వెంకట్రామన్ గారు నియమింపఁబడిరి. ఇందలి యుపాధ్యాయు లనేకులు పరీక్షకులుగా నియమింపఁబడి విశ్వవిద్యాలయముచే గౌరవింపఁబడియున్నారు.

క్రమముగా కళాశాల వృద్ధిపొందుచున్నది. 1908-వ సంవత్సరమువఱకు తఱచుగా నింగ్లీషునందు ఇక్కడి విద్యార్థులే మొదటివాళ్లు బంగారుపతకమును సంపాదించుచుండెడివారు. రసాయనశాస్త్రమందు గౌరవము నొందుచుండెడివారు. ఒకానొకప్పుడు మొదటి తరగతియందు జయ మందుటయు విశ్వవిద్యాలయపువారి పతకము నొందుటయుఁ గూడ సంభవించుచుండినది. ప్రస్తుతము రాజధానికళాశాలలో రసాయన శాస్త్రోపన్యాసకులుగా నున్న గుళ్లపల్లి సాంబమూర్తిగారు రాజధానిలోని విద్యార్థు లందఱిలోను మొదటివారుగా జయమొంది గౌరవమును దెచ్చిరి.

ఇప్పుడు విద్యార్థుల సంఖ్య హెచ్చుగా నున్నది. కళాశాలలో మంచి పుస్తకభాండాగార మున్నది. వ్యాయామక్రీడలకుఁ దగిన సదుపాయము లున్నవి. విద్యార్థి భవనము లేదు గాని ఒక సంవత్సరములో నట్టిది తయారగు నని చూచుచున్నాము. శంకుస్థాపన మయినది; కట్టుట ప్రారంభింతురు. మధ్యమపరీక్షకుఁ జదువు బాలురకును పట్టపరీక్షకుఁ జదువు బాలురకును కొందఱికి సంస్థానమువారు వేతనము లిచ్చుచున్నారు. అది కాక మహారాజాగారి సత్రమొకటున్నది. అందులో సుమారు 150 మంది విద్యార్థులకు నిత్యము నుచితముగా భోజనము పెట్టుదురు. క్షత్రియబాలురకు కళాశాలలో జీతము విషయము సదుపాయము లున్నవి. ప్రస్తుతము రసాయన శాస్త్రమునకు కొంత లాభము చేయుచున్నారు. సుమారు 50,000 రూపాయలు ఖర్చుపెట్టి నూతనముగా నొక భాగమును గట్టుచున్నారు. ఈ నడుమ 4 లక్షల రూపాయలు పెట్టి యొక దివ్యభవనమును కళాశాలకొఱకు కట్టవలె నని యోచించిరి. యుద్ధము వచ్చుటచే నా సొమ్ము యుద్ధనిధి కియ్యఁబడినది.

కళాశాలాధ్యక్షులు రామానుజాచార్యులుగారు కళాశాలను వృద్ధిలోనికిఁ దెచ్చిరని చెప్పవలెను వారు క్రొత్తగా గౌరవ పట్టపరీక్షలయందు గౌరవము నందినవారి నుపన్యాసకులుగా నియమించి ప్రోత్సాహము చేయుచున్నారు. వా రాంధ్రు లగుటచే నాంధ్రదేశాభివృద్ధియందు వారి కభిమానము మెండు. ఆంధ్ర. విశ్వవిద్యాలయ మొకటి యావశ్యక మని వారు గడచిన యాంధ్రమహాజనసభయందుపన్యాసము నిచ్చియున్నారు.

మన యాంధ్రు లందఱును విశ్వవిద్యాలయము కావలె నని ప్రస్తుతము యోచించుచున్నారు గాని, మహారాజా ఆనందగజపతి గారు జీవించియుండిన కాలమున నాంధ్రులకు ప్రత్యేక విశ్వవిద్యాలయ మొకటి కావలె నని తగిన ప్రయత్నములు చేయుచుండిరి. సుమారు 30 సంవత్సరముల క్రిందట నిట్టి తలంపుతోఁ బ్రయత్నించుచుండిన యా మహానుభావుని దేశాభిమాన మెవరికి కలదు ? అయినను విజయనగరసంస్థానాధీశులు విశ్వవిద్యాలయమునకు సాహాయ్యము సంగవలయు నని యాంధ్రదేశము నిరీక్షించుచున్నది. కుమార మహారాజాగారు సంస్థానాధిపత్యము వహించినప్పుడు తమ కుటుంబ గౌరవమును జ్ఞాపకముంచుకొని విశ్వవిద్యాలయము విషయము తగిన ప్రయత్నము చేయుదు రని ప్రజలు నమ్ముచున్నారు.

# రామచిలుక

సోదరకవులు, పిప్పర

చైత్రరథనందనములకు సాటి యగుచు
వివిధవికసితతరులతావితత మగుచు
విపులతరవాహినీతటద్విభాగ మగుచు
నొక్క యుపవన మలరారు నుర్వియందు. 1

తే. చెప్పఁగారాని సంపద నొప్పు మిగులు
నవ్వనంబున వసియించు ననవరతము
ధీరనాథుఁడు నా నొక కీరనాథుఁ
డెంతయు వయస్సుధీవయోవృద్ధుఁ డగుచు. 2

తే. అవ్వనంబున వసియించునట్టి యెల్ల
కీరగణ మాతనికిఁ జేయు గౌరవంబు;
అతఁడు నప్పక్షిగణము నత్యాదరమున
నేలుకొనుఁ గీడు మేళ్లకుఁ బాలుపడుచు. 3

తే. సంతతానందహృదయుఁడు శాంతమూర్తి
యాతఁ డవ్వని నెప్డుఁ బాయండు; వాని
తాతముత్తాత లందఱు దానియంద
పుట్టి గిట్టి రతండును బుట్టె నచట. 4

క. ఇమ్ముగ నొక వటవృక్షపుఁ
గొమ్మను దగు గూఁడు గట్టుకొని యం దాహా
రమ్మచటి చుట్టుపట్ల ర
యమ్మునఁ దాఁ దెచ్చుకొని ప్రియమ్మున నుండున్. 5

తే. మంచు చినుకులు జాఱెడు మంచి వేళఁ
జెట్టుకొమ్మల కెగయుచుఁ జెలువు నూపు;
కలయ నీరెండ గాయు బంగారు వేళ
గుంపుతో నొక్కపరి వ్రాలి కొమరు నూపు. 6

తే. ఇట్టు లుండఁగ నొకనాఁ డహీనవృత్తి
నప్పతంగవరుండు విహారసరణి
తనదు యూథంబుతోఁ గొంత దవ్వు పోయి
యిష్టఫలభోజియై పరితృప్తుఁ డగుచు. 7

తే. మగిడి యిలు సేరుతటికి దైవగతి నతని
వాసమై యొప్పు నవ్వనభాగమందు
దావదహనంబు దరికొని దారుణముగ
భస్మ మొనరించె నొకకొంత ప్రాంతరంబు. 8

తే. అంత నక్కీరవరము రయంబు మీఱ
సఖులతో వచ్చి గుండెలు ఝల్లు మనఁగ
పూర్వభంగికి వింతయై యోర్వరాని
వగపుఁ బొడమించు మన్న యవ్వనముఁ జూచి. 9

తే. శోకభరమగ్నుఁ డగుచు నా శుకవరేణ్యుఁ
డశ్రుపూరంబు గ్రక్కు నేత్రాంచలముల
తోడఁ గంపితగాత్రంబుతోడ ధరణి
నట్టె చదికిలఁబడె వివశాత్ముఁ డగుచు. 10

తే. తక్కిన శుకోత్కరంబు చిత్తంబులందుఁ
జాలిగొను చింత నప్పల్లు చుట్టుఁ జేరి
చేయుటకుఁ దోఁప కేమియుఁ బాయరాని
దైవసంగతి నాత్మలఁ దలఁచుకొనుచు: 11

ఆ. పొక్కుచుండె, నంత భూరిచిత్తుఁడు ధీర
నాథుఁ డింత దేఱి నలుఁగడఁ గను
గూలఁబడిన మిత్రకోటిఁ గన్గొని యల్ల
నిట్టులనియె నంత రట్టు వెట్ట: 12

తే. "అకట! దైవంబు మృదుచిత్తుఁ డగుట యెట్లు?
సాధుతరజీవములకు నాశ్రయద మగుచుఁ
గనులపండువు సేయు పచ్చని వనంబు
నిట్టుల పోకార్చె; సదయత యిట్టి దొక్కొ? 13

తే. ఏ కనులతోడ మున్ను నే నీవనంబు
ప్రకృతిలక్ష్మీవిలాససంపన్న మనుచుఁ
గాంచినాఁడనో? ఇప్పు డా కనుఁతోడ
వనికి వడనీరు గార్పఁగావలసె నకట!" 14

తే. ఇట్టు లనుచును శుకరాజు పట్టరాని
సేగి నొక్కింత తడవు విచేష్టుఁ డగుడు,
సర్వకీరంబులును దద్దశావిశేష
మునకు వనరుచు నాతని ముసరి యపుడు. 15

తే. ముక్కు ముక్కునఁ జేరిచి మోము దుడిచి,
ఱెక్క లల్లార్చి చెమ్మటల్ సక్కఁజేసి,
త్రోటిఁ జెదరిన ఱెకలఁ బొటుపఱచి
యుపచరించిన నవ్విహంగోత్తమంబు. 16

తే. కొంతవడికిని దేఱి హృదంతరమునఁ
బూర్వవనవైభవంబు నపూర్వ మనుచుఁ
దలఁచితలఁచి విచారింపఁ దలఁకొనుటయుఁ,
అతని కీరీతి ననియె విహంగచయము: 17

తే. "దైవికంబుగఁ బ్రాప్తించుదాని కిట్లు
వగతురే ధీరచిత్తులు? ఖగకులేంద్ర!
వసుధ సర్వావనీరుహాభరితవనము
లెన్ని లే వాశ్రయింప ఖగేంద్రములకు? 18

తే. తాన పుట్టించు; గిట్టించుఁ దాన మరల.
అది స్వభావంబు విధికి నిరంతరంబు;
దీని కీలక మెఱిఁగి సుధీరు లెపుడు
సేగి నొందరు యోగవియోగములకు. 19

తే. ఈ వనము పోయె నని మన కింత యేల?
వింధ్యధరణీధరంబున వేనవేలు
వనము లున్నట్లుగా వినవచ్చుచుండు,
వేగ పోదము లెం! డట కీ గడియనె." 20

తే. నాఁగఁ దహతహపడి ధీరనాథుఁ డనియె:
"అక్కటా! యిట్టి మాట మీ రాడఁదగునె?
ఎంత కఠినాత్ములకు నైన కృతము మఱువ
వచ్చునే? దైవ మట్లైన మెచ్చునెట్లు? 21

తే. ఎచటఁ బుట్టితిమో? మన మెచట సతము
శేమసుఖములతోడ వసించినాము?
అట్టి వనమును కటకటా! యెట్టు లిపుడు
విడిచి చన నొప్పఁ దలఁచుఁడీ! విహగవరులు!" 22

క. అనుటయుఁ బకపక నగి యి
ట్లను నక్కీరోచ్చయం "బయారె! ప్రవాగ్మిన్
వన మెల్లఁ గాలిపోయిన
మన మిచ్చట నిలుచు టెట్లు? మను టెట్లు దగన్? 23

క. పోసఁగదు నీ వాక్యము; మన
బస నిత్తఱి మార్పవలయు; వని నెల్లెడలన్
బసుమంబె యెగురుచున్నది;
పస చెడె శేషావనీజపటలియుఁ గనుమా. 24

క. ఉన్నంత కాల ముండుర;
సన్నను నెవరైనఁ గూడఁ జని చత్తురె? నీ
వన్నది సరసముగా లే;
దన్నియమము పెట్టుకొనిన నగునే మనకున్? 25

క. లె మ్మేఁగుద మింకొక్క వ
నమ్మునకు" ననంగ ధీరనాథుఁడు "నా వా
క్య మ్మొక్కటి విని యది విహి
త మ్మేనం గొనుఁడు విడువఁదగుఁ గాదేనిన్. 26

క. జననియును జన్మభూమియుఁ
జను స్వర్గముకంటె నధికసంప్రీతిద మై
యని పెద్ద లందు; గందును
జననియు నా జన్మభూమి సరి కా దరయన్ 27

క. జనని యొక కొన్ని నెలలే
తన యుదరమునందుఁ దాల్చు, ధాత్రి శరీరిన్
జననము మొద లామరణము
మనుచుంగద! పూజనీయ మాతకుఁ దలఁపన్. 28

క. అది యటు లుంచుఁడు, కట్టా!
'ఇది నాకుం జన్మభూమి; ఇది నా సొంతం;
బిది నాదు స్వదేశం' బని
మది గర్వింపని శవంబు మహిని గలుగునే? 29

క. కావున నిత్తఱి మనకున్
వావిడిచి ప్రియోపవనముఁ బాయుట విసుఁడీ
కేవలపాశకహేతువు
జీవచ్ఛవ మెవ్వఁ డట్లు చేయఁదలఁచునో? 30

క. అనయము మన మందఱకున్
బొనరె వనేతరఫలాళి భుజియించు నెడన్
గొనకొని తద్బీజములన్
దవరఁగఁ గొని తెచ్చి యిందు నాటఁగవలయున్. 31

క. అటు లొక్క కొంత కాలము
పటుదర్పస్ఫూర్తిఁ బాటుపడిన వనం బె
ప్పటికన్న మిన్నయై చె
ప్పటకును నలవడని విభవమునఁ జొప్పడదే?" 32

క. అనుటయుఁ గొన్ని శుకమ్ములు
మనమున నిది లెస్స యనుచు మన్నించెఁ గడున్;
మన కది దుర్ఘట మని కొ
న్ని నిరుత్సాహమున ప్రబంగి నీతి దొఱంగెన్. 33

క. నీతి దొఱంగిన వెల్ల వ
నేతరముల కేఁగుచుండ, నేపని నైనన్
జేతుము నీతో నని సం
ప్రీతిగ నొక కొన్ని యనుగమించెన్ వానిన్. 34

క. పనిచేయ వచ్చుతఱి కొ
ప్పిన యక్కీరముల సంఖ్య వెండియుఁ గుఱచై
మన ధీరనాథు మనమున
సునిశితధృతి పట్టుదలయుఁ జొబ్బిలఁజేసెన్. 35

క. చనినవి చనఁగాఁ దుద కా
తని కొక్క శుకంబు మాత్ర తగు సాహాయ్యం
బొనరించెఁ; దద్ద్వితీయుఁడు
మన శుకనాథుండు ధైర్యమహిమన్ బెలుచన్. 36

క. నలుదెసలఁ గలుగు నుపవన
ముల కేఁగుచు భుక్తఫలసముత్కరబీజం
బులఁ దద్వనమున నునుచుచుఁ
గులాయమును గట్టెఁ బూర్వకుజమండమునన్. 37

క. "శ్రీరామ! రామ! దశరథ
భూమీధవపుత్ర! పరమపురుష! యనంతా!
నీ మది నెంచి మదీయా
రామమ్మున్ బెనుపవే! కర మ్మనురక్తిన్." 38

గీ. అనుచు నిశ్చలభక్తి హృదంతరమున
తత్పదాంభోజయుగళంబు దలఁచుచుంటఁ
గీరనాథుఁ డతఁడు జగద్గీతకీర్తి
రామచిలుక యటంచు పేర్వడసె జగతి. 39

క. ఆ రీతి సకలవిధములఁ
జేరంది నిజోపవనముఁ బెనుచుటకు సతం
బా రామచిలుక ధృతి దయి
వాఱ యథాశక్తిఁ బాటుపడి పనిసేయన్. 40

క. కాలక్రమమున నతని సు
శీలత మెప్పింప, విధి వశీకృతచిత్తుం
డై లక్ష్మిసర్వస్వా
వాలం బై యుపవనంబు పొలిలఁజేసెన్. 41

తే. అటుల తన పూన్కి నెఱవేర్చి యా శుకంబు
తనదు జన్మము ధరణి సార్థకము గాఁగఁ
జేసికొనుటయె కాక నిస్సీమకీర్తిఁ
బేరు దెప్పించెఁ దనజాతివారి కెల్ల. 42



KUGLAR HOSPITAL, GUNTUR

కుగ్లరు అసుపత్రి, గుంటూరు



NURSES HOME: KUGLAR HOSPITAL GUNTUR

కుగ్లరు అసుపత్రి : పరిచారకుల గృహము



CHILDREN'S WARD: KUGLAR HOSPITAL, GUNTUR

బాలక్షేమము : కుగ్లరు వైద్యశాల, గుంటూరు

# ఆంధ్రదేశము -- వైద్యసాహాయ్యము

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు గారు, ఏ. వి. యస్., ఏ. యం. బి.

ఆంధ్రులు, వారి యారోగ్యము, వైద్యసాహాయ్యము మొదలగునవి ప్రకృతాంశములు. చెన్న రాజధానియందలి కొన్ని జిల్లాలును నైజాము రాజ్యమందలి కొన్ని జిల్లాలును చేరి ఆంధ్రదేశ మని వ్యవహరింపఁబడుచున్నది. ప్రకృతము వ్రాయఁబోవు నంశముల నుద్దేశించి గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్లారి, అనంతపూరు, చిత్తూరు జిల్లాలను మాత్రము ఆంధ్రదేశముగ గ్రహించినాఁడను. ఈ పదునొకండు జిల్లాలును 78,442 చదరపు మైళ్ల వైశాల్యము గలవి. ఇందు అన్ని తెగలకు చెందిన 1,66,94,708 మంది ప్రజలు గలరు. ఇందలి యాంధ్రసోదరులకు వైద్యసాహాయ్య మెట్లు జరగుచున్నది యను విచారణీయము.

1915-వ సం. పు నివేదిక యింతవఱకు లభింపలేదు. వైద్యశాఖాధికారి ప్రకటించిన 1914-వ వత్సరపు నివేదిక ననుసరించి యీ క్రింది యంశములు వ్రాయుచున్నాఁడను.

ఆంధ్రదేశమునందు దొరతనమువారిచేతను, లోకల్ ఫండు మునిసిపల్ సంఘములు మిషెనరీలు పోలీసువారు మొదలగు సంస్థల చేతను పోషింపఁబడు పాశ్చాత్యవైద్యశాలలు 222 గలవు.

పై వైద్యశాలలయందు ఐ. యం. ఎస్. ఆఫీసర్లు, సివిల్ అసిస్టెంటు సర్జనులు, సివిల్ అపాతికరీలు, సబ్ అసిస్టెంటు సర్జనులు, లేడీ అపాతికరీలు, లేడీ డాక్టర్లు, మొత్తమునకు అన్ని రకముల చికిత్సకులును 322 రు గలరు.

పై వైద్యశాలలయందు, వైద్యశాలలలో నుండియు బైట నుండి మందుకై వచ్చియు, సంవత్సర మాధ్యంతము వైద్యసాహాయ్యము నందిన రోగులు 26,96,042 రు అని తెలియుచున్నది. రోగుల మొత్తమునకు మందులకై రు. 1,70,115 లును, పథ్యోపచారములకై రు. 53,068 లును, వైద్యుల జీతములకై రు. 3,34,812 లును, చిల్లర ఖర్చులకై రు. 66,787 లును, ఇండ్లకై రు. 1,91,821 లును, మొత్తము మీఁద వైద్యశాఖకై రు. 8,26,603 లు వ్యయపడినట్లు తెలియుచున్నది. ఈ ఖర్చు మొత్తములో దొరతనమువారు జీతములు మొదలగువానికై రు. 1,62,983 లును, లోకల్ ఫండువారు రు. 4,40,037 లును మ్యునిసిపల్ వారు రు. 1,51,405 లును, ధర్మాత్ములు రు. 28,249 లును ఇచ్చినట్లు తెలియుచున్నది.

ఈ యంకెలను బట్టి చూడ, రు. 8,26,603 ల నుండి 26,96,042 రు రోగులు చికిత్సాసాహాయ్యమును పొందినట్లును, అందు రోగి యొకనికి రు. 0-4-10½ లు ఖర్చుపడినట్లును గన్పట్టుచున్నది.

ఈ మొత్తము రూపాయిల ఖర్చులలో గమనింపఁదగిన ముఖ్య విషయములు కొన్ని గలవు. జీతములకై వ్యయపడు రు. 3,34,812 లను అల్పవేతనములను గ్రహించు సివిల్ అసిస్టెంటు సర్జనులకుఁ గాని సబు అసిస్టెంటు సర్జనులకుఁ గాని ఖర్చుపడియుండ వనుట స్పష్టము. ఇంత మొత్తము ఎట్లు ఖర్చుపడుచున్న దని యోచించిన, ఒకజిల్లాకు అధమము ఒక ఐ. యం. యస్. ఆఫీస రుండుటయు, ఆ యుద్యోగి నెలకు వెయ్యి లేక పదునైదు వందల రూపాయలకు తక్కువ గాని జీతము గ్రహించుటయు సర్వజనవిదితము. ఏ జిల్లా యందు వ్యయము తక్కువ కనఁబడునో అచ్చట ఐ. యం. యస్. ఆఫీసరు లేఁ డనుట స్పష్టము.

మందులకై రు. 1,70,115 ల ఖర్చు చూపఁబడినది. వైద్యుల జీతములకై వ్యయ మగునంతటి మొత్తము కూడ మందుకై వ్యయపడున ట్లగపడదు. ఈవిషయమై పాఠకులకు వైద్యశాలలయందు వెలగల మంచి మందుల నిచ్చెదరా యను సంశయము పొడమకపోదు. ఇఁక పథ్యమునకై కనఁబడు రు 53,068 ల సంఖ్యను జూచెదమా, ఈ శాలల చిల్లర ఖర్చులకై వ్యయపడు రు 66,787 ల మొత్తమంత గూడ నగపడదు. మఱియు చికిత్సాసాహాయ్యమును పొందిన రోగుల మొత్తము సంఖ్యను బట్టి పథ్యాచరణమును యోచించినచో, పాశ్చాత్యపద్ధతి వైద్యులు కూడ మన ప్రాచీనవైద్యపద్ధతియందలి లంఘనచికిత్స నవలంబించిరా యను సంశయము తోఁపకమానదు.

ఈ పదునొకండు జిల్లాలయందును 222 వైద్యశాలలు గలవని తెలిపియుంటిని. ఈ వైద్యశాల లెట్లు పోషింపఁబడుచున్నది యు మనవారిలో ననేకులకు తెలిసియుండదు. వాని వివరములను వైద్యశాఖవారు ప్రచురించిన నివేదికయందలి లెక్కలనుండి పైన కనఁబఱచియుంటిని. అందులో వైద్యశాలలకై దొరతనమువారు జీతములకును గృహనిర్మాణములకును రు. 1,62,983 లు ఇచ్చియున్నారు. ఇందు కడప బళ్లారి నెల్లూరు జిల్లాలయందు వైద్యశాలలు కట్టుటకై యిచ్చిన రు 1,25,913 లు పోను రు. 37,070 లు మాత్రమే దొరతనమువారు వైద్యసాహాయ్యమునకై యిచ్చినట్లు తెలియుచున్నది. ఈ యంకెలను బట్టి చూడ, వైద్యసాహాయ్యమున లోకల్ ఫండువారు ప్రథమగణ్యు లనియు, మ్యునిసిపాలిటీవారు ద్వితీయు లనియు తెలియుచున్నది. దొరతనమువారు చేయు సాహాయ్యమును చూతమా, వారి ఐ.యం.యస్. ఆఫీసర్ల రెండు నెలల జీతమునకైనను చాలన ట్లగపడుచున్నది. పైన కనఁబఱుపఁబడిన వివరములనుండి వైద్యశాఖయందలి వ్యయమునకై వినియోగింపఁబడు ద్రవ్యము ఏయే శాఖలనుండి వచ్చుచున్న దియు విశదము కాఁగలదు.

పై వైద్యశాలలయందు కార్యములను నిర్వహించు చికిత్సకులు మాత్రము దాదాఁపు 322 రు గలరని తెలిపియుంటిని. జిల్లా ముఖ్యస్థానముల యందలి పెద్ద వైద్యశాలలలో ఐ. యం. యస్. ఆఫీసరు, సివిల్ అసిస్టెంటు సర్జను, సబు అసిస్టెంటు సర్జనులును ఉండుట కలదు. ఆయా జిల్లాల ప్రధానస్థానముల నుండు అధికసంఖ్యాకు లగు వైద్యులు పోను మిగిలినవారిలో, తఱచుగ తాలూకా ఆసుపత్రుల యందు, సామాన్యవైద్యుఁ డనఁబరగు ఒక ఆస్పటల్ అసిస్టెంటుమాత్రమేయుండును. దాదాఁపు డెబ్బది యెనిమిది వేల చదరపుమైళ్ల వైశాల్యమును, ఒక కోటి డెబ్బది లక్షల ప్రజలును గల యాంధ్రావనియందు, చికిత్స నందిన రోగుల సంఖ్యను బట్టి చూడ, దొరతనమువారిచే నియమితము లగు వైద్యశాలలును వైద్యులును కూడ చాలకుండుట స్పష్టము. ఇందలి జనసంఖ్యను బట్టియు, చికిత్స నందిన రోగుల మొత్తమును బట్టియు చూడ, మొత్తము జనసంఖ్యలో ఒకదేశము కూడ ఆంగ్లచికిత్సాసాహాయ్యమును పొందిన ట్లగపడదు.

పైఁగనఁబఱుపఁబడిన వైద్యుల సంఖ్యను బట్టియు ఆంధ్రదేశమందలి ప్రజల సంఖ్యను బట్టియు వైద్యసాహాయ్యము ఎంతవఱకు లభించియుండు నని యోచింప, దాదాఁపు 51,847 ప్రజలకు ఒక యాంగ్లవైద్యుఁడు చొప్పున చికిత్సాసాహాయ్యమును చేసినట్లు తేటపడుచున్నది. ఇందఱు జనులకు ఒక ఆస్పటల్ అసిస్టెంటు ఏరీతిని చికిత్సాసాహాయ్యము చేయఁగలఁడో యోచనీయము.

దొరతనమువారు నూతనముగ విధించిన "వైద్యకశాసనము" అమలులోనికి సంపూర్ణముగ రాకపూర్వమే, యేఁబదివేల ప్రజలకు ఒక ఆంగ్లవైద్యుఁడు చికిత్సాసాహాయ్యము చేయుట దుర్ఘటముగా నుండ, వైద్యకశాసనము సంపూర్ణముగ నమలులోనికి వచ్చిన పిదప, నిఁక నెట్లుండునో చదువరులే యూహింపవలెను. ఈ శాసనవిధుల ననుసరించిన ఆంగ్లచికిత్సకుఁడు ఏఁబదివేల జనులు గల ఆయా గ్రామములలోఁ గాని వైద్యశాలయందుఁ గాని చికిత్సాసాహాయ్య మొనరించునా? అక్రమప్రసవములకు సహాయుఁ డగునా? దొమ్ముల యందలి దెబ్బలకు సాక్ష్యము వెళ్లునా? మరణశాసనముల చేవ్రాలులు చేయునా? ఆగంతుక సందిగ్ధ మరణముల శవచ్ఛేదము లొనరించునా? ఇట్టి వెన్ని కార్యములను నానాఁట చేయఁగలఁడో యోచింపుఁడు. వాని విషయ మంతయు ఆయా తాలూకాలవారికిని పల్లెలవారికిని ఎల్లరకును విదితమే. పైఁ గనఁబఱుపఁబడిన వివరముల నుండి దొరతనమువా రొసఁగు చికిత్సాసాహాయ్యము మిక్కిలి స్వల్పసంఖ్యాకులకే లభించుచుండుట విశద మగుచున్నది. దేశమందలి యితర ప్రజలు ఏ వైద్యవిధానముపై నాధారపడి యున్నారను విషయమును చర్చించుట యనవసర మైనను పాఠకమహాశయుల బోధకై కొంత వివరించెదను.

పాశ్చాత్యవైద్యపద్ధతి కొలఁది కాలముగ మన భారతదేశమున వ్యాపించియున్నది. దీని వ్యాపనమునకై దొరతనమువారు ప్రతివత్సరమును కొన్ని కోట్ల ద్రవ్యమును వెచ్చించుచున్నారు. ప్రతి రాజధానిలోను వైద్యశాలలను కలాశాలలను స్థాపించి ఉత్తమ విద్యను గఱపుచున్నారు. అందు మనరాజధానిలో గడచిన డెబ్బది సంవత్సరములుగ కలాశాలలు స్థాపించియున్నారు. ఇందు నాఁటి నుండి నేఁటివఱకును బైలుపడిన పట్టభద్రులు 15 రు, యం. బి. అండు సి. యం. లు. 164 రు, యల్. యం అండు యస్. లు 398 రు అని తెలియుచున్నది. డెబ్బది వత్సరముల కాలములో లెక్కకు ఉత్తమ వైద్యవిశారదులు కొందఱె యగపడుచున్నారు. అందును మన యాంధ్రులు 10 మంది లేక 15 రుండవచ్చును. ఇందును ఆంధ్రులలో ఉత్తమోత్తమబిరుదము లందినవా రొకరైనను లేకపోవుట చాల విచారకరము. ఇప్పుడిప్పుడు వైద్యకలాశాలలలో చేరు ఆంధ్రయువకులు ఉత్తమతమ వైద్యపట్టములు పొందుటకు ప్రయత్నము చేయవలెను. దేశము నానాఁట జనబాహుళ్యమున వృద్ధి నొందుచున్నది. వైద్యులు అల్పసంఖ్యాకులు. ఆంధ్రయువకు లనేక కళాశాలలయందు చేరి వైద్యవిద్య నభ్యసించుట యవసరము.

పైఁ గనఁబఱుపఁబడిన వైద్యులసంఖ్య అల్ప మనియు వీరికై డెబ్బది వత్సరములుగ ఎన్ని లక్షల ద్రవ్యము ఖర్చు అయినదియు అందు ఒక్క వైద్యవిద్యార్థికై యెంత వ్యయ మగునదియు పాఠకులకు బోధపడఁగలదు.

పులింద తక్షక వారణాసి శ్రీశైలము అమరావతి, వీనియందు ప్రసిద్ధి గాంచిన ఆయుర్వేదవిద్యాపీఠములును, వాని పరంపరలును, అందు ప్రసిద్ధి గాంచిన ఆయుర్వేదవేత్తలును, రాజావలంబనము లేకపోవుటచేతను ఇంక ననేక కారణములచేతను క్రమముగ క్షీణింపఁ దొడఁగెను. పై విద్యాపీఠములయందువలె బహుసంఖ్యాకు లగు విద్యార్థులు విద్య నభ్యసింపకున్నను, అచ్చటచ్చటఁగల ఆయుర్వేదవిదులు తమతమ శక్తుల ననుసరించి విద్యార్థులకు లక్ష్యలక్షణముల విద్యను గఱపుచుండిరి. దేశీయ మహారాజులు రాజులు పరదేశపు వైద్యమును కారణాంతరములచే తమ రాజ్యములందు నెలకొల్పుకొనియున్నను సవతితల్లి మాదిరి ఆయుర్వేదమును కూడ క్రీఁగంటితో చూచుచువచ్చిరి. ఇందుచేతను, భారతభూమియందు మతాభినివేశము లుండుటచేతను, పాశ్చాత్య పద్ధతియందువలె మందులు చేయువా రొకరు వానిని అమ్మువా రొకరు వాని గుణాదుల నెఱింగి వినియోగించువా రొకరు గాక, మందులు చేయువారును వినియోగించువారును ఒకరే యగుటచేతను, త్రికాలవేదు లగు మహర్షుల జ్ఞానతేజస్సుతో కూడిన మన యాయుర్వేదవైద్యము నభ్యసించిన యనేకులు అక్కడక్కడ నిలిచియుండిరి. ఆ పరంపరలే లోకమున ఖ్యాతి గాంచిన కుటుంబములు. వారలే ప్రకృతము భారతభూమియం దంతటను వ్యాపించియున్నారు. వీరలలో కొందఱు తమతమ పితృపితామహాదులవద్ద లక్ష్యలక్షణముల విద్య నభ్యసించి పరంపరలను కాపాడుచున్నారు. మఱికొందఱు ప్రసిద్ధు లగు వైద్యపుంగవులకడ కేఁగి కొన్ని వత్సరములు గురుకులవాసము చేసి లక్ష్యలక్షణముల నభ్యసించి తమ విజ్ఞానమును లోకమున వినియోగించుచున్నారు. ఇఁక కొందఱు తమ పూర్వులు వైద్యు లనియు తామా పరంపరలయందు జన్మించితి మనియు ఆ మాత్రముననే తాము వైద్యుల

మనియు చెప్పుకొనుచున్నారు. పైఁ జెప్పఁబడినవారలు గాక, కొందఱు ఏవియో ఒకటి రెండు విషయములు (చిట్కాలు) తెలిసికొని అందువలన ఖ్యాతి వడసియున్నారు.

సిద్ధాంతిత మగు విద్యాపీఠములు లేకపోవుటచేత ఏకముఖ మగు పాండిత్యము గల వైద్యులు అరుదై, బహుముఖములతోఁ జేరిన విజ్ఞానము గల వైద్యులును సామాన్య మగు జ్ఞానము గల వైద్యులును నున్నారు. జ్ఞానము అనంతము. అయ్యది దానిదాని సాధనములతో వేర్వేఱుగ నుండిన ట్లగపడినను ప్రక్రియాభాగ మందలి ఫల మనేకము. కానం జేసి అందలి భేదములను విమర్శించుట యనవసరము. ఇట్టి వైద్యవిజ్ఞానము గల వైద్యులు మన యాంధ్ర భూమిని అనేకులు గలరు. సామాన్యవిశేషజ్ఞానము గల యీ దేశీయ వైద్యులే ప్రజాసామాన్యమునకు ఆధారముగ నున్నా రనుట నిర్వివాదము. మరియు భారతసామ్రాజ్య శాసనసభయందు ఈ నెల 15-వ తేదిని నూటికి తొంబది తొమ్మది మంది దేశీయవైద్యము మీఁదనే యాధారపడియున్నా రని చెప్పిన సర్ పాడిలూకిసు గారి అమృతవాక్యములే నిదర్శనములు.

కడచిన జనాభా లెక్కలనుండి యీ పదునొకండు జిల్లాల యందును, అన్ని రకముల వైద్యులును దాదాఁపు 19,350 మంది గల రని తెలియుచున్నది. వీరి సంఖ్యను ఆంధ్రదేశమందలి మొత్తము జనసంఖ్యను బట్టి చూడఁగా, సుమారు ఎనిమిది వందల ముప్పది మందికి ఒక దేశీయవైద్యుఁడుగ తేలుచున్నది. ఇందును సామాన్య జ్ఞానము గలవారిని లెక్కింపక కొంత జ్ఞానము గలవారిని విడఁదీసినను, పై మొత్తము జనసంఖ్యలో ఎనిమిది వందల మందికి ఒక దేశీయవైద్యుఁడు సాధారణముగ నేర్పడుచున్నాఁడు. దొరతనము వారి వైద్యసాహాయ్యమును వైద్యుల సంఖ్యను, దేశీయవైద్యుల సంఖ్యను దేశీయవైద్యులు చేయు వైద్యసాహాయ్యమును విమర్శించి చూడ, పాటకమహాశయులకు దేశమంతయు ఏ వైద్యమున నాధారపడియున్నదియు రెంటిలో నేది సులభసాధ్య మైనదియు హెచ్చువెచ్చము లేనిదియు విశేషఫలప్రద మైనదియు వారివారి మతధర్మములను కాపాడునదియు ప్రత్యేకముగ తోఁచకమానదు.

తిరువాన్కూరు మైసూరు కొచ్చి రాజ్యములయందు రాజకీయ మగు గొప్ప కలాశాలలు వైద్యశాలలు స్థాపితములు. ఇందు ఆయుర్వేదము లక్ష్యలక్షణములఁ గఱపఁబడును. మైసూరు కలాశాల యందు అనాటమీ ఫిజియాలజీలను కూడ నేర్పుదురు. ఈ కలాశాలలయం దుత్తీర్ణతను గాంచిన విద్వద్వైద్యులను తమ రాజ్యమునఁ గల వైద్యశాలలయందు రాజకీయవైద్యులుగ నియమించియున్నారు. ఇట్టి వైద్యశాలలు తిరువాన్కూరు రాజ్యమున 72 కలవు. మైసూరు రాజ్యమున 27 ఆయుర్వేద వైద్యశాలలును 5 యూనానీ వైద్యశాలలును కలవు.

హైదరాబాదు రాజ్యమున నైజాము దొరతనమువారు యూనానీ కలాశాలలను స్థాపించినారు. ఇం దుత్తీర్ణత గాంచిన వారిని తమ రాజ్యమున రాజకీయవైద్యులుగ నియమించియున్నారు. ఇట్టి యూనానీ వైద్యశాలలు పెక్కులు గలవు.

చెన్నరాజధానియందు కీర్తిశేషులైన ఆనరబిల్ వి. కృష్ణస్వామయ్యర్.సి. యస్.ఐ. గారిచే స్థాపిత మగు వైద్యపాఠశాల కలదు. ఇందు లక్ష్యలక్షణముల విద్య గఱపఁబడును. మరియు అనాటమీ ఫిజయలజీలు కూడ దేశభాషలలో బోధించెదరు.

కాచె పదునైదు వత్సరములుగ నొక ఆయుర్వేదకళాశాల నిర్వహింపఁబడుచుండుట యందఱికిని విదితము. దీనియందు పైకలాశాలలయందువలెఁ గాక, కలకత్తా బొంబాయి బనారస్ జయపూరు మైసూరు మదరాస్ మొదలగు పట్టణములయందు ఖ్యాతి గాంచిన ఆయుర్వేదాచార్యులును పాశ్చాత్యవైద్యవిశారదులును గలసి యేర్పడిన పరీక్షకసంఘముచే నియమిత మగు పాఠ్యక్రమము ననుసరించిన బోధనాపద్ధతి గలదు. ఇందు పాశ్చాత్యవైద్యపద్ధతియందలి అనాటమీ ఫిజయలజీ కెమిస్ట్రీ ఫిజిక్సు మిడ్వైఫరీ మెడిసన్ మెటీరియ మెడికా హైజీన్ మొదలగునవి కూడ దేశభాషలలోఁ గఱపఁబడును. "ఆయుర్వేదభూషణ" అను సంస్కృతశాఖతో పాటు "భిషగ్వర" అను ఆంధ్రశాఖయు కలదు. ఇందు సంస్కృతశాఖయందు "ఆయుర్వేదభూషణ" బిరుదములు పొందినవారు లాహోర్ అజమీర్ కలకత్తా అనంతశయనము గద్వాల్ బంగళూరు మొదలగు భారతదేశముల వాసము లేర్పఱచుకొని వైద్యప్రచారము చేయుచున్నారు. ఒక కేరళీయ ఆయుర్వేదభూషణుఁడు ఎడింబరో మహానగరమున వైద్యశాఖయందు విద్యాభ్యాసము చేయుచున్నాఁడు. ఈ రెండు శాఖలయందును పట్టభద్రు లైనవారు 32 రు గలరు. మొత్తమునకు పై రెండు శాఖలయందును పట్టములు గ్రహించిన ఆంధ్రులు పదుగురు గలరు. ప్రకృతము కలాశాలయందు ఇరువది మంది యాంధ్రులు ఆయుర్వేదము నభ్యసించుచున్నారు. మన రాజధానియందు ఆంధ్రులు ఆయుర్వేదము నభ్యసించుటకును ఆంధ్రభాషయందు ఆయుర్వేదవిద్య గఱపుటకును ఏర్పడిన ఆయుర్వేదకలాశాల యిది యొకటియే. మొత్తముమీఁద ఆయుర్వేద కలాశాల లన్నిటియందును బిరుదములు పొందిన విద్వద్వైద్యులు దాదాఁపు రెండు వందల మంది గలరు.

పైన వివరింపఁబడిన దానిని బట్టి దొరతనమువారు అనేక లక్షల రూప్యములు వెచ్చించి అల్పసంఖ్యాకు లగు పాశ్చాత్య వైద్యులను సృష్టిచేయుటతోఁ బాటు అల్పవ్యయముతో ఆయుర్వేద వైద్యులను వేలకొలఁది తర్ఫీతు చేయింపవచ్చు నని చదువరులకు బోధపడక మానదు.

ఆంధ్రదేశమందలి జనసంఖ్యను బట్టి దొరతనమువారు చేయు వైద్యసాహాయ్యము "స్థూలారుంధతీన్యాయము"గ నున్నది. ఇయ్యది యే బహుజనుల నుపకరించునట్లు దొరతనమువారిని కోరదమేని, పెద్ద వైద్యులకు పెద్ద జీతములు లభించుట నిశ్చయము; పేద లగు ప్రజలకు వైద్యసాహాయ్యము లేకపోవుటయు సత్యము. దివారాత్రములు చెమట లూడ్చి కష్టపడి దమ్మిడి దమ్మిడి కూడఁబెట్టు రహితులచే క్విన్రెంటు రోడ్డుఫండు మొదలగు రూపముల నియ్యఁబడిన

లక్షల కొలఁది ధనము వ్యయ మగుట సిక్కము; ఫలమో అల్పము. మీఁదు మిక్కిలి ప్రసవచికిత్సలయందుఁ గాని శస్త్రచికిత్సలయందుఁ గాని యే విశాఖపట్టణమునకో రాజమహేంద్రవరమునకో జిల్లా పెద్ద ఆసుపత్రి గల దని వెళ్లిన, అచ్చట అనుకూల మగు శస్త్ర సముదాయము లే దనుటయు లేడీ డాక్టర్ లే దనుటయు ఈ శస్త్రచికిత్సకై చెన్నపురికి పొ మ్మనుటయు సాధారణము.

ప్రతి జిల్లాయందును తాలూకాయందును గల జనసంఖ్యను బట్టి ప్రకృతము ఒకటి రెండు ఆయుర్వేద యునానీ వైద్యశాలలను స్థాపింపవలెను. దీని కగు ఖర్చు పాశ్చాత్య వైద్యశాలలకై వినియోగించు రీతిని, జిల్లా బోర్డు తాలూకా బోర్డులనుండి యియ్యవలెను. ఈ విషయమై జిల్లాబోర్డుల తాలూకాబోర్డుల మెంబరులు తగు శ్రద్ధతో పనిచేయఁ బూనుట వారికి విధి. సామాన్యముగా ఒక తాలూకాయందలి యింగ్లీషు వైద్యశాలకై వ్యయమగు మొత్తములో మూఁడు ఆయుర్వేదవైద్యశాలలను నిర్వహింపవచ్చును. మఱియు మందులకై బొంబాయి కలకత్తాలకు పోవలసిన పని లేదు; ఇంగ్లండునకు వ్రాయ నవసరము లేదు. ప్రతిరోగమునకు శస్త్రవైద్య మవసరము లేదు. వైద్యులకు మాసమునకు వందలకొలఁది జీతము లియ్యఁబనిలేదు. మన దొడ్లయందును గ్రామములయందును పుట్టిన మూలికలతో శీతోష్ణస్థితుల ననుసరించి యౌషధములను నిర్మింప వచ్చును. వీని కగు ద్రవ్యము అల్పము.

మన దేశమున మనతోఁ బాటు పుట్టిన మూలికాదులచే చేయఁబడు మందులు మన శరీరమునకు హిత మనుట నిజము. వీనిచే బహుజనుల కుపకారము కలుగుట లోకవిదితము. ఇట్లు సర్వవిధముల అనుకూల్యములు గల ఆయుర్వేదవైద్యశాలలను ప్రతి పల్లెయందును స్థాపించుటకు ప్రతివారును ప్రయత్నింపవలెను.

ఒక నెల కర్చుల మదింపు

ప్రతి రోజును రెండు వందల మంది రోగులకు

| | | | | |
|---|---|---|---|---|
| సామాన్య మగు మందుల ఖర్చు | | | రు. | 40-0-0 |
| ఇద్దఱు వైద్యులకు (40+30) | ... | | ,, | 70-0-0 |
| కంపౌండరు | ... | ... | ,, | 10-0-0 |
| రైటరు | ... | ... | రు. | 10-0-0 |
| ఇద్దఱు మందులు చేయువారలు | | | ,, | 15-0-0 |
| ఇంటి యద్దె | ... | ... | ,, | 15-0-0 |
| చిల్లర ఖర్చులు | ... | ... | ,, | 10-0-0 |
| | | మొత్తము | ,, | 170-0-0 |

పై కనఁబఱుపఁబడిన ప్రకారము ఇన్నూరుమంది రోగులు వచ్చు ఆయుర్వేదవైద్యశాలను సామాన్యమగు మందుల నిచ్చి నెల 1-కి నూట డెబ్బది రూపాయములతో నిర్వహింపవచ్చును. ఇయ్యది నా యిరువది యైదు వత్సరముల యనుభవముమీఁద వ్రాసినాఁడను. ఇట్టివాని వివరములను గోరువారలకు ప్రత్యుత్తరముల నిచ్చుటకు సిద్ధుఁడను. పాశ్చాత్య పద్ధతుల ననుసరించి యిన్నూరుమంది రోగులు ప్రతిదినము వచ్చు వైద్యశాలను నిర్వహింపవలె నన్న, అందలి ప్రధాన వైద్యుని జీతమునకే మాసమాసమునకు ఇన్నూరు రూపాయలు చాలవు. మిగిలిన వైద్యులకును ఇతరపరివారమునకును మందులు మొదలగువానికిని చేర్చి మాసమునకు ఎన్ని వందలు కావలయునో పాఠకమహాశయులకు బోధ కాఁగలదు.

ఆంధ్రమండలముల కన్నిటికిని చేరిన ఆయుర్వేదకళాశాల యొకటి యవసరము. ఇందు ఆయుర్వేదవిద్యను లక్ష్యలక్షణములతో ఆంధ్రభాషయందు బోధింపవలెను. ఇందు జయము గాంచినవారినే ప్రతి జిల్లాయందును తాలూకాయందును పల్లెయందును వైద్యులుగ నియమింపవలెను. జిల్లా బోర్డులనుండి తాలూకా బోర్డులనుండి ధనమును వెచ్చించి వైద్యశాలల నేర్పఱుపవలెను. కళాశాలయందు జయము గాంచువారు విశేషముగ లేకున్న, ఆయా ప్రాంతములలో ప్రసిద్ధి గాంచిన వైద్యులను నియమింపవలెను. ఇట్లు చేసినచో జనసామాన్యమునకును, అందును మిక్కిలి బీదలకును, వైద్యసాహాయ్యము లభింపఁగలదు. ఆరోగ్యము అధికము కాఁగలదు. ప్రజలు సత్సంతతిని పొందఁగలరు. విద్యాబుద్ధులు వర్ధిల్లును. నాగార్జునాదికలావంతులచేతను అనేక మహిమలు కనుఁగొనిన నవనాథసిద్ధులచేతను పరహితాచార్య నీలకంఠ వల్లభేంద్ర బసవరాజాదులగు వైద్యపుంగవులచేతను అలంకరింపఁబడిన ఆంధ్రదేశము అభివృద్ధి నొందును. ఆంధ్రమాత సంతసించును.

# పాశ్చాత్యనవీన వైద్యశాస్త్రము

కే. వీ. సుబ్బారావు గారు, ఎం. బి. (హోమోపతి)

గత సంవత్సరాది సంచికయందు పాశ్చాత్యనవీనవైద్యశాస్త్రము హిందూదేశములో నెట్లు వ్యాపకమైనదియు వ్రాసియుంటిని. ఈ సంచికయందు ఈ నవీనవైద్యశాస్త్రమునకును ఇతర ప్రాచీనవైద్యశాస్త్రములకును గల భేదములను వ్రాయుచున్నాను.

ఈ నవీనవైద్యశాస్త్రమార్గదర్శకుఁడైన హానిమాను జర్మనీదేశములో విశేషప్రఖ్యాతి వహించిన వైద్యశిఖామణి. ఈయన పాశ్చాత్యప్రాచీనవైద్యశాస్త్రమునందు పట్టపరీక్షలో కడతేఱి బహుకాల మా వైద్యము నభ్యసించి విశేషకీర్తిని పొందెను; అనేక పాశ్చాత్యభాషలలో పాండిత్యము గలవాఁడు. ఈయన వైద్యశాస్త్రమునందే గాక యితరము లగు ననేకశాస్త్రములయందుఁ గూడ పాండిత్యము గలవాఁడు. ఈయన వ్రాసిన గ్రంథము లనంతములు. ఈయన వైద్యశాస్త్రము పఠింప పరిశీలింప, అందలి యశక్తతయు లోపములును బయలుపడసాగెను. ఆ కాలపు పాశ్చాత్యవైద్యగ్రంథములలో రోగవర్ణనను అనఁగా రోగనిదానమును గుఱించి విశేషముగా వ్రాసియుండెను. ఔషధశక్తిజ్ఞానము చాల లోపించియుండెను. చికిత్స తెలియని వర్ణనవలన ఉపయోగము లేదని అతృప్తితో హానిమాను వైద్యవృత్తిని మానుకొనెను. కేవలసత్యమునందు మనస్సు గలవాఁడై తనకు వైద్యవృత్తియందు లభించు ద్రవ్యలాభమును వదలుకొనెను. స్వగృహమున బిడ్డలకు వ్యాధులు సంభవించినను వారికిఁ గూడ ఔషధము లియ్యకయే ప్రకృతికి విడిచి కాలము గడపుచుండెను. వ్యాధులు నిశ్శేషముగా కుదురు మార్గ మేర్పడునంతవఱకు తా నౌషధమును ముట్ట నని ప్రతిజ్ఞ చేసెను. అనేకపాశ్చాత్యభాషలలో పాండిత్యము గలవాఁడగుటవలన ఒక భాషలోని వైద్యగ్రంథమును మఱియొక భాషలోనికి భాషాంతరీకరించుచు తద్ద్వారా లభించు ద్రవ్యముతో జీవనము చేయుచుండెను. ఇది రెండు విధముల హానిమాను కుపయోగపడెను: ఒకటి జీవనాధారము, రెండవది శార్మణ్యేతరభాషలలో నుండు వైద్యగ్రంథముల పరిచయము. ఇట్లుండఁగా, వైద్యప్రపంచాంధకారమునకు భానూదయసమయము ప్రాప్తించెను. ఆంగ్లేయవైద్యశాస్త్రజ్ఞుఁడైన కల్లను వ్రాసిన వైద్యగ్రంథమును జర్మనీభాషలోనికి భాషాంతరీకరించుటకు హానిమాను ప్రారంభించెను. కల్లను తన గ్రంథములో పేరూవియన్ పట్ట వలన జ్వరము నివర్తించు క్రమమును ఒక విధముగా వికదీకరించెను. ఈ వివరణమువలన హానిమాను తృప్తి చెందనివాఁడై; జ్వరమునకును పెరూవియన్ పట్టకును గల సంబంధమును గుఱించి విశేషముగా యోచించుటకు ప్రారంభించెను.

ఇట్లు హానిమాను చాల కాలము యోచించి దేహారోగ్యముతో నున్న తాను పెరూవియన్ పట్టను పుచ్చుకొనినయెడల ఆ పట్ట తన దేహస్థితిలో ఏ విధమైన మార్పును తేఁగలదో పరిశీలింపవలయు నని ప్రయత్నించెను. పట్టను పుచ్చుకొనెను. ఆరోగ్యవంతుఁడగు హానిమాను పట్టను పుచ్చుకొనిన వెనుక చలి జ్వరముచే పీడితుఁడయ్యెను. ఈ జ్వరము రెండు మూడు రోజులలో నెమ్మదించెను. జ్వరము పట్టకలన కలిగినదా లేక స్వభావముగా వచ్చినదా యను సందేహము కలవాఁడై హానిమాను మరల పట్టను పుచ్చుకొనెను. ఈ పర్యాయము గూడ అదే విధమగు చలియు జ్వరమును కనుపించెను. ఎన్ని పర్యాయములు పెరూవియన్ పట్టను పుచ్చుకొన్నను అన్ని పర్యాయములు ఒకే విధమగు చలియు జ్వరమును వచ్చుచుండెను. అందువలన హానిమాను 'పెరూవియన్ పట్టకు జ్వరమును కలుగఁజేయు శక్తి యున్నది. కనుకనే జ్వరమును కుదుర్చుచున్నది.' యను నిర్ధారణకు వచ్చెను. పట్ట కలిగించు వ్యాధిని పట్ట కుదుర్చుచున్నది. ఈ న్యాయము పట్టకు మాత్రము సంబంధించినదా లేక సర్వపదార్థములకును సహజమా యను సందేహము పొడమెను. ఇతరపదార్థములను కొన్నిటిని పై విధముగా పరిశీలించుటకు హానిమాను ప్రారంభించెను. ఏయే పదార్థములను ఎన్ని పర్యాయములు పుచ్చుకొన్నను ఆయా పదార్థములకు నైజమగు మార్పులనే అవి దేహారోగ్యమందు చూపుచుండినవి అనఁగా పెరూవియన్ పట్ట ఒక రకము జ్వరమును, ఉప్పు మఱియొక రకము జ్వరమును, పాషాణము వేఱొక రకము జ్వరమును కలుగఁజేయుచున్నవి. ఇట్లే అనేకములగు నితరరోగములను గూడ కలిగించుచున్నవి. ఏ రకము అస్వస్థత ఏ పదార్థమువలన పుట్టుచున్నదో ఆ రకము అస్వస్థత ఆ పదార్థమువలననే నశింపఁగలదు. కనుక పై న్యాయము పెరూవియన్ పట్టకే గాక సర్వపదార్థములకును నైజమను సత్యమును హానిమాను గ్రహించెను. ఈ జ్ఞానముతో హానిమాను నవీనవైద్యపద్ధతిని కనుఁగొనెను. హానిమానుకు పూర్వపు పాశ్చాత్యులు పదార్థశక్తిని గ్రహించుచుండిన విధము తెలిసినఁ గాని పాశ్చాత్యప్రాచీన వైద్యమునకును ఈ నవీనవైద్యమునకును గల తారతమ్యము గోచరము కాదు.

## ప్రాచీన గుణనిరూపణ విధానము

ఒక పదార్థమును మనుష్యేతరజంతువులకు (కోతి కుక్క కప్ప కుందేలు మొదలగువానికి) ఇచ్చి ఆ పదార్థము ఏ మార్పును వాని శరీరములయందు కలిగింపఁగల దని చూచుచున్నారు. మనుష్యజాతి దేహసౌఖ్యమున కుపయోగింపఁబడు పదార్థముయొక్క ఔషధశక్తిని మనుష్యుని ద్వారా గ్రహించుట యుక్తము గాని మృగ

ముల ద్వారా గ్రహించుట యుక్తము కాదు. మనుష్యునికి విషమగు పదార్థము ఇతరజంతువులకు ఆహారముగా నుండుట గలదు. ఇతర జంతువులకు ఆరోగ్యము నిచ్చు పదార్థము మనుష్యునికి అనారోగ్యము నియ్యవచ్చును. మృగముల ద్వారా లభించిన జ్ఞానసాహాయ్యముతో ఉత్కృష్టదేహులగు మనుష్యులకు చికిత్స చేయుట యుక్తము కాదు. వీరిట్లు సేకరించిన పదార్థచింతామణికి పలు విధములగు లోపములు ప్రాప్తించుచున్నవి. మనుష్యునికిని ఇతర జంతువులకును సృష్టియందపారవ్యత్యాసమున్నది. ప్రత్యేక శరీరభాగములు భేదించుచున్నవి. జీవజంతుధర్మము భేదించుచున్నది. వీరి పదార్థములయొక్క ఔషధశక్తిని నిరూపింపవలసిన జంతువులకు వాక్కు లేదు. మాట్లాడుటకు శక్తి లేని జీవజంతువు పదార్థమువలన తన శరీరమునందు కలిగిన మార్పులను (అనఁగా కడుపు నొప్పి, తల నొప్పి, ఒడలి మంటలు, మొదలగు వానిని) తాననుభవింపఁగలదు గాని, ఇతరులకు ఎట్లు బోధపఱుపఁగలదు? పదార్థశక్తిని కనుఁగొనుటకు ప్రయత్నించు మనుష్యుఁడు పై జంతువులకు పదార్థము నిచ్చిన వెనుక ఆ జంతువుల బాహ్యచిహ్నములను ఆధారము చేసికొని శరీరపు మార్పులను గ్రహించుచున్నాఁడు. అనఁగా కోఁతికి పాషాణము నిచ్చినప్పుడు కోఁతికి కడుపులో మంట కలుగు ననుకొందము. కోఁతి కడుపును తడుముకొనుచు పొరలాడుచుండును, లేక గంతులు వైచుచుండును. కోఁతి కడుపు మంటచేతనా లేక నొప్పిచేతనా శ్రమపడుచున్నది యని ఒకఁడు అనుమానింప వచ్చును గాని, శ్రమపడు కోఁతి తప్ప ఇతరులు దృఢముగా ఇదమిత్థమని చెప్పుట కెట్లు సాధ్యమగును? పదార్థశక్తిని గ్రహించుటకు ప్రయత్నించి కోఁతికి పదార్థము నిచ్చిన మనుష్యునికి, తనకు పదార్థమువలన కలిగిన బాధను కోఁతి చెప్పఁజాలదు. పదార్థశక్తిని నిరూపించు చిహ్నములు రెండు విధములు: (1) పదార్థమును సేవించిన ప్రాణి స్వయముగా గ్రహింపఁగల చిహ్నములు (కడుపుమంట కన్నుపోటు మొదలగునవి). (2) పదార్థమును సేవించిన ప్రాణియొక్క శరీరపు మార్పులు: చూచువారు గూడ గ్రహింపఁగల చిహ్నములు (వాఁపు, కండ్లకలక మొదలగునవి). ఇందు మొదటి రకము చిహ్నములు ముఖ్యమైనవి. ఇట్లు పాశ్చాత్యప్రాచీన వైద్యులు పదార్థశక్తిని మాట్లాడుటకు శక్తి లేని జీవముల ద్వారా నిరూపించు ఆచారము గలవారగుటవలన పైనుదాహరించిన పదార్థశక్తిని నిరూపించు రెండు విధములగు చిహ్నములలో ముఖ్యములగు మొదటి తరగతి చిహ్నములను వీరు సేకరించుటకు శక్తి లేనివారగుచున్నారు. కావున వీరి పదార్థచింతామణిలో ముఖ్యచిహ్నములు లోపించుచున్నవి. ఇది హానిమానుకు పూర్వముండిన పాశ్చాత్య వైద్యులయొక్కయు వారి పద్ధతిని అవలంబించు ఇప్పటి వైద్యులయొక్కయు సామాన్యపు పోకడయొక్క సంగ్రహము.

## నవీన గుణనిరూపణ విధానము

పాశ్చాత్యప్రాచీనవైద్యులయొక్క పైనుదాహరించిన నిష్ప్రయోజకమార్గములే నవీనవైద్యపద్ధతిని స్థాపించుటకు హానిమానును ప్రేరేపించినవి. ఈ పద్ధతి ప్రకారము పదార్థశక్తిని నిరూపించుటకు మనుష్యుఁడే కావలయును. ఆ మనుష్యుఁడైనను ఆరోగ్యవంతుఁడుగా నుండవలెను. పదార్థమును మనుష్యుఁడే పుచ్చుకొని పదార్థశక్తిని నిరూపించుచున్నాఁడు గనుక మనుష్యుని ద్వారా పై చెప్పఁబడిన రెండు విధములగు చిహ్నములును బయలుపడఁగలవు. పదార్థశక్తిని గ్రహించుటకు ప్రయత్నించి మనుష్యునికి పదార్థము నిచ్చిన వైద్యునికి పదార్థమువలన తాను మాత్రము గ్రహింపఁగల చిహ్నములను మనుష్యుఁడు చెప్పఁగలఁడు. చూచువారు గూడ గ్రహింపఁగల చిహ్నములు సహజముగా బయలుపడుచున్నవి. ఇట్లు పాశ్చాత్య నవీనవైద్యులు పదార్థశక్తిని మనుష్యుని ద్వారా నిరూపించుచు పై ద్వివిధములగు చిహ్నములను సేకరించుటకు శక్తి గలవారై తమ పదార్థచింతామణిని లోపములు లేనిదిగా చేయుచున్నారు. దీనికి శుద్ధపదార్థచింతామణి యని పేరు. ఈ నవీనపద్ధతి వైద్యమునకు హానిమాను మూఁడు విధులను నియమించెను:

(1) సదృశచికిత్స. (2) ప్రత్యేకమూలిక. (3) సూక్ష్మమగు మోతాదు.

## సదృశ చికిత్స

హానిమాను వైద్యవృత్తిని మానుకొని భాషాంతరీకరణమువలన జీవనము చేయుచుండు కాలములో కల్లను వ్రాసిన పెరూవియన్ పట్ట యుపయోగమును తాను సమ్మతింపక పెరూవియన్ పట్టను తాను పుచ్చుకొని పట్టయొక్క ఔషధశక్తిని నిరూపించి పట్టవలన కలుగు జ్వరము పట్టవలననే నశించుచున్నదని కనిపెట్టెను. మఱియు ఈ న్యాయము పట్టకే గాక సర్వపదార్థములయందు నున్నదని నిరూపించెను. ఒక పదార్థమును ఔషధముగా నుపయోగింపవలయు నని మనము ఉద్దేశపడుటకు పూర్వమే ఆ పదార్థమును ఆరోగ్యవంతుఁడగు మనుష్యునికిచ్చి వాని ద్వారా ఆపదార్థముయొక్క శక్తిని (అనఁగా అది యేయే వ్యాధులను కలుగఁజేయఁగలదో వానిని) తెలిసికొనియుండవలయును. ఇట్లు హానిమాను అనేకపదార్థముల శక్తిని నిరూపించి గ్రంథము వ్రాసియున్నాఁడు. ఆ గ్రంథమునకే శుద్ధపదార్థచింతామణి యని పేరు. వైద్యుఁడు రోగమునకు చికిత్స చేయునపుడు, ఆ రోగచిహ్నములను ఏ పదార్థము పుట్టింపఁగలదో ఆ పదార్థమును తెలిసికొనుట కర్తవ్యము. రోగమునం దే చిహ్నములుండునో ఆ చిహ్నములే ఔషధమునం దుండవలెను. అట్టి యౌషధమే చికిత్స కుపయోగపడునది. దీనికే సదృశచికిత్స యని పేరు. చికిత్సకునికి రోగచిహ్నములును ఔషధచిహ్నములును సమగ్రముగా తెలిసియుండవలయును.

## ప్రత్యేకమూలిక

ఈ పద్ధతి ప్రకారము మందు దినుసులయొక్క శక్తిని మనుష్యుని ద్వారా నిరూపించు కాలములో వానిని ప్రత్యేకముగా నుప

యోగించెదరు. ప్రత్యేకపు మందు దినుసుయొక్క శక్తిని మాత్రమే నిరూపించియున్నారు గాని రెండు మూఁడు మందు దినుసులను చేర్చి పుచ్చుకొన్నప్పుడే చిహ్నములు మనుష్యశరీరమునందు కలుగునో వానిని నిరూపించినవారు కారు. కావున ఔషధశక్తి జ్ఞానమును బట్టి చికిత్స నియమింపఁబడినది. ఇతరవైద్యపద్ధతుల ప్రకారము ఒక రోగి ఏకకాలములో తలనొప్పి కడుపునొప్పి కన్నుపోటులతో శ్రమపడుచుండఁగా, తలకు రుద్దుటకొక మందును, కడుపునొప్పికి మఱొక మందును, కన్నుపోటుకు కంటిలో వేయుటకు వేఱొక మందును ఇచ్చి చికిత్స చేయుట వాడుక. ఈ పద్ధతి ప్రకారమట్లు గాక పై రోగచిహ్నము లన్నియు ఏకకాలములో ఏ మందు దినుసుయొక్క ఔషధశక్తిని నిరూపించు సందర్భమునందు ఆరోగ్యవంతుఁడైన మనుష్యుని ద్వారా కనఁబడెనో ఆ మందు దినుసును ఇచ్చి చికిత్స చేయుట వాడుక. ఆ ప్రత్యేకమూలికకు పై చిహ్నము లన్నియు ఏకకాలములో కలిగించు శక్తి యున్నది గనుక అది వానిని ఏకకాలములో నివర్తి చేయఁగలదు. దీనికే ప్రత్యేకమూలిక యని పేరు.

## సూక్ష్మమగు మోతాదు

ఈ పద్ధతి ప్రకారము ఔషధముగా నుపయోగింపవలసిన పదార్థముయొక్క శక్తిని మనుష్యశరీరమునందు నిరూపింపవలయునని చెప్పియున్నది గదా? చికిత్సయందనేకవిషపదార్థములు గూడ నుపయోగపడుచున్నవి. ఈ విషపదార్థములను స్థూలముగా మనుష్యుని కిచ్చి నిరూపింపవలసియున్న ఎట్లు సాధ్యమగును? ప్రాణహాని కలుగును కదా? కనుక పదార్థములను అతిసూక్ష్మముగా ఇచ్చి వాని శక్తిని నిరూపించి చికిత్సయందుఁ గూడ సూక్ష్మముగానే వాడుచున్నారు. వీ రుపయోగించు ఔషధము సూక్ష్మదర్శినీ యంత్రముతోఁ గూడ చూడఁజాలనంత సూక్ష్మముగా నుండును. దీనికే సూక్ష్మౌషధమని పేరు. సూక్ష్మౌషధములవలన వేఱొక యుపయోగము గలదు. కొన్ని పదార్థములు స్థూలదశయందు ఔషధశక్తిని చూపఁజాలకున్నవి. ఆ పదార్థములే సూక్ష్మదశలో విశేషముగ ఔషధశక్తిని చూపుచున్నవి. ఇందుకు దృష్టాంతములు: (1) ప్రతిదినమును మనము ఆహారమూలమున ఉప్పును విశేషముగా పుచ్చుకొనుచున్నాము. దానివలన వ్యాధులు పుట్టుట గాని నశించుట గాని లేదు. దీనినే వీరు సూక్ష్మముగా చికిత్సయం దుపయోగించునప్పుడిది అనేకవిధముల మేహరోగములు చలి జ్వరములు మొదలుగాఁ గల రోగములను కుదుర్చుచున్నది. (2) ఇసుక స్థూలదశయం దౌషధశక్తి లేనిదై సూక్ష్మముగా నుపయోగింపఁబడినప్పు డనేక మహావ్యాధులను కుదుర్చుచున్నది. ఇట్లనేకపదార్థములు ఇతరవైద్యపద్ధతులవారి కుపయోగము లేనివై వీరి కుపయోగపడుచున్నవి.

## ఉపసంహారము

ఇట్లు నవీనవైద్యస్థాపకుఁడగు హానెమాను సదృశచికిత్సను విధించి పదార్థశక్తిని మనుష్యుని ద్వారా ప్రత్యక్షముగా నిరూపించి ఇతరులు మనుష్యేతరజంతువుల ద్వారా కల్పించు ఊహల నన్నిటిని పూర్వపక్షము చేసెను. ప్రత్యేకౌషధపు దినుసును విధించి యితరవైద్యపద్ధతులవా రనేకౌషధపు దినుసులను ఒక రోగమునం దుపయోగించి రోగస్థితి మాఱినప్పుడు ఏ దినుసు ఏ క్రొత్త గుణమును కలుగఁజేయుచున్నదో ఏ దినుసు ఏ గుణమును కుదుర్చుచున్నదో తెలియక శ్రమపడు స్థితిని వీరి పద్ధతి వైద్యము నుండి తొలఁగించెను. సూక్ష్మౌషధమును విధించి వైద్యుఁడు పొరపాటుగా రోగమునకు సరికాని మందు నిచ్చినను దానివలన నితర బాధ లేకుండునట్లు చేసెను. ఔషధము బహుసూక్ష్మముగా నుండుటవలన అది యే రోగమునకు ఇయ్యఁబడినదో ఆ రోగమును నివర్తింపఁగలదే గాని వేఱు విధము లగు శరీరబాధలను కలుగఁజేయదు. ఇదియే పాశ్చాత్యనవీనవైద్యమునకును ఇతర వైద్య పద్ధతులకును గల ముఖ్యతారతమ్యము.

# అహల్యాసాంత్వనము

తెలిసి కృతాపరాధ వయితే? యటుగా, దది నే నెఱుంగుదున్;
తెలియక త్రొక్కినన్? మతిమతీ! మలినంబు పదంబు నంటు; ఈ
కొలయెడ నీవు వంచితవు, కోరిక విస్మృతి నయ్యె; కాననే
ఫలము జడత్వ; మూఱడుము, బాధయు జ్ఞాతము గా దొకింతయున్. — కా. గో. రా.

# విద్యామూల్యత

జూలూరి తులశమ్మ గారు

ఆయి దాటు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి బాలునకు సత్యాసత్యముల విషయమైన జ్ఞానము కలుగును. పది పండ్రెండు సంవత్సరములు వచ్చునప్పటికి సామాన్యజ్ఞానము కలుగును. ఏ కార్యమును చేయుటకైన నతఁ డప్పు డర్హుఁడై యుండు నని చెప్పుకొనవచ్చును. అప్పటినుండియు బాలునకు యుక్తరీతిని నీతిబోధక మగు విద్యను నేర్పుట తలిదండ్రులకు కర్తవ్యము. చిన్న చిన్న మొక్కలకు విశేషముగు నీటిపోతవలన హాని కలుగుట యెట్లో, అట్లే మొలక లెత్తుచున్న జ్ఞానాంకురములపై విద్యాప్రవాహముఁ బరపిన నా యంకురములకు హాని వాటిల్లును. కావున, బాలునకు మునుమున్న స్వల్పవిద్యను బోధింపవలెను. అనఁగా ఈడున కనువు గాని విద్య నేర్పఁగూడ దని మా తలంపు. క్రమక్రమముగ నా బాలుఁడు ప్రారంభ విద్యయందు కడతేఱునప్పటికి పదునాలు పదునేను సంవత్సరముల ప్రాయ మగును. అటుపైని కళాశాలయం దుత్తమవిద్యను ప్రారంభించుట కర్హుఁడౌను. తన విద్య పూర్తి యగునప్పటికి బాల్యయౌవనములు నిండియుండును. ఆ తరుణమున నభ్యసించిన విద్యలు స్వతంత్రజీవనాధారములుగను యోగ్యతాకరములుగను జ్ఞానప్రబల కారణములుగను స్వదేశాభిమానకరములుగను మానసోత్సాహదాయకములుగను పరిణమించి, వారి హృదయములయందు దయ ధర్మము శాంతి దాంతి సత్యము దేశభక్తి సమచిత్తము స్వజనప్రేమ పరార్థపరత సంఘీభావము ధైర్యస్థైర్యములు నయవినయాదులు మున్నగు సద్గుణము లుత్పన్నము లగును. ఆందువలన నొక విధమగు ప్రభావము వారియం దుద్భవ మగును. అందువలన వారే సంఘదోషములను దూషించి యైకమత్యమును నెలకొల్ప సమర్థు లగుదురు. విద్యయం దిట్టి ప్రభావ ముండుటవలననే దీని నభ్యసించినవార లసామాన్య వైభవ యుక్తు లయ్యెదరు.

దొంగలు హరించుట కవకాశము లేనిదియు, ఎల్లవేళల శుభముల నొసంగునదియు, విద్యార్థుల కొసంగిన నభివృద్ధి గాంచునదియు, కల్పాంతమం దైన నాశమును బొందనిదియు నగు విద్యారూపగుప్తధన మెవ్వరికడ నుండునో వారితో అన్యులు సమానులు కానేరరు. కావున, రాజులారా! మీరు విద్వాంసు లగువారలతో విరోధ మూనకుం డని భర్తృహరి నీతి బోధించుచున్నాఁడు. అట్టి మహత్తు గల విద్యాధనమును బాలురకు గడించి యిచ్చుటకు వారి తలిదండ్రులు విద్యావంతులుగను జ్ఞానవంతులుగను ప్రాపంచక జ్ఞాన ప్రపూర్ణులుగను నుండవలెను. ఎంత విద్యాధికు లైనను ప్రాపంచకజ్ఞాన ప్రపూర్ణులుగను నుండవలెను. ఎంత విద్యాధికు లైనను ప్రాపంచకజ్ఞాన మబ్బుట కడు దుస్తరము. అయ్యవి గల తలిదండ్రుల చేతిలోని బిడ్డనికి విద్యాబుద్ధులు సకాలమున నలవడఁగలవు.

“తన యనుంగుబిడ్డని తల్లి యెట్లు పోషించి రక్షించునో అటులే విద్య మానవుని రక్షించును. కుమారుఁడు తనవద్ద నున్నప్పుడే తల్లి పోషింపఁగలదు, గాని యన్యప్రదేశములం దున్నప్పుడు పోషింపఁజాలదు. ఇతరదేశములయందును విద్య తల్లివలె కాపాడుచుండును. తండ్రి కుమారుని కేరీతిని హితాహితనిరూపణము చేసి హితమును బోధించునో, అటులే విద్య హితమును బోధించి సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయును. చిత్తమునం దంటియున్న ఖేదమును తియ్యని మాటలతో తొలఁగించి స్వకాంతామణి యెట్లు సంతసింపఁజేయునో అటులే విద్య చింతాలతాచ్ఛేదమును గావించి హర్ష మొదఁగూర్చును. వే యేటికి? కల్పలతాఖ్య యగు విద్య గలిగినవానికి లోకమునందు సాధ్యపడని యర్థ మొకండు గలదా?” యని భోజప్రబంధకారుఁడు వచించియున్నాఁడు.

విద్యయందుఁ గల మాహాత్మ్యమును తల్లి గూడ నెఱింగియుండవలెను. ఏల నన, బిడ్డలకు ఏయే సమయములయం దెట్టి సద్బోధన చేయవలయునో, ఎట్టి సమయములయందు ఆటలు నేర్పవలయునో, ఎట్టి వేళల మనకు సకలసౌఖ్యప్రదుం డగు దేవుని గుణగణంబుల బోధింపవలయునో, ఏయే రీతుల భోజనమజ్జనశయనంబు లొనగూర్పవలయునో తెలిసికొనునంతటి విద్యాజ్ఞానము తల్లులకు లేకపోవుట వలన, వారు తమ బిడ్డలను జ్ఞానహీనముగ పెంచుచుందురు. అందువలన నా బాలురు చెడ్డమార్గముల నధిగమించి భ్రష్టులగుచున్నారు. ఇట్టివారల నెందఱెందఱినో మనము చూచుచున్నాము. బిడ్డలకు తండ్రివద్దకంటె తల్లికడ మిక్కుటమగు చేరిక యుండును గావున, తల్లి విద్యావతిగ నుండవలెను. తల్లియే బిడ్డనికి సద్బోధ చేయు సద్గురువు. శిశువు గర్భస్థ మైననాఁటినుండియు తల్లియొక్క సదుద్దేశములును సద్విద్యయు సదాచారములును బిడ్డని కాధారమై యుండును గావుననే తల్లి గుణవతి యయ్యె నేని బిడ్డలు గూడ గుణవంతు లగుదు రని వదంతి కలిగియున్నది.

శ్లో. నాస్తి వేదాత్ పరం శాస్త్రం - నాస్తి మాతృసమో గురుః — అని భారతమునందు వ్రాయఁబడియున్నది. ఈ ప్రమాణము వలన తల్లియే ముఖ్యగురు వని తెలియవలసియున్నది.

తల్లి యెట్లు బోధించిన పసివాండ్రగు బిడ్డలు అటులే వర్తింతురు. కావున ప్రథమగురు వగు తల్లి మిగుల మేధాశక్తి గలదిగను బోధనాశక్తి గలదిగను నిరంతరోత్సాహదాయినిగను నుండవలెను. కావున స్త్రీలకుఁ గూడ పురుషులకువలెనే విద్య యావశ్యకమని యెఱుంగవలెను. ఎఱిఁగియే యుందురు గాని యాచరణములోనికి తేవలెను.

స్త్రీపురుషుల శరీరములకు నేత్రేంద్రియ మెట్టి యాధారమో మనంబునకు విద్యానేత్ర మంతకంటె నెక్కుడు ముఖ్యమైన యాధారమైనట్లు కనుపట్టుచున్నది. ఏలయన నేత్రములు లేకున్నను, విద్యానేత్రము కలిగియుండెనేని, ప్రజల కత్యంతోపయుక్తములును నీతిదాయకములును నగు ఉద్గ్రంథముల వ్రాసి యజరామరమగు కీర్తిని గడించిన మహాకవు లెందఱో యుండిరి. మనోనేత్రమగు విద్య లేక మాంసనేత్రములు గలిగియుండిన జనులు అంధప్రాయు లని నమ్మవచ్చును. విద్యయం దట్టి ప్రభావము గలదు. అది కష్టసాధ్యము. అంగడియం దమ్మఁబడునది కాదు. అంగడుల దొరకెడిదే యగునేని లక్షాధికారులును రాజాధిరాజులును కోరిన ధన మొసంగి దానిని తమ ప్రేమ గల బిడ్డలకు కొని యొసంగకుందురా? కావుననే విద్య యమూల్యమనియు అనర్ఘమనియు వచించెదరు. విద్యయందలి యాశనే ధనవంతు లగువారలు ధన మెంత వెచ్చించినను ఒకచిన్నమైనను సంపాదింపఁజాలకున్నారు.

విద్యాధనమును పరిశ్రమచేతనే గాని సంపాదింపఁజాల రని భారతమునం దొక యితిహాసము వ్రాయఁబడియున్నది. భరద్వాజ కుమారుం డగు యవక్రీతుఁడు చదువకయే విద్వాంసుఁడను గావలయు ననెడి యాసచే తపము గావింప నారంభించి దేవేంద్రునిచే నివారింపఁబడియు తెలిసికొనక తుద కతని సైకతసేతునిర్మాణకార్యంబునఁ గన్న తెలిసి తనలోపంబు గ్రహించె ననుటయే యందలి సారాంశము. చదువకయే శ్రమ సేయకయే యట్టి మంత్రతంత్రములచేతను జపానుష్ఠానములవలనను విద్య లభింప నేరదు. కాఁబట్టి జాతిమతభేదములు లేక మానవులందఱును తెలుగని వెలుగని విద్యాధనార్జనము సేయుట విధాయకకృత్యమై యున్నది. ఎట్టి నిఱుపేదలైనను పరిశ్రమచేసి విద్యను సంపాదింతురేని, అవి వారిని మూర్ధాభిషిక్తులుగను సభాపూజ్యులుగను కీర్తికాములుగను చేయును. ధనవంతులము గదా యని గర్వించి సోమరులైనవారికి విద్య లభింపఁజాలదు. అట్టివారు గౌరవత్వాదిలక్షణములను పొందఁజాలరు.

ఇట్టి సద్విద్య బోధించుటకుఁ దగిన యుపాధ్యాయుఁడు గావలయును. బాలుని చిత్తమునం దేయే విద్యల నభ్యసింపవలయు నను కోరిక యుండునో, ఉపాధ్యాయుఁడు ఆయా విద్యలలో పరిపూర్ణుఁడుగాను, నిర్మలభావముతో విద్యారహస్యముల నెల్ల బోధించు నట్టి సరళస్వభావమును గలవాఁడుగాను కోపశూన్యుఁడుగాను నుండవలెను. చదివించుట కవసరమైన యుపకరణములు గలిగియుండవలెను; బాలునిచిత్తమున కెట్టిది యెట్లు బోధించిన బోధపడునో యెఱింగియుండువాఁడు గావలయును.

ఎంత విద్వాంసుఁడైనను కొందఱు బాలురకు బోధపడునట్లు వక్కాణించు సామర్థ్యము గలిగియుండరు. అట్లు గాక చక్కఁగా బోధించు శక్తి గలిగియుండవలెను. లౌకిక వైదిక వ్యాపారంబులందుఁ గల ధర్మమర్మములను సంపూర్ణముగ నెఱింగియుండవలెను. ఆలస్య ప్రమాదము లంటకుండవలెను. విద్య నేర్పునప్పుడు కలిగెడి క్లేశములకు సహించు సుస్వభావము గలవాఁడుగ నుండవలెను. పైని వ్రాసిన సద్విషయములలో కొన్నియైనఁ గలిగియుండినఁ గాని, యుపాధ్యాయాధికారము పొందుట కర్హుఁడు కాఁజాలఁడు. అట్టి సద్గుణసంపత్తి గల గురువు విద్య నేర్చుకొనుటకు ముందు వలయు పదార్థములలో మొదటిని సమకూర్చును, దానివలన సమస్తసద్గుణములును కలుగును.

అనర్పఁబడిన గుఱ్ఱము సారథికి వశమై వర్తించునట్లు, ఎవఁడు విద్వాంసుఁడో ఎవని హృదయము విద్యాయుక్తమై యుండునో అట్టి జనుఁడే వివేకశీలుఁడై యింద్రియజయము గలవాఁ డగు నని కఠోపనిషత్తునందు వ్రాయఁబడియున్నది. ఇట్లు నియమవ్రతశీలుఁడై విద్య సంపాదించినవానికి లోకములో సాధ్యము గాని కార్యములు లేవు.

కాని, వీని కంతరాయము లనేకములు గలవు. వానిలో మొదటియంతరాయము గృహిణీస్వీకారము. అందువలన సాంసారికబంధములు మెండుగా నావరించుకొనును. సంసారసాగరపతితుఁ డగు జీవి యావలియొడ్డునకుఁ జనుట యరిది. అందువలన విద్యను పూర్తి చేయలేకపోవును. విద్యారత్నమును పోఁగొట్టుకొంటినే యను చింత యొకవంకను భార్యయు పిల్లలు నొకవంకను పసితన మొకవంకను వానిని చింతాసాగరంబున ముంచివైతురు. అట్టి గృహస్థుఁడు రోగభూయిష్ఠుఁడై అల్పాయుష్కుఁడై చంచలచిత్తుఁడై అనేక కష్టములను పొల్పడవలసి వచ్చును. పైని వ్రాసిన చొప్పున బాల్యయౌవనదశలు రెండును బ్రహ్మచర్యయుక్తముగఁ గడపినవారలకు అంతరాయరహితమగు సద్విద్య ప్రాపించును.

ఇది యాచరణీయము ఇది యనాచరణీయము అని యోచించి యుక్తమార్గమునఁ బ్రవేశించుట ధర్మము. స్వప్నమందైన ప్రమాదవశంబునైనను నసత్యముం బొరయకుండుట సత్యము. చంచలస్వభావ మగు మనంబును ఏకాగ్రముగ నుంచునట్టి ప్రజ్ఞయే శమ మనఁబడును. ఇదియే మనోనిగ్రహ మనఁబడును. దమము అనఁగా బాహ్యేంద్రియములను స్వాధీనము గావించుకొనుట. తితీక్ష యనఁగా దుఃఖము మున్నగునవి యెన్ని చెందినను చలింపకయుండుట. అమాత్సర్యము అనఁగా తనకంటె ధనము గాని విద్యాధనము గాని యధికముగ నార్జించినవారిని జూచి యసూయఁ జెందకుండుట. తాను మిగుల శ్రమచేసి సంపాదించిన విద్యను పరుల కొసంగుట దాన మనఁబడును. లౌకిక పారమార్థిక విషయముల వినుట శ్రుత మనఁబడును. తాను విన్న విషయమును జ్ఞప్తియం దుంచుకొనుటయే ధృతి; దీనినే ధారణ యందురు. అన్యులవలన తన కెట్టి చిక్కులు కలిగినను వారికి ప్రతిక్రియ గావింపక వారి యపచారములను సహించుటయే క్షమ యనఁబడును.

ఈ మున్నగు లక్షణంబు లన్నియు, యమనియమంబు లనఁబడును. ఇవి శారీరమానసికములను సంబంధించి యున్నవి. ఇవియే బ్రహ్మచర్యరూపావయవము లని పెద్దలు వక్కాణింతురు. బ్రహ్మచర్యదీక్ష పాలించువాఁడే పై సద్గుణముల నొప్పి విద్య నభ్యసించుట కవకాశము గలదు గాని వివాహ మైనచో ఈ లక్షణములకు దూరుఁడగును. "వివాహో విద్య నాశాయ," అని సామాన్యముగ మనవార లందఱును వాడుచునే యుందురు. అది నిక్కువమే యని నమ్మవచ్చును.

కాఁబట్టి తలిదండ్రులు విద్యావంతు లైనయెడల బిడ్డలను సుకర మగు మార్గమునఁ బ్రవేశము గావింతురు. మనుజులకు విద్య యావశ్యకమో ధన మావశ్యకమో యోచింతురు. ఎద్దానివలన నేది సంపాదించుట సుకరమో యోచింతురు. ఏది చెడని పదార్థమో నిశ్చయింతురు.

"విద్యాధనమే తక్కిన యన్ని ధనములలోను శ్రేష్ఠ మైనది. ఏల యన, ఇతరుల కొసంగినకొలఁదిని వృద్ధి యగుచుండును. మోయవలసిన యావశ్యకము లేదు. దానివలననే యితరధనములు ప్రాపించు" నని శుక్రనీతియందు వ్రాయఁబడియున్నది. కావున ఇట్టి లోకోపకారకంబు లగు వాక్యముల పరిశోధించిన మహాత్ము లూరక తెల్పుదురా? ఇదియునుం గాక, విద్యాధనమును హృదయపేటికయందు గుప్తపఱచినవారలే ధన మార్జించుట గాని రక్షించుకొనుట గాని కలుగుచున్నది. ఒక్కొకవేళయందు ధనరక్షణమునకు విద్య యావశ్యకము. అది లేకయే మహారాజు లనేకులు తమతమ యైశ్వర్యములను గోలుపోవుట కలుగుచున్నది. విద్వాంసు లన్నచో యే కాలమందును నిలుపు లేక ధనమును కీర్తిని సంపాదించి యనేక నూతనరాజ్యములను స్థాపించుచున్నారు. ఇట్టి యున్నతస్థితులు విద్యవలననే ప్రాపించును గాని, వేఱొండు విషయమునఁ బ్రాపింపఁజాలవు.

ఇప్పుడు మన ప్రస్తుతస్థితిని బట్టి యోచింపఁగ, మన హిందువులలో బాలురకు పదిరెండు పదుమూఁడు సంవత్సరములకే విద్య కొంతవఱకు పూర్తి యగును. ఇంచుమించు సమాన మగు వయస్సు గల కన్యను వివాహము సేతురు. అంత నామె యత్తవారియింటికి వచ్చును. అప్పటినుండియు బాలుని విద్య నశించును; అనారోగ్యము హెచ్చును; చింత బల మగును. కాఁబట్టి విద్యాప్రపూర్తి యగువఱకును బాలుని బ్రహ్మచారిగనే యుంచవలెను. అటులైన విద్యాధనము సంపాదించుట కర్హుఁ డగును.

ఇహలోకపరలోకములయందు పొందఁగల సకలసౌఖ్యములకును నివాసస్థాన మగు సీమ యేది కలదో, అట్టి స్థానమును మనుజుఁడు విద్యాప్రభావమువలన నే పొందఁగలఁడు గాని, ధనమువలనఁ గాని నేర్పువలనఁ గాని విద్యావిహీన మగు తపమువలనఁ గాని పొందనేరఁడు. మనపూర్వులు బ్రహ్మచర్యనిష్ఠచే వేదాదివిద్యలు సంపాదించి జ్ఞాన మలవఱచుకొని పరిపక్వబుద్ధి గలవారై శబ్దజాల మంతయును ముఖస్థమై యుండునట్టి ధారణ గలిగి తాము గడించిన విద్యాధనమును పరులకు పంచియిచ్చుచు సకలకళానిపుణులై సర్వకార్యదక్షులై నిర్నిద్రాప్రభావులై యుండెడివా రని శ్రుతులు స్మృతులు తెల్పుచున్నవి.

ఏ కాలమునం దీ దేశీయులు సమస్తవిద్యల నభ్యసించి సంపూర్ణపాండితి గలవారలై యుండిరో, ఆ కాలమం దీ దేశము ధృతి జ్ఞానము తేజము వీర్యము పరాక్రమము బలము మున్నగునవి కలిగియుండెను.

ప్రస్తుతకాలమున నీ దేశీయులు పూర్వోక్తగుణభావములకు దూరులై యున్నారు. ఆ కారణమున మన దేశ మౌన్నత్యము నొందుటకు మాఱుగ దారిద్ర్యదేవతకు నివాసమై యజ్ఞానభూయిష్ఠమై మహాహీనస్థితియం దున్నది. మహాభారతయుద్ధము జరగిన పిమ్మట కలియుగారంభమునుండియు క్రమక్రమముగా ఈ దేశము హీనస్థితికి వచ్చినట్లు గ్రంథనిదర్శనములవలననే తేలుచున్నది. ఆ కారణమువలన ఈ దేశవాసులు విద్య నభ్యసించుటయందును, అన్యులకు బోధించుటయందును సామర్థ్యము చాలనివారలై మూఢప్రాయులై ధనాకర్షణతత్పరులై విఫలప్రయత్నులై యన్నవస్త్రములకుఁ గూడ దూరులై యల్లాడుచున్నారు. ఏ దేశము గాని యెప్పుడు గాని విద్యచేత నభివృద్ధి చెందియుండునో, అందలి జనులు అప్పుడు ఐశ్వర్యయుక్తులై యుందు రనియు విద్య కెప్పు డెచ్చట నంతరాయము గలుగునో అప్పు డచ్చటి జనులు హీనస్థితికి వత్తు రనియు సర్వవిద్యాపారగుల సిద్ధాంతమై యున్నది. ఎప్పుడు మన యార్యావర్తము పూర్వమువలె విద్యాప్రభావముచే శోభిల్లుచుండునో అప్పుడు తద్దేశవాసులు విద్యాబలమును బుద్ధిబలమును ప్రబలి కాలూనుట కవకాశము కలుగును. విద్యాభివృద్ధి మూలమున దేశౌన్నత్యాది సౌఖ్యసంపదలు గలుగును. అందునిమిత్తమై నీతిప్రయుక్త మగు విద్య నభివృద్ధిచేసికొన యత్నించుట యీ దేశవాసులకు విధాయక కృత్యమై యున్నది.

అన్ని దేశములకంటెను విద్యాబుద్ధులవలన నేమి బలపరాక్రమములవలన నేమి ధైర్యస్థైర్యములవలన నేమి సత్యౌదార్యాదులవలన నేమి యీ దేశవాసులు వెనుకఁ బడియున్నారు. తన దేహమును తాను శుభ్రపఱచుకొనుట యెట్టి యావశ్యకమో తన దేశమును తా నున్నతస్థితిలోనికి తెచ్చుటయు నట్టి యావశ్యకమే. కావున దేశభక్తు లందఱును సంఘీభూతచేతస్కులై వైపేర్కొనంబడిన కార్యముల నెఱవేర్చుటకు త్వరపడవలెను.

విద్యాస్కంధమునుండి యనేక శాఖలు బైలువెడలియున్నవి. మనుజుల యభిప్రాయములు గూడ ననేకవిధము లగు భేదములచే నొప్పుచున్నవి. శస్త్రవిద్య యంత్రవిద్య చిత్రలేఖనవిద్య శిల్పవిద్య రసాయనవిద్య వ్యాయామవిద్య మున్నగు విద్యాశాఖలు గలవు. ఇందేదేని శాఖల నధిరోహించిన, బాలురు కడగాంచఁగలరో తచ్ఛాత్రాధికారులు గాని తలిదండ్రులు గాని యభ్యాసకుల యనుమతి ననుసరించి ఆయావిద్యలయందు ప్రవేశపెట్టుట యుత్తమకార్యము. అట్లయినచో నాయభ్యాసకులు తీయనీటి కెదురెక్కు చేఁపలవలె నత్యుత్సాహయుక్తులై విద్యాభ్యాస మొనర్తురు కాని,యన్యానుమతి

ననుసరించి తచ్ఛాఖ నధిరోహింపఁజేసిరేని తచ్ఛాఖాదియందే యుండుట నిక్కువంబు.

ఆయా శాఖలయందు వ్యాయామవిద్య గూడ మనుజునకు ముఖ్యముగ నావశ్యకమై యున్నది. నియమితప్రకార ముపయోగింపకుండిన లోహాయంత్రము త్రుప్పుపట్టునట్లే దైవనిర్మితమైన యీ మజ్జాస్థియంత్రము గూడ నట్టి స్థితిని జెందును. శరీరమునకు పాదాది శిరఃపర్యంతమును వ్యాపించి యనవరతము పనిచేయు ముఖ్యయంత్రములకు పరిశుద్ధరక్తమును గొనిపోయి యిచ్చుచు అచ్చటి చెడురక్తమును పవిత్రము చేయుచుండు రక్తనాళములు ఈ వ్యాయామమువలన బలపడి యితరయంత్రములకు బల మొసంగును. భుజింపఁబడిన పదార్థమంతయు నియమితప్రకారము జీర్ణమై తత్సారము రక్తరూపముగా మాఱి నాళములయందు ప్రవేశించి ప్రవహించుచుండును. ఎంత బలువైన యాహారమును భుజించినను వ్యాయామ మజీర్ణమును కలుగనీయదు. అందువలన శ్వాసకోశము మున్నగు యంత్రములు నియమిత ప్రకారము వాయువును పీల్చుటయు విడుచుటయు కలిగియుండును. మనము చేయు పనులకును మన జీవాధారమునకును ఆధార మగు మెదడునం దుండు యంత్రముల పరిశుభ్రపఱచును. ఆ కారణమువలన కాయపుష్టియు ముఖవికాసమును ఆరోగ్యమును కలిగియుండును. ఆరోగ్య మెప్పుడు గలిగియుండునో ఆయుర్వృద్ధి గూడ నప్పుడే గలిగియుండును. పరిశ్రమవిద్యలు మున్నగునవి యిటీవల కలిగియుండలేదు. ప్రకృతిశాస్త్రకారులు దీనిని యోగశాస్త్రమనియు యోగాభ్యాస మనియు వ్రాసియున్నారు. ఈ యోగము నభ్యసించినవారు మిగుల ఆరోగ్యము కాయపుష్టి ముఖవికాసము మున్నగు సల్లక్షణములు గలిగి చిరకాలము మృత్యుముఖంబునఁ బడక యున్నట్లు తచ్ఛాస్త్రశోధనవలన తెలియుచున్నది. అదియును గావచ్చును. ఈ శరీరము గాజుకాయను బోలియున్నది. గాజుకాయ యెంత జాగరూకతతో కాపాడిన నంత కాలము శిథిలావస్థను పొందక యుండును; అటువలెనే యీ శరీరము గూడ తగిన యాహారవిహారశయనాదుల నొసంగుచు మిగుల జాగరూకులై కాపాడిన, ఆయుర్వృద్ధి కలిగి చాలఁ గాలము జీవింతు రని తత్తద్విషయకగ్రంథములు బోధించుచున్నది పరిశ్రమ యెల్లరకును ఆవశ్యకము. వ్యాయామమువలన కాయపుష్టి చెంది పట్టువల కలిగినప్పుడు శక్తిసామర్థ్యములు చూపునట్టి బలవంతునకును బలహీనునకును సామ్య మెట్లగును? విద్యాప్రపూర్ణునకును విద్యాహీనునకును సాటి యెట్లగును?

ఎవనియొక్క జీవనమువలన బంధువులు మిత్రులు భృత్యులు మున్నగువారలు జీవింపఁజాలరో, వాని జీవనము మెతుకుల నేఱికొని భుజించి జీవించు కాకి జీవనముతో సామ్య మగుచున్న దని పంచతంత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. కావున, ఏ విద్యనైనను పరిపూర్ణముగ నార్జించి తన్మూలమున వర్గత్రయమున కాస్పద మగు ధనార్జనము గావించి నీత్యౌదార్యాదిగుణయుక్తులై చిరకీర్తులైనవారల మనుగడయే మనుగడ. తదితరులు కాకిజీవనముకంటె నధమమగు జీవనము చేయుచున్నా రని నమ్మవచ్చును.

కావున దేశభక్తులగు నో ప్రియసోదరులారా! ప్రస్తుతము మన హిందువులలోను అందును బ్రాహ్మణులలోను చిరకాలము నుండి పాదుకొనియున్న యనాచారపిశాచమును తొలఁగించి సంఘమును పరిశుభ్రపఱచి స్త్రీపురుషసంఘమునకు విద్యామృతము నొసంగినఁ గాని, మన దేశ మున్నతస్థితికి రాఁజాలదు.

ఆ. గాజురాల కెంత కాంతి గలిగియున్న,
రతనమునకు సాటి రానియట్లు
కనక మెంత శోభ మనుజున కొసఁగిన,
విద్య వోలె కీర్తివిభవ మిడదు.

# ఘోషా

కోలంగిరి వేంకటకృష్ణారావు బహద్దరు గారు

ఉ. రోసము కల్గి యూరక విరుద్ధవిమర్శనముల్ లిఖింప కీ
వ్యాసముం గొని యుక్తవిషయంబును గైకొని పద్మనాయక
స్త్రీసముదాయముం గరుణచే దిలకించి సముద్ధరింప నే
జేసెద దొల్త నాకొలదిం బున్నెహితులందఱకుం నమస్కృతుల్.

ఈ ఘోషా యను దురాచారమహాభూతము తురుష్కపరిపాలనకుం బూర్వము హిందూమతంబులలోం గల దని చెప్పుట నిరాధారము. వేదములను భారత భాగవత రామాయణాది పురాణేతిహాసములలోను బృహత్కథామంజరి, కథాసరిత్సాగరము లోనగు నపౌరుషేయగ్రంథములలోను ఘోషా మన పూర్వులు జరపినట్లు కన్పట్టదు. నిండు పేరోలగంబున సింహాసనాసీను లైన పతులకుం జేదోడు వాదోడుగం జరించినట్లును, పరపురుషు లని యైన కొంకక మహానుభావులు హఠాత్తుగం దమ కగపడినప్పు డతిథిసత్కారము లొనంగి చక్కంగ వారితో భాషించినట్లును, తాము వనవాసాజ్ఞాతవాసంబుల కేగ నియమంబు లేకున్నను భర్తలతోం గూడం గాలినడకతో దుర్గమారణ్యభూములం జరియించి కడు నిడుమ లందినట్లును, నానాదేశ భూపాలచూడామణులు కొలువుకూట మలంకరించియుండంగాం దమ కిష్టమైన పురుషుల వరించినట్లును, ప్రాణేశ్వరులు సంగ్రామరంగంబున కేంగునప్పుడు వెంటనంటి రథచోదక కృత్యముల నెఱపుట మాత్రమునె కాక సమయ మేతెంచ వాలు కేలం గీలించి దుర్వారాభీలాహవకేళి వైరులం జెండాడి పతులకు జయంబుం జేర్చినట్లును, సీత, ద్రౌపది, దమయంతి, చంద్రమతి, సత్య, సుభద్ర, ప్రమీళ, వీరమాత, ఇందిర, వీరాబాయి, మొదలగు పతివ్రతామతల్లుల చరిత్రములు మన మనేకపర్యాయములు చదివి యున్నారము. దీనిం బట్టి మనము పురాణకాలము మొదలు చరిత్రకాలమువఱకు యువతీమణులు ఘోషా యవలంబించియుండ రని తెలిసికొంటిమి. పైంజెప్పిన శ్రుతిస్మృత్యాదులయందె కాక నాటకములయందుం బ్రబంధములయందు చరిత్రములందు నీ యాచార మున్నట్టు కవు లే సందర్భమునను హిందువులం గూర్చి వ్రాసియుండరు. ఈ యాచారము బ్రాహ్మణేతరజాతులలో నెప్పుడు లేదు గాన, నీ విషయమై యింకం జర్చింపం బని లేదు. ఈ "ఘోషా" ఆచారము హిందూమతములలో వంశపారంపర్యముగం గానవచ్చుట లేదు. కాని, పద్మనాయకు లనంబడు వెలమదొరలయెడ నిది నేంటికిం గానవచ్చుచున్నది. పద్మనాయకుల కీ యాచారము పౌరుషేయమా? కల్పితమా? యని చర్చించిన నిందలి సారాంశము తేలక పోదు. కొందఱు దూరాలోచన మాని వెలమవారల కిది యాచార మనవచ్చును దీనిం గూర్చిన నా ప్రత్యుత్తరముం దిలకించిన సహృదయులు ఘోషా వెలమవారల కేల పట్టుపడెనో యెప్పుడు పట్టుపడియెనో తెలిసికొనకపోరని యీ విషయ మింకం జర్చించెదను.

పద్మనాయకులం గూర్చిన పుస్తకములలోం బ్రస్తుతాంశమున కుపయోగించునది పలునాటి వీరచరిత్రము. ఇది రమారమి 500 సంవత్సరముల క్రింద శ్రీనాథ కవిసార్వభౌమునిచే మంజరీద్విపదగ వ్రాయంబడినది. ఈ కవిశ్రేష్ఠుడు పద్మనాయకుల విషయము చక్కంగ నెఱింగినవాం డని యితని భీమేశ్వరపురాణాది గ్రంథములె కాక, సర్వజ్ఞసింగమనేని యాశ్రయము గూడ ఘోషించుచున్నది. ఈ కవిరాజు తన వీరచరిత్రమున కథానాయకుం డగు బాలచంద్రునిం గూర్చి వ్రాయుచు వెలమవారల కులాచారముల నన్నింటిం జక్కంగం జర్చించియున్నాడు. భారతయుద్ధమున నభిమన్యునివలె పలనాటి వీరయుద్ధమున విక్రమముం జూపిన యభిమన్యుసదృశుం డగు బాలచంద్రుడు పద్మనాయకవంశజుండు. ఈ చరిత్రమున వెలమవారలకు "ఘోషా" ఆచారము పూర్వ మున్న దని యైనను లే దని యైనను నిరూపించుట కాధారము లున్న వేమో విచారించుట బాగు గాన, నద్దానికై కడంగెదను. నిష్పక్షపాతబుద్ధితోడ విమర్శించినచో, నీ పలునాటి వీరచరిత్రమునందు మన కులకాంతలకు ఘోషా యున్నట్లు పొడకట్ట దని మా సోదరులు కను పెట్టక పోరు. వీరచరిత్రమున బాలచంద్రుం డాడుకొనుటకు బొంగరములు కావలెనని కోరంగా తల్లి యైన †ఐతమ్మ బొంగరములు చేయించిన సందర్భ మిట్లు వ్రాయంబడినది.

"మొదలు రప్పించిన ముఖ్యులైనట్టి
యొజ్జలు తన ముందర నుండంగం జూచి
బొంగరంబులు చేయం బొసంగును మీకుం
బైండి యిప్పించెద పట్టినయంత
..................................

† ఐతమ్మ వెలమ బ్రహ్మనాయకుం డను వెలమవీరుని భార్య. ఈ బ్రహ్మనాయకుండు మహావీరుం డనియుం గృష్ణాంశసంభూతుం డనియు గ్రంథములం జెప్పంబడినది. వెలమవీరులకు, ఘోషా యున్న నీ వీరపురుషుం డేల నిరాకరించును!

పనిముట్లు తీసుక వడి ర మ్మటన్న
పనిముట్లు కొనివచ్చి భామ కన్నెదుర
భక్తితో నిలిచిరి పటిమ దీపింప
నైతమ్మ సెలవిచ్చె నంతట వారు” వీరచరిత్రము, పుట

ఈ పంక్తులఁ బట్టి విచారింపఁగా సౌన్నారులకు రాజసదృశుఁ డగు బ్రహ్మనాయకునంతవానిఁ బెట్టఁ బట్టిన యైతమ్మ కనిపించినట్లే కదా! పై పదములఁ జూచి పూర్వము మనకు ఘోషా కల దని సాహసించువా రుందురా? అయినను, మా వ్యతిరేకవాదులు “ఒజ్జలు తన ముంగల నుండంగఁ జూచి” అనుచోట “ఒజ్జలు” అను శబ్దమును గ్రహించి, గురుభావ ముంచి యైతమ్మ సౌన్నారలకు దర్శన మిచ్చుటవలన నాయమకు ఘోషాకు భంగము రా దందు రేమో? అలాగైన (సౌన్నారులు) “భక్తితో నిలిచిరి పటిమ దీపింప” అను పంక్తిలోని సౌన్నారులు చూపిన యైతమ్మ మీఁది భక్తి మా కాధారము కాదా! గురువులు శిష్యురాండ్ర చెంత భక్తితో నిలిచిరని చెప్పునంతటి వెఱ్ఱివాఁడా శ్రీనాథుఁడు?

అదియుఁ గాక, “యైతమ్మ సెలవిచ్చె” ననుటలో గురులకు సెలవిచ్చుటా? ఎంతటి విరుద్ధము! కాన నిస్సంశయముగా నైతమ్మ కంసాలులకుఁ గానవచ్చె ననియు నాయమకు ఘోషా లే దనియు నమ్మితీఱవలయును. ఇట్టి యాధారములు కావలయు ననిన, శ్రీనాథుని వీరచరిత్రమునందు లెక్కకు మించినన్ని చూపవచ్చును. కాని గ్రంథవిస్తరభీతిచే నవి యెల్ల చూపక యింకొక్క ముఖ్యాధారము మాత్ర మాగ్రంథమునుండియే యుదాహరించి యీ విషయము ముగించెదను. ఐతమ్మ తన కోడలు గృహమున కేఁగు పట్టున నిట్లు వ్రాయఁబడియున్నది.

“అనుచు నేరాండ్రు తా నందలా లెక్కి
†గండువారింటికి గ్రక్కునఁ జనిరి.

పద్మనాయకసోదరులారా! పై యంశమందలి యాథార్థ్యము గ్రహించి మీ యభిప్రాయమును లోకమునకు బోధింపుఁడు.

విషయ మే మనఁగా, బ్రహ్మనాయకుని భార్య యగు నైతమ్మ తోడికోడండ్రతోఁ గొమారుని యత్తవారింటికిఁ జూడఁబోవుట.

ఐతమ్మ తోడికోడండ్రతో నెక్కిన యందలము లెవ్వి? ఎట్లుండు నని విచారించిన ఘోషా పస తేలితీఱును. * అందలము తద్భవము. దీనికి మాతృక ఆందోళము. (పార్శ్వముల మఱుగు లేని పల్లకి.) శబ్దరత్నాకరము చూడుఁడు. మఱియు “సీ. పొందుగా నందలంబులు పల్లకీలు దత్తత నాయితము సేయు శైబికులును” కళాపూర్ణోదయము. ఆ-2. కవికర్ణరసాయనమున ఆందోళపదము “సీ. ఆందోళికలయందు నంతరచరులైన సనికృతాకృతపుఁ బిశాచజనులు” అని వాడఁబడియున్నది. ఆందోళము అందలము సమార్థద్యోతకము లనుట నిర్వివాదాంశము. ఎక్కినది ఐతమ్మ. మఱియుఁ దోడికోడండ్రతో. దేనిని? అందలమును. అది యెట్టిది? పార్శ్వముల మఱుగు లేనిది. వహ్వారే! ఘోషా యాచార మెంత చక్కఁగా పూర్వమున నున్నదో చూచితిరా! బ్రహ్మనాయకుఁడు నిరాఘాటముగ నిరుప్రక్కల మఱుగు లేని పల్లకి నెక్కించి తన సతిని తోడికోడండ్రతోఁ గూడ ప్రయాణము చేయింప, మనవారు ఘోషా యనాదినుండి కల దనిన జవాబు చెప్పవలయునా?

దీనిం బట్టి బ్రహ్మనాయకుని కాలమున అనఁగా నిప్పటికి 700 ల సంవత్సరముల క్రింద వెలమవారికి ఘోషా లే దని 500 ల సంవత్సరముల క్రిందట మహాకవి చెప్పు వాక్యముకంటె నింక ప్రబల ప్రమాణ మేమి కావలయును? పూర్వ మెన్నఁడు ఘోషా యాచారము లేకుండ పద్మనాయకస్త్రీలు మఱుగు లేని పల్లకి నెక్కి ప్రయాణముఁ గావించినట్లు స్పష్ట మయ్యెఁ గాన, నా సోదరు లీ విషయము నొప్పుకొనక తప్పదు కదా!

## ఘోషాపదము అన్యదేశీయము

“ఘోషా” ఆచార మాచరణలోనికి వచ్చిన కాలము నిర్ణయించుటకే కాక, ‘ఘోషా హిందువుల కున్నదా? లేదా?’ యను విచారణకుఁ గూడ నీ ఘోషాశబ్ద మే భాషలోనిదో విచారించుట యావశ్యకమై యున్నది. ఘోషాపదము హూణాంధ్రసంస్కృతభాషలలోఁ బ్రకృతార్థమును బోధింప దని పలువుర పండితులవలననే గాక, నా స్వల్పవైదుష్యముచేఁ గూడ గ్రహించితిని. కాని, గీర్వాణమున మాత్రము ఘోషా” యను ఆకారాంత స్త్రీలింగ పద మొకటి కానవచ్చుచున్నది. దాని కర్థము విచారింపఁగా 1. ఘోటజటీ (గొట్టె చెట్టు) 2. సుషవీ (నల్లజీలకఱ్ఱ), 3 మేఘనాదః (చిత్తికూర), అని యర్థాంతరము లున్నట్లు 1875-వ సం. న అచ్చైన సర్వశబ్దసంబోధిని యను సంస్కృతనిఘంటువువలనఁ దెలియవచ్చినది. కాని, ఘోషా యనుట కవరోధ మను నర్థము మాత్రము గీర్వాణమున లేనే లేదు. ఇఁక తెలుఁగున నందురా! తెలుఁగున ఘవర్ణము షవర్ణము లేవు కాన నీ పదము తెలుఁగు భాషలోనిది కా దని సులభముగ గ్రహింపఁగల్గితిమి. ఆంగ్లేయమున నిట్టి పద మిట్టి యర్థము బోధించుచు లే దని ఘంటాపథముగ నొక్కి చెప్పఁగలను. ఇంక నీ పద మే భాషలోనిదై యుండు ననిన, నీ యాచార మే మతమునఁ గలదో వారి దగువచ్చు ననుకొని, ప్రకృతము ఘోషా కులాచారముగ నడపుకొనుచు నా యర్థములో వ్యవహరించు తురుష్కుల భాషాపద మేమో యని తోఁచుచున్నది. తురుష్కులకు ఘోషా ముఖ్య మైన దనుటకు వసుచరిత్రములోని దగు “సీ. ఎదలపైఁ బాదలు పయ్యెదలు జాఱఁగనీక బిబ్బీలకు ముసుంగు లబ్బఁజేసె” అను సీసపాదము తోడ్పడుచున్నది. మునుపు మన దేశ మేలిన ప్రభువులలో ముఖ్యులు మహమ్మదీయులు కాన, “యథా రాజా తథా ప్రజాః” అను నార్యోక్తి ననుసరించి వారి యాచారము మన కలవాటుపడి యప్పటినుండి తురుష్కభాషనుండి వ్యవహారార్థ

†గండువారు బాలచంద్రునకుఁ బిల్ల నిచ్చినవారు. అనఁగా ఐతమ్మకు వియ్యాలవారు.
*అందలము = బాలక్రీడావిశేషము. అది యిట సమన్వయింపదు

మీ పదమును దెచ్చికొంటిమేమో యని విమర్శించుట యుక్తము గాన, నందులకై కడంగెదను.

ఈ విషయమై పారశీక పండితుల యభిప్రాయముఁ గోరఁగా ఘోషా యను నుచ్చారణ తప్పనియు, మన మే యర్థమున ఘోషా యని యుచ్చరించుచున్నారమో యా యర్థమున పారశీకభాషలో గోషా యని యుచ్చరించుచుండి రనియు తెలియఁబలికిరి. ఇప్పటి కేఁబది సంవత్సరములనాఁటి పారశీకనిఘంటువైన "గియాసుల్లోగాత్"లోను ఇప్పటి కిరువది సంవత్సరములనాఁటి "లోగాతుకిష్వరీ" యను పారశీకనిఘంటువులోను గోషా యను శబ్దమున కర్థము మూల యని యున్నది. కాని, స్త్రీలు పురుషులకుఁ గానరాకుండుటను దెలుపుటయందు మాత్రము విచ్చలవిడిగా వ్యవహరింపఁబడుచున్నది. మఱియు విశేషముగాఁ గాకున్నను తఱచుగా నేని గోషాపదము 'స్త్రీలు పురుషులకుఁ గానరాకుండుట' అను నర్థమందు ప్రయోగింపఁబడియే యున్న దని వినుచున్నాఁడను. ఉర్దూలోఁ గూడ నీ శబ్దమీ యర్థముననే వ్యవహరింపఁబడుచున్న దని కూడ తెలియుచున్నది. గోషా యను శబ్దమున కుర్దూభాషలో పర్యాయపదముగఁ బర్దా యను పదము కూడ వాడఁబడుచున్నది. పారశీక తురుష్కభాషలలోఁ దప్ప నీ యర్థ మిచ్చు నీ పదము లే భాషయందును లేకపోవుటవలనను, యవనులమే యీ యాచారమునకు మొదటి దగుటచేతను మన మెక్కుడు కాలము మహమ్మదీయ పరిపాలనమునకు లోఁబడినవార మగుటవలనను, తురుష్కపరిపాలనకుఁ బూర్వము నిట్టి యర్థమును బోధించు పదము గాని యాచారము గాని మన గ్రంథములయందు కానఁబడమిచేతను, ఈ దురాచారమునే గాక ఈ గోషా యను పదమును గూడ మనవారలు తురకలయొద్ద గ్రహించి రాను రాను గోష యని ఘోషా యని వ్యవహరించుచుండి రని నమ్మవలసియున్నది. నమ్మవలసియుండుట యేమి? నమ్మితీఱవలయును. తురుష్కుల రాజ్యకాలమున మనకు గోషా యెట్లు స్థిరపడెనో యట్లే తురుష్కరాజ్యాంతమున నీ యాచారము నశించిన బాగుండునది. ఏగడియయం దీ బీజము మొలిచెనో గాని నేఁటికి మహావృక్షమై యచ్ఛేద్యముగ నున్నది. పూర్వము రాజులు మహమ్మదీయు లగుటవలన, వారి యాచారములు మనకుఁ బట్టువడియె ననుటలోఁ దప్పు లేదు. ఒక్క నిదర్శనము: మన కాంగ్లేయ ప్రభుత్వము ప్రాప్తింపక పూర్వ మీ బూట్లు సూట్లు ముందుజుట్లు కలవా? ఇపుడు మన కలవడలేదా? అలాగే యాయా రాజుల యాచారములు ప్రజల కలవడియే తీరును. లేకున్న నది యొక న్యూనతగాఁ బరిణమించును. మా సోదరులు 'మన మొకరమే తురుష్కపాలనమునకు లోఁబడితిమా? బ్రాహ్మణాది తదితరులు లోఁబడలేదా? అలాగైన నే కులమున లేని గోషా మన కులమందు మాత్రమే యుండుట యేల? యని యొక ప్రశ్న వేయవచ్చును. దీనికిఁ బ్రత్యుత్తరము చెప్పు భారము నాయందె కలదు; ఏ మన్న, మనకును మహమ్మదీయపాలకులకును రాజకీయ వ్యవహారసంబంధము కడు దగ్గఱ యగుటవలనను, ధనమునకును గోషాకును సంబంధబంధ ముండుటవలనను, ఆ కాలపు మహమ్మదీయుల కృపవలన మనమే యైశ్వర్యవంతుల మగుటవలనను, ఈ యాచారము మనకుఁ బట్టుపడినది. మఱియుఁ దురకలు రాజ్యగర్వమున నోడ లెఱుంగక కానవచ్చిన సుందరులఁ జెఱపట్టుట గూడ హిందూమతములలో గోషా వ్యాపించుటకు హేతువై యున్నది.

## గోషా విడువవచ్చునా? కూడదా?

"గోషా" ఆచారము విడువవచ్చునా? కూడదా? అను సంశయము స్థిరపఱచుకొనుటకు ఈ యాచారమువలనఁ గలుగు లాభాలాభములు ముందుముందు విచారింపవలసియుండును. ఎంత యత్నించినను నా కీ యాచారమున నీషణ్మాత్రమేని లాభ మున్నట్లు పొడకట్టకున్నది. అయిన నన్ను కొందఱు నీ వీయాచారము విడువవలయు నను వాఁడవు కాన, నన్నియు నష్టములుగానే పొడకట్టుచున్న దని యందురేమో! ఇదివఱకీ విషయమును గుఱించి వాదప్రతివాదములు జరగినప్పుడు నేను దీని (గోషావలన) లాభము లేవి యని నా సోదరుల నడుగఁగా జవాబు నొసంగలేక 'పూర్వాచారము, మనము మాత్రము దీని నేల వదలుకొనవలయు?' నని వ్రాయసాగిరి. ఈ ప్రత్యుత్తరమందలి సరసతఁ బత్రికాపాఠకు లప్పుడే చవిచూచిరి. ఇఁక దీనివలన నష్టము లేమయిన, కలవా? యనిన ననంతములుగ గలవని చెప్పఁగలను. ఈ యాచారమువలన నంతంత మాత్రపు జమీందారులు బుక్కాపకీరు లగుచున్నా రనుటలో నతిశయోక్తి లేదు. మఱియు బీదవార లీ యాచారమువలన పడు నవస్థ వివరింప నా తరము కాదు "గోషా"జరపితీఱవలయు నని దృఢనిశ్చయముగాఁ బ్రవర్తించువారలలో నప్పుసప్పులు లేక తమ యుద్దేశమును సంపూర్ణముగ నెఱవేర్చుకొనువారు 100 కి 12 మంది యేని యుందురని తోఁచదు. వీరు మొదటి తెగలోనివారు. ఇఁక రెండవ తెగలోనివారు కొంచెమో గొప్పయో ఋణ ముండియు, నాస్తి కొద్దిగనో గొప్పగనో యుండి కష్టసాధ్యముగ గోషా నెఱవేర్చుకొనువారు. మూఁడవ తెగవారు (అనఁగా) కొంత కాలము మొదటి తెగలో నుండి క్రమశః రెండవ తెగలోఁ బ్రవేశించి యందుండి బయలుపడినవారు. మూఁడవ తెగవారే సేవకావృత్తితో 8-10 రూపాయలు నెలకు గడించుచు గోషాను నిలిచిపెట్టఁజాలక యవస్థ పడువారు. వీ రందఱు విధిగ గోషా నాచరింపవలసినవారే.

గోషా యున్నవారియొద్ద దాసీ లుండవలయును. ఒక్క దాసియె యున్న దొరసాని గారి పనులు మాత్రమే తీర్పఁగలదు. కాన, బజారు పనులకు వేఱొక కాసా యుండవలయును. అయ్యగారి సంపాదన యమ్మగారి గోషాకు సరిపోవునో పోవదా! సరిపోవకున్న కుటుంబవ్యయముతోఁ బాటు సర్వవిధముల సంసార మప్పులపా లగును. మఱియు, "గోషా" కల అమ్మగారికి ప్రయాణములు వచ్చిన మేనాలు బోయీలు కావలయును. ఈ బోయీల కలవిమాలిన ధనము వెచ్చించి విధిగ గోషా పాలించు పూర్వాచారపారాయణు లగు సామాన్య కుటుంబీకు లెట్లు కాపురము చేయఁ గలరో

యోజింపుఁడు. ఇంక యోజింపవలసిన దేమున్నది. పెద్దలు సంపాదించిన భూములు ఇల్లు వాఁకిలి పెట్టుబడిఁ బెట్టిన కోమటుల పాలై తీఱవలయును. ఈ రీతివారి నెంతమందినో చూచుచున్నాము. ఒకవేళ నీ గోషా స్త్రీలు రెయిలు ప్రయాణము చేయవలసి వచ్చినయెడల పడు నవస్థకు మితము లేదు. ప్రతి రైల్వే ఆఫీసరు బెదిరించినను గోషా స్త్రీల పోషకుఁడు కొంత చేయి జాఁచి యాచారము కాపాడుకొనవలయును. లేకున్న సరివారిలో నమర్యాద. ఈ కొఱమాలిన వ్యయములవలన సామాన్య కుటుంబములు తప్పక యప్పులపాలయితీఱును. నా యభిప్రాయ మీ గోషా దేశానర్థకమునకుఁ గూడఁ గొంతవఱకు సాయపడుచున్నదనియె. ఎట్టులనఁ బురుషులతోఁ బాటు ఏ యంశమునసేని తక్కువ యనిపించుకొనక మీఁదుమిక్కిలి కొన్ని యంశంబుల మేలుచేయ యనఁజాలు స్త్రీలను గృహద్వారము దాఁటి వచ్చిన కుక్కను గొట్టినట్లు కొట్టుచు నతి నీచముగఁ జూచుచున్నారము కదా! వీరికి గోషా ఆచారమే లేకున్న పురుషులకుఁ దోడై దేశసేవ చేయుచుఁ గీర్తి నార్జింపకయుందురా? సాటి దేశములతోఁ బాటు మన దేశము గూడ దినదినాభ్యుదయము గాంచి పూర్వౌన్నత్య మార్జింపక పోవునా? గోషా స్త్రీల విద్యకుఁ గూడ ఈ దురాచారమే యాటంకము గల్గించుచున్నది. గోషా పాటించు ప్రతివారును స్త్రీలను పదిసంవత్సరములు దాఁటినఁ బరపురుషులకుఁ గానరానీయరు. ప్రపంచమును జూడనీయరు. ఈ లోపుగ స్త్రీ ప్రపంచజ్ఞాన మెంత యలవరుచుకొనఁగలదు? విద్యావ్యాపక మెంత చేసికొనఁగలదు? ఎక్కుడు తెలివిగల కన్యయైన ఒరులు వ్రాసిన యుత్తరము నెట్లో కష్టసాధ్యముగఁ బఠింపఁగలదు. అంతలో విద్యాభంగము వాటిల్లును. అందువలననే గోషా పాటించు స్త్రీలలో నుత్తమవిద్య కానరాకుండుట. విద్యాజ్ఞానము లేని స్త్రీలవలన దేశమున కెట్లు మేలు లభింపఁగలదు? కొందఱు గోషాయం దభిమానము గలవారు "మన స్త్రీలకు విద్యయే కావలసియున్న స్త్రీలచేతనే చెప్పింపరాదా?" అందు రేమో? స్త్రీవిద్యయే కడు తక్కువగా నున్న యీ కాలమున నుత్తమవిద్య బోధించు సతులు తఱచు లభింతురా? లభింతురే యనుకొనుఁడు. అంతంత మాత్రపువారు వారలకు జీతముల నిచ్చి భరింపఁగలరా? ఏ పిఠాపురము రాజాగారి వంటివారో నెలకు వందలకొలఁది యిచ్చి యఫ్. ఏ., బి. యే. లు ప్యాసయిన స్త్రీలను భరింపఁగలరు గాని సామాన్యులకు సాధ్యమా? కనుక స్త్రీవిద్యకుఁ గూడ నీ దురాచారము ప్రతిబంధకమే. ఇఁక పద్మనాయక స్త్రీలకు ప్రపంచజ్ఞాన మెటులుండును? భాషాజ్ఞాన మెటులుండును? గోషాస్త్రీలు ఇల్లు దాఁటి బయటికి రారు. గోషా సాగించుకొనుచు స్త్రీలు దేశాటన మొనర్చిన నెంత లాభమో యొనర్పకున్న నంతియు లాభము. గొప్పగొప్ప జమీన్దారులు స్త్రీల గోషా పాలించుచు సంచారము సలుపఁగలరేమో గాని సామాన్యుల కిది సాధ్యమా? సాధారణముగ గోషా స్త్రీలు ప్రయాణము సలుపునపుడు కొంచెమేని సందు లేని గుఱ్ఱపుబండ్ల నెక్కుదురు. ఏమి లాభము? వీరు ప్రపంచమును సృష్టివిచిత్రములను చూచు నోములు నోఁచుకొనలేదు.

సోదరులారా! ఈ గోషా ఆచారమువలన ధనవ్యయమా యెక్కువ. విద్యయా శూన్యము. ప్రపంచజ్ఞానమా పూజ్యము. నవనాగరకతయా హుళిక్కి. దేశోద్ధరణమా సున్న.—అని నిదర్శనపూర్వకముగ నీ వ్యాసమువలనఁ దేలినది. కాన, లాభములు లేకపోఁగాఁ బై పెచ్చు నష్టము లనేకములు కల యీ గోషా యాచారముం బట్టి పూర్వాచారరతులు వ్రేలాడక యీ దురాచారనిర్మూలనము గావించుట యుక్తము. ఇది విసర్జనీయ మని శాసించుచున్నాఁడను. ఇంత మాత్రమున నుత్తమవిద్య ప్రపంచజ్ఞానము కల స్త్రీలు (గోషా యాచారము గలవారి కుటుంబములలో) లేరనఁజాలను. వేయిమంది కొక్కరేని యుండకపోరు. స్త్రీసమాజములలో నట్టివార లుపన్యాసములు కూడ నొసంగుచుండి రని కర్ణాకర్ణిగ వినుచునే యున్నారము. అది శుభసూచకమే. ఆ వార్త కర్ణరసాయనమే. కాని, మన స్త్రీ లందఱట్టె యుత్తమవిద్యావతులైనఁ గాని దేశము సంఘము కులము బాగుపడవు.

## గోషాకు కారణములు

హిందూదేశమును తురుష్కులు పాలించుతఱి కమ్మవారు రెడ్డివారు వెలమవారు లోనగువారు సామంతప్రభువులుగ నుండిరి. ఆ మహమ్మదీయులకు లోఁబడి వారి యడుగులకు మడుఁగు లొత్తుచు వారి వేషాచరణలు కలవారలో యటుల చరించుచుండుటచే హిందూమతములో గోషా ప్రబలినది. ముష్కరు లగు తురుష్కులు రాజ్యగర్వమున నోడ లెక్కింపక చూపునకు వచ్చిన పరకాంతల నెపుడు చెఱపట్టిరో అప్పుడే గోషా హిందువులలోఁ బట్టువడినదందురు. అదియు యథార్థ్యమే. నిజమునకు ప్రభువుల యాచారము ప్రజలకు నచ్చుట సాజము కాన, నే కారణమువలననైన నేమి మనకు గోషా తురుష్కులనుండియే వచ్చినదని శాసింపఁగలను.

ఇంతదనుక నెందులకు? నేఁడు హూణరాజులఁ జూచి స్త్రీస్వాతంత్ర్యమునకై కొంతమంది యెట్లు పోరాడుచున్నారో నాఁడా మహమ్మదీయుల కాలములో గోషాకొఱకట్లె పోరాడి స్థాపించి రని తోఁచుచున్నది. వ్రాయ మఱచితిని. ఇప్పటికి తురుష్కపాలనమునకు లోఁబడిన నైజాము రాష్ట్రములోని హిందువు లందఱును గోషా పద్ధతి నవలంబించుచున్నారు. దీనింబట్టియేని యీ యాచారము తురుష్కుల దని పలుకవచ్చును. ఇప్పుడేని గోషాయం దాసక్తి కలవారు దీనిని మహమ్మదీయులు దెచ్చిపెట్టిరని సాధ్యమైనంతవఱకీ యాచారము నేల తొలఁగించుకొనరో తెలుపఁజాలను. మఱియు గోషాకు ధనము కూడఁ బ్రాధాన్య మని చెప్పవచ్చును. ధనవంతులైన మాత్రమున గోషా పట్టువడునా? యని యోజింపఁ బని లేదు. ఇప్పుడిప్పుడు కొన్ని జాతులవారు ధనవంతులయి యిది యొక ఘనత యని కాఁబోలు తమ స్త్రీలను గోషాలో నుంచుచున్నారు. అప్పుడు మనము ధనవంతుల మగుటచే గర్వించి యవనరాజస్త్రీలు వెలికి రాకుండుటచేతనే గౌరవపాత్రులైరని భ్రమించి పులిని గని నక్క వాఁతలు పెట్టికొనినట్లు మనవారు గూడ స్త్రీలకు గోషా కల్పించి రనవచ్చును. తురుష్కులు విషయలంపటులై హిందూకాంతలకు సేగి కావించి రను పలుకు నిరూపింపవచ్చును. పూర్వపు మొగలాయి ప్రభువులలో సత్ప

వర్తము డని పేరొందిన అక్బరే శ్రీవేషమునఁ బృథ్వీసింగు భార్యను బలిమింగొనిపోవఁ బ్రయత్నించె నని సుప్రసిద్ధ చరిత్రకారులగు కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. గారు మహమ్మదీయ మహాయుగమున వ్రాసియున్నారు. కంచెయే చేను మేసిన నేమున్నదను నార్యోక్తిరీతి రాజులే యిట్టి దుష్ప్రవర్తకులు కాఁగా ప్రజలగుట యొక గొప్ప విషయము కాదు. ఆ రోజులలో నెవటఁ జూచిన నిట్టి కల్లోలములు జరుగుటవలన మానసంరక్షణార్థమై మనవారికి గోషా ఆచారమును స్వీకరించుట తప్పు కాదు. కాని, అట్టి గోషా అనుపయోగమైన యిత్తఱి దాని పాటించుటయే మహా ద్రోహకరము. ఈ గోషా పదము తురుష్క భాషనుండి మనవా రెట్లు తెలుఁగులోనికిఁ దెచ్చికొనిరో అట్లే ఆచారమును బూర్వము తురుష్కులకో అకే వినియోగించిరి. రానురా నీ యాచారము హెచ్చుపెరిఁగి ఆఁడువారలఁ బ్రపంచము చూడనీయరాదను విరుద్ధాభిప్రాయముకో అ ఘంబుట్టిన దని పలువురకు భ్రాంతి కలిగించుచున్నయది. అక్కటా! ఈ తురుష్కుల కాలమున నెన్ని కల్లోలములు జరిగినవి? శ్రీవిద్యనాఁడే నశించె. హిందువుల యౌన్నత్య మపుడే యడఁగెంటె. దేవతామందిరము లపుడే భగ్నమయ్యె క్రమముగా రానురాను విద్యాగంధశూన్యుల కీ గోషాయందలి పాపాంశము ఇది వ్యాపించుటకు హేతువు అజ్ఞానమై, పూర్వ తెంపరియో లాభము లేకున్న నీయాచారము నిల్పుదురా యను నొక గొప్ప యూహ కలుగుచున్నది. కొందఱు ప్రభువుల కీయాచారము యోగ్యమగును. ఇది యుక్తమా? పూర్వము కృష్ణదేవరాయలయంతటి రాజవరేణ్యుఁడు పుణ్యయాత్రలకు స్వేచ్ఛగ భార్యలతోఁ జరించినట్లును, తిరుపతిలో నతనికాంతల దివ్యవిగ్రహముల నిత్తడితో చేయించినట్లును మనము చూచుచునే యున్నారము. ఇప్పటికి నీ దురాచారము వెలమవారియందును రెడ్డివారియందును కమ్మవారియందును గానవచ్చుచున్నది. మఱియు "గోషా"ను గుఱించి బందరు శతావధానములోఁ బృచ్ఛకునకు తిరుపతి వేంకటేశ్వరకవులు 1910-వ సంవత్సరమున నిట్లు సెలవిచ్చియున్నారు:—

ఉ. కామిను లింట నుంచుటకుఁ గారణముల్ విచరింపవాఁడ నే
నేమని యన్న దుష్టులగు నెవ్వరిచేతను బోని లేమియే
సామజయాన సుందరి నిజంబుగఁ గన్పడినంత నాపెపై
ప్రేముడి నిల్పి రేతురకబిడ్డలు నాఁడుదయించె ఘోషయున్.

ఈపద్యము కూడ నాపైకారణమున కాధారమగుచున్నది. గోషా వ్యాపకమునకుఁ గారణములు నిరూపింపఁబడినవి. కాన నిజము గ్రహించి గోషా కూడునా కూడదా యను విషయమునఁ గూడ దని సహేతుకముగ నేను వ్రాసిన వ్రాతను జూచి "గోషా" దురాచారమును నిర్మూలము గావింప నగనాగరకసోదరులు ప్రయత్నింతురు గాక!

ఇఁక మీఁది చర్చనీయాంశమునకుఁ బోవుదము. గోషా ఆచరించు జమీన్దారీ లన్నియు సాధ్యమైనంతవఱకుఁ దురుష్కుల పాలనలో వచ్చియున్నవని యనేకాధారములవలన నిరూపింపఁగలను. మఱియు వీరందఱు తురుష్కులకు సామంతులుగ నున్నవారే. కొన్ని కొన్ని సంస్థానములు మనవారలకుఁ దురకలు స్వయముగా నిచ్చినట్లు కూడఁ దెలియవచ్చును. ఆకారణముచేతనే యిప్పటికిని ఆయా జమీన్దారుల సంస్థానములలో వాడఁబడు వ్యావహారికపదములు కూడ హిందూస్థానీభాషలోనివిగనే యున్నవి. దీని కుదాహరణముగ ఫసలీ మహసూల్ పేష్కర్ తహసీలు సనదు కిస్తి పేష్కుషు ఖాజలు మతలబు సముదార్ శిరస్తేదార్ తహసీల్ హుజూరు లోనగు మాటలు సాధారణముగ స్వదేశసంస్థానములలో నేఁటికిని వ్యవహరింపఁబడుచున్నవి. అంతదనుక నేల? మనము రాజచిహ్నముగ నాయము చిపవనుంచుకొను బహద్దరు పదము కూడ తురుష్కభాషలోనిదే! వీని నన్నిటిని సమన్వయము చేసి చూడ, తురుష్కులకు మనకుఁ గల సంబంధములు గోషాను గూర్చిన విశేషములు స్ఫురి త మయుతీనవు. పయి పదముల మాదిరిగనే గోషా కూడ మనకు దేశకాలావస్థలం బట్టి యాచారముగ నేఁటికిఁ గానవచ్చెడిని.

## ఈ కాలమునకు ఘోషా తగునా?

గోషా విషయమై సంపూర్ణముగ నింత చర్చించిన పిమ్మట నీ యంశమునకు జవాబు వ్రాయుట కడు తేలికగ నున్నది. గోషా ఆచార మెప్పటికిని తగదు. అందీ కాలమున మొదలే తగదు. గోషాను పూర్వము మనవారు శ్రీమానసంరక్షణముకొఱకును అప్పటి ప్రభువుల యాచార మగుటవలనను దానివలన గౌరవము కల దని తలంచియు స్వీకరించియుండిరి. అది సత్యమే. నేఁటి కాలమునఁ బులియు మేఁకయు నొక్క రేవున నీరు ద్రావునట్లు పాలించు నీ యాంగ్లేయప్రభుత్వకాలమునఁ గూడ నా దురాచారము నేల సాగనీయవలయును? కొందఱు పూర్వకాలమునుండి వచ్చుచున్న యీ యాచారమును బోనిచ్చుట యెట్లని చున్నారు. కాని, నేను పూర్వకాలమున నీ యాచారము లే దని సాధారపూర్వకముగ నిరూపించితిని. ఆ చర్చ పిష్టపేషణముతో సమాన మని విడిచి ప్రకృతమునకు వచ్చుచున్నాఁడను. మనమందఱ మొక రాజునకు బద్ధులము కాన నప్పటి రాజుల యాచారము స్వీకరించితిమి. ఇప్పుడు ఇప్పటిరాజుల యాచారము స్వీకరించి దేశానర్థదాయక మగు గోషా నేల విడువరాదు? ఆచారములు కాలానుగుణముగ మాఱవద్దా? ఏ కాలమునకుఁ దగిన గొడుగా కాలమున పట్టవద్దా? కాన, గోషా ఆచారము తగదు. అది విసర్జనీయ మని శాసించెదను. గోషా ఆచారమందు పట్టుదలగల వారి కుటుంబములలోని నవనాగరికులు పలువురు నా యభిప్రాయము నామోదించి యీ దురభిప్రాయమును తొలఁగించుకొనుచునే యున్నారు.

ఈ సదుమ పత్రికాముఖమున చెలికాని సీతాపతిరావు గారును కొలఁది దినముల క్రిందట విద్యార్థియు, వార్తాముఖమున రావు సత్యనారాయణమూర్తి గారును వీ రందఱికి పూర్వము వేంకటాద్రి యప్పారావు బహదూరు గారును, సత్యవాదియు, ఈ విషయమున నాతో నేకీభవించిరి; ఏకీభవించినవా రింకను పలువురు గలరు.

కులాభిమానులు దేశాభిమానులు శ్రద్ధతో నీ వ్యాసమును తిలకించి శ్రీల గోషా తొలఁగించి దేశారిష్టమును బాపఁ బ్రార్థితులు. నా వ్యాసమందు వ్యతిరేకాభిప్రాయము గలవారు తిట్టులకు దిగక, నామములు దాఁపక సవ్యముగ ప్రత్యుత్తర మొసంగినచో వారలకు జవాబు చెప్ప సిద్ధముగ నున్నాఁడను.

# సంఘసంస్కారము

ఎమ్. భుజంగరావు బహదూర్ గారు

పశ్చిమమార్గానుసారముగా విద్యాభ్యాసము గావించుకొనిన హిందువులలో హిందూమతము, ఒంటెత్తుతనమును సాంఘికధర్మవిరోధమును గలిగించు శీలము కలదై యున్న దనియు, అందు మూలమునఁ దన్మతోద్ధరణమువలననే సంఘసంస్కారమును సాగనేర దనియు, కాఁబట్టి మనము పశ్చిమము ననుకరించి దానినుండి జ్ఞానజ్యోతిని బడయవలయు ననియుఁ దలంపులు గలుగుచున్నట్లు కాన్పించుచున్నది. ఇట్టివారికి జాతిధర్మానుసారమైన సంస్కారమందు నమ్మకము లేదు. కానఁ బూర్తిగాఁ బాశ్చాత్యుల సాంఘికధర్మ మవలంబింప వీరు ప్రయత్నము చేయుచున్నారు. వీరు జాతిధర్మవిలక్షణ మగు యుక్తిధర్మముపై నొక నూతనసాంఘికభవనమును గట్టఁ బ్రయత్నమును జేయుచున్నారు.—అని శ్రీ లాలా లజపతిరాయి గారు కాయస్థసమాచార పత్రికయందు 10-వ సంపుటము 4-వ సంచికలో వ్రాసియున్నారు.

సంఘసంస్కారమును గూర్చి లేనిపోని గాథలతో ప్రజార్థము కాని మాటలతో గొడవలను వ్రాయుటకంటె దేశభక్తులగు శ్రీ లాలా గారి పైవాక్యమందలి సారమును బరిశీలించిన సంఘసంస్కారమున కెక్కుడు సహాయసంపత్తులు చేయఁగలుగుదు మని భావించి సంఘసంస్కారమునకుఁ దటస్థించిన విపద్దశను సూచించు పైవాక్యము ననుసరించియే నే నీ వ్యాసమును వ్రాయఁబూనితిని.

లాలా గారు, అపరసరస్వతు లగుటయే గాక, దేశక్షేమమునకై యెన్నివిధముల వ్యయప్రయాసములకు లోనై పాటుపడిరో వేఱుగఁ జెప్ప నవసరము లేదు. అది యంతయు సర్వజనవిదితమే.

వీరు కూపస్థమండూకమువలె జన్మస్థానమును విడువకయే సర్వసాంఘికాచారములను విపులము చేయఁ బ్రయత్నించినవారు గాక, సకలదేశసంచారము చేసి యాయా తావులం గల యాచారములను వాని భేదములను బరిపూర్ణముగా గ్రహించి లోకానుభవమును సంపాదించుకొని యే విధముగా నుండిన సంఘమునకు బాధ లేకుండునో యట్టి మార్గమును బయటికిఁ దీసి యీ మీఁది వాక్యములను వెలువరించియుండుటచే, వానియం దెక్కుడు సారము కలదని యెల్లరును విశ్వసనీయములుగా నెంచక తప్పదు.

హిందూమతమునకును జాతిధర్మములకును సంబంధ మేమియు లేదు; ప్రతిబంధకమును లేదు. కాని, కులాచారముల ననుసరింపనిచో మానవులు పాపు లగుదు రని మనవాండ్రు సాధారణముగా చెప్పెడి మాటల నంత పాటిగాఁ గొనుట తగదు. అయ్యవి మన్వాదిధర్మశాస్త్రకర్తలు తమ నియమించిన యాచారములను ప్రజలు తప్పక ఆచరించవలె నని చేసిన యేర్పాటులై యుండవలెను. లేదా, ఇటీవల ప్రజ లా యాచారములనుండి విముఖు లగుటంబట్టి మన వృద్ధులు పన్నిన పన్నాగమై యుండవలెను. ఎటు లన, క్రైస్తవాది మతములందు, అవతారపురుషులు చేసిన విధానములు కొన్నియును, అర్చకులు సమారాధనాది మతకార్యములయందు చేయవలసిన తంతు నిమిత్తమై చేయు విధానములు కొన్నియును గలవు. పూజావిధానములు గూడ నవతారపురుషు లేర్పాటు చేసిన విధానములతో పాటివే యనుట యెంత సమంజసముగా నుండునో, సాంఘికధర్మములను మతధర్మములతోఁ బోల్చుటయు నంత సమంజసమే. హిందూమత మన, వేదములయందు విశ్వాస ముంచుట, అవతారపురుషులం బూజించుట మొదలగునవి యై యున్నది. ఇది యన్ని జాతులవారికిని సమానమే. ఇఁక జాతిధర్మము లన్ననో ఒక్కొక్క జాతివారి కొక్కొక్క విధమగు ధర్మము లేర్పాటయి యున్నవి. ప్రజలకు దర్జాను జూపించు సాధనము లనేకము లున్నవి. అందులో జాతు లనునదియు నొక విధమగు దర్జాయే యై యున్నది. జాతిధర్మముల ననుసరింపనివారు తమ దర్జానుండి దూరులై హీనదశకుఁ బాత్రు లగుదురు. ఇట్టి గౌరవమును గాపాడుటకే మనవారు కులాచారధర్మములను విడనాడినచో నధోగతిపా లగుదు రని యనేకవిధముల నొక్కి భయపెట్టి చెప్పియున్నారు. అంతియే గాని, జాతిధర్మముల ననుసరింపనియెడల మనకు నరకము సంభవించు ననియు, భగవంతుని దృష్టిలో విరోధుల మగుదు మనియుఁ జెప్పెడి మాట విశ్వాసపాత్రము కాదు. మఱియును బ్ర. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారు హిందువుల సాంఘికధర్మమును గూర్చి యిట్లు వ్రాసియున్నారు. ఏమనఁగా: "హిందువుల సాంఘికధర్మములకు మూలము ఒక దేశమును ఒక జాతియును గాదు. ఒక సంఘముయొక్క యభివృద్ధియు ఒక దేశముయొక్క లాభమును వీరు కోరియుండలేదు. వీరు కోరినది యాత్మాభివృద్ధి. వీ రభిలషించినది ఆత్మయొక్క లాభమును ఆత్మయొక్క ఘనతయును నై యున్నది. లోకములో నాత్మ యంతటను వ్యాపించియున్నది. హిందువులయందున్న యాత్మయు మహమ్మదీయులయందున్న యాత్మయు క్రైస్తవులయందున్న యాత్మయు నొక్కటియే. జీవకోటియొక్క అనుబంధమునకుఁ గారణ మాత్మయే." అని. మన పూర్వులు చేసియున్న యేర్పాటులయందు రానురాను చెడుగులు ప్రవేశించి పయి యేర్పాటు లన్నియుఁ జెడుగులై సాంఘికాభివృద్ధికి ఆతంకములుగాఁ బరిణమించినవి. అట్టి యాతంకములను దొలఁగించుటకు మనము సర్వవిధములఁ బ్రయత్నింపవలసినదియే గాని మనము సంఘముమీఁదఁ గోపపడిన సంఘమున కెట్టి లాభమును జేయఁజాలనివార మగుదుము.

కనుక ప్రస్తుతము హిందూమతమును ద్వేషించి జందెములన

ద్రెంపుకొని యగ్రజాతిని దూషించి తామేమో సంఘాభివృద్ధి గావించెద మని చెప్పువారు దేశమున కెట్టి లాభము చేయఁగలరో యోజింపవలసియుండును. నవనాగరకులు ప్రజలు పడుచున్న కష్టములను జక్కఁగా గుర్తెఱిఁగి వారికి మార్గమును సూచించుటకు బదులు ముందుగఁ దాము మతభ్రష్టులై ప్రజల ననేకవిధములఁ దూలనాడుచున్నారు. ఈ కారణముచేత వీరు ప్రజావిరోధము సంపాదించుకొని ప్రజలనుండి దూరగులగుచున్నారు. వీరి మాటలందుఁ బ్రజల కెంత మాత్రమును విశ్వాసము లేదు. ప్రజలయొక్క కష్టసుఖములను గుర్తెఱిఁగి సమయము వచ్చినపుడు వారికి మంచిత్రోవఁ జూపిన వారు బాగుపడుదురే కాని, వారిని నిందించినచో నెవ్వరును సమీపమునకుఁ జేరరు. ప్రజామార్గదర్శకులుగా నుండువారు ప్రజలలో నొకరై యుండవలెను గాని, తామేమేమో గొప్పవార మని చెప్పి పయిపయిం దిరిగిన, లాభము లేదు. నవనాగరికు లందఱు నేదియో యొక సంగతిని బట్టుకొని దానినే సాధింప నెంతురు గాని, ప్రజ లెట్టి కష్టములఁ బడుచున్నారో వాని నెట్లు నివర్తింపవలయునో గుర్తెఱుంగఁజాలకున్నారు. ఇట్టివారిని గూర్చియే లాలా గారు మీఁది వాక్యమును వ్రాసియున్నారు. ఈ సందర్భములో నీ క్రింది విధముగా వివేకానందస్వాములవారు వ్రాసియున్నారు:

"ప్రపంచమునందలి చెడుగును బాగుచేయవలె నన్న నిత్యాభివృద్ధి గావించుటయే ముఖ్యమైన పని. మనుష్యు లెంత గట్టిగా మాట్లాడినను ఇంతకంటె నేమియుఁ జేయఁదగిన పని కాన్పింపదు. చెడుగును దొలఁగింపవలె నని ప్రయత్నించువారి సంగతిని మొదట ముఖ్యముగా గ్రహించితీరవలెను. ఈ విషయమున మనము స్వస్థచిత్తము కలవారము కావలయును. మన రక్తమునుండి దుర్గంధమయిన వెట్టిని తొలఁగింపవలెను. అప్పుడు ప్రపంచచరిత్ర, వచ్చినారయి పట్టుదలతోఁ జేసిన సంస్కారములే వాని యుద్దేశములను నశింపఁజేసినవని, మనకు బోధపఱుపఁగలదు."

మన సంఘములోఁ జెడుగు లున్న వని ప్రతివానికిని దెలియును. ప్రతిబాలుఁడును సభలలో మన చెడుగులను వాగ్ధోరణితో వెలిపుచ్చఁగలుగును. ప్రపంచయాత్ర చేయనెంచిన ప్రతివిదేశీయుఁడును మన దేశమందు రయిలులోఁ బ్రయాణము చేసినంతమాత్రముననే అందలి చెడుగులను వెలిపుచ్చు గొప్ప యుపన్యాసముల నిచ్చుచున్నాఁడు. ప్రతివారును మన చెడుగులను బయలుపఱచువారే కాని వానిని సాధించు మార్గము కనఁబఱచువారొకరును గానరారు. ఉపన్యాసములతోను సభలలోను వార్తాపత్రికలలోని వ్యాసములలోను మన ప్రాణములు విసిగిపోవుచున్నవి. కాని, మనలను బురదనుండి తప్పించు మానవుఁడు కావలెను. అతఁడే మనకు ముఖ్యబంధువు. ఇప్పటి నవనాగరికులును అట్టి దేశబంధువు లని చెప్పుటకు జనసామాన్యము వెనుదీయుచున్నారు. వీరు దాదాపు వంద సంవత్సరములనుండి సంఘోద్ధారణమునకై పాటుపడుచున్నారు. ఇందలి ప్రతిఫల మెద్ది యని విచారించి చూచినఁ గొంచె మించుమించుగాఁ బూర్వాచారపరాయణులను దాదాపు బండబూతులతోఁ దుల్యమగు భాషలో వ్యాసములను ప్రహసనములను వ్రాసి నిందించినారు. పాపము! కొంత కాలమునకే పూర్వాచారపరాయణులు కూడ నిందాభారమును మోయఁజాలక నవనాగరికులను వారి భాషలోనే తిట్టుట నారంభించిరి. ఈ విధముగా ద్రావిడభాషలు లోనుగాఁ గలిగిన మన హిందూదేశమందలి భాషలలోఁ జూడంగూడని చదువఁగూడని గ్రంథసామగ్రి బయలుదేఱినది. ఇంతకన్న నధికలాభ మేమియుఁ గానుపింపలేదు. ఇదియా సంఘసంస్కారము! ఇదియా దేశమాత నుద్ధరించుట!

ఇఁక లాలా గారు వ్రాసిన పై వాక్యములోని రెండవ యంశమును అనఁగాఁ బశ్చిమమును వరించి దానినుండి జ్ఞానజ్యోతిని బడయుట మంచిదా కాదా యను విషయమును జర్చింపవలసియున్నది. పశ్చిమఖండమందలి నాగరకతను గూర్చి లాలా గారిట్లు వ్రాసియున్నారు: "ప్రస్తుతము పాశ్చాత్యుల నాగరకతకు మూలమయిన పాశ్చాత్యుల సాంఘికధర్మములోఁ దప్పక లోప మొకటి యుండి తీరవలయును. కావుననే విద్వాన్ హాక్స్‌లే యంతటివాఁడు గూడ నీ నాగరకతను నిందించియున్నాఁడు. పండితుఁ డగు హాక్స్‌లే చెప్పిన వాక్యము లివ్వి యున: 'ఇప్పటి నాగరికతలలో మిక్కిలి ప్రసిద్ధి నొందినది గూడ సుస్థిరత లేనిదియు, ఉన్నతమైన పరమావధి లేనిదియునై యున్నది. మానవకుటుంబములలోఁ జాల భాగ మభివృద్ధి కానియెడల నొక తోఁకచుక్క వచ్చి దీని నంతను సిద్ధిఁ బొందింపఁ గోరెదను' అని."

దీనిని బట్టి పాశ్చాత్యుల నవధర్మములు నింద్యములై జాత్యభిమానపురస్కృతములై యున్న వని స్పష్టపడుచున్న దని లాలా గారు తెల్పిరి. ఈ సందర్భములో బ్రహ్మయ్యశాస్త్రి గారు ఇట్లు వ్రాసినారు: "పశ్చిమదేశసంఘములు తమ లాభమును గోరియే యితరుల కన్యరీతిగా లాభములు చేయఁ గోరుదురు గాని కేవల పరార్థపరత్వముతో నెన్నఁడును జేయరు. తమ సంఘము బాగుపడుటయే వీరి ముఖ్యోద్దేశము. మానవకుటుంబమునకు లాభకరము గాక యొక తెగవారికే మాత్రమే లాభకరమగు నుద్యమము నడుపుటయే మంచి దని హాక్స్‌లే దొరగారు వ్రాయుటకుఁ గారణము పాశ్చాత్యుల కుమార్గములే యనవచ్చును. ఇట్టి తంత్రములను ఇట్టి సాంఘికధర్మములను పాశ్చాత్యులనుండి గ్రహించుటకే మన సంఘసంస్కారప్రియులు ప్రయత్నించుచున్నారు." ఈ పయి వాక్యములను బట్టి చూడ, మన సాంఘికధర్మములు పాశ్చాత్యుల సాంఘికధర్మములకంటె నీచములు కావని [illegible] మనకు తోఁచిన [illegible] స్పష్టము కాఁగలదు. పాశ్చాత్యధర్మములకును మన సాంఘికధర్మములకును భేద మెట్లున్నను, మన ప్రజలు మన సాంఘికధర్మముల విడనాడి పాశ్చాత్యధర్మములను గ్రహించుట [illegible] కాదు. సంఘసంస్కారవిషయములో మంచి పెద్దలు ప్రజల యొక్క ప్రజాభిప్రాయమును బొత్తుగా సరకుగొనక యుండుట మంచిది కాదు. ప్రజ లందఱుఁ దమ ధర్మములను విడనాడుటకు సిద్ధముగ లేరు.

# సంఘసంస్కారము

ఎమ్. భుజంగరావు బహదూర్ గారు

పశ్చిమమార్గానుసారముగా విద్యాభ్యాసము గావించుకొనిన హిందువులలో హిందూమతము, ఒంటెత్తుతనమును సాంఘిక ధర్మవిరోధమును గలిగించు శీలము కలదై యున్న దనియు, అందు మూలముచే దన్మతోద్ధరణమువలననే సంఘసంస్కారమును సాగ నేర దనియు, కాఁబట్టి మనము పశ్చిమము ననుకరించి దానినుండి జ్ఞాన జ్యోతిని బడయవలయు ననియుఁ దలంపులు గలుగుచున్నట్లు కాన్పించుచున్నది. ఇట్టివారికి జాతిధర్మానుసార మైన సంస్కార మందు నమ్మకము లేదు. కానఁ బూర్తిగాఁ బాశ్చాత్త్యుల సాంఘిక ధర్మ మవలంబింప వీరు ప్రయత్నము చేయుచున్నారు. వీరు జాతి ధర్మవిలక్షణ మగు యుక్తిధర్మముపై నొక నూతనసాంఘికభవన మును గట్టఁ బ్రయత్నమును జేయుచున్నారు.—అని శ్రీ లాలా లజపతిరాయి గారు కాయస్థసమాచార పత్రికయందు 10-వ సంపుటము 4-వ సంచికలో వ్రాసియున్నారు.

సంఘసంస్కారమును గూర్చి లేనిపోని గాథలతో ప్రజార్హ్యము గాని మాటలతో గొడవలను వ్రాయుటకంటె దేశభక్తు లగు శ్రీ లాలా గారి పైవాక్యమందలి సారమును బరిశీలించిన సంఘ సంస్కారమున కెక్కుడు సహాయసంపత్తులు చేయఁగలుగుదు మని భావించి సంఘసంస్కారమునకుఁ దటస్థించిన విపద్దశను సూచించు పైవాక్యము ననుసరించియే నే నీ వ్యాసమును వ్రాయఁబూనితిని.

లాలా గారు, అపరసరస్వతు లగుటయే గాక, దేశక్షేమ మునకై యెన్ని విధముల వ్యయప్రయాసములకు లోనై పాటుపడిరో వేఱుగఁ జెప్ప నవసరము లేదు. అది యంతయు సర్వజనవిదితమే.

వీరు కూపస్థమండూకమువలె జన్మస్థానమును విడువకయే సర్వసాంఘికాచారములను విపులము చేయఁ బ్రయత్నించినవారు గాక, సకలదేశసంచారము చేసి యాయా తావులం గల యాచారము లను వాని భేదములను బరిపూర్ణముగా గ్రహించి లోకానుభవమును సంపాదించుకొని యే విధముగా నుండిన సంఘమునకు బాధ లేకుండునో యట్టి మార్గమును బయటికిఁ దీసి యీ మీఁది వాక్యము లను వెలువరించియుండుటచే, వానియం దెక్కుడు సారము కల దని యెల్లరును విశ్వసనీయములుగా నెంచక తప్పదు.

హిందూమతమునకును జాతిధర్మములకును సంబంధ మేమియు లేదు; ప్రతిబంధకమును లేదు. కాని, కులాచారముల ననుసరింపనిచో మానవులు పాపు లగుదు రని మనవాండ్రు సాధారణముగా చెప్పెడి మాటల నంత పాటిగాఁ గొనుట తగదు. అయ్యవి మన్వాది ధర్మశాస్త్రకర్తలు తమ నియమించిన యాచారములను ప్రజలు తప్పక ఆచరించవలె నని చేసిన యేర్పాటులై యుండవలెను. లేదా, ఇటీవల ప్రజ లా యాచారములనుండి విముఖు లగుటంబట్టి మన వృద్ధులు పన్నిన పన్నాగమై యుండవలెను. ఎట్టు లన, క్రైస్త వాది మతములందు, అవతారపురుషులు చేసిన విధానములు కొన్ని యును, అర్చకులు సమారాధనాది మతకార్యములయందు చేయవల సిన తంతు నిమిత్తమై చేయు విధానములు కొన్నియును గలవు. పూజావిధానములు గూడ నవతారపురుషు లేర్పాటు చేసిన విధాన ములతో పాటివే యనుట యెంత సమంజసముగా నుండునో, సాం ఘికధర్మములను మతధర్మములతోఁ బోల్చుటయు నంత సమంజ సమే. హిందూమత మన, వేదములయందు విశ్వాస ముంచుట, అవ తారపురుషులం బూజించుట మొదలగునవి యై యున్నది. ఇది యన్ని జాతులవారికిని సమానమే. ఇఁక జాతిధర్మము లన్ననో ఒక్కొక్క జాతివారి కొక్కొక్క విధమగు ధర్మము లేర్పాటయి యున్నవి. ప్రజలకు దర్జాను జూపించు సాధనము లనేకము లున్నవి. అందులో జాతు లనునదియు నొక విధమగు దర్జాయే యై యున్నది. జాతిధర్మముల ననుసరింపనివారు తమ దర్జానుండి దూరులై హీన దశకుఁ బాత్రు లగుదురు. ఇట్టి గౌరవమును గాపాడుటకే మన వారు కులాచారధర్మములను విడనాడినచో నధోగతిపా లగుదు రని యనేకవిధముల నొక్కి భయపెట్టి చెప్పియున్నారు. అంతియే గాని, జాతిధర్మముల ననుసరించనియెడల మనకు నరకము సంభ వించు ననియు, భగవంతుని దృష్టిలో విరోధుల మగుదు మనియుఁ జెప్పెడి మాట విశ్వాసపాత్రము కాదు. మఱియును బ్ర. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారు హిందువుల సాంఘికధర్మమును గూర్చి యిట్లు వ్రాసియున్నారు. ఏమనఁగా: "హిందువుల సాంఘికధర్మ ములకు మూలము ఒక దేశమును ఒక జాతియును గాదు. ఒక సం ఘముయొక్క యభివృద్ధియు ఒక దేశముయొక్క లాభమును వీరు కోరియుండలేదు. వీరు కోరినది యాత్మాభివృద్ధి. వీ రభిలషించినది ఆత్మయొక్క లాభమును ఆత్మయొక్క ఘనతయు నై యున్నది. లోకములో నాత్మ యంతటను వ్యాపించియున్నది. హిందువులయం దున్న యాత్మయు, మహమ్మదీయులయం దున్న యాత్మయు క్రైస్తవులయం దున్న యాత్మయు నొక్కటియే. జీవకోటియొక్క అనుబంధమునకుఁ గారణ మాత్మయే." అని. మన పూర్వులు చేసియున్న యేర్పాటులయందు రానురాను చెడుగులు ప్రవేశించి పయి యేర్పాటు లన్నియుఁ జెడుగులై సాంఘికాభివృద్ధికి ఆతంక ములుగాఁ బరిణమించినవి. అట్టి యాతంకములను దొలఁగించుటకు మనము సర్వవిధములఁ బ్రయత్నింపవలసినదియే గాని మనము సంఘముమీఁదఁ గోపపడిన సంఘమున కెట్టి లాభమును జేయఁ జాలనివార మగుదుము.

కనుక ప్రస్తుతము హిందూమతమును ద్వేషించి జందెములను

ద్రెంపుకొని యగ్రజాతిని దూషించి తామేమో సంఘాభివృద్ధి గావించెద మని చెప్పువారు దేశమున కెట్టి లాభము చేయఁగలరో యోజింపవలసియుండును. నవనాగరకులు ప్రజలు పడుచున్న కష్టములను జక్కఁగా గుర్తెఱిఁగి వారికి మార్గమును సూచించుటకు బదులు ముందుగఁ దాము మతభ్రష్టులై ప్రజల ననేకవిధములఁ దూలనాడుచున్నారు. ఈ కారణముచేత వీరు ప్రజావిరోధమును సంపాదించుకొని ప్రజలనుండి దూరమగుచున్నారు. వీరి మాటలందుఁ బ్రజల కెంత మాత్రమును విశ్వాసము లేదు. ప్రజలయొక్క కష్టసుఖములను గుర్తెఱిఁగి సమయము వచ్చినపుడు వారికి మంచి త్రోవఁ జూపిన వారు బాగుపడుదురే కాని, వారిని నిందించినచో నెవ్వరును సమీపమునకుఁ జేరరు. ప్రజామార్గదర్శకులుగా నుండువారు ప్రజలలో నొకరై యుండవలెను గాని, తామేమేమో గొప్పవారమని చెప్పి పయిపయిం దిరిగిన, లాభము లేదు. నవనాగరికు లందఱు నేదియో యొక సంగతిని బట్టుకొని దానినే సాధింప నెంతురు గాని, ప్రజ లెట్టి కష్టములఁ బడుచున్నారో వాని నెట్లు నివర్తింపవలయునో గుర్తెఱుంగఁజాల కున్నారు. ఇట్టివారిని గూర్చియే లాలా గారు మీఁది వాక్యమును వ్రాసియున్నారు. ఈ సందర్భములో నీ క్రింది విధముగా వివేకానందస్వాములవారు వ్రాసియున్నారు:

"ప్రపంచమునందలి చెడుగును బాగుచేయవలె నన్న విద్యాభివృద్ధి గావించుటయే ముఖ్యమైన పని. మనుష్యు లెంత గట్టిగా మాట్లాడినను ఇంతకంటె నేమియుఁ జేయఁదగిన పని కాన్పింపదు. చెడుగును దొలఁగింపవలె నని ప్రయత్నించువారీ సంగతిని మొదట ముఖ్యముగా గ్రహించితీరవలెను. ఈ విషయమున మనము స్వస్థచిత్తము కలవారము కావలయును. మన రక్తమునుండి మతసంబంధమయిన వెఱ్ఱిని తొలఁగింపవలెను. అప్పుడు ప్రపంచచరిత్ర, మచ్చివారయి పట్టుదలతోఁ జేసిన సంస్కారములే వాని యుద్దేశములను నశింపఁజేసినవని, మనకు బోధపఱుపఁగలదు."

మన సంఘములోఁ జెడుగు లున్న వని ప్రతివానికిని దెలియును. ప్రతిబాలుఁడును సభలలో మన చెడుగులను వాగ్ధోరణితో వెలిపుచ్చఁగలుగును. ప్రపంచయాత్ర చేయనెంచిన ప్రతివిదేశీయుఁడును మన దేశమందు రెయిలులోఁ బ్రయాణము చేసినంతమాత్రముననే అందలి చెడుగులను వెలిపుచ్చుచు గొప్ప యుపన్యాసముల నిచ్చుచున్నాఁడు. ప్రతివారును మన చెడుగులను బయలుపఱుచువారే కాని వానిని సాధించు మార్గము కనఁబఱుచువా రొకరును గానరారు. ఉపన్యాసములతోను సంఘములతోను వార్తాపత్రికలతోను వ్యాసములతోను మన ప్రాణములు విసిగిపోవుచున్నవి. కాని, మనలను బురదనుండి తప్పించు మానవుఁడు కానరాఁడు. ఆతఁడే మనకు ముఖ్యబంధువు. ఇప్పటి నవనాగరకులును అట్టి దేశబంధువు లని చెప్పుటకు జనసామాన్యము వెనుదీయుచున్నారు. వీరు దాదాఁపు వంద సంవత్సరములనుండి సంఘోద్ధరణమునకై పాటుపడుచున్నారు. ఇందలి ప్రతిఫల మెద్ది యని విచారించి చూచినఁ గొంచె మించుమించుగాఁ బూర్వాచారపరాయణులను దాదాఁపు బండబూతులతోఁ దుల్యమగు భాషలో వ్యాసములను ప్రహసనములను వ్రాసి నిందించినారు. పాపము! కొంత కాలమునకే పూర్వాచారపరాయణులు కూడ నిందాభారమును మోయఁజాలక నవనాగరికులను వారి భాషలోనే తిట్టుట ప్రారంభించిరి. ఈ విధముగా ద్రావిడ భాషలు లోనుగాఁ గలిగిన మన హిందూదేశమందలి భాషలలోఁ జూడఁగూడని చదువఁగూడని గ్రంథసామగ్రి బయలుదేఱినది. ఇంత కన్న నధికలాభ మేమియుఁ గానుపింపలేదు. ఇదియా సంఘసంస్కారము! ఇదియా దేశమాత నుద్ధరించుట!

ఇఁక లాలా గారు వ్రాసిన పై వాక్యములోని రెండవ యంశమును అనఁగాఁ బశ్చిమము ననుసరించి దానినుండి జ్ఞానజ్యోతిని బడయుట మంచిదా కాదా యను విషయమును జర్చింపవలసి యున్నది. పశ్చిమమునందలి నాగరకతను గూర్చి లాలా గా రిట్లు వ్రాసియున్నారు: "ప్రస్తుతము పాశ్చాత్యుల నాగరకతకు మూలమగు పాశ్చాత్యుల సాంఘికధర్మములోఁ దప్పక లోప మొకటి యుండి తీరవలయును. కావుననే విద్వాన్ హాక్సలే యంతటివాఁడు గూడ నీ నాగరకతను నిందించియున్నాఁడు. పండితుఁ డగు హాక్సలే చెప్పిన వాక్యము లెట్టివనగా: 'ఇప్పటి నాగరికతలలో మిక్కిలి ప్రసిద్ధి వహించినది గూడ సుస్థిరత లేనిదియు, ఉన్నతమైన పరమావధి లేనిదియు నై యున్నది. మానవకుటుంబములలోఁ జాల భాగ మభివృద్ధి కానియెడల నొక తోఁకచుక్క వచ్చి దీని నంతను సిద్ధిఁ బొందింపఁ గోరదను' అని."

దీనిని బట్టి పాశ్చాత్యుల సంఘధర్మములు నింద్యములై జాత్యభిమానపురస్కృతములై యున్న వని స్పష్టపడుచున్న దని లాలా గారు తెల్పిరి. ఈ సందర్భములో బ్రహ్మయ్యశాస్త్రి గారు ఇట్లు వ్రాసినారు: "పశ్చిమదేశసంఘములు తమ లాభమును గోరయే యితరుల కన్నరికైన లాభములు చేయఁ గోరుదురు గాని కేవల పరార్థపరత్వముతో నెన్నఁడును జేయరు. తమ సంఘము బాగుపడుటయే వీరి ముఖ్యోద్దేశము. మానవకుటుంబమునకు లాభకరము గాక యొక తెగవారికి మాత్రమే లాభకరమగు నుద్యమము నచ్చుటయే మంచి దని హాక్సలే దొరగారు వ్రాయుటకుఁ గారణము పాశ్చాత్యుల కుమార్గములే యనవచ్చును. ఇట్టి తంత్రములను ఇట్టి సాంఘికధర్మములను పాశ్చాత్యులనుండి గ్రహించుటకే మన సంఘసంస్కారప్రియులు ప్రయత్నము చేయుచున్నారు." ఈ పయి వాక్యములను బట్టి చూడ, మన సాంఘికధర్మములు పాశ్చాత్యుల సాంఘికధర్మములకంటె నీచము లయినవి కావనియును వాని ననుసరించుట మనకు శోచనీయ మనియును స్పష్టము కాఁగలదు. పాశ్చాత్యధర్మములకును మన సాంఘికధర్మములకు నుండిన తారతమ్య మెట్లున్నను, మన ప్రజలను మన సాంఘికధర్మములను విడనాడి పాశ్చాత్యధర్మములను గ్రహించుట యంత సులభము కాదు. సంఘసంస్కారవిషయములో మంచి పెద్దలు ప్రజలకు కాపుగఁ బ్రజాభిప్రాయమును బొత్తుగా సరకుగొనక యుండుట మంచిది కాదు. ప్రజ లందఱుఁ దమ ధర్మములను విడనాడుటకు సిద్ధముగ లేరు.

సంఘసంస్కారము కావలె నని కోరువా రెవరు ? ప్రజలా లేక యిప్పటి నవనాగరికులా? ప్రజలు మన సంఘమునందలి దురాచారములను దురాచారములుగా నెంచుట లేదు. ఏల యన, విధవావివాహ ప్రసంగము చేసినప్పుడు, వారు మీ రన నేల, విధవలే నవనాగరికులను దిట్టి పొమ్మనుట మెట్టుచున్నారు. దీనికి కారణ మేమి? ఏ విధవలను గురించి నవనాగరికులు రాత్రింబవళ్లు పరితపించుచున్నారో ఆ విధవలు తమ దశ దుర్దశ యని యెఱుఁగనే యెఱుఁగరు. వారు సుఖముగా కాలక్షేపము సేయుచున్నారు. చెన్నపురి రాజధానిలో నిప్పటికి శ్రీ వీరేశలింగము పంతులు గారు వివాహములు చేసిన 40, 50 విశ్వస్తలకే తమ యవస్థ దురవస్థ యని తెలిసినది. క్షత్రియ వైశ్య శూద్రాదు లగు నితరజాతులవారు బ్రాహ్మణులు తమతో భోజన ప్రతిభోజనములు సల్పుట పెండ్లిండ్లు చేసికొనుట మొదలగు కార్యములను జేయాలే దని పరితపించుట యెచ్చటను విని యుండలేదు. చెడిపోయిన బ్రాహ్మణుల యింటను శూద్రాదులు గూడ భోజనము సేయరు. ఈ విషయమై పరితపించువా రుండి రని చెప్పినను వారి సంఖ్య బహుస్వల్పముగా నుండును. శూద్రాదుల మాట యటుండఁ బంచముల మాట చెప్ప నక్కఱయే లేదు. ఇట్టి సందర్భములలో సంఘసంస్కారము సంఘసంస్కార మని యొకరిద్దఱు పరితపించిన లాభ మేమి? వారి పరితాప మరణ్యరోదనముగా నున్నది. ఒకరిద్దఱే యూఁదుకొట్ల ప్రజలకు సంఘసంస్కారము గావింపవలె నని యెంచుట సాహసకృత్యము కనుక మన మిప్పుడు సంఘసంస్కరణవిషయములోఁ జేయఁదగిన దెద్దియో విచారింపవలసి యున్నది.

మన హిందూదేశములో ననాదినుండియు రాజులు పరిపాలించుటయు, వారే ప్రజలకు సస్మృతిశాసనములను నిర్మించుటయు వాడుకయై యున్నది. "నావిష్ణుః పృథివీపతిః" అను నార్యోక్తిం బట్టి ప్రజలు రాజాజ్ఞ యనఁగ రాజశాసనములను (చట్టములను) శిరసా వహించుటయుం దలవాటుపడియున్నారు. కాని, ఆ మన రాజు లిప్పుడు లేరు. వారి స్థానమున బ్రిటీషు దొరతనమువారున్నారు. మన దొరతనమువారికి సాంఘికధర్మములను గూర్చి చట్టముల నేర్పఱచుట కిష్టము లేదు. ఒకవేళ వా రట్టి చట్టములఁ జేయఁబూనినను ప్రజాభిప్రాయమును బట్టి వారు చేయుటయో మానుటయో తెలియును. అట్టి సాంఘికధర్మశాసనములను దొరతనమువారు చేయఁ గలుగుటకుఁ జిరకాలము పట్టును. ఈ మధ్య మనము తొందరపడక ప్రజాభిప్రాయములను క్రమక్రమముగా మార్చుటకుఁ బ్రయత్నించుచుండవలెను. మన ప్రజలు సంఘసంస్కారమునకుఁ బూనుకొనకుండుటకు ముఖ్యకారణ మేది యన, నవిద్యవలన వచ్చిన మూఢత్వము. ఈ మూఢత్వమును బోఁగొట్టుటకు మనము సర్వదా ప్రజలకు విద్య గఱపుచుండవలెను. ఈ విషయములో వివేకానంద స్వాములవా రిట్లు వ్రాసిరి. "సంఘసంస్కారమునకుఁ గూడ ముఖ్యమైనది ప్రజలకు విద్యయే. వారికి విద్య వచ్చునంతవఱకు మనము వేచియుండవలెను." అట్లు చేయక తొందరపడినచో సంఘసంస్కారములు చేయలేక పోవుట సరి కదా, సంఘసంస్కారకు లన్న ప్రజ లసహ్యము గూడఁ గలుగఁజేయుదురు. ఇప్పటికే నవనాగరికు లనినచో నది యొక చెడ్డ పేరుగాఁ బరిగణింపఁబడుచున్నది. కాని, మీరు దేశబంధువు లని యెక్కరు ననుకొనుట లేదు. నవనాగరికులు చేయఁదగిన కార్యము మహత్తరమైనది. కనుక వారు తొందరపడి యీ కార్యమును పాడుచేయకుందురుగాక యని సర్వదా మనము భగవంతుని ప్రార్థింపవలయును.

నవనాగరికులయొక్క సహాయ మవసరము లేకయే సంఘమునఁ జాలమార్పులు జరుగుచున్నవి. పూర్వమువలె మనవారు మన యాచారములను నెఱవేర్చుట లేదు. దీనికిఁ గారణము కాలమే యని యెఱుఁగవలెను. పూర్వము మనవారు వర్ణాశ్రమధర్మములను బూర్ణముగా నెఱవేర్చుటకుఁ దెక్కులగు సావకాశము లుండెడివి. మన రాజులు దేశమునకుఁ దగినట్లు పరిపాలించి యేయే జాతివా రెట్లుండవలయునో య ట్లుండుటకుఁ జాల నవకాశములను గలుగఁజేసియుండిరి. మనుష్యదేహములోఁ జేతులు పనిచేయుట, కాళ్లు నడచుట, నోరు తినుట మొదలగు పనులు వేఱువేఱు అవయవము లెట్లు నెఱవేర్చుచున్నవో, కుటుంబములోఁ బెద్దవాండ్రు ధనసంపాదన చేయుట, స్త్రీలు గృహకృత్యములను జక్కపెట్టుచు భోజనాదికములను గూర్చుట మొదలగు కుటుంబసంబంధమైన పనులు కుటుంబములోని మనుష్యులు వారివారి వంతునకు నిర్వర్తించుచుండుట యెట్లో, అట్లే సంఘములోను జరగవలె నని మన పూర్వు లెంచి సంఘమునందుఁ జతుర్వర్ణముల నేర్పాటు చేసి మనకు చేయవలసిన పనుల నాయా జాతులవారికి నియమించి యున్నారు. దీనినే మనవారు వర్ణాశ్రమధర్మము లందురు. ఈ చతుర్వర్ణములు నేర్పడిన కాలమునకు ఏయే మనుష్యులు, ఏయే పనులకుఁ దగియుండిరో వారి నాయా పనులలో నియమించి నాలుగు తెగలుగా విభజించినట్లు కాన్పించుచున్నది. రాజులు కష్టపడి ప్రజాపరిపాలన చేసి శత్రుసంహార మొనర్చి దేశములను సంపాదించి రాజ్యముల నేలుట, బ్రాహ్మణులు భగవద్ధ్యానము సేయుచు విద్యావంతులై వేదమార్గము ననుసరించి భగవంతుని మహిమలను ఇతరజాతులకు బోధపఱచుట, వైశ్యులు భూమిని వ్యవసాయము చేసి పండించుట, శూద్రులు దాసులుగా నుండుట మొదలగు నేర్పాటులు ప్రతిసంఘమునకును ముఖ్యముగా నుండవలసినవియే. భగవద్ధ్యానము విద్య శౌర్యము లేకపోయినను, కృషివాణిజ్యములు లేకపోయినను, సంఘము నిలువ నేరదు. ప్రతిసంఘమునకు నివి యన్నియు ముఖ్యముగ నుండవలసినవియే. భగవద్ధ్యానము విద్య లేకపోయిన సంఘమున కరిష్టము కలుగు నని యెంచి పూర్వపు మన రాజులు బ్రాహ్మణులకు వారి పనుల నెఱవేర్చుటకు అనేక విధములఁ దోడ్పడుచుండెడివారు. అంతియే గాని, మనవా రిప్పు డనుకొనునట్లు అప్పటి రాజు లందఱు పిచ్చివాండ్రయి బ్రాహ్మణుల వలలలోఁ జిక్కియుండ లేదు. అటు లైనచోఁ గ్రైస్తవదేశములలో మతగురువులకు ఇప్పుడు రాజులును ఇతరప్రజలును లొంగియున్నా రనియా

యర్థము! వారట్లు లొంగియుండనియెడల వారికన్నన్ని సదుపాయములు చేసి లక్షలకొలంది ధనమును వారి నిమిత్త మేల వ్యయపఱుపవలయును? ఇవి యన్నియు మనలను నిందించుటయే ప్రధానము చేసికొనియుండెడు పాశ్చాత్యులలోఁ గొందఱును వారి వాక్కులే దైవవాక్కులుగా నెంచుకొను నవనాగరికులును చెప్పెడి మాటలై యున్నవి. అటులే శాస్త్రపరీక్ష సేయుచున్న పాశ్చాత్యుల విషయమై కూడ. శాస్త్ర పరీక్షకై పశ్చిమదేశములందలి రాజులు, ఆ శాస్త్రకారుల కనేకవిధము లగు సదుపాయములను జేయుచుండిరి. కనుక జాతుల విభజన మన నుదుటనే ప్రాదుర్భవించిన దని చెప్పకొన నవసరము లేదు. వర్ణాశ్రమధర్మములు వర్ణాశ్రమధర్మము లని మనవారు నొక్కి చెప్పుటకు బహుశః ప్రజలలోఁ బోట్లాటలు కలిగి ప్రతిజాతివాఁడును బ్రాహ్మణునివలెనే నేనును తిని కూర్చుండెదను, నా విధికృత్యము చేయ నని గాని, లేదా క్షత్రియునివలె యుద్ధములు చేసి రాజ్యము నే సంపాదించెద నని కాని బయలుదేరినయెడల సంఘమున కరిష్టము సంభవించి చెడిపోవు నని చెప్పియుండి రని తోఁచుచున్నది.

ఇట్టి మన పూర్వసంఘనిర్మాణములు కొంత కాలమునకు మార్పు చెందవలసిన యవస్థ సంభవించినది. మన పురాణములలో నేమి, ఇతరగ్రంథములలో నేమి బ్రాహ్మణులు కూడ మాంసాదులను భుజించి రనియు, మద్యపానము చేసి రనియు, రాజులు మొదలగువారు బ్రాహ్మణులకు భోజనము లిడి రనియు మొదలగునవి యచ్చటచ్చటఁ గాన్పించును. కాని, యిటీవల బౌద్ధమత ప్రేరపణవలన "అహింసా పరమో ధర్మః" అను నార్యోక్తిని బూర్తిగా నెఱవేర్చు నుద్దేశముతో మనలో నగ్రజాతులవారు మాంసము భుజింపఁ గూడదు మొదలైన యేర్పాట లను జేసికొనిరట్లు తోఁచుచున్నది.

ఈ కారణముబట్టి మన సంఘము రెండు విధము లై పోయినది: మద్యమాంసభక్షకులు, తదితరులు. క్రమముగా మద్యమాంసములను నిషేధించిన బ్రాహ్మణులు మొదలగువారు తదితరులతో భోజనాదులను మానియుండవచ్చును. ఇది కేవలము సహజమే. మద్యపానము చేయనివాఁడు చేసినవానియొద్ద నిలుచుట కష్టమే మాంసము తిననివాఁడు మాంసము తినువానితోఁ గూడ భుజించుటయు నట్టిదియే. ఈ కారణములంబట్టి మన సంఘములోని నాలుగు జాతులవారికి భోజనప్రతిభోజనములు పోయియుండవచ్చును. పెండ్లిండ్లు మొదలగు నితరకార్యములును వీనితోపాటుగనే పోయియుండవచ్చును. ఈ విధముగా జాతి యను పెనుభూతము మనల నాశ్రయించినది. ఇట్లు సంభవించిన మనవస్థలను ఒక్కొక్కదానినే తొలఁగించుటకు మాఱుగా, ఒక్కమాఱుగా గొడ్డు మాంసము తిను మాదిగవాని పంక్తిని భుజింపు మనుటయు, విద్యావాసన లేని మాదిగవాని పిల్లలను బ్రాహ్మణులను వివాహమాడుఁడని చెప్పుటయు, మొదలైన నియమములు సంఘాభివృద్ధికి మాఱుగా సంఘనాశనమునకే తోడ్పడును. ఈ సందర్భములో నిటీవలఁ జెన్నపురి రాజధాని గవర్నరు శ్రీ పెంటలెండు ప్రభువుగారి యధ్యక్షతక్రింద జరగిన సభలో ఎఫ్. జే. రిచర్డ్సు గారు చెప్పిన యంశములు గమనింపఁ దగియున్నవి. అవి యెవ్వి యన: "నిమ్నజాతులను బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్ర జాతుల రీతిగా నేర్పాటు చేయుట కెంత మాత్రము వీ లుండదు. ఈ పనికై బ్రాహ్మణులు కొంతవఱకు తమ జాతి ధర్మములను బరిత్యజించుట కొప్పుకొనినను, ఇతర జాతుల వారిలో నూటికిఁ దొంబదియాఱుగు రొప్పుకొనరు ఏ హిందువుఁడును నాల్గు జాతులు నేకమైపోవుటను గుఱించి స్వస్థచిత్తతతో నాలోచింప లేఁడు. పదివేల జనులలో నొకరికైనను అర్థము తెలియని జాతిభేదము లేకపోవుట యను పాశ్చాత్యపద్ధతిని మూఁడు కోట్ల జనుల కేర్పాటు చేసి యనాదిసిద్ధ మగు జాతిభేదముల నొక్కసారిగాఁ దొలఁగించుట హిందూసంఘమున కరిష్టదాయకముగా నుండును." కనుక ఈ జాతిభేదములను క్రమముగా మనము విడనాడవలెను గాని, ఒక్కసారిగా నా పని చేయుటకుఁ బూనఁగూడదు. ముందుగా నాలుగు జాతుల నేర్పడిన యితరభేదములను దొలఁగించుటకుఁ బ్రయత్నము చేయవలెను.

మఱియు నిప్పటికి దొరతనమువారి పరిపాలనలోఁ గ్రమక్రమముగ సంఘము నొక్కదారిని ద్రిప్పుటకు సమర్థములైన పాఠశాలలు, అయోమార్గములు, తదితరము లగు నేర్పాటులు జరగియున్నవి. సమస్తజాతులవారు నొక పొగబండిమీఁదనే యెక్కవలయును. సకలజాతులవారు నొక పాఠశాలలోనే చదువవలయును. ఇట్టి యేర్పాటులవలన సర్వజాతులును నైకమత్యము కలిగి కొంతవఱకు సంచరించుచున్నవి. క్రైస్తవమతము, అది చేయఁదగిన మార్పులను క్రమముగాఁ జేయుచున్నది. వీని యన్నిటివలనను పూర్వపద్ధతులయందు నమ్మకము లేక యేమి, వాని సారము తెలియక పోవుటచేత నేమి, యిప్పటి కాలమున కనుకూల మగునట్లు మాఱిపోవుచున్నది. ఇప్పటి వారికి వర్ణాశ్రమ ధర్మములు భయముతోఁ గూడుకొన్నవి గాని, అభిమానపూరితములు గావు. మనవారికిఁ గులమునుండి వెలివేయఁ బోయినఁ జాలును. వారి యిష్టము వచ్చినట్లు సంచరించుటకు వారి కింతయును సంకోచము లేదు. కాని, నలుగురికిని దెలిసినయెడల వర్ణబాహ్యుఁడ నగుదు నను భయము మాత్రము పీడించుచున్నది. ఇట్టి మార్పులను గలుగఁజేసినది దొరతనమువారి సాంగత్యమే. నవనాగరికులయొక్క కృషియే యిది యని వారనుకొనిన ననుకొననిండు. ప్రతిమానవునకు నెవనియంతట వాఁడు తన్ను బాగుచేసికొనుటకుఁ గాని చెఱచుకొనుటకుఁ గాని సావకాశము గలదు. ఇతరుని బాగుచేయుటకును చెడఁగొట్టుటకును సావకాశము లేదు. శ్రీకృష్ణభగవానుఁ డంతటివాఁడు గూడ మానవుని రక్షించుట తనచేత నైన పని కా దని భగవద్గీతలోఁ జెప్పియున్నాఁడు. ఎవని మంచికి వాఁడే కర్త. ఇట్లుండ, నొకఁడు సంఘమును బాగుచేయుట యెంత కష్టమో పాఠకులే విచారించెదరు గాక! కాలానుసారముగా జరుగుచున్న మార్పులకుఁ దోడ్పడుటయే మనకు ముఖ్యమైన పనిగా నున్నది.

మనసంఘమునకు సంభవించిన యాపద లన్నియు జాతి

యనుదానివలననే సంభవించినవి. జాతి తొలఁగిపోయినయెడలఁ దక్కిన కష్టము లన్నియుఁ దమంతటఁ దామే పోవునని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

ప్రస్తుతము చిక్కులేని తేలిక సంస్కరణ మొనర్చి సంఘము నొకదారికిఁ ద్రిప్పవలెను గాని, ప్రజల కసహ్య మగు పెద్ద మార్పులను ముందే చేయఁ బ్రయత్నింపరాదు.

కాఁబట్టి నేను మొదట చెప్పినట్లు సంఘసంస్కారమునకును మతమునకు నెట్టి సంబంధమును లేదు. సంఘమునకు సంభవించిన దురాచారము లన్నియు నించుమించుగా జాతిమూలముననె సంభవించిన వని చెప్పుటకు సందేహము లేదు. కావున నీ జాతిని క్రమక్రమముగా నేదియో యొక విధమున రూపుమాపిననే గాని సంఘసంస్కారము పొసఁగనేరదు. పుం డెక్కడ నుండిన నచటనే మందు వేయకున్నఁ బుండు మానదు గదా!

ఇఁక విధవా వివాహములం గూర్చి కొంచెము ముచ్చటింప వలసియున్నది. వివేకానందస్వాములవారు విధవావివాహములకును కన్యలకు నమితసంబంధము కల దని చెప్పియుండిరి. మన దేశములో విధవలు కలరు. యూరపు దేశములోఁ బెండ్లి గాని కన్యకలు గలరు. విధవల దుఃఖము మాన్పఁజూచినయెడలఁ గన్యకలు వృద్ధియై విధవలకన్న నెక్కువ చిక్కును దెచ్చిపెట్టెదరు. ఈ సంగతులు యూరపు దేశచరిత్రలు చదివినవారికి విశదమగును. మన నవనాగరికులు విధవావివాహములం గూర్చి యెన్ని యుక్తులు చెప్పుచుందురో యవి యన్నియు యూరపు దేశమునందలి కన్యకల విషయమున సరిపోవును. కన్యక లుండుట మంచిదా విధవ లుండుట మంచిదా యను పిచ్చి తలంపులలోనికి దిగక దేశ మభివృద్ధిఁ జెంది ప్రజలు విద్యావంతు లైనప్పుడు, ఎట్లు జరగవలయునో యట్లు జరగియే తీరును. విధవలో కన్యకలో మన కుండవలసినవారే కావునను, విధవావివాహములు మనవా రిపుడు ఒప్పుకొనకుండుటచేతను, సంఘసంస్కారములో విధవావివాహములు గూడఁ జేర్చినయెడల మిడిమిడి జ్ఞానము గలిగిన మన ప్రజలు సంఘసంస్కారము మనకు వల దందురో యను భయముచేతను, విశ్వస్తల ప్రశంస యిపుడు చేయుట మంచిది కా దని నా యభిప్రాయము.

అతిబాల్యవివాహములు మొదలైన యితర సంస్కారముల విషయమై వేఱుగాఁ జెప్పవలసిన యగత్యము లేదు. అవి యెల్లరికిని ముఖ్యములే యని సర్వజనవిదితము.

# మాత్సర్యము

చింతా శంకరదీక్షితులు గారు

మానవుఁడు పుట్టినంతనే మచ్చరంబు
వాని నలమును, పోఁద్రోయ వశము గాదు;
మచ్చరము దేశనాశకమార్గ మొందు,
మచ్చరము సౌఖ్యనాశకమార్గ మెపుడు,
మచ్చరము క్రోధరాజసన్మాన మందు, 5
మచ్చరము కామమందున మసలుచుండు,
మచ్చరము లోభమోహాల మసలుచుండు,
మనుజు నాశ్రయ మాశించు మచ్చరంబు;
మచ్చరము లేకపోయిన మాను జగము;
లోని శత్రుల కిది రాజు, లోక మిదియె. 10
ఆఱుశత్రులలో నొక రైనఁ గాని
లేని మానవుఁ డెందును లేఁడు ధరణి;
అట్టి శత్రువులకు మూల మైన దొక్క
మచ్చరము, దాని నెఱుఁగంగ మనకు వశమె?
సృష్టి కెప్పుడు మొదలు? ఆ సృష్టి కెపుడు 15
అంత? మప్పుడు మచ్చర మంత మొందు.

II

ధనము విద్యయు గుణమును దాన మెపుడు
రమ్మనిన వచ్చునవి గావు, పొమ్మటన్న
పోవు; కృషిచేత వచ్చును, ముదము గూర్చు.
వీరలను వారలను జూచి వ్రేలు కఱచి 20
లేదుగా యని తెలఁపకు, లెమ్మ! లెమ్మ!!
ఫలము గోరక దేవుపై భార ముంచి
వేగమే పొమ్ము కృషి చేయ వేగ పొమ్ము.
వారలను వీరలను జూచి పనిని మఱచి
వారలకు వీరలకు ముడివైచినంత 25
నేమి సమకూరు? నీకు మరేమి కలుగు?
తుదకు వారలే సిరిఁ దులఁ దూఁగుచుండ,
కడుపు మండంగ నీ కేల కానిగుణము!
అందముగ చందముగ లోకమందు తిరుగు
వానిఁ జూచిన చిట్లింతు వదన మెపుడు, 30
పెడమొగము ద్రిప్పి దిరుగుదు, వెక్కసముగ
వార లేహాని చేసిరి? వార లేమి
తిట్టిరా? కొట్టిరా? లేక దెప్పినారె?
పలుకు, లేకున్న పటౌన వారిఁ జూడ
కడుపు మండంగ నీ కేల కానిగుణము? 35

# చిత్రకల్పన

రొయ్యూరు గామచంద్ర ప్రసాదరావు గారు

సీసపద్యము

1. అరిభయంకరచక్ర కరిరక్ష సాగర చాయ శ్రీకర్బురసాటియుగళ

2. నాళీకసన్నిభనయన యండజవాహ వాణీశజనక వైభవబిడౌజ

4. రాజీవమందిర రమణ బుధరక్ష వరజటస్తుతి శౌరి వాసుదేవ

8. భూరికృపాకర బొబ్బిలిపురిపాల పాపభుజంగమపరమగరుడ

16. దోషశైలేశ శశిరక్ష ద్రుహిణిహేళి ... ... ... ...

కీ వాక్యము: "అ న్న య్య తో టి వి స్సా ప్ర గ డ కా మ రా జు భా షిం చు హే ళి దా క్షి ణ్య శా లి."

1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22 23 24

ఈ చాటుపద్యమును బొబ్బిలిపురంబున విస్సాప్రెగడ కామరాజుకవి రచించినట్లు తెలియుచున్నది. దీనిలోని లోపములను సవరించుటకుఁ గాని గీతమునందు కొఱవడిన మూఁడు పాదములను ఇష్టమువచ్చినట్లు పూర్తి చేయుటకుఁ గాని నేను తలపెట్టలేదు. పాఠకు లెవరైన నిర్దుష్టమైన అసలు పద్యమును నాకును లోకమునకును దెలుపకపోరనియు, పద్యముక్రింద వ్రాయఁబడిన "అన్న......శాలి" అనెడి కీవాక్యమును పద్యములోని పై యయిదు చరణములను తలపెట్టిన కార్యమునకు చాలియుండుటచేతను, నేనట్లు చేయలేదు. ఈ సీసపద్యము మొదటిపాదమునకు కుడిప్రక్క 1, రెండవ పాదమునకు 2, మూఁడవపాదమునకు 4, నాలవ పాదమునకు 8, అయిదవ చరణమునకు 16 అను అంకెలు వేయఁబడియున్నవి. పద్యముక్రింద కీవాక్యము 24 అక్షరములు గలిగినదై యున్నది.

ఇఁక దీని విధానము దెలిపెదను. ఎట్లంటేని, ఎవరైనను ఆంధ్రభాషలోని యొక యక్షరమును తలఁచుకొనిన పక్షమున దానిని నాకు వారు చెప్పకయే పై పద్యముయొక్క సాహాయ్యముచే కనుఁగొనఁగలను. అయిన, కొన్ని విధులకు లోఁబడవలసియుండును. అందు (1) అచ్చులలో అ యొకటి మాత్రమే తలఁచుకొనునదిగా నుండవలెను. (2) హల్లులలో ఙ ఞ వదలివేయవలెను. ఒత్తు అక్షరములకును ఒత్తు లేని యక్షరములకును భేదము గణింపరాదు. అనఁగా క్షఖలు తథలు మొదలగునవి యొక్కటిగానే భావింపవలెను. లేదా ఒత్తు అక్షరములను తలంచుకొనకుండినను సరే. (3) నణలకును లళలకును రఱలకును వేఱువేఱు భేదము పాటింపరాదు. అనఁగా పై కీవాక్యములోని 24 అక్షరములలో దేనినైన తలంచుకొనునట్లు చేయుటే దీని భావము.

పై విధానములకు లోనై ఒక యక్షరమును దలఁచుకొనినపుడు దానిని కనుఁగొను మార్గ మేదన, పై పద్యము కీవాక్యము కంఠతా వచ్చునట్లు ముంగ చేయవలెను. అట్లు చేసి ఆ పద్యముయొక్క మొదటి పాదము చదివి వినిపించి అందు తలఁచుకొనఁబడిన యక్షర మున్నదియు లేనిదియు అడిగి తెలిసికొనవలెను. తరువాత, 2, 3, 4, 5 చరణములు వరుసగా చదివి ఆ యక్షరము ఏయే చరణములలో నున్నదియు తెలిసికొనుచుండవలెను. అంతట ఆ యక్షరము కొన్ని పాదములయం దుండుటయు కొన్నిటియందు లేకుండుటయు కలుగును. అప్పుడు అక్షరము ఉన్న పాదముల ప్రక్క వేయఁబడిన సంఖ్యలను కలుపునది. అపు డేవది వచ్చె ననుకొనుము. కీవాక్యములోని 20వ యక్షర మగు ద తలఁచుకొనఁబడిన దని తెలిసికొనవలెను. ఇంకను విరళముగా తెలిపెదను. మీరు కోరిన యక్షరము 1వ పాదములో మాత్రమే యున్నయెడల కీ వాక్యములోని మొదటి యక్షరము అ గనుక తలఁచుకొనినది అ యనియు, 1,3 పాదములలో నున్నయెడల ఆయా పాదముల ప్రక్క వేయఁబడిన సంఖ్యల మొత్తము 1+4=5 గనుక కీవాక్యములోని 5వ యక్షరము ట తలఁచుకొనఁబడిన దనియు, 2,5 పాదములలో నున్నచో ప్రక్క యంకెల మొత్తము 2+16=18 గావున హే యనియు తెలిసికొనుచుండవలెను. దీనినిబట్టి ను యెక్కడ నుండును? 3, 4 పాదములలో మాత్రమే యుండు నని కనుఁగొనఁగలము. అక్షరములకు గుణితములతోఁ బని లేదు. ఇట్లు చెప్పుచుండిన నాహ్లాదంబు జనింపకపోదు గదా.

# వెలమలు క్షత్రియులా ?

చెలికాని లచ్చారావు గారు

చదువరులారా! చరిత్రవిషయము వ్రాయుట సులభమైన పని గాదు. అందులోను ఇది యౌను ఇది కాదు అని నిర్ధారణ చేయఁబడక సందిగ్ధావస్థయం దుండి వాదప్రతివాదసమన్వితం బగు నంశమును వ్రాయుట మఱియు దుర్ఘటము. సంశయమును మది నణఁచి పెట్టి యూరకుండుట సమంజసమా! ఐనను, నాకుఁ దోఁచిన కొన్ని గ్రంథముల నాధారంబుగఁ గొనియు, గాథలఁ దెలిసికొనియు, ఆచారంబుల గమనించియు, పూర్వోక్తసందర్భంబుల గ్రహించియు, వెలమవారి వంశోత్పత్తిని గుఱించి సంక్షేపంబుగ వ్రాయ సాహసించితి. లోపము లున్న మన్నింతురుగాక! చరిత్రలు వ్రాయుట యందు మన పూర్వుల యుదాసీనతయే మన కిట్టి కష్టము నకుఁ గారణము. "రాచవెలమలు" (పద్మనాయకులు) అని వివిధనామంబులఁ బిలువఁబడు వెలమవారు క్షత్రియులా? తదితరశూద్రజాతికిఁ జెందిన తెగయా? యను సంగతి చర్చనీయము. ఇప్పు డుండు ప్రాపంచిక మర్యాదలను బట్టి క్షత్రియు లనుకొనినంత మాత్రమున గౌరవాధిక్యము లేదు. శూద్రు లనినంత మాత్రమున నీచత్వమును లేదు. బాహ్యవేషంబులు ప్రధానములు గావు. శూద్రులు తాము క్షత్రియుల మని యనుకొనినంత మాత్రమున గొప్ప గుణంబులు గలుగఁబోవు. మణులు మణులే. గాజు పూసలు గాజు పూసలే గదా! మణు లెన్ని విధముల రాచినను తమ సహజకాంతిని విడువనేరవు గదా! మనము ముందు వెలమశబ్దోత్పత్తిని గూర్చి యరయుదము. ఇది సంస్కృతపదము గాక దేశ్య మగుటంజేసి దీని రూపోత్పత్తి కనుఁగొనుట కష్టము. గ్రంథాధారంబుల వెదకుదము. ద్రావిడమందు దాక్షిణాత్యులలో 'వెల్లాళర్' అను జాతి కల దనియు, వీరికి అఱవ వెలమ లని పేరు కల దనియు, అటులే మన దేశమందలి వెలమలకు తెలుఁగు వెల్లాళర్ అను నామము కల దనియు, వారికిని వీరికిని సంబంధము లుండవచ్చు ననియు, వెలమ లన వ్యవసాయకు లను వ్యుత్పత్త్యర్థముఁ జేసి ఎడ్గార్ థర్‌స్టన్ గారు తమ "దక్షిణదేశపు వర్ణములు జాతులు" అను గ్రంథమునందు వ్రాయుచు, వెలమలలో 'రాచవెలమలు' అని విభాగించి బొబ్బిలి, వేంకటగిరి, పిఠాపురము, నూజవీడు సంస్థానములను బేర్కొనియున్నారు. అక్కాలంబున వీ రొక రాజశాఖగఁ దేలిరి. పరశురాముని ధాటికి ఓర్వలేక అడవులు పట్టి వెలి యైనందున వెలమవా రైరని యభిక్తునందును, అతని ప్రచండ కోపాగ్ని కోర్వలేక వెలవెలపోయినందున నని కొందఱును, అతఁడు జందెములు లేని క్షత్రియులను గామ మండుటచే జందెములు తీసివేసి తిరిగి అతని యనంతరము కూడ ధరింపనివారు క్షత్రియులనుండి వెలియై వెలమవా రైరని కొందఱును చెప్పుచున్నారు. మఱియు ప్రతాపరుద్రుని వంశస్థులు కాకతి యను దేవతను గొలిచి కాకతివా రైనటు వెల్లమ్మ యను దేవతను గొలిచినవా రగుటచే వెలమవా రైరని కొందఱి యభిప్రాయము. తక్కిన వెలమలకన్న వీరికి శ్రేష్ఠత్వ మేల యొసఁగవలె నన్న, వెలమలలో వెలమలు అదివెలమలు అని రెండు తెగలు గలవు. అందు ఆదివెలమలకు సంస్థానములు లేవు; రాచవెలమలకుఁ గలవు. ఆదివెలమ లన మొదటినుండియు వెలమలై యున్నారని భావము. రాచవెలమలు ఉపనయనాది సంస్కారశూన్యు లగుటచే వెలమ (శూద్రు) లైరి. రాచవెలమ లని ఎడ్గార్ థర్‌స్టన్ గారు పేర్కొనియుండిరి గదా! మఱియు నీ సంఖ్య 77 గోత్రముల పద్మనాయకులకు తదితర వెలమ లగు 10 గోత్రముల శూద్రులతోను సంబంధము లేనట్టు పురాతనకవి యగు పద్మనాయక చరిత్ర కారుఁడు వ్రాయుచున్నాఁడు. "శూద్రనామంబులు శోభిల్లు నాలవ కొలమువా రనియుఁ గాపు లని పలుక - తద్విశేషంబులై తనరు వెలమ యనంగ" అని యాంధ్రభాషార్ణవము వెలమలను శూద్రులనుండి భేదించె. మఱియు నితరసంస్థానకవివరుండును జగత్ప్రసిద్ధుండును పండితవరేణ్యుండును నగు శ్రీనాథుండు, "పద్మనాయకు లన, వెలమ లన" పావనవంశ్యులుగాను పుణ్యవంశ్యులుగాను జగత్పవిత్రగోత్రులుగాను తన భీమఖండంబునఁ బరగణించియున్నాఁడు. మఱియు మన్వాదిస్మృతులును భాగవతాదిపురాణేతిహాసంబులును ద్రవిడాదిదేశములందలి క్షత్రియులే యుపనయనాది సంస్కారములు లేక శూద్రత్వ మొందినట్లు చెప్పుచున్నవి. ఇతరశూద్రులందు లేని ఘోషాపద్ధతి, పైతృకకార్యములు చేయునపుడు కాశీ జన్నిదములు దాల్చుట, జాతమృతాశౌచంబుల యందు 12 దినంబులు పాటించుట, పంక్తిభోజనాదిసందర్భములలో విఘ్నేశ్వరపూజ, ఆశీర్వచనసమయంబులందు క్షత్రియాచారానుచరులై వర్తించుట, వేషభాషాదుల నియమంబులు, బ్రాహ్మణభక్తి, బంధుమర్యాదలు, పెద్దల మన్ననలు మొదలుగాఁ గల క్షత్రియాచారగుణంబులు చూచ, వీర లొకప్పుడు క్షత్రియులా యను సంశయము కలుగక పోదు. రాచవెలమలు కూలిపనులకు పోవుట, దున్నుట, యాచించుట మొదలగు పనులకు పోరు. ఏది యున్నను జందెములు లేకున్న క్షత్రియులు గారనిన, ప్రస్తుతము కాళహస్తిరాజు గారును అచ్చటి వారి బంధువులును శూద్రులవంటకములు భుజించుచున్నను జందెములను ధరించుచున్నారు. కాళహస్తి వెలమవారికిని అచ్చటి సమీప గ్రామంబుల నుండు క్షత్రియులకును కొంతకాలమువఱకు సంబంధ

బాంధవ్యములు జరిగినట్టును వారివారి బిడ్డల పసపుకుంకుముల నిమిత్తమై మడిమాన్యముల నిచ్చియున్నట్టును శాసనప్రమాణములు గలవని పానుగంటి జనార్దనరావు, బి. యే గారు నెల్లూరిలో నాతో నొకప్పుడు సెలవిచ్చిరి. ఈ పై యుదాహరణంబులచేత రాచవెలమలు క్షత్రియులా యను సంశయవాదమీమాంస ఋజువగుచుండ, వీరలు పద్మనాయకకులజు లను నొక విశేషణమునఁ బిలువఁబడుచుండుటంజేసి, పద్మనాయకుఁ డన సూర్యుఁ డగుటచే సూర్యవంశజు లగు క్షత్రియు లని తన యన్వర్థనామమే చెప్పుచున్నది. రావువంశీయుల చరిత్రయందు గురుజాడ శ్రీరామమూర్తి పంతులు గారు కూడ వారిని క్షత్రియజాతిగ నిరూపించియున్నారు మార్కండేయపురాణంబున మహానంది యను రాజు శూద్రకన్యయందు మహాపద్మినిని గనిన ట్లున్నది. ఆ పద్మిని వంశమువారు వీరై యుండవచ్చుననియు, వారి నాయకత్వము గల యీ వంశము పద్మనాయకవంశమనియు కొందఱి యాశయము. క్షత్రియకన్యకలు శూద్రపురుషులను బొందుట శాస్త్రనిషేధము గాని, క్షత్రియులు శూద్రకన్యకలను వరించి సంతానము పడయవచ్చును. ఎక్కువ కులస్థు లగు పురుషులకును తక్కువ కులమువా రగు స్త్రీలకును కలిగిన సంతానము సత్సంతానముగా నే చరిత్రలయందుఁ బరిగణింపబడుచుండెఁ గదా! అంత నీచమైయుండినయెడల వరప్రసాదు లనఁదగు కవులు శ్రేష్ఠత్వ మిత్తురు! మఱియు సోమదేవరాజీయమున కాకతీయ విభుండగు ప్రతాపరుద్రుఁడు నానాజాతుల సభామధ్యంబున నాయకత్వంబు నొసంగు సందర్భమున "ఉత్తమ వంశజాతులే కాని యితర జాతులవారు కారు" అని నొక్కి వక్కాణించి మానధనులును నీతివివేకసంపన్నులును, స్వామిహితాచరులును సమ్మాద్రులు నైన పద్మనాయకులు నాయకత్వంబునకుఁ దగుదు రని నుడువ, ఆ సభ్యు లెల్లరు హర్షించిరి. ప్రతాపరుద్రుఁడు క్షత్రియకులవతంసుఁడు. అట్టి ప్రతాపరుద్రచక్రవర్తి పద్మనాయకులతో సహపంక్తి భోజనము చేసినట్లు పద్మనాయక చరిత్రయందుఁ గలదు. మఱియుఁ పల్నాటివీరచరిత్రమున కార్తవీర్యుని సంతతివాఁడై క్షత్రియుఁడైన యనుగురాజు తన మంత్రియు వెలమవంశీయుఁడు నైన రేచెర్ల దొడ్డనాయని కుమారుని పెద్దన్నను దత్తపుత్రునిఁగా స్వీకరించిన ట్లున్నది. ఇవన్నియుఁ బరికించి చూడ, వీరలు క్షత్రియులే యని నిర్ధారణ యగుచున్నది. ఇంకను వీరి క్షత్రియత్వము నిరూపించుటకు బిరుదావళులు మొదలగు చరిత్రాధారంబు లున్నను, ముందుముందు చరిత్రను విపులముగా వ్రాయఁదలచుకొంటిని గాన గ్రంథవిస్తరభీతిచే ప్రస్తుతము క్లుప్తముగా వ్రాసి ముగించితిని.

# భాస్కరప్రశంస

గాదె జగన్నాథస్వామి గారు


ధరధాతృశంకరుల చిన్మయతేజము నాత్మఁ దాల్చి యీ<br>
రోదసి వెల్గఁజేసి నిజరోచుల; సన్నుతవేదమంత్రవి<br>
ద్యాధరశేఖరుండ వయి దండి శశాంకముఖగ్రహాళితో<br>
నీ ధరణిన్ భరించు నిను నెల్లపుఁకుఁ భజియింతు భాస్కరా!

చ. జగముల కాప్తబంధు వయి చంద్రకళాపరిపోషకుండ వై<br>
గగనచరాధినేత వయి కంధరసృష్టివిరించనుండ వై<br>
నిగమగురుండ వై మఱియు నిస్తులతేజుఁడ వైన దేవ! నిన్<br>
బొగడఁగ నా తరంబె? బుధముఖ్యులు నేరరటన్న, భాస్కరా!

చ. ఒక కవి నీపయిన్ శతక మొప్పఁగఁ జెప్పుటఁ బాసె సంఘతన్<br>
సుకరముగా మఱొక్కఁడు వసుంధరకున్ నిను డించి కొల్చె కో<br>
రికఁ గొనె దీనిఁ జూచి యొకొ రేయిఁబవళ్లను నిన్ను నాశ్రయిం<br>
చి కవిబుధుల్ పరింత్రు గడుఁ జేరువ వేఁడికి నోర్చి భాస్కరా!

చ. కమలభవాండమధ్యమునఁ గ్రాలి చరించుచు నోలిఁ గాలచ<br>
క్రమునను మాసవర్షములు గల్గఁగఁజేయుచు షడ్గ్రహాంబ్రలన్<br>
గ్రమగతిఁ ద్రిప్పకొంచు ధ్రువకాంచనభూమిధరప్రదక్షిణం<br>
బమరులు మెచ్చ సల్పుదని యార్యులు సెప్పుచునుంద్రు భాస్కరా.

ఉ. నీవు స్థిరుండ వంచు మతి నిన్ను ధరిత్రి గ్రహాళి కైవడిన్<br>
వారిరిఁ జుట్టివచ్చు నని ప్రస్తుతకాలబుధుల్ వచింతు రిం<br>
దే వచనంబు సత్యమొ గ్రహించుట కష్టము చూడ రూఢిగాఁ<br>
దావకదీప్తి వర్ధిలెడు ధాత్రి యటంచు గణింతు భాస్కరా!

చ. ఉదయమునందు బ్రహ్మరుచి నొప్పి మహేశుని భాతి వెల్గి మ<br>
ధ్యదివసమందు విష్ణుగతి నస్తమయంబున సొంపు మీఱి స<br>
త్పథమున సంచరించు నినుఁ బ్రస్తుతిఁ జేసి కదయ్య రాముఁ డా<br>
పదఁ బడకుండఁ దొల్లి ఘనకీర్తిఁ బంక్తిముఖున్ బరిమార్చె భాస్కరా!

ఉ. ఒక్కరు చక్రి చక్షు వను చొక్కరు శంకరు తేరి చక్రమం<br>
చొక్కరు పద్మమిత్రుఁ డను చొక్కరు నిన్ గ్రహరాజటంచు ని<br>
ట్లొక్కొక రొక్కపక్కి మది యోజనఁ జేయుచునుంద్రు గాని నే<br>
నిక్కముగా గణించెదను నీ వఖిలేశుఁడ వంచు భాస్కరా!

చ. గురుకృపచేత జ్ఞాన మొనగూడిన దేహి యదెట్లు చిత్తవి<br>
స్ఫురణము గాఁగ దుర్విషయమోహముఁ బాసి వెలుంగు? నట్లెయా<br>
యరుణుఁడు ప్రాగ్దిశన్ బొడముచుంతనె లోకము తెల్వి గాంచు వె<br>
ల్లురు! దశదిక్కులన్ బగఁగి తూలఁగఁజేయఁ దమంబు భాస్కరా!

చ. ప్రతిదినమందు నీవు కనుపట్టుచునుండెడి కాంబునన్<br>
మతి గణియించి నీ మహిమ మన్ననఁ జేయఁగనోప వెందు ని<br>
న్నతిమహతాంధకారగల నాస్తికఘూకము లంతమాత్ర నీ<br>
ప్రతిభకు లోప మాసె? బుధవర్ణితచర్య! నతార్య! భాస్కరా!

ఉ. కంటికి గోచరం బగు జగత్త్రితమైన చరాచరాళి నీ<br>
వంటి యఖండదీప్తి గల వస్తువుఁ గాన, ముహాస్తిఁ జేసి నిన్<br>
దొంటి ద్విజుల్ మహామహిమతో నొకయింత కొఱంత లేకిలన్<br>
మంటయు లేదె! వారి మను మార్గమె శ్లాఘ్యతరంబు భాస్కరా!

# ప్రకృతిశాస్త్రము — వేదాంతము

శ్రీపాద పేరిశాస్త్రి గారు, బి. ఏ., ఎల్. టీ.

జగదుపకారులై జగజెట్టులై యుండి
జగములయందలి జడత మాన్ప
అద్భుతావహముగా ననలంబునుండియే
యుద్భవిల్లెడుఁ జుండి యుదక మనుచు
రాజిల్లు వజ్రముల్ రమ్యతాహీన మౌ
బొగ్గులతో సరిపోలు ననుచు
జగముల జననంబు చలనంబు వృద్ధియు
వైద్యుతశక్తిచే వఱలు ననుచు
బోధ మొనరించి దృష్టాంతపూర్వకముగ
ప్రాజ్ఞు లెల్లరు విశ్వసింపంగ నెల్ల
మర్మములు తేటపఱచి సన్మాన్యులైన
ప్రకృతితత్త్వజ్ఞుల కొనర్తు వందనములు. 1

తే. ప్రకృతితత్త్వవిచారణపండితు లగు
డాల్టను ప్రభు న్యూటను డాక్టరు నల
లివ్నరును బోసు పేళ్చరు లేవొజియరు
హాలటా ఫేరడేలను ప్రస్తుతింతు 2

క. అతులితభక్తిం గొలిచెద
మతిమంతుని నుతగుణాఢ్యు మద్గురువరు నం
చితరసవాదవిధిజ్ఞున్
గతు లిడు చేమూరివంశు నరసింహార్యున్. 3

ప్రస్తుత మాంధ్ర వాఙ్మయమునందు సాధారణముగా రెండు తెగల పుస్తకములు గలవు: (1) వేదాంతగ్రంథములు (2) శృంగార గ్రంథములు. కొన్ని సంవత్సరములనుండి నవలలును బయలుదేఱు చున్నవి.

కాని, ప్రకృతిశాస్త్ర గ్రంథములు బయలువెడలుట లేదు మూఁడు నాలుగేండ్ల క్రిందట ప్రకృతిశాస్త్ర గ్రంథములు లేవనియే చెప్పవచ్చును. వీరేశలింగము పంతులు గారు రచియించిన శరీర శాస్త్రమును ఎవరో నాయఁడుగారు వ్రాసిన మాంత్రసానిక శాస్త్ర మును దప్ప మఱియేవియు నాకుఁ గానరాలేదు. రెండు మూఁడేండ్ల నుండి మాత్రము విజ్ఞానచంద్రికాగ్రంథమాలలో బయలుదేఱుచున్నవి. కావున మనలో ప్రకృతిశాస్త్ర గ్రంథములు లేవనియే చెప్పవచ్చును.

లేమికి కారణ మేమనఁగా, ప్రకృతిశాస్త్ర విమర్శనము చేయు వారు తక్కువ. హిందువులు సాధారణముగా నీ లోకము ముఖ్యము గాదనియు, అంతయు పరలోకముతో మాత్రమే సంబంధము ముఖ్య మనియు, ఐహికలోకసంబంధము లగు శాస్త్రపరిశీలనలను మానిరి. ఇప్పటివా రైహికలోకము ముఖ్య మని యెఱిఁగియుండియు, దానిని మఱచుచు వచ్చిరి. ఏ దెటు లున్నను, వేదాంతార్థము నిచ్చెడి యభిప్రాయములే వారికి సులభముగా నలవడుటచేత నీ వ్యాసమునందు వేదాంతార్థములకును ప్రకృతిశాస్త్రార్థములకును భేదము లే దనియు, రెండును ఒక్కరీతినే బోధచేయు ననియుఁ జూపెదను.

ఈశ్వరుఁడు సర్వవ్యాపకుఁడును సర్వశక్తియు నను వాక్యము గలదు. శక్తి యనఁగా 'ఫోర్సు' అనియు లేక 'ఎనర్జీ' యనియు నేను దలఁచెదను. లోకములో నెక్కడఁ జూచినను శక్తియే వ్యక్త మగుచున్నది. ఈ శక్తి వ్యక్తముగాను అవ్యక్తముగాను పరిణమించుచున్నది. ఆంగ్లభాషలో 'పొటెన్షల్ ఎనర్జీ' యనియు 'కినెటిక్ ఎనర్జీ' యనియు పేరులు గలవు. రసాయన సమ్మేళనమునందును, ధూమశకటము నడచునపుడును, విద్యుచ్ఛక్తి వ్యక్త మగునపుడును శక్తియొక్క సామర్థ్యము వెలువడుచున్నది.

(1) విత్తులోపల నవ్యక్త మగు శక్తి గలదు. అందుచేతనే మొలక భూమికిఁ గల యాకర్షణశక్తి (గ్రేవిటీ)కి విరుద్ధముగా భూమిలోనుండి దారిచేసికొని మీఁదికి (బయటకు) వెలువడుచున్నది. ఆ శక్తిచేతనే తనకుఁ గావలసిన పదార్థములను భూమినుండియు వాయువునుండియు తీసికొని మొలక వృద్ధిపొంది చెట్టుగా పరిణమించుచున్నది.

(2) చెట్టుయొక్క యాకులు కూడ సూర్యరశ్మియందుండెడు శక్తిచేత తమకుఁ గావలయు కర్బనమును నత్రజనిని తీసికొని, క్లోరొఫిలు అను పదార్థమును పండ్లను కాయలను భూమ్యాకాశములనుండి తీసికొనుచున్నవి. ఆకాశమునందు కర్బనద్వయామ్లజని యున్నది. దానిని విభజన చేసి కర్బనమును తీసికొనుచున్నవి. భూమియందలి నత్రికముల (నైట్రేటుల) నుండి కావలయు నత్రజనిని తీసికొనుచున్నవి.

(3) జంతువులు కూడ తమకుఁ గావలయు పదార్థముల నట్లే తీసికొనుచున్నవి. శరీరము మిక్కిలి సూక్ష్మము లగు పదార్థముల యణువుల (సెల్లుల)తో చేయఁబడినది. ప్రతి యణువునందును జీవాణువు (ప్రోటోప్లాసమ్) అనెడు పదార్థమున్నది. ఆ పదార్థములో జీవము నిచ్చు శక్తి గలదు. ఆ శక్తి మూలముననే జంతువులు జీవించుచున్నవి.

(4) ఉదజని (హైడ్రోజన్) అను వాయువును హరిణము (క్లోరీను) అను వాయువును ఒకదానితో నొకటి చేర్చిన మాత్రముననే అవి కలసికొనును. ఎందుచేత ననఁగా, ఆయా వాయువులయందు స్వభావముగా నొక శక్తి గలదు. ఆ శక్తిచే నవి కలియును.

వంగదేశపు శాస్త్రజ్ఞులు జే. సి. బోసు గారు చెట్లకును

జంతువులకును భేద మేమియు లే దనియు చెట్లు కూడ మనుష్యులవలెను జంతువులవలెను తమ కష్టసుఖములను తెలుపు ననియు శోధనపూర్వకముగాఁ జూపియున్నారు. వా రొక యంత్రమును గనిపెట్టియున్నారు. ఆ యంత్రసాహాయ్యముచేత చెట్లు తమ స్థితిగతులను వ్రాయును. క్లోరోఫారమును చెట్టులోనికిఁ జొనిపినయెడల చెట్టు కూడ మనుజునివలెనే నిద్ర చెందునట్లు తెలియవచ్చుచున్నది.

మీఁదఁజెప్పిన తార్కాణములను బట్టి చూచిన, ఈశ్వరశక్తియొక్క సామర్థ్యమును సర్వవ్యాప్తియు తేటయగుచున్నవి. అందుచేతనే,

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి! వింటే.

అనునది నిజము నిజ మని ప్రకృతిశాస్త్రములు చెప్పుచున్నవి. మీఁది పద్యమునందు లింగపరిణామమునకు సంశయింపక 'చక్రి' యనుదానికి బదులుగా 'శక్తి' యని పెట్టిన ప్రకృతిశాస్త్రములలో ఆ పద్యమును జేర్పనగును. ఈ చెప్పిన శక్తికి ఆద్యంతములు లే వని మన వేదాంతార్థము. ప్రకృతిశాస్త్రములు గూడ అది నిజ మని చెప్పుచున్నవి. అదియే యాంగ్లమున "కాన్సర్వేషన్ ఆఫ్ ఎనర్జీ" అని యందురు. అలాగుననే పదార్థము నశింపనేర దని రసాయనశాస్త్రములును చెప్పుచున్నవి. ఆంగ్లమున "ఇండిస్ట్రక్టబిలిటీ ఆఫ్ మేటరు" అని యందురు. పదార్థముయొక్క రూపము మాఱును గాని పదార్థము నశింపదు. ఒక స్ఫురవు(ఫాస్ఫరస్)ముక్కను గాని మైనపువత్తి ముక్కను గాని తీసికొనివచ్చి వెలిఁగించినయెడల పదార్థము నశించినట్లగపడునే గాని, ఆయా పదార్థములు మండునపుడు గలిగెడు వాయువులను తదితరపదార్థములను పోకుండ జాగ్రత్త చేసి తూఁచినయెడల బరువు తగ్గదు. కావుననే "మృత్యు వనఁగ పంచభూతములు పంచభూతములలో కలసిపోవుట" యని మనవారు చెప్పెదరు. తగులఁబెట్టునపుడు గాని పాతిపెట్టునపుడు గాని యీ శరీరము బొగ్గుపులుసు గాలిగాను నీరుగాను ఖటిక హారిదము (కేల్సియమ్ ఫాస్ఫేట్) గాను తదితర పదార్థములుగాను మాఱును. చూచితిరా? ప్రకృతిశాస్త్రము లెట్లు మన వేదాంతార్థములను ఋజువు చేయుచున్నవో!

భగవంతుఁడు పరమదయాళుఁడు. ఈ వాక్యము మనము తఱచుగ వినుచునే యుందుము. కాని, ఈ లోకమునందలి జనులును జంతువులును కష్టపడుచు బాధపడుచున్నారు కదా? భగవంతుఁ డెట్లు పరమదయాళుఁడు? భగవంతుఁడు సృష్టియందు మనకొఱకై చేసియుండు నిర్మాణములను జూచిన మనకు తెలియును, బోధపడును.

(1) పుష్పముయొక్క యండకోశమునందు అండాశయము లున్నవి. అండాశయములే పుప్పొడితోఁ జేరి కాయలు పండ్లు అగును. కావున, అండాశయములను జాగ్రత్తగాఁ గాపాడవలయును. అందుకొఱకే భగవంతుఁడు అండాశయములను అండకోశమునందును, ఆ యండకోశము చుట్టు నాకర్షణపత్రములను, వానికి చుట్టు రక్షకపత్రములను సృజించి జాగ్రత్తగాఁ గాపాడుచున్నవాఁడు.

(2) అలాగుననే జంతువునం దుండెడు శిశువును గూడఁ గాపాడుచున్నాఁడు. జంతువునందు సయితము అండాకృతి గల స్థూలబీజము లున్నవి. ఇవి స్త్రీ సంబంధము లగు స్థూలబీజములు. వీనితో పురుషసంబంధము లగు స్థూలబీజములు కలసి శిశువు గర్భకోశమునం దేర్పడును ఈ కోశము మిక్కిలి నిర్మలముగా నవారోగ్యదాయకము లగు పదార్థములు లేకుండునట్లుగా నుండును. కావున శిశువునకు భంగము గర్భమునం దున్నప్పు డుండదు.

కాని, మనుజులు దుష్ప్రవర్తనలవలన నప్పుడప్పు డా యంగమును పాడుచేయుచుందురు. శిశువు గర్భమున నున్నంత కాలము నొక తిత్తియం దుండును. ఆ తిత్తికి రెండు పొర లుండును.

కోరియను—ఇది మీఁది పొర. దీనిలో మఱియొక పొర యుండును. దీనిని "ఏమ్నియను" అని పిలిచెదరు. దీనిలోపల నొక విధమయిన ద్రవపదార్థము (ఏమ్నియోటిక్ ఫ్లూయిడ్) నందు శిశువు తేలుచుండును.

ఎందుకొఱకు భగవంతుఁ డీ ద్రవమును బెట్టినాఁడు? తల్లిగర్భమున కేదైన దెబ్బ తగిలినను లోనుండు శిశువునకు దెబ్బ తగులకుండ నాఁపుదల చేయుటకే.

(3) ఈ లోకమునందు జీవరాసుల శ్వాసకోశములనుండియు, వృక్షజంతుసంబంధము లగు పదార్థములు కుళ్లునపుడును మఱుగునపుడును మండునపుడును, కర్బనద్వయామ్లజని అనఁగా బొగ్గుపులుసు గాలి బయలుదేఱును. ఈ వాయువునందే జీవుఁడును నివసింపఁజాలఁడు. ఎన్నియో యుగములనుండి యీ వాయువు బయలుదేఱుచున్నదే. మన మేల జీవించియున్నాము? భగవంతుఁ డిది చూచియే తగిన యేర్పాటులు చేసియున్నాఁడు. చెట్లు సూర్యకిరణముల సాహాయ్యముచేత ఆ వాయువును విభజించి తమకుఁ గావలయు కర్బనమును దీసికొని ప్రాణవాయువును మన కిచ్చుచున్నవి. చూచితిరా భగవంతుని ప్రేమ!

మీఁదఁ జెప్పిన తార్కాణములను బట్టి చూడ, భగవంతుఁడు పరమదయాళుఁడు గాఁ డని యెవ్వరు చెప్పఁగలరు? మీఁదఁ జెప్పిన మూఁడవ తార్కాణమును బట్టి చూడ, ఈ జగత్తు నియామకమైన త్రోవను బోవుచున్న దనియు, భగవంతుఁ డెంతయు బుద్ధిశాలి యనియు తేటపడుచున్నది. నే నిప్పు డిచ్చిన తార్కాణములు మిక్కిలి కొంచెము. ఈ లాగుననే తార్కాణములను వేలకొలఁది గుణింపనగును. వేయుగ చెప్పనేల? ప్రకృతిశాస్త్రములే వేదాంత గ్రంథములు. కాని, అవి వేదాంతమును మిక్కిలి సులభముగా

# ప్రకృతిశాస్త్రము — వేదాంతము

శ్రీపాద పేష్శాస్త్రి గారు, బి. ఏ., ఎల్. టి.

జగదుపకారులై జగజ్జెట్టులై యుండి
జగములయందలి జడత మాన్ప
అద్భుతావహముగా ననలంబునుండియే
యుద్భవిల్లెడుఁ జుండి యుదక మనుచు
రాజిల్లు వజ్రముల్ రమ్యతాహీన మౌ
బొగ్గులతో సరిపోలు ననుచు
జగముల జననంబు చలనంబు వృద్ధియు
వైద్యుతశక్తిచే వఱలు ననుచు
బోధ మొనరించి దృష్టాంతపూర్వకముగ
ప్రాజ్ఞు లెల్లరు విశ్వసింపంగ నెల్ల
మర్మములు తేటపఱచి సన్మాన్యులైన
ప్రకృతితత్త్వజ్ఞుల కొనర్తు వందనములు. 1

తే. ప్రకృతితత్త్వవిచారణపండితు లగు
డాల్టను ప్రభు న్యూటను డాక్టరు నల
లిస్టరును బోసు పేశ్చరు లేవొజియరు
వాలటా ఫేరడేలను ప్రస్తుతింతు 2

క. అతులితభక్తిం గొలిచెద
మతిమంతుని నుతగుణాఢ్యు మద్గురువరు నం
చితరసవాదవిధిజ్ఞుఁ
గతు లిడు చేమూరివంశు నరసింహార్యుఁ. 3

ప్రస్తుత మాంధ్ర వాఙ్మయమునందు సాధారణముగా రెండు తెగల పుస్తకములు గలవు: (1) వేదాంతగ్రంథములు (2) శృంగారగ్రంథములు. కొన్ని సంవత్సరములనుండి నవలలును బయలుదేఱుచున్నవి.

కాని, ప్రకృతిశాస్త్ర గ్రంథములు బయలువెడలుట లేదు. మూఁడు నాలుగేండ్ల క్రిందట ప్రకృతిశాస్త్ర గ్రంథములు లేవనియే చెప్పవచ్చును. వీరేశలింగము పంతులు గారు రచియించిన శరీరశాస్త్రమును ఎవరో నాయఁడుగారు వ్రాసిన మాంత్రసానిక శాస్త్రమును దప్ప మఱియేవియు నాకుఁ గానరాలేదు. రెండు మూఁడేండ్లనుండి మాత్రము విజ్ఞానచంద్రికాగ్రంథమాలలో బయలుదేఱుచున్నవి. కావున మనలో ప్రకృతిశాస్త్ర గ్రంథములు లేవనియే చెప్పవచ్చును. లేమికి కారణ మే మనఁగా, ప్రకృతిశాస్త్ర విమర్శనము చేయువారు తక్కువ. హిందువులు సాధారణముగా నీ లోకము ముఖ్యముగా దనియు, అంతయు పరలోకముతో మాత్రమే సంబంధము ముఖ్యమనియు, ఐహికలోకసంబంధము లగు శాస్త్రపరిశీలనలను మానిరి. ఇప్పటివా రైహికలోకము ముఖ్యమని యెఱిఁగియుండియు, దానిని మఱచుచు వచ్చిరి. ఏ దెటు లున్నను, వేదాంతార్థము నిచ్చెడి యభిప్రాయములే వారికి సులభముగా నలవడుటచేత నీ వ్యాసమునందు వేదాంతార్థములకును ప్రకృతిశాస్త్రార్థములకును భేదము లే దనియు, రెండును ఒక్కరీతినే బోధచేయు ననియుఁ జూపెదను.

ఈశ్వరుఁడు సర్వవ్యాపకుఁడును సర్వశక్తియు నను వాక్యము గలదు. శక్తి యనఁగా 'ఫోర్సు' అనియు లేక 'ఎనర్జీ' యనియు నేను దలఁచెదను. లోకములో నెక్కడఁ జూచినను శక్తియే వ్యక్త మగుచున్నది. ఈ శక్తి వ్యక్తముగాను అవ్యక్తముగాను పరిణమించుచున్నది. ఆంగ్లభాషలో 'పొటెన్షల్ ఎనర్జీ' యనియు 'కినెటిక్ ఎనర్జీ' యనియు పేరులు గలవు. రసాయన సమ్మేళనమునందును, ధూమశకటము నడచునపుడును, విద్యుచ్ఛక్తి వ్యక్త మగునపుడును శక్తియొక్క సామర్థ్యము వెలువడుచున్నది.

(1) విత్తులోపల నవ్యక్త మగు శక్తి గలదు. అందుచేతనే మొలక భూమికిఁ గల యాకర్షణశక్తి (గ్రేవిటీ)కి విరుద్ధముగా భూమిలోనుండి దారిచేసికొని మీఁదికి (బయటకు) వెలువడుచున్నది. ఆ శక్తిచేతనే తనకుఁ గావలసిన పదార్థములను భూమినుండియు వాయువునుండియు తీసికొని మొలక వృద్ధిపొంది చెట్టుగా పరిణమించుచున్నది.

(2) చెట్టుయొక్క యాకులు కూడ సూర్యరశ్మియం దుండెడు శక్తిచేత తమకుఁ గావలయు కర్బనమును నత్రజనిని తీసికొని, క్లోరొఫిలు అను పదార్థమును పండ్లను కాయలను భూమ్యాకాశములనుండి తీసికొనుచున్నవి. ఆకాశమునందు కర్బనద్వయామ్లజని యున్నది. దానిని విభజన చేసి కర్బనమును తీసికొనుచున్నవి. భూమియందలి నత్రికముల (నైట్రేటుల) నుండి కావలయు నత్రజనిని తీసికొనుచున్నవి.

(3) జంతువులు కూడ తమకుఁ గావలయు పదార్థముల నట్లే తీసికొనుచున్నవి. శరీరము మిక్కిలి సూక్ష్మము లగు పదార్థముల యణువుల (సెల్లుల)తో చేయఁబడినది. ప్రతి యణువునందును జీవాణువు (ప్రోటోప్లాసమ్) అనెడు పదార్థ మున్నది. ఆ పదార్థములో జీవము నిచ్చు శక్తి గలదు. ఆ శక్తి మూలముననే జంతువులు జీవించుచున్నవి.

(4) ఉదజని (హైడ్రోజన్) అను వాయువును హరిణము (క్లోరీను) అను వాయువును ఒకదానితో నొకటి చేర్చిన మాత్రముననే అవి కలసికొనును. ఎందుచేత ననఁగా, ఆయా వాయువులయందు స్వభావముగా నొక శక్తి గలదు. ఆ శక్తిచే నవి కలియును.

వంగదేశపు శాస్త్రజ్ఞులు జే. సి. బోసు గారు చెట్లకును

జంతువులకును భేద మేమియు లే దనియు చెట్లు కూడ
మనుష్యులవలెను జంతువులవలెను తమ కష్టసుఖములను
తెలుపు ననియు శోధనపూర్వకముగాఁ జూపియున్నారు.
వా రొక యంత్రమును గనిపెట్టియున్నారు. ఆ యంత్రసా
హాయ్యముచేత చెట్లు తమ స్థితిగతులను వ్రాయును. క్లోరో
ఫారమును చెట్టులోనికిఁ జొనిపినయెడల చెట్టు కూడ
మనుజునివలెనే నిద్ర చెందునట్లు తెలియవచ్చుచున్నది.

మీఁదఁజెప్పిన తార్కాణములను బట్టి చూచిన, ఈశ్వరశక్తి
యొక్క సామర్థ్యమును సర్వవ్యాప్తియు తేటయగుచున్నవి.
అందుచేతనే,

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి! వింటే.

అనునది నిజము నిజ మని ప్రకృతిశాస్త్రములు చెప్పుచున్నవి. మీఁది పద్యమునందు లింగపరిణామమునకు సంశయింపక 'చక్రి' యనుదానికి బదులుగా 'శక్తి' యని పెట్టిన ప్రకృతిశాస్త్రములలో ఆ పద్యమును జేర్పనగును. ఈ చెప్పిన శక్తికి ఆద్యంతములు లే వని మన వేదాంతార్థము. ప్రకృతిశాస్త్రములు గూడ అది నిజ మని చెప్పుచున్నవి. అదియే యాంగ్లమున "కాన్సర్వేషన్ ఆఫ్ ఎనర్జీ" అని యందురు. ఆలాగుననే పదార్థము నశింపనేర దని రసాయనశాస్త్రములును చెప్పుచున్నవి. ఆంగ్లమున "ఇండిస్ట్రక్టబిలిటీ ఆఫ్ మేటరు" అని యందురు. పదార్థముయొక్క రూపము మాఱును గాని పదార్థము నశింపదు. ఒక స్ఫురవు(ఫాస్ఫరస్)ముక్కను గాని మైనపువత్తి ముక్కను గాని తీసికొనివచ్చి వెలిఁగించినయెడల పదార్థము నశించినట్లగపడునే గాని, ఆయా పదార్థములు మండునపుడు గలిగెడు వాయువులను తదితరపదార్థములను పోకుండ జాగ్రత్త చేసి తూఁచినయెడల బరువు తగ్గదు. కావుననే "మృత్యు వనఁగ పంచభూతములు పంచభూతములలో కలసిపోవుట" యని మనవారు చెప్పెదరు. తగులఁబెట్టునపుడు గాని పాతిపెట్టునపుడు గాని యా శరీరము బొగ్గుపులుసు గాలిగాను నీరుగాను ఖటిక హారిదము (కేల్సియమ్ ఫాస్ఫేట్) గాను తదితర పదార్థములుగాను మాఱును. చూచితిరా? ప్రకృతిశాస్త్రము లెట్లు మన వేదాంతార్థములను రుజువు చేయుచున్నవో!

భగవంతుఁడు పరమదయాళుఁడు. ఈ వాక్యము మనము తఱచుగ వినుచునే యుందుము. కాని, ఈ లోకమునందలి జనులును జంతువులును కష్టపడుచు బాధపడుచున్నారు కదా? భగవంతుఁ డెట్లు పరమదయాళుఁడు? భగవంతుఁడు సృష్టియందు మనకొఱకై చేసియుండు నిర్మాణములను జూచిన మనకు తెలియును, బోధపడును.

(1) పుష్పముయొక్క యండకోశమునందు అండాశయము లున్నవి. అండాశయములే పుప్పొడితోఁ జేరి కాయలు పండ్లు అగును. కావున, అండాశయములను జాగ్రత్తగాఁ గాపాడవలయును. అందుకొఱకే భగవంతుఁడు అండాశయముల నండకోశమునందును, ఆ యండకోశము చుట్టు నాకర్షణపత్రములను, వానికి చుట్టు రక్షకపత్రములను సృజించి జాగ్రత్తగాఁ గాపాడుచున్నవాఁడు.

(2) ఆలాగుననే జంతువునం దుండెడు శిశువును కూడఁ గాపాడుచున్నాఁడు. జంతువునందు సయితము అండాకృతి గల స్థూలబీజము లున్నవి. ఇవి స్త్రీ సంబంధము లగు స్థూలబీజములు. వీనితో పురుషసంబంధము లగు స్థూలబీజములు కలసి శిశువు గర్భకోశమునం దేర్పడును ఈ కోశము మిక్కిలి నిర్మలముగా ననారోగ్యదాయకము లగు పదార్థములు లేకుండునట్లుగా నుండును. కావున శిశువునకు భంగము గర్భమునం దున్నప్పు డుండదు.

కాని, మనుజులు దుష్టప్రవర్తనలవలన నప్పుడప్పు డా యంగమును పాడుచేయుచుందురు. శిశువు గర్భమున నున్నంత కాలము నొక తిత్తియం దుండును. ఆ తిత్తికి రెండు పొర లుండును.

కోరియను—ఇది మీఁది పొర. దీనిలో మఱియొక పొర యుండును. దీనిని "ఏమ్నియను" అని పిలిచెదరు. దీనిలోపల నొక విధమయిన ద్రవపదార్థము (ఏమ్నియోటర్ ఫ్లూయిడ్) నందు శిశువు తేలుచుండును.

ఎందుకొఱకు భగవంతుఁ డీ ద్రవమును బెట్టినాఁడు? తల్లిగర్భమున కేదియైన దెబ్బ తగిలినను లోనుండు శిశువునకు దెబ్బ తగులకుండ నాఁపుదల చేయుటకే.

(3) ఈ లోకమునందు జీవరాసుల శ్వాసకోశములనుండియు, వృక్షజంతుసంబంధము లగు పదార్థములు కుళ్లినపుడును మఱుఁగునపుడును మండునపుడును, కర్బనద్వ్యామ్లజని అనఁగా బొగ్గుపులుసు గాలి బయలుదేఱును. ఈ వాయువునందే జీవుఁడును నివసింపఁజాలఁడు. ఎన్నియో యుగములనుండి యీ వాయువు బయలుదేఱుచున్నదే. మన మెల జీవించియున్నాము? భగవంతుఁ డిది చూచియే తగిన యేర్పాటులు చేసియున్నాఁడు. చెట్లు సూర్యకిరణముల సాహాయ్యముచేత ఆ వాయువును విభజించి తమకుఁ గావలయు కర్బనమును దీసికొని ప్రాణవాయువును మనకిచ్చుచున్నవి. చూచితిరా భగవంతుని ప్రేమ!

మీఁదఁ జెప్పిన తార్కాణములను బట్టి చూడ, భగవంతుఁడు పరమదయాళుఁడు గాఁ డని యెవ్వరు చెప్పఁగలరు? మీఁదఁ జెప్పిన మూఁడవ తార్కాణమును బట్టి చూడ, ఈ జగత్తు నియామకమైన త్రోవను బోవుచున్న దనియు, భగవంతుఁ డెంతయు బుద్ధిశాలి యనియు తేటపడుచున్నది. నే నిప్పు డిచ్చిన తార్కాణములు మిక్కిలి కొంచెము. ఈ లాగుననే తార్కాణములను వేలకొలఁది గుణింపనగును. వేఱుగ చెప్పనేల? ప్రకృతిశాస్త్రములే వేదాంత గ్రంథములు. కాని, అవి వేదాంతమును మిక్కిలి సులభముగా

బాగుగా మనస్సునకు పట్టునట్లు మాటల యాడంబరము లేక దృష్టాంత పూర్వకముగను శోధనపూర్వకముగను తెలియఁజేయును.

సత్యమును ప్రకృతిశాస్త్రము చెప్పునట్లు మరియే గ్రంథములును జెప్పఁజాలవు. సత్య మనఁగా నోటితో మాటలు చెప్పుట గాదు ఉన్నది యున్నట్టు చెప్పుట. ఉన్నది యున్నట్టు చెప్పుటకు ప్రకృతిశాస్త్రములకుఁ గాక మరియేశాస్త్రములకు వీ లున్నది? తక్కిన శాస్త్రములలో సత్యమో యసత్యమో తెలిసికొనుటకు తగిన శోధనలు లేవు. వేదవ్యాసుఁడు చెప్పినాఁ డనిన ప్రకృతిశాస్త్రములలో దానికి ఘనత రాదు. శోధనను చూపుము.

అదియును గాక, ఐహికమునం దెంత మనకు ఈ శాస్త్రముల వలన లాభము గలదో కండ్లతోఁ జూచువానికిని, చెవులతో వినువానికిని, నోటితో రుచి చూచువానికిని, కొంచెము ఆలోచన యున్నవానికిని జెప్పనక్కఱలేదు మీ సౌఖ్యముల కెల్ల ప్రకృతిశాస్త్రములే మూలములు.

కాని, కొందఱు జర్మనీ దేశమును జూపి, చూచితిరా ప్రకృతిశాస్త్రము లెట్లు పరిణమించినవో యందురు. జర్మనియందు రసాయనశాస్త్రమును శస్త్రశాస్త్రమును మిక్కిలి యభివృద్ధి చెందనవి. రసాయనశాస్త్రమే యిప్పు డీ మహాఘోరసంగ్రామమును నడపించుచున్నది. దానివలననే "జప్పెలినులు" "విషవాయు ప్రయోగములు" 'మంటలు', బాంబులు, 17 అంగుళముల ఫిరంగులు బయలుదేఱినవి. కావున రసాయన శాస్త్రము పాపభూయిష్ఠ మయినది యని చెప్పనగును. కాని, దీనివలనఁ గలిగెడు లాభము లెన్ని యున్నవి? ఎందఱు జనులు సుఖించుచున్నారు? నాగరకత యెంత హెచ్చెనది?—ఇది యాలోచింపవలదా? రసాయన శాస్త్రము లేనియెడల కట్టుటకు బట్టయు, తినుటకు అన్నమును, శరీరారోగ్యమునకు మందును అరుదై పోవును.

మంగలికత్తి మంచిదే. మంగలివాఁడు మనకు క్షురకర్మ నాచరించి మనల నందముగాఁ జేయును. అటు గాక, క్షురకర్మ చేయుచు మంగలి కత్తితో వేసిన నేమి చేయవచ్చును? అప్పుడా మంగలి పొదిలోనుండి మరియొక కత్తిని దీసి వాని వ్రేలును తెగవేయవలయునే కాని, మంగలికత్తిని నిందింపవచ్చునా? ప్రతి వస్తువునకును మంచి యుపయోగమును చెడ్డ యుపయోగమును గలవు. దానిని జాగ్రత్తతో వాడుకొనవలయును.

కావున, దేశాభివృద్ధికయి ప్రకృతిశాస్త్ర పరిశ్రమ చేసి, యాంధ్రవాఙ్మయమునం దా శాస్త్రములను వ్రాసి యాంధ్రవధూటికి వన్నె తేవలయు నని కోరుచు విరమించుచున్నాఁడను.

# అంధుఁడు

నాగసముద్రము వాసుదేవరావు గారు

వెలుఁగు వెలుఁ గంచుఁ బలుమాఱు పలుకుచుంద్రు,
కన్నులే లేవు: నే దానిఁ గాంచు టెట్లు?
వసుధ వెలుఁ గంచుఁ బరఁగెడు వస్తు వేదో?
దృష్టియే లేకయుండిన నష్ట మేమొ?
చూపు గలిగిన సమకూరు సుఖ మ దేమొ?
దిక్కు మాలిన గ్రుడ్డిని దెలుపరాదె?
వింత లెన్నియొ వసుధలో వెలయు ననుచు
భానుఁ డెంతయుఁ గాంతితోఁ బరఁగు ననుచు
ముచ్చటింతురు వేనూఱు ముదముతోడ;
నిసుని వేఁడిమి ననయము గనుచునుందు,
వెలుఁగు చీఁకటు లతనిచేఁ గలుగు నెట్లు?
నిదురపోవుచు నుండిన నదియె రాత్రి,
పాటుపడియెడి సమయమే పగలు నాకు;
నిదురపోకయ నే నుండనేర్తునేని
యంతమే లేని పగలు నా కమరియుండు;
నిడుద నిట్టూర్పు లుడుగుచు నేలఁ గనుచు
నకట! యెంతటి వంత యీ యంధున కని
మీర లెల్లరు ననుఁ జూచి మిడుకుచుంద్రు;
కనులచేఁ గల్గు సుఖము నేఁ గానఁ గాన,
నోర్పుతో నేను ఈ నష్ట మోర్చియుందు.
పొందఁజాలనిదానికై పొక్కు టేల?
చింత లేవియు లేనట్టి స్వాంతమందు
క్రొత్త బాధల సమకూర్చుకొనఁగ నేల?
గ్రుడ్డి బాలుఁడ ననుచు నేఁ గుందనేల?
కాన, మీరీతిఁ జేయుచుఁ గడు ముదమున
ప్రొద్దుపుచ్చుచు మనుటయే పొసఁగెనేని,
సార్వభౌమునితో నేను సాటియగుదు.

# యుద్ధము — భౌతిక శాస్త్రములు

విస్సా అప్పారావు గారు, ఎమ్.ఏ., ఎల్.టి.

అహో! నేడు జరగుచున్న ఐరోపామహాసంగ్రామ మెన్ని ప్రక్కల వ్యాపించి యున్నది! ఇరుతెగల బలములును రామాయణ భారత యుద్ధబలములను మించియున్నవి. ఇదివఱకు నెఱేగిన యుద్ధము లన్నిటికంటె దీనియందు బహువిశేషములు గలవు. ఒక్కొక యుద్ధరంగము వందలకొలఁది వేలకొలఁది మైళ్ల దూరము గలిగియున్నది. ఒక రంగమునకు మఱియొక రంగమునకు ఖండాంతరములం దుండుటచేత వేలకొలఁది మైళ్ల దూర మున్నది. యుద్ధము అన్నిచోటులలో ముగింపు లేక నిరంతరము రాత్రింబగళ్లు 18 మాసములనుండి జరగుచునే యున్నది. ఇంక నిటు లెన్నినాళ్లు జరగ నున్నదో! ఇట్టి యుద్ధము ఏ విధమున నాటంకము లేకుండ జరగుటకు ఐరోపాఖండవాసుల బుద్ధిచాతుర్యమే కారణము. సుమారు 25 సంవత్సరముల నాఁటినుండి, అందులో ఈ పదిసంవత్సరముల లోను, తెల్లవారల భౌతికశాస్త్రచర్చలు శోధనములు బహు ప్రబలముగా జరగినవి. అన్ని శాస్త్రములలోను బహువిచిత్రములు గనుపెట్టఁబడినవి. వీనితో యుద్ధసౌకర్య మెట్లు జరగు నన్న విషయము మఱియును శోధింపఁబడినది; చాలవఱకు సిద్ధిఁ బొందినది; పొందుచున్నది. అట్టి స్థితియందు యుద్ధ మారంభమైనది. ఇరువదియవ శతాబ్దమున జరగిన యుద్ధములయందు ఈ నవనాగరకతాఫలవిశేషములు గాన్పించుచునే యున్నవి కాని, యింత వ్యాప్తి గల మహాసంక్షోభ మిదివఱలో పుట్టనందున భౌతికశాస్త్రముయొక్క నిగ్గులును శక్తులును అంతగా వెల్లడి యగుటకు కారణములు కనఁబడలేదు. ఇప్పటి యుద్ధప్రక్రియలను మార్చుటయందు సాధనభూతము లగు భౌతికశాస్త్రమహాశక్తులలో ముఖ్యమైనవి ఏవనఁగా:

1. పెట్రోలు మోటారు యంత్రము.
2. విద్యుద్యంత్రములు.
3. పొగ లేని మందు, గొప్ప అగాదుగుండు.
4. విషజల విషవాయు ప్రయోగములు.

## 1. పెట్రోలు మోటారు యంత్రము

మోటారు బండ్లను, మోటారు సైకిళ్లను, జప్పెలిను గాలిమోడలను, తదితరవిమానములను నడపు యంత్ర మీ పెట్రోలు యంత్రమే. ఆవిరి యంత్రములో నీరు గాలి యై యంత్రమును ఎటుల నడపునో, ఈ యంత్రములో పెట్రోలు గాలిగా మాఱి ప్రాణవాయువుతో మిశ్రమై యంత్రమును నడపును. ఈ పెట్రోలు కిరొసిన్ నూనెలో నొకభేదము. ఈ పెట్రోలు మోటారు, పొగబండి యావిరియంత్రమువలె, పెద్దది కాదు. అంతకంటె పెక్కురెట్లు బరువు తక్కువ. సమశక్తి గలిగియుండి ఈ విశేషములు అదనముగా కలిగియుండుటచేత, క్రమక్రమముగా సాధారణమైన పను లన్నిటిని సాధ్యపఱుచుటకు పెట్రోలుయంత్రము మిక్కిలి సహకారిగా నున్నది. శక్తి యెక్కువ బరువు తక్కువ యగుటచేత నెంతటి బరువులను సునాయాసముగా నీ యంత్ర మతివేగముతో లాగఁగలిగి యున్నది. ఈ కారణముచేత యుద్ధరంగమునందు అనేకరీతుల తోడ్పడుచు నుపయోగింపఁబడుచున్నది.

రణరంగములయందు పూర్వముకంటె మిక్కిలి యెక్కుడు సేనలను నిలుపుటకు ఈ యంత్రమే ముఖ్యాధారము. చతురంగబలములు, మందుగుండు సామానులు, పరివారములు, సర్వవిధములైన సన్నాహములు, యుద్ధమునకు దాడివెడలుటకును కొంతకాలము అనుకూల భోజనాదులతో యుద్ధము జరపుటకును దేశమందు 5, 6 ఇనుపదారులు, విశాలమైన బాటలు కలిగియున్న యెడల, పూర్వమందు అనుకూలముగా యుద్ధము జరుగుచువచ్చినది. ఇంతియగాక, దేశము సుభిక్షమై, ఫలవంతమై, కాలము సమమై యుండెడిది. ఇప్పుడో అట్టివి యున్నను సరిపడవు. ఇట్టి యుద్ధమునకు కావలసిన సకల విషయములకు వేగనులు, వేన్సు, అమిబస్సులు లారీలు, కార్సులు, ఆమ్బ్యులెన్సులు మొదలగు పెట్రోలు మోటారు బండ్లు, వందలకొలఁది వేలకొలఁది ప్రతిరంగమందును రాత్రింబగళ్లు పనిచేయుచున్నవి. ఇవియే లేకున్న యెడల అన్ని లక్షల సేనలు ఏ లోటును లేకుండ నెన్నఁడు నుండ నేరవు. చుట్టుపట్టుల కూరగాయలు పైరులు ఇతర భోజనసామగ్రులును, సేనలు ప్రవేశించిన కొలఁదిరోజులలోనే వ్యయ మయినవి. ఆయా జిల్లాలనుండి పారిపోఁగా మిగిలిన జనులకును ఈ సేనాసమూహములకును ఈ మోటారు బండ్లే ప్రాణాధారము లయియున్నవి.

రాజులు తమ కోటలలో డాఁగి, బురుజులమీఁద గొప్ప గొప్ప ఫిరంగులను మోపి వాని శక్తిచేత శత్రువులను బీభత్సము చేయుచుండిరి. బురుజులమీఁద నుంపఁబడిన గొప్ప ఫిరంగులకు జవాబు చెప్పఁదగినట్టి గొప్ప శతఘ్నులను తమతో తీసికొని వచ్చుటకు ప్రతికక్షులకు వీలు లేకయుండెను. అతిభారము లగుటచేత మిట్టపల్లములయందు (నిమ్నోన్నతములయందు) త్వరితముగా లాగుటకు గుఱ్ఱములు సహకారులు గానందున నిదివఱలో నట్లుండెను. అందుచేతనే రాష్ట్రాధిపతు లందఱు తగిన స్థలములయందు అభేద్యమైన గొప్ప కోటలను గట్టుకొని మన క్షేమ మభయ మని తలంచుకొనుచుండిరి. బెల్జియములోని లీజి నామూరు అన్ట్వెర్పు కోటలును, రష్యాలోని వార్సా నోవాజార్జివిస్కు కోవ్నో ఇవేన్‌గరాడు

కోటలును అట్టివియే. దుస్సాధ్యము లనుకొన్న వీని యవస్థ ప్రస్తుత మెట్లున్నదియు నందఱకు తెల్లమైన విషయమే. అట్టి దృఢ దుర్గములు సులభభేద్యము లగుటకు ఏమి కారణము? అడుగు, అడుగున్నఱ వాశా గల గొప్ప ఫిరంగులను, ఈ క్రొత్త పెట్రోలు యంత్ర సాధనము మూలమున నతిసులభముగా కావలయు నన్న చోట్లకు శత్రువులు తీసికొని పోఁగలుగుటయే. ఈ ఫిరంగులు 1000, 2000 పౌనుల బరువు గల గుండ్లను మహావేగముతో 10, 15 మైళ్ల దూరము నుండి కోటలమీఁదకు త్రోయఁగలవు. ఇట్టివి గుఱి తప్పక తగిలిన యెడల, నవీనసాధననిర్మితము లైన యంతటి బలిష్ఠపు బురుజులు సయితము దెబ్బ కొకటి చొప్పున ధ్వంస మయినవి. కావున, ముందు కోటలను గట్టుకొనుట అవివేకపుఁ బనిగా తోఁచుచున్నది.

మునుపటివలెఁ గాక సైనికులకు వారి పరివారములకు ఆహారపదార్థములు శుభ్రముగాను విరివిగాను సమకూరుచున్నవి. రొట్టె మాంసము కూరగాయలు పెట్టెలలోఁ బెట్టి మూయఁబెట్టినవి గాకుండ నెప్పటి కప్పుడు ఎంతదూరమునుండి యైనను వీని సాధనమున తేఁబడుచున్నవి. ఇందువలన సైన్యమునకు సౌఖ్యము ఆరోగ్యము ఎక్కువయై యుద్ధసామర్థ్యము పెరుఁగుచున్నది. ఇంతియ గాక, గాయములు తగిలి యుద్ధరంగమునందు పడిపోయినవారిని తత్క్షణము తీసి, తగిన యేర్పాటులు ఔషధసాధనవిశేషములు గలిగి యుద్ధరంగమునకు చాల దూరమున నున్న స్థలములకు, ఎంత మాత్రమును కాలవిలంబము గాని కుదుపునది గాని లేకుండ సర్వసుఖముల నిచ్చుచు గొని పోవుటకు ఈ ఆమ్బ్యులెన్సు బండ్లు మిక్కిలి యుపకారులుగా నున్నవి. సేనలకు కావలసిన చోట వంట చేయుటకును, యుద్ధప్రదేశములయందు కావలె నన్న చోటికిఁ బోవుటకును, మోటారు బండ్లమీఁద వంటశాలలు నిర్మింపఁబడియున్నవి. సైనికులు స్నానమాడుటకును, స్నానము చేయునపుడు వారి దుస్తులను పరిశుద్ధిఁ జేయుటకును, సదుపాయములు గల బండ్లును యుద్ధభూములయం దుపయోగింపఁబడుచున్నవి. సాధారణముగా ఇండ్లయొద్ద జరగునటు లెల్ల సదుపాయముల నిచ్చుచు ప్రతిదినము ఏ పనియు వేళ తప్పక జరపుచు ఈ బండ్లు కడు సౌఖ్యదాయకములగుచున్నవి. యుద్ధమం దొక స్థలమున కొల్బలము నశించి దురవస్థ తటస్థింపనై యున్న సమయములయందు అతిశీఘ్రముగా తాజా బలమును కడు దూరమునుండి యైనను తీసికొని వచ్చుటకు కూడ ఈ బండ్లత్యంతోపయోగములుగా నున్నవి. సేనానాయకులు తమ తమ సేనలను ప్రతిదినమును పోయి చూచుటకును, ఎక్కడెక్కడ ఏ వింత పుట్టినను స్వయముగా పరీక్షించి యాలోచన చెప్పుటకును, గుఱ్ఱముకంటె అతిత్వరితము లగుటచేత ఈ బండ్లు సాధనము లగుచున్నవి. మఱియు నొక యధికారియొద్దనుండి మరియొకనియొద్దకును, ఒక రంగమునుండి మరియొక రంగమునకును, ప్రభుత్వమువారియొక్క యుత్తరువు లందఱకు త్వరలో తెలుపుటకు మోటారు సైకిళ్లుపయోగింపఁబడుచున్నవి.

శత్రుసేనల ఆనుపానులు కనుఁగొనుటకును, స్వసేన లున్న స్థలముల యొక్క చుట్టుపట్లను పరిశీలించి క్షేమము గలుగఁజేయుటకును గుఱ్ఱపుదళ ముపయోగము. కాని, ఇప్పు డీ పనిని మోటారు బండ్లమీఁద తక్కువ జనము శీఘ్రకాలములోఁ జేయుచున్నారు. అందుచేత గుఱ్ఱపుదళములయొక్క యావశ్యకత యంతగా లేదు. ఈ బండ్లకు ఉక్కురేకుల కవచము లుండును. వీనిమీఁద యంత్రపు తుపాకు లమర్పఁబడియుండును. ఇట్టి పనులకు కొన్ని సమయములయందు ఈ విధముగానే మోటారుసైకిళ్లు కూడ ఉపయోగముగా నున్నవి.

ఆకాశగమన మనునది యీ పెట్రోలు మోటారు యంత్ర సాహాయ్యము లేనియెడల సాధ్యము గాకయేపోవును. 50 గుఱ్ఱముల శక్తి గల యీ యంత్రము రమారమి 100 పౌనుల బరువులో నిమిడింపఁబడుచున్నది. ఇట్టి యంత్రములు రాను రాను గొప్పగొప్పవి నిర్మింపఁబడుచున్నవి. ఇది యంతయు 4, 5 సంవత్సరములలో వచ్చిన మార్పు. ఒక్కొక యంత్రము 250 గుఱ్ఱముల బలము గలది కూడ కట్టుచున్నారు. అట్టివి నాలు గున్నయెడల ఎంత శక్తియో యాలోచింపుఁడు. అందుచేతనే జెప్పిలిను గాలిఓడలు 2, 3 టన్నుల బరువు గల బాంబు గుండ్లతోను మఱి యింత బరువు గల తదితరసామగ్రులతోను 7, 8 వేల అడుగుల యెత్తున గంటకు 50 మైళ్ల చొప్పునఁ బోఁగలుగుచున్నవి. ఇవి గాక రకరకముల ఏరోప్లేనులు అనేకములు గూడ వీని సాహాయ్యముననే పోవుచున్నవి. ఇవి యాకసమున నిరంతరము తిరుగుచుండుటచేత ఇరుతెగలవారికిని దాఁపఱికములు రహస్యములు దొంగపోటులు అనునవి యే విషయములోఁ గాని యుండుటకు వీలు లేక యొకరి రహస్య మొకరికి తెలియుచున్నది. ఇందుచేతనే పూర్వమువలెఁ గాక ప్రతిదినము పోరుచున్నను ఎవ్వరికిని నిశ్చయమైన గెలుపు గలుగుట లేదు.

ఫిరంగులతో గుఱి చూచి కొట్టుటకు ఈ విమానములు ముఖ్యాధారములు. ఆకాశమున నుండి గుండు దెబ్బ తగిలినది తప్పినది సంజ్ఞాపూర్వకముగా ఈ విమానములలోనివారు తెలియఁబఱచుచుందురు. ఈ కారణముచేత బహిరంగస్థలములలో నుండుటకు వీలు లేక భూమిలో గుహలు త్రవ్వుకొని తల దాఁచుకొనవలసి వచ్చినది. నాలు గైదు మణుగుల బరువు గల బాంబుగుండు 5, 6 వందల అడుగుల యెత్తునుండి పడవేసినయెడల సాధారణమైన యిల్లు రూపుమాయును. అందుచేత మందుకొట్లు మొదలైన శత్రుస్థలములమీఁద వైమానికులు బాంబులు వేసి నష్టములను గలిగించుచున్నారు. ఈ విషయములో మిత్రమండలివారే జార్మనుల్యలకంటె అతిశయము చూపుచున్నారు.

## 2. విద్యుచ్ఛక్తి

ఈ యుద్ధమందు విద్యుచ్ఛక్తియొక్క విశేషములు వినిన కొలఁదిని ఈ శక్తియే లేనియెడల, ఈ సంగ్రామము నవీనపద్ధతి ననుసరించిన దని యెల్లరకును తోఁచుట కవకాశము లేకయే పోవును. విద్యుచ్ఛక్తివికారము లేని చోటు గాని పని గాని లేదు. ఈ శక్తి

భగవంతునివలె త్రిమూర్తిత్వము దాల్చుచున్నది. కావలె నన్న పని చేయు చోట సృష్టికర్తవలెను, గాయములు తగిలి బాధపడువారిని బ్రోచుటయందు ఆ మహావిష్ణువవలెను, శత్రు సేనలఁ గాల్చుటయందు లయకాలరుద్రునివలెను గానవచ్చుచున్నది.

దీపములు

ఐరోపాఖండమందు ప్రతి పల్లెలోను ఎలెక్ట్రిక్ దీపములు సర్వసాధారణమై యున్నవి. రాత్రులయందు ఇక్కడవలె కిరోసిను దీపము లక్కడ వాడుట యరుదు. సేనలు కూడ నట్టి యలవాటు నే పడియున్నవి. కాన, రాత్రులు శిబిరములయం దంతట దీపములు వెలిఁగించుటకు వీలగునటులు విద్యుద్యంత్రములు తోడ్పడుచున్నవి. ఒక మోటారు ట్రక్కుమీఁద ఒక ఆయిల్ ఇంజను, ఒక ఎలెక్ట్రిసిటీ సృష్టించు యంత్రము (డైనమో), వీనికి కావలసిన సామగ్రు లన్నియు నమర్పఁబడి సిద్ధముగా నుండును. కావలసిన చోట నది దీపముల నిచ్చును. ఊరూరను సినమటోగ్రాఫు యంత్రములు ప్రదర్శింపఁబడుచున్నవి. వారు పైని చెప్పిన సామానులతోనే తమ సినోమా భవనమును విద్యుద్దీపములతో నింపుచు జనులకు ఆనందము నాశ్చర్యమును కలిగించుచున్నారు.

యుద్ధరంగములయందు దీపకాంతి యెల్లప్పుడు నుండుట వల్ల శత్రువులకు గుట్టుమట్టు వెల్లడి యగును. అందుచేత పైన చెప్పఁబడినరీతిని యుద్ధము జరగుచున్న గోతులయందు దీపము లుండే వీలు లేదు. కాని, యక్కడివారికి రాత్రి యెటునటుఁ బోవుట, పనిలేనికాలమం దవసరమైనయెడల చదువుకొనుట, మొదలైన పనులకు సహకారులుగా నుండుటకై, జేబులో నిముడు నట్టి చిన్నచిన్న విద్యుద్దీపములు వేలకొలఁది వాడఁబడుచున్నవి. పూర్వమువలెఁ గాక ఈ యుద్ధములో రాత్రులయందు సాధారణముగా యుద్ధము జరగుచున్నది. శత్రుస్థానములను వెల్లడి చేయుటకు వేలకొలఁది క్రొవ్వువత్తుల కాంతి గల విద్యుద్దీపములు అన్వేషణజ్యోతులు (సెర్చి లైట్సు) నెక్కులు వాడఁబడుచున్నవి. ఇవి ఆయిల్ ఇన్‌జిన్ డైనమోలు గలిగిన ఒక మోటారు బండిమీఁద నమర్పఁబడి, కావలె నన్నచోటికి తీసికొనిపోవుటకును ఎత్తున నమర్చుటకును వీలు కలవిగా నున్నవి. వీని సాహాయ్యముచేత 5-10 మైళ్లవఱకును పట్టపగలట్టు లుండును. ఈ గొప్ప దీపముల సాహాయ్యముచేత పగటియందుఁ గూడ సంజ్ఞారూపముగ వార్త లంపఁబడుచుండును. సముద్రముమీఁది యుద్ధనావలకు ఈ దీపములే రాత్రుల యందు నేత్రములు. ఈ దీపసాహాయ్యముచేతనే ఆకసమునఁ బోవు జెప్పెలిను గాలియోడలను గాని ఏరోప్లేనులను గాని గుర్తించి, తగిన యేర్పాటులను ప్రతిక్రియలను చేయుటకు వీలగుచున్నది. ఇవి లండను పేరిసు మొదలగు నగరులయందు విమానభయముచేత రాత్రులయం దుపయోగపఱచుచున్నారు.

తీఁగెదళ్లు

ఇరుతెగలవారును శత్రువులు తమమీఁదికి చొరఁబడి రాకుండుటకై అడ్డుకొఱకు లోహపుఁదీఁగెను 6, 7 అడుగుల యెత్తువఱకు దడివలె తమ చుట్టును అల్లించి యావరణ మేర్పఱచుచున్నారు. ఈ తీఁగెలకు నడుమనడుమ విశేషముగా ముండ్లు గుత్తులు గుత్తులుగా నమర్పఁబడి యుండును. ఈ యడ్డు చాలక ఇట్టి తీఁగెదళ్లను ఒకదాని తరువాత నొకటి మూఁడింటి నల్లించి నడిమిదడియందు విద్యుచ్ఛక్తి నమితముగా ప్రవేశపెట్టుచున్నారు. శత్రువులు దీనిని తాఁకినంత మాత్రమున ఎటులున్నవా రటు విగతప్రాణు లౌదురు. ఈ కారణము చేత దేశ మంతటను పారా యనునది యవసరము తగ్గిపోయినది. ఇట్టి వనేకములు బెల్జియమం దున్నవి. జార్మణ్యుల బాధ నోర్వలేక ఉలాందు దేశమునకు పోఁదలఁచిన బెల్జియమునందలి జనులకు ఎంత మాత్రమును వీలు లేకుండుటకొఱకును, ప్రయత్నించినఁ బ్రాణము పోవుటకొఱకును, రెండు దేశములయొక్క సరిహద్దునం దిట్టి దళ్లు నిర్మింపఁబడినవి. ఏమి యీ పాపకర్మము! మనుష్యుని బుద్ధిబల మెట్టి విపరీతమార్గములను ద్రొక్కుచున్నది!

శబ్దభేది

మన పురాణములయందు మేఘనాథుఁడు మొదలైన రాక్షసులు మేఘముల చాటున నుండి శరవర్షమును గురిపించుట వినియున్నాము. అట్టి సమయములందు శబ్దభేది యను శక్తిచేత శత్రువు దృగ్గోచరము గాకున్నను గుర్తించి యోడించినట్లు మన కందఱకు తెలిసిన విషయమే. ఇప్పుడు వైమానికులు శత్రువుల నగరులమీఁద ఇటులే మేఘముల చాటున నుండి బాంబులను వేయుచున్నారు. వారిమీఁద ఫిరంగులను గురి చూచుటకును, వా రున్న స్థల మెఱిఁగి వైమానికులు పోయి యుద్ధము చేయుటకును, విద్యుచ్ఛక్తివికారమైన మైక్రోఫోనను యంత్రము కడు సాహాయ్యము చేయుచున్నది. ఇది గాక, తా మున్న యుద్ధపుగోతుల క్రిందనుండి యెదిరి గోతుల క్రిందకు త్రవ్వుకొని వెళ్లి శత్రువుల యడుగుభాగమున మందు పెట్టి కాల్చుచున్నారు. దీనివలన కొన్ని వందల గజములవఱకు నున్న శత్రువులు సర్వనాశన మగుచున్నారు. ఇట్టి యాపత్తు తప్పించుకొనుటకు మైక్రోఫోను యంత్రము తోడ్పడుచున్నది. దీనిచేత ఎంత స్వల్పమైన మెల్లని ధ్వనియైనను గుర్తింపఁబడి, తాము ప్రతిక్రియ చేయుటకు చాలవఱకు వీలగుచున్నది.

మరియొక విశేష మేమనఁగా, జార్మణ్యుల జలాంతర్గాములు విచ్చలవిడిగా బ్రిటీషు దీవుల చుట్టును తిరుగుచు నౌకాసైన్యమునకును, జనమును సామానులను తీసికొనిపోవు పాగయోడలకును, భయోత్పాతమును గలిగించుచుండుట యెల్లరకును విశదమే. నీటిలో మునిఁగి వచ్చుదానిని కనిపెట్టుటకును, ఎంత దూరముననే పైపున నున్నదో చెప్పుటకును, ఈ మైక్రోఫోను సాధనభూతమైనది. ఈ శబ్దభేది వలన నిట్టి విశేషలాభమును కొద్ది నెలల క్రిందటనే కనిపెట్టినారు. అట్టివి ముఖ్యమైన రేవులయం దుంచి, యుద్ధనావలు తగినవి సిద్ధముగా నేర్పఱచి, జలాంతర్గాములను బాఱఁదోలుట గాని ముంచుట గాని చేయుచున్నారు. నాఁటినుండియు ఉత్తరసముద్రమునందు తొందర తగ్గినది.

## వార్తాయంత్రములు

అనేకవిధములైన వార్తలు ఒక చోటినుండి మరియొక చోటికి వెంటనే తీసికొని పోవుటకు మనుష్యునికంటె గౌతుకంటె టెలిఫోను టెలిగ్రాఫు యంత్రములు ప్రతిచోట నుపయోగముగ నున్నవి. ఈ యన్నిటిలోను రహస్యవ్యాపారము జరపవలసిన వేగులవారికిని వారి ప్రభువులకును ఉత్తరప్రత్యుత్తరము లిచ్చుటలోను, విమానములనుండి క్రిందివారికిని క్రిందినుండి విమానములలోనివారికిని వార్తలు తెలుపుటలోను, తీఁగ లేని తంతితపా యంత్రము మిక్కిలి యున్నికకు వచ్చినది. అట్టి యంత్రసాహాయ్యముచేతనే గదా ఎమ్డెన్ ఓడ యంత కాలము దౌర్జన్యముఁ జేయఁగలిగినది.

## విద్యుత్కిరణములు

సూర్యకిరణములకు మన మడ్డము వచ్చిన నవి లోపల ప్రవేశింపలేవు. అందుచేతనే మనకు నీడ గల్గుచున్నది. కాని, విద్యుత్కిరణము లీ విషయములో సూర్యకిరణములను మీఱినవి. ఇవి దేహములో ప్రవేశించి చీఁకటియింటిలోని దీపమువలె లోని సంగతులను దృగ్గోచరములు చేయఁగలవు. ఈ సాహాయ్యముచేత సైనికులకు గుండు దెబ్బలు తగిలినయెడల నూహను బట్టి యాలోచింప నక్కఱ లేకుండ రూఢిగ నీ చోటున నిది యున్నదని నిశ్చయించుటకు ఆధారము గలిగినది. సునాయాసముగా శస్త్రచికిత్స చేయఁబడుచున్నది. విద్యుచ్ఛక్తివలని యుపయోగములలో నిదియును, ఈ క్రింద చెప్పఁబోవు మరిరెండును మాత్రము మరణసాధనములు గాక జీవనసాధనములై యున్నవి. ఇట్టి యంత్రములు సర్వసన్నాహములతో పెట్రోలుయంత్రపు బండ్లమీఁద నమర్పఁబడి కావలెనన్న చోటికి తీసికొనిపోఁబడుచున్నవి. ఈ విద్యుచ్ఛక్తిచేత బలమైన అయస్కాంతములు తయారు కాఁగలవు. వాని సాహాయ్యముచేత మాంసపు కండ నడుమ చిక్కుకొని యున్న ఇనుపముక్కలను సునాయాసముగా ఆకర్షణచేత బైటికి తీయుచున్నారు. దీనిని మన గ్రంథములయందు చెప్పఁబడిన విశల్యకరణినిగా భావింపవచ్చును. ఇంతియు గాక, సాధారణముగా నీటియందు సూక్ష్మజీవు లమితముగా నుండి సేనలకు తత్పానమువలన ననారోగ్యమును గలిగించును. వీనిని బాగుపఱచుట యిదివఱకు యుద్ధములయందు సాధ్యము గాకుండెను. ఇప్పటి యుద్ధమందు ఈ విద్యుచ్ఛక్తినుండి వేఱొక తరగతి (అల్ట్రా వయొలెట్) కిరణములను పుట్టించి వానిని నీటఁ బ్రవేశపెట్టి తన్మూలమున క్రిమినాశనము చేసి ఆరోగ్యమును కలిగించుచున్నారు.

## 3. పొగ లేని మందు, గొప్ప అగాదుగుండు

తుపాకిమందు రమారమి 700 సంవత్సరముల క్రిందట ఇంగ్లాండులో రోజరు బేకను కనిపెట్టినాఁడని వ్రాయుచున్నారు. శుక్రనీతిసారములో అగ్నిచూర్ణ మను పేర దీనిని గుఱించియే విపులముగా వ్రాయఁబడి యున్నది. నాలుగు గాని ఆఱు గాని పాళ్లు సురేకారమును, ఒక పాలు గంధకమును, ఒక పాలు జిల్లేడు బొగ్గును కలిపిన, ఈ చూర్ణము తయారగు నని యున్నది. దీనిని బట్టి చూడ, చాల కాలమునుండి ఈ తుపాకిమందు వాడుకలో నున్నట్టు స్పష్టము. ఈ మందు ఫిరంగులలో వేసి కాల్చినయెడల నమితముగా పొగ బైలుదేఱును. ఈ పొగవలన ఫిరంగినాళా చిట్లము గట్టి నలుదిక్కు పాడగును. ఈ కారణముచేత పొగ లేనిదియు కొంచెము నిలుకడగా [illegible] చేయుటకు ప్రయత్నములు జరుగుచు వచ్చినవి. తుదకు ప్రయత్నములు సుమారు 25 సంవత్సరములనుండి క్రమముగ సిద్ధించినవి. గన్‌కాటను అను వస్తువునుండి కార్డైటను పొగ లేని మందు ఇంగ్లీషువారు తయారుచేసిరి. కార్బాలికు ద్రావకమునుండి ఆంగ్లేయులు లిడ్డైటు అనుదానిని, ఫరాసులు మెలినైటు అనుదానిని తయారుచేసిరి. ఈ నడుమ నాలుగైదు సంవత్సరముల దరిమిలాను శిటాకాలు అను పదార్థమునుండి టి. యన్. టి. చూర్ణములు జర్మణ్యులచేత తయారు చేయఁబడినవి. ఇవియే యన్నిటికంటె షెల్సు టార్పిడోలు నింపుటకు నాణ్యము లని స్థాపింపఁబడినది. పైన చెప్పఁబడిన కార్డైటు, లిడ్డైటు, మెలినైటు, టి. యన్. టి. చూర్ణములు ప్రస్తుతము యుద్ధమునం దుపయోగములో నున్నవి. 500 పౌనుల బరువు గల ఈ మందు పేలిన చోట నమితమైన గొయ్యి పడును. రాతినేల గాని, ఇటుకసున్నములతోఁ గట్టిన కట్టడములు గాని, మెత్తని భూమి గాని, యేదియైనను, ఈ యగాదునకు ముక్కముక్కలై చెదరిపోవును. ఈ చూర్ణములతో నింపిన గుండ్లను వదలు ఫిరంగులయొద్దఁ గాని యీ గుండు పడి పేలు స్థలముల సమీపమునఁ గాని యున్న మనుష్యులకు అతిదారుణమైన యీ శబ్దము వినుటచేత కొన్ని సమయములయందు చెవులు వినఁబడకపోవుట మతిపోవుట తటస్థించుచుండును. ఇట్టి యగాదు గుండ్లవల్లనే కదా నవీననిర్మితములైన గొప్ప కోటలయందలి ఉక్కుతో నిర్మింపఁబడిన బురుజులు ఏటున కొకటియై తునియలైనవి. ఫిరంగు లీ గుండ్లను 10-15 మైళ్లు దూరమువఱకును త్రోయఁగలవు. తుపాకిమందును ఫిరంగినాళాయందు దట్టించి దానిని కాల్చ యీ కారణముచేత గుండును కొన్ని మైళ్లవఱకును త్రోయఁగలుగుచున్నారు. ఈ తుపాకిమందు కాలునపుడు పొగ యనునది యుండదు గాన, పట్టపగటియందు సయితము ఫిరంగి యున్న స్థలము పొగచేత నిర్ధారణ చేయుటకు వీలు లేకపోవుచున్నది. ఇది యొక గొప్ప విశేషము. ఈ నవీనపు తుపాకిమందు పూర్వపు మందుకంటె ఎన్నోరెట్లు పేలుడు శక్తి గలది. ఈ కారణముచేతనే పూర్వపు యుద్ధములయందు వలెఁ గాక గుండ్లు కడు దూరము త్రోయఁబడుచున్నవి. పూర్వము ఇనుపగుండ్లను ఫిరంగులతో వేసెడివారు. ఇప్పటి గుండ్ల అడ్డము కంటె పొడు గెక్కువగా నుండును. గజము పొడుగును అడుగు మందమును గల గుండ్లు పెద్ద ఫిరంగులనుండి వదలుచున్నారు. ఇవి పడవలసినచోట పడఁబోవునపుడు పేలి సర్వనాశనముఁ జేయుచున్నవి. ఈ విషయములో యుద్ధ మమితమైన మార్పును జెందినది.

## 4. విషజల విషవాయు ప్రయోగములు

సుమారు 2800 సంవత్సరముల క్రిందట గ్రీసు దేశమున జరిగినట్టి యొక యుద్ధమందు శత్రువులు కోటను ముట్టడించినప్పుడు తారును గంధకమును కోటగోడల ప్రక్కను కాల్చి దానివలన కలిగెడు పొగ గాలులవలన లగ్గలఁబట్టు శత్రువులను పాఱఁదోలినట్లు చరిత్రకారులు వ్రాసియున్నారు. 2200 సంవత్సరముల క్రిందట చాణక్యుఁడను కౌటిల్యుఁడు నందరాజుల నిర్మూలము చేసి చంద్రగుప్తుని రాజ్యాభిషిక్తుఁ జేసెను. ఆ చాణక్యుఁడు అర్థశాస్త్ర మను గ్రంథమును రచించెను. అందు శత్రువుల సాధించు విషయము లనేకములు పేర్కొనఁబడినవి. శత్రువులు నీరు ద్రావు చెఱువుల విషము గలుపుట, శత్రువుల శిబిరములయొద్ద కొన్ని వస్తువులను సంపుటి చేసి కాల్చి దాన వెలువడు విషవాయువులచేత వారిని చంపుట, విషజలము వారిమీఁదఁ జల్లుట, ముఖ్యమైన శత్రునాయకులను విషప్రయోగము మొదలైన యనేకచిత్రగతులఁ జంపుట, శత్రుకూటములయందు ప్రవేశించి వారి దయకు పాత్రులై యుండి వారియెడ స్వామిద్రోహము చేయుట, మొదలైన యనేకసంగతులు విపులముగా వ్రాయఁబడియున్నవి. అట్టివి ఆ కాలమందు బాగుగ తెలిసిన విషయము లనుట స్పష్ట మగుచున్నది. ఇంత కాలము నుండియు ఇవి యుద్ధమునందు వాడుట ధర్మము గా దని మాని యున్నారు. కాని, నేఁటికి ధర్మాధర్మవిచారణ యనునది కొంచెమైనను లేక జర్మణ్యులు తమ శక్తిసామర్థ్యములను తెలివితేటలను పూర్తిగఁ గనఁబఱచి నవీనమును ఘోరమును నైన విషజల విషవాయు ప్రయోగముల నారంభించినారు. 30, 40 గజముల పొడుగు గల మంటలను మహిషాసురమర్ధనియొక్క కోపానలశిఖలవలె శత్రువులమీఁదికిఁ బ్రయోగించుచున్నారు. ఇది పెట్రోలు ద్రవ్య తారుల కూడికచేతఁ గలిగిన మంట. ఇది యుఱఁచిపెట్టిన గాలిశక్తిచేత దూరమునకు పంపఁబడుచున్నది. ఇట్టివి బాంబుల లోను షెల్సులోను పూరించి శత్రువులమీఁదికి వేయుచున్నారు. చేతితో గ్రనేడులను విసరుచున్నారు. ఈ పను లన్నిటికిని తోడ్పడు యంత్రసాధనములు యుద్ధరంగములయందుఁ గావలె నన్నచోట తటస్థించునటు లేర్పాటులు చేయఁబడియున్నవి. ఈ విషవాయువులు ప్రయోగించినప్పుడు వానివలని చేటు లేకుండుటకై మిత్రమండలి వారు ముసుఁకకవచముల నుపయోగించుచున్నారు ఇందు విషవాయువును హరించు వస్తుసంపుటి గలదు. ఈ కారణముచేత ఈ గాలుల వలని భయము మిత్రమండలివారికి తగ్గినది. ఇట్టి విష ప్రయోగముల వలన బాధపడు జను లనేకు లున్నారు. వారు క్రమక్రమముగా క్షీణించి లోలోపల వెత్తిబాధను ఇదమిత్థ మని చెప్పలేక కృశించుచున్నారు. ఇది యన్ని ప్రయోగములకంటెను క్రూర మైన దని చెప్ప నక్కఱలేదు. ఎట్టి పాపకృత్యముల కైనను ఉత్సహించుచున్నారు గదా! ఇ దేమి పాపమో తెలియదు. భౌతికశాస్త్రచర్చలు మనుష్యుని యొక్క సౌఖ్యమును పెంచుటకే యుపయోగపడుటకు మాఱుగ సర్వనాశనము చేయుటకు కారణము లగుచున్నవి. ఎంత విపరీత కాలము వచ్చినది! దీనిని త్వరలో శాంతి పొందించి ప్రపంచక్షోభము మాన్పుటకు భగవంతుని మన మందఱము ప్రార్థింపవలసిన విధియై యున్నది. పాపము శమించుఁగాక!

## కడుపుమంట

చింతా శంకరదీక్షితులు గారు

చిన్నిగ్రుడ్లను జాగ్రత్త చేసినావు
అనుదినము వాని రక్షణ మరసినావు
పొందు నభివృద్ధి నీక్షించి పొంగినావు
తల్లికిని బిడ్డపై నింత దనరు ప్రేమ
యంచు లోకాన కెఱిఁగించి యలరినావు
ఇట్టి నీ వక్కటా! పిల్ల లింపు మీఱ
మెల్లమెల్లగ కొమ్మపై మెలఁగుచుండ
మెడల నిక్కించి లోకము మెచ్చుచుండ
అందమై నెఱుల్ నవనవలాడుచుండ
చూచి సహియింపలేకుంటి; చూడలేక
'కూ' యటంచును మంజులకూజితంబు
చేసినంతనె ముక్కుతో ద్రోసివైతు.
ఎందులకు నీకు ఈ యీర్ష్య! ఏల ద్వేష!
మా నిసువు లేమి చేసెనో యానతిమ్ము.
కోయిల యటన్న నీ కింత కోప మేల?
కాకమా! నీకు తగ దింత కడుపుమంట.
ప్రేమ బంధాల బిగియించు పెద్దత్రాడు
పుడమినే స్వర్గముగ మార్చు మూలమంత్ర
మార్తిఁ గుందెడువారల కౌషధంబు
ప్రకృతి నెచ్చెలి, సౌఖ్యసంవర్ధకంబు
మధుర నిస్వన సంపూర్తి మానితంబు
స్వస్థితికి విస్మృతిని దెచ్చు సాధనంబు
ధరణి నిర్మలసంతోషదాయకంబు
నిరుపమానంబు, క్షణమాత్రనిశ్చయంబు
'కో' యనెడి చిన్ని కోకిల కూజితంబు.
ముక్కెటుల వచ్చె నద్దాని పొడువ నీకు?
కాకమా! ఏల నీ కింత కడుపుమంట?
చివురుజొంపంపు టుయ్యెలఁ జేరియుండి
వీచు మారుత మిటునటు నూఁచుచుండ
కీరశారికల్ గొలువ హజారమందు
లేఁత చిగురాకు మెక్కుచు లీలఁ బాడి
కొలువు దీర్చు ప్రకృతి తొలి ముద్దుబిడ్డఁ
గోకిలను జూచినంతనె కోప మేల?
కాకమా! నీకు తగ దింత కడుపుమంట.

# యుద్ధము — విద్యుచ్ఛక్తి

అప్పాస్వేదుల లక్ష్మీనారాయణ గారు, ఎమ్. ఏ.

ప్రస్తుతము లోకమందు ఘోర మహాసంగ్రామము జరగుచున్న దనియు, దానిచే ప్రతిదినమును వేనవేలు జీవరాసులు నాశనము నొందుచున్న దనియు మన కెల్లరకును దెలిసిన యంశమే. ఇంతవఱకును ప్రపంచమందు జరగిన యుద్ధములకును ఈ ప్రస్తుతయుద్ధమునకును అనేక విషయములందు భేదము లున్నవి. ఇప్పటి యుద్ధమందు రెప్పపాటు కాలములో నెందఱో ప్రాణములు వదలిరని వినుచున్నాము. పూర్వకాలమందలి యుద్ధములలో నుభయపక్షములవారి సైన్యబలమును ద్రవ్యబలమును బట్టియు, సేనాధిపతియొక్క బుద్ధికుశలతను బట్టియు జయాపజయములు కల్గుచుండెడివి. పూర్వపు యుద్ధము లిరుప్రక్కలవారి సైన్యములకు జరగు యుద్ధము లని చెప్పవచ్చును. ఈ శతాబ్దమందు శాస్త్రపరిజ్ఞానము మిక్కుటముగా నుండుటచే, యంత్రబలము హెచ్చుగా నున్నది. ఒకానొక సైన్య మెంత యధికముగా నున్నను, శత్రుపక్షమున పరిపూర్ణశాస్త్రజ్ఞానము గల యంత్రకారు లున్నచో, ఆ బల మంతయు క్షణములో భస్మ మయిపోవును కావున, ఈ యుద్ధము పూర్వపు యుద్ధములవలె నుభయసైన్యములకును జరగు సంగ్రామ మని యెంచుటకంటె, నుభయపక్షములందు యంత్రకారులకును శాస్త్రపరిజ్ఞాతలకును జరగు పోరాట మని యెంచుట మేలు. పాశ్చాత్యదేశములందలి పండితులు, ముఖ్యముగా జర్మనీ దేశపు పండితులు, పదార్థవిజ్ఞానశాస్త్రమందును రసాయనశాస్త్రమందును మఱి యితరప్రకృతిశాస్త్రములందును పారంగతను పొంది రని చెప్పవచ్చును. కాఁబట్టి మిత్రమందలి శాస్త్రజ్ఞులయొక్కయు జర్మనీదేశపు శాస్త్రజ్ఞులయొక్కయు పాండిత్యములు డీకొనుచున్న వని చెప్పినను చెప్పవచ్చును. ఇరువదియవ శతాబ్దమందు పాశ్చాత్యదేశములలో నాగరికత మిక్కిలి హెచ్చుగా నున్నను, లోకమందలి ప్రజల సౌఖ్యమునకు తోడ్పడవలసిన శాస్త్ర పరిజ్ఞానము, లోకసంక్షోభమునకును జననాశనమునకొఱకును ఉపయోగింపఁబడుచున్న దని ఈ శాస్త్రములే తప్పక లజ్జ నొందు నని యూహింపఁగలము. అది యెట్లున్నను, ఈ సంగ్రామమందు సంపూర్ణశాస్త్రపరిజ్ఞానముచే నూతనముగ కల్పింపఁబడిన యంత్రములను వాని విచిత్రచర్యలను చూచి యచ్చెరువొంది, 'భళిరే! పదార్థవిజ్ఞానశాస్త్రము దార్ఢ్య మేమి! లోకసౌఖ్యమును గాని లోకసంక్షోభమును గాని సమకూర్చుటయందు విద్యుచ్ఛక్తివంటి మహాశక్తి వేఱొకటి లోకమందు లేదు గదా!' యని మన మందఱము చెప్పుకొనుట లేదా?

విద్యుచ్ఛక్తివలన లోకమునకు ముఖ్యోపయోగ మేది యనిన, దీపములు వెల్గించుట యని మన కెల్లరకుఁ దెలిసిన యంశమే. ప్రస్తుతమీ మహాసంగ్రామమం దున్న సేనలు కూడ విద్యుచ్ఛక్తినే దీపములకొఱకు నుపయోగించుచున్నారు. జర్మను లేదైన పట్టణము నొకదానిని జయించి యా పట్టణములో ప్రవేశించిన మరుచటి క్షణమే వారాలోచించు నంశ మేది యన, ఆ పురమందలి విద్యుచ్ఛక్తియంత్రములను మరమ్మతు చేయించి, తిరిగి యా నగరమందు విద్యుద్దీపములను వెలిఁగించుటకు తగిన యత్నము సల్పుటయే. జర్మనీవారు గతసంవత్సరమున బెల్జియముపై దండెత్తినపుడు శత్రువులు తమ విద్యుచ్ఛక్తియంత్రములను సరియైన స్థితిలో నుంచ రని యెంచి తమ యంత్రములను దీపములను వానికి కావలసిన సామగ్రిని పంపుచుండెడివారు. ఈ సంగ్రామ మారంభ మయినపుడు, ఇదివఱలో జరగిన యుద్ధముల రీతిని ఇప్పుడు కూడ, యుద్ధము సంధ్యాకాలముతో ముగియు దని తలంచిరి. కాని, రాత్రియుద్ధ మింత ఘోరముగా జరగు నని యెవ్వరు నూహింపరైరి. రాత్రి యుద్ధమునకు మిక్కిలి కాంతి గల దీపము లావశ్యకమని భూతలమునకు తీసికొని రాఁబడిన సూర్యుఁడా యనునట్లు ప్రజ్వరిల్లు దీపములను గనిపెట్టిరి. ఈ దీపములనే "సెర్చి లైట్లు" అని వాడుచున్నారు. ఇది మిక్కిలి బలమైన విద్యుత్ప్రవాహమువలన వెలిఁగింపఁబడిన దీపమే కాని వేఱు కాదు. మన మందఱము నిత్యమును మోటారు బండ్లకు పెట్టు దీపములను చూచుచుంటిమి గదా. ఈ సంగ్రామమందు ఉపయోగించుచున్న "సెర్చి లైట్లు"ను వానివలెనే యుండును గాని, వానికంటె మిక్కిలి పెద్దవిగా నుండును. ఈ భేదమును జ్ఞాపక ముంచుకొని రెండింటిని సమదృష్టితో చూడవచ్చును. పైనఁ జెప్పిన రీతిని మిక్కిలి బలమయిన విద్యుత్ప్రవాహమును "ఆర్కు లాంపు" అను దీపముగుండ ప్రవహింపఁజేసినపుడు మిక్కిలి కాంతి గల యొక చిన్న దీప ముండును. ఈ దీప మొక పుటాకార దర్పణముయొక్క ప్రధాన కేంద్రమం దుంచఁబడును. ఈ దీపకిరణములు దర్పణముమీఁదఁ బడునప్పుడు వాని నన్నివైపులకు చెదరనీయక, ఒక్కవైపునకే పరావర్తింపఁజేయును. ఇదియును గాక, యీ పరావృత్తకిరణము లన్నియు సెర్చి లైటు పటములోఁ జూపినరీతిని సమతరములుగాఁ బోవును.

ఈ "సెర్చి లైట్ల"లో నుపయోగించు దర్పణముల వలయాంతర్మధ్యరేఖ సాధారణముగా నొక గజ ముండును. అనఁగా నొక సాధారణగవాక్షమంత స్థలము నాక్రమించును. ఈ దర్పణము మంచి లోహముతోఁ జేయఁబడును. ఈనడుమ బంగారముతో మలామా చేసిన యద్దములను గూడ నుపయోగించుచున్నట్లు వినుచున్నాము. దానివలన ప్రతిఫలింపఁజేయఁబడిన కిరణములు సుమా రయిదు మైళ్ల దూరమువఱకు వెలుతురు నిచ్చును. కడచిన సంవత్సరము సెప్టెం

బరు 9-వ తేదిని చెన్నపురి దగ్గఱ "ఎమ్డెన్" అను చిన్న యుద్ధనావ చేసిన యల్లరి మన మింకను మఱవలేదు ఆ నౌకానాయకుఁడు పట్టణమునకు నాలుగు మైళ్ల దూరమున నిలిచి ఇట్టి సెర్చి లైటును రాత్రి తొమ్మిది గంటల వేళ పురముపైఁ జూపె ననియు, పురజను లందఱును సూర్యుఁ డుదయించెనా యని గడబిడపడి రనియు, ఆ నౌకానాయకుఁడు పట్టణమందలి ప్రాసాదములు నంతదూరము నుండి స్పష్టముగాఁ జూడఁగల్గె ననియు, ఎన్నియో ఫిరంగులను పేల్చె ననియు, ఆ గుండ్లకొలఁది నెనిమిది మైళ్లవఱకు దెబ్బలు తగిలె ననియు సర్వజనవిదితమే. ఆహా! ఈ సెర్చి లైటు మాహాత్మ్యమేమి!



దీనికి విద్యుచ్ఛక్తియే కదా మూలకారణము. ప్రస్తుత మీ సంగ్రామమునందు ప్రతిసేనకు కొన్ని యిటువంటి సెర్చి లైట్లు ఉండును. తఱుచు ఈ సెర్చి లైట్లును వానికి కావలసిన విద్యుచ్ఛక్తిసంబంధమైన సామగ్రియు ఒక మోటారు బండిలో నుంచఁబడును. ఈ సెర్చి లైట్లు ఎటుప్రక్కకు కావలసిన నటుప్రక్కకే మఱలఁద్రిప్పవచ్చును ఈ దీపములు రాత్రి యుద్ధము చేయుటకే గాక వార్తలను పంపుటకు పగటి వేళ కూడ నుపయోగించుచున్నారు తంత్రీవార్తలను పంపుటయందువలెనే కొన్ని గుర్తుల నుంచుకొని వాని ప్రకారము వార్తలను పంపుచున్నారు ఇదియును గాక, విద్యుత్ప్రవాహమువలన వెలిఁగింపఁబడుచున్న దీపములను కందకములలో యుద్ధభటులు వార్తాపత్రికలను చదువుకొనుట కుపయోగించుచున్నారు

## విద్యుత్ప్రవాహ ఘోరకృత్యములు

మబ్బులు పేని వర్షము కురియునపుడు, పిడుగులు పడి కొంత మంది జనులు ప్రతిసంవత్సరము నశించుటను మనము చూచుచుంటిమి గదా! ఈ పిడుగు విద్యుచ్ఛక్తిమహిమయే గాని మరియేమియుఁ గాదు మిక్కిలి బలమైన విద్యుచ్ఛక్తులను విద్యుద్యంత్రము నుండి తీసినపుడు, అవి చిన్న మెఱుపులవలె నుండు ననియు, చాల ప్రాణోపద్రవకరమైన వనియు కొందఱకు తెలిసియే యుండును అలాగుననే బలమైన విద్యుత్తు ప్రవహించుచున్న తీఁగెలను ముట్టినచో, మన శరీరము కంపించి గగుర్పాటు కలుగును. ఈ విద్యుత్ప్రవాహమే చాల బల మయినయెడల, ఆ తీఁగలను ముట్టిన తక్షణమే మానవుఁడు మృతినొందును.



కడచిన సంవత్సరము జర్మనీవారు బెల్జియముపై దండెత్తినపుడు రాజకీయోద్యోగులలో ముఖ్యులను ఖయిదీలనుగా తీసికొని, వారు తిరిగి సరిహద్దులలో నున్న హాలెండు దేశములోనికి పారిపోకుండుటకై బెల్జియమునకును హాలెండునకును నడుమ పై పటములో చూపించిన రీతిని తీఁగకంచెలను వేసి, ఆ తీఁగెలగుండ చాల బలమైన విద్యుచ్ఛక్తిని ప్రవహింపఁజేయుచుండిరి. ఎవరైనను పారిపోవుటకు ఉద్యమించినప్పుడు, దానిని తాఁకిన తక్షణ మచ్చటనే ఆ మానవుఁడు ప్రాణములను విడుచును. కావున, ఈ సరిహద్దులను కాపాడుటకు నేఁటి యుద్ధభటు లవసరము లేదు.

జర్మనీవా రుపయోగించుచున్న ప్రాణోపద్రవమైన విషవాయువులుగూడ విద్యుచ్ఛక్తిమహిమయే యని చెప్పవచ్చును ఏల యనఁగా, విద్యుచ్ఛక్తికి రసాయనవియోగము చేయు సామర్థ్యము కల దనియు, ఈ సామర్థ్యమువల్లనే బంగారు వెండి మొదలైన యుత్తమలోహములను రాగి మొదలగు కొన్ని నీచలోహముల మీఁద పూఁతపూసి ఆ నీచవస్తువులను ఉత్తమలోహములవలె ప్రకాశింపఁజేయుచున్నా రనియు, అలాగు తయారుచేయు వస్తువులను

మన దేశములో స్త్రీపురుషు లెందఱో యుపయోగించుచున్నా రనియు తెలిసిన సంగతియే.

ఆకాశవిమానములను కట్టినపుడు ఆ విమానములు గాలిలో తేలి పక్షులవలె నెగురులాగున వానియందు మిక్కిలి తేలికయైన "జలవాయువు" అను నొక గాలితో నింపఁబడిన కొన్ని పెద్ద తిత్తుల నుంచెదరు. కొన్ని రసాయనములయొక్క ద్రవణము నీ విద్యుచ్ఛక్తివలన పృథక్కరించుటచే నీ జలవాయువు తయారుచేయఁ బడును. ఈ రసాయనవియోగమునందే, యిప్పుడీ జర్మను లుపయోగించుచున్న ప్రాణోపద్రవమైన వాయువు "క్లోరీను" అనునది కూడ తయారగును. కావున నిది కూడ విద్యుచ్ఛక్తిమహిమయే యని చెప్ప వచ్చును.

## అదృశ్యవిమానములు, శబ్దగ్రాహియంత్రము

దృశ్యము కానివానిని కనిపెట్టుటయందు దీని మహిమ యత్యద్భుతముగా నుండును. కడచిన సంవత్సరము ఈ సంగ్రామ మారంభమయినపుడు, జర్మనీవారు తమ సూక్ష్మబుద్ధితో ఈ దురాకృతముకొఱకు కొన్ని సంవత్సరములనుండి చాల ప్రయాసపడి ప్రవీణత నొంది తయారుచేసిన విమానములమీఁద పక్షులరీతి నాకసమునందు తిరిగి అనవరతము పోరు సలుపుచు, శత్రుదుర్గములమీఁదను సేనలమీఁదను యుద్ధనౌకలమీఁదను, వీనితో సంతుష్టి నొందక, నిరపరాధులయిన స్త్రీలమీఁదను పిల్లలమీఁదను బాంబులను వదలి యెంత నష్టము కలిగించిరని మనకు విశదమైయున్నది. ఆంగ్లేయులు శత్రువిమానమును గగనమార్గమునందుఁ జూచినప్పుడా విమానము మీఁదికి ఫిరంగులను గాల్చి గాని, తమ విమానములను పైకెక్కించి దానితోయుద్ధముచేసిగాని, దానిని నాశనము చేయుటకు లేనియెడల తఱిమివేయుటకు ప్రయత్నము చేయుచుండిరి. అప్పుడు జర్మనీవారు పట్టపగలీ విమానముమీఁద పోవుట తమకు క్షేమము కాదనియు తమ సంకల్పము నెఱవేఱకున్నదనియు గ్రహించి క్రొత్త వ్యూహములను పన్న నారంభించిరి. రాత్రిసమయమందుఁ గాని, దట్టముగా మంచు కురియునప్పుడు గాని, లేదా మబ్బులు వేసినప్పుడు వాని వెనుక దాఁగి కాని, శత్రువునకు సులభముగా అపకారము చేయ వచ్చునని తలఁచి, నిండు వెలుతురులో పయనములు మానుకొనిరి. వీరి దెంత సూక్ష్మబుద్ధియైనను, ఒకరికి అపకారము చేయఁదలచిన యాలోచనయే గాన, అది యెప్పుడును జయము నొందనేరదు. ఈ విమానము లిప్పుడు నేత్రములకు గోచరము కాకపోయినను, శ్రోత్రేంద్రియములకు గోచర మగును. మనము మంచి పైరుగాలిలో గాలిపడగ నెగురవైచినప్పుడది యొక విధమైన ధ్వనిని జేయును. ఈ విమానములు తఱుచు గంటకు 80 మైళ్ల వేగముతోఁ బోవుచుండును. నీటిమీఁద పోవు నోడలను వానిలో నుండెడి యింజనులు ఏలాగున తీసికొనిపోవునో, ఆలాగుననే యీ విమానములను కూడ తీసికొనిపోవుటకు వానిలో ఇంజన్లు ఉండును. ఈ యింజనులవల్లను ఈ విమానములు గాలిలో నతివేగముగా పోవుటచేతను ఒక విధమైన ధ్వని వినఁబడుచుండును. ఈ ధ్వని యెంత సూక్ష్మముగా నుండినను కొన్ని యంత్రముల సాహాయ్యముచేత కనిపెట్టవచ్చునని యు వీనిని బాగుగా కనుపెట్టినప్పుడు ఈ విమాన మెంత దూరమున నున్నదియు, ఏ దిక్కున నున్నదియు కనుపెట్టవచ్చుననియు ఫ్రెంచివారును ఇంగ్లీషువారును కనిపెట్టిరి. ఫ్రెంచివారీ విమానములను కనిపెట్టుట కుపయోగించు యంత్రము బహువినోదకరముగా నుండును. వారు నాలుగు గ్రామాఫోను గొట్టములవంటి గొట్టములను నాల్గు స్థలములయందుంచి వాని మూతుల నన్నిటి నొకే పైపునకు కనఁబఱుతురు. ఒకచోట చేయఁబడిన శబ్ద మింకొకచోట వినఁబడుటకు కారణము శబ్దమువలన పుట్టు కంపము. మన యిండ్లలో నెప్పు



డైన గట్టిగా నఱచిన, దగ్గఱ నున్న బిందెలు పళ్లెములు మొదలైనవి కంపము నొంది ధ్వని చేయ నారంభించును. ఆలాగుననే యేదైన శబ్దము చేయఁబడినప్పుడా శబ్దమువలన చుట్టు నున్న గాలి కంపించి దానియందు నీటిమీఁదవలె తరంగములు పుట్టి యన్ని దిశలకును బోవును. వీనిలో కొన్ని తరంగములు మన శ్రోత్రేంద్రియములమీఁద పడిన, తిరిగి యా శబ్దమును మనము వినఁగలము. మనము చెవితో వినినకంటె, గ్రామాఫోను గొట్టమువంటి గొట్టమును చెవిలో పెట్టుకొనునెడల శబ్దము స్ఫుటముగా వినఁబడును. వీని మూతులు చాల పెద్దవిగా నుండుటచేత శబ్దము లెంత సూక్ష్మముగా నున్నను,

ఈ నాలుగు గొట్టములును సూక్ష్మధ్వనులను పోగుచేసి వినఁబడు లాగు చేయును. వీని కొక విధమైన "మైక్రోఫోన్లు" అను టెల్లిఫోన్లు మొదలైనవి యమర్చి విద్యుచ్ఛక్తి సాహాయ్యమున ఈ ధ్వనులను బాగుగా వినఁబడులాగు చేసిరి.

పూర్వపుటయందలి పటములో నొక యంత్రమం దొకపరాగుఁడు ధ్వనిని బట్టి విమాన మే దిక్కున నున్నదో కనిపెట్టుటను చూతుము. దీని నే దిక్కునకు కావలసిన నా దిక్కునకు త్రిప్పుటకు వీలు కలదు. విమాన మే దిక్కున నున్నదో కనిపెట్టుటకు దీనివలన వచ్చు ధ్వనిని వినుచు, దీనిని క్రమముగా త్రిప్పుచుందురు.

బ్రిటీషువారు నేత్రములకు గోచరము కాని యా విమానములను కనిపెట్టుటకు ఫ్రెంచివా రుపయోగించినదే యుపయోగింతురు. కాని, ఫ్రెంచివారి యంత్రములకంటె వారివి మంచివని చెప్పవచ్చును. ఏల యనఁగా, వీ రుపయోగించు యంత్రములవలన విమానము సరిగా ఎక్కడ నున్నదో కనుపెట్టవచ్చును. ఫ్రెంచివా రుపయోగించు యంత్రమువల్లన దాదాపుగా వాని దిక్కునుస్థలమును మాత్రమే తెలిసికొనవచ్చును. ఇది యటుండ, విమాన మున్న స్థలము దాదాపుగా కనిపెట్టిన పిమ్మట విమానముల మీఁదికి కాల్చు ఫిరంగులనుండి వెలువడు గుండ్లకు "ష్రాప్నెల్" అని పేరు. ఈ ష్రాప్నెల్ గుండునందు రమారమి 300 చిన్న రవ్వ లుండును. ఫిరంగిని కాల్చిన తరువాత ష్రాప్నెల్ గుండు కొంత దూరము పోయి గుఱికి కొంచెము దూర ముండఁగానే భగ్గున బ్రద్దలయి రవ్వగుండ్లు నానాముఖములకు వెదఁజల్లి చుట్టుప్రక్కల కొంత దూరమున నున్న మనుష్యులను చంపుటయందు మిగుల ప్రయోజనకారి.

ఇదియును గాక, ఈ యుద్ధమునందు జర్మనులును మిత్రమండలివారును కందకములను త్రవ్వి స్థిరవాసములు నిర్మించుకొని సమయము వచ్చినప్పుడు శత్రువులపైఁ బడుచున్నారు. ఇందుచేతనే పశ్చిమరంగమందు యుద్ధము చుఱుకుగా లేకపోయినది. ఈ కందక యుద్ధములను బట్టియే, ఒకరి కందకములనుండి యింకొకరి కందకములలోనికి సొరంగములను త్రవ్వి, శత్రుకందకముల క్రింది సొరంగములలో మందు కూరి, సమయము వచ్చినప్పుడీ విద్యుత్సాహాయ్యము చేతనే దానిని కాల్చి యా కందకములలో నుండు శత్రువులను సంహరించుచున్నారు. ఈ సొరంగములు త్రవ్వునపుడు చేయఁబడు ధ్వనులను కూడ మైక్రోఫోనులు అని పైని చెప్పిన యొక విధమైన



టెల్లిఫోనుల సాహాయ్యముచేత బాగుగా కనుపెట్టి సొరంగ మెంత దూరమున నున్నదియు సరిగా కనుఁగొనవచ్చును. ఇట్లు కనుఁగొనిన వారు, తిరిగి ఆ సొరంగము చేయుచున్న వారికి తగిన శిక్ష చేయుటకై తాముకు మరియొక సొరంగమును త్రవ్వి, తమ శత్రువులు దగ్గఱగా వచ్చినప్పుడు మందును కూరి పేల్చి వారిని జంప నుద్యమింతురు.

## జలాంతర్గాములను కనిపెట్టుట

ఈ యుద్ధమున జర్మనులు చేయుచున్న ఘోర కార్యము సర్వజనవిదితమే. జలాంతర్గాములు సముద్రమందు నడచునప్పుడు కిరసనునూనె యింజనుల సాహాయ్యముచే నడపఁబడుచున్నవి. నీటిలో మునిఁగియున్నప్పు డీ సాధారణమైన యింజనులు పనిచేయవు. అందుండు విద్యుచ్ఛక్తి యంత్రములే పనిచేయును. కావున, జలాంతర్గాములకు విద్యుచ్ఛక్తియే మూలాధారమై యున్నది! అవి నీటిలో మునిఁగి యున్నప్పుడు టార్పిడో గొట్టముల నుండి టార్పిడోలు శత్రువులపైకి విద్యుచ్ఛక్తి వలననే ప్రయోగింపఁబడును. సముద్రరంగమందు బ్రిటిష్ వారి నౌకాబల మెంత గొప్పదియు బలమైనదియు పూర్వమునుండి ప్రఖ్యాతి గలదియు నైనను, ఇవి నీటిలో మునిఁగి చేయు ఘోరకృత్యముల చేత మిత్రమండలివారి నౌకాబల మంతయు నిరర్థకమా యనున ట్లుండెను. ధర్మము మిత్రమండలి వారిప్రక్క నున్నది గావున, వారి యదృష్టవశమున జలాంతర్గామి 50 మైళ్ల దూరములో నున్నను కనిపెట్టుటకు మార్గము కనఁబడెను. అప్పటినుండియు జర్మనీదేశపు జలాంతర్గాములను రూపుమాపుటకు, అమెరికా దేశపు విద్యుచ్ఛాస్త్రజ్ఞుఁడును ఫ్రెంచిశాస్త్రజ్ఞుఁడును కనిపెట్టిన "మైక్రోఫోన్" అను నొకవిధమైన యంత్ర ముపయోగించుచున్న దని చెప్పవచ్చును. కంటికి గోచరము గాకపోయినను, వానిలో నుండెడి యింజనులు మొదలైనవి పనిచేయునప్పు డొక చిత్రమైన కీచుధ్వని కలుగును. సముద్రము అడుగునుండి వచ్చువానివలెఁ గాక యిది చాల కీచుగా నుండును. ఈ కీచుధ్వనిని మైక్రోఫోనులవలన బాగుగా కనిపెట్టవచ్చును. జలాంతర్గామి ఎంత దూరములో నున్నదియు ఏ దిక్కున నున్నదియు సరిగా కనిపెట్టవచ్చును.

ఇందు ముద్రించిన పటములో కనఁబఱచిన ప్రకారము

జలాంతర్గామిని కనిపెట్టుటకు కొన్ని మైక్రోఫోన్లను నీటి యడుగునకు దింపి యొక్కొక్కదాని నొక్కొక్కదిశకు త్రిప్పి పెట్టుదురు. పైన నివి యన్నియు నొక టెల్లిఫోనువంటి యంత్రములో కలిపి వీనినుండి వచ్చు ధ్వనులను వినినట్లయిన, ఏ దిశకు చూపు మైక్రోఫోనులో ధ్వని విస్తారముగా నున్నదో కనిపెట్టియు, ఎటువైపునకు ఆ ధ్వని హెచ్చుచున్నదో కనిపెట్టియు, జలాంతర్గామియొక్క దూరమును దాని స్థానమును సరిగా కనిపెట్టవచ్చును. ఈ యంత్రములు కనిపెట్టినవారి కిద్దఱికిని ఈ ధ్వని దేనివలన వచ్చునో తెలియును గాని, అది పైకి చెప్పినయెడల జర్మనీవారు ఆ ధ్వనులు లేకుండ చేతు రని అది రహస్యముగా నుంచఁబడినది. వీరివలన చేయఁబడిన యంత్రమందు మఱి యన్నియు నెట్లమర్పఁబడినవో యుద్ధము సాంత మగువఱకు పైకిఁ దెలియఁజేయరు. సబ్మెరయినులను కనిపెట్టుట కుపయోగించు నీ యంత్రములు బ్రిటీషుద్వీపములచుట్టును ఫ్రాన్సుయొక్క సముద్రతీరమునను సుమారు రెండు వేల స్థలములయందమర్పఁబడియున్నవి. ఈ ప్రదేశములకు 50 మైళ్ల దూరమున నున్న జలాంతర్గామిని గూడ సులభముగా కనిపెట్టి దానిమీఁదికి కొన్ని విమానములను బంపి యది పైకి వచ్చినప్పుడు బాంబులను వేసి దానిని నశింపఁజేయుదురు. ఈ విధముగా జర్మనుల సబ్మెరయిను లెన్నియో నష్ట మయినవి. ఈ దురంతక జలాంతర్గామివలననే, యుద్ధధర్మము గాకపోయినను, నిరపరాధులైన పిల్లలను స్త్రీలను సముద్రము పాలు చేసి జర్మనులు ధర్మవిదూరు లయిరి.

## సేన, తంత్రీవార్తాదికములు

తీఁగెలవలన వార్తల నెన్ని వేల మైళ్ల దూరమైనను రెప్పపాటు కాలములో పంపుచున్నా రనియు, ఈ తంత్రీవార్తలవలన వర్తకప్రపంచమునకును ప్రజలకును చాల సౌకర్యము గల దనియు మన కందఱకు తెలియును. ఈ తంత్రీవార్తలకు విద్యుచ్ఛక్తియే మూలాధారము. తీఁగెలగుండ ప్రవహించు విద్యుత్తు సాహాయ్యము వలన వార్తలు ఒక స్థలమునుండి యింకొక స్థలమున కెంత దూరమైన నెట్లు పంపఁబడునో ఇట్టి చిన్న వ్యాసమున సవిస్తరముగా వ్రాయుట సాధ్యము కాదు. వర్తమానఘోరసంగ్రామమునందుఁ గూడ నీ తీఁగెటపా ముఖ్యావసరమై యున్నది. పూర్వపు యుద్ధములందు జయాపజయములు సేనాధిపతుల బుద్ధికుశలతను బట్టి యుండెడివి. ప్రస్తుత సంగ్రామమందు జయాపజయములు ఉభయ పక్షములవారి విద్యుత్తంత్రులను బట్టి యుండు నని దృఢముగా చెప్పవచ్చును. ఈ యుద్ధములో జర్మనీ దేశపు సైన్యములందు ప్రతి గుఱ్ఱపు దళమునకును వార్తాతంత్రులను స్థాపించుటకు "తంత్రీవార్తాదళ" మని కొంతమంది యుద్యోగియు లుందురు. వీరు గుఱ్ఱపుదళముకంటె ముందు పోయి తీఁగెలను స్థాపించి తాము బయలుదేఱిన స్థలమునకు వార్తలు పంపులాగు చేయుటయే వీరి పని. ఇప్పు డీ యుద్ధమందు వేర్వేఱు స్థలములకు తీఁగెటపాను స్థాపించు పద్ధతి బహువినోదముగా నుండును.

పై నుదాహరించిన ప్రతి తంత్రీవార్తాబలమునకును సుమారు 9 మైళ్ల దూరమునకు వలయు తీఁగెయు తత్సంబంధమైన సామగ్రియు నియ్యఁబడును. వీ రుపయోగించు తీఁగె మిక్కిలి సన్నముగా నుండి చిన్న చక్రములమీఁద దారపుకండెలరీతిని చుట్టఁబడును. ఈ చుట్టల నిద్దఱు వడిగా గుఱ్ఱములమీఁదఁ బోవుచు తీసికొనిపోవుదురు. వీరు పోనుపోను, చుట్టలు క్రమముగా విడుచుండును. వీరివెనుక మఱిద్దరు కొంకెలు కట్టిన కఱ్ఱలను రెంటిని తీసికొని వీరివలెనే గుఱ్ఱములమీఁద వడిగాఁ బోవుచు చుట్టలు విడి క్రిందఁ బడుచున్న తీఁగెల నెత్తి చెట్లకొమ్మలకుఁ గాని క్రింద నుండు రాళ్లకుఁ గాని కట్టుదురు. వీరివెనుక మఱిద్దఱు గుఱ్ఱములమీఁద స్వారి చేయుచు నీ తీఁగెలమూలమున వార్తలు సరిగా పోవుచున్నదియు లేనిదియు పరీక్షింతురు. ఈ ప్రకారము వీరు సుమారు 10 నిమిషములలో తొమ్మిది పది మైళ్ల దూరమువఱకు తీఁగెల నమర్చి వార్తలను పంపుటకు తయారుచేతురు.



పైన ముద్రించిన పటమునందు జర్మను లీ యుద్ధములో తీఁగెటపాను స్థాపించు విధానమును చూడఁగలము. పూర్వపు యుద్ధములందువలె పదాతులచేత వార్తల నంపుట కవసరము లేదు. పదాతుఁడు వార్తలను కొనిపోవుటకు కొన్ని దినములుపట్టును. అదియును గాక, పదాతులు తమ ప్రాణములను పిడికిటఁ బెట్టుకొని సంచరించెడివారు. ఇప్పు డీ విద్యుత్తు ప్రవహించు తీఁగెల సాహాయ్యమున వార్తలను రెప్పపాటుకాలములో నెన్ని వేల మైళ్ల దూరమైనను బంపవచ్చును.

'అది యటుండ, ఈ యుద్ధమందు సైన్యముయొక్క ప్రతి భాగమునకును టెలిఫోనులు గలవు. వీని సాహాయ్యముననే యొక భాగమునుండి మఱియొక భాగమునకు వార్తలను బంపుచున్నారు. ఉభయ పక్షములవారి సైన్యము లెదురుకొనినప్పుడు, సేనానాయకులు యుద్ధమును నడపుటకుఁ గూడ ఈ టెలిఫోనులనే యుపయోగించుచున్నారు. ప్రాచీనపు సంగ్రామములందు సేనా

నాయకుఁడు తుపాకులను ప్రేల్చువారియొద్ద నిలిచి సమయము వచ్చినప్పుడు బిగ్గరగా నఱచుటవలన వారిని తుపాకులు కాల్పుఁడని చెప్పుచుండెడివాఁడు. ఇప్పుడు సేనానాయకుఁడు ఫిరంగుల పంక్తికి కొన్ని మైళ్ల దూరమున నేదైన నొక చెట్టుమీఁద దాఁగి శత్రుసైన్యమును బాగుగా కనిపెట్టి చూచుచు సమయము వచ్చినప్పుడు ఫిరంగులను ఫలాన దిశకు ప్రేల్పుఁడని సైనికులకు చెప్పును. స్టీమరులోని యింజనులను నడపువాఁడు ఆ దేవైపునకుఁ బోవునదియుఁ జూడక చూక్కాని పట్టునతఁడు చెప్పు విధముగఁ జేయుచు దానిని సరిగా ఏలాగు నడపునో ఆలాగుననే యిప్పటి యుద్ధమందు సైనికులు గూడ శత్రుసైనికులను జూడకపోయినను సేనానాయకుఁడు చెప్పిన రీతిని తమ ఫిరంగులను సరిగా కాల్తురు.

## తంత్రీవిరహితవార్తలు

తంత్రీసాహాయ్యము లేక కూడ వార్తలను బంపుచున్నారు. ఇది యంతయు విద్యుచ్ఛక్తిమహిమయే గాని మరేమియుఁ గాదు. ఈ తంత్రీవిరహితవార్తలవలన యుద్ధనౌకలకును విమానములకును చాల నుపయోగము గలదు. కొన్ని శాస్త్రములందు పారంగతను బొంది లోకప్రఖ్యాతిఁ గాంచిన 'జగదీశచంద్రబోసు' అను హైందవుఁడే ఈ తంత్రీ విరహితవిద్యుద్వార్తాప్రచారమున కుపయోగించు మిక్కిలి సున్నితమైన యొక యంత్రమును కనుఁగొనెను. ఆ యంత్రమునే యిప్పుడనేకదేశములం దుపయోగించుచున్నారు. కావున నీశాస్త్రజ్ఞుఁడు మన మాతృదేశమున కెంతయో కీర్తిని దెచ్చెనని యీ సందర్భమున దృఢముగా చెప్పవచ్చును.



స్తంభముమీఁద స్థాపించిన సెర్చిలైటు

## రాంజనకిరణములు

విద్యుచ్ఛక్తిసాహాయ్యమున నొకవిధమైన కిరణములను సృజింపవచ్చునని 'రాంజన్' అను విద్యుచ్ఛాస్త్రజ్ఞుఁడు కనిపెట్టెను. ఆ కిరణములను మన శరీరముగుండ పంపిన, అవి మాంసముగుండ పోయి శల్యములవలన నాపఁబడును. ఇవి రాంజనకిరణములని వాడఁబడుచున్నవి. ఈ కిరణముల సాహాయ్యముచే నిప్పుడు ప్రతివైద్యశాలలో వైద్యులు శరీరమును గోయకయే యెముకలను జూడఁగలిగి మాంసమందు మరియేదైన పదార్థమున్నయెడల సులభముగాఁ జూచి దానికి తగిన చికిత్స చేయుచున్నారు. ఈ కిరణముల వలననే యీ శతాబ్దమందు శస్త్రశాస్త్ర మెంతయో వృద్ధియైనది. వర్తమానసంగ్రామమం దున్న ప్రతిసేనకు సంబంధించిన వైద్యశాలలలోను ఈ రాంజనకిరణయంత్రములు కొన్ని యుండును. వీని సాహాయ్యమున యుద్ధభటుల శరీరములలో ఫిరంగి గుండ్లు రవ్వలు మొదలగునవి యెచ్చట నున్నదియు శరీరమును గోయకయే నిమిష మాత్రమునఁ గనిపెట్టి తగిన చికిత్స చేయుచున్నారు.

## ఉపసంహారము

విద్యుచ్ఛక్తివలన పరిశ్రామికవృత్తులకును వర్తకవాణిజ్యములకును గలిగెడి అపరిమితలాభమును బట్టి చూడ, రానురాను దొరతనమువారు పన్నులు పుచ్చుకొని నీటి సదుపాయము చేసినటులే సులభమార్గమున విద్యుచ్ఛక్తి గూడ మనకు లభించునట్లు చేయవచ్చును. కడచిన సంవత్సరము సెప్టెంబరునెలలో అమెరికా దేశపు విద్యుచ్ఛాస్త్రజ్ఞుఁ డొకఁడు తీఁగలేని టెలిఫోనును గనిపెట్టి నాలుగు వేల మైళ్ల దూరమున నుండువానితో మాట్లాడఁగలిగెను. యుద్ధానంతరము దీని రహస్యము బయలుపడిన తరువాత అన్ని దేశముల దొరతనములవారును నేకీభవించి వర్తకనౌకల సదుపాయముకొఱకు దీని నుపయోగించెదరు. విద్యుచ్ఛక్తివలన సస్యములను పుష్టిచేయుటకును శారీరరుగ్మతలకు చికిత్స గనిపెట్టుటకును శాస్త్రజ్ఞులు తగినంత పరిశ్రమ చేయుచున్నట్లు గాన్పింపదు. సూర్యమండలమున ఉష్ణమును వెలుతురును నిచ్చు కిరణము లున్నవని మన కిదివఱకే తెలియును. సూర్యునియందు తదితరకిరణము లేవయిన నున్న వేమో శాస్త్రజ్ఞులు కనిపెట్టినచో, వానిని గూడ ఉష్ణకిరణములను తేజఃకిరణములను సృజించినటులే, విద్యుచ్ఛక్తిసాహాయ్యముచే సృజించుటకు సాధ్యము కావచ్చును. సూర్యకిరణములకు క్రిమికీటకాదులను నశింపఁజేయు శక్తి కలదని మన కిదివఱకే తెలియును. సూర్యమండలమునుండి వచ్చు కిరణసముదాయమున నే తరగతి కిరణముల కీ సామర్థ్యము కలదో యే మహానుభావుఁడైన కనిపెట్టినచో, విద్యుచ్ఛక్తివలన ఆ కిరణములను సృజించి లోకమందలి ప్రజల సౌఖ్యముకొఱకు ఎంత పనియైన చేయవచ్చును. విద్యుచ్ఛక్తివలన మరియొక లాభమున్నది. విద్యుత్ప్రవాహమువలన కాలుచుండు నతి తీవ్రమయిన ఉష్ణము నిచ్చు కొలుములు ఈనడుమ సంపూర్ణత్వమును పొందినవి. అవి పరిశ్రామికలోకమునకు మిక్కిలియుపయోగకారులగు నని యూహింపఁగలము.

దీనిని బట్టి, పాశ్చాత్యదేశములందు పదార్థవిజ్ఞానశాస్త్రమును రసాయనశాస్త్రమును మరి యితర ప్రకృతి శాస్త్రములును ఎట్టియుచ్ఛదశయం దున్నవో స్పష్టము.

ఈ విషయమున జర్మనీ దేశమునకుఁ జాలిన దేశము మఱియొకటి లోకమందు లే దని దృఢముగ చెప్పవచ్చును. వీరి శాస్త్రజ్ఞానము మారణ సాధన నిర్మాణములకు వినియోగపడుచున్న దనియు, పాపము! నోరెఱుఁగని చిన్న దేశములు వీరి శాస్త్రజ్ఞానమునకు మృత్యుదేవత పాలిటఁ బడుచున్న వనియు మనము విషాద మొందినను, వారి శాస్త్రప్రావీణ్యమును అద్భుత శక్తిని జూచి యాశ్చర్య మొందక తప్పదు. ఇంగ్లాండు దేశము, తన శాస్త్ర విషయములయందు కొంత యశ్రద్ధ నవలంబించుటచే. యంత్రములు రసాయనములు మొదలగువాని నిమిత్తము జర్మనీ దేశము నాధారముగాఁ జేసికొనియున్న దని 'షైమింగు" అను విద్యుచ్ఛాస్త్ర ప్రవీణుఁ డగు నొక యాంగ్లేయుఁడు కడచిన యక్టోబరు నెలలో లండను విశ్వవిద్యాలయమందు చెప్పియున్నాఁడు. దీని నంతటిని జూడ, మన హిందూదేశమునకును పాశ్చాత్యదేశములకును ఎంత తారతమ్య మున్నదో మన దేశ మెట్టి క్షీణదశయం దున్నదో స్పష్ట మగును. కాని, హిందూదేశమందు నయితము శాస్త్రజ్ఞులు బయలు దేఱుట శుభసూచకము. జగదీశచంద్ర బోసను హైందవుఁడు కొన్ని శాస్త్రములందు పారంగతను పొంది పాశ్చాత్యదేశములకుఁ బోయి తన సామర్థ్యమును జూపి తనకును తన మాతృదేశమునకును ధవళ యశమును సంపాదించెను. పూర్వము మన హిందూదేశమునందు అట్టి శాస్త్రము లన్నియు నున్నతస్థితియం దుండెడివి, కొన్ని శతాబ్దముల నుండి యవి క్షీణించిన వనియు, వానిని పునరుద్ధరింపవలె ననియు, ప్రకృతి పరిశ్రామిక శాస్త్రములను వృద్ధిచేయవలె ననియు, మన హైందవ ప్రముఖు లిప్పుడు గ్రహించినారు. కాశీనగరమందు స్థాపింపఁ బడుచున్న హిందూవిశ్వవిద్యాలయమందు ప్రకృతి పరిశ్రామిక శాస్త్రములు ప్రముఖతను వహించు నని మనకు సంతోషముగా నున్నది. కాఁబట్టి మన మహారాజులును ఘనతర దేశాభిమానులును ప్రకృతి శాస్త్రాభివృద్ధికి తోడ్పడుదు రనియు, కాశీనగరమునందలి హైందవ విశ్వవిద్యాలయమువంటి విద్యాలయము లెన్నియో దేశ మంతటను స్థాపింపఁబడు ననియు, పరిశ్రామికవృత్తులను నేర్పుటకు కర్మాగారములు స్థాపింపఁబడు ననియు నమ్మఁగలము. నిశ్చయముగా హిందూదేశమందు నూతనశకము ప్రారంభ మయినది. జగదీశచంద్రుఁ డను సూర్యుఁ డుదయింప, అంధకార మెంత కాల ముండును?

# ఏది జ్ఞానము?

కన్నెపల్లి సాంబశివరఘురామస్వామి గారు

తరుణుల్ సూనులు దేహగేహములు బాంధవ్యంబు లోనైన బం
ధుర మోహాస్పదవస్తుసంగతియె సాధుజ్ఞానమా? లేక న
శ్వరమాపోషితవృక్షపుష్పఫల నానావస్తుసందోహసుం
దరసందర్శనలాభశోభనము విజ్ఞానంబ యూహింపఁగన్?

చ. తెలతెలవాఱు వేళల నదీజలమందునఁ దానమాడి ని
శ్చలమతి నీశ్వరున్ గొలిచి మడిపుభంజన మాచరించుటే
తలఁపఁగ జ్ఞానమా? మమతఁ దాలిమి దూలి చరించి యైహికం
బుల మది నమ్మి గర్వపడి పోఁడిమి వీడుట జ్ఞానమా కనన్?

చ. ప్రకృతికృతక్రమాగతశుభంబుల కర్తృతఁ దానె మీఁద వై
చుకొని యకార్యకారణ మనూయ నభాగ్యకృతంబటంచుఁ గూ
హకమున నుంట జ్ఞానమ? శుభాశుభమందున నీశ్వరుండె కా
రకుఁ డని మిన్నకుండుట తిరంబగు జ్ఞానమ యెంచి చూడఁగన్?

శా. ప్రత్యక్షంబె ప్రమాణ మంచుఁ బరమున్ బాటింపకే యైహిక
వ్యత్యాసంబుల నాత్మ నమ్ముకొని గర్వం బందుటే జ్ఞానమా?
సత్యం బెల్లఁ బరంబె యైహికము తుచ్ఛం బంచు గుర్తించి సం
గత్యాగంబున మోహ మందుకొనుటే జ్ఞానంబ యూహింపఁగన్?

మ. ధనభోగాదుల నమ్మి ప్రాణులయెడన్ దాక్షిణ్యమున్ వీడి నే
నను మోహంబునఁ జిక్కి క్రుళ్లిపడుటే యత్యంతమున్ జ్ఞానమా?
జననం బొందిన వేళఁ దెచ్చినది లేశం బేనియున్ లేదు పో
యిననాఁ డొక్కటి వెంట రా దని మదిన్ వీక్షించుటే జ్ఞానమా?

# పసిబిడ్డ

నాగసముద్రము వాసుదేవరావు గారు

చిన్నికుఱ్ఱఁడ! నీ వింత చింత లేక
కాల మొకరీతిగా నెట్లు గడపె దౌర!
ముద్దు గుల్కెడు నీ చిన్ని మొగమునందు
నిర్మలత్వంబు మాత్రమే నిండియుండు; 4
కపట మొక్కింత యైనను గానరాదు;
దుఃఖ మనునది నినుఁ జూచి దూరమగును,
కారణం బేమి యుండునో గాంచలేము;
మాకుఁ దెలియని యీ గొప్ప మర్మ మేమి? 8
చెప్పరా దొకొ? మాకును చిన్ని నిసుఁగ
తిండి నొసఁగెడువారల యందుఁ జేరి
యర్థమే లేని మాటల నాడుచుండి
మైత్రి సల్పెదు వారితోఁ జిత్రవృత్తిఁ; 12
తినఁగ నన్నంబుఁ బెట్టెడి జననిఁ గాంచి
యాదరంబున నినుఁ బెంచు దాదిఁ జూచి
యతిముదంబున నినుఁ జేరు ననుజుఁ గనుచు
'బాలకుఁడ వైన నెఱవ మీ మేలు' ననుచు 16
నవ్వుఁ బుట్టించు నీ తేఁట నవ్వుచేత
పావనంబైన నీ ముద్దు పలుకుచేత
చూడ నింపైన నీ మేల్మి మూపుచేత
చిన్నిపాపఁడ! నీ బాల్యచేష్టచేత 20
చూపుచుందువు నీ భక్తి నేపు మీఱ;
కుటిలచిత్తుఁడు మనుజుఁడు కూడ దనుచు
నెవరియొద్దకు నుండక యేడ్వఁ జూచి
నిన్ను బయటికిఁ గొనిపోయి నీదుతల్లి 24
నిర్మలాకాశమును వేగ నీకుఁ జూప,
మిగుల ధనికుల మేడలమీఁదఁ బోలె
బీదవారల గుడిసెలమీఁదఁ గూడ
నరునిఁ జంపెడు నవగుణపరునిమీఁద 28
తపసు చేయుచునుండెడు తపసిమీఁద
మానవుఁడు లేని దారుణకాననమున
ప్రజలచే నిండి విలసిల్లు పట్టణమున
భేద మించుకయును లేక ప్రేమతోడ 32
తనదు చల్లని వెన్నెల ననవరతము
అవని నంతట నెఱపుచు నాకసమున
పరఁగుచుండెడు నా శీతకరునిఁ జూపు,
'అతఁ డొక్కఁడె నా సాటి యగు' నటంచు 36
చిగురుటాకును బోలెడు చేతితోడ
నతనిఁ జూపుచు మోదంబు నందె దౌర!
మరల చంద్రునిలోఁ గల మచ్చఁ జూచి
మఱచియుండిన వంతను మదిఁ దలంచి 40
తగదు వేగమే యిటనుండి తర్లు మనుచు
పట్టుపట్టెద వది యేటి పంతమయ్య!
మచ్చ లేనట్టి వస్తు వీ మహిని గలదె?
నలుపుఁ బొందక గుఱిగింజ గలుగు నెచట? 44
లోపమే లేని దేదియు లోకమందు
గానరాదెంత నేర్పుతోఁ గలయఁ గనిన.
స్వచ్ఛ మైనది నీ దగు స్వాంత మొకటె,
దాని కొద్దియు సాటియే గానరాదు. 48
ఎల్ల విషయంబు లెఱుఁగు నీ వెదుట నుండ,
సత్యశీలుఁడ వగు నీవు సరస నుండ,
జ్ఞానమే లేని యొక చిన్నకూన వనుచు
తాను జేసెడి దెద్దియుఁ గాన ననుచు 52
మంచిచెడ్డల నెఱుఁగని మనుజుఁ డకట!
చేయఁగారాని పనులను జేయుచుండు,
నాడఁ జెల్లని మాటల నాడుచుండు,
తనదు కన్నుల రెంటిని దనర మూసి 56
పాల నన్నిటఁ ద్రావుచుఁ బరులు దన్నుఁ
గాన రని యెంచు ఆ పిల్లికూనవలెనె.
పారమే లేని సంసారవార్థియందు
మునిఁగి మోదంబు నెచ్చటఁ గనఁగ లేని 60
మనుజుతో నీవు సతతంబు మనుటఁ జేసి,
పెద్దవాఁడవుగా నీవు పెరుగుకొలఁది
జనుల బాధించు పలు చెడ్డ గుణము లెల్ల
సంతతము మదిఁ గలఁచెడు చింత లెల్ల 64
కష్టములపాలు చేసెడు కాంక్షలెల్లఁ
బొందుచుండును నిన్ను సంపూర్ణముగను
భ్రమరకీటకన్యాయంబు ప్రబలు కతన.
పెద్దవాఁ డౌచు నీ విట్లు పెరుగుకొలఁది 68
సద్గుణంబుల మాటయు సమయుఁ గాన,
పెద్దవాఁ డన్న నెవ్వరు ప్రేమఁ జూప;
చిన్ని సుగుణంబు లుండెడి నిన్నుఁ జూచి
మురియుచుందురు మనుజులు ముదముతోడ. 72

GENERAL BOTHA, MR. JOHN MERRIMAN AND GENERAL SMUTS



దక్షిణాఫ్రికా మంత్రిత్రయము: జనరలు బోథా, మెర్రిమెన్, జనరలు స్మట్సుగారలు.
(ఎడమవైపునుండి కుడిప్రక్కకు చదువుడు)

THE RIGHT HONOURABLE MR. AUSTIN CHAMBERLAIN



ఆస్టిను ఛేంబర్లేనుగారు, ఇండియా కార్యదర్శి

# యుద్ధచరిత్రము

## ఇటీవలి వృత్తాంతములు

రాక్షసనామసంవత్సర సంచికయందు జూన్ మాసాంతము వఱకును క్లుప్తముగా యుద్ధచరిత్రము వ్రాయఁబడియున్నది. ఈ సంచికయందు జూలయి మొదలు మార్చివఱకును సంక్షేప చరిత్రము వ్రాయుటకు ప్రయత్నింపబడును. ఈ చరిత్రమును చదువు వారికి పటములు దగ్గఱలేనిది సంగతులు బోధపడుట కష్టతరముగాన గత సంచికయందును, అప్పుడప్పుడు దైనిక పత్రికలలోను ముద్రింపఁబడిన పటములను దగ్గఱబెట్టుకొని చదువవలయును. జూలై మాసము నందు మిత్రమండలి ఫ్రాన్సులోని విల్ పట్టణమును పట్టుకొనుటకయి గొప్ప ప్రయత్నములను జేసి జర్మనులకు చాలనష్టమును గలిగించెను. వారు ఈరంగమున సౌషే గ్రామమును పట్టుకొనుటలో అగ్రాంసు ప్రాంత్యమున యుద్ధతీవ్రత కొంతకాలమువఱకును తగ్గిపోయెను. కాని ఈ ఫ్రాంసురంగమునందే కాలొన్నీలోను, మ్యాజు శిఖరములమీదను



బ్రిటీషు సైనికులు యుద్ధరంగమునకు బయలుదేరుట

పోరు ప్రారంభమయ్యెను. ఇచ్చట జర్మనులు నూతనముగా నాక్రమించుకొనిన స్థలమువఱకయి ఉభయులును పోరాడిరి. జయాపజయములు అటునిటు కలుగుచుండెను. జూన్ 23 ఉదయమున జర్మనులు రెండుమారుల కందకముల నాక్రమించుకొనిరి. తుకతుక ఉడకబెట్టిన నూనెలను ఫ్రెంచివారిమీద పోసిరి. విషవాయువులను ప్రయోగించిరి. తాత్కాలిక జయము జర్మనుల కిచ్చట లభించినను, ఫ్రెంచివారి శతఘ్నులు శత్రువులను బీభత్సముఁ జేసినందున ప్రాఁతస్థలములు తిరిగి వారి వశమయ్యెను. ఈ కాలొన్నీ, మ్యాజు శిఖరములకు క్రిందనున్న వాండిప్రాప్టకు సామీప్యమున లాఫాంటీ సెల్లి వద్ద జర్మను లత్యుగ్రతతో చెలరేగిరి. కొన్ని గంటలలో 220 గజముల స్థలముమీద 4,000 షెల్లులను వారు ప్రయోగించుటనుబట్టియే వారెట్లు క్రుమ్మరించెదరో తెలియుచున్నది. ఈయుప్పెన

పహోతుమువలన వారు ముందునకు నడచి ఫ్రెంచివారి స్థానములను కొన్నింటిని పట్టుకొనిరి తిరిగి కొన్నిదినములకు ఈ స్థలములను, 140మంది జర్మను ఖయిదీలను, 8 గ్గురు సైనికోద్యోగులను ఫ్రెంచివారు పట్టుకొనిరి

## సౌషే, సెయింటుమిహియల్

పశ్చిమరంగమున జరిగిన యుద్ధము లన్నియు అటు, పోటుగా నున్నవి పెక్కు వందల మైళ్లు భూమి పొడుగున లక్షల కొలది సైన్యము కందకములలో చేర్పఁబడినది ఇరుపాగుల వారికిని సరి సమానమయిన బలము, యుద్ధయంత్రములు, పరికరములు గలవు ఒక రొక్కపర్యాయము ముందునకు వచ్చిన, ఇంకొక పర్యాయము వేఱొకరు వారిని త్రోసివేయుదురు సరిసమాన మయిన జట్టీలు కుస్తీపట్టిన విధము అంగుళలన్న అటు ప్యారిసుమీద వెళలేద మని గాని, లేక యిటు బర్లినుకు పట్టుకొనెద మని గాని వెఱ్ఱికోరికలు శత్రువుల నందఱిని జూలయి మాసముతో వదలి పోయెను. ఫ్రెంచి వారు పట్టుకొనిన సౌషేగ్రామమును పట్టుటకయి జర్మనులు విశ్వప్రయత్నములను జేసిరి విషవాయువులను పుష్కలముగా విడిచిరి ఫిరంగులను వురిపించిరి జూలయి 11-12 వ తేదీలను సౌషేలోని శ్మశానములను, కొన్ని కందకములను పట్టుకొనిరి ఈ కందకములు జూన్ 16 న ఫ్రెంచివారి వశమయినట్టివి ఈ సమయమునందే సెయింటు-వాస్టులోని న్యూవిల్లీకి ఆగ్నేయమున ఫ్రెంచి పంక్తులను ఛేదించుటకయి యత్నములు సలుపఁబడెను ఇచ్చట శత్రువులు చేయి పారెడు దూరములో కందకములు త్రవ్వుకొని యుండుట వలన దూరము పారెడు ఫిరంగులు పని చేయజాలకుండెను అందువలన అగ్నిగోళములను (గ్రెనాడులను గత సంవత్సరాది సంచిక 286 వ పేజి చూడుఁడు) విసరుకొనిరి జర్మను లిచ్చట జయింపలేదు

## ఫోంబెల్లీ

వోస్జెసులోని ఫోంబెల్లీలో జూన్ 22 వ తేదిని ఫ్రెంచి వారిని తఱిమి ఆక్రమించుకొనిన 650 గజముల పొడుగు, 760 గజముల వెడల్పు గల కందకముల నుండి ఫ్రెంచివారు జర్మనులను తొడల గొట్టిరి ఇచ్చట 19 మంది జర్మనుద్యోగియులు, 767 మంది గాయములుతినని సైనికులు, 82 మంది దెబ్బలుతినిన వారు ఫ్రెంచి వారి వశమయిరి 87 మిల్లి మీటరు పెద్ద ఫిరంగి, 4 మెషీను ఫిరంగులు, గ్రెనాడులు, ఫ్రెంచిమార్టరు, విషవాయుప్రయోగసాధనములు, తూటాలు దొరకెను

## మ్యూజుశిఖరములు

సెయింటు మిహియల్ కడ్డ వాక్సుఫెరీలో కొన్ని పంక్తులను జర్మనీయావారు పట్టుకొనిరి మ్యూజునదికి కుడిప్రక్కనుండి, ఎయిలీకి దక్షిణమున అప్రెమాంటు అరణ్యమువరకు జర్మనీయులు ఫిరంగులను విరామము లేకుండ కాల్చికాల్చి 760 గజముల కందకముల మాత్ర మిచ్చట పట్టుకొనఁగలిగిరి వాక్సుఫెరీలోని యితర పంక్తుల వద్ద చాల నష్టములతో పారఁదోలఁబడిరి. బోయిస్ లా ప్రేట్రీలోను కొడుకుడుకు నూనెను కందకములలో దొర్లించి ముందునకు పోగిరి.

## జూలయి 10 మొదలు 17 వఱకు.

సౌషేశ్మశానము నాక్రమించుకొనిన తరువాత జూలయి 12-వ తేదిని జర్మనీయులు "లెబిరింతు"లోని కందకములను బట్టు



ఫ్రెంచివైమానికులు బాంబులను వేయుట

కొనుటకయి ప్రయత్నించిరి ఆల్సేసులోని సాండర్నాకు పయి చేసిన ప్రయత్నము విఫలమయ్యెను. లెర్ ఫ్రెంచి విమానములు విస్సిల్లేసు, లెన్ హాట్టొం ఛాటెలువద్ద నున్న రయిలుస్టేషనుమీద, అప్రైపుకు నున్న పంతెనలమీఁద 'యంయం' బాంబులు 99-వ నెంబరువి 171 ని వేసెను విమానములకు నష్టముకలుగలేదు పిల్కెముకద్ద ఇంగ్లీషు

వా రాక్రమించుకొనిన కందకములను పట్టుటకయి చేసిన యత్నములు ఫలింపలేదు. ఎగ్రాసు, సెయింటువాస్టు, లేబిరింతులవద్ద 14-వ తేదిని ఒకరినొకరు కొద్దిగా కొట్టుకొనిరి. కార్లియిల్ ఘాటావద్ద ఫ్రెంచివారు ఒక జర్మను కందకపంక్తిని పట్టుకొనిరి గాని జ్యూరౌయిన్ అడవివద్ద సెర్వన్‌రోడ్డు కుత్తరమున జర్మనులకు తావిచ్చిరి. ఆర్గొన్నిలో ఫ్రెంచివారితో జర్మను యువరాజు తీవ్రముగా 25 దినములనుండియు (జూన్ 20, జూలయి 15) పోరాడుచుండెను. 26 దినములలో 7000 ఖయిదీలను పట్టుకొంటినని ఈయన యనినను ఇన్ని దినముల పోరునకిది యొక్క గొప్ప విజయము కానేరదు. జూలయి 14న ఆర్గొన్నీలో జర్మనీయులకు జయములు సమకూరనేలేదని ఫ్రెంచి అధికారవర్గము ప్రకటించెను.

### జూలయి 18—24

జూలయి 18-19 తేదీలను సౌషేగ్గఱ జర్మనులు తఱుమఁబడిరి. సాయిసన్సుమీఁద శతఘ్నులను శత్రువులు కురిపించిరి. 20 వ తేది ఫెచ్చి కనుపులలో కొంత పోరాటము జరిగెను. ఆదినముననే ఫ్రెంచి విమానములు కోల్మారు, ఛల్లిరెంజి, క్రాణ్‌ఫ్లౌన్స-ఇణ్-బార్నీ రయిలుస్టేషనుల మీఁద బాంబులను వేసి నష్టమును కలిగించెను. 20-21 వ తేదీలలో కోల్మారుకు పడమట మన్‌స్టరువద్ద కఠిన యుద్ధము జరిగెను. ఫ్రెంచివారు కొంత భూమి నాక్రమించుకొనిరి. జర్మను లీ భూమికయి 9 పర్యాయములు దుమికిరి. తొమ్మిది పర్యాయములును తఱిమివేయఁబడిరి. 107 మంది ఖయిదీలు ఫ్రెంచివారికి చిక్కిరి. ఫ్రెంచిరంగమున నితరమగుచోట్ల కొద్దిగా పోరుసాగెను. 23వ తేది ఫ్రెంచివారి విమానములు కాణ్‌ఫ్లౌన్సుమీఁద బాంబుల వేసి వచ్చెను.



హూగువద్ద జర్మనులు బ్రిటీషుకందకముల పయి మంటలను గొట్టచులగుండ ప్రయోగించుట

## సర్ జాణ్ ఫ్రెంచిగారి రిపోర్టు

21, 22, 23, 24 జూలయి తేదీలను, హూగు, జిల్లిబేకుల వద్ద కొంత పోరు జరిగెననియు, కొన్ని మందుగనులు ప్రేల్పఁబడిననియు, బ్రిటీషు సేనానాయకుఁడు సర్ జాణ్ ఫ్రెంచిగారు తెలియఁబఱిచిరి. అన్ని ఫ్రెంచి, జర్మను కందకములును పిప్పియయినవా యని అనుకొనునంత గర్జనముతో గనులు ప్రేలెనట.

వోస్జెసులోని బాండిసాప్ట్రవద్ద పరాసువారికి కొద్దిపాటిజయము సమకూరినది. లాంఘాంబెల్లీగుట్ట రెండు బెటాలియనుల సేనవలన నాక్రమించుకొనఁబడెను. 837 మంది జర్మను ఖయిదీలు, 6 యంత్రఫిరంగులు దొరకినవి.

### జూలయి 24—31

జూలయి 26 వ తేదిని జర్మను వైమానికులు బాంబులను డన్‌కిర్కుపయినివేసిరి. ఫ్రెంచివారు నాటెల్లోయి మీద విడిచిరి ఒక్కమయిలు పొడుగుననున్న జర్మను కందకముల నాక్రమించుకొనుట ఈ వారముతో పూర్తియయినది. లింగెకోప్ఫ్ శిఖరములను 200 మంది జర్మను ఖయిదీలను పట్టుకొనిరి. 27 వ తేదిని ఫ్రెంచి కందకములమీఁద వచ్చి మూఁడుపర్యాయములు సౌషేవద్ద జర్మనులు పడిరి. మూఁడుపర్యాయములు తఱుమబడిరి. ఆర్గొన్నీ, లేబరింతులవద్ద స్థానికమయిన పోరు కొద్దిగా జరిగెను. వోస్జెసులో జర్మానియావారు ఫ్రెంచివారిని ధైర్యముతో ముట్టడించిరి గాని పరాసువారి 75 వ నంబరు ఫిరంగులు మంటలను కురిపించి వారికి స్థలము దొరకకుండఁజేసెను. 27 వ తేదిని జర్మనుబారులపయి అయిదుచోట్ల ఆకాశదళము బాంబులనువేసి నష్టము కలుగఁజేసి వచ్చెను. 30 వ తేదిని

ఫ్రెయిబర్గు, ఛానీ రయిలుస్టేషనుల పయిని పరాసువిమానములు బాంబులను ప్రయోగించి వచ్చెను. మరి 45 విమానములు ఆల్సేసులోని పెచ్చులుబ్రోనులోనున్న కరోసినాయి లుండు జర్మను స్థానముల పయి బాంబులను వేసినవి.

## బ్రిటీషురంగము—మంటలను ప్రయోగించుట

30-వ తేదిన జర్మనులు క్రొత్తగా నిర్మించిన సాధనమునుండి 500 గజముల బ్రిటీషు కందకములలోనికి హూగువద్ద మంటలను ప్రయోగించి పట్టుకొనిరి. 31 వ తేదిన కందకములు తిరిగి కొన్ని బ్రిటీషు వారి వశమయ్యెను. ఆగస్టు 1, 2 లలో అగ్నికరగోళములను ప్రయోగించి ఆల్బెయిక్, ఆంగ్రేసుల వద్దనున్న రోడ్డుప్రక్క కందకములను కొన్నింటి నాక్రమించుకొనిరి. షాంపేనుబ్యూసుజవ్రర్ ముఖమున పరాసులు కొంత భూమిని సంపాదించిరి. సెయింటు హ్యూబర్టు, వేరిఫ్వేరీ సాలవద్ద కరగోళములను ముందుగా విసరి జర్మనులు చేసిన ప్రయత్నములు నిష్ప్రయోజనమయ్యెను. మ్యూజు శిఖరములమీఁది లెస్ఎపాసు, ట్రాంఛీగ్గెల ప్రాంత్యమున జర్మను ముట్టడులు ఫ్రెంచి శతఘ్నుల వలన చిందరవందరయయ్యెను. జర్మనులు తిరిగి వెచ్చవెచ్చని నూనెను కందకములలోఁ బోసి మేరీఫేరీసావద్ద కందకములమీఁదఁ బడిరి.



జర్మనుకందకములను ఆంగ్లహైందవ సైనికులాక్రమించుకొనుట

### ఆగస్టు 1 మొదలు 14 వఱకు

రష్యామీఁద తమ యావచ్ఛక్తిని శత్రుమండలివారు ప్రయోగించుచుండుటచేత పశ్చిమ రంగమునందు పెద్దపోరాటములు ఈ దినములలో జరుగలేదు. తూర్పున పోలండుకు ముఖ్యనగరమగు వార్సా శత్రుమండలివారి వశమయ్యెను. పశ్చిమమున ఆర్గోన్నిలో కొంత వఱకు ఇరువాగులవారును బోరిరి. 11 వ తేదిని బోయి డిలాగ్రూరివద్ద పోరుజరిగి జర్మనులుపరాసువారి మొదటి కందకపుపంక్తులను కొన్నింటిని సంపాదించిరి. రెండుదినములయిన తరువాత జర్మనులు ముందుకుఁ బోవ తిరిగి యత్నించినను సాధ్యముకాలేదు. ఆర్టాయిలో-సౌషే, కార్లియూల్ ఛాటూల-వద్ద ఘోరసంగ్రామము జరిగెను. శత్రువులు ఈ రెండు ప్రదేశములలోను అతిసాహసముతో బోరిరి.

## హూగువద్ద సమరము

ఇచ్చట బ్రిటీషువారు జర్మనులను వెనుకకుఁద్రోసి వారిస్థానముల కొన్నింటి నాక్రమించుకొనిరి. శాల్బలము ముందునకు విజృంభించినప్పుడు శతఘ్నిబలము వారికి చాలసహాయముఁ జేసి త్రోవను కలుగఁజేసెను.

జర్మను కందకములలో నాంగ్లేయులు శతఘ్నిపరంపరలను కురిపించుటయే గాక! జర్మనుల సహాయమయి రిజర్వులోనుండివచ్చుచున్న సేనలు రాకుండ దూరముగా బారులను వదలి "మంటల గోడలను" దాటి రాకుండ కట్టిరి. ఈపోరు అతిబుద్ధి వైభవముతో సంకల్పింపఁబడెను. నతి చాతుర్యముతో కొనసాగింపఁబడెను. ముప్పావు గంటలో జర్మను కందకములు ఆంగ్లేయులచేతియం దుండెను.

### ఆగస్టు 14—21

సౌషే, వోజ్సెసుల యుద్ధముతో ఫ్రెంచివారి స్థితి వృద్ధిలోనికివచ్చెను. మన్స్టరుమీఁది దండయాత్ర తిరిగి ప్రారంభింపఁబడియెను. సాండగ్నాదు మన్స్టరుకు నైఋతి మూలను కలదు. దీనిని మూఁడుపర్యాయములు జర్మనులు తలపడినను నోడించి ఫ్రెంచివారు తమవశముననే ఉంచుకొనిరి. మరియొక దాడి పరాసులు లింగ్, మెట్జెకలుపయిఁ జేసిరి. జర్మనుల నష్టమిచ్చట హెచ్చుగా నుండెను. ఈమన్స్టరు, లింగ్, దాడుల వలన జర్మనులు రాకపోకల సదుపాయములు పోవునట్లగపడెను. అందుచే మన్స్టరు పడకుండుటకయిజర్మ

సయులు అమెరికా కనుమలగుండ ఫ్రెంచివారిమీఁద పడిరి. కాని యిచ్చట జర్మనులు జయింపలేదు. ఫ్రెంచివారు జర్మనీయుల రాక



కందకములలో బాంబులు ప్రేలుట

పోకలకు కష్టములను కలిగించుచునే యుండిరి. అర్రాసు మొదలు మాంగి డియర్ వఱకును ఫిరంగులతో యుద్ధము జరిగెను. పడమటిరంగములోని యితరస్థలములలో బాంబులను త్రోయుట, తుపాకిమందు పెట్టి కందకములను ప్రేల్చుట, కరగోళములను విసరుట మొదలగు పనులు జరిగెను. ఆర్గో న్నిలో జరిగిన యుద్ధమంతయును ఈ రకముదే. ఇచ్చట భూస్థితియు నిందు కనుకూలమయి యుండెను.

## తూర్పురంగము — గలీషియా

1915 ఏప్రిలు నెలలో ఆస్ట్రియనులు జర్మనుల సహాయమువలన గలిషియాలో ముందుగా రష్యను లాక్రమించుకొనిన స్థలములను వశము చేసికొనుటకయి తీవ్రయుద్ధమును ప్రారంభించిరి. రెండు నెలలలో జయ మటు నిటు అగుచువచ్చెనుగాని జూను 22 వ తేదిని లెంబర్గు నగరము ఆస్ట్రియనులవశమగుటతో రష్యనలు వెనుకకు తగ్గుట ప్రారంభించిరనియు, పెక్కువందల మయిళ్లు యుద్ధరంగముఖమున ఇచ్చటచ్చట వారు బాగుగా శత్రువులతోఁ బోరాడి తాత్కాలిక జయములను బడసినను, కావలసినంత మందుగుండు సామానులు సిద్ధమగునంతవఱకును శత్రువుల విజృంభణమును నీలయునంతవఱకు ఆపుచు మరలి పోవుటయే రణనీతిగా నేర్పఱచుకొనిరనియు, తెలిసికొనవలసియున్నది లెంబర్గు నెప్పుడు వదలిరో నీష్టరునదీ ముఖభాగములో స్థానముల నేర్పఱచుకొనిరి. జూన్ 21 వ తేదిని ఈ రంగములోనే నిజ్నీవా అనుచోట ఆస్ట్రియనులను బాగుగా నోడఁగొట్టిరి. ఈ నీష్టరుయుద్ధము ఖయు హాలిక్జుకు పశ్చిమమునను, వెనకను అంతరించును. దక్షిణపు పోలండులోని సైన్యములును గలీషియా సైన్యములు వెనుకకు దాటుచుండుటచేత వారితో సంబంధము నుంచుకొనుటకయి మగలుచుండెను. వెనుకకు మగలుటయనఁగా ఒక్కసారి వెనుకకు తిరిగి పరుగెత్తుట కాదు. శత్రుదాడిని పూర్తిగా నెదిరించుటకు శక్తిలేక పోరాడుచునే తగ్గిపోవుచుండుట.

### జూలయి 10 మొదలు 17 వఱకు

పశ్చిమ రంగమునందు శత్రువులు ఫ్రెంచి బ్రిటీషు సేనలతో కొద్దిగా పోరాడచు, వారిని ముందునకు రాకుండఁజేసి, వారిదెబ్బలను కాచుకొనుచు కాలము గడపుచుండిరి. కాని తూర్పు రంగముననే తమ యావచ్ఛక్తిని ధారపోయుచు రష్యాను పూర్తిగా నోడింపవలయునని సంకల్పించియుండిరి. రష్యాను పూర్తిచేసిన తరువాత తిరిగి పడమటి



రష్యా వేగువాండ్రు

పడవచ్చునని వారియెత్తు. దక్షిణ పోలండులో నొకచోట ఆస్ట్రియను సేన ఆర్చిడ్యూక్ జోసెఫ్ ఫర్డినాండుగారి ఆధిపత్యముక్రింద రష్యావారిచే నోడింపఁబడెను. 22,000 ఆస్ట్రియను ఖయిదీలు పట్టుకొనఁబడిరి. జర్మను జనరలు మాకెన్సనుదగ్గఱనే ఉండుటవలన ఫర్డినాండుసేన వినాశముగాకుండ అడ్డుపడెను. రష్యనులు జయముపయిని జయమును పొందుట కశక్తులయి యుండిరి. వారు ఇవన్‌గోరోడ్-ఖోలంరయిలుకు దక్షిణమున కందకములను త్రవ్వుకొనిరి. దక్షిణ పోలండులో ఆస్ట్రోజర్మనులు చేసిన ప్రయత్నము వార్సాను పట్టుకొనుటకయి చేసిన యత్నములో నొకభాగము. ఎడమప్రక్కను జర్మను జనరలు వాన్‌బ్యూలో మిటాను పట్టుకొనుటకయి నడచుచుండెను. ఈయెత్తు వార్సామీఁదఁగాక మిటామీఁదనే జర్మనులకండ్లుగలవని మోసముచేయుటకయి వేయఁబడినది. ఆగ్నేయ దిక్కున రష్యనులు పోరాడుచు వెనుకకుఁ జనుచుండిరి. వార్సాకు త్తరమున రష్యనులు జర్మను జనరలు ఐక్‌హార్ణ్‌తో పోరుచు నారూ ఆశ్రమముల వైపున నడచుచుండిరి. ప్రాస్నేష్జు జూలై 14 వ రష్యనులచే ఖాళీ చేయబడెను. వార్సాకు పశ్చిమముననున్న కందక పంక్తులు రష్యావారిచేతిలోనే ఉండెను. విశ్చులా నదిని దాఁటి వెనుకకుసయితము పోయెదరని సూచన లింతవఱకును కనఁబడలేదు. రాడంవద్ద ఆస్ట్రియనులతో గట్టిగా పోరుచుండిరి. దక్షిణపుపోలండులో మాకెన్సనుతో ఘోరసంగ్రామము జరుగుచుండెను.



గంటలువగయిరా సామానులు వార్సానుండి తీసికొనిపోబడుట

## వార్సానుపట్టుటకు ప్రయత్నములు

పోలండులోని నదులవద్ద ఘోరసంగ్రామములు జరిగినవి, అవి రక్తముతో ప్రవహించిన వనుటలో నతిశయోక్తిలేదు. రష్యనులు బగ్గునదిని దాఁటి పరుగెత్తిరి. వార్సాకుముందు వారలతిసాహసముతో పోరుచుండిరి. జర్మనుల విజృంభణ మిచ్చట కొంతకాల మాఁపఁబడియెను. జర్మనులు సయితము మహారమయిన నష్టములను పొందిరి. నారూనదిని దాఁటనీయకుండ రష్యనులు నత్యంత పరాక్రమముతో డీకొనిరి.

జూలయి 26, 27 వ తేదీలను జర్మనులు ముందు అడుగు పెట్టకుండ నాఁపబడిరి. జనరలు వాన్ మెకిన్సను రష్యావారి తీవ్రతకు నత్యాశ్చర్యము నొందెను. కాని వార్సాను వదలిపెట్టి పోవలసిన కాలము వచ్చిన దని రష్యనులు తెలిసికొనిరి. వారికి జర్మనులకున్నంత మందుగుండు సామాను లేకపోయెను. జర్మనుల కున్న అత్యంత రయిలు సౌకర్యములు లేవు. జర్మనుల కున్న సిద్ధ సైన్యములు లేవు. జర్మనులు వార్సా యుద్ధములో ఒక్కొక్క రష్యను సైనికునికి ఒక్క షెల్లు వంతున నొక్క దినములో 4 లక్షుల షెల్లులను వేసినప్పుడు అంత సరఫరా లేని రష్యనులు తత్కాలము వార్సాను వదలుటకు నిశ్చయించుకొనవలసి వచ్చెననుటలో నాశ్చర్యమేమి? 28-29 జూలయి తేదీలను రష్యనులు లుబ్లినునుండి ఖోలం వఱకు గీయఁబడిన పంక్తినివదలి వేఱుస్థానములకు పోయిరి. 30 వ తేదిన ఆస్ట్రియను గట్టుపుసేన లుబ్లినులో ప్రవేశించెను. మఱునాడు ఖోలం మాక్రమించుకొనఁబడియెను.

## కూరు లాండులో పోరు

తూర్పున రెండవ రంగమగు కూరులాండులో జర్మనులు మిటావద్దకు వచ్చిరి. ఈ ప్రయత్నములు వార్సాలో రష్యా సేనలను తగ్గించి, రష్యనులకు రెండు చోట్ల తొందర కలిగించుటకయి చేయఁబడినట్టివి. మిటా రయిలులు కలియు పట్టణము. యుద్ధరంగములో ప్రాముఖ్య మయినట్టిది. ఇది పడుటతో రీగాకు మార్గము సులభసాధ్యమయ్యెను. రష్యనులు కఠినముగా పోరాడిరిగాని మిటానువదల లేదు. జర్మనులు విషవాయువుల నధికముగాఁ బ్రయోగించిరి. 1000 మంది జర్మనులకు, 1000 మంది రష్యనులకు ఈ పోరులో ఖయిదీలు దొరకిరి. ఆస్ట్రియనులు బగ్‌నదిని దాఁటి వ్లాడిమిర్‌మీఁదికి వెళ్లుచుండిరి.

## వార్సా ఖాళీచేయబడుట

ఈ నగరము పశటకుముందు జనసంఖ్యలో సగము భాగము విడిచి వెళ్లిపోయెను. రష్యనులు తీసికొని పోవలసిన సామానును, సైనికులను ముందుగా తీసికొని వెడలిరి. యంత్రసామానులు, రయి

ంవేగనులు, సర్వ యుద్ధసామగ్రియును తర్లింపబడెను. రాగి టెలిగ్రాఫు తీగెలు, దేవాలయముల గంటలు సయితము పంపివేయఁబడెను. రయిలులమీఁద నెక్కింప వీలు లేని సామానలు తుపాకిమందుతో ప్రేల్చబడిన తరువాత ముక్కలు రయిలులమీఁద నెక్కింపఁబడెను.

## తొందరలలోఁ గూడినవారము

ఆగస్టు 14 మొదలు 21-వ తేది వఱకును రష్యనులకు శత్రువులచేత తొందర లధికముగా నుండెను. 1914 వ సంవత్సరములో ఆగస్టు సెప్టెంబరు నెలలలో ఫ్రెంచి బ్రిటీషు సైన్యములు బెల్జియమునుండి మార్నె వఱకు తఱుమఁబడినప్పుడు కలిగినతొందర రష్యనుల కీవారమునందు కలిగెను. రష్యను సైన్యము లన్నితావులను వెనుకకు మరలి ఒకచోట కలిసికొని, తిరిగి పోరఁగలుగుటకయి పారిపోవుచుండెను. జర్మనులు తిరిగి రష్యాలేవకుండ చావుదెబ్బలనిప్పుడె కొట్టవలయునను ఆశను పెట్టుకొని యుండిరి. కాని రష్యనులు తమ సైన్యములు పూర్తిగా సంహరింపఁబడకుండ వెనుకకు తీసికొనిపోగలుగుట గొప్ప జయమనియే యనవలయును. నోవోజార్జియెవిస్క కోటలో కొంత సైన్యమును రష్యను లుంచి వెళ్లిరి. పదుము దినములు శత్రువులీకోటపయి ఫిరంగిధారలను జొప్పించిరి. కోటలు పొడిపొడియయ్యెను. 19-వ తేదిని ఈకోట శత్రుమండలి వారి వశమయినది. 700 రష్యను ఫిరంగులు, 80,000 ఖయిదీలు శత్రువుల స్వాధీనమయిరి.



వార్సావద్ద వంతెనలను రష్యనులు డైనమైటుపెట్టి భస్మముచేసి వెడలిపోవుట

## నీమెన్ కోట పడుట

ఇంతమాత్రమే కాదు మూఁడువారములు కోవ్నోకోటను రష్యను సైన్యములు మహాపరాక్రమముతోఁ గాపాడెను. ఈకోటలు ఆస్ట్రోజర్మనుల్ల పెద్ద ఫిరంగులదెబ్బలకు తాళఁజాలకపోయెను. కాని కోటమాత్రము పడలేదు. 20-వ తేదిని నీమెన్‌కోటలు మార్షలు వాన్ హిండెన్‌బర్గుగారి వశమయ్యెను. ఇది రష్యనులకు గొప్ప అపజయము ఏలయనగా హిండెనుబర్గుగారు కూరులాండులోను, దక్షిణమున పోలండులోను పోరుచున్న రష్యను సైన్యములను రెండుగా చీల్పఁగలిగిరి. బ్రెస్టులిటోవిస్కునుండి గీతగీచినచో నేర్పడు ప్రాంత్యమును రష్యనులు వదలివేసిరి విల్నా డ్వినుస్క ప్రాంతములకు జేరిరి. ఈ విల్నా ప్రాంత్యమును వదలివేయుటకును రష్యను సేనాని గ్రాండు డ్యూక్ నికోలస్ గారు సిద్ధపడిరి. ఆయపజయములవలన వారూః దీర్ఘాగములను రష్యనులు వదలిపెట్టవలసి వచ్చెను. లోమ్జా మొదలగు కోటలు చాల విడవాడఁబడెను. విశ్చులా—బగ్గునదుల సంగమ ప్రదేశమగు నోవో జార్జి యెూవిస్కనద్దనున్న గట్టికోటలలో కొంతసేన యుంచబడెను. కాని ఆధునిక యుద్ధములో గట్టి కోటలవలన లాభము లేదని తేలినది. ఒక కోట కొంతస్థలము నాక్రమించుకొనును. అందు సైన్యములు, సామానులు పేర్వఁబడి యుంచఁబడును. ఆధునికమగు నేల ఫిరంగులు తొమ్మిదిమైళ్లు దూరము పారుచున్నవి. కొన్నిచోట్ల ఇరువదిగుల వారు మ కొన్ని కోటలమీఁద వెయ్యి, పదుమూఁడు వందల ఫిరంగులను ఒక్క పర్యాయము గుఱిపెట్టి కాల్చిరి. ఇన్ని ఫిరంగి గుండ్లు ఒక్క మయిలు, రెండు మయిళ్ల పొడుగున కోట యున్నను ఒక్క పర్యాయము వచ్చి పడునప్పుడు ఆ కోటలో ఒక్క గజమయినను ఫిరంగి గుండు పడని తావు ఉండదు. అందుచే నేలలో కందకములు త్రవ్వుకొని పెక్కు మయిళ్ల పొడుగున భూమిని ఆక్రమించుకొని, నేలలో దాఁగి యున్నప్పుడె ఆధునిక ఫిరంగుల ముందు తాళఁజాలుదురు గాని ఒక్క చిన్న కోటలో పెక్కువేల సైన్యము

లుండినయెడల గ్రుక్కతిరుగక బోనులోని ఎలుకవలె కొట్టుకొనెదరు. ఇది గొప్పసైనిక యింజనీయరుల యభిప్రాయము. అందువలననే కందకయుద్ధమునకయి గ్రెనేడులు, ట్రెంచి మోర్టరులు, చేతి బాంబులు, మొదలగు కొలఁది దూరము పోవు సాధనములు నిర్మింపఁబడినవి. కూరులాండులో రీగా నాక్రమించుటకయి జర్మనులు ప్రయత్నములను జేయుచునే యుండిరి. "ఆ" నదిమీఁద జరిగిన పోరులో జర్మనులు వెనుకకు మరల వలసి వచ్చెను. ఈ కూరులాండు రంగమందే డ్వినుస్కు, జాకోబ్‌స్టాడ్, లిటోక్కుమిర్ అను తావుల రష్యనులు జర్మనీయులను ముందునకు రాకుండ ఆఁపివేసిరి. కోవ్నోదుర్గము మీఁద జర్మను లుగ్రముగా వచ్చిపడిరి. ఇట్లు చేయుటవలన వారి యుద్దేశము పోలండులోని రష్యను సైన్యమునకు, కూరులాండులోని సైన్యమునకు సంబంధము త్రెంపవలయునని. ఫిరంగులను ముప్పుతిప్పలుగా వేసిరి. కాల్బలములు పెక్కుసార్లు ముందునకు సాగెను. కానిగొప్ప నష్టముతో తఱిమివేయఁబడెను. రష్యసేనలు నాశనము గాక వెనుకకు పోవుచు తరలుటచేత, జర్మనులును పెద్దపెద్దసేనలను నష్టపడిపోయిన వారగుటచే వానికి బదులుగా వారి దేశమునుండి క్రొత్తసేనలను తెప్పించుకొని జయించిన భూమిని ఎక్కువ జాగ్రత్తతో కాయవలసివచ్చెను.

రీగాను పట్టుకొనుటకు జర్మనుల కింతవరకును వీలుపడక పోయెను. నదులలో వీరు చిక్కుకొనిరి. బౌస్కుకద్ద తీవ్రముగా యుద్ధము జరిగెను. వాన్‌హిండెన్‌బర్గు ముందుకు పోవుటకు వీలుపడలేదు. 'ఆ' నదికి వెనుక ఓలొక్కుమిరులోనికి జర్మనులు త్రోయబడిరి. ఒస్సొవిట్జుకోట మీఁదను జర్మనీయు లతి తీక్ష్ణముగా ఫిరంగి బారులను వదలిరి. ఆకోటయు పడిపోయెను.

## ఏడ్రియాటికు సముద్రము

ఆస్ట్రియామీఁద యుద్ధము ప్రకటింపబడగానే ఈసముద్ర ద్వారములను ఫ్రాంసు బంధించెను. ఆస్ట్రియను యుద్ధనావలు ఫ్రెంచి నావలతో పోరాడలేక వాని జలాశ్రయములకు, పోలా, ట్రీస్టు, మాన్‌ఫాల్‌కోనులలో దాగియుండెను. ఆస్ట్రియా పరదేశములతో జేయుచున్న వర్తకము అంతరించెను. ఇటలీయును యుద్ధము ప్రకటించినందున ఇటాలియను నావలు ఫ్రెంచినావలకే తీరమున మరింత తోడ్పడినవి. తటస్థదేశముల వర్తకము ఇటలీ రేవులతో మాత్రమే జరుగుచున్నది. ఈతీరమున ఆస్ట్రియనులు సముద్రములో వదలిన గనికి తగిలి ఫ్రెంచివారి "గాంబెట్టా" యను క్రూసరు మునిగిపోయెను.

## బాల్టికు సముద్రము

ఈ సముద్రములో జర్మనులకును, రష్యనులకును యుద్ధనావలు కలవు. జూన్ 28-వ తేదిని కొన్నినావలతో రష్యారేవు అగు లిండామీద జర్మనులు కాల్చిరి. పట్టణమునకు విశేషనష్టము కలుగలేదు. ఒక జర్మను డిస్ట్రాయరు గనితగిలి మునిగిపోయెను. రష్యావారి డిస్ట్రాయరుయుద్ధనావలు కనపడగానే జర్మను నావలు పరుగెత్తిపోయెను. జూలయి 2-వ తేది యుదయము 8 గంటలకు రష్యావారి క్రూసరులు మాకరోఫ్, బేయన్, రూరిక్, బోగటైర్ అను వానిమీద జర్మను సబ్మెరయినులు టార్పెడోలను వేయుటకయి ప్రయత్నించెను. రష్యనులును తమ్మెదుర్కొనిన నావలు దక్షిణమునకు పారిపోకుండ కాయుచుండిరి. జర్మనులు కొన్ని డిస్ట్రాయరులను, ఆగ్సుబర్గుఅను క్రూసరును, గనులను సముద్రములో వదలు ఆల్బట్రాసు అను నావనుమట్టుకె కలిగియుండిరి. రష్యనుల బలమధికమగుటవలన జర్మనులు పరుగెత్తిపోవ నారంభించిరి. మంచు శత్రునావలు కనపడకుండ కురియుచుండెను. రష్యనులకు కనపడకుండుటకయి జర్మను నావలు ఊరక నల్లపొగను సయితము విడిచెను. ఆల్బట్రాసు దెబ్బలు తిని స్వీడను తీరములోనున్న గోట్లాండు లంకలో శరణుజొచ్చెను.

సబ్మెరయినులుండు స్థలములోనికి పోనొల్లక రష్యనునావలు వెనుకకు మరలగా 10 గంటలవేళ జర్మనులవి "రూను" అను క్రూసరు, బ్రిమెన్ తరగతి క్రూసరు యింకొకటి, నాల్గుడిస్ట్రాయరులు రష్యను నావలకు కనపడెను. రష్యనులు తక్షణమే యుద్ధము ప్రారంభించిరి 'రూను' యొక్క 8 ఇంచి ఫిరంగులు 'రూరిక్' యొక్క 10 ఇంచి ఫిరంగుల ముందు చాలక నాశనమాయెను. రూనునుండి గొప్ప మంటలు బయలుదేరినవి. తరువాత యీనావ యేమయినదియు తెలియదు. మిగిలిన జర్మను నావలు పరుగెత్తిపోయెను. రష్యనుల డిస్ట్రాయరు "యెజలెల్నీ" అను దానికి టార్పెడో దెబ్బ యొకటి తగిలెను కాని మునుగక రష్యను నావాశ్రయమును చేరగలిగెను. ఇంతలో జర్మనుల మొదటితరగతి యుద్ధనావలు వారి క్రూసరులు సహాయార్థము వచ్చెను రష్యనునావలు తిరిగి తలపడెను. 16,800 టన్నుల పెద్ద యుద్ధనావ "డ్యూచ్చిలాండు" వంటిది రెండు రష్యను టార్పెడోలకు గురియయ్యెను. రష్యనులు ఈనావ బ్రద్దలయ్యెనని ప్రకటించిరి

## రీగా రేవుదగ్గర సముద్రయుద్ధము

ఆగస్టునెలలో రీగా సింధుశాఖలోనున్న రీగా పట్టణమును సముద్రముమీద పోరి పట్టుకొనుటకయి జర్మనులు యుద్ధనావలను పంపిరి. యుద్ధనావలు జయమందిన తరువాత నగరములో దిగుటకయి పొగనావలలో సైనికు లెక్కింపబడి సిద్ధముగానుంచబడిరి. రేవులోనుండు గనులను తీసివేయుటకయి కొన్ని గనులపడవలు పంపబడియెను. జర్మనుల డిస్ట్రాయరులను రష్యాయుద్ధనావలు తరుమగొట్టెను. కాని ఆగస్టు 18, 19-వ తేదులలో క్రూసరులను వెంటబెట్టుకొని డిస్ట్రాయరులు ముందుగా వచ్చెను. ఈరేవులో దిగి పెట్రోగ్రడు నగరమును రీగాతోకలుపు 350 మైళ్ల రైలు నాక్రమించుకొని రష్యా రాజధానికి తొందర కలుగజేయవలయునని రష్యనులు తలంచిరి. జర్మనులు 700 మొదలు 1500 వరకు సైనికులను నేలమీఁద నొకదిక్కున దింపగల జయమును సయితము పొందిరి. తరువాత సముద్రయుద్ధములో రష్యావారి సివోచ్ అను గన్బోటు మునిగిపోయెను.

ఈబోటు మునిగిపోవకముందు ఒక జర్మను డెస్ట్రాయరును ముంచి వేసెను. ఇంతలో నేలమీద దిగిన 1000 జర్మను సైనికులను రష్యను సైనికులు ధ్వంసము చేసిరి. జర్మనుయుద్ధనావలు రష్యను నావలతో బోరాడలేక వెన్నుజూపెను. 21-వ ఆగస్టున రీగా సింధుశాఖలో జర్మనుల నావలు అంతర్ధానమయ్యెను. ఈ సముద్రపు పోరాటములో ఒకటో రెండో క్రూసరులను 8 డిస్ట్రాయరులను, ఒక సబ్మెరయినును జర్మనులు పోగొట్టుకొనిరి.

## ఇటాలియను రంగము

కాడోరు రణరంగ ముఖమున ఇటాలియనులు గొప్పసాహసముతో ముందుకు వెళ్లుచుండిరి. ఇది పర్వతయుద్ధము. ఫిరంగులను సర్వవస్తువులను వేలకువేల అడుగుల యెత్తున పయికెక్కించవలయును. ఆస్ట్రియనులు అనేక సంవత్సరములనుండియు తమస్థానములలో కోట్లకు కోట్లు ధనము వ్యయము చేసి దుర్భేద్యములగు కోటలను నిర్మించియున్నారు. పదిమంది ఆస్ట్రియను లాకకోటలో నుండి సరిగాపోరాడిరేని ఎంతమంది శత్రువుల నయినను నిలిపియుంచవచ్చును. అందుచే యుద్ధములోదిగి 1 సం. దాటినను ఇటాలియనులు గబగబ కోటలను పట్టుకొని హంగరీ మాగాణముల లోనికి కొండలుదిగి ప్రవేశించనేలేదు. వారిసంకల్ప సిద్ధికి మరికొంతకాలము పట్టును కొన్ని లక్షలమంది ఆస్ట్రియనులను నిరంతరము రణరంగమునకు పోనీయకుండ ఈ కొండలలో పట్టియుంచుట ఇటలీ మిత్రమండలికి చేయుచున్న యుపకారములలో నొక్కటి. కోర్టినా ఆంపెజ్జోను పట్టుకొని మంచిస్థానమును ఇటాలియనులు సంపాదించిరి. ఫొర్లెరిగోను పట్టుకొనుటవలన దానిపయిన పెద్దపర్వతము మీద నున్న పెసో డిసిక్రియామీద ఫిరంగులను ప్రయోగించుటకు వీలు కలిగెను. కోర్టినా పీఠభూమి నంతయు ఫిరంగులతో తుడుచుటకు వీలుకల మాంటెటో ఫనీ ఇటాలియనుల చేతులలో బడుటయు అదృష్టము. కోర్టినానుండి $4\frac{1}{2}$ మైళ్లు పైకెక్కినగాని మాంటెటోఫెనో రాదు. ఒక్కరాయి జారిపడినను శత్రువులకు మెలకువ కలిగించు శిఖరముపై రాత్రివూట ఇటాలియను లెగబ్రాకి పట్టుకొనుట ప్రశంసనీయము.



ఇటాలియనులు ఆల్ప్సునిఖలు పర్వత శిఖరములకు ప్రాకుటకము

## గల్లిపోలి రంగము

ఫ్రెంచి, ఇంగ్లీషు, ఆస్ట్రేలియను, న్యూజిలాండు సేన లీరంగమునందు నిగుటయే బహుకష్టతరమయ్యెను. టర్కీవారి ఫిరంగులు సముద్రతీరము నంతయు తుడుచుచుండగా సేనలనుదించిన మిత్రమండలి సేనానులు బహు ప్రశంసింపబడిరి. బ్రిటీషు ఫ్రెంచి యుద్ధనావ లీకార్యమునకయి యెంతో సహాయపడెను. ఈ నావలు తుపాకుల మీద కురిపించి వారికి గుక్కత్రిప్పుకొనుటకు వీలు లేనట్లు చేసెను. బులెయిర్ మీద నవి అమితముగా గాల్చెను. గల్లిపోలికి బాహ్యలోకముతో సంబంధము లేకుండ చేయబడెను. బ్రిటీషు అంతర్గాములు జలసంధిలో ప్రవేశించి చాలదూరము వెళ్లి తురుష్కనావలను ముంచి, సముద్రవర్తకమును పాడుచేసి వచ్చుచుండెను. జర్మను లీ సమయమునసే వారి సేవకు ఎమ్డెను నుండి అంతర్గాములను మధ్యధరా సముద్రమునకును, ఆసియామైనరులోని కొన్ని దీవులకును గ్రీసుద్వీపములకును పంపిరి. వారియుద్దేశము గల్లిపోలికి వెళ్లుచున్న మిత్రమండలివారి సైన్యపునావలను, కొన్ని యుద్ధనావలను ముంచవలయునని. అంతర్గాములు 4000 మైళ్లదూరముకంటె హెచ్చుదూరము నాగెచాలక వెళ్లలేవు. జర్మనులు కూనె తటాకములను అంతర్గాములకు జతపఱచి పంపిరి. అందువలన నింతదూర

మవి రాగలిగెను. ఈ ఆసియా మైనరు, లోను గ్రీసులంకలలోను వాని కొఱకయి నూనె సిద్ధముగా నుంచబడెనట. గ్రీసురాజు కాన్‌స్టెంటయను (కెయిజరు బావమరిది) తన దేశపు లంకలలో నూనె కొట్లు లను జేసెనని మిత్రమండలికి కావలసినంత ఋజువు సయితము దొరికెను.

## నైరృతి ఆఫ్రికా

ఇది జర్మనీవారిది. దేశపు విస్తీర్ణము బ్రిటీషు ద్వీపములు, బెల్జియము, హాలెండు కలిపిన ఎంతో అంత. మే 12-వ తేదితో ఈ భాగమునందు యుద్ధమంతరించెననియే చెప్పవచ్చును. వర్తకాను కూలముగల దక్షిణభాగము దక్షిణాఫ్రికాలోని బ్రిటిషు గవర్నమెంటువారి చేతిక్రింద ఇచ్చట గయి లుతో సహా నున్నది. స్వాకోపుమండునుండి బయలు దేరిన భోథాగారి సైన్యములు విండోకు నాక్రమింపుకొనెను. ఇచ్చటనే జనరలు వాండరు వెంటరుగారు బోథాగారితో కలిసిరి. నమీబు ఎడారిలోని గ్రేట్ స్కోప్సు, స్వాకోపునదివీూది జెక్సు, బింగాన్వెకొండలగు చోట్ల జర్మనులు సాహసముతో బోరిరి. విండోకు వద్ద 3000 యూరోపియనులు, 12,000 మంది దేశీయ సైన్యము ఖయిదీలుగా పట్టుకొనబడిరి. బెర్లినుతో సయితము సంబంధముగల తీగలేనితంత్రీకా ర్యాలయము విజయులవశ మయ్యెను. దక్షిణాఫ్రికా సేనలకు కావలసినంత యితరసామగ్రి లభించెను. జర్మనుసేన ఉత్తరముగా పారిపోయెను. ఈ సైన్యము పోయినను సైన్యమునకు తొందర అప్పుడప్పుడు కలుగకయుండవలెననియే బోథాగారు తమ సైన్యమునంతయు నచ్చటనుంచి జొహానెస్ బర్గుకు వెళ్లిరి. ఈ జయమునకయి మిత్రమండలివారును, బ్రిటిషుసామ్రాజ్యమును నీయన నధికముగా నభినందించెను. దక్షిణాఫ్రికాలో బోథాగారి కొనరింపబడిన సపర్యలకు లెక్కలేదు. బోథాగారు వదలిపెట్టి పోయినసైన్య మూరకుండక పరుగెత్తిపోయిన జర్మనుసైనికుల వెంటనంటెను. రెండుభాగములుగా చీలి రయిలు ఉత్తరముగా నడచినసేన జూన్ 20-వ తేదిన ఒటీయివారంగో అను స్థలము నాక్రమించుకొనెను. తూర్పుదిశను వెళ్లినసేన కొండలలో జొరబడి నడిచి ఆ సమయమందే వాటరుబర్గు నాక్రమించుకొనెను. ఒటీయివారంగో, ఒటీయు స్థానములనుండి మరియొక సేన జనరలు బ్రిట్సుగారి క్రింద పడమట ఓట్జువరకును వెళ్లి, అచ్చటనుండి ఎతోషాపాన్ వైపునకు మరలి 200 మైళ్లు నామటోని ముఖమున నడిచెను. జూలయి 1-వ తేదిన ఒటావినగరమును జనరలు మేబర్గుగారి సైన్య మాక్రమించుకొనెను. అంతట ఈ సేనాధిపతి ఉత్తరమున నామేబు వద్దకు వెళ్లెను. జర్మనుసేన వాన్‌క్లీసుక్రింద ఘూబు వద్ద నీయన నెదుర్కొనెను. జర్మను లోడిపోయి పరుగెత్తిరి. ఈ సేనాధిపతి మరి ముందునకు నడిచి పోయెను. జూలయి 9-వ తేదిని జర్మను గవర్నరు సీజుగారు నైరృతి ఆఫ్రికాలోని సైన్యములు బోథాగారి వశమగునని రాయబారములనంపి వారివశ మయ్యెను. ఈ దేశమంతయు దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారి చేతిలో బోథాగారి ముఖ్యమంత్రిత్వముక్రింద కలదు. దీని వైశాల్యము 3,22,000 చతురపు మయిళ్లు, లేక ఇంగ్లండు వైశాల్యమునకు ఆరురెట్లు.



[illegible]



[illegible]

## ఆగస్టునెలాంతమున యుద్ధస్థితి

వార్సాపడిపోవుటచేతను, జర్మను సేనలు చెదరుటచేతను, పశ్చిమమున మిత్రమండలి బెల్జియమునుగాని, ఫ్రాన్సునుగాని జర్మనులు వదలిపోవునట్లింతవరకును చేయలేక పోవుటచేతను జర్మనులు క్రొత్తవ్యూహములను పన్నుచుండిరి. అవియేవన.

(1) పెట్రోగ్రాడును ముట్టడించుట

(2) మధ్య రష్యాలో ప్రవేశించి రష్యను సైన్యముల నాశనమొందించుట. లేక యుద్ధమునకు పనికిరాకుండ జేయుట.

(3) ఇంగ్లండు, ఫ్రాంసులపయి పశ్చిమరంగమున విజృంభించుట.

(4) సర్వియా నాక్రమించుకొనుట. రుమానియాలో జొరబడుట. బల్గేరియా, ఆల్బేనియాలను వశము జేసికొని తుర్కికి కావలసిన సహాయమును జేయుట.

రష్యను సైన్యముల వినాశముచేయదలచిన సంకల్పమింత వరకును సిద్ధింపలేదు. జర్మనీకిని గొప్ప సైన్యనష్టము కలిగి బలహీనమైనది. వార్సాచుట్టును జరుగుచున్న యుద్ధముల యుద్దేశము రష్యను సైన్యముల చుట్టును క్రమ్ముకొనవలయు నని. ఒకవేళ ఇది సాధ్యము కానిచో, రీగా ప్రాంత్యమున జరగుచున్న యత్నములవలన పెట్రోగ్రాడును పట్టుకొనవలయునని. ఒకవేళ పెట్రోగ్రాడును సంరక్షించు కందకములు, కోటలు, వశము కానిచో నా రాజధానీనగరము చుట్టును రయిలులను పట్టుకొని ఇతర ప్రాంతములతో సంబంధము లేకుండ జేయవచ్చును. రాజధాని కీ దురవస్థ సంభవించుట జేశముండంతట నష్టైక్యమును పురికొల్పను. ఈవిధముగా పెట్రోగ్రాడు సమీపమున జరిగిన యెడల, 2000 మైళ్ల భూమిలో తూర్పు రంగమందు పేర్పబడిన లు ఇతరరంగములకు పంపుటకు వీలుకలుగును.



భోధాగారి సైనికులు జర్మను పతాకమును పట్టుకొనుట

## పశ్చిమరంగము

ఇక పశ్చిమమున మిత్రమండలివారి స్థానములు సెప్టెంబరు 1914 మొదలు సెప్టెంబరు 1915 లోపల నపరిమితముగా బలపడినవి. ప్యారిసును పట్టుకొనుట, ఇంగ్లండుమీద దాడి కలలోనివార్తలయినవి. ఈరంగమున శత్రువులు తమ్ము తఱిమివేయకుండ జర్మనీయులు తమ స్థానములను కాపాడుకొనినచో జాలును. 1914 ఆగస్టు సెప్టెంబరులలో జరిగిన మార్నుయుద్ధము మొదలు వైప్రెసు యుద్ధమువరకును జర్మనీ తానుకావలసినంత నష్టమును పొంది తన శత్రువులకు కావలసినంత నష్టమును కలుగజేసినదే గాని ఫ్రాంకో-బ్రిటిషు సేనలను రూపుమాపలేకపోయెను. దినదినమును వారి బలము వృద్ధియగుచున్నది. వారికి యుద్ధపరికరములు జర్మనీకంటె నధికముగా గలవు. సముద్ర మార్గములు వారిచేతిలో నుండుటచే ఇండియా, ఆస్ట్రేలియా, కానడ, మొదలగు దేశములనుండియు అమెరికా నుండియు యుద్ధసామగ్రులను సైన్యములను భోజన పదార్థములను నిరభ్యంతరముగా దెప్పించుకొనుచున్నారు. వారి వర్తకము సాగుచున్నది. జర్మనులది అంతరించినది. కాబట్టి పశ్చిమమున ఎవరు తొందరలేక దీర్ఘకాలము నిలువగలరో వారిది జయ మని తేలినది.

## సర్బియా

ఇక సర్బియామీద పడుటకయి క్రాకౌ, వార్సా, వియన్నా నుండి సైన్యములు బయలుదేఱినను 500 మైళ్ల దేశమును కొండలను దాటి ప్రవేశింపవలయును. కాని యింత బలము ముందు సర్వియా ఆగజాలదనుట నిజము. డార్డనల్సు గల్లిపోలీలో నున్న మిత్రమండలి సేనలవలన నానా అవస్థ పడుచున్న తుర్కికి

జర్మనులు సహాయము జేయుట కేవల మావశ్యకమయినది. బల్గేరియా యెవరి పయిపున జేరునో ఆగస్టునెలలో యింకను తేలలేదు. ఇటాలియనుల తొందరచే కష్టపడుచున్న ఆస్ట్రియనులకు కొంత సహాయము చేయుట అగత్యమని తలంప బడెను. ఆగస్టు నెలాంతమున యుద్ధస్థితి ఈ విధముగా నుండెను.

## పశ్చిమరంగము

ఆగస్టు 27 సెప్టెంబరు 4

ఈ వారమునందు కందకముల యుద్ధములో వ్రాయవలసిన విశేషము లేవియును లేకపోయినను విమానముల పోరాటము హెచ్చుగానుండెను. ఫ్రెంచివారి 62 విమానములు నాలుగు దళములుగా చీలి లోరెయినులోని డిల్లింజన్‌లో షెల్లులనుచేయు జర్మను కర్మాగారముపయిన 150 బాంబులను వేసెను. జర్మనులు వీనిలో నాలుగింటిని ధ్వంసముచేసితిమని యనిరి. వోవరులోని, డాన్స, బాసాలోనున్న సైన్యశిబిరములపై 25-వ తేదిని పరాసు విమానములు బాంబులను కురిపించెను. గ్రాండిఫాటెల్, ఫ్లేవిల్లీ, సెర్గున



అశ్వసైనికుని మీఁదబాంబు పడుట

ఘరలమీఁదను, విగ్రేలోనుండు విమానముల గృహములమీఁదను, శాయిలెస్స రయిలుస్టేషనుమీఁదను బాంబులు వేయఁబడినవి. బ్రిటీషు, ఫ్రెంచి, బెల్జియము వైమానికులు ఉత్తరదిక్కునందలి హౌతుల్స్ట అడవిపై (సైన్యములం డుండును) బాంబులను విడిచి వచ్చెను. వైమానికులందఱును సురక్షితముగా వచ్చిరి. 28-వ తేదిని జర్మను వైమానికులు పేరిసుమీఁద బాంబులనువేయుచు రాఁగా పరాసు విమానములు పారఁదోలెను. నేలమీఁది యుద్ధము ఫిరంగులతో



ఫ్రెంచి వైమానికుడు జర్మనువిమానముమీద కాల్చుట

పోరాడఁబడినది. వోస్జెసు, ఆర్గోన్నిలలో పరాసులు ముందునకు నెమ్మదినెమ్మదిగా పోవుచున్నారు.

## ఆల్సేసు

సెప్టెంబరు మొదటివారమునాఁటికి లింగికోప్ మొదలు మన్‌స్టర్, గ్యూబువిల్లర్ లను దాఁటి థానువఱకు వెళ్లుగిరి కిరుముఖములను శత్రుసైన్యములుండెను. లింగికోప్‌వద్ద పోరు దిట్టముగా జరిగినది. మన్‌స్టరు జర్మనుల చేతిలోనే యుండెను. ఈనగరమునకు పశ్చిమమున పోరాటము జరిగినది. లింగి, శ్వారన్‌కోఫ్ శిఖరముల మీఁద జూలయినెలలో ప్రారంభింపఁబడిన యుద్ధము ఆగస్టు మాసాంతమున కంతరించెను. ఆశిఖరములు ఫ్రెంచివారివశ మయ్యెను. మన్‌స్టరు కిరుప్రక్కల ఫ్రెంచివారు జయించినస్థలమునుండి ఆపట్టణములోని జర్మనులకు తొందర కలుగజేయుచుండిరి

సెప్టెంబరు 4—18

ఫిరంగుల యుద్ధము, చేతి బాంబులను విసరుకొనుట పశ్చిమరంగమున 14 దినములలో ఎంతమాత్రమును తగ్గలేదు. దినదినము మరింత హెచ్చుచుండెను. ఏయినః- మార్నె కాలువ ఒడ్డుననున్న సాపిగ్నులు బ్రిడ్జిహెడ్డునుండి పరాసులను తఱుముటకయి శత్రువులు ప్రయత్నించిరి. మూఁడుదినము లిచ్చట ద్వంద్వయుద్ధము జరిగెను, జర్మనులు లెంత విరామము లేకుండ పోరినను ఫ్రెంచివారిని బ్రిడ్జిహెడ్డునుండి కదలింప లేకపోయిరి. షాంపేనులో శత్రువు శతఘ్నిదళశక్తి బలహీనముగా నుండెను. ఈ భర్తిపూర్తికిఁ

మ్యూజుశిఖరముల మీఁద గిరంకులను ధరిపించిరి ఫ్రెంచివారు జర్మనుల గతుకస్థానములను పాడుచేసి శిఖరములను కాపాడిరి

బ్రిటీషు ముఖమున గనుల నొండోరులు ప్రేల్చిరని సర్ జాన్ ఫ్రెంచిగారు ప్రకటించిరి వైప్రెసు పరిసరములలో ఘోరంగి యుద్ధము జరిగను.

## ఆర్గొన్నిలో జర్మను యువరాజు

(సెప్టెంబరు 4-సెప్టెంబరు 30)

కడచిన ఆ ఎనిమిది వారముల నుండియు ఆర్గొన్నిలో జర్మనుయువరాజు వెర్డనును పట్టుకొని, వెర్డనునుండి పేరిసుకు వెళ్లు గొప్పరయిలువే లయినను ఆక్రమించుకొనవలయునని భగీరథ ప్రయత్నములను జేయుచుండెను. బినార్విల్లీదగ్గఱనున్న స్థానములపయి లిన్నెలీ ఛాటారోడ్డుపయి, మేరీ థెరిసే పయి, వారి ఉగ్రము నంతయు జర్మనులు చూపిరి. బినార్విల్లీ రోడ్డుదగ్గఱ యుద్ధము అతిపరాక్రమముతో జరిగినది. జర్మనులు ఎంతనష్టము వచ్చినను అణుమాత్రమయినను లెక్క సేసినవారు కారు. ఎక్కువ పట్టుదలతో పోరిరి. తరువాత ఈ యుద్ధము కోర్టుఛాసీ మొదలు లాహారాజీవఱకును, లాహారాజీ మొదలు బినార్విల్లివఱకును అన్ని ముఖములకును వ్యాపించెను రెండుచోట్ల మాత్రము జర్మనులు ఫ్రెంచి పంక్తులలో చొరబడఁగలిగిరి. మేరీథెరీసే వద్ద జర్మను లెక్కువ యుద్ధప్రయత్నంతులయిరి 1¼ మయిళ్ల పొడుగు 1500 గజము వెడల్పుగల ఫ్రెంచి కందకముల నాక్రమించుకొనఁగలిగిరి జర్మనులు 30 ఫ్రెంచి యుద్యోగులను, 12000 మంది మనుజులను, 48 యంత్రపుఫిరంగులను, 50 బాంబులు విసరు యంత్రములను పట్టుకొంటి మని ప్రకటించిరి ఫ్రెంచివారు మేరీథెరీసే స్థానములను పోగొట్టుకొంటి మనిరిగాని నష్టముల నొప్పుకొనలేదు

జర్మనులింత సాహసముతో, ఇంత రణరంగముమీఁద ఇన్ని దినములు ప్రాణములకు లెక్క సేయక పోరాగా ఈ స్వల్పలాభమును మాత్రమే పొందగలుగుట యొకగొప్ప గాదు



ద్వంద్వ యుద్ధము

## తూర్పురంగము

రష్యనులు గట్టిగా పోరాడుచు వెనుకకు మరలి పోవుచుండిరి జర్మనీయులు వారిని తరుముచున్నారు. బ్రెస్టొలిటోవిస్కు దగ్గర నేర్పఱచుకొనిన స్థానములకు రష్యనులు వదలి పెట్టిరి. ఆగస్టు 20,21-వ తేదీలను నోవోజార్జియోవిస్కు కోట పడిపోయెను. అందలి సైన్యము 30,000 లకు లోపుగా జర్మనులకు ఖయిదీలయిరి. విశ్చులా నదీభాగములను వదలుటచేత రష్యనులు ఒసోవెట్జో కోటను సయితము వదలి వేయవలసి వచ్చెను. ఇది 22-వ తేదిని ఖాళీచేయబడినది. శత్రువులకు పనికివచ్చునవన్నియు తుపాకిమందు పెట్టి కాల్చివేయబడెను. 23-వ తేదిని కోటను శత్రువు లాక్రమించుకొనిరి 22-వ తేదిని బైల్సుకు వద్ద రష్యనులు జర్మనుల నోడించిరి. ఇతర తావులలో రష్యనులు నెమ్మదిగా వెడలిపోవుచుండిరి. 26-వ తేదిన బ్రెస్టులిటోవిస్కు కోటను వదలివేయుటకు రష్యనులు నిశ్చయించుకొనిరి. వంతెనలు, కోటలు తుపాకిమందులో భస్మముచేయబడెను. సేన వెనుకకు పోయెను. జర్మనులను లోయరు నీమెన్ బగ్గ నదులకు మధ్య తఱిమివేసిన తరువాత, కొన్ని వారములనుండి ఆపిపెట్టియుంచబడిన గలీషియా దండయాత్రను ఆస్ట్రో-జర్మనులు ప్రారంభించిరి. బోహెం-ఎర్మొల్లీ, ఫ్లాంజరు-బాల్జిను సేనాధిపతుల ముందర రష్యనులు (ఇదివరకే వారి సైన్యములు తగ్గిపోయియుండుట వలన) పోరాడ జాలక గలీషియాను వదలి పెట్టుటకు నిశ్చయించుకొని వారి మార్గమంత శత్రువులకు పనికివచ్చు ప్రతివస్తువును తగల పెట్టుచు, గ్రామములను పరశురామప్రీతి జేయుచు వెడలి పోయిరి

## పోలండులో జర్మనులు

రక్షింపలేని కోటలను, రాజకీయ సరిహద్దులను రష్యనులు వదలిపెట్టి విశాలమయిన రణరంగమును సెప్టెంబరు నెలలో ఆక్ర



జర్మనులు ఫ్రెంచి కందకముల నాక్రమించుకొనుట

మించుకొనిరి. సైనికులకు కొంత అలసట తీరుటవలన తిరిగి వారు శత్రువులమీద ధైర్యముతో పోరాడగలరను ఆశ అంకురించెను. ఆగస్టు కడపటి వారములో డ్వీన్స్కు ఫ్రెడ్‌రిచ్‌స్టాడులలో జరిగిన యుద్ధ మెవరికిని అనుకూలముగ లేదు.

నీమెను నదిమీద ఓలిటాయనుచోట జర్మనులు రష్యనుల నోడించి 1600 ఖయిదీలను 17 ఫిరంగులను పట్టుకొనిరని జర్మను అధికారవర్గము ప్రకటించెను. గలీషియాలో రష్యనులు టార్నోపోలు వఱకును తగ్గిపోయిరి ఇదిచూచి ఆస్ట్రో జర్మనులను ఆగస్టు 29-30 తేదులను వారికి విశేష ఒత్తిడి కలుగజేసిరి. కాని శత్రుమండలి బాగుగా దెబ్బలుతిని పరుగెత్తిపోయెను. స్ట్రయిపా ప్రాంత్యమున 700 మంది ఆస్ట్రో జర్మనులు, ౬0 ఫిరంగులు అనేక యంత్ర ఫిరంగులు రష్యనులచే పట్టుకొనబడెను. అనేకమంది శత్రువులిచట హతులయిరి. వికలాంగులయిరి. సెప్టెంబరు 1వ తేదిన నీమను నది మీదనున్న రష్యావారి కడపటికోట వదలివేయబడెను. ఈకోటలో నున్న వస్తువులన్నియును వీలయినంతవఱకు నాశనము చేయబడెను. రష్యనులు వెళ్లునప్పుడు బజారులలో శత్రువులతో బోరిరి. ఈదినముననే స్టయిరునదిమీద నున్న లస్కుఅను కోటసయితము వదలిపెట్టబడెను. స్ట్రయిపానదిని కొంతకాలము ఆస్ట్రో-జర్మనులు దాటకుండ నాపబడిరి. లస్కుకోటలో శత్రుమండలివారు ౬0,000 సంచులు ధాన్యమును పట్టుకొనిరని ప్రకటింపబడెను. సెప్టెంబరు 1, 2వ తేదీలను ఉత్తర, మధ్యరంగములలో పోరుజరిగెను. విల్నాదగ్గర జర్మనులు సామాన్య జయమును బడసిరి. కాని ఫ్రెడరిచ్ స్టాడ్‌వద్ద జర్మనులకుగొప్పజయము సమకూరెను. రష్యారంగము ఆగస్టు నెలాంతమున ఓలిటా మొదలు బయాలీటాకు తూర్పు వఱకును వ్యాపించి యుండెను తరువాత నారూ నదిని గాటి బ్రెస్టులిటోవ్‌స్కుకు తూర్పున ఒకటి రెండు మైళ్లవఱకుండెను సెప్టెంబరు 7వ తేది లోపల రష్యనులు 30 మైళ్లు వెనుకకు తరుమబడిరి. క్రొత్తగీత విల్నాకు సమీపముననున్నది విల్నా మొదలు ఒరానీవఱకును వ్యాపించినది. ఒరానీవద్ద రష్యనులు తలపడి జర్మనులను కొంతకాలము ముందునకు రాకుండజేసిరి గ్రోడ్నోకు తూర్పునను రష్యనులు ధైర్యసాహసములతో బోరిరి కాని రష్యనులను ఈ ప్రాంతమున వోలకోవుస్కువఱకును జర్మనులు పారదోలగలిగిరి సైన్యములున్న గీత గ్రోడ్నో తూర్పుదిశను నీమను నదినిదాటి, వోల్కోవుస్కుకు పడమట వరకునపోయి, నాలుగు రయిలులను దాటి పైప్రిపెట్ చిత్తడి నేల



రష్యనులు తగులబెట్టుచు, పోరాడుచు తరలిపోవుచుండుట



జర్మనులు ఫ్రెంచి కందకముల నాక్రమించుకొనుట

మించుకొనిరి. సైనికులకు కొంత అలసట తీరుటవలన తిరిగి వారు శత్రువులమీద ధైర్యముతో పోరాడగలరను ఆశ అంకురించెను. ఆగస్టు కడపటి వారములో డ్వీన్స్కు ఫ్రెడ్రిచ్ స్టాడులలో జరిగిన యుద్ధ మెవరికిని అనుకూలముగ లేదు.

నీమెను నదిమీద ఓలిటాయనుచోట జర్మనులు రష్యనుల నోడించి 1600 ఖయిదీలను 17 ఫిరంగులను పట్టుకొనిరని జర్మను అధికారవర్గము ప్రకటించెను. గలీషియాలో రష్యనులు టార్నోపోలు వఱకును తగ్గిపోయిరి. ఇదిచూచి ఆస్ట్రో జర్మనులను ఆగస్టు 29-30 తేదులను వారికి విశేష ఒత్తిడి కలుగజేసిరి. కాని శత్రుమండలి బాగుగా దెబ్బలుతిని పరుగెత్తిపోయెను. స్ట్రియిపా ప్రాంత్యమున 700 మంది ఆస్ట్రోజర్మనులు, ౬0 ఫిరంగులు అనేక యంత్ర ఫిరంగులు రష్యనులచే పట్టుకొనబడెను. అనేకమంది శత్రువులిచట హతులయిరి. వికలాంగులయిరి. సెప్టెంబరు 1వ తేదిన నీమను నది మీదనున్న రష్యావారి కడపటికోట వదలివేయబడెను. ఈకోటలో నున్న వస్తువులన్నియును వీలయినంతవఱకు నాశనము చేయబడెను. రష్యనులు వెళ్లునప్పుడు బజారులలో శత్రువులతో బోరిరి. ఈదినముననే స్ట్రయిరునదిమీద నున్న లుస్కు-అను కోటసయితము వదలిపెట్టబడెను. స్ట్రియిపానదిని కొంతకాలము ఆస్ట్రో-జర్మనులు దాటకుండ నాపబడిరి. లుస్కు-కోటలో శత్రుమండలివారు ౬0,000 సంచులు ధాన్యమును పట్టుకొనిరని ప్రకటింపబడెను. సెప్టెంబరు 1, 2వ తేదీలను ఉత్తర, మధ్యరంగములలో పోరుజరిగెను. విల్నాదగ్గర జర్మనులు సామాన్య జయమును బడసిరి. కాని ఫ్రెడరిచ్ స్టాడ్ వద్ద జర్మనులకు గొప్పజయము సమకూరెను. రష్యారంగము ఆగస్టు నెలాంతమున ఓలిటా మొదలు బయాలీటాకు తూర్పు వఱకును వ్యాపించియుండెను. తరువాత నారూ నదిని దాటి బ్రెస్టులిటోవ్స్కు-కు తూర్పున ఒకటి రెండు మైళ్లవఱకుండెను. సెప్టెంబరు 7వ తేదిలోపల రష్యనులు 80 మైళ్లు వెనుకకు తరుమబడిరి. క్రొత్తగీత విల్నాకు సమీపమునన్నది. విల్నా మొదలు ఒరానీకఱకును వ్యాపించినది. ఒరానీవద్ద రష్యనులు తలపడి జర్మనులను కొంతకాలము ముందునకు రాకుండజేసిరి. గ్రోడ్నోకు తూర్పునను రష్యనులు ధైర్యసాహసములతో బోరిరి. కాని రష్యనులను ఈ ప్రాంతమున వోలుకోవుస్కు వఱకును జర్మనులు పారదోలగలిగిరి. సైన్యములున్న గీత గ్రోడ్నో తూర్పుదిశను నీమను నదినిదాటి, వోల్కోవుస్కు పడమట వరకునుపోయి, నాలుగు రయిలులను దాటి ప్రైపెట్ చిత్తడి నేల



రష్యనులు తగులబెట్టుచు, పోరాడుచు తరలిపోవుచుండుట

కఱకునుపోవును. ఈ దేశమంతయు చవుటిపఱ్ఱ బురదతో చిత చిత లాడుచుండును. అందుచే శత్రువులకు కొన్ని ఆటంకములుకలవు

## రష్యాచక్రవర్తి సైన్యాధిపత్యమును వహించుట

రష్యను సర్వసేనాధిపతియగు గ్రాండు డ్యూక్ నికోలస్ గారి వద్దనుండి సేనానాయకత్వమును రష్యను చక్రవర్తిగారే వహించి వారిని కాకేససుకు రాజప్రతినిధిగాను, సర్వసేనాధిపతిగాను నియమించిరి తురుష్కులతో పోరుట యీయనకు పెట్టబడిన పని. జనరలు అలెక్సీఫు రష్యాచక్రవర్తిగారి తరువాత రెండవవారుగా నియోగింపబడెను. ఈమార్పులకు కారణము నికోలసు గారికంటె యౌవనవంతుడగు సేనాధిపతి తూర్పురంగమున నుండవలయునని రష్యా వారికి సంభవించిన అపజయములును నిందుకు మరియొక కారణము. ఉత్తరమున జనరలు రజ్కీ, హిండెను బర్గుతో పోరాడుచుండెను జర్మనులు రజ్కీముందర ఆగిపోవలసివచ్చెను. ఫ్రెడరిచ్ స్టాడును పట్టుకొనినను డ్వీనా నింతవఱకును జర్మనులు పట్టుకొనలేదు. రష్యనులు వారి నాపివేసియుండిరి డ్వీన్స్కునకు పశ్చిమమున అధిక జర్మను సేనల ముందర రష్యనులు వెనుకకు మరలుచుండిరి. విల్నాకు పశ్చిమమున రష్యనులు వారి స్థానముల నన్నింటిని కాపాడుకొనుచుండిరి. గ్రోడ్నోకు తూర్పున జర్మనులు ముందుకు వచ్చిరి. 1800 రష్యను ఖయిదీలను పట్టితిమని ప్రకటించిరి. దక్షిణమున ప్రైపెట్ చిత్తడి నేలలో జర్మను సైన్యములు లియోపాల్డు రాకుమారుని క్రింద నెమ్మదిగా వారి శత్రువులను వెనుకకు త్రోసివేయుచుండిరి. ఇచ్చట జర్మనులు చెడ్డనీటివలనను, ఈగల బాధచేతను ఆహారము లేకను అవస్థపడుచున్నారని తెలియవచ్చెను సెప్టెంబరు 9 12 తారీఖుల మధ్య 6000 ఖయిదీలను పట్టితిమని బర్లినులో నధికారవర్గము ప్రకటించెను



జర్మనులు ఫిరంగులను బురదనేలలో లాగుకొని పోవుచుండుట

దక్షిణమున 29-30 అగస్టు తేదీలను టార్నోపోలు వద్దను రష్యనులు వెడలిపోయిరి ఆస్ట్రియనులు వీరి జాడల మీదనే పరుగులిడుచు వెళ్లిరి. సెప్టెంబరు 7-వ తేదిన జనరలు ఇవనోఫ్ ఆస్ట్రో జర్మనులమీద సెరెత్ ప్రాంతమున తిరుగబడెను 3-వ సెప్టెంబరు మొదలు 8-వ తేది వఱకు ఈ ఱక్కన పోరాటము రష్యనులకే అనుకూలముగా నుండెను. వారీకాలములో 17,000 మంది ఖయిదీలను, 38 శతఘ్నులను, 65 యంత్రఫిరంగులను పట్టుకొంటిమని ప్రకటించిరి. 9 వ తేదిన 8000 మంది ఆస్ట్రో జర్మనులు ఖయిదీలుగా దీసికొనబడిరి 10-11 తేదీలను మరి 7500 మంది సైనికులను, 150 మంది యుద్యోగీయులను రష్యనులు పట్టుకొనిరి

## లిథియూనియాలో విషమావస్థ

విల్నాప్రాంతమున నున్న రష్యనుల స్థితి శోచనీయముగా నుండెను. లిథియారాష్ట్రమునకు ముఖ్యపట్టణమగు విల్నాను పట్టుకొనుటకయి మార్షాలు వాన్ హిండెన్బర్గు గొప్ప సన్నాహములను జేయుచుండెను. వార్సా నెప్పుడు వదలిరో అప్పటినుండియు రష్యను లిచ్చట స్థానముల నేర్పఱచుకొనిరి సెప్టెంబరు 15-20 వ తేది ఆవైపుల జర్మనులు పిడ్జీ అను తావును తీసికొని కుడివైపున డ్వీనాకు, ఎడమవైపున నడుమనున్న విల్నాకు సంబంధము తెగగొట్టుటకు మోటరు బండ్లలో గొప్ప ఫిరంగులను, సైన్యములను, భూమిమీద అశ్వసేనను బంపిరి. ఈ సేనలు విల్నా-మినస్కు రయిల్వేను మోలోడెచ్నోకద్ద తెగగొట్టి విల్నానుండి ఈ రయిలు మార్గమున రష్యనులు పరుగెత్తి పోకుండ జేసెను. ఈ విల్నాలోని సైన్యముల చుట్టును కమ్ముకొని అందరిని ఖయిదీలు చేయవలయునని చేసిన సన్నాహమిది. రష్యనులు ఈ బోనలో పడకుండుటకయి తక్షణమే విల్నాను వదలిరి. ఈ విల్నాను జనరలు వాన్ ఐక్హార్నను 18-వ సెప్టెంబరు తేదిన నాక్రమించుకొనెను రష్యనుల స్థితి మిక్కిలి కష్టతరముగా నుండెను వారికి విల్నానుండి పారిపోవుటకు విల్నా-లిడారయిలు ఒక్కటిమాత్రమే యుండెను ఈ రయిలును తెగగొట్టుట కింకొక జర్మను సేన నీమనునదిని దాటి జనరలు ఉవాన్ గాల్విట్జు, వాన్ షోల్ట్జు గార్ల నాయకత్వము క్రింద వచ్చుచుండెను రష్యనులు విల్నాను వదలి మోలోడెచ్నో

వద్ద జర్మనులతో పోటు రయిలును వశము చేసికొని పోలోఖుకు అయిన వెళ్ళ వలయును లేదా దక్షిణమునకు తిరిగి పోయెదమనినను డ్వినాకు చేరకముందే రజీక్కా దగ్గర జర్మనులు రయిలును పట్టుకొని యుండుటచే వారిని జయింపవలయును, లేదా ఓడిపోయి వారి వశము కావలెయును. ఇట్టి విషమావస్థ వార్సాపడిపోయిన తరువాత ఈ రష్యను సైన్యములకు తటస్థించి యుండలేదు.

### వోల్హీనియా, గలీషియాలు

ఇచ్చట జనరలు ఇవనోఫ్ శత్రువుల మీసకే బాగుగా ఉరకుచు వారికి క్రొత్త తావులు దొరకకుండ కాపాడుచున్నాడు కాని రష్యనులకు కావలసినంత మందుసామాను లేనందున పెద్దఆశలు పెట్టుకొనలేదు. వోల్హీనియాలో ఆస్ట్రియనుల అతిశయము అపబడుటయేగాక వారోడింపబడిరి రష్యనులు 10,000 మంది ఖయిదీలను, 17 ఫిరంగులను, 26 యంత్రఫిరంగులను పట్టుకొనిరి గలీషియాలో టార్నాపోలుకు పశ్చిమమున రష్యనులు బాగుగా ముందుకు పోవుచునే యున్నారు. మోలోడెచ్చినోవద్ద జర్మనులు తరుమబడిరనియు, రయిలులు వారివశము కాలేదనియు రష్యను అధికారవర్గము ప్రకటించెను.

### డ్వినస్కు ప్రాంత్యము

అక్టోబరు 3 మొదలు 10-వ తేదివఱకును డ్వినస్కు ప్రాంత్యమున కఠినముగా నిరువాగువారును బోరిరి అక్టోబరు 3-వ తేదిని ఛిచ్చికోవో మీద జర్మను శతఘ్నులు పరపబడెను. జర్మనులు కొన్ని కందకములను బట్టిరి గాని 7 వ తేదివఱకును బాగుగా ముందుకు సాగుటకు వీలుపడలేదు రష్యనులను ఇచ్చటచ్చట జర్మనులనోడించుచు వెనుకకు గొట్టుచుండిరి. గ్రానడు గ్రువాల్డువద్దను కొన్ని కందకములు జర్మనీయుల పరమయ్యెను 18 కాల్బములు గల డివిజనులను, 7 అశ్వసేనల డివిజనులను మొత్తము 3,00,000 ల మంది సైనికులను ఈ ఒక్క ప్రదేశములో జర్మను లుంచుటను బట్టి చూడగా వారుసైన్యముల నిటునటు ఎట్లు దొర్లించుచున్నారో తేటపడకపోదు

### విల్నారంగము

విలెయికాను రష్యనులు తిరిగి పట్టుకొని నందున గుక్క త్రిప్పుకొనుట కవకాశము గలిగినది. వీరు జర్మనులను తాకిరి. 27-వ సెప్టెంబరున పోరు దృఢముగా జరుగుచుండెను. ఓష్మియానా, స్మోర్గోనీలలోను యుద్ధము జరగెను. ఈయుద్ధపర్యవసానము విడ్సే, విడారయిలులను పట్టుకొని రష్యనులను బోనులో వేసి ఒత్తవలయునని. జర్మనులు చేసిన యత్నములు ఈజయముల వలన నాపబడినవని రష్యను అధికారులు ప్రకటించిరి

అక్టోబరు 6-7 తేదీలను రష్యనులు స్మోర్గోనికుత్తరమున పోస్టవీ, మన్కీలవఱకును పోగలిగిరి అక్టోబరు 7 మొదలు 10 వఱకును ఇచ్చట విశేషము లేమియును లేవు.

### ప్రైపెట్ భాగము

ఈరంగమున జర్మను సేనాధిపతి మార్షాలు వాన్ మాకెన్సన్ గారు కాడ. వ్రాయవలసినంత గొప్ప సందర్భములేవియును లేవు. కొన్ని గ్రామములను పట్టుకొనుట, విడచుట, ముందుకు వచ్చుట, వెనుకకు పోవుటతో నిచ్చట సరిపోయినది.

### గలీషియా

గలీషియా, వోల్హీనియాలలో పోరు బాగుగానే జరిగినది. 200 మైళ్ల యుద్ధముఖమున రష్యనులను శత్రువులను కొంత వెనుకకు తరిమిరి కాని జనరలు ఇవనోఫ్ గారు సైన్యములను ముందుకు పోనీయక అపియుంచిరి ఆస్ట్రోజర్మను లోడిపోవుటచే లెంబర్గు తిరిగి రష్యనుల వశమగునేమో నని యూహింపబడెను. కాని జనరలు వాన్ మాకెన్సను సకాలమునకు సైన్యములు పంపగా ఆస్ట్రియనుల స్థానములు బలపడెను. ఈసైన్యములు ఇవనోఫ్ గారి మధ్యసైన్యములను స్ట్రయిర్ నదియొక్క వెనుకభాగమునకు తరిమెను. గలీషియా సరిహద్దులలో నత్యంత రక్తపాతముతో గూడినయుద్ధము నోవోఅలెక్సినెటువద్ద జరిగెను. అక్టోబరు 3-వ తేదిన 3 రష్యను డివిజనులు జారుటోరిస్కు కుత్తరమున స్టయిరును తిరిగి దాటి ఏడమ ఒడ్డుప్రక్కవ స్థానముల నేర్పఱచుకొనిరి శత్రువులు పరుగెత్తిరి. కొన్ని గ్రామములు రష్యనుల చేతులలోపడెను తిరిగి ఆస్ట్రియను లెక్కువసేనలతో తలపడుటచే రష్యనుల విజృంభణము ఆగిపోయినది రష్యనులు లస్కుకు తూర్పునను, దక్షిణమునను 3500 సైనికులను ఖయిదీలుగా బట్టుకొనిరి. యంత్రఫిరంగులు, త్రెంచిమార్టరులు కొన్ని చిక్కినవి టార్నాపోలుకు పడమట స్ట్రిపానదిమీద రష్యనులు అక్టోబరు 1-9 తేదీలలో కొంత నూతనప్రదేశమును పట్టుకొనిరి.

### సర్వియాపై దండయాత్ర

ఆస్ట్రో జర్మను సైన్యము లీదేశము నాక్రమించుకొనుటకయి అన్ని సన్నాహములను జేసెను డాన్యూబు నదిని దాటి, బెల్గ్రేడు నగరములో బ్రవేశించిరి. సర్వియనులు వారి రాజధానిని వదలి వెళ్లిపోయి తూర్పుముఖమున టూబ్రావిట్జా, గ్రాడిషేట్ వయిపులకు సైన్యములను ముట్టడికయి పంపిరి మొరావా, మాలావానదుల సంగమస్థానమందున్న రాము గ్రామమువద్ద వీరిసైన్యములు సర్వియాలో ప్రవేశించినవి. ఈరామువద్దనుండి ఒక చిన్నరయిలు పోజారెరాక్ కోటవద్దకు పోవును సర్వియా సరిహద్దు లనేక స్థలములలో సేవ, డ్రినానదులయొడ్డున ముట్టడించబడినవి. ఓబ్రెనే గోక్ వద్ద యింకొకసేన జేజ్రోక మూలనుండి దేశములో బ్రవేశించెను ఇచ్చట సర్వియను లతి సాహసోత్సాహములతో బోరి శత్రువుల నాపిరి ఈ ఓబ్రేన్ వోక్ వద్దనుండి దేశమధ్యమునకుపోవు మంచి రయిలు బాటకలదు గిప్సీ లంకలోనున్న సర్వియను సైన్యములు జాబ్రేవద్ద గొప్ప శత్రుసైన్యముల ముఖమున పరుగెత్తిపోయెను.

క్షితరచోటుల తాత్కాలిక వంతెనలను వేసి ప్రవాహములను దాటి దేశములో శత్రువులు ప్రవేశించిరి.

ఆస్ట్రియాకు ఈ సర్వియాతో జగడమే యుద్ధమునకు కారణమయినది. ఈదేశమును రక్షించుటకయియే మిత్రమండలి బద్ధకంకణ లయినది. ఈదేశమును జయించనిది ఆస్ట్రియాకు గౌరవహానియగును. అదిగాక దానిని పూర్తిగా జయించి ఎల్లప్పటికిని తన వశము చేసికొనవలయునని ఆస్ట్రియాకు దురాశ కలదు. బల్గేరియాకు ప్రాతశత్రుత్వము సర్వియా మీద కలదు. అందుకని జర్మనీలో జేరి, సర్వియా బల్గేరియా వద్దనుండి రెండవ బాల్కను యుద్ధములో జయించి తీసికొనిన మెసిడోనియాను తిరిగి ఆక్రమించుకొనవలయునని బల్గేరియాకున్నది. వియన్నా నుండి కాన్‌స్టాంటునోపిలుకు వెళ్లు గ్రాండు ట్రంకురయిల్వే సర్వియాగుండ పోవును కాబట్టి తురుష్కులకు సహాయమును పంపుటకయి ఈ రయిలును ఆస్ట్రో జర్మనులు వశము చేసికొనకతప్పదు. సర్వియాను క్రిందనుండి పయివఱకును తుడవక తప్పదు.

అటు బల్గేరియా ఇటు జర్మనీ, ఆస్ట్రియాలు తాఁకినప్పుడు ఒక్క చిన్నదేశమేమి చేయగలదు? అనేకదినములు ఘోరముగా పోరి, ఓడిపోయి దేశమంతయును శత్రువులవశము చేసి సర్వియారాజు యువరాజు, మంత్రులు, రాజకుటుంబముతో ఇటలీకి వెళ్లిపోయిరి.

వివరములు

అక్టోబరు రెండవవారమంతయు లోకముయొక్క దృష్టి సర్బియామీఁదికి మరలినది. బల్గేరియా శత్రుమండలిలో మసిడోనియా నపహరించుటకు జేరినది. గ్రీసురాజు సర్బియాతోనున్న సంధి నుల్లంఘించి సర్బియాతో జేరక తటస్థభావము వహించెను. సెప్టెంబరు మాసాంతమున మార్షాలు వాన్ మెకెన్సను గారు హంగరీకి వెళ్లి టామేశ్వారునుండి ఆస్ట్రియాను దండయాత్రను సర్బియాపై సిద్ధము చేసెను. జర్మనులు తమసేనలను సయితము టామేశ్వారునకే పంపిరి. జర్మను లితర యుద్ధముఖములలో కావలసినంత సేనల నుంచవలసి వచ్చినందున చాలసైన్యము నిచ్చుటకు పంపలేదనియు, ఆస్ట్రియను సేనలను 'గట్టిజేయుటకు' వలసినంత సేనను పంపిరనియు, ఈ దండయాత్రలోనున్న సేనలో సగము భాగమయినను బల్గేరియను సేనయనియు యూహింపఁబడినది. 7-వ అక్టోబరున ఆస్ట్రో-జర్మను యక్షౌహిణులు సర్బో సరిహద్దులను దాట మొదలిడిరి. అదే సమయమున వేఱొక పటాలము సేరజేవో నుండి బోస్నియా సరిహద్దుకోటయగు వైషేగ్రాడు మీద పంపఁబడెను. ఈకోటను ఆస్ట్రియనుల వద్దనుండి గత వత్సరము సర్బులు జయించిరి.



తాత్కాలికపు వంతెనను ఒక యొడ్డునుండి ఇంక యొడ్డుకు వేసి ఆస్ట్రో-జర్మను సేనలు సర్బియాలో ప్రవేశించుట

డాన్యూబు నదిని దాటుటకుముందు రాజధాని బెల్గ్రేడు మీఁద వందలకొలఁది ఫిరంగులు ఒక్కపెట్టున కేల్పఁబడెను. మూఁడు దినము లీ దురదృష్టపు పట్టణము ఈ బారులకు గుఱియయ్యెను. అక్టోబరు 10-11 తేదీలను బల్గ్రేడు, సెమాంద్రియా పత్తనములు పట్టుకొనఁబడియెను. సర్బులు నగరమునకు దక్షిణమున నున్న కొండలపయికి తమసేనలను దీసికొనివెళ్లిరి. శత్రువుల నష్టము లపారము సర్బులు రాక్షసులవలెనే పోరిరి. కాని అధిక సంఖ్యల ముందు నిలుపఁజాలక పోయిరి సర్బియాతోనున్న కొద్దిపాటి ఫ్రాం

మీదను కొన్ని సైన్యములు వెడలెను. టిమోక్ పరిసరములలో
సర్వియనులు జనరలు బోయెడ్‌జెఫ్‌చే తరుమబడిరి. బల్గరులకు 200
మంది ఖయిదీలు దొరకిరి. ఆగ్నేయదిక్కున వ్రానాయ్ 15-వ తేది
ఆక్రమించుకొనఁ బడియెను. బెల్గ్రేడు-సలోనికా రయిలు కొన్ని
చోట్ల యెత్తివేయఁబడెను. తరువాత కోథానా, ఇష్టిపులు బల్గరు
లచే నాక్రమించుకొనఁబడియెను. సర్బులు యుస్కుబు నగరమునకు
పరుగెత్తిరి. పడమటి దిక్కున ఎంత ఘోరముగా సర్బులు తలపడి
నను బల్గరులు త్రోసికొని వచ్చుచునే యుండిరి. 21-వ తేదిన
కూమనోవో, వేల్సు గ్రామములు పట్టుకొనఁబడెను.

యుస్కుబుదగ్గఱ పారిపోవుచున్న సర్బులు కొంతకాలము నిలఁ
బడి పోరాడిరికాని తఱిమివేయఁబడిరి. 21-వ అక్టోబరున తీవ్రమయిన
పోరు జరిగినతరువాత యుస్కుబు బల్గేరియనుల వశమాయెను. ఈ
విధముగా సలోనికానుండి వచ్చుచున్న మిత్రమండలిసేనలు సర్వి
యనులను కలిసికొనకముందే వారికిని వీరికిని మించిన సైన్య బాహు
ళ్యమును బల్గరులు వారిమధ్యనిలిపిరి. అక్టోబరు 21-వ తేదిని జనరలు
సెర్రెలుగారిక్రింద ఫ్రెంచిసేనలు రాబ్రోవోవద్ద బల్గరులమీఁదపడెను.
బల్గరులు బాగుగా పోరాడినను ఫ్రెంచివారిచే ఒక సర్వియను
పటాలపు సహాయమువలన వెనుకకు కొట్టఁబడిరి ఈశాన్యమున బల్గ
రులు సర్వియనుల కోటయగు జమెఛారు ముందర ఆఁపివేయఁబడిరి.
పైగటుకద్దను అటులనే గావింపఁబడెను. అప్పటికి నిష్‌నగరము
స్థితి ఊఁగులాడుచున్నను తత్కాలము బల్గరుల దాడి ఆ నగరము
పయి ఆఁపబడెను. ఉత్తరమున ఆస్ట్రో-జర్మనుల వ్యాపకము నెమ్మ
దిగానుండెను. వీరి సేనాధిపతి వాన్ మాకెన్సను బల్గరుల జయముల
పై నిరీక్షించుచుండెను. సర్వియనులు మాకెన్సనుగారితో నత్యంత
శౌర్యముతో బోరుచు ప్రతి అంగుళము భూమిమీఁద ఆస్ట్రో-జర్మనుల
రక్తమును చూడనిది, తమ రక్తమును పాఱనీయనిది భూమిని వద
లనేలేదు. బల్గేరియనుల దేశములో సైన్యములను దించి తొందర
కలుగఁజేయవలయునని రష్యాచేసిన ప్రయత్నములు సిద్ధింపలేదు.

## ఇటాలియను రంగము

ఇటాలియను రంగమున సెప్టెంబరు ఒకటవ రెండవ వార
ములలో యుద్ధ మతితీవ్రముగా జరిగెను. రోవర్టో, బోర్గో అను
రెండు పెద్దకోటలను ఆస్ట్రియనులు విడిచి పారిపోయిరి. ఇటాలియను
సైన్యము లన్నిదిశలను ముందుకునడిచెను. పై రెండు పట్టణములలోను
ప్రవేశించుటకు ఇటాలియనులు కొన్నిదినము లాగిరి. ఏలనగా విడిచి
పెట్టిపోయిన పట్టణముమీఁద ఆస్ట్రియనులు వెనుకనుండి దిట్టముగా
గాల్చుట అలవాటు. ఇతరస్థలములలో ఇసోంజో కనుమలు మొదలు
స్విస్సు పొలిమేరలవఱకును పోరాటములుజరిగెను. కార్సోప్రాంత్య
మున ఆస్ట్రియనులు బలవత్తరమయిన సైన్యములను పేర్చిరి. ఆసైన్య
ములను త్రోయుచు ఇటాలియనులు ముందునకుపోయిరి డోబెర్డోను
ఇటాలియనులు పట్టుకొని ఆస్ట్రియనుల రక్షకస్థానములకు కొంత
తొందర గలిగించిరి. మాంటిటోనలె దిక్కున కొండలలో నతిసాహస



ఇటాలియనులు పైకిపాకి పోరాడవలసిన మహాపర్వతములు

ముతో పోరాడి గొప్ప జయములను బడసిరి. బోడెన్‌బాక్ కనుమ
లలో రెంజునదీతీరమున ఆస్ట్రియనుల తీవ్రతను ఇటాలియను కొండ
ఫిరంగులు బాగుగా తగ్గించెను. ఈ కొండ యుద్ధములలో ఆస్ట్రియ
నులు విరివిగా విమానములను ఇటాలియను పట్టణములమీఁదికి పంపిరి.
ఇటాలియను విమానధ్వంస ఫిరంగులును, విమానములును వీనిని తఱిమి
వేయుచుండెను. ఇటాలియనుల విమానములు నానాఁటికి వృద్ధియగు
టయే గాక ఆస్ట్రియనుల స్థానములపయి అనేక పర్యాయములు
బాంబులను వేసి వచ్చెను.

ఆల్ప్సు కొండలలో చలికాలము పోయిన తరువాత శీతోష్ణ
స్థితి రమణీయముగా నుండును. ఈ యవకాశమును చిక్కించుకొని
ఇటాలియనులు శత్రువులను బాగుగా ముట్టడించుచున్నారు. ఈ
రంగములో ముఖ్యభాగము కార్సోపీఠభూమి. గోరిజియా దానికి
ముఖ్యస్థానము. ఈ గోరిజియా నగరును పట్టుకొనుట కిటాలియనులు
నాలుగు ముఖముల నల్లుకొనుచున్నారు. సోమవారము సెప్టెంబరు
20 వ తేదిన ఆస్ట్రియనులు మాంటిసాన్ మైకేలు అరణ్యమునుండి
పారఁదోలబడిరి. ప్లెజ్జో పల్లపుభూమిలో ఇటాలియనులు శీఘ్రముగా
స్థానముల నేర్పఱచుకొనిరి. వారి నచ్చటనుండి తఱుమలేక బాంబు
లను విమానములనుండి ఆస్ట్రియనులు వేయుచుండిరి. ఈ బాంబుల
వలన పుట్టు అగ్నివలన ప్లెజ్జో, సెజోన్నెరా, డోవ్వెరు పట్టణములు
ధ్వంసమయ్యెను. ఇటాలియను ఫిరంగులు కోరిట్జిన్కాలో పెద్ద అగ్ని
ప్రమాదమును కలిగించెను. ఇది ఆస్ట్రియనుల నగరము. చాల సైన్య
మిచ్చటికి చేర్పఁబడినదని తెలిసినది.

## ఇంగ్లండుమీఁద జెప్పెలినుల దాడి

4-వ ఆగస్టు జర్మనీమీఁద యుద్ధము ప్రకటింపఁబడెను.

(ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిసెంబరు నెలలలో జెప్పెలినుల దాడి లేనే లేదు).

జనవరి 19.1915:—యార్మౌతు, కింగ్సులిన్నులమీఁద దాడి.

ఫిబ్రవరి, మార్చి నెలలు:—దాడి లేదు.

ఏప్రిలు 14, 16:—బ్లయితు, వైట్‌సైడ్, లోవ్‌స్టాఫ్టు, ఇప్సువిక్, బరీసెయింటు ఎడ్మండ్సు మీఁద బాంబులు వేయఁబడెను.

మే 10, 17, 27, 31:—లండనులోని సౌతెండ్, రామ్సుగేట్, సౌతెండ్, లండను బహిర్భాగములమీద దాడి.

జూన్ 4, 6, 15:—తూర్పుతీరము, ఆగ్నేయదిక్కు, తిరిగి తూర్పుతీరములమీఁద దాడి.

జూలై నెల:—దాడులు లేవు.

ఆగస్టు 9, 12, 17:—తూర్పుతీరము, తూర్పుతీరపు జిల్లాలు.

సెప్టెంబరు 7, 8, 11, 12, 13, 14:—తూర్పుతీరము, తూర్పుతీరపు జిల్లాలు, లండనులోని భాగములు, తూర్పుతీరము, తూర్పుతీరము, తూర్పుతీరము.

కాన్స్టంటినోపిల్‌భూమిలో ఆష్ట్రియనులు చెట్టుమీఁద యంత్ర ఫిరంగి నమర్చుట

### నష్టములు

| | | మృతినొందినవారు | గాయములు తినినవారు |
|---|---|---|---|
| జనవరి | 19 | 4 | 9 |
| ఏప్రిలు | 14 | - | 2 |
| ,, | 16 | - | - |
| మే | 10 | 1 | - |
| ,, | 17 | 2 | 8 |
| ,, | 27 | 8 | - |
| ,, | 31 | 6 | - |
| జూన్ | 4 | - | - |
| ,, | 6 | 24 | 40 |



ఈయింగ్లీషువారిబైప్లేన విమానములు జెప్పెలినులను పారదోలి నగరములను కాపాడుచుండును

| | మృతినొందినవారు | గాయములు తినినవారు |
|---|---|---|
| జూన్ 15 | 15 | 15 |
| ఆగస్టు 9 | 13 | 12 |
| ,, 12 | 6 | 23 |
| ,, 17 | 10 | 36 |
| సెప్టెంబరు 7 | 17 | 39 (ముగ్గురు కనఁబడనివారి శరీరములు దొరకెను) |
| ,, 8 | 20 | 86 |

(సెప్టెంబరు 11, 12, 13, 14 తేదీలలో కొంత ఆస్తికి నష్టము కలిగినది కాని ప్రాణనష్టము కలుగలేదు)

| | | |
|---|---|---|
| అక్టో 13 | 56 | 114 |
| మొత్తము | 177 | 384. |

## బాల్టికులో బ్రిటిషు సబ్మెరయినులు

లిటిలుబెల్టు, గ్రేటుబెల్టు, సౌండు అను మూఁడు ద్వారములగుండ బాల్టికు సముద్రములోఁ బ్రవేశింపవలయును. గ్రేటుబెల్టు, లాంగిలాండు బెల్టులగుండ లోకములో నెవరి నావలయినను వెళ్లుటకభ్యంతరము లేదు. యుద్ధారంభమున జర్మనులు లాఁగిలాండు బెల్టును, సౌండును గనులతో పేర్చిపెట్టిరి. డెన్మార్కు గ్రేటుబెల్టులో గనులను పేర్చెను. గ్రేటుబెల్టుగుండ బ్రిటిషు సబ్మెరయినులు బాల్టికులోనికి వెళ్లవలయును. అవి ఉత్తర జర్మను రేవులకు, స్కాండినేవియాకు మధ్యనున్న వర్తకపు స్థానములలో పనిని చేయవలసియున్నవి. ఇచ్చటనే జర్మనుల వర్తకనావ లనేకములు




బ్రిటీషువారి "సి" తరగతి అంతర్గామి

ముంచఁబడెను. బాల్టికులో జర్మనుల వ్యాపారము చీకాకుపఱుపఁబడెను. వర్తకనావలేగాక జర్మను డిస్ట్రాయరులు రెండు క్లింథోలం హార్బరు సామీప్యమున అక్టోబరు 2వ తేదిన టార్పిడోలతో కొట్టి ముంచఁబడెను. ఈ తొందరవలన. జర్మనులు వర్తకనావలను ఒక్కొక్కటిగా పంపక పదిపండ్రెండింటిని జతచేసి పంపుటకు మొదలుపెట్టిరి. ఈ క్రొత్తపద్ధతివలన ఎంతలాభమో కలుగలేదు.

## సర్వియాస్థితి

సర్వియాస్థితి మిక్కిలి దౌర్భాగ్యముగా నున్నది. ఈ దేశపు చిన్నిసైన్యము అనేక అక్షౌహిణులవలన అన్ని దిక్కులనుండియు నొత్తఁబడుచుండెను. కొండలలో దాఁగుకొనుటకయి పరుగెత్తుచున్న వీరచ్చట భద్రముగా నుండఁగల రనియు, వారి సేనానాయకుఁడు వారిని కాపాడఁగలఁడనియు తలంపఁబడుచుండెను. అక్టోబరు 24వ తేదినఆస్ట్రో- జర్మనులు బెల్గ్రేడుకు చాల మైళ్లు దక్షిణమునకొస్మాజా శిఖరములవఱకును వచ్చిరని తెలిసెను. పశ్చిమమున, పశ్చిమోత్తరమున, డ్రీనానదీ ముఖమున శత్రువులు త్రోసికొని వచ్చుచుండిరి. క్రైషెగ్రాడు నగరము సర్వియనులచే, మాంటినీగ్రినులచే కొంతకాలము కాపాడఁబడినను శత్రువులకశమయ్యెను. పశ్చిమోత్తరమున కట్టకడపట నున్న డాన్యూబునదిలోని రేవులగు నెగోటిన్ప్రకోవో గ్రామములు బల్గరుల స్వాధీనమయ్యెను. ఈ గ్రామములు పడఁగానే బల్గరులకును, డాన్యూబుమీఁదనున్న ఓర్సోవాలోనున్న ఆస్ట్రియనులకు సంబంధము కలసి ఒక్కపెట్టున వారు సర్వియుల పాఱఁదోల ప్రారంభించిరి.




బ్రిటీషువారి "బి" తరగతి అంతర్గామి

## సర్వియాముఖ్యమంత్రి ప్రార్థన

అక్టోబరు 27వ తేదిన సర్వియాముఖ్యమంత్రి యం. పాషిచ్చి హృదయము కరఁగునట్లు మిత్ర

మండలికి పంపిన ప్రార్థనము బ్రిటిషు పత్రికలలో ప్రకటింపఁబడెను. సర్వియావారు ఆస్ట్రో-జర్మనుల వలనను, బల్గరులవలనను మరణదండనము విధింపఁబడినాఁ దని అందు వ్రాయఁబడెను. సర్వియను లెంత పరాక్రమవంతు లయినను ఇంత గొప్ప సైన్యములతోఁ బోరఁజాలరు. వారి స్వాతంత్ర్యమునకు మిత్రమండలివారు సకాలమునకు సహాయము చేయనిచో కడపటి దినములు వచ్చిన వని తలంపవలయును." ఇప్పటికి సరిహద్దులనుండియు ముఖ్యనగరములనుండియు అన్నిదిక్కులను సర్వియనులు తఱుమఁబడిరి. వారి దేశమధ్యమున నున్న కొండలలో సైన్యములఁ జేర్చికొని మిత్రమండలిసేన యెప్పుడు వచ్చునా సహాయమున కని నిరీక్షించుచుండిరి. వీరి సేనానాయకుఁడు మార్షాలు పట్నికుగారు కొండలలో దక్షిణమునను.మధ్యను సైన్యములను పేర్చి దక్షిణసైన్యమునకు సలోనికాలో దిగి, మసిడోనియాగుండ వచ్చుచున్న ఫ్రాంకో-బ్రిటీషు సేనతో సంధి కలయున ట్లొనర్చెను.

శతఘ్నినిర్మాణస్థానము సయితము వదలివేయఁబడెను. కాని యిచ్చట నేమి యుద్ధసామాను నుంచబడలేదు. దక్షిణమున ఫ్రాంకో-బ్రిటిషు సేనలు దిగినవి. కొంతసేన సర్వియనులకు సహాయార్థము వచ్చినది. కాని శత్రుమండలివారి మూఁకలముందర ఈసైన్యము చాలలేదు. అందుచే సర్వియనలు అన్ని దిక్కులను నోడిపోయి పరుగెత్తవలసి వచ్చినది. స్ట్రుమునిట్జయొద్ద ఫ్రెంచివారు బల్గేరియనులను తఱిమి బల్గేరియను దేశములోనె ప్రవేశించిరి. సలోనికానుండి నిషు నగరమునకు వెళ్లు రయిలును మాత్రము మిత్రమండలి చేతిలోఁ బడకుండ బల్గేరియనులు విశ్వప్రయత్నములను జేయుచుండిరి. నల్లసముద్రపు... (unclear) సీలోనున్న రష్యను యుద్ధనావలు అక్టోబరు 28-వ తేదిని బల్గేరియా రేవగు వార్నామీఁద ఫిరంగులను కాల్చెను. బల్గేరియామీఁద పంపుటకయి రష్యనులు నేలమీఁద గొప్పసైన్యమును తయారుచేయుచున్నారనియు తెలియవచ్చెను.

అక్టోబరు 27-వ తేదిని జయఛార్ కోట బల్గేరియనుల వశమయ్యెను. తరువాత నియాజెవాట్జు ఆక్రమించుకొనఁబడెను సర్బుపటాలములు పశ్చిమమునకు పారిపోయెను తదనంతరము సర్బులు పైరటుకోటవద్ద నతిగార్ధ్యముతోఁ బోరాడిరి. ప్రతియంగుళము భూమికిని జగడము జరిగెను. కాని 29-వ తేదిని ఈ కోట బల్గేరియనుల చేతులలోఁబడెను. బల్గరుల నష్టము లమితముగా నుండెను. ఈ బాల్కను రాష్ట్రముల సేనలు (ముఖ్యముగా బల్గేరియను సేనలు) ఒకరిమీఁద పడుటలో ఘోరమృగములవలె పడెదరు. ప్రాణములను సరకుచేయరు. అంగవలన వారికి నష్టములు ఆధునిక ఫిరంగులముందు అపరిమితముగా కలుగుచుండును. చాలమంది బల్గరులను మిత్రమండలి ఖయిదీలనుగా చేసెనని ప్రకటింపఁబడెను. 16 ఫిరంగులును దొరకినవి. ఈ పైరటు పోవుటవలన సర్వియావారి ఉత్తరసైన్యపు కుడిభాగము చెల్లాచెదరయిపోయినది. అందుచే వారు పరుగెత్తిరి. అన్నిచోటులను ఓడిపోయినను హతముగాని సర్బుసేనలు తిరిగి కూడుకొని నైరృతిదిక్కున నున్న కొండలలోనికి వెడలిరి. నవంబరు 1-వ తేదిన గోర్నిమిలానోవాట్జు అను స్థానమును (బెల్‌గ్రేడునకు దక్షిణమున 55 మైళ్లు) జర్మనులు పట్టుకొనిరి. క్రాగుజేవాట్జు అను



సర్వియా ప్రజలు వారిమందలను త్రోలుకొని శత్రువుల హింస తాళఁజాలక పరుగెత్తి పోవుచుండుట

## బాల్కనులలో యుద్ధము

ఈ అక్టోబరు మాసము, నవంబరు మాసములలో లోకము యొక్క కండ్లన్నియు బాల్కనుల మీఁదనే నుండెను. కిచనరు ప్రభు వింగ్లండునుండి బాల్కనురంగములనుజూచి పరిస్థితుల నారసి వచ్చుననియు ప్రకటింపఁబడెను. పైరటు అక్టోబరు 28న పడినది గదా. 28వ తేదిని ఆస్ట్రియనులు విషెగ్రాడునుండి బయలుదేఱిరి. మాంటినీగ్రినులు పోరాడుచు తూర్పుముఖమున పోవుచుండిరి. ఫ్రెంచివారు సలోనికానుండి నిషురయిలువే ననుసరించి బయలుదేఱెదరని, స్ట్రూమ్నిట్జా దగ్గఱ బల్గరులు రయిలుపడకుండ తఱిమివేయుటకు గొప్ప సన్నాహములను జేయుచుండిరి. ఫ్రెంచివారి స్థానములమీఁద రెండుమూఁడుపర్యాయములువచ్చిపడిరిగాని, లోకప్రఖ్యాతమగువారి 75 నంబరు ఫిరంగులు బల్గరులనుతుత్తునియలుగా గొట్టివేసెను బల్గరులు వర్దారునదిలోఁబడి అనేకులు చచ్చిరి. స్ట్రుమునిట్జాపట్టణమును పట్టుటకయి ఎంతతంటాలు పడినను బల్గరుల కోరికలు ఫలింపలేదు. యుస్కుబు వర్దారులనుండి తఱుమఁబడిన సర్బులుపశ్చిమపు బాల్కనులలో స్థానముల నేర్పఱచుకొనిరి యుస్కుబుకు 20 మైళ్లు పశ్చిమోత్తరముననున్న కఛానిక్ కనుమలలో కొంత సెర్బియను సేన చేరెను. కాఛానిక్ కనుమనుండి సర్బియ

